# ఆంధ్రుల జానపద విజ్ఞానం

డా. ఆర్వీయస్. సుందరం




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

# ఆంధ్రుల జానపద విజ్ఞానం

డా. ఆర్వీయస్. సుందరం




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

ANDHRULA JANAPADA VIGNANAM - A Comprehe
book on Telugu Folk-lore studies by Dr R. V. S. Sunda
Department of Telugu, Institute of Kannada Stu
University of Mysore, Mysore-570 006.

---

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాదు-500 004.

ప్రచురణ : 345

ప్రథమ ముద్రణ : 1983

ప్రతులు : 2,000

వెల : రూ 15/-

ప్రతులకు :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
"కళాభవన్", సైఫాబాదు,
హైదరాబాదు-500 004.

ముద్రణ :

మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్
1-1-694/2/ఎ, గాంధీనగర్,
హైదరాబాదు-500 380.

# తొలిపలుకు

నిరక్షరాస్యులంతా అజ్ఞానులుకారు. జ్ఞానాన్ని సంపాదించు కోవడానికి అక్షరాస్యత ఒక అవకాశం మాత్రమే. కనుకనే జానపదులు అజ్ఞానులుకారు. అనుభవజ్ఞులు. అనుభవం మనిషికి జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. పండితులు, నాగరికులు సృజించుకుని పెంపొందించుకున్న పరిజ్ఞానంతో పరిచయం లేక పోయినా, ప్రకృతి ఒడిలో పెరిగిన జానపదులు తమ అనుభూతులను పాటల్లో, ఆటల్లో, రకరకాల కళల్లో వ్యక్తం చేసుకున్నారు. తమ అనుభవాల వల్ల తమకు అందిన సంస్కారంతో ఎన్నో శారీరిక, సాంఘిక, మానసిక సమస్యలకు పరిష్కారాలు కనుగొని తరతరాలుగా తమకు ఎదురౌతున్న ఇక్కట్లను ఎదుర్కొంటున్నారు. వాళ్ళ వాఙ్మయం, వాళ్ళ కళాజీవితం నిన్నటి దాకా అనాదృతాలుగా ఉండిపోయినవి. వాళ్ళు సంతరించుకున్న విజ్ఞానాన్ని, కళావిలసనాన్ని పరిశీలించే ప్రయత్నం ఇటీవల బహుముఖీనంగా సాగుతున్నది. విశ్వవిద్యాలయ స్థాయిలో జానపద వాఙ్మయ సేకరణం, అధ్యయనం, పరిశోధనం సాగుతున్నవి. ప్రజాస్వామ్య జీవిత విధానంలో పల్లీయుల, గిరిజనుల, సామాన్యుల బ్రతుకు బరువులకు విలువ ఉండి తీరాలనే యాథార్థ్యాన్ని పండితులిప్పుడు గుర్తించి, పరిశీలిస్తున్నారు. కళాసృజనం మానవ సహజం. అనుభవం వల్ల పదార్థాల కలరూపులు తెలుసుకుని సుఖపడటం మానవ జీవితవికాస రహస్యం. నాగరకుల్లోనూ, అనాగరకుల్లోనూ, జ్ఞానపదుల్లోను, జానపదుల్లోనూ ఈ లక్షణాలు స్వతస్సిద్ధంగానే ఉంటాయి. అనుభూతి మానవసహజం. జానపద నాగరక కళాభేదాలు కేవలం బాహిరమైనవి, స్థూలమైనవి. సూక్ష్మంగా పరిశీలిస్తే తత్త్వం ఈ రెంటిలోనూ ఒక్కటే. జానపదుల విజ్ఞాన విశేషాలు నాగరకుల ఆలోచనల కెన్నింటికి పురుడుబోసినవో? ఈ జానపదుల కళల సెలయేళ్ళు ఎన్ని నాగరకుల కళాస్రవంతులకు మూలములైనవో? ఎన్ని జానపదుల అనుభవాలకు నాగరకులు తమ మిరుమిట్లు గొలిపే రంగులు పులుముకుని సొంతం చేసుకున్నారో!

డాక్టర్ ఆర్.వి.ఎస్. సుందరంగారి ఈ "ఆంధ్రుల జానపద విజ్ఞానం" ఆయన అధ్యయనశీలతకూ, పరిశోధనాసక్తికీ, జానపద వాఙ్మయానురక్తికీ ఫలితం, నిదర్శనం. ఈ గ్రంథంలో జానపదుల స్వరూప స్వభావాలు, వారి కవితా లక్షణాలు, గద్యకథనాలు, సామెతలు, పొడుపు కథలు, భాషా విశేషాలను గూర్చి విశ్లేషణం ఉంది. తెలుగు జానపదుల సాంఘికాచారాలు, వాళ్ళ దేవతలు, మంత్ర తంత్రాలు, పండుగలు, వైద్యం, ఆటపాటలు, అన్నపానాదులు, కట్టు, బొట్టు, జుట్టు, చిత్రకళ, నృత్యం, శిల్పం, సంగీతం, రూపకం ఇంక ఇంకా మరెన్నో విశేషాలతో సాధికారిక పరిచయం ఉన్నది ఈ పుస్తకంలో. ఈ జానపద విజ్ఞానాన్ని సేకరించే పద్ధతులను గూర్చి, పరిశోధించే పద్ధతులను గూర్చి డాక్టర్ సుందరంగారీ గ్రంథంలో అనేకాంశాలను విపులీకరించి వివరించినారు. విద్యార్థులకూ, పండితులకూ, పరిశోధకులకూ, భాషాభిమానులకూ, సంఘసేవకులకూ ఎంతో ఉపయుక్తమైన ఈ పుస్తకం రచించిన డా॥ సుందరంగారు అభినందనీయులు. ఎంతో శ్రమకోర్చి ఈ పుస్తకాన్ని రచించిన డా. ఆర్. వి. ఎస్. సుందరం గారికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పక్షాన ధన్యవాదములను సమర్పించుకుంటున్నాను. ఈ ప్రచురణ గూర్చి ప్రత్యేక నిధులు మంజూరు చేసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి అకాడమీ పక్షాన అనేక ధన్యవాదాలు.

హైదరాబాదు — ఇరివెంటి కృష్ణమూర్తి

15-9-83 — కార్యదర్శి

# స్థాపన

ఆంధ్రుల జానపద విజ్ఞానానికి ఈ స్థాపన నిజానికి అవసరం లేదు. అయినా ప్రస్తావనగా నాలుగు ముక్కలు చెప్పడం నా ధర్మం. ముఖ్యంగా ఈ పుస్తకాన్ని నా చేత రాయించిన అకాడెమీ వారికి నిండు గుండెతో కృతజ్ఞతలు చెప్పుకోడం నా ప్రథమ కర్తవ్యం. నేను చెప్పగలిగినది చెప్పే అవకాశం లేకపోతున్నదనే నా తపనను అర్థం చేసుకున్నందుకు, పుస్తకాన్ని ప్రచురించే బాధ్యతలు తీసుకున్నందుకు ముఖ్యంగా డా. బెజవాడ గోపాలరెడ్డి గారికి, డా. ఇరివెంటి కృష్ణమూర్తి గారికి అభివందనాలు. ఇల్లలుకగానే పండుగ కానట్లే పుస్తకం రాయగానే ప్రచురించినట్లుకాదు. స్నేహమూ, పుస్తకాలూ, సహృదయుల చేయూతలు, సన్మిత్రుల వెలుగూ తప్ప ఆస్తి కూడబెట్టడం తెలియని నాబోటి వాడికి ఇంతమాత్రం పుస్తకం అచ్చు వేసుకోడం సాధ్యం కాని పని. అందుకే అకాడెమీవంటి సంస్థలు పూనుకోనిదే ఇలాంటి రచనలు వెలుగు చూడవు.

ఆంధ్ర సంస్కృతిలోని ప్రత్యేకత ఏమిటన్న ప్రశ్నకు సమాధానం ఆంధ్రుల జానపద విజ్ఞానంలో లభిస్తుంది. నన్నయాది మహాకవుల రచనలు సంస్కృత భాషను, భారతీయ సంస్కృతిని, సంస్కృత ఆలంకారికుల కావ్య మీమాంసా పద్ధతుల్ని జీర్ణించుకున్నాయి. పండితారాధ్య చరిత్ర, క్రీడాభిరామం వంటి యే ఒకటిరెండు గ్రంథాలో తప్పించి తెలుగువారి సంస్కృతిలోని ప్రత్యేకతను ప్రతిబింబించే కావ్యాలు మనకు లేవు. "మీ ఆటలేమిటి, పాటలేమిటి, పండుగలేమిటి, ఆచారాలేమిటి, వేష భూషణా లేమిటి, నమ్మకాలేమిటి" అని యెవరైనా అడిగితే మన శిష్టకవుల కావ్యాలను చూపి, వాటిలో చూడమని అనగలమా? మనం ఎవరం, ఎక్కడి నుంచి వచ్చాం; ఎలా జీవిస్తున్నాం, మనవి అని చెప్పుకో దగ్గవి మనకెన్ని వున్నాయి అని ఆత్మవిమర్శ చేసుకునే వారెవరైనా జానపద విజ్ఞానం వైపు చూపు సారించక తప్పదు.

'పొరుగింటి పుల్లగూర రుచి' అన్నట్లుగా మనకు మొదట్నుంచి పర భాషా సాహిత్యాలలో సొగసుల్ని చూచి మురిసి పోవడం అలవాటయింది. సంస్కృతమయింది, ప్రాకృత మయింది, తమిళం, కన్నడం మొదలైనవి చూచి, తన్మయం చెందిన తర్వాత ఆంగ్లాది పాశ్చిమాత్య భాషలవైపు మన దృష్టి మరలింది. తమిళంలో సంగ సాహిత్యం సొగసుల్ని మనసారా పొగడ గలంగాని, అంతే ప్రాచీన కాలంనుంచి తీపి తెలుగులో అలల్లాకదలివస్తున్న జానపద కవితల్ని హీనంగా చూస్తాం. ఇలియడ్, ఒడిస్సి, కలేవాల, సిలప్పది కారం పేర్లు చెప్పుకొని, వాటి గొప్పతనం ముందు తలవంచుతాం. కాని ప్రపంచంలోనే అత్యుత్తమ జానపద ఇతిహాసాలుగా పేర్కొన దగిన పల్నాటి వీర చరిత్రని, కాటమరాజు కథలనీ కన్నెత్తికూడా చూడం. తెలుగు వారికి ఆత్మ విశ్వాసం, తమ భాష, సంస్కృతి, సాహిత్యాల మీద గౌరవం ఏర్పడే వరకు ఈ స్థితి తప్పదు.

ఆంధ్రుల జానపద విజ్ఞాన సంపద ఔన్నత్యాన్ని, నేడు ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో జరుగుతున్న కృషిని దృష్టిలో వుంచుకొని ఈ పుస్తకాన్ని రాశాను. జానపద విజ్ఞాన విభజన, పరిశీలన శాస్త్రీయంగాజరగడానికి మార్గాన్ని నాకు తెలిసినంతవరకు తెలియ జేయడం, ఆంధ్రుల జానపద విజ్ఞానంలోని ప్రత్యేకతని వీలయినంత వరకు వెలికి తీసి చెప్పడం నా ధ్యేయం. దీనికి ప్రణాళికను నేనే ఏర్పరచుకొని, సాధ్యమైనంతవరకు ప్రతి ప్రక్రియకు సంబం ధించిన లక్షణాదుల్ని సంక్షిప్తంగా నిర్దేశించి తర్వాత వివరణకు పూను కున్నాను. ఇందువల్ల లక్షణమూ, లక్ష్యమూ కూడా అయ్యేట్లుగా ఈ గ్రంథాన్ని తయారు చేయడం జరిగింది.

ఈ గ్రంథం సమగ్రం అని నాకు ఏ మాత్రం అపోహ లేదు. ఇది ఆంధ్రుల జానపద విజ్ఞాన సర్వస్వానికి పీఠిక మాత్రమే. దీన్ని విస్తరించి సమగ్రంగా రాస్తే ఎన్ని వేల పుటలవుతుందో తెలియదు. అది ఒక్కరి వల్ల అయ్యేపని కూడా కాదు. నేను ఇంత మాత్రం రాయడానికి ఎంతో మంది పెద్దల ప్రోత్సాహం, ఎందరో మహనీయుల గ్రంథాల ఋణం కారణం. ముఖ్యంగా మైసూరులో జానపద విజ్ఞాన స్నాతకోత్తర విద్యార్థులకు పాఠం చెప్తుండడం వల్ల నాకెంతో లాభించింది. మైసూరు వాతావరణం ప్రశాంతంగా పని చేసుకుపోయే అలవాటు కలిగించింది.

ఇందులో ప్రచురించిన కొన్ని ఛాయాచిత్రాలు నావి. మరికొన్నిమైసూరు లోని జానపద వస్తుప్రదర్శనాలయానికి సంబంధించినవి. ఛాయాచిత్రాలను ఇచ్చి, ప్రచురించుకోడానికి అనుమతి ఇచ్చిన కన్నడ అధ్యయన సంస్థ నిర్దేశ కులు డా. హా.మా. నాయకగారికి కృతజ్ఞతలు. నాయీ కృషి వెనక ఆయన ప్రోత్సాహం ఎంతో వుంది. దాన్ని నేను మరిచి పోలేను.

తెలుగు ప్రపంచంలోని ఇతర భాషలసరసన ప్రత్యేక ప్రతిపత్తితోనిలవా లన్నా, దాని స్వంత గొంతుకను వినిపించాలన్నా మన జానపద విజ్ఞానాన్ని ఇతరులకూ పరిచయం చెయ్యాల్సిన అవసరం వుంది. అంతకన్న ముందు మనలో ఏముందో మనమే తెలుసుకోవాలనే ఉద్దేశమే ఈ పుస్తకం రాయ టానికి కారణం. నా ప్రయత్నాన్ని సహృదయులు ఆదరంతో ఆహ్వానిస్తారని ఆశిస్తున్నాను.

సుందరం

కన్నడ అధ్యయన సంస్థ
మైసూరు విశ్వవిద్యాలయం
మైసూరు—6

# అంకితం

## అమ్మకు

అమ్మా!

నిఘంటువులో అర్థాలుండవచ్చు - కాని

పరమార్థం లభించదు

సహనానికి, సౌశీల్యానికి నిజమైన అర్థాన్ని

నీ జీవితపు పుటల్లోనే చూచాను,

తెలుసుకున్నాను, అనుసరించడానికి ప్రయత్నిస్తున్నాను.

దారుణమైన జీవిత యజ్ఞానికి

దేహాన్ని, మనస్సును అర్పిస్తూ కూడా

సంయమం కోల్పోని నీవు

ఒక్కనాడైనా కన్నీర్ర చేసి వుంటే

నేను వ్యథాగ్నికి ఆహుతి అయ్యేవాణ్ణి.

నేను నేను కానమ్మా - నీ కొడుకుని

అందుకే

నా శక్తియుక్తుల్ని ధారపోసి

రాసిన యీ పుటల్ని

నీకర్పిస్తున్నా.

—సుందరం

# విషయసూచిక

# ప్రవేశిక

ఆంధ్రుల జానపద విజ్ఞానమంటే ఆంధ్రుల జానపద సంస్కృతి. జానపద విజ్ఞానం (Folk lore), జానపద సంస్కృతి (Folk culture), జానపద జీవనం (Folk life) వేరు కాదు. జానపద విజ్ఞానమంటే కేవలం మౌఖికంగా ఒక తరంనుంచి మరొక తరానికి సంక్రమించే వాఙ్మయ సాహిత్యమనే సంకుచిత దృష్టిని పోగొట్టాలని నేడు అమెరికాలో జానపదజీవన మనే పదాన్ని కొందరు విద్వాంసులు వాడుతున్నారు. మానవ జీవిత మంత విస్తృతమైన పరిధి జానపద విజ్ఞానాని కున్నదని చెప్పడమే వారి ఆశయం.

జానపద విజ్ఞానం సంస్కృతిలో ఒక భాగం. సంస్కృతిని నాగరికతకు పర్యాయపదంగా కొందరు వాడుతారు కాని అది సరికాదు. ఆదిమానవుని కాలంనుంచి, నేటి నాగరిక మానవుని వరకు ఆయాకాలాల్లో మనిషి తన అభ్యున్నతి కోసం చేసిన కృషి 'సంస్కృతి'. అంటే మానవకృతి సంస్కృతి అన్నమాట. ఈ సంస్కృతిలో జానపదుల జీవనానికి సంబంధించిన గేయాలు, కథలు, సామెతలు, భాష, నమ్మకాలు, దుస్తులు, ఆటలు, వంట, వైద్యం, కళలు మొదలైనవన్నీ జానపద విజ్ఞానంలో భాగాలే.

జానపద విజ్ఞానం అత్యంత ప్రాచీనకాలానికి సంబంధించిన సాంప్రదాయిక జ్ఞానమని. మరో విధంగా చెప్పాలంటే అది సజీవ శిలాజం(living fassil)వంటిదని కొందరు అభిప్రాయ పడ్డారు. జానపద విజ్ఞానం గతకాలానికి ప్రతిధ్వని మాత్రమే కాదు. వర్తమానం లోని శక్తివంతమైన గొంతుక అనే విషయాన్ని కూడా మనం గమనించాలి.[1] పల్లెటూళ్ళన్నీ పట్టణాలుగా మారితే జానపద విజ్ఞానం నామరూపాలు లేకుండా పోతుందను కోడం కూడా సరికాదు. గ్రామీణులు, విద్యావిహీనులు మాత్రమే జానపదులని, వారికి సంబంధించినదే జానపద విజ్ఞానమని 19 వ శతాబ్దికి చెందిన జానపదవిద్వాంసులు భావించేవారు.[2] నేడు నగర సంబంధమైన జానపద విజ్ఞానాన్ని గురించిన అధ్యయనం కూడా సాగుతున్నది.

జానపద విజ్ఞానం ఒక ప్రత్యేక అధ్యయన విభాగమై విశ్వవిద్యాలయాలలో కూడా ప్రవేశించింది. అందువల్ల జానపదులంటే ఎవరు, జానపద విజ్ఞానం పుట్టుపుర్వోత్తరాలేమిటి, దీని అధ్యయనం చెయ్యాలంటే ఏయే పద్ధతుల్ని అనుసరించాలి, దీన్ని వర్గీకరించడమెలా—అనే విషయాల్ని పరిశీలించాల్సి వుంది.

జానపద విజ్ఞాన అధ్యయనంలో శాస్త్రీయ దృష్టి అవసరమనే విషయాన్ని స్పష్టం చేయడానికి, ఈ క్షేత్రంలో ఇటీవల జరుగుతున్న కృషిని పరిచయం చేసి ఆంధ్రుల జానపద విజ్ఞానాన్ని సమగ్రంగా అధ్యయనం చేసేందుకు తగిన శాస్త్రీయ అవగాహనను ఏర్పరచడానికి ఈ ప్రవేశికను రాయడం జరిగింది.

జానపదులంటే ఎవరు ?

ఒకప్పుడు జానపద సాహిత్యమంటే కేవలం పల్లెపదాలు మాత్రమే, జానపద విజ్ఞానాన్ని కూడా కొందరు జానపద వాఙ్మయానికి పర్యాయపదంగా వాడడం జరిగింది. జానపద విజ్ఞానాన్ని ఇంగ్లీషులోని 'ఫోక్‌లోర్'కు సమానార్థకంగా తెలుగులో మనం వాడుతున్నాం. 'ఫోక్‌లోర్' అనే పదాన్ని డబ్ల్యు. జె. థాంప్ (W. J. Thoms) 1846 లో రూపొందించాడు. 'ది అథనీయం' అనే పత్రికకు రాసిన ఒక వుత్తరంలో థాంప్ 'ఫోక్‌లోర్' అనే పదాన్ని సూచిస్తూ దాని అర్థాన్ని కూడా కొంతవరకు వివరించాడు. జానపదులకు చెందిన ఆచారాలు, నమ్మకాలు, కథాగేయాలు, సామెతలు మొదలైన విజ్ఞానమే 'ఫోక్‌లోర్' అని థాంప్ వచించాడు.

జానపదులకు సంబంధించినదే 'ఫోక్‌లోర్' అని చెప్పడం సులభమే. 19 వ శతాబ్దిలో 'ఫోక్'ను నిర్వచించిన విద్వాంసులు జానపదులంటే విద్యావిహీనులైన కర్షక జనులని, గ్రామీణులని అభిప్రాయ పడ్డారు. సంస్కృతిలో మూడు దశలున్నాయని మానవ శాస్త్రవేత్తలు అభిప్రాయపడ్డారు. అరణ్య జీవన స్థితి, అనాగరిక స్థితి, నాగరిక స్థితి అనే ఈ మూడు దశలలో జానపదులుఅనాగరిక స్థితికి చెందిన వారని అభిప్రాయపడేవారు. అంటే జానపదులుఅటు ఆటవికులూ కాదు, ఇటు నాగరికులూ కాదు-పల్లెటూళ్ళలో నివసించే వారన్నమాట.

జనపద మంటే ఒకప్పుడు కేవలం 'పల్లెటూరు' అనే అర్థం వుండి వుండవచ్చు. నేడు 'ఫోక్' అనే పదానికి సమానార్థకంగా మనం వాడుతున్న జానపదుల్ని గ్రామీణులనే పరిమితార్థంలో ఊహించడం సబబుకాదు. అయితే జానపదు లంటే ఎవరు?

ప్రసిద్ధ జానపద విద్వాంసుడైన అలన్ డండెస్ ప్రకారం జానపదు లంటే ఏదైనా ఒక్క విషయంలోనైనా భావసామ్యం కలిగిన జనసముదాయం వీరు ఒక భాషకు సంబంధించిన వారు కావచ్చు. ఒక ప్రదేశంలో నివసిస్తున్న వారు కావచ్చు, ఒక ప్రదేశంలో నివసిస్తున్నవాడు కావచ్చు. ఒకే జాతికి, మతానికి, వృత్తికి సంబంధించిన వారు కావచ్చు.[3] అయితే ఈ జనసము దాయం తమదే అని చెప్పుకోగల్గిన కొన్ని సంప్రదాయాలను కలిగి వుండాలి. జన సముదాయం అన్నప్పుడు 'ఫోక్' అనిపించుకోవా లంటే కనీసం ఇద్ద రైనా వుండాలని తేలింది. అయితే మామూలుగా జానపద సముదాయంలో ఎక్కువమంది వ్యక్తులుంటారు. ఈ విధంగా జానపదుల్ని నిర్వచించడం వల్ల 'ఫోక్' అన్నదానికి అర్థం ఒక కుటుంబమైనా కావచ్చు, ఒక దేశమైనా కావచ్చు. 'మాయింటి జానపదవిజ్ఞానం' అనడం ఎంత అర్థవంతమో 'భార తీయ జానపద విజ్ఞానం. అనడమూ అంతే అర్థవంతమే. ఒక కుటుంబం లోని పద్ధతులు, నమ్మకాలు, వారి ఇంటిపేరును గురించిన కథాకమామిషూ మొదలైనవి ఇంటింటి జానపద విజ్ఞానమైతే, భారతీయుల సంప్రదాయాలు, ఆచారాలు, నమ్మకాలు, పండుగలు మొదలైనవి భారతీయ జానపద విజ్ఞాన మని పించుకుంటాయి అందువల్ల 'ఆంధ్రుల జానపద విజ్ఞానం' అనడం వల్ల ఆంధ్రులందరికీ ప్రత్యేకమైన సంస్కృతి వుందని, వాళ్ళవే అయిన కొన్ని సంప్రదాయాలు, నమ్మకాలు, ఆచారాలు, అభిరుచులు, సాహిత్య రూపాలు, కళలు వున్నాయని అర్థం. జానపదులను పైన చెప్పిన ఆధునిక దృక్పథంతో నిర్వచిస్తే సమానసంప్రదాయాలు కలిగినఆటవికులైనా, గిరిజను లైనా, గ్రామీణులైనా, నగరవాసులైనా జానపదులే అవుతారని చెప్పవచ్చు. అందువల్లనే భారతీయులు, ఆంధ్రులు, స్త్రీలు, పిల్లలు, విద్యార్థులు, గిరిజనులు మొదలైన వివిధ జన సముదాయాలకు సంబంధించిన జానపద విజ్ఞానాన్ని ప్రత్యేకంగా పేర్కొనే అవకాశం వుంది.

జానపద విజ్ఞానం :

జానపద విజ్ఞానం సంస్కృతిలోని, జీవితంలోని అన్నివిషయాల్లనూ తనలో ఇముడ్చుకోగలిగినంత విశాలమైంది కావడం చేత దాన్ని నిర్వచించడం చాలా కష్టంతో కూడు కున్న పని. అందువల్లనే అలన్ డండెస్ ఒక పట్టీ రాసి 'దానిలో వుండేవే జానపద విజ్ఞానం' అని చెప్పి వూరుకున్నాడు (డండెస్ 1965). జానపద విజ్ఞానానికి సంబంధించిన నిర్వచనాలలో బ్రున్‌వాండ్ చెప్పింది అత్యంత సమంజసంగా కన్పిస్తుంది 'ఫోక్‌లోర్'లో చేరవగ్గవి "those materials in culture that circulate traditionally among members of any group in different versions, whether in oral form or by means of customary example" అని ఈ నిర్వచనం చెప్తుంది.[4]

పై నిర్వచనాన్ని పరిశీలిస్తే జానపద విజ్ఞానాన్ని జానపదేతరమైన వాటి నుంచి వేరు చేయడం ఎలాగన్నది బోధపడుతుంది. 1. సంస్కృతికి సంబంధించిన విషయాలు 2. ఏ జనసముదాయంలోనైనా సాంప్రదాయికంగా ప్రసారమయ్యేవి 3. వివిధ రూపాంతరాలు కలవి 4. మౌఖికంగా గాని, మరోవిధంగా గాని ఒకతరంనుంచి మరోతరానికి సంక్రమించేవి జానపద విజ్ఞానంలో చేరుతాయని చెప్పవచ్చు.

వర్గీకరణం :

ఏ శాస్త్రాన్నయినా అధ్యయనం చెయ్యాలంటే దాన్ని విశ్లేషించి వర్గీకరించాలి. జానపద విజ్ఞానం స్వరూప స్వభావాలను బాగా అర్థం చేసుకోవాలంటే ఈ అధ్యయన విషయంలోని వివిధ విభాగాలను సూక్ష్మంగా పరిశీలించాల్సి వుంది. జానపద విజ్ఞానంలో ముఖ్యంగా శాబ్దిక జానపద విజ్ఞానం (Verbal folklore), శాబ్దికేతర జానపద విజ్ఞానం (Non-verbal folklore) అనే రెండు విభాగాలున్నాయి. మౌఖికంగా, శబ్దరూపంలో వెలువడేది మొదటి విభాగానికి చెందినదైతే, తదితరమైన నమ్మకాలు, ఆచారాలు, దుస్తులు, అలంకారాలు, ప్రదర్శన కళలు మొదలైనవి రెండవ విభాగానికి చెందుతాయి.

రిచర్డ్ ఎం. డార్సన్ (Richard M. Dorson) జానపద విజ్ఞానాన్ని స్థూలంగా నాలుగు శీర్షికల కింద విభజించాడు (డార్సన్ 1972). 1. మౌఖిక

జానపద విజ్ఞానం (Oral folklore) జానపదగేయాలు, కథాగేయాలు, జానపద పురాణాలు, ఐతిహ్యాలు, గద్యకథలు, సామెతలు, పొడుపు కథలు, మాండలికాలు, నుడికారాలు, తిట్లు, ఒట్లు మొదలైనవన్నీ ఈ విభాగంలోనివే. 2. సాంఘిక జానపదాచారాలు (Social folk customs) : పుట్టుక, వివాహం మరణం మున్నగు వానికి చెందిన ఆచారాలు, కుటుంబం, సంబంధ–బాంధవ్యాలు, పండుగలు, వినోదాలు, ఆటలు, జానపదవైద్యం, మతం, నమ్మకాలు మొదలైనవి ఈ విభాగంలో చేరుతాయి. 3. వస్తు సంస్కృతి (material culture) : భౌతిక జీవితానికి సంబంధించిన అన్ని వస్తువులు ఈ విభాగంలో చేరుతాయి. కళారూపాలుకూడా వస్తురూపంలో వుంటే ఈ విభాగంలోనే స్థానం పొందుతాయి. చిత్రకళ, శిల్ప, వాస్తుకళ, వివిధ వృత్తుల పరికరాలు, దుస్తులు, అలంకరణ, ఆభరణాలు, ఆహార సామగ్రి, పూజాసామగ్రి, శిలావిగ్రహాలు, దారు విగ్రహాలు మొదలైన వాటిని ఈ విభాగంలో పరిశీలించడం జరుగుతుంది. 4 జానపద కళలు (Folk arts) : సంగీతం, నృత్యం, అభినయం వుండే ప్రదర్శన కళలన్నీ ఈ విభాగంలో చేరుతాయి. గాత్ర సంగీతం, వాద్య సంగీతం, తోలుబొమ్మలాటలు, యక్షగానం, వీధి భాగోతం కోలాటం, పగటివేషాలు, బహురూపులు, గారడివిద్యలు మొదలైనవి ఈ విభాగంలో చేరుతాయి.

డార్సన్ చేసిన పై విభజన స్థూలమైనదైనా శాస్త్రీయంగా వుంది. అయినా కొన్ని శాఖల విషయంలో అతివ్యాప్తి, అవ్యాప్తి లేకపోలేదు. వివిధ సంజ్ఞలు, భంగిమలు మొదలైనవాటిని ఎక్కడ చేర్చాలన్నది ఒక సమస్య కళగా మనం మన్నించే కవిత్వం వాగ్రూప కళగా పరిగణించబడింది జానపద కళల్లో చేరాల్సిన శిల్పం, చిత్రకళ మొదలైనవి వస్తు సంస్కృతిలో చేరాయి. ఏది ఏమైనా జానపద విజ్ఞానానికి సంబంధించిన స్థూల వర్గీకరణాలలో డార్సన్ వర్గీకరణమే అత్యుత్తమమైనది. దీన్నే కొన్ని మార్పులతో స్వీకరించి ప్రకృత గ్రంథంలో అనుసరించడం జరిగింది.

జానపద విజ్ఞానాన్ని సమగ్రంగా అధ్యయనం చేసేటప్పుడు సూక్ష్మాతి సూక్ష్మమైన అంశాల్ని కూడా పరిశీలించాలి. ఇలాంటి పరిశీలనకు ఆర్. ఎస్. బాగ్స్ (R.S. Boggs) విభజన వుపయోగిస్తుంది బాగ్స్ విభజన [5]

గ్రంథాలయాల్లో మనంచూసేపుస్తకాల విభజనవంటిది. జానపద విజ్ఞానంలోని ముఖ్యవిభాగాలను బాగ్స్ ఇంగ్లీషులోని పెద్ద అక్షరాలతో సూచించాడు. వాటిని గణాలు (groups) అన్నాడు. జానపదవిజ్ఞానంలోని ప్రధాన గణాలీక్రిందివి :

A. సామాన్య జానపద విజ్ఞానం (General Folklore)

B గద్య కథనం (Prose Narrative)

C కథాగేయం (Ballad) గేయం, (Song) , నృత్యం (Dance) ఆట (Game), సంగీతం (Music), గద్య (Verse)

D. నాటకం (Drama)

F ఆచారం (Custom) , ఉత్సవం(Festival)

G. భూగోళం (Geography)

L భాష (Language)

M. కళ (Art) , చేతిపనులు (Crafts), వాస్తువు (Architecture)

N. ఆహారం (Food) ,పానీయము (Drink)

P. నమ్మకం (Belief)

S వాక్కు (Speech)

V. సామెత( proverb)

W. పొడుపుకథ (Riddle)

పై గణాలలో ఒక్కొక్కదాన్ని బాగ్స్ కొన్ని వర్గాలు (Categories)గా విభజించాడు. ఉదాహరణకు గద్యాఖ్యానాలుగల B గణంలో మూడు వర్గా లున్నాయి. అవి B 200 పురాణం, B 400ఐతిహ్యం, B 600 కథ అన్నవి. ఈ వర్గాలను బాగ్స్ వందల్లోచెప్పాడు ( B200, B 400, B600 మొ॥వి) ఒక్కొక్కవర్గంలోను కొన్నిమాదిరులుంటాయి. ఈమాదిరులు(types)పదుల్లో వుంటాయి. ఉదాహరణకు B 200పురాణం-అనే వర్గంలో B 220,B 230, B 240 మొదలైన మాదిర్లుంటాయి. ఒక్కొక్క వర్గంలోను కొన్నిప్రక్రియలు (forms), వాటిలో కొన్ని విభాగాలు (Divisions) వుంటాయి ఈ విభజనను ఏదైనా ఒక వుదాహరణతో స్పష్టంచేయవచ్చు. 'C 324' అన్నది ఏమిటని తెలుసుకోవాలంటే దాన్ని ఇలా వివరించవచ్చు.

C (గణం) = కథాగేయం, పాట, నృత్యం మొదలయినవాటిని సూచిస్తుంది.
C 300 (వర్గం) = జానపద గేయాలను సూచిస్తుంది.
C 320 (మావిక) = రసగీతాలను సూచిస్తుంది.
C 324 (ప్రక్రియ) = సంతోషగీతం

పై వర్గీకరణం వల్ల ముఖ్యంగా రెండు ప్రయోజనాలున్నాయి. ప్రపంచంలో ఏ మూలకు సంబంధించిన జానపద విషయమైనా సరే ఒక నిర్దిష్ట సంకేతాన్ని వుంచుకొని (C 324 లాగా) దాని తులనాత్మకంగా పరిశీలించడానికి వీలవుతుంది. రెండవ ప్రయోజనం ఏమిటంటే ఇటువంటి సూక్ష్మ విభజన వల్ల జానపద విజ్ఞానంలో ఏయే అంశాలు వస్తాయన్నది తెలిసి దాని స్వరూపం మనకు బోధపడుతుంది.

నేడు అన్ని శాస్త్రాల అధ్యయనం బహుముఖంగా సాగుతున్నది. దినదినానికీ విద్వాంసులు ప్రతి శాస్త్రంలోని లోతుల్ని తరచి చూస్తున్నారు. కంప్యూటర్‌వంటి ఆధునిక ఉపకరణాలను ఉపయోగించుకునేంత వరకు అనేక శాస్త్రాల అధ్యయనం ఎదిగింది. తమ విభజనల్లో బొగ్స్ వంటివారు ఇలాంటి నూతన శాస్త్రీయ విధానాలను దృష్టిలో వుంచుకున్నారు.

కంప్యూటర్ వంటి ఆధునికయంత్రాలను వాడి, జానపద విజ్ఞానంలోని ప్రతిఅంశాన్ని సూక్ష్మంగా విశ్లేషించవచ్చు. అప్పుడు జానపద గేయంవంటి ఒక్కొక్క విషయంలోనూ వేలకొద్దీ విభాగాలు, ఉపవిభాగాలు గుర్తింపుకు వస్తాయి. ఈ విభాగాలను, ఉపవిభాగాలను అకారాదిగాకూర్చి, ఒక్కొక్క దానికి ఒక్కొక్క సంఖ్యను సంకేతంగా నిర్ణయించి, పాటలలో కన్పించే ముఖ్యమైనవైవ్యావృత్యాత్మక గుణాలను (distinctive features) పట్టీ చేసి విశ్లేషణ చేయవచ్చు. ఇలాంటి అధ్యయనాన్ని గూర్చిన కొన్ని వివరాలను తెలుగు-కన్నడ జానపద గేయాలలో చూడవచ్చు. (సుందరం 1978: 279).

జానపద విజ్ఞానం –ఉత్పత్తి వికాసం :

జానపద విద్వాంసులు ఇటీవలి కాలంలో ప్రతిపాదించిన అనేక సిద్ధాంతాలు. విధానాలు జానపద విజ్ఞానం ఏ విధంగా ఉత్పత్తి అవుతుందన్నదాన్ని అర్థం చేసుకోడానికి ఉపకరిస్తాయి. ఈ సిద్ధాంతాలు ముఖ్యంగా మూడు ప్రశ్న

లకు సమాధానం చెప్పడానికి ప్రయత్నిస్తాయి. అవి 1. జానపద విజ్ఞానం ఎప్పుడు పుట్టింది 2. ఎక్కడ పుట్టింది. 3. ఎందుకు, ఏ విధంగా పుట్టింది? అన్నవి. జానపద విజ్ఞానానికి ఉత్పత్తికి సంబంధించినంతవరకు రెండు ముఖ్య గుణాలున్నాయి. వాటిలో మొదటిది బహుప్రదేశ అస్తిత్వం (Multiple existence) రెండవది వివేక రాహిత్యం (Irrationality). జానపద విజ్ఞానం బహుప్రదేశ అస్తిత్వం కలది. లాలిపాట ఆంధ్రదేశం లోనూవుంది, కర్నాటకం లోనూ వుంది, ఆఫ్రికాలో ఆమెరికాలోనూ వుంది ఇట్లే వివిధ ప్రక్రియలు వివిధ ప్రదేశాలలో కనిపిస్తాయి.

బహుప్రదేశ అస్తిత్వమనే గుణాన్ని వివరించడానికి రెండు మార్గాలున్నాయి. ఏకోత్పత్తి వాదం (Monogenesis), బహుళోత్పత్తివాదం (Polygenesis) అన్నవే అవి రెండు. ఈ వాదాలు జానపద విజ్ఞానానికే కాక సంస్కృతి అధ్యయనానికి, మానవ శాస్త్ర అధ్యయనానికి కూడా అన్వయిస్తాయి. గేయం, కథ, నమ్మకాలు మొదలైనవి ఒక ప్రదేశంలో పుట్టి మిగిలిన ప్రదేశాలకు వ్యాపిస్తాయని ఏకోత్పత్తి వాదం చెప్తుంది. ప్రపంచంలో వివిధ ప్రదేశాలలో కనిపించే జానపదాంశాలలో ఏవైనా పోలికలు కనిపిస్తే దానికి కారణం మనిషిలోని మూలభూతంగా వుండే మానసిక ఐక్యతేగాని ఒక దానికి మరొక దానికి నేరుగా వుండే సంబంధం కాదని బహుళోత్పత్తివాదం చెప్తుంది. ఈనాడు పెక్కుమందివిద్వాంసుల సమ్మతిని పొందింది ఏకోత్పత్తి వాదమే గాని, బహుళోత్పత్తివాదం కాదు.

ఏకోత్పత్తి వాదాన్ని సమర్థించే వాటిలో చారిత్రక భౌగోళిక సిద్ధాంతం ఒకటి. దీనికే ఫిన్నిష్ విధానం అనే పేరుంది. దీన్ని ప్రతిపాదించిన వారు జూలియస్ క్రోహ్న్ (Julius krohn), కార్లెక్రోహ్న్ (Kaarle krohn) ఎందలకొద్దీ పాఠాలలో అనేక ప్రదేశాలలో కనిపించే జానపద కథలను పరిశీలించి మూలప్రతిని కనుక్కోడానికి ప్రయత్నం చేయడం ఈ విధానంలో ముఖ్యం. చారిత్రక పునర్నిర్మాణ సిద్ధాంతం (historical-reconstructional) కూడా జానపద విషయాల చరిత్రను తెలుసుకోడానికి సహాయపడుతుంది.

ధార్మిక కర్మకాండలే జానపద విజ్ఞానానికి మూలమనే అభిప్రాయం ఒకటుంది. దీన్ని ఆచరణాత్మక సిద్ధాంతం (ritualistic theory)అంటారు. జానపద పురాణాలు, పండుగలు మొదలైన వాటిని నిశితంగా పరిశీలిస్తే ప్రాచీనకాలంనాటి ఏదో ఒక కర్మకాండను వాటిల్లోంచి పునర్నిర్మించవచ్చునని ఈ సిద్ధాంతం చెప్తుంది. కాని జానపద సంబంధమైన నమ్మకాలు మొదలైన వాటి ఆధారంతో మత సంబంధమైన ఆచరణలు నిర్మాణమవుతాయని, అందు వల్ల ఆచరణలే జానపద విజ్ఞానానికి మూలమనడం సమంజసంకాదని కొందరంటారు.[6]

జానపద గేయాలు మొ॥వి ఎందుకు పుట్టాయి, ఎలా పుట్టాయి అన్న ప్రశ్నలకు సమాధానం తెలుసుకోడానికి స్వప్నమూల సిద్ధాంతం, మనో విశ్లేషణ (Psycho-analysis) ఉపయోగిస్తాయి. కథలు మొదలైన జానపద ప్రక్రియలలో మనం చూచే అనేక సంఘటనలకు కలలే కారణమని కొందరి అభిప్రాయం. స్వప్నాలను మనస్తత్వశాస్త్రపరంగా విశ్లేషించినప్పుడు జానపద విజ్ఞానం అర్థ వివరణ సాధ్యమవుతుందని వీరు భావిస్తారు. లైస్నర్ (Ludwig Laistner)మున్నగువారు ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు.

జానపద విజ్ఞానాన్ని ఉత్పత్తి పరంగా చూచినప్పుడు బహుప్రదేశ అస్తిత్వం, వివేక రాహిత్యం అనే రెండు గుణాలు ముఖ్యమైనవని ఇంతకు ముందు చెప్పబడింది. బహుప్రదేశ అస్తిత్వాన్ని ఏకోత్పత్తివాదం, బహూత్పత్తి వాదం వివరిస్తాయి. వివేక రాహిత్యాన్ని మనోవిశ్లేషణ సిద్ధాంతం వివరిస్తుంది. కథలు మొదలైన వాటిలో శిష్ట సాహిత్యంలోని క్రమంగాని, సర్వాంగ సుందరమైన కూర్పుగాని కనిపించవు జానపద విజ్ఞానంలోని వివేక రాహిత్యాన్ని గురించి తెలుసుకోవాలంటే మనోవిశ్లేషణను ఆశ్రయించాలి.

మనోవిశ్లేషణ సిద్ధాంతానికి మూలప్రేరణ సిగ్మండ్ ఫ్రాయిడ్ నుంచి లభించింది. కోరికలను అణచివుంచితే అవి కలలు రావడానికి కారణమవుతాయని ఫ్రాయిడ్ అభిప్రాయ పడ్డాడు. మానవునిలోని చేతన, సుప్తచేతన, అచేతన స్థితులను ఫ్రాయిడ్ విశ్లేషించి చూపాడు. జానపద విజ్ఞానం సామూహిక సుప్తచేతన స్థితిలో ఉద్భవిస్తుందని విద్వాంసులు అభిప్రాయపడ్డారు.

ప్రసిద్ధ మనస్తత్వ శాస్త్రవేత్త యూంగ్ ప్రతిపాదించిన సామూహిక సుప్త చేతన సిద్ధాంతాన్ని మనం జానపద విజ్ఞానానికి కూడా అన్వయించవచ్చు

జానపద విజ్ఞానం మానవుని సుప్తచేతన స్థితిలో వెలువడుతుందన్నది ఒక అభిప్రాయం అయితే, దీనికి పోషకంగా ఈ విజ్ఞానం సామూహిక సుప్త చేతనలో ఉద్భవిస్తుందని విద్వాంసులు చెప్తారు జానపద విజ్ఞానంలో చాలా భాగం సమష్టి సృష్టేగాని వ్యష్టి కాదు. ఒకవేళ సామెతలాంటి ఏ ఒకటి రెండు ప్రక్రియలో వ్యష్టిసృష్టిగా మొదలైనా అవి జానపద సామెతలు కావాలంటే సామూహిక పునఃసృష్టి తప్పదు. ప్రాచీనకాలంలో మానవులేపని చేసినా సామూహికంగానే చేసేవారు. ఒకవేళ ఏదైనా వ్యక్తినోటిగుండా వెలువడినా అది సామాజిక స్పృహతో కూడి వుండేది. హడ్సన్ సాహిత్యాన్ని గురించి చెప్పిన మాటలు జానపద విజ్ఞానానికంతటికీ వర్తించేవే: "సాహిత్యావిర్భావ కాలం గురించిన పరిశోధనల వల్ల కవిత్వం ఒకవ్యక్తికి సంబంధించిన భావ వ్యక్తీకరణవల్ల వెలువడలేదని, ఒక సమూహానికి లేక గుంపుకు సంబంధించినదనడం సమంజసమని చెప్పవచ్చు'' (హడ్సన్ . 97)

పై సిద్ధాంతాలు, అభిప్రాయాలు జానపద విజ్ఞానం పుట్టుకను గురించి తెలుసుకోడానికి అనేక విధాల దోహదం చేస్తాయి. పై వివరణ సారాంశాన్ని ఇలా చెప్పవచ్చు. జానపద విజ్ఞానం ఒక్క ప్రదేశానికి పరిమితమయింది కాదు. అది బహుప్రదేశ అస్తిత్వం కలది. దీని మరొక గుణం వివేకరాహిత్యం. జానపద విజ్ఞానం ఏ కాలంలో పుట్టింది, ఏ ప్రదేశంలో పుట్టింది, ఎందుకు పుట్టిందన్న విషయాలను తెలుసుకోడానికి కొన్ని సిద్ధాంతాలు, విధానాలు సహాయ పడ్తాయి. మొత్తంమీద జానపద విజ్ఞానం వ్యష్టిసృష్టికాదు, సమష్టి సృష్టి.

ఒక్కొక్క ప్రదేశంలోని జానపద ప్రక్రియల ఉత్పత్తిని గురించి తెలుసుకోవాలన్నా, ఒక భాషకుగాని, మతానికిగాని, దేశానికిగాని సంబంధించిన జానపద ప్రక్రియలను అధ్యయనం చెయ్యాలన్నా ఆయా ప్రక్రియల విశిష్టలక్షణాలను లెక్కలోకి తీసుకోవలసి ఉంటుంది. అట్లే ఒక ప్రదేశం నుండి మరొక ప్రదేశానికి వలస వెళ్ళే జానపద ప్రక్రియలను గురించి తెలుసుకోవాలంటే ఆయా ప్రదేశాల చరిత్ర, సంస్కృతి మొదలైనవాటిని గురించిన అవగాహన అవసరం. దీన్ని ఒక ఉదాహరణతో స్పష్టంచేయవచ్చు.

బాలనాగమ్మ, సారంగధర వంటి కథాగేయాలు తెలుగుదేశంలో ఎంత ప్రచారంలో వున్నాయో, కన్నడదేశంలోనూ అంతే ప్రచారం పొంది వున్నాయి. ఇలాంటి సమాన కథాంశాలున్న గేయకథలు ఆంధ్ర కర్నాటకాలలో స్వతంత్రంగా ఉద్భవించాయని చెప్పేస్తే ఏ చిక్కూ లేదు. బహుళోత్పత్తి వాదాన్ని సమర్థించేవారు ఈ విధంగానే చెప్పి చేతులు కడుక్కుంటారు. కాని అదిసరికాదు. కర్నాటకంలోని వృత్తిగాయకులలో హెళవరు (తెలుగు పిచ్చుకుంట్లు) మొదలైనవారు కన్నడ కథాగేయాలను గానంచేస్తారు వీరి మాతృభాష తెలుగు. కొన్ని తరాల ముందు వీరు తెలుగుదేశం నుంచి వలస వచ్చి కన్నడదేశంలో స్థిరపడ్డారు. వీరితోబాటే కొన్ని కథాగేయాలు కన్నడదేశంలో ప్రవేశించాయి. చరిత్రను సంస్కృతిని తరచిచూచుకుంటూ పోతే ఇలాంటి విశేషాలు బయల్పడతాయి. మరి బాలనాగమ్మ, సారంగధరవంటి కథలు మరాఠీదేశం నుంచి వచ్చాయేమోననే విషయంకూడా పరిశీలించవలసి వుంది. ఎందుకంటే ఈ కథల్లోని కొన్ని పాత్రలు, కొన్ని సంప్రదాయాలు మరాఠీ సంప్రదాయానికి చెందినవి. జానపద విజ్ఞానంలోని ప్రతిప్రక్రియ ఉత్పత్తి వెనకా సుదీర్ఘమైన సంప్రదాయం వుంటుందన్న విషయాన్ని మరిచిపోరాదు

జానపద విజ్ఞానంవల్ల ప్రయోజనాలు

జనజీవనంలో జానపద విజ్ఞానం వహించే పాత్ర ఏమిటి అన్నదికూడా పరిశీలింపవగింది. జానపద విజ్ఞానాన్ని ప్రయోజనాత్మక దృష్టితో చూచేవారు ప్రకార్యాత్మక సిద్ధాంతం (functional theory) అన్నదాన్ని ప్రతిపాదించారు. అమెరికాలోని సాంస్కృతిక మానవశాస్త్రజ్ఞులు ముఖ్యంగా అవిద్యావంత సమాజాల్లోని సాంస్కృతిక విషయాల ప్రయోజనం మీద ఎక్కువగా దృష్టిని సారించారు. సామాజిక సంస్థల కార్యనిర్వహణలో జానపద విజ్ఞానం పాత్ర ఏమిటనే విషయాన్ని గురించి కొందరు పరిశోధించారు.

జుని పురాణశాస్త్రాన్ని (Zuni Mythology) గురించి పరిశోధనలు జరిపిన బెనెడిక్ట్ (Rutn Benedict) అనే విద్వాంసురాలు జానపద విజ్ఞానం అనేక సందర్భాలలో సాంస్కృతిక నియమావళిని కూడా ఉల్లంఘిస్తుందని అభిప్రాయపడింది (డార్సన్ 1972 : 21). జానపద ప్రక్రియల ప్రయోజనాలను గురించి విస్తృతమైన అధ్యయనం చేసినవాడు విలియం బేస్కామ్.

(William Bascom). ఆయన అభిప్రాయం ప్రకారం జానపద ప్రక్రియలు ప్రకార్యాత్మక సమాజం సృష్టించేవి కావటం వల్ల అవి సంచలనాత్మకంగా వుంటాయిగాని నిశ్చలంగా వుండవు. ఒక్కొక్క జానపద ప్రక్రియకూ ఏదో ఒక నిర్దిష్ట ప్రయోజనమూ, ఇంకా కొన్ని ఉపప్రయోజనాలు వుంటాయి. సామెతలు జానపద న్యాయస్థానాలలో తీర్పు చెప్పడానికి వుపయోగిస్తాయి. పొడుపు కథలు బుద్ధికి పదును పెడ్తాయి. పనిపాటలు శ్రమను తగ్గించడానికి దోహదం చేస్తాయి. లాలిపదాలు, జోలపాటలు పసిబిడ్డలను నిద్రబుచ్చడానికి వుపయోగిస్తాయి. జానపదుల పండుగలు, వుత్సవాలు, నమ్మకాలు, పలుకుబళ్ళు, సామెతలు, వైద్యం మొదలైన వాటికి నిర్దిష్టమైన ప్రయోజనాలున్నాయి.

ఇటీవలి జానపద సిద్ధాంతాలలో వైచారికాత్మక సిద్ధాంతం (ideological theory) ఒకటి ఒక విధంగా రాజకీయ సిద్ధాంతం. రాజకీయపరంగాజానపద విజ్ఞానాన్ని ఉపయోగించుకోడం హిట్లర్ కాలంనుంచి మొదలయింది. సోవియట్ రష్యా కమ్యూనిజాన్ని ప్రచారం చేయడానికి జానపద విజ్ఞానం ఒక శక్తివంతమైనసాధనమని గ్రహించింది. సొకొలొవ్ జానపదవిజ్ఞానాన్నిగురించే రాస్తూ అది వర్గ సంఘర్షణను ప్రతిబింబిస్తుందని, వర్గ సంఘర్షణకది ఒక ఆయుధమని వచించాడు (డార్సన్ 1972:17). తెలుగుదేశంలో కూడా అనేక వుద్యమాలలో జానపద ప్రక్రియలు నిర్వహించిన మహత్తరమైన పాత్రను మరువలేము.

పైన పేర్కొన్నవికాక జానపద విజ్ఞానంవల్ల ముఖ్యంగా నాలుగు ప్రయోజనాలు లభిస్తాయని చెప్పవచ్చు.

జానపద విజ్ఞానం జానపదులకు ఉల్లాసాన్ని, ఆనందాన్ని కలిగిస్తుంది. గేయాలు, కథాగేయాలు, కథలు మొదలైన సాహిత్య ప్రక్రియలు మనకెంతగా హాయిని కలిగిస్తాయో వేరుగా చెప్పనక్కరలేదు. పనిపాటలు పనిలోని శ్రమను తగ్గించి వుల్లాసాన్ని కలిగిసాయన్నది అనుభవంలో వున్నదే. కథాగేయాలు చెప్పేవారికి, వినేవారికి కూడా ఇంపుగా వుంటాయి. వీరగాథలు వంటివి (Heroic ballads) వినేవారికి సంతోషాన్ని, ఉద్రేకాన్ని వూపును ఇస్తాయి. పండుగలు, వుత్సవాలు జనుల జీవితాన్ని సుఖమయం చేస్తాయి, సమాజంలోని

సభ్యుల నడుమ సంపర్కాన్ని పెంపొందిస్తాయి. తద్వారా ఆనందదాయకా లవుతాయి. చిత్రకళ, శిల్పం, ప్రదర్శన కళలు మొదలైనవన్నీ కంటికి, చెవికి ఇంపుగా వుంటాయి. సద్యఃపరనిర్వృతిని కలిగిస్తాయి. ఆటపాటలు పిల్లలకు వుత్సాహాన్ని ఆనందాన్ని ఇస్తాయి. వినోదాలు మానవ జీవితాలలో అనివార్య మైన భాగాలుగా వుండి వారి జీవితం వుల్లాసంగా నడవడానికి దోహదం చేస్తాయి.

జానపద విజ్ఞానంవల్ల కలిగే మరో ప్రయోజనం సంస్కృతి పరిరక్షణ. సంస్కృతిలో ఒకభాగమైన జానపదవిజ్ఞానం సంస్కృతినిపరిరక్షించడమేమిటని మనం ఆశ్చర్యపోవచ్చు. కాని ఇది జానపద ప్రక్రియల ముఖ్య ప్రయోజ నాలలో ఒకటి. సంస్కృతికి సంబంధించిన అనేక విషయాలు కాల గర్భంలో కలిసిపోకుండా జానపద విజ్ఞానం కాపాడుతుంది. ఉదాహరణకు ఒక జాన పద గేయమే వుందనుకుందాం. గేయాలను గానంచేయడం మనసంస్కృతిలో ఒకభాగం. కాని నేడు జానపదగేయాలను పనుల్లో, పండుగల్లో వివిధ సంద ర్భాలలో పాడడమే అరుదై పోతున్నది. అయితే మామూలుగా ఏదైనా పాట పాడాలంటే సిగ్గుపడేవారు కూడా జానపదులకు సంబంధించిన ఏవ్రతమో, పండుగో, పెళ్ళిపేరంటములో వస్తే నలుగురితో కలసి పాడుతారు. అంటే ఈ జానపద సందర్భాలు మన సంస్కృతికి, సంప్రదాయానికి రక్షణ కల్పిస్తున్నట్లే కదా! మరో వుదాహరణలో ఈ విషయాన్ని స్పష్టం చేయవచ్చు మన నిత్య జీవితంలో పంచెకట్టుకోవాలన్నా, తలపాగా పెట్టుకోవాలన్నా వంకీలు, వడ్డా ణాలు ధరించాలన్నా సిగ్గుపడే రోజులివి. అయినా జానపద విజ్ఞానానికి సంబం ధించిన ఏ పెళ్ళో వుత్సవమో, పండుగో వస్తే పెట్టెలో భద్రంగా దాచిపెట్టిన జరీపంచెలు, ఆభరణాలు, అలంకరణ సామగ్రి బయటికి రావడం మనంద రికీ తెలిసిందే. ఈ విధంగా జానపద విజ్ఞానం సంస్కృతిని పరిరక్షించడంలో తోడ్పడుతుంది.

జానపదుల విద్యాభ్యాసానికి జానపద విజ్ఞానం తోడ్పడుతుంది. ఇది మరో ఉపయోగం. మన చదువు పాఠశాలల్లో కళాశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో కొంతవరకే సాగుతుంది. మనం నిజమైన విద్యావంతులం కావాలంటే జాన పద విజ్ఞానం తోడ్పాటు తప్పక అవసరమవుతుంది. చిన్నతనంలో జానపదుల

ఆటపాటలవల్ల వినోదంమాత్రమే లభిస్తుందనుకుంటే అది పొరపాటే. పిల్లలకు ఆటపాటలవల్ల దైహికవ్యాయామమే కాక మానసిక వ్యాయామం కూడా లభిస్తుంది. పిల్లలు ఆటలాడితే అదేదో ఎగిరి గంతులేయడంగా పరిగణిస్తాము. అదే పెద్దలు ఆడితే శారీరక శిక్షణలో భాగంగా భావిస్తాము. చిన్నపిల్లలు వినోదంగా వుపయోగించే ముక్తపదగ్రస్తాలు వారి పదజ్ఞానాన్ని పెంపొందించడానికి వుపయోగిస్తాయి. పొడుపుకథలు బుద్ధి వికాసానికి తోడ్పడతాయి. పూర్వకాలంలో వీరపురుషుల తల్లులు వీరగాథలను, కథలను చెప్పి తమ పిల్లలకు ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని కల్గించే వారని మనంకొన్ని కథల్లో చదువుకున్నాం. జానపదుల జీవితంలో సామెతలు నిర్వహించేపాత్ర మహత్తరమైనది. జీవితాన్ని వడగట్టినట్లుండే అనుభవవాక్యాలు సామెతలు. నిత్యజీవితంలో ఏ తప్పు చేసినా, చేసినతప్పును, సరిదిద్దుకోవలెనన్నా సామెతలను ఆశ్రయించడం అలవాటే. చిన్న చిన్న వాక్యాలరూపంలో వున్నా, సామెతలు జానపదులకు ఎన్నో సందర్భాలలో పాఠాలను నేర్పిస్తాయి. అవి వారి, విద్యాభ్యాసంలో భాగాలని చెప్పినా తప్పులేదు. జానపద సంగీతం, నృత్యం, నాటకం మొదలైనవి కూడా జానపదులకు ఎన్నో విషయాలను నేర్పుతాయి. వారిని సంస్కారవంతులుగా తీర్చిదిద్దుతాయి.

జానపద విజ్ఞానం ప్రధాన ప్రయోజనాలలో మరొకటి నిషిద్ధమైనవాటికి అవకాశం కల్పించడం, మన సమాజంలో అనేక నిషేధాలు (taboos) న్నాయి. త్రాగుడు మంచిదికాదు. బహుభార్యాత్వం నిషిద్ధం, నలుగురిలో తిట్లు అరుపులు మొదలైనవి నిషిద్ధాలు, ఏ సంస్కృతిని తీసుకున్నాసరే వారికొక నియమావళి అంటూ వుండనే వుంటుంది. ఆ నియమావళిని సామాన్య పరిస్థితుల్లో అతిక్రమించరాదు. అయితే జానపద విజ్ఞానం అట్టినియమావళిని అతిక్రమించడానికి సహాయపడుతోందంటే ఆశ్చర్యపడనవసరం లేదు. ఉదాహరణకు అశ్లీల పదాలనుచ్చరించడం తగనిపని. కాని జానపద గేయాలలో అశ్లీల శబ్దాలను ఏ మాత్రం జంకూగొంకూ లేకుండా వాడవచ్చు. సామెతలలో వాడవచ్చు, పొడుపు కథలలో వుపయోగించవచ్చు. త్రాగుడు మామూలుగా పనికిరాదు. కానిజాతర్లలో వుత్సవాల్లో అది నిషిద్ధంకాదు. అక్రమసంబంధాలను మన సమాజం అంగీకరించదు. అయితే జానపదగేయాలలో అక్రమసంబంధాలకు సంబంధించినవి

కోకొల్లలుగా కన్పిస్తాయి. ఈ విధంగా జానపద విజ్ఞానం తెరమరుగున ఎన్నో నిషిద్ధవిషయాలకు అవకాశం కలుగుతుంది.

పైన పేర్కొన్న ప్రయోజనాలు మాత్రమేకాక గేయం, కథాగేయం, కథ, సామెత, నమ్మకం, మతం, నృత్యం, సంగీతం, నాటకం మొదలైన వివిధ జానపద ప్రక్రియలకు ప్రత్యేకమైన ప్రయోజనాలున్నాయి. వీటి అన్నిటి వల్ల తెలిసేదేమిటంటే జానపదవిజ్ఞానం జనజీవనం నుంచి వేరుచేయలేని ముఖ్యమైన భాగం అని.

విద్వాంసుల కృషి

జానపద విజ్ఞానం శాస్త్రీయమైన అధ్యయన విషయంగా ప్రారంభమయింది 19 వ శతాబ్ది నుంచి. అంతకుముందే 'ఫోక్‌లోర్' పేరుతో కాకున్నా, ఈ విషయాన్ని గురించిన పరిశోధన జరగకపోలేదు. సాంప్రదాయిక విజ్ఞానంమీద ఆసక్తి ఇంకా కొన్ని శతాబ్దాల ముందునుంచే విద్వాంసుల్లో వుంది. 18 శతాబ్ది చివరి రోజుల్లో హెర్డర్ (Herder) జానపద గేయానికి వోక్‌స్లైడ్ అనే పదాన్ని వాడాడు. Volkslied అనే పేరుతో హెర్డర్ పిలిచిన గేయాలసంకలనం Stimmen der volkerin Liedern 1778–779 లో ప్రచురితమయింది. జానపద కథాక్షేత్రంలో గొప్పగా కృషిచేసిన గ్రిమ్ సోదరులు (grimm brothers) 1812 లో Kinder and Hausmarchen అనే సంకలనాన్ని ప్రచురించారు.

'ఫోక్‌లోర్' అనేపదాన్ని 1846 లో థామస్ రూపొందించిన తర్వాతన్నే జానపద విజ్ఞానంలో కృషి వేగాన్ని పుంజుకొనింది. 19వ శతాబ్ది చివరి భాగానికి ఐరోపాలో అమెరికాలో జానపద విజ్ఞాన కేంద్రాలు స్థాపించబడ్డాయి (English Folklore Society, 1878; American Folklore society 1888) తర్వాత ఫిన్‌లెండ్, ఇంగ్లెండ్ స్కాట్లెండ్ మొదలైనచోట్లకథాగేయాలు, సామెతలు, ఐతిహ్యాలు మొదలైనప్రక్రియలను గురించి విస్తృత పరిశోధన జరిగింది. జాన్‌బ్రాండ్, హగ్‌మిల్లర్, లోక్రాట్, బిషప్‌పెర్సి, సర్‌వాల్టర్ స్కాట్ మొదలైనవారు ఈ క్షేత్రంలో చక్కని కృషిసల్పారు.

20 వశతాబ్దిలో అనేక వి ద్వాంసులు జానపదక్షేత్రానికి పెక్కువిధా లుగా సేవ చేశారు. మెరియా లీచ్ సంపాదకత్వంలో వెలువడిన (Standard Dictionary of Folklore Mythology and Legend) ఒకమహత్తరమైన సాధన. జానపదవిజ్ఞాన వర్గీకరణం క్షేత్రంలో ఆర్. ఎస్ బాన్స్ సేవ గమనార్హం. జానపద కథాక్షేత్రానికి అంతర్జాతీయ స్థాయిలో సేవచేసిన స్టిత్ థాంపన్(StithThompson )ఆంటి ఆర్నె(Anthi Aarne) ప్రాప్(Vladimir p.opp )మున్నగువారుపేర్కొనదగినవారు. జానపద విజ్ఞాన క్షేత్రానికి అనేక విధాలసేవ చేసిన వారిలో సి.ఎం. బౌరా(C. M. Bowre) గమరి( Francis B Gummere ) ఎడ్వర్డ్‌లీచ్ (Mac Edward Leach)డార్సన్ (Richard M. Dorson)అలన్‌డండెస్(Alan Dundes)మరండా(pierre Maranda ) టేలర్ Aicher Tailor, క్రాప్పె A H krappe మున్నగువారు పేర్కొనదగినవారు.

తెలుగుదేశంలో జ్ఞానపద విజ్ఞానాన్ని గూర్చిన కృషి శాస్త్రీయపద్ధతుల్లో ఇటీవలే ప్రారంభమయినా, ఈ విజ్ఞానాన్ని గూర్చిన ఆసక్తి విద్వాంసుల్లో 19 వ శతాబ్దినుంచే వుంది. ఈ సందర్భంలో మొట్టమొదట పేర్కొనదగినవాడు కల్నల్ కాలిన్ మెకంజి (1754-1821) 18 వ శతాబ్ది చివరి భాగం నుంచి మెకంజి కావలి వెంకటబొర్రయ్య సహాయంతో పురావస్తుపరిశోధనను, చారిత్రకపరిశోధనను చేపట్టాడు. మదరాసులో సర్వేయర్ జనరల్‌గా నియమింపబడిన మెకంజీగ్రామ గ్రామాలను గురించి సేకరించిన సమాచారం ఎంతో విలువైనది. జానపదసంస్కృతిని అధ్యయనం చేయాలనుకునే వారికి మెకంజీ సేకరణలు అత్యమూల్య మూలద్రవ్యాలుగా వుపయోగపడతాయి.

తెలుగువారికి చిరస్మరణీయుడైన సి.పి. బ్రౌన్ శిష్టసాహిత్యోద్ధరణకు సేవచేసినట్లే జానపద సాహిత్యానికి కూడా గణనీయమైన సేవచేశాడు. బ్రౌన్ లేఖలతో సహా ఆయన సేకరణలన్నీ 19 వ శతాబ్దినాటి ఆంధ్రుల జీవితంలోని వివిధ ముఖాలను ప్రదర్శిస్తాయి. పల్నాటి వీరచరిత్ర, బొబ్బిలికథ, కుమార రాముని కథమొదలైన అనేక కథాగేయాలను బ్రౌన్ సేకరించాడు. దక్షిణ దేశంలో జానపద గేయాలను సేకరించాలనే బుద్ధిమొదట ఛార్లెస్ ఇ. గోవర్‌కు (charles E. Gover) కలిగింది. 1871 లో ఆయన "Folksongs of

Southern India " అనే గ్రంథాన్ని ప్రచురించారు. అయితే ఆయన సంకలనంలో తెలుగు జానపద గేయాలకు బదులు వేమన పద్యాలున్నాయి.

జానపద గేయాలకు సంబంధించినంతవరకు తెలుగులో జె.ఎ. బోయల్ (J. A. Boyle )ను ఆద్యులుగా చెప్పుకోవచ్చు. ఈయన ఇండియన్ ఆంటిక్వరీలో ఒక చారిత్రక గేయాన్ని కొన్ని శృంగార గేయాలను ప్రచురించాడు. 1874 లో Telugu Ballad Poetry అనే పేరుతో ఒక వ్యాసాన్ని ప్రచురించాడు. 20వ శతాబ్దికి ముందే ఇంకా కొంతమంది జానపదగేయాలను ప్రచురించిన వారున్నారు. 1884 లో జానకి పాటలు, 1893లో కోలాట కీర్తనలు అచ్చయ్యాయి.

1900లోను, 1903లోను నందిరాజు చలపతిరావుగారు స్త్రీల పాటల్ని అచ్చువేశారు. సక్రమమైన పద్ధతిలో ప్రచురితమైన చెప్పుకోతగ్గ గేయసంకలనాలివి. 1905లో కాకినాడవారైన మంగు వెంకట రంగనాథరావుగారు స్త్రీల పాటల్ని అచ్చువేశారు. 1909లో 'చిల్లర పాటలు' ప్రచురింపబడ్డాయి. 1910-20 మధ్య 'అప్పగింతల పాటలు,' 'అడవి గోవింద నామకీర్తనలు,' 'కోలాట కీర్తనలు,' 'శ్రావణ మంగళవారపు' పాటలు మొదలైనవి వెలువడ్డాయి. 20వ శతాబ్దం పూర్వార్థంలో ప్రచురింపబడ్డ మరికొన్ని జానపద గేయ సంపుటాల పేర్లు ఆంధ్రవాఙ్మయ సూచికలో ఇవ్వబడ్డాయి. కన్యకామ్మవారి పాటలు, కోటప్ప గురుకీర్తనలు, పెండ్లి గోవింద నామములు, శ్రావణ మంగళ, శుక్ర వారముల పాటలు, చల్ మోహనరంగ, సిరిసిరిమువ్వ పాటలు మొదలైనవి వీటిలో ఉన్నాయి. 1924 లో తేకుమళ్ళ అచ్యుతరావుగారు ఆంధ్ర పదములు పాటలు అనే చిన్నపుస్తకాన్ని ప్రచురించారు.

20వ శతాబ్ది ఉత్తరార్ధం నుంచి మాత్రమే జానపదగేయాలను గూర్చిన కృషి విమర్శనాత్మకంగా సాగుతున్నది. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, చిలుకూరి నారాయణరావుగారు, మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, అక్కిరాజు ఉమాకాన్తంగారు ఈ సందర్భంలో పేర్కొనదగినవారు.

సురవరం ప్రతాపరెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరిత్ర, ఖండవల్లివారి ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి ఈ సందర్భంలో ప్రత్యేకంగా ఎన్నదగ్గవి. ముఖ్యంగా రెడ్డిగారి సాంఘిక చరిత్రలో జానపద విజ్ఞానానికి సంబంధించిన సమాచారం బోలెడంత దొరుకుతుంది.

జానపద విజ్ఞానాన్ని అసంఖ్యాకంగా సేకరించి తమ జీవితాన్నే దానికి అంకితం చేసినవారు నేదునూరి గంగాధరంగారు. వారి 'మిన్నేరు', 'మున్నీరు', 'సెలయేరు' మొదలైనవి అందరూ కళ్ళకద్దుకోదగ్గవి. సామెతలు, ఆటపాటలు, పండుగలు, వ్రతాలు, కథలు మొదలైన జానపద ప్రక్రియలెన్నో నేదునూరి గంగాధరంగారి సేకరణల్లో ఉన్నాయి. 'కృష్ణశ్రీ' గారు ఎన్నో గేయాలను సేకరించారు, వ్యాసాలను రాశారు. శ్రీహరి ఆదిశేషువుగారు 1954లో రాసిన 'జానపదగేయ వాఙ్మయ పరిచయము' తెలుగుభాషా సమితివారి బహుమతి నందుకున్నది.

జానపద విజ్ఞానంలో కృషిసల్పిన విద్వాంసుల్లో డా. బి. రామరాజు గారిని ప్రత్యేకంగా చెప్పుకోవాలి. తెలంగాణా ప్రాంతానికి చెందిన వేలకొలది గేయాలను సేకరించడమే కాకుండా ఆయన 'తెలుగు జానపదగేయ సాహిత్యము'ను గూర్చి పరిశోధనచేసి పిహెచ్.డి. పట్టం పొందారు. ('Folklore of Andhra Pradesh; 'Folktales of Andhra Pradesh' మొదలైన గ్రంథాలను, పెక్కు వ్యాసాలను ఆయన ప్రచురించారు. డా. టి. దోణప్ప గారు రాయలసీమ జానపద విజ్ఞానాన్ని సేకరించి వివిధ పత్రికలలో విలువైన వ్యాసాలను రాశారు. అపూర్వమైన ఎన్నో జానపద ప్రక్రియలను వెలుగులోకి తెచ్చారు.

ఆంధ్రదేశంలోని వివిధ విశ్వవిద్యాలయాలలో జానపద సాహిత్యాన్ని గూర్చిన పరిశోధన జరగడం, జరుగుతుండడం ప్రశంసార్హం. డా. యస్వీ జోగారావు గారు యక్షగానాలను గురించి పరిశోధన జరిపి ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి పిహెచ్ డి. పట్టాన్ని పొందారు. జానపద గేయాలను మానవ శాస్త్రదృష్టితో పరిశీలించిన వారు డా. నాయని కృష్ణకుమారి. తెలుగులో వీర గాథలను క్షుణ్ణంగా పరిశోధించి బృహద్గ్రంథాన్ని వ్రాసి పిహెచ్.డి. పొందిన వారు డా॰ తంగిరాల వెంకటసుబ్బారావు. డా. బి. రామరాజుగారి అధ్వర్యంలో

యెలంద రఘుమారెడ్డిగారు జానపదగేయములు. - సాంఘిక చరిత్ర అనే పరి శోధనకు పిహెచ్. డి. పొందారు ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి శ్రీ జి. లింగారెడ్డి, శ్రీమతి నాయని కొటీశ్వరి, శ్రీమతి కె. సుమతి మున్నగు వారు జానపద విజ్ఞానక్షేత్రములో కృషిచేసి పరిశోధన పట్టాలను పొందారు.

ఆంధ్రేతర ప్రాంతాలలోని విశ్వవిద్యాలయాలలో కూడా తెలుగు జానపద విజ్ఞానం గురించి పరిశోధన జరిగింది. మదరాసు విశ్వవిద్యాలయంనుంచి వింజమూరి సీతాదేవి గారు జానపద సంగీతాన్ని గూర్చిన పరిశోధనకు ఎం. లిట్. పట్టాన్ని పొందారు. ప్రకృత గ్రంథరచయిత మైసూరు విశ్వవిద్యాలయంనుంచి 'తెలుగు—కన్నడ జానపద గేయాల'కు గాను పిహెచ్.డి. పట్టం పొందాడు. తెలుగు జానపద విజ్ఞాన క్షేత్రంలో తులనాత్మక పరిశోధనల్లో ఇది మొదటిది. 1973లో పిహెచ్.డి. పట్టం పొందిన ఈ గ్రంథం మైసూరు విశ్వవిద్యాలయంలో జానపద విజ్ఞాన క్షేత్రంలో వెలువడిన మొదటి పరిశోధన గ్రంథం కూడా. ప్రస్తుత రచయిత జానపద సాహిత్య స్వరూపం', 'జనపద సాహిత్యద మూల తత్వగళు' (కన్నడం), జానపద విజ్ఞాన స్వరూపం (కన్నడంనుంచి అనూదితం), ఆలిచిప్పలు — ఆణిముత్యాలు (ఇతరులతో) మొదలైన గ్రంథాలను కూడా ప్రచురించాడు. బెంగుళూరు విశ్వవిద్యాలయం నుంచి డా. జి. ఎస్. మోహన్ అనంతపురం జిల్లా స్త్రీల పాటలకుగాను పిహెచ్. డి. పట్టాన్ని పొందారు. తెలుగు—కన్నడ సామెతల గ్రంథాన్ని కూడా ఈయన ప్రచురించారు. శ్రీ జి. అశ్వత్థనారాయణ 'తెలుగు-బ్రజ భాషలలోని జానపద కృష్ణగాథల'ను గూర్చి పరిశోధన చేస్తున్నారు.

జానపద విజ్ఞానానికి సంబంధించిన కొన్ని విలువైన గ్రంథాలను ప్రచురించి కొన్ని సాహిత్య, సాంస్కృతిక సంస్థలు, వ్యక్తులు చేసిన సేవ గమనించ దగ్గది. ఎన్. వి. గోపాల్ అండ్ కో. వంటివారు గుజిలీ ప్రతులలో అయినా జానపద సాహిత్యాన్ని ప్రచురించి ఎంతోసేవ చేశారు. 'త్రివేణి' పేరుతో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీవారు ప్రచురించిన గేయసంకలనం చాలా విశిష్టమైనది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు అనేక వృత్తి పదకోశాలను, మాండలిక పదకోశాన్ని ప్రచురించి జానపదుల భాషను నిఘంటువుల కెక్కించి భద్రపరిచారు. జానపద గేయాలు. సాంఘిక చరిత్ర, కాటమ

రాజు కథలు వీరు ప్రచురించారు. ఎల్లోరాగారి 'సరాగాలు', చింతాదీక్షితులుగారి 'జానపద వాఙ్మయము', డా. టి. దొణప్పగారి 'జానపద కళాసంపద' మొదలైనవి పేర్కొనదగ్గవి. ఇటీవల వెలువడిన జి. లింగారెడ్డిగారి 'కరీంనగర్ జానపద గేయాలు' ప్రాదేశిక సంకలనాల పరంపరకు నాంది అయింది.

ఇటీవలి కాలంలో ఆంధ్రదేశంలో కూడా జానపద విజ్ఞానంపై ఆసక్తి పెరిగింది. ముఖ్యంగా ఉస్మానియా విశ్వవిద్యాలయంలో జానపద సాహిత్య బోధన, పరిశోధన ఉత్సాహపూరితంగా సాగుతున్నది. ఇంకా అనేక విశ్వవిద్యాలయాలలో జానపద విజ్ఞానం అధ్యయన విషయమయింది. శాస్త్రీయమైన అధ్యయనానికి ఇవన్నీ దోహదం చేయగలవని ఆశించవచ్చు.

టిప్పణి :

1. ' Folklore is an echo of the past, but at the same time it is also the vigorous voice of the present'', *Folklore and Folk life*, Introduction, Richard M. Dorson (Ed.), 1972, p. 17.

2. ''If modern folklorists accepted the nine-teenth century definition of folk as illiterate, rural, backward peasant then it might well be that the study of the love of such folk might be a strictly salvage operation and that the discipline of folkloristics would in time follow the folk itself into oblivion......But if we look at the question ''who are the folk?'' in a new light, we shall see that the folk are not dying out, and that there are folk cultures alive and well in the United States, Canada and Europe; and that new folk cultures are bound to arise,'' *Essays in Folkloristics*, Alan Dundes, 1978, p.6.

3. ''The term 'folk' can refer to *any group of people whatsoever who share* at least one common factor. It does not matter what the linking factor is-it could be a common occupation, language or religion-but what is important is

that a group formed for whatever reason will have some traditions which it calls its own. In theory a group must consist of at least two persons, but generally most groups consist of many individuals. A member of the group may not know all other members, but he will probably know the common core of traditions belonging to the group, traditions which help the group to have a sense of group identity," *The study oj Folklore,* Alan Dundes (Ed ), 1965, p.2.

4 Jan Harold Brunvand. *The study of American Folklore,* New york 1968. As quoted by Edson Richmond, in his review of the above book in Journal of American Folklore, 82 : 323, 1969, p.81. పై ఉల్లేఖనాన్ని డా. పి. ఆర్. సుబ్రమణియన్ రాసిన 'An Introduction to the study of Indian Folklore'. 1972. p.47 నుంచి తీసుకోవడం జరిగింది.

5. *Standard Dictionary of folklore, Mythology, and Legend* Maria Leach (ed.), 1975, pp. 1138-1147.

6. "If a myth does come from ritual, where then does the ritual come from ? Ritualists delight in tracing folkloristic items back to ritual, but they usually have little if anything to say about the origin of the ritual" *The study of Folklore,* Alan Dunder, 1965, p.53.



# ఆంధ్రులు

ఆంధ్ర జానపదులు (Andhra Folk) ఒక ప్రత్యేక సంస్కృతి, సంప్రదాయాలు కలవారు. వారికి విశిష్టమైన జానపద విజ్ఞానం వుంది. ఆంధ్ర, తెలుగు అనే రెండు పదాలు నేడు ఎక్కువగా వాడుకలో వున్నాయి. ఈ రెండింటిలో ఆంధ్ర శబ్దం జాతిపరంగా, భాషాపరంగా, దేశపరంగా అనేక శతాబ్దాలనుంచి వాడుకలో వుంది. ఆంధ్ర శబ్దంకంటె అర్వాచీనమైనది తెలుగు. ఆంధ్రులు-తెలుగువారు ఒక్కరు కాదని, వేరువేరు జాతులని ఈ రెండు జాతులు నేడు ఒకటై ఇప్పటి తెలుగువారు ఏర్పడ్డారని కొందరు విద్వాంసులు చెప్తారు.

ఆంధ్రులు అత్యధిక సంఖ్యలో నివసిస్తూ ప్రాచీన కాలంనుంచి ఆంధ్ర భూమిగా పేరుపొందిన ప్రదేశం ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌గా అవతరించింది. ఆంధ్రప్రదేశ్‌లో నేడు తెలుగు మాట్లాడే ప్రజలే అత్యధిక సంఖ్యాకులు, అయితే దేశ విదేశాలలో వుండే ఆంధ్రులు సుమారు ఒకటిన్నర కోటికి పైగా సంఖ్యను కలిగి వున్నారు. ఒకప్పుడు ముక్కోటి ఆంధ్రులనే వారం ; తర్వాత ఐదుకోట్ల ఆంధ్రులయ్యారు ; ఇప్పుడు ఆంధ్రుల సంఖ్య ఆరు కోట్లయింది.

ఆంధ్రుల ప్రస్తుత నివాసం ఆంధ్రప్రదేశమయినా ఒకప్పుడు వారు ఉత్తర పారశీకంలోని అంక్షునదీ తీరంలో నివసించేవారని కొన్ని పురాణాలుచెప్తాయి. ఆంధ్రులు గంగానదీ తీరంలో వుండేవారని కూడా కొన్ని గ్రంథాలు చెప్తున్నాయి. ఐతరేయ బ్రాహ్మణకాలానికి వింధ్య ప్రాంతంలో వుండిన ఆంధ్రులు తర్వాత నేటి ఆంధ్రదేశాన్ని తమ నివాస స్థానంగా చేసుకున్నారు.

ఆంధ్రులు ఎక్కడినుంచో ఇప్పటి ఆంధ్రప్రదేశ్ ప్రాంతానికి వచ్చినట్లే ఇక్కడి ఆంధ్రులు అనేక ప్రాంతాలకు వలస వెళ్ళారు. ఇలా వలస వెళ్ళిన ఆంధ్రులు ప్రవాసాంధ్రులు. అలాకాక తరతరాలనుంచి వివిధ రాష్ట్రేతర ప్రదేశాలలోనే నివసిస్తున్న రాష్ట్రేతరాంధ్రుల సంఖ్య గణనీయంగా

వుంది. ఆంధ్రప్రదేశ్‌కు పశ్చిమంగా కర్నాటకంలో నేడున్న జిల్లాలలో అచ్చ మైన తెలుగువారు లక్షల మంది నివసిస్తున్నారు. కోలారు జిల్లా నేటికీ తెలుగు ప్రాంతమే. బళ్ళారి జిల్లాలో ఇంకా తెలుగు పలుకులు వినబడుతూనేవుంటాయి. బెంగుళూరు, తుంకూరు, చిత్రదుర్గ. రాయచూరు, మొదలైన జిల్లాలలో కూడా తెలుగువారు చాలామంది ఉన్నారు. తమిళనాడులో మద్రాసు మహానగరం తెలుగు వారికే చెందవలసిందని చేసిన వాదన ఫలితాన్నివ్వలేదు. నేటికీ మద్రాసులోని అనేక ప్రాంతాలలో తెలుగువారి ప్రాబల్యం అలాగే వుంది. ధర్మపురి జిల్లాలోని హోసూరు మున్నగు ప్రాంతాలు తెలుగునాట చేరదగినవి. ఒరిస్సాలో తెలుగువారే అధికంగా వుండే ప్రాంతాలు కొన్ని చేరి పోయాయి. కేవలం తమిళనాడు, కర్నాటక రాష్ట్రాలలో కోటిమంది తెలుగు వారున్నారు. బొంబాయి ప్రాంతానికి అనేక తరాల ముందే తెలుగు వారనేకులు తరలివెళ్ళారు. భారీ పరిశ్రమల్లో, వివిధ కర్మాగారాలలో పనిచేసేందుకు, కూలినాలి చేసు కొనేందుకు తెలుగువారు చాలామంది తరలి వెళ్ళారు. కర్నాటక రాష్ట్రంలోని వివిధ పరిశ్రమల్లో, ప్రణాళికల్లో తెలుగువారి సంఖ్య గమనార్హమైనది. జంషెడ్‌పూర్, టాటానగర్, ఖర్గపూర్ మొదలైన చోట్ల ఆంధ్రులనేకులు ఉద్యోగరీత్యా స్థిరపడి వున్నారు.

ఇక దేశాంతరాలకు వెళ్ళిన ఆంధ్రులు లక్షల సంఖ్యలో వున్నారు. బర్మాకు, దక్షిణాఫ్రికాకు, మారిషస్‌కు, మలేసియాకు తరతరాల క్రిందటే ఆంధ్రులు వలస వెళ్ళారు. రంగూన్‌ను గురించిన జానపదగేయాలే వున్నాయి. వివిధదేశాల సంస్కృతులమీద ఆంధ్రదేశ సంస్కృతి, ఆంధ్రప్రజల సంప్ర దాయాల ప్రభావాన్ని గురించి లోతైన పరిశోధన జరగవలసి వుంది.

ఈ విధంగా ఆంధ్రప్రదేశ్‌లోనే కాక ఇంకా అనేక రాష్ట్రేతర, దేశాం తర ప్రదేశాలలోను వుండే ఆంధ్రులు ఎవరు? వారి సంస్కృతి ఎటువంటిది? వారి జానపద విజ్ఞానంలోని ప్రత్యేక అంశాలేమిటి? ఇలాంటి విషయాలను పరిశీలించ వలసి వుంది. ఆంధ్రులు—తెలుగు వారు మొదట వేరువేరు జాతు లుగా వుండి తర్వాత ఒక్కటైనారని కొందరు విద్వాంసులంటారు. ఆంధ్రులు ఔత్తరాహులని, తెలుగువారు నేటి తెలుగుదేశంలోని ప్రదేశాలలోనే చరిత్ర పూర్వయుగాల నుండి వున్నారని మరికొందరి అభిప్రాయం.

ఆంధ్రులను గురించిన ఉల్లేఖనం మనకు తెలిసినంత వరకు మొట్ట మొదట ఐతరేయ బ్రాహ్మణంలో కనిపిస్తుంది. శునశ్శేపుని కథలో ఆంధ్రులనార్యులని పుండ్ర, శబర, పుళింద, మూతిబాది దస్యులలో చేరినవారని సూచన వుంది.[1] ఐతరేయ బ్రాహ్మణంలోని ఈ ఉల్లేఖాన్ని బట్టి క్రీ. పూ. 600 ప్రాంతంలో ఆంధ్రులు వింధ్య ప్రాంత దేశంలో నివసించే వారని వూహించవచ్చు. ఆంధ్ర శబరాదులు "ఆర్యావర్తానికి సరిహద్దు ప్రాంతాల్లో ఆనాడు నివసిస్తున్న ద్రావిడులో ముండా ప్రజలో అయివుండవచ్చు భారత దేశానికి ఆర్యులు ఆగంతకులనీ, ముండా ప్రజలూ, ద్రావిడులూ వారికి పూర్వముండిన ఆదిమవాసులనీ చరిత్రకారుల నిర్ణయం. కాబట్టి ఆంధ్రులు అనార్యులైన ద్రావిడులలో ఒక తెగవారని అభిప్రాయ పడవచ్చు"నని జి. ఎన్ రెడ్డిగారు రాశారు (భ. కృష్ణమూర్తి 1974 : 1). ఆంధ్రులు ద్రావిడులనడమూ తప్పే, ఆర్యులనడమూ తప్పే అనే విద్వాంసులూ వున్నారు. పైవాదాలలో ఏదీ సత్యంకాదని, ప్రపంచంలో ఎక్కడా ఆ మాటకొస్తే స్వచ్ఛమైనజాతి అంటూ ఏదీ లేదని ప్రసిద్ధ చరిత్ర కారులైన నేలటూరి వారన్నమాట ఒప్పుకోదగిందే (నేలటూరి వెంకట రమణయ్య 1969 : 29). ఆయన అభిప్రాయం ప్రకారం ఆంధ్రజాతి మిశ్రజాతిగా వెలువడడం ఇలా జరిగింది. "మాటవరుసకు ఆంధ్ర జాతి యాద్యమున స్వచ్ఛమైనదని యొప్పుకొందము. వీరొత్తరాపథికులు. అంజనదీ తీరము నుండి కాక పోయినను గంగా తటము నుండియో, వింద్యాద్రిసాను దేశముల నుండియో ఇప్పటి తెనుగు భూమికి వలస వచ్చి స్థిర నివాసము నేర్పఱచుకొనిరని యింతకు పూర్వము చెప్పియున్నాడను. ఆంధ్రులు వలస వచ్చినప్పుడు తెనుగు దేశము నిర్మానుష్యమైన కాడుకాదు. రామాయణకాలమప్పటికే గోదావరీ తటమునకు జనస్థానమని పేరు వచ్చినది. ఇచ్చట యాదిమ జనులు శాంతులు. కోయలను నాటవిక జనులని శాస్త్రజ్ఞుల యభిప్రాయము. పిమ్మట దేశమును ద్రావిడు లాక్రమించుకొనిరి. తరువాత నాంధ్రు లేతెంచిరి. ఈ మూడుజాతులు సంయోగము వలన స్వచ్ఛమైన యాంధ్రజాతి మిశ్ర జాతిగ మారినది. ఆంధ్రద్రావిడ సంయోగము వలన గొన్ని మార్పులు గలిగినవి" (నేలటూరి వెంకట రమణయ్య 1969 : 28-29). మనుస్మృతిలో కారావర స్త్రీకి, వైదేహునకు జన్మించిన నిషాదులే ఆంధ్రులని చెప్పడాన్నిబట్టి[2] చూస్తే ఆంధ్రులు మిశ్రజాతి అనే విషయం స్పష్టమవుతుంది.

సంస్కృత వాఙ్మయంలో అక్కడక్కడ అంధక, ఆంధ్రక జాతులనుగూర్చిన ఉల్లేఖనాలున్నాయి. ఈ నాటికీ బీరారు ప్రాంతంలో అంధలనే తెగవారున్నారు. మొత్తం మీద మొదట ఔత్తరాహులుగా వుండిన ఆంధ్రులు క్రమేణ ఈనాటి తెలుగు దేశానికి వచ్చి ఇక్కడి ద్రావిడులతో, బహుశా వారిలో భాగమైన తెలుగు వారితో కలిసిపోయి ఈనాటి ఆంధ్రు య్యారని ఊహించవచ్చు.

ఆంధ్రులనుగూర్చి వివిధ గ్రంథాలలో ఉండే ఉల్లేఖనాలు కేవలం పుక్కిటిపురాణాలు కావు. వాటిలో ఒక క్రమం కనిపిస్తుంది. ఐతరేయ బ్రాహ్మణకాలానికి అడవుల్లో తిరుగుతుండిన ఆంధ్రులు చంద్రగుప్తమౌర్యుని కాలానికి మౌర్యుల తర్వాత ఎదిగిన చతురంగ బలం సంపాదించారని మెగస్తనీసు వ్రాతలవల్ల తెలుస్తున్నది. అశోకుని 13వ ధర్మలిపి శాసనంలో ఆంధ్రులు అతనిసామ్రాజ్యంలో వారని చెప్పబడింది. మయసభలో ధర్మరాజును కొలిచిన రాజులలో ఆంధ్రరాజులుకూడా వున్నారని మహాభారతం చెప్తుంది. వాయు పురాణంలో ఆంధ్ర భృత్యులపేర్లు పరిపాలనా కాలం వివరింపబడి వున్నాయి. శాతవాహనులే ఈ ఆంధ్రభృత్యులు. వీరి పరిపాలనా కాలం క్రీ. పూ. 230 నుంచి క్రీ. శ 225.

శాతవాహనుల కాలంనుంచి ఆంధ్రులకు సంబంధించిన చారిత్రక దశ ప్రారంభమవుతుంది. నాలుగువందల సంవత్సరాల పాటు పరిపాలన సాగించిన శాతవాహనులు మొదటి రాజధాని ఔరంగాబాద్‌లోని ప్రతిష్ఠానపురం, నేటి పైఠాన్. ఆనాడు ప్రాకృతం అధికార భాష. అయితే దేశభాష వేరుగా ఉండేది. అది తెలుగే అని చెప్పడానికి తగిన ఆధారాలున్నాయి. శాతవాహన కాలానికి చెందిన గుణాఢ్యుడు శర్వవర్మతో కలిగిన వివాదంలో తాను ఓడిపోతే సంస్కృతాన్ని, ప్రాకృతాన్ని, దేశభాషను మాట్లాడనని ప్రతిజ్ఞ పూనాడు. అప్పటి దేశ భాష ఆంధ్రభాషే అయివుండవచ్చు. ఎందుకంటే అప్పటికి ఈ సంభాషణ జరిగిన పైఠాన్‌లో మరాఠీభాష లేదు. భరతుని కాలానికే (క్రీ.శ. ప్రారంభ కాలం) బర్బర, కిరాత, ఆంధ్ర, ద్రమిలాది భాషలు సంస్కృత ప్రాకృతాల కంటె వేరైనవనే విషయం గుర్తింపుకు వచ్చిందని నాట్యశాస్త్రంలోని ఒక ఉల్లేఖనం చెప్తున్నది. గాథాసప్తశతిలోని తెలుగు పదాలు కూడా ఆనాటికే ఆంధ్రభాష ఉందని నిరూపిస్తున్నాయి. శాతవాహనులు ఆంధ్రభాషను మాట్లాడే

వారో లేదో తెలియదు. అసలు వారు ఆంధ్రులో, ఆంధ్రుల భృత్యులో తెలియదు. ఏది ఏమైనా గాథాసప్తశతి కాలానికే ఆంధ్రభాష ఒకటి వేరుగా ఉండేదని మాత్రం చెప్పడానికి అవకాశం ఉంది.

గాథాసప్తశతి ఆంధ్రులను గురించి తెలుసుకోడానికి ఒక ఆకర గ్రంథం అంటే తప్పులేదు. ఆకాలానికి ఆంధ్ర పథంలో వ్యావసాయిక నాగరికత ప్రవేశించింది. విస్తారంగా గ్రామసీమలు ఏర్పడ్డాయి. ఇలా గ్రామసీమలు ఏర్పడడం వ్యావసాయిక నాగరికతకు పునాది. శాతవాహనుల కాలానికి గ్రామసీమల్లో ఉత్పత్తి శక్తులు స్థిరపడ్డాయి. అశోకుని కాలంలో మతాధికారం బ్రాహ్మణులది. శాతవాహనుల కాలానికి నిమ్న వర్గాలకు కూడా కొంత ప్రాధాన్యం వచ్చింది. వేర్వేరు వృత్తులు, కులాలు ఏర్పడ్డాయి. గాథాసప్తశతి కాలంలో ప్రత్తిపంట విస్తారంగా ఉండేది. రాగులు, కొఱ్ఱలు, సజ్జలు ప్రధానమైన ఆహార ధాన్యాలుగా ఉండేవి.

ఇంతకు ముందే చెప్పినట్టుగా ఈనాటి తెలుగువారు ఆర్యులని గాని అనార్యులనిగాని చెప్పడానికి వీలులేదు. ఆర్యద్రావిడుల మిశ్రణం శాతవాహన యుగంలోను అంతకుముందు కూడా జరిగింది. నాగులు, యక్షులు, తెలుగువారు ద్రావిడ తెగలకు చెందినవారు. ఆర్యులు మధ్యధరా ఉపజాతికి చెందినవారు. ద్రావిడులు మంగోలియన్ జాతికి చెందినవారు. ఆంధ్రదేశంలోని చెంచులు, కోయలు మున్నగువారు ఆస్ట్రిలాయిడ్ ఉపజాతికి చెందినవారు. వీరిలో అనేకులు వ్యవసాయాన్ని ప్రధాన వృత్తిగా చేపట్టారు. అందువల్ల వీరి కలయిక అనివార్యం అయింది.

ఆంధ్రులలో ఆజానుబాహువులున్నారు, వామనాకారులున్నారు, పసిమిచాయవారున్నారు, నల్లనయ్యలున్నారు. వీరు ఏ జాతికి చెందిన వారన్నది తెలుసుకోవాలంటే కొన్ని ఆచారాలు,సంప్రదాయాలుకూడా దోహదం చేస్తాయి. బ్రాహ్మణుల వివాహాది ఆచారాలలో ఆర్యపద్ధతులు చోటు చేసుకుని ఉన్నాయి. బ్రాహ్మణేతరులలో అనార్య సంప్రదాయా లనేకం కనిపిస్తాయి. అంత మాత్రం చేత బ్రాహ్మణులందరూ ఆర్యులని, బ్రాహ్మణేతరు లందరూ అనార్యులనీ చెప్పడానికి వీలులేదు, అసలు ఈ ఆచారాలు సంప్రదాయాలు మొదలైనవి సంస్కృతికి సంబంధించినవి ; వంశ పారం పర్యంగా వచ్చేవి

కావు. వంశానుగతంగా సంక్రమించే దైహిక లక్షణాలను పరిశీలించి మానవ శాస్త్ర పరమైన తెగ (race)ను నిర్ణయించ వలసివుంటుంది.

మామూలుగా ఆంధ్రదేశంలోని ప్రజలు మధ్యధరా అరణ్య ఉపతెగకు చెందిన వారని చెప్పవచ్చు. అయితే ప్రదేశాలలో, కొండల్లో కోనల్లో నివసించే కొంతమంది ఆస్ట్రిలాయిడ్ ఉపతెగకు చెందినవారు కూడా ఉన్నారు. కొన్ని మంగోలాయిడ్ తెగకు చెందిన జాతులు కూడా ఆంధ్రదేశంలో కనిపిస్తాయి.

ఆంధ్రప్రదేశ్

నేడు ఆంధ్రులనగానే ఆంధ్రప్రదేశ్ గుర్తు వస్తుంది. ఆంధ్రభాష, ఆంధ్రప్రదేశ్, ఆంధ్రప్రజలనే వాటిలోని 'ఆంధ్ర' పదం సమానార్థకంగా భాషను, దేశాన్ని, జాతిని నిర్దేశిస్తున్నది. సమానార్థకమని ఎందుకంటున్నానంటే ఆంధ్రజాతిదే ఆంధ్రభాష; ఇదే అర్థంలో తెలుగుజాతి, తెలుగు భాష, తెలుగుదేశం అనికూడా చెప్పవచ్చు. ఆంధ్ర—తెలుగు ఈనాడు ఒకే అర్థంలో ప్రయోగింపబడుతున్నాయి. అయితే కొన్ని ప్రాంతాలలో ఈ రెండింటి వ్యవహారంలో కొంత భేదం కనిపిస్తుంది. ఉదాహరణకు కన్నడ దేశంలో ఎవరైనా 'ఆంధ్ర' అనే పదాన్ని ఉపయోగిస్తే దాన్ని ఆంధ్రదేశానికి చెందినవారు అనే అర్థంలోనే ఉపయోగిస్తారు. 'తెలుగువారు' అంటే తెలుగు మాట్లాడే వారందరూ—అంటే కన్నడదేశంలో నివసిస్తూ తెలుగు మాట్లాడేవారు కూడా—అని అర్థం. 'తెలుగు' అన్నది భాషకు, 'ఆంధ్ర' అన్నది దేశానికి అధికారికంగా వాడుకలో ఉండడం వల్ల ఈ విధంగా అర్థం చేసుకోవడం తటస్థించింది.

ఆంధ్ర పథం (అంధాపథమ్) అనే పేరు ఆంధ్రులు నివసించే ప్రాంతానికి సుమారు 15—16 శతాబ్దాలనుంచే వాడుకలో ఉన్నట్లు కొన్ని శాసనాల వల్ల తెలుస్తున్నది. రామాయణ కాలంలో నేటి ఆంధ్రప్రదేశ్ ప్రాంతం దండకారణ్యంచేత ఆవరింపబడి ఉండేది. జనస్థానంకూడా ఆంధ్రదేశంలోని భాగమేనంటారు. బౌద్ధయుగంలో ఈనాటి ఆంధ్రదేశంలోని భాగాలను వజ్రదేశమని, నాగభూమి అని, మంజీర దేశమని పిలిచేవారు

త్రిలింగ దేశమనే పేరుకూడా తెలుగుదేశానికి ఒక పేరని కొన్ని ఉల్లేఖనాలు చెప్తున్నాయి. ప్రతాపరుద్రీయం లోని నాటక ప్రకరణంలో ఒక శ్లోకం ప్రకారం శ్రీశైల కాళేశ్వర ద్రాక్షారామాలలోని త్రిలింగాల వల్లనే త్రిలింగ మనే పేరు వచ్చింది. తెలుగు అనే రూపమే త్రిలింగగా సంస్కృతీకరింప బడిందని భాషాశాస్త్ర వేత్తలలో అనేకులు భావిస్తున్నారు. గుణగవిజయాదిత్యుని సాతలూరు శాసనం మొదలైన చోట్ల త్రికళింగ శబ్దం వుంది. ఇదే 'తెలుగు' శబ్దానికి మూలమని మరికొందరంటారు. గోదావరి తూర్పుతీరం నుంచి మహానది వరకు కళింగ దేశమనే వ్యవహారం వుండేది. కళింగ దేశంనుంచి వెళ్ళిన వారు కనుకనే మలేసియాలో తెలుగువారికి క్లింగు లనే పేరు వచ్చింది.

ఆనాడు ఆంధ్రపథంగా త్రిలింగదేశంగా, కళింగదేశంగా, వేగి దేశంగా, వెలనాడు, పాకనాడు, పల్నాడులుగా ఉండి తర్వాత ఆంధ్రరాష్ట్రంగా అవతరించి చివరికి ఎందరో మహానుభావుల తపోఫలంగా 1956 నవంబరు ఒకటవ తేదీన ఆంధ్రప్రదేశ్ నామంతో విశాలాంధ్ర అవతరించింది. ఒకప్పుడు, దక్షిణాపథానికి చెందినవాడనే అర్థంలో తెనుగువారనే పేరున ద్రావిడులుండేవారు. ఆ తెనుగులే తెలగలు వారిదే తెలంగాణము. బ్రాహ్మణులలో కూడా తెలగాణ్య లౌకశాఖ. వింధ్యప్రాంతాలనుంచి ఆంధ్రులు కూడా దక్షిణా పథానికి వచ్చి ఆంధ్రపథాన్ని ఏర్పరచుకున్నారు. ఆంధ్రదేశం, తెలుగుదేశం ఒకటైపోయాయి. నేడు ఆంధ్రులు తెలుగువారు వేరుకాదు. అంతా ఒకటై నేటి ఆంధ్రప్రదేశ్‌లోని ప్రజలుగా మారారు.

నైసర్గిక స్వరూపం : ఆంధ్రప్రదేశ్ $12^{0}14'$ – $19^{0}15'$ ఉత్తర అక్షాంశరేఖల మధ్య. $76^{0}50'$ – $84^{0}45'$ తూర్పు తులాంశరేఖల మధ్య ఉంది. తూర్పుదిక్కున బంగాళాఖాతం, పడమట కర్నాటక రాష్ట్రం, మహా రాష్ట్ర, దక్షిణాన తమిళనాడు, ఉత్తరాన మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలు ఆంధ్రప్రదేశ్‌కు ఎల్లలుగా ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్‌కు ఐదు రాష్ట్రాలు పరిహద్దుల్లో ఉండటం వల్ల అనేక సంస్కృతులకు కూడలిగా ఆంధ్ర దేశం రూపొందింది. అంతేకాక ఉత్తర, దక్షిణ భారతాలకు ఆంధ్రప్రదేశ్ సేతువులాగా ఉంది. వేషభాషలలో, సంస్కృతిలో, దేహరచనలో అన్ని

విషయాలలోను ఆంధ్రప్రదేశ్‌లోని ప్రజలు ఉత్తర భారతానికి దక్షిణ భారతానికి వారధిగా నిలిచి ఉన్నారు. ఆంధ్రప్రదేశ్‌కు 965 కి.మీ. పొడవుగల సముద్ర తీరం ఉండడం మరో వైశిష్ట్యం.

ఆంధ్రప్రదేశ్ మనదేశంలో వైశాల్యంలో ఐదవ స్థానాన్ని ఆక్రమిస్తున్నది. జనాభారీత్యా కూడా ఆంధ్రప్రదేశ్‌ది ఐదవస్థానమే. చారిత్రకంగా ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణ, కోస్తా, రాయలసీమ అనే మూడు ప్రాంతాలేర్పడ్డాయి.

ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ అనే భూభాగంగా ఉన్న ప్రదేశంలో లక్ష సంవత్సరాల క్రిందటే మానవుడు జీవించేవాడు. ఆనాడు అతను ఉపయోగించిన రాతి పనిముట్లు ఈ ప్రదేశంలో దొరికాయి. కొండలమీద ప్రవేశించే వాగులవద్ద ఎన్నో రకాల పనిముట్లు లభించాయి. కొన్నివేల సంవత్సరాల ముందు మానవుడు జంతువుల్ని వేటాడేందుకు విల్లంబుల్ని ఉపయోగించేవాడు. ఇప్పటికీ ఆంధ్రప్రదేశ్‌లోని ఏజన్సీప్రాంతాల్లో కోయలు, గోండ్లు మొదలైనవారు విల్లంబుల్ని ప్రయోగించడం చారిత్రకంగా వారికి లభించిందే అని చెప్పవచ్చు. ఆంధ్రదేశంలో నేటికీ కొందరు అనాది (యానాది) జాతులవారు నివసిస్తున్నారు. ఈనాడు వీరు తెలుగు మాట్లాడుతూ ఉన్నా తెలుగు భాష పుట్టిక ముందునుంచే వీరు తెలుగు గడ్డమీద నివసిస్తున్నారని చెప్పవచ్చు. చెంచుల, యానాదుల అలవాట్లను, ఆకారాలను, జీవనవిధానాలను బట్టి పాతరాతియుగం నాటి అవశేషాలు వారిలో కనిపిస్తాయన్నది గమనించవచ్చు. చెంచులకు వేట ప్రధానవృత్తి. యానాదులు ఎలుకలు, ఉడుతలు, పాములు మొ॥ వాటిని పట్టడంలో నిపుణులు.

పాతరాతియుగం నాటి లక్షణాలు కొన్నిటితో బాటు కొత్తరాతియుగానికి చెందిన అనేక లక్షణాలు తెలుగుదేశంలోని కోయలు, సవరలు, గోండ్లు మొదలైనవారిలో కనిపిస్తాయి. అయితే ఈనాడు ఇలాంటి లక్షణాలు దినదినానికి క్రమక్రమంగా కనిపించకుండా పోతున్నాయి. క్రీ.పూ. 2500-900 మధ్య నేటితెలుగుదేశంలో ప్రజలు కొత్తరాతియుగంలో జీవించారు.[3] అప్పటివారిని మన ఆంధ్రులని కాని, తెలుగువారని గాని పిలవడానికి వీలులేదు. ఆకాలంనాటి ప్రజలను గూర్చి కొన్ని విశేషాలను తెలుసుకోడానికి కెయిరనులనబడే పూర్వకాలపు సమాధులు కొంతవరకు ఉపయోగిస్తాయి. ఆశ్చర్యకరంగా ఉండే

ఇలాంటి సమాధుల్ని చూచి జనులు వీటికి రాక్షసగుళ్ళు అని పేరుపెట్టారు. మృతదేహాలను దహనం చేయడం ఆర్యుల ఆచారమని, శవాలను పూడ్చడం ద్రావిడుల ఆచారాన్ని తెలుపుతాయని కొందరు భావిస్తున్నారు. అయితే ఈ విధంగా ఆర్య ద్రావిడ ఆచారాలను ఒక్క సంప్రదాయంతో కొలిచి వేరు చేయ బూనడం సాహసమవుతుంది.

పాతరాతియుగంలో, కొత్తరాతియుగంలో, ఇనుప యుగంలో ఆంధ్ర దేశంలోని ప్రజలు మూలద్రావిడభాషనే మాట్లాడేవారో, తెలుగునే మాట్లాడే వారో, మరే భాషను మాట్లాడేవారో తెలియదు. అయితే నేటి ఆంధ్రప్రదేశ్‌లో నివసించే ఆంధ్రులు, పరరాష్ట్రాలలో, విదేశాలలో నివసించే ఆంధ్రులు మాత్రం ఆర్య, ద్రావిడ, ముండా, గోండు, కోయ, యానాది, చెంచు, నాగ, యక్షాది, అనే జాతుల సమ్మేళనం వల్ల ఏర్పడిన జాతి అనవచ్చు. అదే నేటి ఆంధ్రజాతి లేక తెలుగుజాతి.

## ఆంధ్ర జానపదులు

ఆంధ్రేతర ప్రాంతాలలోని తెలుగువారి విషయం ఎక్కువగా తెలియదు గాని ఆంధ్ర ప్రదేశ్‌లో మొత్తం జనాభాలో గ్రామీణ జనాభాశాతం సుమారు 80 పైగా ఉంది. పట్టణాలలో నివసించే ప్రజలు కేవలం 20 శాతం మాత్రమే. ఇక అత్యంత ప్రాచీన కాలంనుంచి తమ అలవాట్లను, అభిరుచులను, సంప్రదాయాలను కాపాడుకుంటూ వస్తున్న గిరిజనులు ఆంధ్రప్రదేశ్‌లో పదిహేడు లక్షలకు పైగా ఉన్నారు.

ఆంధ్రజానపదుల ప్రధానవృత్తి వ్యవసాయం. మనరాష్ట్రంలోని శ్రామికులలో 32 శాతం వ్యవసాయదారులు, 38 శాతం వ్యవసాయ కార్మికులు. మిగిలినవారు ఇతర శ్రామికులు. 1961 నాటి లెక్కలతో పోలిస్తే మొత్తంమీద వ్యవసాయదారుల శాతం తగ్గుతూ వస్తున్నది. వ్యవసాయ కార్మికుల శాతం హెచ్చుతూవస్తున్నది. వ్యవసాయదారులంతా కాలక్రమేణా తమ భూముల్ని పోగొట్టుకొని చిన్నరైతులుగా, వ్యవసాయ కార్మికులుగా తయారవుతున్నారని దీని వల్ల తెలుస్తుంది. ఆంధ్రప్రదేశ్ మొత్తంమీద వ్యవసాయరంగం పైన పనిచేసేవారు సుమారు 12 శాతం మాత్రమే.

ఆంధ్రజానపదులలో మళ్ళీ అనేక కులాలు, జాతులు ఉన్నాయి. వసుధైక కుటుంబాన్ని గురించి మనమెంతగా ఘోషిస్తున్నా నానాటికీ కులమత భేదాలు హెచ్చుతున్నాయేగాని తగ్గడంలేదు. కులమత వర్గ రహిత సమాజమే పరమాశయమైనా చారిత్రకాధ్యయన దృష్ట్యా ఆంధ్రజానపదులలోని వివిధ జాతులను గురించి వివరించక తప్పడంలేదు. జానపద విజ్ఞానానికి, వివిధ కులమత వర్గాలకు ఒక్కొక్కసారి ప్రత్యక్ష సంబంధం ఉంటుంది. కులాలలో అనేకం వృత్తులనుబట్టి ఏర్పడినవే కాబట్టి ఆయా వృత్తులకు సంబంధించిన విజ్ఞానం వేరువేరుగా ఉంటుంది. అట్లే వివిధ మతాలకు సంబంధించిన నమ్మకాలు, సంప్రదాయాలు వేరువేరుగా ఉంటాయి.

ఆంధ్రప్రదేశ్‌లోని ఆదిమ జాతులగురించి మొదట చెప్పుకోవాలి. ఆంధ్రప్రదేశ్‌లో ఉండే ఆదిమ జాతులందరూ తెలుగు మాట్లాడేవారు కారు. అయినా వీరి సంప్రదాయాలు, నమ్మకాలు, జీవన విధానంవల్ల మన ప్రాచీనులను గురించిన అనేక విషయాలు తెలుస్తాయి బోయలు మున్నగు వారిని గురించి మన ప్రాచీన కావ్యాలలో కూడా ఉల్లేఖనాలు కనిపిస్తాయి. బోయలు వేటగాళ్ళని, ఆటవికులని, క్రూరులని కవులు వర్ణించారు. కరీంనగర్, నల్లగొండ జిల్లాల్లో భోయీలనే జాతి ఉంది. పల్నాటి వీరచరిత్రలో బాలచంద్రునితో దెబ్బలుతిని పారిపోయిన వారిలో కొందరు 'బోయవారము మేము పూర్వంబునందు బుజముల కాయలు పూని కన్గొనుడి' అన్నారు. భోయీలు నిన్న మొన్నటి వరకు పల్లకీలను మోస్తుండేవారు.

బోయలవంటి ఆదివాసులు ఆంధ్రప్రదేశ్‌లో 33 జాతులవారున్నారు. "వీరి పేర్లు చెంచు, కోయ, గోండు, భగత, గదబ, జాతపు, కమ్మర, కట్టునాయక, కొండదొర, కొండకాపు, కొండరెడ్డి, ఖోండు, కోటియ, బెంతొ ఒరియ, కులియ, మాలి, మన్నెదొర, ముఖదొర, పొరజ, రెడ్డిదొర, రోన, సవర, సుగాలి, యానాది, ఎరుకుల, అంధ్, భిల్లు, నాయకపోడ్, కోలం, పర్ధాన్, తోటి, గొండు, నాయక, వాల్మీకి" (వెన్నెలకంటి రాఘవయ్య 1974 : 16–17)

వేలకొద్దీ సంవత్సరాలనుంచి అడవుల్లో, కొండల్లో నివసిస్తున్న గిరిజనుల సంక్షేమంకోసం బ్రిటిషు ఇండియా ప్రభుత్వం శ్రీకాకుళం, విశాఖ

పట్నం, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, వరంగలు, ఖమ్మం, అదిలాబాద్ జిల్లాలలోని అరణ్య ప్రదేశాలకు ఏజన్సీ ప్రాంతాలని పేరు పెట్టింది. నేటికీ ఏజన్సీప్రాంతాలు అట్లే ఉన్నాయి. వారి స్థితి గతుల్లో పెద్ద మార్పేమీ రాలేదు. మార్పంతా కేవలం కాయితాల్లో మాత్రమే కనిపిస్తుంది.

ఆదివాసుల్లో ముఖ్యంగా కొండ, అడవి జాతులు, పల్లపు భూముల వారు, దేశ ద్రిమ్మరులనే మూడు రకాలవారున్నారు ఏజన్సీ ఆదివాసులైన కోయ, కొండరెడ్డి, సవర మొ॥న వారు ఇంకా నాగరికత ముఖం చూడడానికి ఇష్ట పడడం లేదు. పల్లపు ప్రాంతాలకు చెందిన కొందరు ఆదివాసులలాగే కోలాములు, నాయక్ పోయలు, కోయలు ఇప్పుడిప్పుడే సేద్యం చేయడానికి అలవాటు పడుతున్నారు. నల్లమల చెంచులు మాత్రం ఇంకా గడ్డలను తవ్వు కొని తింటూ, వేటాడుతూ, ఆకులు అలములు భుజిస్తూ ఉన్నారు.

ఆంధ్రప్రదేశ్‌లోని జిల్లాలలో గిరిజనుల జనసంఖ్యలో విశాఖ పట్నం జిల్లాకే అగ్రస్థానం. మొత్తం 33 గిరిజన జాతుల్లో ఈ జిల్లాలో 23 జాతుల వారున్నారు. కొండదొరలు, వాల్మీకులు, కమ్మ, కోయలు, మన్నె దొరలు, రెడ్డి దొరలు, ఎరుకలు మొదలైనవారు విశాఖపట్నం జిల్లాలో ఉన్నారు. వీరిలో అనేకులు వ్యవసాయ కూలీలుగా కాలం వెళ్ళబుచ్చుతున్నారు. విశాఖ పట్నం జిల్లాలో సుమారు మూడు లక్షలమంది గిరిజనులుండగా శ్రీకాకుళం జిల్లాలో రెండులక్షల పన్నెండు వేలమంది ఉన్నారు. ఈ జిల్లా గిరిజనుల జనాభాలో రెండవస్థానం ఆక్రమిస్తున్నది. ఈ జిల్లాలో సవరలు, కొండదొరలు, జతపులు ఎరుకలు, మన్నె దొరలు మొదలైన 20 జాతుల వారు శ్రీకాకుళం జిల్లాలో ఉన్నారు. తూర్పుగోదావరి జిల్లాలోని రంపచోడరవం, ఎల్లవరం తాలూకాలలో గిరిజనులు ఎక్కువగా నివసిస్తున్నారు: కొండరెడ్లు, కోయలు, కొండకాపులు మన్నెదొరలు, వాల్మీకులు మొదలైన వారు ఈ జిల్లాలో ఉన్నారు. పశ్చిమగోదావరి జిల్లాలో కోయలు, ఎరుకలు, కొండరెడ్లతో బాటు యానాదులు కూడా ఉన్నారు. కృష్ణాజిల్లాలో చాలాతక్కువమంది గిరిజనులున్నారు. రాష్ట్రంలో ఈ జిల్లా గిరిజనుల జనసంఖ్యలో 12 వ స్థానాన్ని ఆక్రమిస్తున్నది. ముఖ్యంగా ఎరుకలు, సవరలు, యానాదులు ఈ జిల్లాలో ఉన్నారు. గుంటూరు జిల్లాలో చెంచులు, యానాదులు, ఎరుకలు ఎక్కువగా ఉన్నారు. గిరిజనులు ఈ జిల్లాలో

బుట్టలు, తట్టలు, తడికెలు అల్లేవారుగా, వ్యవసాయ కూలీలుగా ఉన్నారు. నెల్లూరు, కర్నూలు, గుంటూరు జిల్లాలలోని కొన్ని తాలూకాలు కలిసి ప్రకాశం జిల్లాగా ఏర్పడ్డాయి. ఈ జిల్లాలో యానాదులు, ఎరుకలు, చెంచులు, సుగాలీలు ఎక్కువగా ఉన్నారు గిరిజన జనాభా ఎక్కువగా ఉండే జిల్లాలలో నెల్లూరు జిల్లా ఒకటి. వీరి జనసంఖ్యలో 5 వ స్థానం ఆక్రమిస్తున్న నెల్లూరు జిల్లాలో 14 తెగల మంది గిరిజనులున్నారు వీరిలో సగం మంది యానాదులే. ఎరుకలు మొదలైన వారు మరికొంతమంది మాత్రం ఉన్నారు. యానాదులు ఎక్కువగా ఇండ్లలో పని పాటలు చేసేవారుగా, వ్యవసాయ కూలీలుగా, పందులు పెంచేవారుగా జీవిస్తున్నారు యానాదులు చిత్తూరు జిల్లాలోకూడా ఉన్నారు. రాష్ట్రంలో కెల్లా అత్యధిక వైశాల్యంలో అడవులున్నది ఖమ్మం జిల్లాలో, భద్రాచలం, నూగూరు ప్రాంతాలతో పాటు జిల్లా తూర్పుభాగమంతా దట్టమైన అడవి ప్రాంతంగా ఉంది. గిరిజనుల్లో ఎక్కువ భాగం కోయలు. వీరే సుమారు రెండు లక్షల మంది ఉన్నారు.

గిరిజనులను వదలి ఇతర కులాలకు వస్తే వాటి చరిత్ర, సంఖ్య, సంప్రదాయాలు మొదలైనవి ప్రత్యేక గ్రంథమంత అవుతాయి. హిందువుల్లో 18 సంఖ్యకు ఎన్నో విధాలుగా ప్రాధాన్యం ఉంది. కులాల సంఖ్య కూడా 18 అని నాగులపాటి శాసనంలో ఉంది (సురవరం ప్రతాపరెడ్డి, తృతీయ ముద్రణం : 53). కోమట్లు, ఈదురవారు, గొల్లవారు, అక్కలవారు, సాలెవారు, మంగలులు, కుమ్మరవారు మొదలైనవారు ఈ 18 కులాల్లో ఉన్నారు. ఇంతకు ముందే చెప్పినట్లు ఈ కులాల్లో చాలావరకు వృత్తుల వల్ల ఏర్పడ్డవి. కొన్ని మతసంబంధమైన కులాలు కూడా ఉన్నాయి. శైవ వైష్ణవుల వల్ల కొత్తకులాలు అనేకం ఏర్పడ్డాయి. లింగాయతులు, బలిజలు, జంగాలు, తంబళ్ళు, శైవ కులాలు, నంబులు, సాత్తానులు, దాసర్లు మొదలైనవారు వైష్ణవకులాలు. వైష్ణవుల్లో సాత్తని, సాత్తిన అని రెండు శాఖలేర్పడ్డాయి. ఇవి శాత్తాద, శాత్తిన అనే అరవ పదాలకు తెనిగింపులు. సాత్తని (సాతాని) వారు జందెము ధరింపని వారు. సాత్తిన వారు జందెము ధరించే వారు. సాత్తని వారిని శ్రీకృష్ణ దేవరాయలిలా వర్ణించాడు (ఆముక్త మాల్యద 4-35) "పొంకపు పట్టెనామములు పొల్పగు మేల్ తిరుచూర్ణరేఖలున్ చంకల తాళికాదళ విసారిత పేటికలన్ భుజంబులన్ సంకును చక్రముల్ గలుగు సాత్తనివారు...."

వర్ణాశ్రమ ధర్మాలను నిలబెట్టడానికి అనేక శతాబ్దాల నుంచి ప్రయత్నాలు జరుగుతూనే ఉన్నాయి. మరొకవైపు కులరహిత సమాజాన్ని గురించిన చిలక పలుకుల్ని వింటూనే ఉన్నాం. తెలుగులో ప్రాచీన కవులలో అత్యధికులు వర్ణాశ్రమాచారాలను నిలబెట్టాలని చూచినవారే. నన్నయ భారతంలో బ్రాహ్మణాధిక్యతను ప్రచారం చేశాడు, అయితే నన్నయకాలానికి వైదిక నియోగిశాఖ లేర్పడలేదు. తర్వాత ఈ రెండుశాఖలతో బాటు ఆరువేల నియోగులని, తెలగాణ్యులని, వెల్నాడని, ములకనాడని సవాలక్ష శాఖ లేర్పడ్డాయి. ఈ జాడ్యం నేటికీ ఇంకా పూర్తిగా వదలలేదు. బ్రాహ్మణుల్లో వేదశాస్త్ర విద్యలు కేంద్రీకృతమై ఉండేవి. షోడశ కర్మలకు, వ్రతాలకు, శుభా శుభాలకు అన్నిటికీ జనపదాల్లో నేటికీ పురోహితుల అవసరం ఉంది. బ్రాహ్మణులు పురాణాలూ చెప్పేవారు. ఆనాడు వేదవేదాంగాల్లో నిష్ణాతులైన విప్రులు రాజులకు మంత్రులుగా, సేనానులుగా, విద్యాధికారులుగా వ్యవహరించే వారు. శిక్షగురువులు, బోధకులు, పురోహితులుగా ఉండిన బ్రాహ్మణుల మీద రెడ్డి రాజులు చూపిన భక్తి అపారమైనది. అందుకే ఆకాలంలో బ్రాహ్మణులు "ధరిఖుంప నేర్చిరి దర్భపెట్టెడు వ్రేళ్ళ లీల మాణిక్యాంగుళీయకములు ...." (భీమేశ్వర పురాణము, ఆ. 1—ప. 41—42)

విజయనగర రాజుల కాలంలో బ్రాహ్మణులు అర్చకులుగా, పౌరోహితులుగా, జ్యోతిర్వేత్తలుగా జీవించారు. వారికి దేవాలయాల్లో, సత్రాల్లో ఉచితంగా భోజనం లభించేది. పెద్దనాది కవిపండితులకు జరుగుతుండిన సన్మానాలు ఆనాడు బ్రాహ్మణులపై ఉండిన గౌరవభావాన్ని తెలుపుతాయి. ఆనాడు బ్రాహ్మణులు మంత్రులుగా, దండనాయకులుగా, మండలాధికారులుగా ఉండేవారు. 'బాపల సేద్యం, వాలి వైద్యం' అని సామెత ఉంది. అయితే కొందరు బ్రాహ్మణులు పెద్ద భూస్వాములుగా కూడా ఉండేవారు. పెద్దన చిత్రించిన ప్రవరుని పంటవారు పాడిపంట తరుగకుండా ఉండేవారు. బీద బ్రాహ్మణులు పంటలో పత్తి ఓచ్చం తెచ్చి జందాలు వడికి, మర్రి ఆకులు తెచ్చి విస్తళ్లు కుట్టి. కూరగాయలు పండించి, అంగళ్ళ ముందు జారిన మిరియాలేరి పొట్ట పోసుకునేవారు. (శుక సప్తతి 4-109). రానురాను బ్రాహ్మణుల్లో ఔన్నత్యం క్షీణ దశ పట్టింది. వెంకటాధ్వరి విశ్వగుణాదర్శంలో బ్రాహ్మణులను గురించి ఇలా రాశాడు. "ఈ ఆంధ్రదేశములో ఒక్కొక్క యూరియందు శూద్రుడు

గ్రామాధికారి (యజమానుడు) గాను, వాని ప్రక్కన బ్రాహ్మణుడు భృత్యుడై గణక వృత్తిని (కరణము పనిని) అవలంబించినాడు. నీరులేనిచోట తటాకము వలె వేదాధ్యాపకుడొక్కడే ఉన్నను ఇక్కడ వాడు మురికి పాత్రలు తోమెడి పనిలో నియమింపబడియున్నాడు" (సురవరం ప్రతాపరెడ్డి, తృతీయ ముద్రణం : 392-393). ఆంధ్రుల జానపద విజ్ఞానానికి బ్రాహ్మణుల పాటలు, కథా గేయాలు. నమ్మకాలు, సామెతలు మొదలైన వాటి పాలు తక్కువేమీ కాదు. ఆంధ్రజానపదుల్లో బ్రాహ్మణులు కూడా భాగమే అనే విషయాన్ని మరిచిపోరాదు.

ఆంధ్రుల్లో అతిముఖ్యమైన పాత్ర వహించినవారు. వహిస్తున్నవారు రెడ్లు, కమ్మలు. వెలమలు. పల్నాటి వీరచరిత్రలో యుద్ధరంగంలో మాల, మాదిగ, వెలమ, కమ్మరి, కుమ్మరి కులాల వారంతా వైష్ణవ సంప్రదాయం వారై, ఏక పంక్తిలో భుజించారు. ఆనాడు వెలమలు వీర వైష్ణవులుగాను, రెడ్లు వీరశైవులుగాను ఉండినట్లు తోస్తుంది. రెడ్లకు, వెలమలకు కాకతీయుల కాలం లోనే స్పర్థలు ప్రారంభమయ్యాయి. వెలమలు దక్షిణ దేశం నుంచి, రెడ్లు ఉత్తరదేశంనుంచి తెలుగుదేశానికి వచ్చారంటారు. క్రీ.శ. 1100 ప్రాంతంలో దక్షిణ తమిళ దేశం నుంచి వచ్చి కాకతీయ సేనలో చేరిన 'వెల్లాల' జాతివారే వెలమలై ఉండవచ్చునని థర్‌స్టన్ అభిప్రాయపడ్డాడు. అప్పటికే ఆంధ్రదేశంలో ప్రవేశించిన రెడ్లు కొత్తగా వచ్చిన వెలమలపై ద్వేషం పెంచుకున్నారు. ఆంధ్ర దేశంలోని కొంత భూభాగానికి కమ్మనాడనే పేరు పది శతాబ్దాలకు ముందు నుంచి కూడా వుంది. కన్నడ రత్నత్రయంలో ఒకరైన పొన్నకవి (10.శతా) తెలుగుదేశంలోని కమ్మనాటి పుంగనూరుకు చెందినవాడు.

రెడ్లు మొదట చిన్న భూభాగాలకు అధికారులై ఉండి రట్ట గుడ్లు అన బడ్డారు. రట్ట అంటే రాజ్యం, గుడి అంటే గుత్త. వ్యవసాయ నిమిత్తం, గ్రామాల రక్షణకోసం భూములు పొందిన వాళ్ళనే అర్థంలో రట్టగుళ్ళనే పేరు ఏర్పడింది. 1400 ప్రాంతాలకు రెడ్డి పదం స్థిరపడింది. రెడ్లలో మళ్ళీ పంట రెడ్లు, పాకనాటి రెడ్లు, వెలనాటి, రేనాటి, మొరస, పల్లెరెడ్లనే భేదాలేర్పడ్డాయి. నివాస గ్రామాన్ని బట్టి కూడా గోటేటి. ఓరుగంటి, పెదకంటి, కుంచేటి. మోటాటి, దేసూరి రెడ్లవంటి పేర్లు ఏర్పడ్డాయి. తెలుగుదేశంలో అత్యంత ప్రధానమైన రెడ్డి రాజ్యాన్ని వైభవోపేతంగా ఏలిన రెడ్లు విజయనగర కాలానికి

గ్రామాధికారులుగా, వ్యవసాయదారులుగా, సైనికులుగా మారిపోయారు. రెడ్లు గ్రామాధికారులై ఉండి దొంగలను పట్టడం, శిక్షించడం, తగవులు తీర్పు చెప్పడం, గ్రామ రక్షణం విధులుగా కలిగి ఉండినట్లు శ్రీ కృష్ణదేవరాయలు చెప్పాడు. (ఆముక్తమాల్యద : 7-19), అయినా కుబేరుల్ని మించిన రెడ్లు నాటికీ నేటికీ ఉన్నారు. పాలవేకరి కదిరీపతి శుకసప్తతిలో (2-406) రెడ్డి సంసారాన్ని ఇలా వర్ణించాడు.

> "కొలుచు సమగ్రభంగి నొనగూడ దివాణపువారి చేతి కా
> కలు హసి వోవగా కరవుకాల మెరుంగక, పూస బొట్టులం
> బలి కలినీళ్ళు చందనపు మానికె గొల్చినమాళ్లు గల్గి శో
> భిల్లుదురు రెడ్డి బిడ్డలు కుబేరుని పిల్లలనంగ నచ్చటన్"

కాపులు అనే పేరుతో అనేకులు తమనుతాము పిలుచుకున్నా కాపుల్లో ఎక్కువమంది రెడ్లే. వ్యవసాయదారుల్లో మొదటి నుంచి ముఖ్యులు రెడ్లే. స్వయంగా వీరు 'చేని పాటు పడి' పండించేవారు. మధ్యాహ్నం వరకు కష్టపడి పని చేసి 'ఇంటి కేగుదెంచిన తలి దాలి తోకపయి చేర్చిన కాగుల నీటి'తో స్నానం చేసి 'జొడ్డు గిన్నెలో రాగి సంకటి' తినే వారని శుక సప్తతి వర్ణి స్తుంది. (2—335). పాడి పంటలతో విరాజిల్లుతుండిన రెడ్లు ఆంధ్రుల జానపద విజ్ఞానానికి మూల విరాట్టులుగా ఉండినారు, ఉన్నారు.

మొదటినుంచి వ్యాపారం కోమట్లది. కోమట్లు, గోమఠనుంచి, గోమ టేశ్వరుడనే జైన తీర్థంకరుని పదంనుంచి వచ్చిందని కొందరు భావిస్తున్నారు. కోమటికి బేరి, నాడెకాడు అనే పర్యాయపదాలున్నాయి. గౌరులు, సెట్లు, వైశ్యులు మొదలైన పేర్లుకూడా ఉన్నాయి. చాళుక్య, కాకతీయుల కాలంలో వీరశైవులైన బలిజలకు చెట్టి, సెట్టి అని కులబిరుదు లుండేవి. నేటికీ బలిజ సెట్టి అనే పేరు ఉంది. శ్రేష్ఠి తద్భవమే సెట్టి అయివుండవచ్చు. కోమట్లు బెంగాలులో గౌడ దేశంనుంచి 6-7 శతాబ్దాలలో వచ్చి మొదట గౌరులై తర్వాత జైనగోమఠాను యాయులైనారని, కోమట్ల కుల దేవత అయిన కన్యకను విష్ణు వర్ధనుడనే రాజు బలాత్కరించాడనే కథనుబట్టి వాళ్ళు క్రీ.శ. 6—7 శతాబ్దా లలో వచ్చారని సురవరం వారభిప్రాయపడ్డారు (సురవరం ప్రతాపరెడ్డి, తృతీయ ముద్రణము : 54).

బ్రాహ్మణ, వైశ్య, రెడ్డి ఇత్యాది కులాలవారు సమాజంలో స్థిరపడిన వారు. అంతో ఇంతో నాగరికత చవిచూచినవారు. అటు ఆదివాసులలాగా కాకుండా దేశద్రిమ్మరులై జానపద విజ్ఞానమే – జీవనోపాధిగా ఉండే జానపద భిక్షుక గాయకులు కూడా అనేకులున్నారు. వీరిని గురించి ప్రత్యేకంగానే చెప్ప వలసి ఉంది.

జానపద వృత్తిగాయకులు :

వృత్తి గాయకుల్లో రెండురకాల వాళ్ళున్నారు. పూర్వకాలంలో రాజులు తమ ఆస్థానాల్లో వంశకీర్తనంకోసం, శౌర్యగానంకోసం కొంతమంది గాయ కుల్ని పోషించేవారు. సైనికులకు వీరరసాన్ని రంగరించి పోయడానికి కూడా ఈ చారణ గాయకుల్ని ఉపయోగించేవారు. రాజులుపోయి, వారి ఆస్థానాలు కాలగర్భంలో కలిసిపోయిన తర్వాత ప్రజలే రాజులయ్యారు. ప్రజల్లో నానా కులాలవారిని ఆశ్రయించి కులకీర్తనం చేసే వృత్తిగాయకులు కొందరేర్పడ్డారు. బ్రాహ్మణులకు విప్రవినోదులు, క్షత్రియులకు భట్రాజులు, వైశ్యులకు వీర ముష్టులు, ఇతరులకు పిచ్చుకుంట్లు ఆశ్రితులయ్యారు. వీరేకాక తరతరాలనుంచి జానపద కవిత్వ గానంతో పొట్టపోసుకుంటూ జానపద సాహిత్య భాండాగారాన్ని భద్రంగా రక్షిస్తూ వస్తున్న గాయక భిక్షుకు లెందరో ఉన్నారు. తరాలనాటి సంస్కృతిని ప్రతిబింబించే సాహిత్యాన్ని పరిరక్షించిన మహనీయులుగా జాన పద వృత్తి గాయకుల్ని పేర్కొన వలసి ఉంది.

జానపద వృత్తిగాయకులు చాలా వరకు దేశద్రిమ్మరులే. ఒకవేళ ఏదైనా గ్రామంలో ఓ పూరిపాకో, అరెకరా పొలమో ఉన్నాకూడా ఈ గాయకులు దేశ సంచారం చేస్తూ పొట్టపోసుకోడమే ప్రధానవృత్తిగా భావిస్తారు. జానపద వృత్తి గాయకులలో ఎన్నో కులాలవారున్నారు. కొందరికి కులనామధేయమే గాయకవృత్తిని సూచించేదిగా కూడా ఉంటుంది. "పిచ్చుకగుంటులు, శారద కాండ్రు, వీరముష్టులు, జంగములు, దాసరులు, భాగవతులు, పూసల బలిజలు, బీరన్నలవారు, సుద్దుల గొల్లలు, గంగిరెద్దులవారు, బాలసంతువారు, బుడబుడ కలవారు, చిందుమాదుగులు, జోగులవారు, బవనీలు, జక్కులవారు, హట్కా రులు, కొమ్ముకవారు, వీరవిద్యావంతులు, మాష్టీలు, డక్కలివారు, బొమ్మలాట

గాంధ్రు, మున్నగు తీరుతీరుల భిక్షులు లాంధ్రదేశమునమున్న జానపద గాయకులు'' (బి. రామరాజు 1978 : 793).

పైవారిలో కొందరు చుట్టు ప్రక్కలఉండే రాష్ట్రాలలో కూడా ప్రవేశించి అక్కడి పాటలను, కథాగేయాలను కూడా పాడి పొట్టపోసుకుంటున్నారు. ఇటువంటి వారిలో ముఖ్యంగా పేర్కొనదగినవారు పిచ్చుకుంట్లు, 'పిచ్చుకగుంట్లు', 'పిచ్చికుంట్లు', 'పిచ్చకుంట్లు' మొదలైన పేర్లతో వీరిని పిలుస్తుంటారు. 'భిక్షుక' శబ్దభవమే 'పిచ్చుక'. వీరు రెడ్లను, యాదవులను యాచించి జీవనం సాగిస్తారు. కృష్ణామండలంలో కమ్మవారికి కూడా గోత్రాలు చెప్తారు. పాల్కురికి సోమనాథుడి కాలం నుంచి వీరు వికలాంగులని చెప్పబడుతున్నది. ఇదే అర్థంలో వీరిని 'హెళవరు' అని కన్నడంలో పిలుస్తున్నారు. రాయలసీమలో పిచ్చుకుంట్లు కుంటి మల్లారెడ్డి కథను గానం చేస్తారు. (తంగిరాల : ఆంధ్ర జ్యోతి - వారపత్రిక : 19–2–71). ఈ కథలో పిచ్చుకుంట్లు రెడ్ల సంతానంగా చెప్పబడ్డారు. పిచ్చుకుంట్లు శైవులు. శ్రీశైల మల్లికార్జునుని భక్తులు. ఎల్లనాగిరెడ్డి కథ, వేమారెడ్డి కథ మొదలైన వాటిని పిచ్చుకుంట్లు పాడుతారు. గుంటూరు మండలంలో కొందరు పిచ్చుకుంట్లు పల్నాటి వీరచరిత్రను కూడా పాడుతున్నారు. మొదటినుంచి పిచ్చుకుంట్లకు గంట, తిత్తి వాద్యాలు, పిచ్చుకగుంట్లలో గొల్ల, తెలగ, గంట, తురకం, తొగరు, మంద, తిత్తి జాతులవారున్నారు (బి. రామరాజు 1978 : 793) కన్నడంలోకూడా హెళవరు వంశావళినే గానం చేస్తూ తెలుగునాట తాము చేసిన వృత్తినే కొనసాగిస్తూవస్తున్నారు. కన్నడ పిచ్చుకుంట్లలో ఎద్దు కుంట్లు, గంట కుంట్లు, చాప కుంట్లు అనే వారున్నారు. కన్నడ గీతాలను పాడే హెళవరుకూడా శ్రీశైలమల్లికార్జునునిభక్తులే. వీరుకూడా తమవంశంలోని కుంటి జన్మాన్ని గురించి రకరకాలకథలు చెప్తారు. 63 పురాతనుల వంశావళిని హెళవరు చెప్తారు. ఇంకా తిరుపతి తిమ్మప్పకథ కరిభంటని కథ మొదలైనవికూడా వీరు గానం చేస్తారు.

దాసరులు వైష్ణవులు, వీరిలో బుక్కదాసరి, పాగదాసరి, భాగవతదాసరి, చిన్నదాసరి, దండెదాసరి, మాలదాసరి మొదలైన ఉపజాతులున్నాయి. కన్నడ కథాగేయాలను, గేయాలను పాడే వారిలో 'దొంబిదాసరు' అనే వారి మాతృభాష తెలుగే. దాసరులు శంఖం, తంబురా, చిరుతం పలికిస్తూ విష్ణుసంకీర్తన చేస్తూ భిక్షమడుగుతారు.

బలిజలు 'బణజిగరు' అనే పేరుతో కన్నడదేశంలో కూడా ప్రసిద్ధులైన వృత్తిగాయకులుగా ఉన్నారు. రాయలసీమలో పూసల బలిజలు ఎక్కువగా ఉన్నారు. వీరు పూసలు అమ్ముతుంటారు. బొబ్బిలికథ, బాలనాగమ్మకథ మరాటీలకథ, చిన్నమ్మకథ, కామమ్మకథ మొదలైన కథాగేయాలను వీరు పాడుతుంటారు. పూసల బలిజలు వైష్ణవులు, అయినా శైవ గాథలను కూడా పాడుతుంటారు. ప్రాచీన కథాగేయాలనే కాక పూసల బలిజలు సుబ్బిరెడ్డికథ, కలిచెర్ల నరసింహారెడ్డికథ మొదలైన వీరగాథల్ని కూడా పాడుతుంటారు.

ప్రపంచంలోని జానపదమహాకావ్యాలలోనే ఎన్నదగింది పల్నాటి వీరకథ. ఫిన్లెండు జాతీయమహాకావ్యం 'కలేవాల' కన్నడంలోని జానపద మహాకావ్యం 'మలెయ మాదేశ్వర' మున్నగు వాటికన్న పరిమాణంలో, విలువలో గొప్పది పల్నాటి వీరకథ. ఈ మహాకావ్యాన్ని పాడేవారు, పల్నాటివారు లేక వీర విద్యావంతులు. పల్నాటివీరకథలను పిచ్చుకుంట్లు పాడుతుంటారనే వాదం తప్పని, పల్నాటి వీరగాథలను గానంచేసేహక్కు పిచ్చుకుంట్లకు లేదని, ఆ హక్కు వీర విద్యావంతులదేనని తంగిరాల సుబ్బారావుగారు అభిప్రాయపడ్డారు (తంగిరాల: ఆంధ్రజ్యోతి—వారపత్రిక: 29-1—71) వీర విద్యావంతులు హరిజనులు. వీరు గుంటూరు, నెల్లూరు మండలాలలో ఎక్కువగా ఉన్నారు. పల్నాటి వీరకథలను గానంచేసేటప్పుడు వీరజోడు, గంటలు, తిత్తి, తాళం, కత్తిడాలు ఉపయోగిస్తారు. కథనుపాడే ప్రధానవ్యక్తి పల్నాటి వీరునిలాగే వేషంవేసుకుంటాడు. పన్నెండు బిరుదులు ధరించి వీరావేశంతో కథను పాడుతుంటే శ్రోతలలో కూడా వీరావేశం కలుగుతుంది.

తెలుగు జానపద గాయకులలో ఎన్నిదగినవారిలో జంగాలు ఉన్నారు. వీరిని తెలంగాణంలో బుడిగె జంగాలుఅంటారు, బుడిగె అన్నది వీరు వాయించే వాద్యానికి పేరు. తెలుగులోని వీరగాథల్లో సగం పాడేది జంగములే అన్న విషయం గమనించదగ్గది. జంగం రగడ వీరావేశానికి తగ్గట్లుంటుంది. బొబ్బిలి వరుసలో వుండే కథలతోబాటు పద్యాలను, కీర్తనల్ని చేర్చి యక్షగానధోరణిలో జంగంకథలను రూపొందించారు జంగాలు. భల్లాణరాయచరిత్ర, వామన విజయం, సిరియాళ చరిత్ర, దేవయాని మొదలైనవన్నీ ఈ విధంగా రూపు

దాల్చినవే. జంగాలు ఈనాటివారు కాదు. ప్రాచీనకాలంనుంచీ జానపద సాహిత్యం వీరివల్ల వూపిరి పోసుకుంటూ వుంది. మొదట మొదట వీరు శైవ సంబంధమైన కథలను మాత్రమే చెప్పేవారు. కాని రాను రాను శైవేతర కథలకు కూడా అలవాటు పడ్డారు.

శారదకాండ్రు తెలంగాణాలో వ్యాపించివున్నారు. వీళ్ల కథ చెప్పేతీరు కూడా ఇంచుమించు జంగాలలాగే వుంటుంది. జంగాలకు 'జంగం రగడ' అనే ప్రత్యేకమైన వరుసవున్నట్టే శారదకాండ్రకు 'శారదవరుస' వుంది. 'తకిట, కిటతకిట, కిటతకిట కిటత, అని దీన్ని చెప్పవచ్చు, వీరిప్రసక్తిప్రాచీన సాహిత్యంలో కానరాదు. జంగాలు 'తందానతాన' పల్లవిని ఆలాపించనట్లే శారదకాండ్రు ప్రతిదరువు చివరా "ఓ భారతి కరుణామతి, భళి శారద కరుణానిధి" అనే పల్లవి (refrain) ని ఆలాపిస్తారు. శారదకాండ్రుకూడా శైవులే. మున్నూరు, ముతరాసి మొదలైన తెలగ కులాలనుంచి వీరుద్భవించారని రామరాజుగారు రాశారు. (1978:797). భిక్షుకగాయకుల్లో వీరే అధిక సంఖ్యాకులు. శారద వరుసలోని పాటలతోబాటు శారదకాండ్రు మరికొన్ని చారిత్రకగేయాలను కూడా వీరావేశంతో గానం చేస్తారు. సర్వాయిపాపడు, సదాశివరెడ్డి మొదలైన కథల్నిచెప్పేదివీరే. ముఖ్య కథను ఒకరుచెప్తూవుంటే మరొకరో ఇద్దరో వంత పాడుతారు.

జానపద గాయకులలో వీరముష్టివారు కూడా వీరశైవులే. కోమట్లను, జంగాలను యాచించి బతికే వీరముష్టివారి వాద్యం జేగంట లేదా తప్పెట. కోమట్లకు ఇలవేల్పయిన కన్యకాపరమేశ్వరిని గురించిన పాటలను పాడటం చేత కోమట్లు వీరిని ఎక్కువగా ఆదరిస్తారు. దీనికి ఒక కథవుంది. రాజరాజు కన్యకను చెరపట్టడానికి వస్తుండగా పల్లకీ మోస్తుండిన వీరముష్టులు కావాలని ఆలస్యంచేశారట. ఈ లోపల కన్యక అగ్నిప్రవేశం చేసింది. ఈ విధంగా కన్యకమానం కాపాడినందువల్ల వీర ముష్టులు కోమట్ల ఆదరానికి పాత్రులయ్యారు.

ఒగ్గు అనే వాద్యాన్ని వాయించేవారిని ఒగ్గోళ్ళు అంటారు. వీరికే బీరన్నల వారని మరొక పేరు. వీళ్ళ ఆరాధ్య దైవం బీరన్న. వీళ్లు చెప్పేవి కూడా బీరన్న కథలే. ఒగ్గు వీరి ప్రత్యేక వాద్యం. ఇదే శివుని డమరుకం.

వీరణాలను, తప్పెటలను కూడా బీరన్నల వారుపయోగిస్తారు. వీరు చెప్పే కథలలో ముఖ్యమైంది కొమిరెల్లి మల్లన్న కథ. బీరన్నలవారు కర్నాటకంలో కూడా ఉన్నారు.

తెలుగుదేశమంతటా వ్యాపించి వుండే జానపద గాయకుల్లో బవనీలు కూడా వున్నారు. వీళ్ళనే బైండ్లవాళ్ళని, పంబాల వాళ్ళని కూడా చెప్తారు. క్రీడాభిరామంలో కూడా బవనీల ప్రసక్తి వుంది. బవనీలు ఎల్లమ్మ, పోచమ్మ, అంకమ్మ వంటి గ్రామ దేవతల్ని కొలుస్తారు. జమిడిక లేక బవనిక అనే వాద్యం బవనీలకు ప్రధానమైంది. దీన్నే పంబ అని అంటారు. కృష్ణా గుంటూరు ప్రాంతాలలో దీన్నే జముకులంటారు. అందుకే జముకుల కథ అనేది ఏర్పడింది.

కాటమరాజు కథ, కృష్ణలీలల వంటివి చెప్పేవారు గొల్ల సుద్దులు. వీళ్ళు బొమ్మలను కూడా ప్రదర్శిస్తూ కథలు చెప్తారు. కొమ్ములు, వీరణాలు, శంఖాలు మొదలైనవి వీరి వాద్యాలు. వీరిలో ఎక్కువమంది వైష్ణవులు.

పైన చెప్పిన జానపద గాయకుల్లో చాలా వరకు కన్నడ దేశంలో కూడా వున్నారు. సాలానులు, బాలసంతువారు, బుడబుక్కలవారు, జోగులవారు మొదలైన జానపద భిక్షుకులంతా వివిధ జానపద కళలను తరతరాలనుంచి కాపాడు తున్నారు. వారి పాలిటికి అవి ఇంకా వృత్తి విద్యలుగానే వున్నాయి. ఏ ప్రభుత్వమూ ప్రకటించని 'స్వయం ఉపాధి పథకాలు'గా జానపదులు తమ కళల్ని రూపొందించు కున్నారు. ఈ అందరు కళాకారులూ ఆంధ్ర జానపదులు. ఆంధ్రుల జానపద విజ్ఞాన నిర్మాతలు, పోషకులు.

టిప్పణి

1. ''తస్యహ విశ్వామిత్ర స్యైకశతం పుత్రా ఆసుః; పంచాశత్ ఏక జ్యాయాం సో మధుచ్ఛందసః, పంచాశత్ కనీ యాంసః; తద్వై జ్యాయాంసో నతే కులమ్ మేనిరే. తాన్ అనువ్యాజ-హారన్ తాన్ వః ప్రజా భక్షీ ష్టేతి త ఏతేంధ్రాః పుండ్రాః శబరాః పుళిందా మూతిబా ఇత్యుదంత్యా బహవో భవంతి వైశ్వామిత్రా దస్యూనామ్ భూయిష్ఠాః''

(ఐతరేయ బ్రాహ్మణమ్ Asiatic Society of Bengal (1906), 7 వ సంచిక, 3 వ అధ్యాయం, 6 వ ఖండం).

2. "కారా వారో నిషాదాత్తు చర్మకారః ప్రసూయతే
వైదేహికాదంధ్రమేదౌ బహిర్గ్రామ ప్రతిశ్రయౌ"
(మనుస్మృతిః, నిర్ణయ సాగర్ ప్రెస్, బొంబాయి (1920), 10 వ అధ్యాయము, శ్లో. 36).

3. ఏటుకూరి బలరామమూర్తి, ఆంధ్రప్రదేశ్ దర్శిని, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1976, పు. 35.

# జానపద కవిత్వం

మౌఖిక జానపద విజ్ఞానంలో మన దృష్టిని మొట్టమొదట ఆకర్షించేది జానపద కవిత్వం. 'జానపద' శబ్దం చెవిని పడినంతనే ఆంధ్రులు ఆలోచించేది గేయాలను గురించే. ఆ తర్వాత వారి మనసుకు వచ్చేది రామాయణపు పాటలు, భారతపు పాటలు, వీరగాథలు వగైరా వగైరా. తెలుగువారిలో ప్రతి రెండవ వాడూ కవిలాగా కనబడతాడనే మాట హేళనో అవహేళనో కావచ్చు కాని, కవిత్వానికింకా తెలుగుదేశంలో కాలం చెల్లిపోలేదన్న మాట మాత్రం నిజం. వాగ్రూపమైన మౌఖిక జానపద విజ్ఞానంలోని ప్రధాన శాఖలను ఈ క్రింది విధంగా గుర్తించవచ్చు.

<u>మౌఖిక జానపద విజ్ఞానం</u>

1. జానపద కవిత్వం — జానపదగేయం
   — జానపద కథాగేయం

2. గద్యకథనాలు — కథలు
   — ఐతిహ్యాలు
   — పురాణాలు

3. సామెతలు
4. పొడుపు కథలు
5. జానపదభాష

గేయం నాతి దీర్ఘము, భావ కవితారూపము, కథావిరహితము అయి వుంటుంది. కథాసహిత గేయాలను కథాగేయాలనవచ్చు. రెండూ గేయరూపంలోనే వుంటాయి కదా అందువల్ల రెండిటిన్నీ కలిపి గేయమనే ఎందుకనరాదు అని వాదించవచ్చు. కొందరు ఆ విధంగానే 'గేయ' శబ్దం రెండింటికీ వర్తి

చేలా రాశారు కూడా. సమస్త మానవ జాతినీ సూచించ డానికి 'man' అనే పదాన్ని వాడుతున్నా స్త్రీలను ప్రత్యేకించి చెప్పేటప్పుడు 'woman' అనీ, పురుషులను చెప్పేటప్పుడు 'man' అనీ వాడటం కూడా ఇలాంటిదే. కథాగేయం (narrative song) గేయమే అయినా దానిని ప్రత్యే కించి చెప్పాలంటూ Encyclopaedia Britannica ఇలా అంటుంది: "Ballads are a variety of folksong; but they are sufficient by a group in themselves to be classed separately" (vol 3, p. 22).

గేయాన్నీ, కథాగేయాన్నీ వేరుగా చెప్పడం సమంజసమైనా ఈ రెండింటినీ కలిపి చెప్పడానికి గేయానికి భిన్నమైన పదం వేరొకటి అవసర మనిపిస్తుంది. 'జానపద కవిత్వం' గేయరూపంలో వుండే గేయాలకు, కథా గేయాలకూ వర్తించే పారిభాషిక పదంగా ఈ రచయిత సూచించాడు (సుంద రం ; 1976 : 9).

జానపదుల అకృతక రచనల్ని 'కవిత్వ'మనే పేరుతో పిలవ్వచ్చునాఅనే ప్రశ్నవుండనే వుంది శాస్త్రబద్ధమైన మహాకావ్యపరంపరకుఅన్వయించే సిద్ధాం తాలనే జానపద కవిత్వానికి కూడా అన్వయించేట్లయితే బహుశా దాన్ని కవిత్వ మని మనం పిలవ కూడదు. మేధా సంబంధి కాదు కాని జానపద కవిత్వం హృదయ సంబంధి. ప్రకృతితోనే తమ బ్రతుకును ముడివేసుకున్న జాన పదులు భావజీవులు. నిసర్గ పరిసరాల్లో జీవించే వారు కాబట్టి శృంగార హాస్యా లను గాని, శోకరౌద్రాలనుగాని జానపదులు తీవ్రంగానే వ్యక్తం చేస్తారు. మాటలో ఎంత కటువుగా కనిపించినా హృదయం అనతికాలంలోనే ఆర్ద్రి మవుతుంది. జానపదుల అనుభవ ప్రపంచం పరిమితమైంది. అయినా జనప దీయ దృష్టితో, 'అచ్చ'మైన దృష్టితో చూస్తే వారి అనుభవ వైశాల్యం చాలా గొప్పదనే చెప్పాలి. పుస్తకానుభవం బౌద్ధికానుభవం తక్కువైనా జీవనాను భవం జానపదుని దగ్గర సమృద్ధిగానే వుంటుంది. అత్యంత సరళ శిల్పంతో నిసర్గ సుందరమైన కవిత్వాన్ని వెలయించగల అనుభవమూ, అభివ్యక్తీ కరణ శక్తి జానపదుల కున్నాయి. అందుకని జానపద కవిత్వం శిష్ట కవిత్వంతో శాస్త్రీయంగా పోటీ పడలేదు గాని అది ఉచ్చమైన కవిత్వమే.

## గేయం

'ఫోక్‌సాంగ్'ను 'పల్లెపదా'లని, 'పాతపాట' లని చెప్పేవన్నీ పాత మాటలు. మొదటి అధ్యాయంలో చెప్పినట్లుగా జానపద విజ్ఞానం పాతదీకాదు, కొత్తదీ కాదు. అది నిరంతరం రూపు దాల్చుతూనే వుంటుంది, పాతబడుతూనే వుంటుంది, భిన్నరూపాలను పొందుతూనే వుంటుంది. కొన్ని నియమాలకు లోబడినట్లుగా కనిపించినా జానపద గేయం అన్నది నియమాలకు చాలా వరకు అతీతమైంది. వందలు—వేలు జానపద గేయాలను పరిశీలించిన తర్వాత వాటిలో కొన్ని సామాన్య లక్షణాలను గుర్తించ వచ్చు గేయ రూపంలో వుండడమూ, జానపదుల చేత సృష్టింప బడడమూ వీటి ముఖ్య లక్షణాలు.

"అజ్ఞాత కర్తృత్వం, సామూహిక ప్రచారం, మౌఖిక సంప్రదాయం. ప్రాచుర్యం; సారళ్యం, అనేకుల మనస్సుల నాకర్షించి సంపాదించిన జాతీయత". జానపద గేయ లక్షణాలని ఛేంబర్స్ విజ్ఞానసర్వస్వం చెప్తున్నది. ముఖ్యంగా మౌఖిక సంప్రదాయం, ప్రాచుర్యం, అజ్ఞాత కర్తృత్వం జానపద గేయాలను శిష్టగేయాలనుంచి వేరు చేస్తాయి. పల్లెటూరి వారు గేయాన్ని సృష్టించారా అన్నది ముఖ్యం కాదు. సృష్టికర్త అప్రధానుడై వక్తలేక గాయకుడే ప్రధాన పాత్ర వహించినప్పుడే గేయం జానపద గేయమవుతుంది. అందువల్ల 'నేను జానపద గేయం రాశాను' అని ఎవరైనా చెప్పారంటే వారికి ఈ గేయాల అంతస్సత్వాన్ని గురించిగాని, అతిప్రధాన లక్షణం గురించిగాని తెలియదన్నమాట.

అజ్ఞాత కర్తృత్వాన్ని సంతరించుకొన్న గేయం ఏ పుస్తకంలోనో పురుగుల కాహారంగా పడివున్నా అది జానపదగేయం కాజాలదు. ప్రాచుర్యం దాని మరో ముఖ్య లక్షణం. గేయగుణం దాని ప్రాచుర్యానికి చాలా వరకు దోహదం చేస్తుంది. ప్రాసలు, అనుప్రాసలు అలంకారాలేకాక జానపద గేయానికి ఆవశ్యకాలూ, అత్యంత సహజాలూనూ. గేయరూపం జ్ఞాపకం వుంచుకోడానికీ, పునరుచ్చరించడానికీ పనికి వస్తుంది. ప్రాచీన మానవుని భాష, ప్రాచుర్యాన్ని పొందాలనుకున్న శబ్దం లయబద్ధమైనదని చెప్తే పునరుక్తి దోషం అంటవచ్చునేమోగాని, పునరుక్తి జానపదుల విషయంలో గుణమనే

చెప్పాలి. పల్లవి, అనుపల్లవి, లయవిన్యాసం లేకుంటే జానపదునికి 'వూపే' రాదు. మానవుడు లయబద్ధంగా మాటల్ని కూర్చడం కొన్నివేల ఏళ్ళ క్రితమే ప్రారంభమయింది.[1]

కథాగేయాల నుంచి గేయాలను వేరుచేసే గుణాలలో ముఖ్యమైంది ఆత్మాశ్రయ ధోరణి లేక భావనిష్ఠగుణం. వీటిలో కథనం వుండదు. పని పాటల్లో, పారమార్థిక గేయాల్లో, బాంధవ్య గీతాల్లో ఆత్మపరత్వం మరీ ఎక్కువగా కనిపిస్తుంది. శృంగార గేయాల్లాంటి కొన్నిట్లో సంభాషణ రీతి కూడా కనిపించవచ్చు. జానపద గేయాలు అప్రయత్నంగా వెలువడుతాయి. అయినా ఈ అప్రయత్న రచనల వెనుక అపార జీవనానుభవం తొంగి చూస్తుంటుం దనడం అతిశయోక్తి కాదు. "తన మనోభావాన్ని ఎదుటి వారితో చెప్పటం ఎప్పుడైతే మానవుడునేర్చుకున్నాడో అప్పట్నుంచే కవిత్వం పుట్టుకొస్తుంది. మిలమల మాడ్చేఎండలు, హోరున కురిసే వర్షాలు, ముడుచుకు పోయే చలి, ఆనందంతో హృదయాన్ని ఉద్ఘాతలూగించే పంట పొలాలు, శరీరాన్నంతటినీ కదలింపజేసే కష్టమైన పనులు, చావులు, పుట్టుకలు, పెళ్ళిళ్లు, పేరంటములు, పండుగలు, పబ్బాలు, పూజలు ఒక్కటేమిటి ప్రతీ సంఘటన, ప్రతీ సన్ని వేశము, పల్లెటూరి వారి కవితావేశానికి మూలకందాలవుతూ వచ్చాయి" (నేదునూరి గంగాధరం 1961 : 3–4)

ఆశురచనలయిన జానపద గేయాలు మౌఖిక సంప్రదాయంతో జీవిస్తాయి. మౌఖిక సంప్రదాయానికి చెందిన సాహిత్యం అక్షర సాహిత్యంకన్న ప్రాచీన మైనది మాత్రమే కాదు ఎక్కువ ప్రాచుర్యం కలది. సామూహిక ప్రసారం (communal transmission). పునః సృష్టి (re-creation) కూడా జాన పదగేయాలు రూపొందడంలో ప్రధానపాత్ర వహిస్తాయి. సమష్టి అచేతన (collective unconcious) అన్నది జానపదగేయ సృష్టికి కారణమవు తున్నది. మరో విధంగా చెప్పాలంటే వ్యక్త్యతీతం (impersonal) గా ఉండడం వీటి లక్షణమన్నమాట.

జానపద సాహిత్యానికంతటికీ అన్వయించే మరొక లక్షణం 'బహు రూపధారణం'. బహురూపుల్లాగే జానపద గేయాలు వేయని వేషమంటూ లేదు.

ఈ గేయాలను పాడే ప్రతిఒక్కరూ ఏదోపదాన్ని లేక వాక్యాన్ని మరిచిపోతారు. లేకుంటే చేరుస్తారు. అదీ లేకపోతే మారుస్తారు. సృష్టికర్త అప్రధానుడై, ఒక్కొక్క గాయకుడూ పదవాక్య వ్యత్యాసాలకు కారణకర్తలవుతూ వుంటే మూలగేయం కాలాన్ని గురించి పరిశోధించడం వృథాప్రయాసే అవుతుంది. మొత్తం మీద ప్రతి జానపద గేయమూ అకృతక మానవుని నవనవోన్మేష శాలినియైన ప్రతిభవల్ల అవతరించిన నిరాభరణ సౌందర్యరూపమే.

ఆంధ్రుల అపార గేయ సాహిత్య రాశిని గురించి పరిశీలన జరిపే టప్పుడు పైన పేర్కొన్న కొన్ని సామాన్య లక్షణాలను తెలుసుకున్నట్లే, గేయాల పుట్టు పూర్వోత్తరాలను గురించి కూడా కొంత అన్వేషణ జరపాల్సిన అవశ్యకత వుంది. "రెక్కాడితే గాని డొక్కాడదని ఆ కర్షక కార్మికులకు విశ్రాంతి యెరుగని ఆ రెక్కలే దిక్కు. వారి కష్టసుఖాలు వారిలో వారే చెప్పు కోవాలి. హృదయంలో ఉన్న ఆనందమో, ఆవేశమో, దుఃఖమో, కష్టమో పైకి వెళ్ళబుచ్చుకుంటేనేగాని హృదయభారం తీరదు. ఇదే జానపద కవిత్వంగా వెలువడింది" (నేదునూరి గంగాధరం 1961 : 3). జానపద గేయాల పుట్టు కను గురించిన పరిశీలనలో మొదటి అధ్యాయంలో వివరించిన వివిధ సిద్ధాం తాలు వుపకరిస్తాయి.

గేయం పుట్టుక కాలాన్ని అన్వేషిస్తూ పోతే ఇతిహాసపూర్వయుగాలకు వెళ్తాము. పాతరాతి యుగం తుది దశలో వుండిన క్రోమాన్యాన్ మానవులు దాదాపు మనవంటి వారే. ఆ తర్వాత మనిషిలో భౌతికంగా కాక సాంస్కృతి కంగా పరిణామం జరిగింది. మానవుడి భాష సంజ్ఞలతో ప్రారంభమై మెల్ల మెల్లగా భావానికి తగ్గ శబ్దాన్ని వాడడం వరకు వచ్చింది.

మొట్టమొదట మనిషి నోట వెలువడిన పాట ఎటువంటిదో చెప్పడం అసాధ్యం. అయినా పనికి, పాటకు వుండే సంబంధాన్ని బట్టి మొట్టమొదట పని పాటలు (work songs) వెలువడి వుండవచ్చుననిపిస్తుంది. వేట ఆదిమమానవుని ప్రధాన వృత్తి. వేటాడిన తర్వాత వేట ద్వారా కలిగిన భావో ద్వేగంతో నృత్తాలు చేస్తూ మాట్లాడిన భాష లయబద్ధంగా వుండేదని వూహించ వచ్చు. ఆలోచించే శక్తి లభించడంతో బాటే మానవునికి మానవాతీత ప్రపం

చంలో నమ్మకంగూడా ప్రారంభమై వుండాలి. తమ సుఖదుఃఖాలను మానవాతీత శక్తులకు విన్నవించుకునేటప్పుడు కూడా ఆదిమానవులు లయాత్మక గీతాల నాలాపించి వుంటారని వూహించవచ్చు.

తెలుగులో జానపదగేయాలు ఏ కాలంనుంచి వున్నవంటే ఎవరు లెక్కకట్టి చెప్పగలరు? బహుశా తెలుగుభాష మూల ద్రావిడ భాషనుంచి విడివడిన కాలంనుంచీ తెలుగు పాటలు ఉండేవేమో! అంటే తెలుగు జానపదగేయ సాహిత్యం ఎంతలేదన్నా రెండువేల ఏళ్ళనాటిది. ఆధారాల వేళ్ళు వెతుక్కుంటూ వెళ్తే దొరికేది శూన్యమే. గాథాసప్తశతిలో వచ్చే పల్లెపదాల ప్రసక్తి తెలుగుగీతాలను గురించినదైతే ఆంధ్రులకు అంతకంటె సంతోషించే విషయం వుండదు. రోకటిపాటలు తరువోజల్లో వుంటాయన్న విన్నకోట పెద్దన్న సూచనను బట్టి ఈ ఛందస్సు జానపదగేయాల మాధ్యమంగా ప్రాచీన కాలంనుంచీ వుందంటే తప్పుకాదు. అద్దంకి శాసనంలోని తరువోజను బట్టి తొమ్మిదవ శతాబ్దిలో రోకటి పాటలవంటి జానపదగేయాలు ప్రచారంలో వుండేవని వూహించవచ్చు. నన్నెచోడుని కాలంనుంచి రోకటిపాటలుండేవని ఖచ్చితంగా చెప్పవచ్చు. శబర కామిని మల్లికార్జునుని గూర్చి పాటలు పాడుతూ రోకలితో దంచుతుండడం నన్నెచోడుని కంటబడింది. తరువోజలు, మధ్యాక్కరలు జానపదగేయాలలో ఎన్నోచోట్ల దర్శనమిస్తాయి. ఇవి ప్రాఙ్నన్నయ కాలంలోనే శాసన సాహిత్య రూపంలోనే కనిపించడం మనకు ఎరుకే. నన్నెచోడుడు పేర్కొన్న అంకమాలికలు, గౌడుగీతములు, ఆరతులు జానపదగేయాలే. ఉయ్యాల పాటలు కూడా పేర్కొని నన్నెచోడుడు తెలుగువారి జానపదగేయాలలోని అనేక ప్రక్రియలకు చరిత్రను చేకూర్చి పెట్టాడు.

నెలమి జింక పిండు దొలుమేనఁ జేసిన
తపము పండఁ బండెఁ దరువనంబు
లువిద లింపు మిగుల నూయల పాటలు
పాడ మధుమదమున బాడె నళులు (4–89)

తెలుగు జానపదగేయాలను గూర్చి మాత్రమేకాక సామాన్యంగా జానపద విజ్ఞానాన్ని గూర్చి అనేక సాక్ష్యాలను తిరుగులేకుండా వాలిపి తెనడు

పాల్కురికి సోమనాథుడు, ఈ దేశకవి అచ్చమైన దేశిగీతాల నెన్నిటినో విని వాటిని పేర్కొని మహోపకారం చేశాడు. సోమనాథుడు పేర్కొన్న ఈ కింది పదాలలో అనేకం నేటికీ వున్నవే.

....పదములు తుమ్మెద పదముల్ ప్రభాత
పదములు పర్వత పదము లానంద
పదములు శంకర పదములు నివాళి
పదములు వాలేశు పదములు గొబ్బి
పదములు వెన్నెల పదములు సంజ
వర్ణన మరి గణ వర్ణన పదము
లర్ణవ ఘోష ఘూర్ణిల్లుచు నుండ
బాడుచు నాడుచు బరమహర్షమున
గూడి సద్భక్త సంకుల మేగుదేర.

ఇలా ప్రాచీన కవులు పదాలనీ పాటలనీ పేర్కొన్న జానపదగేయ రూపాలను కొన్ని ప్రధాన శీర్షికల క్రిందికి తేవడం సులభమైన పనికాదు. వర్గీకరణ అన్నది ఏ అధ్యయనానికైనా అనివార్యం. జానపద విజ్ఞానాన్ని ఆధునిక అవసరాలకు అనుగుణంగా శాస్త్రీయమైన రీతిలో విభజించిన ఆర్. ఎస్. బాగ్స్ జానపద గేయరూపాలు ఆరింటిని గుర్తించాడు. అవి : రణగీతాలు, దైనిక జీవనానికి సంబంధించినవి, జీవితంలోని ముఖ్యఘట్టాలు, పిల్లల పాటలు, మతసంబంధ గేయాలు.

జానపదగేయాలను లౌకికగీతాలు, పారమార్థిక గీతాలనే శీర్షికల క్రింద స్థూలంగా విభజించవచ్చు. ఆశ్రయాన్ని బట్టి పాటల్ని పురుషుల గీతాలు, స్త్రీల పాటలు, ఉభయుల గీతాలు, పిల్లల పాటలు అని నాలుగు రకాలుగా విభజించ వచ్చు. రసాన్ని బట్టి చూస్తే వలపు పాటలు, హాస్యగీతాలు మొదలైన విభాగా లేర్పడతాయి. గేయాల క్రియాత్మక గుణాన్ని తీసుకుంటే పనిపాటలు, క్రీడా గీతాలు, నృత్యగేయాలు మొదలైన విభాగాలేర్పడతాయి. ఇట్లే ్యను, గాయ

కులను, వాద్యాలను తీసుకొని విభాగాలు చెయ్యవచ్చు. సాధ్యమైనంత వరకు అన్ని రకాల గేయాలనూ ఇముడ్చుకోగలిగిన విభజన చేస్తే ఈ క్రింది విధంగా ఉంటుంది.

1. పని పాటలు
2. పారమార్థిక గేయాలు
3. బాంధవ్య గీతాలు
4. పిల్లల పాటలు
5. వేడుక పాటలు
6. వలపు పాటలు
7. హాస్య గీతాలు
8. కన్నీటి పాటలు.

పనిపాటలు :

వీటిని ఆంగ్లంలో Work songs అనీ, labour songs అనీ songs of action అనీ అంటారు. శ్రామిక గేయం, కార్మిక గేయం లాంటి పదాలకంటే పని చేసేటప్పుడు పాడే పాటలను పనిపాటలనడం మేలు వీటిలో అనంత వైవిధ్యం ఉంది.

గొడ్డలి, కొడవలి, రోకలి, తిరగలి మొదలైనవే పని పాటలకు పక్క వాద్యాలు. ఈ పాటలకు లయ పని ననుసరించి ఉంటుంది. బరువైన పనైతే పాటకూడా బరువుగా, నెమ్మదిగా సాగుతుంది. పని చకచకా సాగవలసి వస్తే పాట కూడా అట్లే పరుగెడ్తుంది. ఈ పాటలలో గీత నాయకుని (song leader) పాత్ర గణనీయమైంది.

తెలుగుకు సంబంధించినంతవరకు పనిపాటల్లో ముఖ్యంగా పేర్కొనదగినవి కర్షక గేయాలు. వీటిని పొలం పాటలనవచ్చు. వానదేవుణ్ణి ప్రార్థించడం మొదలుకొని అన్ని పనులు ముగించుకొని ఇంటికి వెళ్ళే వరకు రైతు నోటినిండా పాటలే. వానపాటలు, ఏరువాకపాటలు, ఏతాము పాటలు, నీరుకట్టె

పాటలు, కలుపు, కోత, కుప్పనూర్పిడి, గింజలుదులిపే పని పాటలన్నీ రైతుకు తన పనిలో దోహదం చేసేవే. ఏతాముతో నీరుతోడి ఎన్నో పాట్లుపడిన రైతు-

ఏటి కేతం బెట్టి యెయిపుట్లు పండించి
ఎన్నడూ మెతుకెరగ నన్నా
నేను గంజిలో మెతుకెరగ నన్నా -

అని వాపోవడమూ కద్దు. రాయల సీమలోని కపిల పాటల్లో వైవిధ్యం ఉంది, హృదయాన్ని కదిలించే చురుకుదనం ఉంది, అల్పాక్షరాలలో అనల్పార్థాలను సూచించే జాణతనం ఉంది.

మాను మాను పువ్వుగాచె
మాని కింద రాశి పోసె
ఇప్పిమాను పువ్వుగాచె
ఇప్పుడిరిగె నా మనసు.

ఈతమాను ఇల్లు కాదు
తాటిమాను తావు కాదు
తగిలినోడు మొగుడు కాదు
తగరు బంగారు కాదు.

బాయిగంగా బల్లారిగంగా
బారమంతా మోపినాము
బాయిలోని సిరి బాలగంగా
బాలెద్దులు నీ బారమమ్మా.

తోటతోట బొమ్మన్నకీ
ఆవునెయ్యి అరటిపండు
మనబాయి బొమ్మన్నకీ
మల్లెపూల మెడదండ.

కపిలతో నీరుతోడి, మడికి గట్లుకట్టి ఉల్లాసంగా చందమామ పాట లాలపిస్తాడు రైతు.

రాతిరి రాతిరి వస్తావని చందమామయ్యో! మామ–చంద ॥
రాతిగంధం తీసి ఉంచితి చందమామయ్యో, మామ–చంద ॥
రాతిరి రాతిరి రాకపోతే మామ– చంద ॥
రాతిగంధం రగిలిపోయే మామ–చంద ॥....

(నేదునూరి గంగాధరం 1961:27)

పొలంపనుల్లో స్త్రీ పురుషులిద్దరికీ సమాన ప్రాధాన్యం ఉంది. స్త్రీ సమానత్వం కోసం పోరాడాల్సిన క్షేత్రమది కాదు. కలుపుతీసే లాంటి పనులు స్త్రీలే చేస్తారు. వాటికి సంబంధించిన పాటలు స్త్రీలే పాడుతారు. వరినాటడం. కలుపు తీయడం అయిన తర్వాత కోతల వరకు పనులుండవు. కోతకాలంలో మళ్ళీ కోలాహలం మొదలవుతుంది. తెలుగులో పొలిపదాలు కూడా బోలెడన్ని లభిస్తాయి. గింజల్ని దులిపి, ధాన్యం రాశులుగా పోసి, రాశిచుట్టూ గీత గీస్తారు. దాన్ని పొలి అంటారు. ధాన్య సమృద్ధికి 'పొలి' అని, దానికోసం పూజించే దేవుడికి 'పొలిగాడు' అని అర్థాన్ని చెప్పుకోవచ్చు. అనంతపురం ప్రాంతంలో కొలవడానికి ముందు పొలంలో ధాన్యరాశి చుట్టూ జిల్లేడాకు చేత బట్టుకొని మూడు ప్రదక్షిణాలు చేస్తారు. దీనికే పొలిదిరగడమని పేరు. వ్యవసాయంలో ఈ విధంగా మొదటినుంచి చివరివరకు ఒక్కొక్కపనికి పాడేపాట లెటువంటివి, వాటి లయ ఎటువంటిది అన్నది పరిశోధిస్తే ఆసక్తికరంగా ఉంటుంది.

కర్షక గేయాలు ఈనాటికీ ఇంకా నిలిచి వున్నాయి కాని కార్మికగేయాలు చాలా వరకు యంత్రాల మోతల్లో మరుగున పడిపోయాయి. మిల్లులలో బరువులు మోసేవారు, రాళ్ళు కొట్టేవారు, బస్తాలు మోసేవారు పాడేపాటలు అక్కడొకటి, ఇక్కడొకటి వినిపిస్తే ఎక్కువ.

వృత్తిగేయాలు పనిపాటల్లో ప్రధానంగా కనిపించే మరో గేయరూపంగా నేటికీ నిలిచి వున్నాయి. ఈ పాటల లయలు పనికి తగినట్లుగా వుంటాయి.

పడవ పాటలు ప్రపంచమంతటా కనిపిస్తాయి. వీటిలో పల్లవి (refrain) లేక ఊత పదాలకు చాలా ప్రాముఖ్యం ఉంది. ఆంధ్రదేశానికి పొడవైన సాగర తీరముంది. కృష్ణా గోదావరులు ప్రయాణాలకు, ఎగుమతి దిగుమతులకు ఉప కరిస్తున్నాయి. ఈ కారణాలవల్ల పడవపాటలు తెలుగులో పుష్కలంగా లభిస్తు న్నాయి. చాలా పడవ పాటల్లో పదాలకన్న ధ్వన్యనుకరణలే ఎక్కువగా ఉంటాయి. పడవపాటలకు విశ్వజనీన వ్యాప్తి ఉన్నట్లే, పాటలో పదంకన్న ధ్వని మున్నదై వాటికి విశ్వజనీన లక్షణమూ లభించింది.

ఏలెస్సా ఓలెస్సా ఏలెస్సా ఓలెస్సా
ఏలెస్సాబో ఓలెస్సా ఏలెస్సాబో ఓలెస్సా
ఏలా యేలా యేలా యేలా యేలా యేలా యేలా తందేలా
ఏలా ఏలా జోర్సెయ్ బార్సెయ్.

ఇలాంటి వాటిలో తరచిచూస్తే పదాలకు అర్థాలను కొంతవరకు కల్పించ వచ్చునేమో. కాని వాటిని పాడేవారికి అర్థం ప్రయోజనశూన్యం; శబ్దం భారం తగ్గించే సాధనం. కొన్ని పడవ పాటల్లో వేదాంతం ఎక్కువగ్గా కన్పిస్తుంది. ఎటుచూచినా మైళ్ళకొద్దీ పరుచుకొని వుండే నీల గంభీర సాగరం ఎంత లోతు గుండె మనిషికైనా వేదాంతం నేర్పుతుంది. 'గట్టెక్కుతాదా నా తెప్ప, కల్లోల జలధిలో మునిగి పోతుందా....' అనే విచికిత్సలో పడతాడు మానవుడు.

కొన్ని వృత్తిగేయాల్లో వనితనం గురించిన ప్రసక్తి కనిపిస్తుంది. ఒక మేదరి అమ్మాయి అల్లిక పనిని ఎంత చక్కగా చేస్తుందో ఈ క్రింది గీతంలో ఉంది.

మేదారి కూతూరు మేలంపు రాలురా
కూసోని అల్లెరా కూరాకు జిబ్బిరా
పండుకో నల్లెరా పట్టుమంచామురా చందమామా - సై
నిలబడుకో నల్లెరా నీలంపు దాగిరి
వంగోని అల్లెరా వడ్ల జల్లిడిరా
పండుకో నల్లెరా పట్టుమంచామురా చందమామా - సై
(తాయమ్మ, రామాపురం, చింతామణి తాలూకా, కోలారుజిల్లా)

పనిపాటల్లో చివరిగా గృహసంబంధమైన తిరుగలి పాటల్ని, రోకటి పాటల్ని చెప్పాల్సివుంది. విసరురాతి పాటలనే పేరుతో తిరుగలి పాటలు రాయల సీమలో ఎక్కువగా ప్రచారంలో ఉన్నాయి. ఇవి మామూలుగా ద్విపదచ్ఛాయలో నడుస్తాయి. సామాన్యంగా ఈ గేయాలు పదిపదిహేను పాదాలు కలిగి వుంటాయి. వీటిలో ఆడవారి అనుభవాలు అణిగివుంటాయి. వారి సుఖదుఃఖాలు, మమతలు, మనువులు, అనుబంధాలు, ఆచారాలు, విసరురాయి ధ్వనితో పాటు గీతంలో చోటు చేసుకుంటాయి.

రోకటి పాటలు నన్నెచోడుని కాలంనుంచి వున్నట్లుగా ఆధారాలున్నాయి. తిరుగలి పాటల్లో హ్రస్వాలు దీర్ఘాలవుతాయి; రోకటి పాటల్లో దీర్ఘాలు హ్రస్వాలవుతాయి. రోకటి పాట తెలిసిన వడుచు దంచడానికి సిద్ధమయిందంటే కష్టమైన పనికూడా సులువవుతుంది. అప్పుడు-

దంపు దంపని యేరు అది యెంత దంపు
ధాన్యరాశుల మీద చెయ్యేసినట్లు
వంట వంటని యేరు అది యెంత వంట
వదినెతో మరదళ్ళు వాదాడినట్లు —

అని ఆడుతూ పాడుతూ ఆ అతివ పని ముగిస్తుంది, అయితే

ఈ యేలా ఈ వడ్లు దంగవు గామోలూ
ఏలూరు సంతాకు ఎల్లను గామోలు....

అనుకునే అనుమానప్పురుగులూ అనేకులుంటారు.

చిన్నకోట పెద్దన రోకటి పాటలు తరువోజ లయలో ఉంటాయన్నాడు. తరువోజకు తెలుగులో వెయ్యి సంవత్సరాలకు పైబడ్డ చరిత్ర వుంది. అందువల్ల రోకటిపాటలకు కూడా అంత పాత చరిత్రే వుందనుకుంటే తప్పుకాదు, విసరు రాతి పాటలకు, రోకటి పాటలకు ఉండే భేదాన్ని 'కృష్ణశ్రీ' ఈ విధంగా వివరించారు. "విసురురాతి పాటలు సోదరుని అభిమానమూ, పొడుపు కథ వంటి సమస్యా, పుట్టింటి అందమూ, ప్రేయసి పరివేదనమూ వంటి అనుభవ బీజముల చుట్టున్నూ అల్లిన అందపుగూళ్ళు.... రోకటితో దంపుతున్న ఆయాస

ములో కల్పన సాగడానికి అవకాశము తక్కువ. తల్లియైన తరువోజను బట్టి నాలుగు పాదాలకూ, ద్విపద ప్రభావాన్ని బట్టి రెండు పాదాలకూ పెరుగుతుంది రచన'' ('కృష్ణశ్రీ', పల్లెపదాలు : 46).

మొత్తం మీద పనిపాటలు నిజమైన జానపదగేయాలకు దగ్గవి. పనిలోని కష్టాన్ని మరపింపజేస్తూ, పని పాటలకు సహజమైన సంబంధముందని నిరూపించేవి పనిపాటలు. ఈ విధంగా ఇవి ప్రయోజనాత్మక గీతాలని చెప్పవచ్చు.

## పారమార్థిక గేయాలు

ఈశ్వరాజ్ఞ లేనిదే చీమయినా కుట్టదనే బలమైన నమ్మకం జానపదుల కుంది. అందుకే వారు దేవుణ్ణిస్తుతిస్తారు, పూజిస్తారు. మెట్టవేదాంతమైనా సరే మాట్లాడుతారు. పరమార్థ ప్రాప్తికి భక్తి-కర్మజ్ఞాన మార్గాలున్నాయని జానపదులు పుస్తకాల ద్వారా నేర్చుకోలేదు. మానవాతీత శక్తులను మంచిచేసు కోడానికి స్తుతించడం, కర్మకాండలను జరపడం, తత్వచింతన చేయడం ప్రాచీన కాలంలోనే ఉన్నాయి.[2]

పరమార్థమంటే అత్యుత్కృష్టమైన అర్థం. దీన్ని సాధించాలంటే భక్తి-కర్మ-జ్ఞాన మార్గాలు ముఖ్యమైనవి. వీటిలో ఒక్కొక్క మతంవారు ఒక్కొక్కదానికి ప్రాధాన్యమిస్తారు. కాని జానపదులకు ఈ మూడూ కావాలి.

భక్తి కలిగి వుండటానికి అందరికీ అధికారముంది కాబట్టి వీరు వారనక అందరూ ఈ మార్గాన్ననుసరిస్తారు. ఈశ్వరుని పైన అత్యంత ప్రేమ కలిగి వుండడమే భక్తి అని సరళీకరించి చెప్పవచ్చు. జానపదుల జీవితంలో దేవతలకున్న స్థానం ఎన్నదగ్గది. దేవతాస్తుతి ద్వారా భక్తిని వెల్లడించుకోడం అత్యంత సరళమైన మార్గం. తెలుగులోని దేవతాస్తుతుల్ని శైవ సంబంధాలని, వైష్ణవ సంబంధాలని, ఇతర దేవతా సంబంధాలని స్థూలంగా విభజించవచ్చు.

శివునికి సంబంధించిన దేవతామూర్తుల్లో గణపతిని మొదట చెప్పుకోవాలి. కోలాటం వంటి వైనోదిక సందర్భాలలో కూడా గణపతి స్తుతి ప్రాధాన్యం వహిస్తున్నదంటే ఈ మూర్తిపైన సామాన్య జనుల్లో ఎంతభక్తి వుందో తెలుస్తుంది. గణనాధుడు అందరికీ నాధుడనే నమ్మకాన్ని ఈ క్రింది గీతంలో వ్యక్తం చేయటం జరిగింది :

గణనాధ విఘ్నుణ గణనాధ
గెజ్జమూర్తి మోవలింగ గణనాధ
తొడ్లమూతో నీరు తెచ్చి గణనాధ
తోరంపు బొజ్జాలు కడిగి గణనాధ ॥గ॥
అయ్యవార్లు నిన్నే గొల్వ గణనాధ
వాళ్ళ పంచాంగమున వుందువయ్యా గణనాధ
కొమిడి వాళ్ళు నిన్నే గొల్వ గణనాధ
వాళ్ళ తక్కిడందే వుందువయ్యా గణనాధ
కాపువారే నిన్ను గొల్వ గణనాధ
వాళ్ళ కాడిమేడి నుందువయ్యా గణనాధ
(గంగన్న, కొమ్మేపల్లి, వాయల్పాడు తా॥ చిత్తూరు జి॥)

భక్తి గేయాల్లో మేలుకొలుపులు, లాలులు, సంవాదాలు ఉన్నాయి. 'తెల్లవారవచ్చె దిక్కులు తెలుపొందె చక్కని నా తండ్రి, మేలుకో' అని పురహరుడైన ఈశ్వరుణ్ణి మేలుకొలిపి భక్తిని ఆ రూపంలో వెల్లడించుకుంటారు కొందరు.

ఘల్లు ఘల్లున పాద గజ్జెలందెలు మ్రోయ
కలహంస నడకల కలికి ఎక్కడికే
జడలోను గంగాను ధరించుకొన్నట్టి
మందలమేలు సాంబశివుని సన్నిధికే....

అనే సంవాదరూపంలో పార్వతీ పరమేశ్వరులను భక్తితో స్మరించుకోడం ఇంకోపద్ధతి.

పాముకుకూడా పాలుపోసి పెంచే అమాయకులైన జానపదులకు నాగన్న మీద వాత్సల్యం ఉండడంలో ఆశ్చర్యం లేదు. నాగపూజ ఆంధ్రుల పూజా విధానాలలో ప్రముఖ స్థానం ఆక్రమించడానికి కారణాలు వెతుకుతూ పోతే బోలెడంత చరిత్ర అవుతుంది.

పుట్టలో నాగన్న బూచి నాగన్న
ఎండలో పడుకోకు వెర్రినాగన్న
కలవారు ఇళ్ళలో గర్వంబు వారు
కాలాపి జల్లేరు కాళ్ళ దన్నేరు

('కృష్ణశ్రీ', పల్లెపదాలు : 141)

కలవారిమీద సామాన్యులకుండే అసహనాన్ని ఎక్కడో ఒకచోట ఏదో విధంగా వ్యక్తం చేస్తారన్న దానికి పైపదం ఒక ఉదాహరణ. కలవారు పాముకంటె విషం ఎక్కువుండే వారని బహుశా ఇదొక సూచన కావచ్చు. 'వాళ్ల ఎంగిళ్ల వేసి భంగపుస్తార'ని కూడా ఈ పాటలో జానపద స్త్రీలు హెచ్చరించారు.

విష్ణువు ఎత్తిన పది అవతారాలలో రామ, కృష్ణావతారాలు జానపదులకు అత్యంత ప్రీతి కరమైనవి. రాముడంత ఇష్టమైన తండ్రి, సీతవంటి చల్లని తల్లి తెలుగు వారికి మరెవరూ లేరు. సీతమ్మ పేరు చెప్పగానే తెలుగుపడుచుల ఒళ్ళు పులకరిస్తుంది, భక్తితో పరవశిస్తుంది. సీతమ్మ పేరుతో మేలుకొలుపు పాడితే అదొక తృప్తి తెలుగు ఆడపడుచుకు. క్రింది పాటలో జానపదులకు సహజమైన నిసర్గ సుందర భావాలు గుసగుసలాడుతాయి.

అమ్మా సీతమ్మా మా తల్లి ముద్దుల గుమ్మ
లేవె బంగరు బొమ్మ లేవమ్మా....
అత్త మామ మరదులు తోడికోడళ్ళు
అపుడె లేచుచున్నారు లేవమ్మా
అదియేమె మాయమ్మ అలసి నిద్రించేవు
అత్తవారిల్లిది లేవమ్మా–తెల్లవారవచ్చెనూ.

(శారదాంబ, నెల్లూరు)

ముఖ్యంగా చివరి రెండు పాదాలలో తెలుగువారి సంస్కృతి కుటుంబ మర్యాద రూపంగా తొంగిచూస్తున్నది.

మేలు కొలుపులలో, లాలి పాటలలో, మంగళహారతులలో విష్ణు స్వరూపాలను ధ్యానించుకొని భక్తి మార్గాన్ని అనుసరిస్తారు జానపదులు. ఈ క్రిందిది అలాంటి ప్రసిద్ధభక్తి గీతాలలో ఒకటి.

కేశవయని నిన్ను వాసిగ భక్తులు
పర్ణించుచున్నారు మేలుకో
వాసవ వందిత వసుదేవ నందన
వైకుంఠ వాసుడ మేలుకో — మేలుకో

నారాయణ నిన్ను నమ్మిన భక్తులు
కరుణ బ్రోవ వేగ మేలుకో
శరణన్న రక్షణ బిరుదు నీకున్నది
శశిధర సన్నుత మేలుకో — మేలుకో

(సుశీలమ్మ, నెల్లూరు)

'నోరు నొవ్వంగ నొక్కసారి గోవిందయని పరమార్థమున భజన చేయని వారుంటే నేమి పోతేనేమి?, అని జానపదులు ప్రగాఢమైన భక్తితో తమ నమ్మకాన్ని వెలుపరిస్తారు.

శివుణ్ణి, విష్ణువునూ, వారికి సంబంధించిన వారినే కాక శైవ వైష్ణవేతర దేవతాస్వరూపాలనూ అంతే ప్రగాఢ విశ్వాసంతో స్తుతిస్తారు జానపదులు. కాలేషామస్తాను కూడా వారికి ఆరాధ్యదైవమే. నెల్లూరు దగ్గర కనుమూరు అనే గ్రామముంది. గాలిదయ్యాలచేత పీడింప బడే వాళ్ళను మస్తాను తప్పక బాగుచేస్తాడని పలువురి నమ్మకం. ఇంద్రకంటి సూర్యకాంతం గారు 'కాలేషామస్తాన్ దేవుని కీర్తనలు' రచించారు. ఇటువంటి రచనలే కాక జానపదుల్లోనే పుట్టి ప్రచారమైన పాటలుకూడా కొన్నివున్నాయి.

వేదాంతులు కర్మమార్గాన్ని నిరసించినా వేదాదులన్నీ కర్మలకు కూడా ప్రాధాన్యమిచ్చాయి. యజుర్వేదం యజ్ఞాది కర్మలను గూర్చిచెప్తున్నది. అయితే యజ్ఞయాగాదులు సామాన్య జనుల కందుబాటులో ఉండేవికావు. వ్రతాలు, నోములు, జాతరలు మొదలైనవి కర్మ సంబంధమైన జానపద గేయాల కాల

పరమార్థ ప్రాప్తికి అనుసరించే మార్గాలలో జ్ఞానమార్గం విశిష్టమైందని పెద్దలు చెప్తారు. వేదాంత గేయాలకే తత్వాలని పేరు. జానపదులకు ఉపనిషత్తులు, దర్శనాలు, తాత్వికశ్లోకాలు తెలియవు. అక్షరబద్ధమైన శిష్టవేదాంత సాహిత్యం పండితులకు మాత్రమే వేద్యమై వుండగా వాగ్రూపమైన జానపద తత్వాలు ఆబాలగోపాలమూ ఇంపుగొల్పుతాయి. జానపద తత్వాలలో అద్వైతంతోబాటు రాజయోగం, అచలవేదాంతం, కులమతాదుల నిరసన, అహింస మొదలైనవికూడా ప్రతిపాదింపబడివుంటాయి. ప్రజల్లో ప్రచారంలో ఉండే తత్వాలలో 'సీతపాట' 'నారాయణ శతకము' 'రామరామ శతకము' 'వచనకాల జ్ఞానము' 'ఆత్మబోధామృత తత్త్వము' 'కలిప్రమాణ తత్వకీర్తనలు' 'కాల జ్ఞాన తత్వములు' 'తారకామృతసారము' మొదలైనవి ముద్రిత గ్రంథరూపంలో ఉన్నాయి. వీటిలో కొన్ని శిష్టుల రచనలు కూడా చేరి వున్నాయి. ఏగంటి, ఎడ్లరామదాసు, నారాయణదాసు. హరిదాసు, పిడుపర్తివారు, చిలుకపాటివారు మొదలైన వారి రచనలు జానపదులకు కూడా చిరపరిచితాలు. వీరబ్రహ్మంగారి కాలజ్ఞాన తత్వాలకు ఆంధ్రదేశంలో మంచి ప్రచారంఉంది. ఈ తత్వాలు బ్రహ్మంగారితోనే పుట్టక పోయినా తత్వప్రచారంలో ఆయన అనుసరించిన పద్ధతి అనేకుల్ని ఆకర్షించింది. తిత్తితత్వాలు అన్నవికూడా తెలుగుదేశంలో ప్రచారంలో ఉన్నాయి. ఒక తిత్తినిండా గాలి ఉంటుంది. సంగీతపు గొట్టం గుండా గాలివచ్చేటప్పుడు మధురశబ్దం వినిపిస్తుంది· తిత్తిలో గాలి ఒత్తిడి తగ్గగానే మళ్ళీ గాలి ఊది పాట ఎత్తుకుంటారు.

భక్తి-కర్మ—జ్ఞానమార్గాలలో వికసించిన ఈ పారమార్థికచింతన మనిషిలో ఎప్పుడు ఉదయించిందో చెప్పలేము. మతమూ, భగవంతునిగూర్చిన నమ్మకాలూ సుమారు 13,500 సంవత్సరాల పూర్వమే ప్రారంభమయ్యాయని మానవశాస్త్రజ్ఞులు చెప్తారు. కాని మానవాతీత శక్తులపై నమ్మకం ఇంకా చాలా ముందుగానే ప్రారంభమై వుండాలి.

### బాంధవ్య గీతాలు

గృహజీవనంలో వివిధవ్యక్తుల మధ్య బాంధవ్యాలకు అనేక జానపద గేయాలు అద్దంపట్టాయి. ఇవి 'స్త్రీలపాటలు' అనే పేరుతో ప్రసిద్ధమయ్యాయి. అమ్మ—కూతురు, అత్త—కోడలు, వదిన—మరదలు, అన్నాచెల్లెళ్లు మొదలైన

బాంధవ్యాలలో భాగమైన జానపదుల అలవాట్లు, అభిరుచులు, భావనలు నిం డిన భావగీతాలు ఇవి. వీటినే కౌటుంబికగీతాలని కూడా పిలువవచ్చు.

బాంధవ్యగీతాలలో మాతృమూర్తికి సంబంధించిన వాటిని మొదట పేర్కొనాలి. ప్రపంచంలో ఏ సమాజంలోనైనాసరే తల్లికొక ప్రత్యేకస్థాన ముంది. బిడ్డల తల్లికి ఉండే గౌరవం గొడ్రాలికిలేదు. స్త్రీలు తమ కొక్కరికే కాక అందరికీ బిడ్డలు కలగాలని కోరుకుంటారు. ఆస్ట్రేలియాలో ఆదిమజాతు లకు చెందిన ఒక అవ్వ ఇలా అంటున్నది.

Give to me, baby I Give to her baby,
Give to him, baby I Give to one, baby,
Give to all, baby' (C.M. Bowra 1962 : 169)

పుట్టిల్లంటే స్త్రీకి ఎనలేని అభిమానం. తెలుగువాళ్ళలో కూతురిని అత్త వారింటికి పంపడం సంప్రదాయం. పుట్టింటికిపోవాలంటే ఆతివలకాళ్ళురథాలై నడుస్తాయి, చేతులుయ్యాల చేరులై ఊగుతాయి.

కాశీదా కెడ మంటె కదలవే కాళ్ళు
ఢిల్లి కెడదామంటె తిరగదే మనసు
నారాచ పుట్టింటి కెడదాము అంటె
నా కాళ్ళు పన్నిన్న రథములై నడచు
నా చేతు లుయ్యాల చేరులై యూగు

చివరిపాదం హృదయాన్ని కదిలిస్తుంది. ఉయ్యాల చేరుల్లాగా చేతులూగు తాయని ఒకతల్లి ఉపమానం చెప్పడం అత్యంత సమంజసంగా ఉంది.

సోదరుడంటే స్త్రీకి అత్యంత అభిమానం. అన్నతో చెల్లెలు మనసు విప్పి తన బాధలు చెప్పకుంటుంది. ఆమె దృష్టిలో అబ్బాయి మేనమామలు 'కందికాయలవంటి కనుబొమ్మలవారు, మిరపకాయలవంటి మీసాలవారు' తల్లిని తలచుకున్నా, సోదరునికి కన్నీటిగాధ వినిపించినా, తమ్ముడిపైన వాత్సల్యాన్ని వెల్లడించినా ఇవన్నీ ఆయా సందర్భాలలో పాడేవికావు. ఇవి ఏ విసురురాయి పాటలో, రోకటి పాటలో అయిఉంటాయి. ప్రతిమనిషికీ ఏదో బాధ ఉండనే

ఉంటుంది. దాన్ని ఇతరులకు చెప్పుకుంటేకాని ఉపశమనం కలగదు. చెప్పుకో దానికిఆత్మీయులెవరూ దగ్గరలేకుంటే తిరుగలిరాయి, రోలు -రోకలే శ్రోతలు. తమ హృదయాలలో ఏ మూలమూలో అవ్యక్తంగాపడిఉండే భావాలకొకరూపం కల్పించుకొని, వాటిని వెలిపరచడానికి జానపదులు కల్పించుకొన్న సాధనమే జానపదగేయం. బాంధవ్యగీతాలు ఈ విధమైన బాధలగాధల్ని భావగీతాల రూపంలో తెలియజెస్తాయి.

ఈ బాంధవ్యాలల్లో చేదు నిజాలను గీత రూపంలో వ్యక్తం చేసేది అత్త కోడళ్ళ బాంధవ్యం. మన సంస్కృతికి ఇదొక మాయని మచ్చ. అందరు అలాంటివారే కాకున్నా 'అత్తలేని కోడలుత్తమురాలని, కోడలులేనత్త గుణ వంతురాలని' చెప్పడం వాడుకయిపోయింది. కుటుంబంలో ఏ కష్టం వచ్చినా దాన్ని గురించి నిజమైన మథన స్త్రీకే ఎక్కువగా ఉంటుంది. ఇలాంటి వేద నలకు హృదయాన్ని కదిలించే కావ్యరూపాన్నివ్వడం కొన్ని గేయాలలో కని పిస్తుంది. తెలంగాణా గేయంగా రామరాజుగారిచ్చిన ఒకగేయం చివర భావాలు నిరుపమానంగా ఉన్నాయి,

మానన్న గానైతి మంచె వేతూరు
చెట్టన్న గానైతి చెలగి వేతూరు
ఆకన్న గానైతి మేకలారగించు
కాయన్న గానైతి కాకులారగించు
పండన్న కానైతి పక్షులారగించు
బలుడు మాతండ్రి పాలు బిండంగ
బంగారు చెంబుతో ధారగానైతి
సిరిదేవి మాయమ్మ చల్లచేయంగ
చిల్లిపోయి కవ్వాన చితుపగానైతి.

(బి. రామరాజు 1958:99)

వేదనవల్ల కలిగిన వైరాగ్యానికిది పరాకాష్ఠ. ఇటువంటి గేయాలు ప్రాచీన కవిత్వంలో పరమోత్కృష్టాలని మనం చెప్పుకునే ఏ పద్యానికీ తీసిపోవు.

కుటుంబ జీవనంలో వివిధ బాంధవ్యాలను తెలిపే ఈ పాటలు మన నిత్య జీవితంలోని వెలుగునీడలకు అద్దం పడతాయి. గృహజీవనం మనం ఏర్పరచుకున్న వ్యవస్థ. దీనిలో ఎన్నో కష్టాలున్నాయి. సుఖాలున్నాయి. వీటిని అత్యంత సహజంగా గీత రూపంలో చూపిస్తాయీ గీతాలు.

## పిల్లల పాటలు

పిల్లలూ గృహజీవనంలో భాగమే. అయినా పిల్లల పాటలకుండే ప్రత్యేకతను బట్టి వాటిని విశిష్టశాఖగా పరిగణించ వలసి ఉంటుంది. ఆదిమమానవుని భాష మన భాషకంటె ఎక్కువ లయబద్ధంగా, పాటకు దగ్గరగా ఉండేదని విజ్ఞులు చెప్తారు. అల్లే పసిపిల్లల మాటల్లోనూ ఏదో తెలియని మాధుర్యం ఉంటుంది.

పిల్లల పాటలకు విశ్వజనీనత ఉంది. పసిపిల్లల జీవితం కవిత్వమయం, సుమధురగీతమయం, పిల్లల పాటలలో పెద్దవాళ్ళు పిల్లలకోసం వ్రాసినవి, పిల్లలు తామే అల్లుకున్నవి ఉన్నాయి. పెద్దలు పిల్లలకోసం వ్రాసిన పాటలలో వైద్యరహస్యాలు కూడా ఉంటాయి. వీటిలో మళ్ళీ పెద్దలే పాడేవి కొన్ని. పిల్లలు పాడేవి కొన్ని ఉంటాయి.

ఈ అన్ని బాలగీతాల ముఖ్యలక్షణం వాటి లయ. అక్షరాలు, పదాలు పునరావృత్తి కావడం వాటిలో కనిపించే గుణం. ఈ పాటల్లో కొన్ని సంవాద రూపంలో కనిపిస్తాయి. హాస్యప్రవృత్తి కొన్నిట్లో కనిపిస్తుంది. పిల్లలకోసం ప్రత్యేకంగా వెలువడిన లాలలు, జోలలు పేరేదైనా ప్రపంచమంతా వ్యాపించి ఉన్నాయి. వీటిలో అంత్యప్రాసలకు, పల్లవికి ఎక్కువ ప్రాధాన్యం ఉంటుంది. అర్థరహితమైన శబ్దాలు మాత్రమే ఉండే పాటలు కొన్ని ఉన్నాయి. ఇటువంటి 'ప్రావక్రీడలు' పిల్లల్లో అనతికాలంలోనే ప్రచారం పొందుతాయి. కొన్ని పాటలు పొడుపు కథలరూపంలో ఉంటాయి. ఇవి పిల్లల బుద్ధిశక్తిని ప్రేరేపించి మానసికమైన కసరత్తుగా ఉపయోగిస్తాయి. ఎగతాళి పాటలు కూడా బాల గేయాలలో ఒకభాగమే. పశుపక్ష్యాదుల చేత ఆకర్షితులైన పిల్లలు పాడేవి కొన్ని క్రీడాగేయాలు పిల్లల ఆటలకు నేపథ్యాన్నిస్తాయి.

తెలుగులో బాలగేయాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. వీటిలో అపరిమిత వైవిధ్యం ఉంది. పసికూనలకు అర్థంగాని లాలిపదాల నుంచి, పెరిగిపెద్దయి పాడే ఆటపాటల (play songs) వరకు అన్నీ ఉన్నాయి. 'అమ్మణ్ణి కన్నులు తమ్మి పువ్వుల్లు । తమ్మి పువ్వులలోని కమ్మతేనెల్లు....' వంటివి ప్రయత్న పూర్వక రచనలన్నది వాటిని చూడగానే తెలుస్తుంది. పాట ఏ విధంగా సాగినా పసిబిడ్డకేమీ అర్థంకాదు. బిడ్డకు తెలిసేది కేవలం పల్లవి మాత్రమే. ఈ పాటలలో పల్లవి 'హాయి' 'హాయిగా'గా బిడ్డను నిద్రబుచ్చడానికి పనికి వస్తుంది.

హాయీ....చిచ్చిళుళుళువ హాయీ
హాయి హాయి హాయి ఆపదలుగాయీ
చిన్నివాళ్ళనుగాయి శ్రీ వెంకటేశా-హాయ్
హాయమ్మ బాయమ్మ అక్క జెల్లెళ్ళు
తొలి ఒక్క జన్మాన తోడి కోడళ్ళు ॥హాయి॥

(సుశీలమ్మ, నెల్లూరు)

పసిబిడ్డకు ఉగ్గుపాలు పోసేటప్పటి నుంచి నిద్రపుచ్చే వరకు పాటలు పాడుతూ ఉండడం తల్లికలవాటు. ఉగ్గుపాలైనా జీర్ణమవుతాయో లేదో అని తల్లికి భయం.

జీర్ణం జీర్ణం వాతాపిజీర్ణం
గుర్రం తిన్న గుగ్గిళ్ళు జీర్ణమై
ఏనుగుతిన్న వెలక్కాయ జీర్ణమై
భీముడు తిన్న పిండి వంటలు జీర్ణమై...

పోవాలని తల్లి ఆరాట పడుతుంది. పిల్లవాడికి కొద్దికొద్దిగా మారాం చేసే వయసు వచ్చి. మొండికెత్తే మొనగాడైతే చందమామను చూపిస్తూ—

"చందమామరావె – జాబిల్లిరావె
కొండెక్కిరావె – కోటివేలు తేవె
పరుగెత్తిరావె – పాలుపెరుగు తేవె
అన్నిటిని తేవె – – అబ్బాయికీవె" అని పాడుతారు.

బాలబాలికలే పాడే 'కాళ్ళాగజ్జి కంకాళమ్మా', 'ఒప్పులకుప్పా వయ్యారి భామా' 'చెమ్మచెక్క చేరడేసిమొగ్గా' మొదలైన పాటలు ఆంధ్రదేశమంతటా ప్రచారంలో ఉన్నాయి. వీటిలో వైద్య రహస్యాలు ఇమిడి ఉన్నాయి. ఈ రహస్యాలను శోధించి వెలికి తీసి బి. రామరాజుగారు, నేదునూరి గంగాధరం గారు తమ వ్యాసాలలో, పుస్తకాలలో ప్రకటించారు. ఇవన్నీ ప్రయత్నపూర్వకంగా వ్రాసిన పాటలు.

శిశుకల్పితాలైన శిశుప్రాసలూ లేక పోలేదు. ఇవే నిజమైన పిల్లల పాటలు. పసివారి పద నిర్మాణశక్తిని, పరిశీలనా దృష్టిని, ప్రాసకల్పనాశక్తిని పెంపొందిస్తాయి శిశుప్రాసలు (Children's rhymes). ప్రశ్నోత్తరాల రూపంలో ముక్తపదగ్రస్తాలను కల్పించే శక్తికూడా పిల్లలకుంది. వీటిచేత జ్ఞాపకశక్తి, పదయుక్తి పెంపొందుతుంది. ఇలాంటి వాటిని పాటలని చెప్పలేం కాని అనుప్రాసలనో, శిశుప్రాసలనో చెప్పవచ్చు. పాటకు జవమయిన ఒక విధమైన లయ వీటిలోనూ ఉంటుంది.

| | | |
|---|---|---|
| పిట్టమ్మ పిట్ట | ఏమి వనము | పొగ మంచు |
| ఏమి పిట్ట | పూల వనము | ఏమి పొగ |
| చిలక పిట్ట | ఏమి పూలు | దీపం పొగ |
| ఏమి చిలక | జాజి పూలు | ఏమి దీపం |
| తెలుపు చిలక | ఏమి జాజి | గోడ దీపం |
| ఏమి తెలుపు | గుత్తి జాజి | ఏమి గోడ |
| హంస తెలుపు | ఏమి గుత్తి | కోటగోడ |
| ఏమి హంస | కవ్వం గుత్తి | ఏమి కోట |
| రాజ హంస | ఏమి కవ్వం | తులసి కోట |
| ఏమి రాజు | చల్ల కవ్వం | ఏమి తులసి |
| మృగరాజు | ఏమి చల్ల | రామ తులసి |
| ఏమి మృగము | మంచు చల్ల | ఏమి రామ |
| వన మృగము | ఏమి మంచు | ఆత్మారామ. |

(త్రివేణి:11)

మెదడుకు పదను పెట్టే పొడుపుకథలు కూడా చాలా వరకు గేయ రూపంలో ఉంటాయి. ఇవి కథారూపంలో, కథాగేయ రూపంలో, చివరికి చిత్రరూపంలో కూడా కనిపించడం వల్ల వీటిని ప్రత్యేకశాఖగా పరిగణించవలసి ఉంది. నిరక్షరాస్యుల విద్యాభ్యాసంలో ఒక భాగమే పొడుపుకథ. జానపదులు తమ ప్రతిభా సామర్థ్యాలను పెంపొందించుకోడానికి కల్పించుకున్న ఒక సాధనం ఈ పొడుపు కథ. దీనిని గురించి ప్రత్యేకంగా చెప్పడం జరుగుతుంది.

బాలగేయాలు మేధాశక్తి ఇంకా పెంపొందని పసికూనల జీవితంలో భాగమైనవైనా వాటి వైశిష్ట్యం వాటికుండనే ఉంది. దేవేంద్ర సత్యార్థిగారి ఈ క్రింది వాక్యాలు గమనించ దగ్గవి: "భారతీయ శిశువుల ప్రాసలు, గీతాలుఎన్నో జాతీయ ప్రభంజనాలకు తట్టుకొని నిలబడ్డాయి. దురాక్రమకారులు దేశసంపత్తును దోచుకొని వెళ్ళారు. కాని భారతదేశంలోని చిన్ని పాపాయిల ప్రాసల్ని గీతాల్ని ఎవరు ఎత్తుకొని పోగలిగారు? మహా విపత్తులకు ప్రజలు బలి అయ్యారు. కాని ఎవ్వరూ పిల్లల దేశీయక్రీడల్ని, ఇంటింటి గీతాలను నాశనం చెయ్యలేక పోయారు" (మాడర్న్ రివ్యూ, సం. 60, పు. 394—తెలుగు అనువాదం).

వేడుక పాటలు

కర్మప్రధానాలైన వివాహకార్యాలు, పండుగలు, వ్రతాలు, నోములు మొదలైనవి ఈనాడు వేడుకలైపోయాయి. నలుగు పెట్టడం, తలంబ్రాలు పోయడం, బువ్వపు బంతి మొదలైనవి సంతోష గీతాలు. మత సంబంధమైన కర్మకాండల బంధాలను వదిలించుకున్న మానవుడు పండుగలను, పబ్బాలను ఏర్పరచుకున్నాడు. కోలాటం మొదలైనవి వినోదప్రధానమైన కళలు. ఇవన్నీ వేడుకగా జరుపుకునేవి కాబట్టి వీటికి సంబంధించిన గీతాలన్నీ వేడుక పాటల కిందికి వస్తాయి.

పెళ్ళి సంబరాలు పెళ్ళి చూపులతోనే ప్రారంభమవుతాయి.

"పిలిపించు నీ సీత పిలుపు చూతాము
పిలుపేమి సూసేవు చిలుక పలుకుల్లా

పిలిపించు నీ సీత నడక చూతాము
నడకేమి సూసేవు అంస నడకల్లో
మీ సిరిబాల సీత ఉందని
మా అయోధ్య రామునికి అడగనొస్తి
మా సీత సిన్నాది యేమియ్యా లేదు
సీత కన్న సిన్నోడె అయోధ్య రాముడు.
(తాయమ్మ, రామాపురం, కోలారు జిల్లా)

జానపదులకు పెళ్ళికూతుళ్ళందరూ సీతలు. పెళ్ళి కొడుకులందరూ రాముళ్ళు. పెళ్ళి సంబరాలలో నలుగు ఒక ప్రధాన ఘట్టం. వారు వీరనక అన్ని కులాలలోను వినిపించే ఈ పాటలు అచ్చమైన జానపదగేయాలు. కోలారు జిల్లాలోని ఒక పల్లెపడుచు పాడిన ఈ క్రింది నలుగు పాటలో నలుగు పంపింది బురుడుగుంట గంగమ్మ అనే గ్రామదేవత.

కమ్మలు కడియాలు కస్తూరి బావిరీలు
నలుగూకు రావె సీతమ్మ

నీ పాలిటి దేవుడు ఏనుగోపాలసామి
నీ కంటిచ్చాయినోడె నిలిచి ఉండాడు
నలుగూకు రావె సీతమ్మ

అత్తారు పన్నీరు సిత్తారి గిన్నెలతో
ఏగ ఏగను రావె సీతమ్మ
నలుగూకు రావె సీతమ్మ

గుండూ పళ్ళెములోన గురుతాయె హో నలుగు
బురుడుగుంట గంగమ్మ అంపింది నలుగు
నలుగూకు రావె సీతమ్మ
(తాయమ్మ, రామాపురం, కోలారు జిల్లా)

తెలుగు వారి పెళ్ళిళ్ళలో తలంబ్రాలు సంస్కృతికి ప్రతిబింబంగా కని పిస్తాయి. 'పులపుల వానొచ్చె పులుమొగ్గ దోడిగె 'రవరవగాలిసరె రాలె మల్లెల్లు' అని తలంబ్రాలను మనోహరంగా వర్ణించే జానపదగేయాలున్నాయి. బువ్వపు బంతి కూడా గీతాలకు స్ఫూర్తి నిచ్చే ఒక రసవత్తర సన్నివేశం. 'విస్తర్లు వేశారు దోసెడేసి' అని, 'ముక్క బియ్యము వండిరి' అని, 'చెయ్యి కడిగిన జిడ్డేలేదు' అని వియ్యాలవారుఎత్తిపొడుస్తూవుంటే పిల్లనిచ్చినవారు తల వంచక తప్పదు. అయితే మగ పెళ్ళివారిని ఆట పట్టించడానికి వారికీ ఒక సమయం వస్తుంది. ఒక పళ్ళెంలో హారతి తీసుకొని ముఖ్యమైన వారందరి దగ్గరికి వచ్చి 'ఎంగిలి మంగలా(ళా)లు' పాడి డబ్బులు వసూలు చేస్తారు.

మంచివారు మామగారు మాఘస్నానం చేయబోతే
మాయదారి కుక్కవచ్చి మంచి మడుగు చేసిపోయె
చక్కని మామగారికి కుక్కమంగళం ॥
గంపెడు సొమ్ము పెట్టుకొని కుంపటిలాగ కూర్చొని
మొగుడు వస్తె లేవదమ్మ మొండికట్టె వదినగారు
చక్కని వదినగారికి కుక్కమంగళం ॥

చివరిగా ఒక తమాషా అప్పగింతల పాట. సామాన్యంగా అప్ప గింతల పాటలు వింటే కన్నీరు రాని వారుండరు. అవి వేడుక పాటలు కాదు ; కన్నీటి పాటలు. అయితే ఈ క్రిందిపాటలో ఒక 'మహాతల్లి' కూతురికిలా బోధిస్తున్నది.

అత్త మామలుగాని ఆడబిడ్డలుగాని
లేరమ్మ నీ దెంత పున్నెమోగాని
మగడు ఒక్కడు గాన మనసు కెక్కినయట్లు
మర్దించి నీ వశము చేసుకోవమ్మ.

(ఎల్లోరా 1961 : 75)

పెళ్ళి పాటల తర్వాత వేడుక పాటల్లో పేర్కొనదగినవి పండుగలు పబ్బాలు జరిపేటప్పుడు పాడే పాటలు. తెలుగు వారి వేడుకల్లో భోగి పళ్ళ

పోయడం, గొబ్బిళ్లు పెట్టడం, హోళి, దసరా మొదలైనవి ఉన్నాయి. ధను ర్మాసంలో రంగవల్లులు తీర్చి గొబ్బిళ్లు చేసి పిడకలు కొడతారు. గుమ్మడి పూలతో అలంకరిస్తారు. సంక్రాంతి ముందు ఆంధ్రదేశంలోని పలుప్రాంతా లలోపల్లెలు గొబ్బిపాటలతో మార్మోగుతుంటాయి. పాట విషయం ఎలావున్నా

గొబ్బియ్యళో గొబ్బియని పాడరమ్మా
గొబ్బియ్యళో —

తెలంగాణా ప్రాంతంలో బొడ్డెమ్మ, బ్రతుకమ్మ పండుగలకు సంబం ధించిన పాటలు విరివిగా దొరుకుతాయి. ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుంచి మహార్నవమి వరకు బ్రతుకమ్మ పండుగ. అంతకు ముందు తొమ్మిది దినాలు బొడ్డెమ్మ పండుగ. ఈ రెండు పండుగలను గురించి బి. రామరాజుగారు తమ 'జానపద గేయ సాహిత్యము'లో విపులంగా చర్చించారు.

హోళీ యావద్భారతంలోను ప్రఖ్యాతి గాంచింది. ఫాల్గుణ శుద్ధపౌర్ణమికి కాముని పున్నమ అనిపేరు. కొండవీటి రెడ్డి రాజులు ఈ ఉత్సవాన్ని చాలా వైభవంగా జరిపేవారు. భీమేశ్వర పురాణం, సింహాసన ద్వాత్రింశిక మొద లైన కావ్యాలలో ఈ ఉత్సవాన్ని గురించిన విపుల వర్ణనలున్నాయి. హోళీ లేక కాముని పండుగకు సంబంధించిన పాటల్లో 'హోలిహోలిర రంగహోలి హోలిర చెమ్మకేళి' అనే పల్లవి ఎక్కువగా వినబడుతుంది. హిందీలోని 'శ్యామ్ ఖేలేరె' హోళి అనే వాక్యానికి 'చెమ్మకేళిర హోళి' అపభ్రంశరూపమని బి. రామరాజుగారు గుర్తించారు. (1958 : 548)

కాముని పండుగ సమయంలో జాజర పాటలు కూడా వినిపిస్తాయి. నాచన సోమన వసంత విలాసమనే గ్రంథం నుంచి లక్షణ కర్తలొక జాజర పాట నుదాహరించారు.[7] భీమఖండంలో జాదుర పాటల ప్రసక్తి ఉంది. ఈ జాజర పాటలను కోలలు తట్టూ పాడుతారు. ఆ సమయంలో కస్తూరి, గంధపు పొడి, పుప్పొడి మొదలైన వాటిని చల్లుతారు. ఈ పొడికి జాజర అని పేరు, జాజర పాటలు శృంగార, హాస్య రస ప్రధానమై ఉంటాయి.

జాజిరి జాజిరి గాజుల పాప
జాజుల్ల గూచున్న సన్నపు చాప
చాపచుట్టరే సందారి కోట
కోట కోటకు రెండు కొమ్మల జగ్గాల్
జగ్గాలు బట్టుక పల్లెకు పోతె
అప్పుడే నా వొల్లు జల్లుమానె
జల్లుమన్న కాడ మల్లెల్లు రాలె
మల్లెల మాదేవి తోట్లో ఉన్నాది.
(కృష్ణశ్రీ, పల్లెపదాలు, 68)

అన్నదొక జాజర పాట.

భారతదేశంలోని అనేక ప్రదేశాలలో అత్యంత ప్రాచుర్యం పొందిన జానపదుల ఆట కోలాటం. పాట, పాట లయకు తగిన ఆట, ఆటకు తగిన సంగీతం, సంగీతంతో బాటు వినోదం ఈ కళలో ఇమిడి ఉన్నాయి. పాల్కురికి సోమనాథుని కాలంనుంచి కోలాటాన్ని గూర్చిన ఉల్లేఖనాలున్నాయి. దక్షిణ దేశంలోని అనేక దేవాలయాలలో కోలాట భంగిమలెన్నో కానవస్తాయి. అన్నమయ్య కీర్తనల్లో కోలాటకీర్తనలు అనేకం ఉన్నాయి. జాతరులు, పోతరాజు కొలువులు, గ్రామదేవతల పండుగలు, పరషలు, మహమ్మదీయుల ఉరుసులూ-ఇవేవీ లేకున్నా వెన్నెల రాత్రులలో ఉబుసుపోకకైనా కోలాటాలు వేస్తారు. కోలాటం జానపదులకు ఉత్తేజాన్ని ఉత్సాహాన్ని ఇస్తుంది. "దీనిలో పర్ణచలనమూ, వేష సామరస్యమూ, గమన సామరస్యమూ, మువ్వలమోత, కోలల లయ, రాగసరళీ, కంఠమేళ, కథా సౌందర్యమూ ఒక్కుమ్మడిగా ఏకమయి అలరిస్తవి" (కృష్ణశ్రీ, పల్లెపద్దాలు).

జానపదులకుండే సామాజిక ప్రజ్ఞ నాగరికుల కుండదు. ముఖ్యంగా పల్లెటూళ్ళలో అందరి మంచీ కావాలి. కోలాటం వేసినా పల్లెలోని పెద్దలందర్నీ పేరుపేరునా చెప్పుకుంటారు.

ఉయ్యాలో జంపాలో ఊరి పేరేమిరా
రామ రామ కోదండ రామా
ఉయ్యాలో జంపాలో ఊరు మేడికుర్తి
రామ రామ కోదండరామా
రచ్చాన ఉండే ఆరెడ్డి పేరేమిరా ॥రామ॥
రచ్చాన ఉండేటి రెడ్డి రాఘవరెడ్డి ॥రామ॥
ఆ రెడ్డీ భార్య పేరు చిలకా పేరేమిరా ॥రామ॥
ఆ రెడ్డీ భార్య పేరు సారస్వతమ్మరా ॥రామ॥
(ప్రకాష్. మేడికుర్తి, చిత్తూరు జిల్లా)

వలపు పాటలు

కోలాటం పాటలు చాలావరకు వలపు పాటలే. వీటిని శృంగార గేయా లని వ్యవహరిస్తుంటారు. ఇవి వలపును కలిగి ఉండేవేగాని, వలచే సమ యంలో లేక వలపును వ్యక్తంచేసే సమయంలో పాడేవికావు. ఇంతవరకు వివ రించిన పని పాటలు, వేడుక పాటలు మొదలైన వటిలో వలపు ప్రధానంగా ఉండే వాటినే వలపు పాటలుగా వ్యవహరించడం జరుగుతున్నది. ప్రాచీన మానవ సమాజంలో వలవు పాటలకు ప్రాధాన్యంలేదు. ఆనాటి జీవితంలో పనికి, పరమార్థానికి మాత్రమే ఎక్కువ ప్రాముఖ్యం కనిపిస్తుంది.

వేటాడే కాలం గడచి మనిషి వ్యవసాయాది ఆహార నిర్మాణ పద్ధ తుల్ని నిర్మించుకున్న సమాజాలలోనే మనకు ఎక్కువగా వలపు పాటలు విని పిస్తాయి. తెలుగు, కన్నడం మొదలైన నాగరక భాషలలో వలపు పాటలదే అగ్రస్థానం. ఈ పాటలను స్త్రీలకు సంబంధించినవి, పురుషులకు సంబంధిం చినవి, సంవాద రూపంలో ఉండేవి అని మూడు విధాలుగా విభజించవచ్చు. ప్రియురాలి మనోభావాలను అత్యంత మనోహరంగా చిత్రించే గీతాలలో 'చల్ మోహన రంగా' పాట ముఖ్యమైంది. దేవేంద్ర సత్యార్థిగారు దీన్ని అనువ దించి 'మీట్ మై పీపుల్' లో ముద్రించారు.

ఇంటికి కాటుకబెట్టి కడవ చంకాను బెట్టి
కళ్ళ నీళ్ళ కఢవ నిండెను గదరా
చల్ మోహన రంగా
కళ్ళ నీళ్ళ కడవ నిండెను గదరా

ఈ పాటలో ఇలాంటి గీతభాగాలు 55 ఉన్నాయి. జానపదుల వలపు పాటల్లో ఉదాత్త విరహ భావాలను మనోహరంగా చెప్పేవి అక్కడక్కడా కనిపిస్తాయి. రాయల సీమలో ప్రచారంలో ఉండే క్రింది కపిలి పదం మధుర ప్రణయ భావానికి మంచి ఉదాహరణ.

మానుమాను పువ్వుగాచె
మానుకింద రాసి పోసె
ఇప్పిమాను పువ్వుగాచె
ఇప్పుడిరిగె నా మనసు.

చెట్లు నిండుగా పూలుపూచే వసంతకాలమంతా ఒక విరహిణి ప్రియుని కోసం వేచి చూచింది. ఇప్పమాను వసంత కాలాంతంలో పూలుపూస్తుంది. అలా పూలుపూచిన మానుకంటబడగానే ఆ మానిని మనసు విరిగి పోయింది. సామాన్యమైన ఒక భావం అత్యంత సుందర కావ్యంగా ఎలా మారుతుందో చెప్పడానికి పై వలపు పాట తార్కాణ.

జారిణికి సభ్య సమాజంలో స్థానం లేదు కాని వలపు పాటలలో ముఖ్యమైన స్థానమే ఉంది. సభ్య సమాజంలో నిషిద్ధమైన వాటిని ఉపయోగించే స్వాతంత్ర్యాన్ని జానపద విజ్ఞానం ఇస్తుంది. కోలారు జిల్లాకు సంబంధించిన 'బోగం' పాట ఈ క్రిందిది.

నే చిన్న దాన్నిరా నెల్లూరు బోగం దాన్నిరా
కాల కురుసా దాన్నిరా కల్లూరు బోగం దాన్నిరా
నేను చిన్నా పాయమపుడు
చింతచెట్టు ఏసి వుంటే

చింత చెట్టు చిగురు కొచ్చె
చిన్నా బిడ్డ తల్లి నైతి
రాగి చెట్టు రచ్చ కొచ్చె
రాజులేలే పాయమాయె
(తాయమ్మ, రామాపురం, కోలారు జిల్లా).

జారిణికి సంబంధించిన పాటలున్నట్లే విటులకు సంబంధించిన పాటలు కూడా జానపద గేయాల్లో ఉన్నాయి. రంగూనుకు పోయిన ఒక వ్యక్తి ప్రియురాలికి వ్రాసిన ప్రేమగీతం 'సిరిసిరి మువ్వ పాట'గా రూపొందింది. ఆకు, వక్క, బియ్యం, బేడలు (పప్పులు) - అన్నీ ఇస్తానన్న ప్రేయసిని తలచుకుంటున్న ప్రియుడి ఈ క్రింది గీతంలో దర్శనమిస్తాడు.

బేవారి చిన్నది బంగారు కంటె వన్నెది
కంటికీ పిరిమైన దన్న కరణగల్లా చిన్నదీ
ఆకు ఇస్తానన్నది అది వక్క ఇస్తానన్నదీ
కూత తిరగని కోడిపుంజును కూరకిస్తానన్నది
బీము నిస్తానన్నది అది బేడలిస్తానన్నది
వండుకోను చేత కాకుంటే
వండి పెడతా నన్నది
(ప్రకాష్, మేడికుర్తి, వాయల్పాడు తా॥ చిత్తూరు జి॥)

వలపు గీతాలలో సంవాదాలు కూడా ప్రధానస్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. భార్యాభర్తల సంవాదం, ప్రియుడు — ప్రియురాలి మధ్య సంవాదం, మామా కోడళ్ళ సంవాదం మామూలుగా కనిపిస్తాయి. జానపదులకు ప్రియతములైన నాయికా నాయకులనేకులున్నారు. కొయ్యోడు—చిట్టెమ్మ, వెంకన్న-చంద్రమ్మ, నారాయణమ్మ — నాయుడుబావ మొదలైన వారికి తెలుగు వారిలో చాలా ప్రచారం ఉంది. వలపు పాటలను కొన్నిచోట్ల 'యాల పదా'లని పిలుస్తారు. "ఏలలు అన్నవి నిర్ణీత ఛందో నిర్మాణముగల పదములు, యౌవనాను భవ

మును సూచించే భావాలున్న పదములను ఇక్కడ ఏల పాటలంటున్నాము. అర్థముతో 'ఏలపాటలు' అన్నమాట వాడుకలో నున్నది'' అన్నారు కృష్ణశ్రీ (పల్లెపదాలు). ఈ క్రింది యాలపదంలో ప్రేయసీ ప్రియుల సరస సంభాషణ ఉంది.

ఆమె॥ వచ్చిపోర సిన్నగ వచ్చిపూల సొగసుగా
నా తొట్టు నువ్వు సూసి నవ్వొద్దురా
ఆనూరి సంతకు నువ్వురారా సిన్నగ
ఆకులకు వక్కలకు ఓ కాసు ఇచ్చిపో

అతను॥ అమ్మతోడు అప్పతోడు కాసులేదె లచ్చిమి

ఆమె॥ లేకుంటే పీడ పాయె లేసి పోర సిన్నగ
సున్నాన్కి ఓకాసు ఇచ్చి పోర సిన్నగ

అతను॥ అమ్మతోడు అప్పతోడు కాసులేదె లచ్చిమి

ఆమె॥ లేకుంటె పీడపాయె లేసి పోర సిన్నగ
పుంగనూరు సంతకి నీవు రార సిన్నగ
పూలకు ఓ కాసు ఇచ్చి పోర సిన్నగ

అతను॥ అమ్మతోడు అప్పతోడు కాసులేదె లచ్చిమి.

(చెన్న బసవయ్య. పుంగనూరు, చిత్తూరు జిల్లా)

వలపు పాటలు సంఖ్యలో అపరిమితంగా ఉన్నా ప్రత్యేక సంపుటాలు వెలువడనేలేదు. 'త్రివేణి', 'తెలంగాణా పల్లె పాటలు', 'పల్లెపదాలు' మొదలైన సంకలనాలలో కొన్ని శృంగార గేయాలున్నాయి. వీటి సేకరణ, ప్రకటణ, పరిశోధన ఇంకా బాగా జరగాల్సి ఉంది.

### హాస్యగీతాలు

నవ్వుపుట్టించేవి, నవ్వులాట కోసం పాడేవి హాస్య గీతాలు. హాస్యం విశ్వవ్యాపక మైంది. నవ్వు—ఏడుపు మనిషి జీవితానికి రెండు ముఖాలు. హొరేశ్

వాల్‌పోల్ అన్నట్లు "ఆలోచించే మనిషికి జీవితం హాస్యరూపకం, స్పందించే మనిషికి జీవితం విషాద రూపకం." వికృతాకారవాగ్వేష చేష్టాదుల వల్ల హాస్యం ఉద్భవిస్తుందని ఆలంకారికులన్నారు. కాబట్టి హాస్యం వేషగతం, చేష్టాగతం, భాషాగతం కావచ్చునని చెప్పవచ్చు. వేషాలతో చేష్టలతో నవ్వించడం సులభం. కాని భాషాగత మైన చమత్కారం చూపించడం కష్టం. హాస్యం కోసమే వెలువడిన గేయాలు తక్కువే అని చెప్పాలి. పని పాటలలో, వేడుక పాటలలో, బాంధవ్యగీతాలలో అనేక సందర్భాలలో హాస్యం కనిపిస్తుంది.

పనిలోని కష్టాన్ని మరిపింప జేసే గుణం హాస్యానికుండడం వల్ల కొన్ని పని పాటలు నవ్వుల బుగ్గలై ఉంటాయి. ఏ పని చేయడానికీ ఇష్టం లేని వారు 'నీళ్ళకుబోరా నిమ్మఅంటే నిద్రవస్తదే అమ్మ' అంటారు. 'కట్టెలకు బోరాకమ్మ అంటే కడుపు నొప్పి మాయమ్మ' అంటారు. 'బొచ్చె దెచ్చుకో బొమ్మ అంటే అట్ల జెప్పు మాయమ్మ' అని మనకు నవ్వు తెప్పిస్తారు. కొందరి చేష్టలు హాస్యరస జనకాలుగా ఉంటాయి. అవి వికృతంగానే ఉండాలని లేదు. పల్లీయుల అమాయక వేషభాషలు కూడా ఒక్కొక్కసారి నవ్వు పుట్టించేవిగా ఉండవచ్చు. కుక్కలకు కూడా అలుసైన కాదరయ్య అనే వ్యక్తి చిత్రణలో సున్నితమైన హాస్యాన్ని అందించేది ఈ క్రింది పాట.

పొద్దున్నె లేచినాడు కాదరయ్య<br>
వాడు కాళ్ళు మొకము కడిగినాడు ॥కా॥<br>
కాళ్ళు మొకము కడిగినాడు కాదరయ్య<br>
వాడు పంగనామం దిద్దినాడె కాదరయ్య ॥పంగ॥<br>
వాణ్ణి పల్లి కుక్కలు చూసినాయి కాదరయ్య ॥పల్లి॥<br>
బవ్వ బవ్వ మన్నాయి కాదరయ్య ॥బవ్వ॥<br>
వాడు చేనిలోకి పారినాడు కాదరయ్య ॥చేని॥<br>
వాణ్ణి చేని మనిషి చూసినాడు కాదరయ్య ॥చేని॥<br>
వాణ్ణి కూతపెట్టి అరిసినాడు కాదరయ్య.

(త్రివేణి :227)

పారమార్థిక గేయాలలో కూడా ఒక్కొక్కసారి హాస్యం తొంగి చూస్తుంటుంది. ఒక తత్వంలో-

వీర బ్రహ్మంగారు వీధెమ్మటొస్తారు
వీధీది కిద్దరిని కంటారయా

అని వక్రోక్తి కనిపిస్తుంది. చాలావరకు నవ్వు పుట్టించేవిగా ఉంటాయి. వియ్యపురాలు పళ్లుతోమదు, పూలు ముడవదు, బెనారసు చీర కట్టదు, ఆకు వెయ్యదు. ఆమె ఎంత మంచిదయినా ఆడపెళ్ళివారి దృష్టిలో వియ్యపురాలి రూపచిత్రణ ఈ క్రింది విధంగానే ఉంటుంది.

వెండి పుల్ల వెండి ఆకు విడిదికి పంపితిమి
పారపళ్ళ వియ్యపురాలు పళ్ళే తోమదుగా

సన్న జాజులు మల్లె మొగ్గలు విడిదికి పంపితిమి
బట్టతల వియ్యపురాలు పూలే ముడవదుగా

బనారసు చీర రవిక విడిదికి పంపితిమి
అబ్బబ్బ ఇవి అన్నీ మాకు అలవాటు లేదనిరి

హారతీ కర్పూరపు దండలు విడిదికి పంపితిమి
కొండమెడ వియ్యపురాలు దండే వెయ్యదుగా

తమల పాకులు వక్కాలు మేము విడిదికి పంపితిమి
కుక్క పళ్ళ వియ్యపురాలు ఆకే వేయదుగా

వివరామెరుగని వియ్యపురాలికి విడుదులు చూపితిమి
వివరామెరుగని వియ్యపురాలు విడిదిలో ఉండదుగా.

(సుశీలమ్మ, నెల్లూరు)

హాస్యరచనల్లో అధిక్షేప రచన (Satire) గొప్పదంటారు. వ్యక్తినో, జాతినో అతిసున్నితంగా అవహేళన చేయడం వీటి పని. అయితే జానపద గేయాల్లో ఇటువంటి ఉదాత్తహాస్యాన్ని ఆశించడం అత్యాసే అవుతుంది. జానపదుల హాస్యం ఉదాత్తమైంది కాకున్నా సజీవమైంది.

కన్నీటి పాటలు

కరుణరసగేయాలనే కన్నీటి పాటలనవచ్చు. సామాన్యంగా జానపద గేయాలన్నీ శృంగార ప్రధానాలనే తప్పు అభిప్రాయం ఉంది. వలపు భావాలకు జానపదు లెంత ప్రాముఖ్యం ఇస్తారో, శోకతప్త హృదయాలకూవారంత ప్రాతినిధ్యం వహిస్తారు. కన్నీటి పాటలు ప్రపంచమంతటా ఉన్నాయి. ఆత్మీయులు చనిపోయినప్పుడు మరణ గీతాలను పాడుతారు. కాని తెలుగులో అటువంటివి చాలా అరుదు. కరుణరస ప్రధానమైన కవిత్వం తెలుగులో కథా గేయాల రూపంలో కనిపిస్తుంది.

జానపద గేయాలలో అప్పగింతల పాటలను కన్నీటి పాటలలో మొట్ట మొదట చెప్పుకోవచ్చు. వీటిని కొందరు స్త్రీలు పాటలలో చేరుస్తారు. వేడుక పాటలలో పెళ్ళిపాటలన్నీ చేరుతాయి కాని అప్పగింతల పాటలు మాత్రం ప్రత్యేకమైనవి. ఇవి సాందర్భిక గీతాలు. అంటే ఒక సందర్భంకోసం ప్రత్యేకంగా వెలువడ్డవి. ఆ సందర్భం ఎట్టి కఠినాత్మునికైనా కన్నీరు తెప్పించేది. ఈ క్రింది కోలారు జిల్లా కన్నీటి పాట అనేక విధాల ఆసక్తి కరమైనది. ఒక విధంగా పుట్టింటినుంచి కదలను ఇష్టపడని కూతురి ఆవేదనను ఇది తెలుపుతుంది. దానికి కారణాలనూ కూతురు చెప్తుంది. కాని అత్తవారింటికి కూతుర్ని పంపితీరవలసిన పరిస్థితి తల్లిది. ఎందుకంటే కూతురు అత్తవారింటికి పోయి ఇంటికి కీర్తి తేవలెనన్నది తల్లిదండ్రుల ఆకాంక్ష. గ్రామ జీవనంలో ఏయింటికాయిల్లు వేరుగా ఉండడం సాధ్యంకాదు. సహజంగానే సామాజిక ప్రజ్ఞ గ్రామీణులు ప్రతి ఒక్కరికీ అలవడుతుంది. అందువల్లనే ఈ పాటలో తల్లి 'ఇంటికి కీర్తి తేవమ్మా' అని మరుక్షణమే 'ఊరికి కీర్తి తేవమ్మా' అంటుంది.

తల్లి: ఆరెకరాల్ చేనిస్తా అంటి మామిడి తోపిస్తా
పోయమ్మా నా కూతురా
పోయింటికి కీర్తి తేవమ్మా

ఆరెకరాల్ చేనిస్తా అవులప్పని నీ జతకిస్తా
పోయమ్మా నా కుతురా
పోయూరికి కీర్తి తేవమ్మా

కూతురు: పోనమ్మా నేను పోనమ్మా
పోతే తిరుగుట లేదమ్మా
ఆరుమంది అన్నగార్లూ
కడగొట్టోడే గంగులప్ప
వానికి నాకు కాదమ్మా
పోనమ్మా నేను పోనమ్మా
పోతే తిరుగుట లేదమ్మా
ఏడుమంది అక్కసెల్లెళ్ళు
కడగొట్టుది కమలమ్మ
దానికి నాకూ కాదమ్మా
పోనమ్మా నేను పోనమ్మా

తల్లి: నాగర బిళ్ళా నేపిస్తా
నాగులప్పను నీ జతకిస్తా
పోయమ్మా నా కూతురా
పోయింటికి కీర్తి తేవమ్మా

కూతురు: పోనమ్మా నేను పోనమ్మా
పోతే తిరుగుట లేదమ్మా.
(తాయమ్మ, రామాపురం, చింతామణి తా॥ కోలారు జిల్లా)

గుర్రాల గోపిరెడ్డి, మానందిరెడ్డి, నాగిరెడ్డి, మొదలైన వారు విషాద నాయకులు. వీరిలో కొందరు ప్రభుత్వ విద్రోహులు, సంఘ విద్రోహులు ఉండవచ్చును గాక! కాని వారి చరిత్రలు ప్రజలకు పాటకట్టిపాడే ఊపు నిచ్చాయి. చారిత్రకాలు, అస్పష్టచారిత్రకాలు అయిన ఈ పాటల్లో చిన్నదైనా పరే కథ సూచ్యంగా ఉంటుంది.

కొన్ని దుర్ఘటనలు కూడా కన్నీటి పాటల ఆవిర్భావానికి కారణం కావడం కద్దు. కొన్ని రైలు ప్రమాదాలు జానపదుల హృదయాలను కదిలించి కవిత్వం పుట్టడానికి కారణమైన సందర్భాలున్నాయి (త్రివేణి : 256).

తెలుగులో స్మృతికావ్యమనే ప్రక్రియ ఆధునిక కాలంలో వెలువడింది. జానపదులు కల్పించిన ఒకగేయం వీటన్నిటికంటె ముందే వెలువడింది. దీని లోని భావాలు అపూర్వమైనవి, చిరకాలం హృదయంలో నిలిచేవి. ఒకే కంచంలో తిని, ఒకే మంచంలో పడుకునే దంపతులలో భార్యావియోగం సంభవించిన భర్త విషాదం ఈ క్రింది గీతంగా రూపు దాల్చింది.

సుద్ద బొందలకాడ—
నీ సుద్ది దియ్యంగానె
సద్ది దిన్నట్టాయనే సిలకా—
సిన్నారి సిలకా

ఇంతెల్ల మెడబాపెనే సిలకా
ఎంత పాపపు దేవుడే సిలకా
సమర్తయై నీవు సాటుకు కూకుంటె
సత్తెబామా వందురే సిలకా—సిన్నారి సిలకా

పసిద్దై నువ్వొక్క పందిట్ల గూసుంటె
పార్వతీ దేవందురే సిలకా - సిన్నారి సిలకా
ముత్తైదవై నువొక్క మూలకు గూకుంటె
ముద్ద బంతీవందురే సిలకా— సిన్నారి సిలకా

ఇద్దరము తినేటి ఆ బొడ్డుగిన్నెలా
ఒక్కనికి ఒనరాయెనే సిలకా - సిన్నారి సిలకా
ఇద్దరము కప్పేటి మద్దికాయల దుప్పటి
ఒక్కనికి ఒనరాయెనే సిలకా - సిన్నారి సిలకా

(త్రివేణి : 275)

కన్నీటి పాటలకే మకుట ప్రాయ మనదగింది ఈ క్రిందిది. ఇది యే సహృదయుడినైనా తప్పక కంట తడిపెట్టిస్తుంది. తనతో ఆడుతున్న సావాస గాడు చనిపోయాడు. అప్పుడొక బాలిక విలపిస్తున్నది. పసిపిల్లలకు సహజ మైన మృదుమధుర భావాలతో హృదయాన్ని కదిలించే విధంగా కల్పింపబడిన గీతమిది.

బొంగురాలాడేటి బొగుడల్లా నాయిరాజా
యాడ లెంకిన (వెదకిన) లేడే యెలదారి ,,
చిర్రగోనె లాడేటి చింతల్లా ,,
యాడ లెంకిన లేడె యెలదారి ,,
గోటీ లాడేటి కోనల్లా ,, ॥యాడ॥
నిన్న మన మాడిన నిమ్మల్లి ,, ॥యాడ॥
మొన్న మన మాడిన మోతుకుల్లి ,, ॥యాడ॥
చెండూలు ఆడేటి చెలుకల్ల ,, ॥యాడ॥
(త్రివేణి :237)

ఇరుగుపొరుగు గేయాలు

ప్రౌఢకవుల కావ్యాలను పరిశీలించేటప్పుడు ఇతర కవుల రచనలను పట్టించుకోకున్నా వచ్చే ఇబ్బందేమీ లేదు. కాని జానపద సాహిత్య పరిశీల నలో ఇరుగు పొరుగు సాహిత్యాలనే గాక ప్రపంచ వ్యాప్తంగా ఉన్న సాహి త్యాన్ని తులనాత్మకంగా చూడాల్సి ఉంది. ఎందుకంటే జానపద సాహిత్యంలో ముఖ్యంగా గేయ సాహిత్యంలో వ్యక్త మయ్యే భావాలు మనిషికి సంబంధించి నవి, మూలభూత ప్రవృత్తులకు సంబంధించినవి.

తెలుగు గేయాలను పరిశీలించేటప్పుడు మన దృష్టి కన్నడ గేయాల వైపు సహజంగా వెళ్తుంది, ఆంధ్రదేశానికుండే ఎల్లల్లో ఎక్కువభాగం కన్నడ దేశానికి ఆనుకుని ఉన్నాయి. అందువల్ల తెలుగు గేయాల లయ, తాళం, భావం అచ్చుగుద్దినట్లు కొన్ని కన్నడ గేయాలలోనూ కనిపిస్తుంది. గేయప్రక్రియల

విషయంలో తెలుగు-కన్నడ-తమిళ గేయాలకుండే పోలికల్ని ప్రత్యేకంగా చెప్పుకోవాలి. వ్యవసాయం విషయం తీసుకుంటే దక్షిణభారతదేశంలో చాలా వరకు వృత్తిలో పోలికలున్నట్లే పాటలలోను పోలికలు కనిపిస్తాయి. 'వానల్లు కురవాలి వానదేవుడా, వరిచేలు పండాలి వానదేవుడా' అని తెలుగు వారు ప్రార్థిస్తే 'హుయ్యో హుయ్యో మళెరాయ, హూవిన తోటకె నీరిల్ల' (కురువు కురువు వానరాజా, పూలతోటకు నీళ్ళులేవు) అని కన్నడిగులు స్తుతిస్తారు. మన నాట్ల పాటలు, కలుపు పాటలు, పొలిపదాలు, కోత పాటలన్నీ కన్నడిగులకూ ఉన్నాయి. పారమార్థిక గేయాల విషయంలో శైవ వైష్ణవ సంబంధగేయాలు దక్షిణభారత మంతటా కనిపిస్తాయి. అయితే గ్రామదేవతల పేర్లలో మాత్రం భేదం కనిపిస్తుంది, ఇది సహజమే. కన్నడిగులకు ప్రీతి పాత్రుడైన దేవుళ్ళలో జవరయ్య (యముడు) ఒకడు. గణపతి తెలుగువారికే కాక తమిళులకు కన్నడిగులకూ 'ముందు వరసదేవుడు'. కోలాటం మొదలైన కళారూపాలలో కూడా ప్రథమ తాంబూలం గణపతికే. "శివశివమూర్తివి గణనాథ నీవు శివుని కుమారుడవు గణనాథ' అని తెలుగువారు పాడితే అదే లయలో కన్నడిగులు—

శరణు శరణువయ్యా గణనాయక
నమ్మ కరుణదిందలి కాయొ గణనాయక....

అని పాడుతారు. కన్నడ పారమార్థిక గీతాలలో శివశరణులకు సంబంధించినవి ప్రత్యేకంగా పేర్కొనదగ్గవి. బసవేశ్వరాదులను గురించిన గేయాలు ఆ భాషలో చాలా కనిపిస్తాయి. వీరశైవం జానపద జీవితంలోకి కూడా చొచ్చుకొని పోవడం ముఖ్యంగా గమనించాలి. తెలుగులోని పనిపాటలలో ధార్మిక వైపథ్యం ఎక్కువగా కనిపించదు. కాని కన్నడంలోని వ్యవసాయ పదాలపై కూడా శైవమత ప్రభావం ఉండడం వింత గొలుపుతుంది.

సంబంధ బాంధవ్యాల విషయంలో సాంస్కృతికంగా దక్షిణ భారతం లోని అనేక ప్రాంతాలలో ఒకే విధమైన ఆచారాలు కనిపిస్తాయి. కేరళలో మాత్రం కొన్ని విభిన్న ఆచారాలను చూడవచ్చు. తెలుగు-తమిళం—కన్నడం భాషల్లోని బాంధవ్యగీతాలలో స్త్రీ చిత్రణ చాలా వరకు ఒకటే అని చెప్ప వచ్చు. ఈ ప్రాంతాలలోని పండుగలు, పబ్బాలు, ఆచారాలు, సంప్రదాయా లలో చాలా పోలికలున్నాయి.

జానపదగేయాలలో సమాన భావాలు ఎంత విశ్వజనీనమైన వంటే పిల్లలను ఓదార్చడానికి చందమామను పిలిచే పాటలు తెలుగులో, తమిళంలో, కన్నడంలో, ఇంకా పెక్కు భాషల్లో కనిపిస్తాయి. చందమామను కొండెక్కి రమ్మని. కోటివేలు తెమ్మని, పాలు పెరుగు తెమ్మని తెలుగుతల్లి పిలుస్తుంది. 'నిలానిలా ఓడివా' (చందమామ పరుగెత్తిరా) అని తమిళ పడుచు ఆహ్వానిస్తుంది. నీళ్ళు ఇమ్మని ప్రార్థిస్తుంది మరొక తల్లి.

New moon, come out, give water for us,
New moon, the under down water for us,
New moon, shake down water for us
[C.M. Bowra 1962:79]

ఈ విధంగా వివిధ ప్రాంతాల గేయాలను అధ్యయనం చేస్తే వాటి వెనుక జానపద హృదయంలోని ఐక్యత హృద్యంగా దర్శనమిస్తుంది. మానవుని మూలభూత ప్రవృత్తుల అభివ్యక్తి మాధ్యమంగా గేయం ఏ విధంగా ఉపయోగ పడుతుందన్నది తెలుస్తుంది.

## గేయాలను గూర్చి మరికొన్ని విషయాలు

జానపద సాహిత్యంలోని మిగిలినరూపాలలాగే గేయంకూడా సంస్కృతికి అద్దం పట్టి చూపుతుంది. తెలుగువారి అచ్చమైన సంస్కృతిని తెలుసుకోవాలంటే జానపద విజ్ఞానమే శరణ్యం అంటే అతిశయోక్తి కాదు, సంస్కృతి అన్నది మహత్తర సాధనకు మారుపేరుగా మనం చెప్పుకుంటాం కాని నిజానికి 'ఒక జాతి ప్రజానీకము యొక్క సంపూర్ణజీవిత చరిత్రయే సంస్కృతి చరిత్ర' అన్న ఖండవల్లి లక్ష్మీరంజనం (ఆంధ్రుల చరిత్ర—సంస్కృతి : 11) గారి మాట మెచ్చదగ్గది.

నాకు నల్లచీర నెమలివన్నె రవికె
వడి నిండ బియ్యము పళ్ళు కొబ్బరిగిన్నె
పసుపు కుంకుమ యిచ్చి పంపెమాయన్న
(కృష్ణశ్రీ,పల్లెపదాలు; 39)

అన్నగీతభాగంలో ఉండే మూడు పాదాలలో తెలుగువారి సంస్కృతికి సంబంధించిన అనేక విషయాలు అడగి ఉన్నాయి. అన్నాచెల్లెళ్ళ అనుబంధమూ, పుట్టింటి ఆచారాలు, అలంకరణ విశేషాలు, మన సంస్కృతిలో కొన్ని వస్తువులకుండే పావిత్ర్యమూ ఈ పాదాలలో వామన రూపంలో ఉన్నాయి. 'అత్తింటి కోడలవు కావుగావున్నె' అని ఒక్క గీతపాదాన్ని చెప్తే దాని వెనుక ఒక జాతి ఆచారాల చరిత్రే సూచితమవుతుంది.

ఉతకరా చాకలి ఉల్లి పువ్వల్లె
మడచరా సాకాలి మల్లి మొగ్గల్లె.

అని ఒక వృత్తిని కళాత్మకంగా, సూటిగా, సుమధురంగా వివరించే శక్తి జానపద గేయాలకు కూడా ఉన్నదని తెలిసి ఆశ్చర్య పోతాం. జల్తారు పట్టు చీరలు, రత్నాల రవికలు, ఒడ్డాణాలు, బాజా బందూలు, గుళ్ళపేరులు, కాసుల కంటెలు, అద్దాల రవికలు జానపద గేయాలలో తప్ప మనకింకెక్కడ కనిపిస్తాయి? తరతరాల సంస్కృతిని పరిరక్షించడం జానపద విజ్ఞాన ప్రయోజనాలలో ఒకటి.

జానపదగేయాల ఛందస్సును లాక్షణిక మతాన్ని అనుసరించి కాకుండా దేశీయ సంప్రదాయాలకనుగుణంగా పరిశీలించాలి. అయినా ఛందస్సునే, పద్యాలకోసం చెప్పే లక్షణ శాస్త్రంగాకాక హృదయాహ్లాద కరమైన లయ పద్ధతిగా పరిగణిస్తే జానపద గేయాల ఛందస్సునూ అదే విశాల దృష్టితో పరిశీలించవచ్చు. దంపుడు పాటలు, విసరురాతి పాటలు, జోలలు, ఏలలు ద్విపదాది దేశి ఛందోచ్ఛాయలలో నడుస్తాయి. ఛందో గ్రంథాలననుసరించి చెప్తే గేయాలను ద్విపదలని, రగడలని, తరువోజలని, షట్పదులని విభజించి చూపవచ్చు. అలాకాకుండా గేయాలు మూడు, నాలుగు, ఐదు, ఆరు మొదలైన ఆవృత్తాలలో నడుస్తాయని నియమమేర్పరుచుకోవచ్చు. నిలువు గీతలు చంద్రవంకలు లఘుగురువులకు గుర్తులుగా పెట్టుకొని గణాలను గుర్తించే విధంగానే ఆవృత్తాలకు త,క,కి,ట, అనే అక్షరాలను గుర్తులుగా వాడుతారు.

'చెమ్మచెక్క చేరడేసి మొగ్గ..' అన్న పాట త్రిశ్రగతిలో 'తకిట' ఆవృత్తాలతో నడుస్తుందని చెప్పవచ్చు.

చివరిగా జానపద గేయాల అధ్యయనం శాస్త్రీయంగా ఎలా జరగాలన్న దాన్ని గురించి చెప్పవలసి ఉంది. నేడు జానపద సాహిత్య అధ్యయనంలో కేవలం సౌందర్య దృష్టిమాత్రం ఉంటే చాలదు. జానపద గేయాలను కేవలం వివరణాత్మకంగా సౌందర్య దృష్టితో పరిశీలించే కాలం పోయింది. మానవ శాస్త్రం, భాషాశాస్త్రం, సాహిత్యం, చరిత్ర, ప్రాక్తనశాస్త్రం మొదలైన శాస్త్రాల నేపథ్యం జానపద విజ్ఞానానికి అవసరం అవుతున్నది.

ఇటీవలి కాలంలో భాషా శాస్త్రంలో ఎక్కువగా ప్రచలితమై ఉండే నిర్మాణవాదం (structuralism) వంటివి జానపదగేయం మొదలైన రూపాల అధ్యయనంలో కూడా ఉపయోగ పడుతున్నాయి. కేవలం ఒక భాషకు సంబంధించిన గేయాలకు కాక సార్వత్రికంగా అన్నిగేయాలకూ అన్వయించే విధంగా అంశాలను (units) నిర్ణయించడానికి నిర్మాణవాదం ఉపకరిస్తుంది. జానపద గేయాలలో మానవునిలో సహజంగా కనిపించే ప్రవృత్తుల అభివ్యక్తి మనకు కనిపిస్తుంది. భయం, కోపం, ప్రేమ, ద్వేషం వంటి భావోద్వేగాలు, నమ్మకాల వంటి సామాజిక ప్రవృత్తులు జానపద గేయాలలో కనిపిస్తాయి. వీటి ఆధారంగా ప్రపంచంలోని అన్నిప్రాంతాలలోని జానపద గేయాలలోని సమాన గుణాలను పోల్చిచూచేప్రయత్నం చేయవచ్చు. (ఇలాంటి ప్రయత్నాలకు సంబంధించిన వివరాలకు ఇదే రచయిత వ్రాసిన 'తెలుగు—కన్నడ జానపదగేయాలు' పు. 27—30 చూడండి).

గేయాలను గురించిన అధ్యయనానికి సాహిత్య విమర్శలో అనుసరించే పద్ధతులు చాలా బాగా ఉపకరిస్తాయనడంలో సందేహం లేదు. మానవ శాస్త్రం గేయాల శాస్త్రీయ అధ్యయనానికి బాగా సహాయం చేస్తుంది. మానవ శాస్త్రవేత్తలు అనుసరించే అనేక సిద్ధాంతాలు గేయాల పరిశీలనకూ పనికివస్తాయి. ముఖ్యంగా మనస్తత్వ శాస్త్ర సహాయాన్ని ఆధునికులు పాటల పరిశీలనకు ఉపయోగించుకోవలసిఉంది. మనోవిశ్లేషణ సిద్ధాంతం సహాయంతో గేయం రూపొందడానికి కారణాలను అన్వేషించవచ్చు. గేయాలలో వ్యక్తమయ్యే భావాలను, నమ్మకాలను, ప్రవృత్తులను అర్థం చేసుకోడానికి అసామాన్య మనస్తత్వ శాస్త్రం (abnormal psychology) వంటివి సహాయం చేస్తాయి. ఈ విధంగా అతి సామాన్యంగా కన్పించే జానపద గేయాలనుంచి అసాధారణ విషయాలను తెలుసుకునే అవకాశం ఉంది.

కథాగేయాలు

జానపద కవిత్వంలో గేయం ఒక ముఖమైతే కథాగేయం మరొక ముఖం. కాని ఇవి రెండూ ఎడమొగం పెడమొగాలు మాత్రం కావు. ఈశ్వరుడే అర్ధనారీశ్వరుడయినట్లుగా గేయమే కథాగేయమూ అవుతుంది. గేయాలలో భావాంశాలు (psychemes) ప్రధానమైతే, కథాగేయాలలో కథాంశాలు (narrative units) ప్రధానంగా ఉంటాయి.

ఆంగ్లంలో బాలెడ్ (Ballad), ఫోక్ ఎపిక్ (Folk Epic), నెరటివ్ పొయ్మ్ (Narrative poem) మొదలైన పదాలు వాడుకలో ఉన్నాయి. బాలెడ్ అన్నది ల్యాటిన్ నుంచి వచ్చిన పదం. ఫ్రెంచ్ భాషలో జర్మన్‌లో Ballade అని, రష్యన్ భాషలో Byliny అని వ్యవహరింప బడేవి ఇంచుమించు సమానార్థకాలని చెప్పవచ్చు. బ్యాలెడ్ లక్షణాలను ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా వివరించారు. ఆక్స్‌ఫర్డ్ నిఘంటువు ప్రకారం చిన్నచిన్న పద్యాలలో జనప్రియ కథను సరళంగా శక్తివంతంగా చెప్పేకావ్యమే బ్యాలెడ్. ఒకప్పుడు నృత్యగీతానికి మాత్రమే బ్యాలెడ్డని పేరుండేది. తర్వాత తర్వాత ఆంగ్లంలో అన్నిరకాల గీతాలకూ బ్యాలడ్డనే పేరు పెట్టడం జరిగింది.[4] ఈ విధంగా బ్యాలడ్ పెట్టిన తికమకలమ్మ తప్పించుకునేందుకు అనేక విద్వాంసులు కథాగేయం (narative poem or song) అనే పదాన్నే ఎక్కువగా వాడుతున్నారు. బ్యాలెడ్డును ఏ అర్థంతో చూచినా అది కథాగేయం మాత్రం అవుతుంది. గేయగాథ (నాయని కృష్ణకుమారి 1977) అన్నదీ కథాగేయానికి మరో పేరే. 'గాథ' అన్నది తప్పుదారి పట్టించే పదం కాబట్టి గేయ కథ లేక కథాగేయం సమంజసమైన పేరుగా కన్పిస్తుంది. డా. కృష్ణకుమారిగారే 'కథాగీతం' అనే పేరును తమ సిద్ధాంత గ్రంథంలో పెక్కుచోట్ల వాడారు. "వీరరస ప్రధానమగు కథను చెపుచు, సంచారగాయక భిక్షువులచే వాడబడు సరళకథాగేయమే వీరగాథ" (తంగిరాల సుబ్బారావు 1972:17) అనే నిర్వచనం అన్ని కథాగేయాలకు వర్తించదు. వాగ్రూపమైన సంప్రదాయం కలిగి, తరతరాలుగా అనేక పాఠాంతరాలతో ప్రచారంపొంది, సామూహికవికాసం కలిగిన కథాగేయాలే జానపద కథాగేయాలు.

కథాగేయాలలో కథ ప్రధానం అయినా వీటికీ గేయాల భావగీతాత్మక (lyric) లక్షణం ఉంటుంది. అయితే అది ప్రధానం కాదు. ఇవి బాహ్యస్వరూపంలో లిరిక్ ను, అంతర స్వరూపంలో ఎపిక్ ను పోలుతాయని విమర్శకులు భావించారు. కథాగేయాలలో కథనం కన్నా అనుకరణ సాధ్యమైన సన్నివేశాలు (imitable situations) ఉండడమే ప్రధానమనే వారున్నారు. కథకు కావలసిన సన్నివేశాలుంటే కథనం ఎవరైనా చేయవచ్చు.

నిర్దిష్టమైన కవి ఎవరూ లేక పోవడం గేయాలకులాగానే కథాగేయాలకు కూడా ఒక లక్షణం. ఈ అజ్ఞాత కర్తృత్వం (anonymity) వల్ల కథాగేయం అందరి ఆస్తి అవుతుంది. వ్యక్త్యతీతం (impersonal) గా ఉండడం ఒక ఉపలక్షణంగా చెప్పుకోవచ్చు. ఈ కథాగేయాలలో కొన్ని కవి సమయాలవంటివి కనిపిస్తాయి. కొన్ని పడికట్టు వర్ణనలు మళ్ళీమళ్ళీ వస్తాయి. అభివర్ణిత పునరుక్తి (Incremental repetition) ఏదైనా విషయాన్ని మన హృదయానికి హత్తుకునేటట్లు చెప్పడానికి పనికివస్తుంది.

కథాగేయాలలో శిష్టుల కథన విధానం కనిపించదు. ఒక సన్నివేశం నుంచి మరో సన్నివేశానికి వెళ్ళిపోవడం, మధ్యమధ్య ఏదో వెలితిగా ఉండడం సర్వసామాన్యం. ఈ విధమైన దూకుడు (leaping and lingering) వల్ల ఒక్కొక్కసారి కథ కూడా సరిగ్గా అర్థంకాక పోవచ్చు. కథాగేయాలలో పల్లవి కూడా ప్రాధాన్యం వహిస్తుంది. అంతర పల్లవి (internal refrain) బాహ్య పల్లవి (extrnal refrain) మిశ్రమ పల్లవి (mixed refrain) అని పల్లవి మూడు రకాలు. ఈ పల్లవి కథాగేయాలు చాలా ప్రాచీనకాలం నుంచి ఉండేవని నిరూపిస్తుందని గమరి అభిప్రాయం.

కథాగేయాలకు పైలక్షణాలే కాక ఇంకాకొన్ని లక్షణాలున్నాయి. వీటిని క్రోడీకరించి బ్లిస్‌పెర్రీ పది లక్షణాలను చెప్పాడు (తంగిరాలసుబ్బారావు 1975 : 24–26). గేయరూపంలో ఉండడం కథాగేయాల మొదటి లక్షణం. సరళ ఛందస్సు, పల్లవి, గానయోగ్యత దీని ఉపలక్షణాలు. ఆఖ్యానరూపంలో ఉండడం రెండవలక్షణం. నియమిత పరిమాణం, యథార్థసంఘటనా జన్యత్వం దేశీయ ఇతివృత్తం, నాయకాభేదత, వీరరస ప్రాధాన్యత, కథాసారళ్యం, హఠాత్ ప్రారంభత్వం, సంభాషణాసహితత్వం. గద్యరాహిత్యం, విషాదాంతం

అభివర్ధిత పునరుక్తి రెండవ లక్షణానికి ఉపలక్షణాలు. గాయక భిక్షువుల ఆశు కవితగా జనించడం కథాగేయాల మూడవ లక్షణం. కవి అప్రధానుడుగా ఉండడం దీని ఉపలక్షణం.

వాగ్రూపమైన ప్రచారం కలిగి ఉండడం, వాగ్రూప సంప్రదాయం లభించడంవీటి నాల్గవ లక్షణం. దీనివల్లనే జనప్రియత్వం అన్న ఉపలక్షణం కూడా లభిస్తుంది. కథాగేయాలు వస్తునిష్ఠ కవిత్వానికి (objective poetry) ఉదాహరణాలు. ఇది కథాగేయాల ఐదవలక్షణం.

జానపద కథాగేయాల భాష, భావం సరళంగా ఉంటాయి. కొన్ని పదాలు, వర్ణనలు పునరుక్తమవుతాయి. వీటిని వారానువర్తనాలు (common places) అంటారు. ఇది ఆరవలక్షణం. కథాగేయాలు ఒక్కకవి వ్రాసినవికావు. ప్రజలలో సహజంగా జనించినవి. ఇలా అనితర సాధ్యంగా ఉండడం కథాగేయాల ఏడవ లక్షణం. ప్రపంచంలోని విభిన్న ప్రాంతాలలో కనిపించే కథాగేయాలలో ఏకసూత్రత ఉంటుంది. వసుధైక కుటుంబాన్ని నిరూపించే ఈ అద్వితీయ గుణం (Unique character) కథాగేయాల ఎనిమిదవ లక్షణం. కథాగేయాలు నీతిని వాచ్యంగా చెప్పవు. వ్యంగ్యంగా చెప్తాయి. విధి బలీయమని బోధిస్తాయి. ఇది తొమ్మిదవ లక్షణం. ప్రతి జీవితానికీ చివర ఓటమి ఉన్నదనే విషాదవిషయాన్ని కథాగేయాలు ప్రతిధ్వనిస్తుంటాయి. ఇది పదవ లక్షణం.

పై పది లక్షణాలనే కాక కథాగేయాలకు మరికొన్ని లక్షణాలనూ చెప్పుకోవచ్చు. వీటిలో ఎక్కువగా వీరరస ప్రధానాలు. వీరం తర్వాత కరుణం, అద్భుతం పేర్కొనదగ్గవి. వీరుడు తల్లిదండ్రులకు ఆలస్యంగా పుట్టడం ఆటపాటలలో అతను అమిత శౌర్యాన్ని ప్రదర్శించడం కథాగేయాలలో కనిపిస్తుంటాయి. అలంకారాలలో సరళమైన ఉపమలు, భాషలో కూడా సారళ్యం గోచరమవుతుంది. జానపదులు వాడేది సరళదేశీయ భాష. సామెతలు, నుడికారాలు సమృద్ధంగా ఉంటాయి. నిఘంటువుల కెక్కని దేశ్యపదాలు అసంఖ్యాకంగా కనిపిస్తాయి. వైరిసమాసాలు, అన్యదేశ్యాలు బోలెడన్ని ఉంటాయి.

కథా గేయాల ఛందస్సు లక్షణ గ్రంథాల ననుసరించేది కాదు. గేయాలను గానం చేసేటప్పుడు రాగాలు సంకీర్ణంగా ఉంటాయి. ఒక పాటను

అందరూ ఒకే విధంగా పాడాలని లేదు. ఈ విధంగా కథాగేయాలను చెప్పే లక్షణాలలో సార్వత్రికంగా మనకు కనిపించేవి ఐదు : 1. ఇది కథాఖ్యానమై ఉంటుంది. 2. పాట రూపంలో ఉంటుంది. 3. జనపదీయమై ఉంటుంది. 4. ఒక ముఖ్యమైన సంఘటన మీద కథాగేయం కేంద్రీకృతమై ఉంటుంది 5. ఇది వ్యక్త్యతీతమై ఉంటుంది (మాక్ ఎడ్వర్డ్ లీచ్ 1975 : 106). సామాన్యంగా ఆఖ్యానాల్లో కనిపించే క్రియ (action), పాత్రలు (characters), సంయోజనం (setting), కథావస్తువు (theme) అనే నాలుగింటిలో క్రియకు కథాగేయాలలో ఎక్కువ ప్రాధాన్యం ఉంటుంది. క్రియ వీటిలో చాలా నాటకీయంగా ఉంటుంది. సంక్షిప్తత అంతటా కనిపిస్తుంది.

కథాగేయాలు ఎప్పుడు అవతరించాయి, ఎప్పుడు వికాసం చెందాయి అన్నది చెప్పడం చాలా కష్టం. ప్రాథమిక రూపమైన భావగీతానికి కథాకథనం చేరి కథాగేయాలు పుట్టి ఉండవచ్చు. ఏమైనా జానపద సాహిత్యరూపాలు గ్రంథస్థ సాహిత్యరూపాలకంటె ముందు అవతరించాయనడంలో సందేహం లేదు వీటిలో కనిపించే సరళమైన ఛందస్సు ప్రాచీన మానవుని భావపరంపర, సంప్రదాయాలు వీటి ప్రాచీనతను నిరూపిస్తున్నాయి. క్రీస్తుపూర్వం కొన్నివేల సంవత్సరాలకు చెందిన వేదాలలోనే కథాగేయాలకు బీజాలున్నాయి. రామాయణ, మహాభారతాల రచనకు జానపద కథాగేయాలే ఆధారమనే అభిప్రాయంలో ఎంతవరకు సత్యమున్నదని పరిశీలించవలసి ఉంది. ప్రాచీన సంస్కృతులైన గ్రీక్, ల్యాటిన్, జర్మన్, హిబ్రూ, చైనా సంస్కృతులలో కథాగేయాలు పుట్టి ప్రచారం పొందాయి.

గేయం కంటె నృత్యం ప్రాచీనమైంది. అతి ప్రాచీనకాలంలో జానపద సమాజంలో ప్రచలితమై ఉండిన నృత్య సంప్రదాయానికి అనుబంధంగా కథాగేయాలు ఆశువుగా అవతరించాయని ఒక ఊహ. మధ్యయుగాలకో ఇంకా ఇటీవలి యుగాలకో కథాగేయాల పుట్టుకను కొందరు తీసుకు రావడం జరిగింది. గాథాకారులు ప్రయత్నపూర్వకంగా వీటిని రచించారని కూడా కొందరు చెప్తారు ప్రాచీన మానవుని నృత్తగీతాలు భావాత్మకాలై, చిన్నవిగా ఉండి ఉంటాయిగాని కథాకథనంతో కూడిన పెద్దపాటలు పుట్టడం స్వభావ విరుద్ధమనే

అభిప్రాయం ఉంది. ఏది ఏమైనా కథాగేయాలకు బీజ ప్రాయమైనవి చాలా ప్రాచీన కాలంలోనే పుట్టిఉంటాయన్నది సమంజసమైన అభిప్రాయమని చెప్ప వచ్చు.

వృత్తిగాయకులు (minstrels) మధ్యయుగాలలో కథాగేయాలను రచించారనే అభిప్రాయాన్ని గమరి వంటి వారు ఖండించారు. వీరు రచించినవి కథాగేయాలకు భిన్నమైనవని ప్రొ॥ కిట్రిడ్జ్ మొదలైన వారు అభిప్రాయ పడు తున్నారు. సాంప్రదాయికంగా ప్రజలలో ప్రచారంలో ఉన్న కథాగేయాలు ప్రజలు సృష్టించినవే అని బహుజన సమ్మతమైన అభిప్రాయం. వృత్తిగాయ కులు రచించినవి సాంప్రదాయిక కథాగేయాలు (traditional ballads) కావచ్చుగాని, జానపద కథాగేయాలు లేక జనప్రియ కథాగేయాలు కాలేవని చెప్పవచ్చు.

కథా గేయాల చివర కొన్ని సందర్భాలలో రచయితల పేర్లు కనిపించ డం వల్ల ఇవి వైయక్తిక రచనలనే అభిప్రాయం కొందరికి కలిగింది. ఏదైనా కొన్ని వైయక్తిక రచనలే కావచ్చు. అది ఒక్కరి రచన అయినా, పలువురి రచన అయినా జన ప్రియత్వం, సంప్రదాయం ఏర్పడి కథాగేయం సామూహిక సంపద అయిందంటే దానిని జానపద కథాగేయం అనవచ్చు.

కథాగేయం వికాసం చెందేటప్పుడు ఒక పద్ధతిలో ఇది జరుగుతుంది. దీనికే మహాకావ్య పద్ధతి లేకఐతిహాసిక పద్ధతి (epic process) అంటారు. ఎవరైనా ఒక చిన్న కథను చెప్పారనుకుందాం. అది విన్నవారు ఆ కథను పూర్తిగా వినకున్నా కథాసారాన్ని అర్థం చేసుకుంటారు. ఆ కథనే వాళ్లు జాన పదులకు చిరపరిచితాలైన మూలాంశాల (motifs)సహాయంతో పునర్నిర్మిస్తారు. ఇలా కథ పెరిగి అనేక సన్నివేశాలతో కూడి కథాచక్రంగా పరిణమిస్తుంది. ఇతిహాసాలతో ఈ బృహత్ కథాగేయాలకుండే పోలికను బట్టి కొందరు వీటిని జానపద ఇతిహాసం (folk pice) అని, జానపద మహాకావ్యం అని పిలుస్తుంటారు.

కథాగేయాల పుట్టుకకు కారణాలను వెదకడం 'ఇసుమున తైలంబు'తీయ డమే. ఎందుకంటే వీటికి ఒక చరిత్ర అన్నది లేదు. లేక ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే చరిత్రకు తగిన ఆధారాలు వీటిలో కనిపించవు. నిరంతరం

మార్పుచెందుతూ వుండడమే జానపద సాహిత్యం లక్షణం. ప్రాచీన కాలంలో జరిగిన అనేక సంఘటనలు, నమ్మకాలు, మూలాంశాలు (motifs) కథాగేయాల పుట్టుకకు కొన్ని కారణాలు. ప్రాచీన కాలంలో వేటప్రధానం వృత్తిగా ఉన్నప్పుడు, వేటను గురించిన వృత్తాంతాన్ని తన వారికి లయబద్ధంగా ఆనాటి మానవుడు చెప్తున్నప్పుడే కథాగేయల ప్రాదుర్భావం జరిగింది. తర్వాతి కాలంలో ప్రాదేశికంగా జరిగిన చిన్నచిన్న పోట్లాటలు, యుద్ధాలు కథాగేయాల అవతరణకు కారణమయ్యాయి. సుదీర్ఘ కథాగేయాలకు కూడా అప్రధానమైన చిన్నచిన్న యుద్ధాలే ప్రేరణ ఇచ్చాయన్నది గమనార్హం.

కథాగేయాల ఛందస్సును బట్టి, కాలప్రమాణాన్ని బట్టి, గాయకులను బట్టి, వాద్యాలను బట్టి వాటిని అనేక విధాలుగా విభజించవచ్చు. కొన్ని కథాగేయాలు పది, పదిహేను నిముషాలలో ముగిసిపోతాయి. వీటిని లఘు కథాగేయాలు (balladlings) అనవచ్చు. మామూలు కథాగేయాలు అనతి దీర్ఘాలు. కొన్ని బృహత్ప్రమాణంకలవి. వీటిని గేయకథా చక్రాలని (ballad cycles) పిలుస్తారు. వీటినే జానపద మహాకావ్యాలని కూడా వ్యవహరించడం కద్దు. జానపద గేయ సాహిత్యాన్ని విస్తృతంగా పరిశోధించి వివరించిన డా. రామరాజుగారు జానపద గేయాలను కథాగేయాలను వర్గీకరించడానికి కొన్ని పద్ధతులను సూచించారు. (1958 : 6—7). వస్తువును బట్టి పౌరాణికాలు, చారిత్రకాలు, అస్పష్టచారిత్రకాలు, మత సంబంధాలు, సాంఘికాలు, మొదలైన భేదాలను గుర్తించవచ్చు, రసానుగుణంగా శృంగార గేయాలు, అద్భుత గేయాలు, కరుణరస గేయాలు మొదలైనవి ఏర్పడుతాయి. ఆలంబనాన్నిబట్టి స్త్రీల పాటలు, పురుషుల పాటలు, స్త్రీ పురుషోభయ సంబంధాలు అని ఏర్పడతాయి. కథాగేయాలకు డా. రామరాజుగారి వర్గీకరణను అన్వయిస్తే ఈ క్రింది విభాగాలేర్పడతాయి : 1. పౌరాణికాలు, 2. చారిత్రకాలు, 3. మత సంబంధగేయాలు, 4. పారమార్థికాలు, 5. శృంగార గేయాలు, 6. అద్భుత రసగేయాలు, 7. కరుణరస గేయాలు, 8. హాస్యరస గేయాలు.

గమరి తన 'ది పాపులర్ బ్యాలడ్' అనే గ్రంథంలో కథాగేయాలలోని విభాగాలను గురించి చర్చించాడు. పొడుపు కథాగేయాలు (riddle ballads) గమరి పేర్కొన్న కథాగేయ రూపాలలో ఉన్నాయి, గేయరూపంలో ఉండే

పొడుపు కథలు మనకు బాగా పరిచయమైనవే. కథాగేయ రూపంలో కూడా కొన్ని ఉంటాయి. గృహసంబంధమైన కలతలు మొదలైనవి కొన్ని కథాగేయాలకు వస్తువులు. వీటిని domestic complications అని గమరి పిలిచాడు. కొన్ని కథాగేయాలలో రాక్షస వివాహం ప్రధానంగా ఉంటుంది. మానవాతీత శక్తులకు కథాగేయాల వస్తువులో ఉండే ప్రాముఖ్యం గమనించ దగ్గది. ఇలాంటివి సూపర్ న్యాచురల్ బ్యాలడ్స్ (supernatural ballads) అనే పేరు కలిగి ఉన్నాయి. పరివర్తనాత్మక కథాగేయాలు (transformational ballads) మంత్ర తంత్రాలతో కూడి ఉంటాయి. ఐతిహ్యాత్మక కథాగేయాలన్నది (legendary ballads) మరో రూపం. యుద్ధ సంబంధ కథాగేయాలనుకూడాగమరి పేర్కొన్నాడు. ఇవికాక హాస్యప్రధానమైనవి, సముద్రకథనం కలవి, 'జర్నలిస్టిక్ బ్యాలడ్స్' మొదలైనవి గమరి చెప్పిన కొన్ని కథాగేయ రూపాలు. పైవాటిలో ప్రాదేశిక లక్షణాలను దృష్టిలో ఉంచుకొని కొన్నిటిని మనంకూడా పరిశీలించవచ్చు.

జానపద మహాకావ్యాలలో ముఖ్యమైన నాలుగు రూపాలున్నాయని ఫెలిక్స్ జె. ఒయ్నాస్ అభిప్రాయం. మానవాతీత వస్తువులుండేవి Shamanistic epics, వీరరస ప్రధానమైనవి Heroic epics, ప్రేమ, సాహసం ముఖ్యంగా ఉండేవి Romantic epics, చారిత్రక సన్నివేశాలకు, పాత్రలకు ప్రాధాన్యం ఉండేవి Hitsoric epics. ఈ నాలుగు (రిచర్డ్ ఎం. డార్సన్ 1972 : 101) మాత్రమే కాక ఆయా భాషలలో ముఖ్యంగా ఉండే మూలాంశాలను బట్టి విభజన చేయవచ్చు. తెలుగు వీరగాథా చక్రాలను ఇతివృత్తాన్ని బట్టి 'శక్తి కథాచక్రము, పల్నాటి వీర కథాచక్రము, కాటమ రాజుకథాచక్రము, వెలకంటి వీరుని కథాచక్రము' అని విభజించ వచ్చునని డా. టి. వి. సుబ్బారావు అభిప్రాయం (1975 : 28). ఈ విధంగా వివిధభాషలలోని విశిష్ట లక్షణాలే కథాగేయాల వర్గీకరణకు మూలకందాలు కావాలనడం సమంజసం. అయినా ఇది సాధ్యమైనంత వరకు సార్వజనీనంగా ఉంటే మేలు.

## చరిత్ర కందని కథాగేయాల చరిత్ర

కథాగేయాల పుట్టుక, వికాసం ఎలా జరిగాయన్నదాన్ని గూర్చిన కొన్ని ఊహాలు ఇంతకు ముందే చెప్పడమైంది. భారతదేశం అందులోనూ ఆంధ్ర

దేశం లోని కథాగేయాల చరిత్ర ఊహల ఉయ్యాలలో ఊగేది మాత్రమే. అక్కడక్కడ శిష్టసాహిత్యంలో కథాగేయాల ప్రసక్తి మాత్రమే మనకు సాక్ష్యం ఇస్తుంది. భారతీయ సాహిత్యంలో అత్యంత ప్రాచీనమైన వైదిక సాహిత్యం లోనే కథాగేయ బీజాలున్నాయి. రామాయణ భారతాలకు వీరరస ప్రధాన కథాగేయాలే మూలమంటారు. నలుని కథ, హరిశ్చంద్రుని కథ రామాయణ భారతాలకంటె ముందే ప్రచారంలో ఉండినవి. క్రీ.పూ. రెండవ శతాబ్దం నుంచే రాజస్థానంలో కథాగేయాలుండేవని అచటి వారు అభిమానంతో చెప్పుకుంటారు. తెలుగులో నన్నయకు పూర్వమే జానపద కథాగేయాలుండేవనడానికి సందేహమే లేదు. అయితే నేటికీ అవిచ్ఛిన్నంగా మౌఖికరూపంలో జీవించి ఉన్న ఈ ప్రాచీన కథాగేయాల చరిత్రను స్పష్టంగా చెప్పే స్థితిలో మనం లేక పోవడం వల్ల ఎవరైనా సాక్ష్యం చూపమంటే చూపేందుకు వీలు కాదు.

భారతదేశంలో కథాగేయాలకు—అందులోనూ వీరగాథలకు పుట్టినిల్లయిన రాజస్థానంతో తులతూగే కథల కాణాచి ఆంధ్రదేశం. పౌరాణిక, చారిత్రక, సాంఘిక సంబంధమైన కథాగేయాలు ఆంధ్రదేశంలో అపరిమితంగా దొరుకుతాయి. పల్నాటి వీరకథ, కాటమరాజుకథ, బొబ్బిలియుద్ధం కథ వంటివి ప్రపంచంలోనే వేళ్ళపైన లెక్కపెట్టదగిన అత్యుత్తమ కథాగేయాలు. నిజానికి వీటిని గురించి తగినంత శ్రద్ధమనకు లేదు గాని, ఇవి ఆంధ్రేతరులకు బాగా తెలిసేట్లు ప్రచారమై ఉంటే ప్రపంచంలోని ప్రముఖ విద్వాంసులందరి దృష్టిని ఆకర్షించేవి. ఫిన్లాండుకు చెందిన 'కలేవాల'ను గురించి ప్రపంచంలోని జానపద విద్వాంసులందరికీ తెలుసు. కాని ఎన్ని కలేవాలాలైనా తెలుగులోని పల్నాటి వీరకథ దరిదాపులకు కూడా రాలేవు.

తెలుగులో కథాగేయాలను గూర్చిన ప్రసక్తి నన్నెచోడుని కాలంనుంచి కనిపిస్తుంది. కుమారసంభవంలో గౌడు గీతాలను గురించి ఉంది (4—112). గౌడుల ఆరాధ్యదైవమైన కాటమయ్యను గురించి అనేక కథలు, గాథలు ప్రచారంలో ఉన్నాయి. బహుశా నన్నెచోడుని కాలం నాటికే గౌడుగీతాలలో కాటమయ్యను గురించినవి ఉండేవేమో !

పాల్కురికి సోమనాథుడు పండితుల తిరస్కారానికి లోనైనా, జాన పదుల పాలిటి చరిత్ర చతురాననుడు సోమనాథుడే. తన కాలంనాటి ఎన్నో జానపద విజ్ఞాన విషయాలను, విశేషాలను గ్రంథస్థం చేసినందుకు సోమ నాథునికి మనమెంతో ఋణపడి ఉన్నాం. భక్తుల చరిత్రలను అనాడు కథలుగా పాడేవారని సోమన బసవపురాణంలో చెప్పాడు. శ్రీశైలయాత్ర చేసే సంద ర్భంలో పిచ్చుకుంట్లు భక్తుల గాధల్ని చెప్తూ భిక్షమెత్తేవారని కూడా చెప్పాడు. అసలు తన బసవ పురాణానికి 'ఆతత బసవ పురాతన భక్త గీతార్థ సమితియే మాతృకం' అన్నాడు. బసవనను గూర్చి మాత్రమే కాక సకల పురాతన చారు గీతాలను పాడేవారు ఆ కాలంలో ఉండేవారనే విషయాన్ని పాల్కురికి సోమన చెప్పాడు.

పల్నాటి వీర చరిత్రలోని కొన్ని భాగాలు శ్రీనాథ విరచితాలవునో కాదో కాని, శ్రీనాథుని కాలంనాటికి పలనాటి కథలు ప్రచారంలో ఉండేవనడం మాత్రక నిజం. బసవపురాణ పండితారాధ్య చరిత్రలలాగే తెలుగువారి జీవి తానికి, సంస్కృతికి అద్దం పట్టె సాంఘిక రచన క్రీడాభిరామం. పల్నాటి వీరులను గూర్చి పాడేవారని క్రీడాభిరామం చెప్తున్నది. ఏకవీరా మహాదేవి యెదుట నిల్చి పరశురాముని కథలెల్ల ప్రౌఢిపాడిన బవనీల చక్రవర్తిని గురించి చెప్పి క్రీడాభిరామకర్త పుణ్యం మూటగట్టుకున్నాడు. ఇంకా ఇలాంటిదే మరో తిరుగులేని సాక్ష్యం ఇస్తూ 'రామాయణ మారుకాండములు' పాడిన విష యాన్ని గూర్చికూడా క్రీడాభిరామకర్త చెప్పాడు. ఇప్పటి రామాయణపు పాటల కవి మాతృకలన దగినవేమో! ఇటువంటి కొన్ని ఉల్లేఖనాల వల్ల తెలుగు భాషకు ఒక స్థిరరూపం ఏర్పడి నప్పటి నుంచే కథాగేయాలవంటి జానపద సాహిత్య రూపాలు ఈ భాషలో వెలువడ్డాయని చెప్పవచ్చు. ఈ విధంగా తెలుగు కథాగేయాలకు వెయ్యేళ్ళకు పైబడ్డ చరిత్ర ఉంది.

### పౌరాణిక గేయాలు

తెలుగులో పురాణాలు (myths) గద్యరూపంలోనూ ఉన్నాయి; పద్య రూపంలోనూ ఉన్నాయి. తెలుగు వారికి సంబంధించినంత వరకు పురాణా లనగానే రామాయణ మహాభారత భాగవతాలు జ్ఞాపకం వస్తాయి. పురాణం అన్నదాన్ని ఇలాంటి పరిమితార్థంలో కాక, ఒక సమాజంలోని నమ్మకాలకు

సంబంధించిన ఒక శాస్త్ర విషయంగా తీసుకుంటే అప్పుడు శైవ వైష్ణవ సంబంధమైన గేయాలను కూడా ఇక్కడే చేర్చవలసి ఉంటుంది. ప్రాచీన కాలంలో ఎప్పుడో జరిగినవని ఒక సమాజంలోని ప్రజలు ప్రగాఢంగా విశ్వసించేవే పురాణాలు. వీటిలో అగ్రస్థానం రామాయణానిది.

సీతారాములు ఆంధ్రజానపదుల జీవితంలోకి చొచ్చుకొని పోయారు. నలుగుపాట పాడినా, కలుపు పాటలల్లినా సీతారాములను తలచు కోకపోతే తెలుగు వారికి తృప్తి ఉండదు. తెలుగులో అన్నిరకాల కావ్యప్రక్రియలలోను రామాయణ కథ ఉంది. చంపూ, ద్విపద, శతక, యక్షగాన, కీర్తనాదులలో సీతారాముల చరిత్రను తెలుగువారు వర్ణించారు.

జానపద కథాగేయాలలో రామాయణ గాథ ఎన్నోమార్పులకు లోనయింది. వాల్మీకి రామాయణంలో లేని ఎన్నో అంశాలు జానపద రామాయణాలలో కనిపిస్తాయి. దీనికి కారణం ఏమై ఉండవచ్చునని ఊహిస్తేబహుశా వాల్మీకి కంటె ముందే రామాయణ కథాస్రవంతి భారతదేశంలో ప్రవహిస్తుండేదేమో అని పిస్తుంది. వాల్మీకి కూడా తన కాలంనాటి జనప్రియ రామాయణ గాథలనే ఆధారంగా చేసుకొని మహాకావ్యాన్ని వ్రాసి ఉంటాడు. నేడు జానపద రామాయణాల రూపంలో కనిపించే కథారూపం కొన్ని విదేశాలకు కూడా వ్యాపించింది. ఈ కారణాల వల్ల తెలుగులోను ఇతర భాషలలోను జానపదుల జీవనంలో ఒకపై ఉండే కథలోని అనేక మూలాంశాలు (motifs) చాలా ప్రాచీన కాలం నుంచి జనజీవనంలో వేళ్ళూని స్థిరపడ్డవనిపిస్తుంది.

తెలుగులోని జానపద గేయాలలో సీత జీవితంలోని వివిధముఖాలు ప్రదర్శించ బడ్డాయి. అనేక రామాయణ గీతాలు సీత పేరుతోనే ఉన్నాయి. సీత, సమర్త, సీతాకళ్యాణం, సీత అప్పగింతయి, సీత అమ్మవారి అలుక, సీత చెర, సీత అగ్నిప్రవేశం,సీతాదేవి వేవిళ్ళు మొదలైనవి కొన్ని పేర్లు మాత్రమే సీతజననాన్ని గురించి ఆసక్తికరమైన అంశాలు జానపద కథాగేయాలలో లభిస్తాయి. పైవి మాత్రమే కాక రామాయణ కథను సంక్షిప్తంగా చెప్పే జానపద రామాయణాలు కొన్ని ఉన్నాయి. శారద రామాయణం, మోక్షగుండ రామాయణం, సంక్షేపరామాయణం, ధర్మపురి రామాయణం, రామ కథా సుధార్ణవం, గుత్తెన దీవి రామాయణం, లంకాసారథి మొదలైనవి ఇలాంటివి.

రామాయణంలోని కొన్ని సంఘటనలను మాత్రం తీసుకొని వర్ణించే కథలు కూడా కొన్ని ఉన్నాయి. పుత్రకామేష్టి, శ్రీరామ జననం, రాఘవ కల్యాణం. సుగ్రీవ విజయం, లంకాయాగం, లక్ష్మణదేవర నవ్వు, ఊర్మిళాదేవి నిద్ర, కుశలవుల యుద్ధము మొదలైనవి రామాయణంలోని కొన్ని ఘట్టాలను రస వత్తరంగా వర్ణిస్తాయి. కుశలవ కుచ్చల చరిత్రలో సీతాపరిత్యాగానికి ఒక బల మైన కారణం కల్పించ బడింది. ఘుప్పనాతి సన్యాసిని వేషంలో వచ్చి సీత చేత బలవంతంగా రావణుని చిత్రం వేయించడానికి ప్రయత్నిస్తుంది. సీత రావణుని గోరుమాత్రం చిత్రించగా శూర్పణఖ చిత్రాన్ని పూర్తిచేసి, బ్రహ్మ చేత ప్రాణం పోయించి సీత పడకటింట్లో పెడుతుంది. అది రాముని కంటబడి సీత మీద అనుమానం రావడానికి కారణమవుతుంది. ఇలాంటి కల్పనలు కొన్ని విదేశీరామాయణాల్లో కూడా కన్పిస్తాయి. లక్ష్మణుడు ఏడు గీతల్ని గీచి వాటిని దాట వద్దని సీతతో చెప్పడం, రావణుడు సీతను తాకకుండా భూమితో బాటు పెళ్ళగించుకొని పోవటం మొదలైనవి జానపదుల కల్పనలు. ఊర్మిళాదేవికి జానపద గేయాలలో పవిత్ర స్థానం కన్పిస్తుంది. సీత అడవులలో కష్టాలను భరించినా. ఆమెకు భర్తసాహచర్యం లభించింది. కాని ఊర్మిళది మూగ వేదన. పెళ్ళి అయిన తర్వాత ఆమె అనుభవించింది వియోగం మాత్రమే. పద్నాలుగేళ్ళ నిద్రాదేవి ఒడిలో సేద తీర్చు కొన్న ఊర్మిళ త్యాగ జీవితాన్ని జానపదులు దర్శించి గీతాలలో చిత్రించారు. 'ఊర్మిళాదేవి నిద్ర' జానపద మనస్తత్వానికి ప్రతీకగా నిలిచే ఉత్తమ గీతం· విచిత్రమైన ఒక సంఘటనను ఆధారంగా చేసుకొని జానపదులు·మనోహరంగా కల్పించిన మరో కథాగేయం 'లక్ష్మణ దేవర నవ్వు'. ఇదొక అపూర్వ కల్పన· పరసమైన చమత్కారానికి ఇంతకంటె ఉత్తమ ఉదాహరణ దొరకదు. శ్రీరామ పట్టాభిషేకం సమ యంలో ఉన్నట్లుండి లక్ష్మణదేవునికి నవ్వు వచ్చింది. వినయంతో తలవంచు కొని తన పని తాను చేసుకొని పోయే లక్ష్మణుడు పడిపడి నవ్వుతుంటే 'గుమ్మడికాయ దొంగలు భుజాలు తడువుకున్నట్లు' ఒక్కొక్కరూ తమను గూర్చే ఆ నవ్వు అనుకున్నారు. రాముడికీ విపరీతంగా కోపం వచ్చింది. చివరికి లక్ష్మణుణ్ణి చంపబోయాడు కూడా. లక్ష్మణుడి వివరణ ఒకవైపు నవ్వునూ, మరొకవైపు జాలినీ తెప్పిస్తుంది. పద్నాలుగేళ్ళ నిద్రాదేవిని వేడు కొని, ఆమెను వదిలించుకొని ఊర్మిళపైకి ఉసిగొల్పాడు లక్ష్మణుడు. వన

వాసం పూర్తి అయి వచ్చిన తర్వాత పట్టాభిషేకం సమయంలో కూడా లక్ష్మణుడికి నిద్ర ముంచుకొచ్చింది. ఇదే అతని నవ్వుకు కారణం. ఈ కారణం తెలిసిన రాముడికి నవ్వాలో ఏడ్వాలో అర్థం కాలేదు హత్య చేయాలనుకున్న వాడు లక్ష్మణుని త్యాగబుద్ధి తలచుకొని ఆత్మహత్యకు సిద్ధపడ్డాడు. జానపదుల ఈ కల్పన ఎంత రసవంతం!

రామాయణపు పాటలు చాలావరకు స్త్రీలపాటలే. కలుపుపాటల రూపంలో ఉండే రామాయణపు పాటలను గురించి డా. దోణప్పగారు 'జానపద కళా సంపద' లో చక్కగా వివరించారు. కోలాటం పాటలరూపంలో కూడా రామాయణం ఉంటుందని 'మాయలేడి పాట' నిరూపిస్తుంది (డా. బి. రామరాజు 1978 : 123—126).

భారత భాగవతాలకు సంబంధించిన పాటలు కూడా తెలుగులో అధిక సంఖ్యలోనే ఉన్నాయి. భారతానికి సంబంధించిన అనేక కథలు కథాగేయ రూపం దాల్చాయి. ధర్మరాజు జూదం, విరాట పర్వం, సుభద్ర కల, సుభద్రా కల్యాణం, సుభద్ర సారె, నలచరిత్ర, దేవయాని చరిత్ర మొదలైనవి జానపదుల జీవితంలో భాగమై పోయాయి. ధర్మరాజు జూదం స్త్రీల నోళ్ళలో నానిన కథాగేయం. 'రాజు చేతికి జిక్కె కనకమ్మ నేడు, ధర్మరాజుకు జిక్కె బలపమ్మనేడు' అని సర్వస్వాన్నీ కోల్పోయిన ధర్మజుని స్థితిని వర్ణించారు జానపదులు. సూటియైన ఈటెల వంటి మాటలతో అనుకున్నదాన్ని చెప్పే శక్తి జానపదులకుంది. ద్రౌపది ఆత్మాభిమానాన్ని చెప్పాలంటే ఎన్నో మాటలెందుకు? 'రారాజు తన చేత వేసె పాచికలు, పాంచాలి తన కాళ్ళదోసె పాచికలు' అని నాటకీయంగా ద్రౌపది చిత్రాన్ని మనముందుంచాడు రచయిత.

శ్రీకృష్ణజననమనే పాటను ఒక్కసారైనా వినని తెలుగువారు అరుదు. 'కస్తూరి రంగ రంగా నాయన్న కావేటి రంగరంగా — శ్రీరంగ రంగరంగా నినుబాసి యెట్లు నేమరచుందురా' అని మొదలయ్యే ఈ కథాగేయంలో శ్రీ కృష్ణుని వర్ణన అత్యంత మనోహరంగా ఉంది.

> "వసుదేవ పుత్రుడమ్మా ఈ బిడ్డ వైకుంఠవాసుడమ్మా
> నవనీత చోరుడమ్మా ఈ బిడ్డ నంద గోపాలుడమ్మా

నవతులకయ్యం, గంగాగౌరుల సంవాదం, భల్లాణరాజుకథ మొదలైనవి శైవ సంబంధ గేయాలలో పేర్కొనదగ్గవి. వీటన్నిట్లో గంగాగౌరు సంవాదం కథ తెలుగునాట అత్యధిక ప్రచారం పొందింది. గౌరి తాను ముడిచిన తర్వాత మిగిలిన పూలను గంగమ్మకు పంపగా గంగ తగవుకు వచ్చింది. ఇద్దరూ 'నా సరిదానవా' అంటే 'నాసరిదానవా' అని తగవులాడుకున్నారు. గంగ అలిగి వెళ్ళింది. ఆమె వెళ్ళిన తెల్లవారే గౌరమ్మకు చెంగు మాసినది. స్నాన పానాదులకు నీరు లేక పోగా గౌరి వీరభద్రుడ్ని పంపింది. ఎక్కడా నీరే దొరకలేదు. చివరికి దక్షుడు దర్పంతో పాలకావళ్ళు, నేతి కావళ్ళు పంపాడు. గౌరి వాటితో స్నానం చేసి చీమలు, దోమల చేత కుట్టించుకుంది. గౌరి అవ మానం దిగమ్రింగుకొని గంగమ్మ దగ్గరికి వెళ్తే ఆ మహాతల్లి—

పచ్చి చేపలు దెచ్చి పందిళ్లు వేసె
యెండు చేపలు దెచ్చి తోరణాల్ గట్టె
పెద్ద చేపల పంచటరుగు తా కట్టె
కప్ప జచ్చిన నీళ్ళు కళాపు జల్లె

గంగ—గౌరి ఇద్దరూ అచ్చమైన జానపద స్త్రీలుగా దర్శనమిస్తారే గాని, పరమేశ్వరుని సతీమణులుగా సాక్షాత్కరించరు. శైవవైష్ణవాలు మతాలే కావచ్చు కాని శైవ వైష్ణవ సంబంధగేయాలు మాత్రం ఆయా పాత్రలను సామాన్యజనులకు సాధ్యమైనంత దగ్గరగా తెచ్చి ఉంచాయి.

## వీరగాథలు

ఐతిహ్యం (legend), కథ (tale), పురాణం (myth) ఈ మూడూ గద్య కథనాలలో ప్రధానమైనవి. పురాణాలే గేయరూపంలో ఉంటే పౌరాణిక గేయాలవుతాయి. ఐతిహ్యాలు గేయరూపంలో ఉంటే వీరగాథలవుతాయి. ఐతిహ్యా లలో కొన్ని చరిత్ర కెక్కిన చరితార్థుల కథలై ఉండవచ్చు. ఐతిహ్యం ఒక్కొక్కసారి చారిత్రకం అయ్యే అవకాశం ఉంది. మొత్తంమీద ఇవన్నీ వీరరస ప్రధానాలు. ఐతిహ్యాత్మకాలు, అస్పష్ట చారిత్రకాలు, చారిత్రకాలు అన్న మూడు రకాలనూ వీరగాథల క్రింద పరిశీలించవచ్చు.

తెలుగులో ప్రపంచంలోనే ప్రథమ స్థానంలో నిలవ గల్గిన వీరగాథలు అనేకం ఉండడం నిజంగా గర్వకారణం. పల్నాటి వీరకథ, కాటమరాజు కథ, బొబ్బిలి కథ, దేసింగు రాజు కథ, ముగ్గురు మరాటీల కథ, సర్వాయి పాపడు కథ, చిన్నపరెడ్డి కథ, సదాశివరెడ్డి కథ, కొమారరాముడి కథ మొదలైనవి తెలుగు నాట ప్రజల్ని ఉత్తేజితుల్ని, ఉత్సాహవంతుల్ని చేసిన వీరగాథలు.

వీరగాథలలో సుదీర్ఘమైన వీరగాథా చక్రాలుండడం తెలుగులో విశేషంగా గమనించదగింది. అతిదీర్ఘ కథలేకాక వీరగాథానికలూ తెలుగులో ఉన్నాయి. గుర్రాల గోపిరెడ్డి, మానంది రెడ్డి, ఉయ్యాలవాడ నరసింహారెడ్డి, బుడ్డా వెంగళరెడ్డి, ధర్మాపురం నరసింహుడు ఈ గాథానికల నాయకులు.

పల్నాటి వీరగాథ రచనకు మూలమైన కథ పన్నెండో శతాబ్దంలో జరిగింది. జానపద కథాగేయాలు ఒక సంఘటన జరిగిన తర్వాత చాలాకాలానికి రూపొందేవి కావు. ఐతిహాసిక క్రమం (epic process) సమకాలీనంగానే ప్రారంభమవుతుంది జానపద ఇతిహాసం సంపూర్ణ రూపం పొందడానికి మాత్రం కొంతకాలం పట్టవచ్చు. అందువల్ల పలనాటి వీరగాథా చక్రంలోని ఒక్కొక్క కథాగేయానికి బీజాలు 12 వ శతాబ్దంలోనే పడి వుంటాయి. పన్నెండో శతాబ్దానికి ముందు అసలు ప్రపంచంలోనే ఎక్కడా వీరగాథలులేవని కొందరు విమర్శకుల తలంపు (తంగిరాల సుబ్బారావు 1975 : 34). పల్నాటి వీరకథ బ్రహ్మనాయుణ్ణి అవతార పురుషునిలాగా చిత్రించింది. నాగమ్మ అసామాన ప్రజ్ఞాపాటవాలు కల నాయకురాలు; పల్నాటి వీరచరిత్ర అనే పేరుతో మనకు నేడు బాగా పరిచయమైనది అసలు సిసలైన జానపద వీరగాథ కాదు. దానిలో ఉండే అనేక కథలు అసలు కథకు సంక్షిప్త రూపాలు మాత్రమే. 'ఇవి విశ్వసింపదగినవి కావు. వీన్నికిని, జానపదులలో వ్యాప్తియందున్న పల్నాటి వీరగాథలకును ఏ విధమగు సంబంధమును లేదు' అని వీరగాథలను గూర్చి సమగ్రంగా పరిశోధన జరిపిన డా. తంగిరాల సుబ్బారావు గారంటారు (1975 : 42). జానపద గాథల్ని పాడేవారు 'వీర విద్యావంతులు'ని, వీరినే 'పల్నాటి వారం'టారని తంగిరాల గారే తెలిపారు (1975 : 44).

పల్నాటి వీరగాథల లాగానే తెలుగునాట ప్రచారం పొంది ప్రపంచంలోని అత్యుత్తమ కథాగేయాలతో పోటీ పడదగినవి కాటమరాజు కథాచక్రం.

వీటిని గురించి తెలుగులోనే ఎక్కువ ప్రచారం జరగలేదంటే ఇక ఇతరులకు చెప్పేమాట ఎక్కడిది. దీనిలో 32 వీరగాథలున్నాయని పరిశోధించి తెలిపిన వారు డా. తంగిరాల. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ వారు కాటమరాజు కథల రెండు బృహత్సంపుటాలను ప్రచురించి మహోపకారం చేశారు. ఈ జానపద ఇతిహాసంలో కాటమరాజు పితామహుడైన ఆవుల వలురాజు నుంచి కాటమరాజు వరకు మూడు తరాలకు సంబంధించిన కథలున్నాయి. పల్నాటి వీర చరిత్ర శ్రీనాథుడు రచించాడనే అభిప్రాయం ఉన్నట్లే, కాటమరాజు కథా చక్రాన్ని కూడా శ్రీనాథుడే వ్రాశాడని జనశ్రుతి ఉంది. అయితే శ్రీనాథుడి పేరుతో యే కథా చక్రంలోని ఏ కథాగేయమూ లేదు.

పైన పేర్కొన్న కథాచక్రాలను నెలల తరబడి పాడవచ్చు. అనతి దీర్ఘాలైన వీరగాథలు రెండు మూడు రాత్రులలో ముగిసిపోతాయి. ఇట్టి గేయాలలో పేర్కొన దగింది కుమారరాముని కథ. దీనిలో చారిత్రకాంశం తక్కువే అయినా కథ కొండంతగా పెరిగింది. ఈ కథ తెలుగు కన్నడాలలో సమాన ప్రాధాన్యాన్ని సంతరించుకుంది. తెలంగాణలో పుట్టి ఇతర ప్రాంతాలకూ ప్రాకి బాగా ప్రచారమైన వాటిలో సర్వాయి పాపని కథ ఒకటి. విదేశీయుడైన జె. ఎ. బోయల్‌ను ఆకర్షించిన జానపద కథాగేయమిది. చరిత్ర, పుక్కిటి పురాణం కలిసి చక్కని జానపద కల్పనలతో రూపొందిన కథాగేయం ఇది. 'సర్వాయి పాపని గూర్చి సాధికారికమైన వృత్తాంతాలను సేకరించి, సవివరంగా, సచిత్రంగా ప్రకటించిన ఘనత డా. బి. రామరాజు గారిది (1978 : 243–251). 'తెలుగు దేశమును గడగడ లాడించుటయే కాక ఢిల్లీ చక్రవర్తికి సైతము తీరని సమస్యగా పరిణమించినాడన్న అతని ధైర్య సాహసములు వీరవిక్రమములు కొనియాడదగినవి' అని సర్వాయి పాపని గూర్చి రామరాజు గారు చెప్పిన మాటలు ఈ జానపద నాయకుని గొప్పదనాన్ని చాటుతున్నాయి (1978 : 251).

దేశింగురాజు కథ తమిళదేశం నుంచి తెలుగు దేశం వైపు వచ్చిన చారిత్రక గేయం. దీనిలో కథాస్థలం తమిళదేశం. తమిళంలో కూడా ఇదే పేరుతో ప్రసిద్ధమైన కథ ఇది. తెలుగు వారి ధైర్య సాహసాలను, ఆత్మాభిమానాన్ని చాటి చెప్పే అసమాన కథాగేయం 'బొబ్బిలి కథ'. జానపద కథా

గేయాలకు — అందులోనూ వీరగాథలకుండ వలసిన లక్షణాలు మూర్తిమత్వం వహించిన కథ బొబ్బిలి కథ. 'రామరామ యనంతకాలము రాజ్యమేలలేము. జగము వుండు కాలము వరకు మనము వుండబోము' అనే నిరాశావాదామే బొబ్బిలి వారి యుద్ధనినాదమైనా, కార్యసాధనకు, వీరాభివ్యక్తికి ఈ కథ ప్రతీకగా రూపొందింది. రంగారావు, తాండ్ర పాపయ్య ఆంధ్ర పౌరుషానికి మచ్చుతునకలుగా భాసిస్తారు. బొబ్బిలిలో జన్మించిన పశుపక్ష్యాదులు కూడ పౌరుషము కలవే. కోడి పందెములాడేటప్పుడు 'చావంటెను మీరు భయపడవద్దు బారా కోడీవా। యెన్నాళ్ళు బ్రతికినా చావు సిద్ధము బారాకోడీ దా। బొబ్బిలి యందున పుట్టినావురా బారాకోడీదా' అని పురికొల్పడం ఆ గడ్డమీద పుట్టిన వారి పౌరుష గుణాన్ని తెల్పుతుంది. యుద్ధసమయంలో ఆదమరచి నిద్ర బోతున్నా నరే తెలుగు బిడ్డలు గుర్రపు సందడి వినగానే పడకలోనే దట్టిగట్టే వారట! రంగారాయునికి 'ముంజేతికి మీసమున్నద'న్న జానపదుని కల్పనా శక్తికి జోహార్లర్పించాలి.

చరిత్ర స్పష్టంగా తెలియని గేయాలలో బంగారు తిమ్మరాజు కథ ఒకటి ప్రసిద్ధమై ఉంది. బహుళ ప్రచారం పొందిన మరొక కథాగేయం ఆరు మరాఠీల కథ. ఇది నిజానికి ఆరెమరాఠీల కథ. ఆరెవారు మరాఠీలలో ఒకతెగ. ఆరెబాస మాట్లాడేవారు పాల్కురికి సోమనాథుని కాలంనుండి తెలుగువారికి పరిచితులే (వృషాధిపశతకం ప. 58). తోలుబొమ్మలాటలు మొదలైన జానపద కళలను వీరు ఆంధ్రదేశంలో ప్రచారం చేశారు. మనకు దొరుకుతున్న వీరగాథలన్నిటిలో అత్యంత ఉదాత్తమైన కథాగేయం సదాశివరెడ్డి కథ. అనేక కథలలో దాయాదుల పోరాటాలే ప్రధాన కథావస్తువుగా ఉన్నాయి. కాని సదాశివరెడ్డి కథలో ఉదాత్తధర్మ కీర్తనముండడం వల్ల 'నిజమైన వీరగాథ యిది యొక్కటే' (బి. రామరాజు 1978 : 30) అని విమర్శకుల మెప్పు పొందింది.

సాంఘికాలు

కథాగేయాలలో ముఖ్యంగా నాలుగు విభాగాలను గుర్తించవచ్చు. మొదటి రెండు పౌరాణికాలు, వీరగాథలు. ఈ రెండిట్నీ గురించి ఇంతకు ముందే వివరించడమైంది. ఇక మూడవ ప్రధాన విభాగం సాంఘిక కథాగేయాలు, వీటిలో

కొన్ని శృంగార ప్రధానాలు, కొన్ని కరుణరస ప్రధానాలు, మరికొన్ని హాస్య రస ప్రధానాలు. అద్భుతరస ప్రధానమైన వాటిని ప్రత్యేకంగా నాలుగవ విభాగంగా గుర్తించవచ్చు. వీటినే మానవాతీత కథలుగా చెప్పవచ్చు.

సాంఘిక కథాగేయాలలో కథ సంఘంలోని వాస్తవికాంశాలకు, కుటుంబ జీవనానికి దగ్గరగా ఉంటుంది. వెంకయ్య — చంద్రమ్మ పాట గేయానికి, కథాగేయానికి మధ్యరకానికి చెందినవి. అరవై ఖండాలుండే సంవాద రూపగేయమిది. హరిజనుడైన వెంకయ్య, కాపుపడుచయిన చంద్రమ్మ పవిత్ర ప్రణయాన్ని అత్యద్భుతంగా సూచన ప్రాయంగా తెలుపుతుందీ పాట.

> మంచి మనసైతేను మాలోడి మాటేల కులమెన్నుకోలేదురో
> వెంకయ్య గుణమునే చూశానురో వెంకయ్య

అని చెప్పే చంద్రమ్మ నాగరికులు, అక్షరబ్రహ్మలు అయిన ఆధునిక విద్యావంతులకూ ఆదర్శప్రాయమైన మహిళ. వెంకయ్య గుడికి వెళ్ళడానికి బెదరుతూ ఇలా అంటాడు.

> ఆడనున్నా సామినే ఈడనూ ఉన్నాడు
> ఈడనున్నా సామినే చందర్రిమ్మ
> నేను కొలుసుకుందునే చందర్రిమ్మ
> ఇద్దరము కలిసి ఏకముగ నుంటేను
> ఏడులోకాలు మన కాడనే ఉంటాయి
> ఎక్కడికి వెళ్ళవద్దే చందర్రిమ్మ
> ఇక్కడనే ఉండి పోదామే చందర్రిమ్మ

మధురప్రేమను అత్యంత మధురంగా చెప్పే మరో
రంగ.' దీన్ని గురించి జానపద గేయాలలోనే చెప్పడమైంది. ఈ లఘుగీతాల మాలికలో నాయికా నాయకుల ప్రేమసూచితమైందిగాని, అవి కథాగేయాలనుకోడానికి వీలుకాదు.

కరుణరసప్రధానమైన కథాగేయాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. అసలు కథాగేయాలు చాలావరకు విషాదాంతాలే. ముఖ్యంగా వీరగాథలు విషాదాంతాలే. వీరగాథలుకాక కరుణరసమే ప్రధానంగా ఉండే కొన్ని కథాగేయాలు కూడా ఉన్నాయి. జానపద కవిత్వాన్ని స్థూలదృష్టితో చూచినప్పుడు శృంగార, వీర, కరుణ, అద్భుత రసాలకు ఎక్కువ ప్రాధాన్యం ఉన్నట్లుగా కనిపిస్తుంది. గేయాలలో చాలావరకు శృంగార ప్రధానమైనవి. కథాగేయాలు వీరకరుణాద్భుతాలు ఎక్కువగా ఉండేవి.

కరుణరసప్రధాన కథాగేయాలలో కన్యకామ్మవారికథ ప్రాచీనమూ, ప్రసిద్ధమూ అయివుంది. తమిళనాట అత్యంత ప్రసిద్ధమైన కణ్ణగి కథే కన్యకాపరమేశ్వరికథ అని కొందరి తలంపు. బెజవాడ కనకదుర్గ కూడా కణ్ణకి అవతారమే అనే వాళ్ళున్నారు. వైశ్యులలో ఎక్కువ ప్రసిద్ధమైన కన్యక కథ ఇంకా అనేక కావ్య ప్రక్రియల రూపంలో రచితమైంది. సారంగధరుని చరిత్రకూడా జానపదులను ఆకర్షించింది. రత్నాంగి, చిత్రాంగి, సారంగధరుడు రాజరాజ నరేంద్రుడు ఇటువంటి పాటల ద్వారా సామాన్య జనులకూ పరిచితులయ్యారు. నన్నయ మహాకవిని పోషించి తెలుగు సాహిత్యానికి మహోపకారం చేసిన రాజరాజుకు కన్యక కథతోగాని, సారంగధరుని కథతోగాని ఎట్టి సంబంధమూ లేకున్నా, అప్పకవి వంటి వారు ఇలాంటి కథల్లోకి రాజరాజును తీసుకొని ఆయనకు కళంకం అంటగట్టారు. ఏది ఏమైనా సారంగధర చరిత్ర అత్యంత కరుణా పూరితమైన కథ ఆంధ్రదేశమందంతటా ప్రసిద్ధమైన మరో కథాగేయం 'కామమ్మకథ'. ఇటువంటి వాటిని పేరంటాళ్ళ కథలంటారు. శీలం, త్యాగం, పాతివ్రత్యం మొదలైన సద్గుణాలకు ప్రతీకగా కామమ్మ పాత్ర మలచ బడింది. 'నల్లతంగాళ్ కథ' దేశింగురాజు వీరగాథలాగే తమిళ దేశానికి సంబంధించింది.

అద్భుత రస గేయాలు

ఆశ్చర్యకరమైన సంఘటనలు అసంభవం కావచ్చు. కాని జానపదులకు అవి ఉల్లాసకరాలయ్యాయి. మాంత్రికులు, మంత్రదండాలు, భూతద్దాలు, అంజనాలు అచ్చమైన జానపద కథన కళకు మూల మంత్రాలు, మూలాంశాలు అయ్యాయి. మానవాతీత శక్తులపైన మానవునికి నమ్మకం ఈ నాటిదికాదు.

అది హృదయంలో నుంచి తీసివేయ జాలనంతగా బలపడి పోయింది.అద్భుత రస గేయాల ఆవిర్భావాన్ని గూర్చి చెప్తూ డా. రామరాజుగారిలా వ్రాశారు : "అసాధ్యమగు విషయము నాకాంక్షించి యత్నులు సాచునప్పుడు గాని ఏ మానవాతీతమగు శక్తియో మంత్రమో యడ్డుపడి చిక్కును మంచుతెరవలె తొలగించిన నెంత బాగుండునను కోరిక అసమంజసమైన దైనను మానవ సహజమే. ఇట్టి కోరిక నాధారముగా చేసికొని పొటమరించినవో లేదా వాని ననుసరించియే ఇట్టి కోరిక లుద్భవించెనో తెలియదు కాని ఇట్టి యద్భుతములు గల కథలనేకములు ప్రతి భాషయందును గలవు'' (1978 : 581).



అద్భుత రస ప్రధానమైన కథాగేయాలలో తెలుగు నాటనే కాక కన్నడ దేశంలోకూడా బాగా ప్రచారం పొందినది 'బాలనాగమ్మ కథ'. మాయలఫకీరు, కార్యవద్దిరాజు, చాకలి తిప్పడు మొదలైన ఇతర పాత్రలతో ఈ కథ రామాయణాన్ని కొంతవరకు పోలుతుంది. మాయల ఫకీరు జానపదులకు మానవాతీత శక్తులపై ఉండే నమ్మకాలకు ప్రతీక. రావణాసురునికి అతడు ప్రతిరూపం. బాలనాగమ్మ భర్త ఏడుగీతలు గీచి పోగా వాటిని దాటి బాలనాగమ్మ భిక్ష వేసింది. జంగము వాడు బాలనాగమ్మను రాగి బెత్తంతో నల్లకుక్కగాచేశాడు. ఇవన్నీ జానపద మూలాంశాలే.



అద్భుత కథలలో పేర్కొనదగిన మరొక కథాగేయం కాంభోజరాజును గూర్చినది. ఈ జంగం కథ క్రీస్తుపూర్వం ఒక వెయ్యినాటిది కావచ్చునని, ఆ కాలంలో ఆంధ్రులు ఉత్తర హిందూదేశంలో కాంభోజ దేశంలో ఉండేవారని శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావు ఊహించారు (బాల, మార్చి 1953). కాని ఇది ఊహ మాత్రమే. ఈ కథలో కాంభోజరాజు 'కర్ణాటక భూమి యందున శాంబరీ పురి పట్టణాన్ని పాలిస్తుండే వాడు. మామూలుగా జానపద కథలో లాగానే సంతానము లేకపోవడం, దానధర్మాలు చేసి, సత్రాలు గుళ్ల గోపురాలు కట్టించి, బావులు, చెరువులు త్రవ్వించి చివరికి రామలింగస్వామిని ప్రతిష్ఠించి, కోనేరు త్రవ్వించి సంతాన ఫలాన్ని సంపాదించడం దీనిలోనూ ఉంది. సంతానం కలిగినప్పటి నుంచి చెరాబంది రాజుకు పట్టాభిషేకం జరిగే వరకు అలౌకిక, అద్భుత అంశాలెన్నో ఈ కథలో వస్తాయి. పాతివ్రత్య మహిమను తెలియజెప్పే మరో అద్భుతగేయం 'ధర్మాంగద పాముపాట'. మంత్ర తంత్రాలు,

అద్భుత కార్యాలు ఈ అన్ని కథాగేయాలలో సర్వసామాన్యంగా కనిపిస్తాయి. ఆశ్చర్యకరమైన వృత్తాంతాలపైన జానపదులకుండే మక్కువను ఈ గేయాలన్నీ నిరూపిస్తాయి.

కథాగేయాల్లో కథాంశాలు

జానపద సాహిత్యంలో మూలాంశాల (motifs)కు అధిక ప్రాధాన్యం ఉంది. కథాగేయాల్లోని మూలాంశాలనేకథాంశాలనవచ్చు (narrative units). కథనంలో ముఖ్యంగా చూడాల్సిన వివే. జానపదులు వీటి ఆధారంతోనే కథ అల్లుతారు. మామూలుగా జరిగేవాటికి భిన్నమైనవే ఈ మూలాంశాలు-కావ్యంలో వక్రోక్తికి ఎంత ప్రాధాన్యం ఉందో జానపద సాహిత్యంలో ఈ 'వక్రాంశాల'కు అంత ప్రాధాన్యం ఉంది. ఉన్నది ఉన్నట్లుగాచెప్తేస్వారస్యం ఉండదు. మామూలు అద్దంలో మనిషి ప్రతి బింబం కనిపిస్తుంది. కాని మాయలమారి అద్దంలో ఎక్కడో సుదూరాన ఉండే మనిషి ప్రతిబింబం కనిపిస్తుంది. ఇలాంటి కథాంశాలు శ్రోతలలో ఆసక్తిని రేకెత్తిస్తాయి. కథ మళ్ళీ మళ్ళీ వినాలనేట్లు చేస్తాయి.

కథానాయకుడు తల్లిదండ్రులకు చాలా ఆలస్యంగా జన్మించడం ఒక మూలాంశం. సంతతికోసం వ్రతాలు చేయడం, సప్త సంతాన ప్రతిష్ఠ చేయించడం, తీర్థ యాత్రలు, చివరికి తపస్సు చేయడం ఈ కథల్లో కనిపిస్తాయి. భగవంతుడో, ఏ మహాపురుషుడో ప్రత్యక్షమై పండో, విభూతో, మంత్రజలమో ఇవ్వడం బాలనాగమ్మ, వీరనాగమ్మ, గాంధారి, శివకుమారుని కథల్లో కనిపిస్తుంది. చనిపోయిన వాళ్ళ కోరికలు తీరకుంటే వాళ్ళ చితిమండదని, కాకులు అన్నం ముట్టవని జానపదుల నమ్మకం. నల్లతంగాళ్ కథలో ఈ విధంగా చితిమండక పోగా నల్లతంగ అన్న నల్లతంబి ఇలా అంటాడు:

ఏమమ్మా చెల్లె, నీకు ఇంత కోపమేలవచ్చె
కోపము నా మీద కొంచెమన్న బెట్టవద్దు
మంటలు లేచెనేని మళ్ళిపగదీర్చెదను
నిప్పులేచి మండెనేని నీదు పగదీర్చెదను

(నాయని కృష్ణకుమారి 1977.84)

జానపద మూలాంశాలలో మరొక సంఘటన ప్రాణాన్ని ఏదైనా పక్షిలోనో, లేక వస్తువులోనో ఉంచడం. కొన్ని కథల్లో ప్రాణం ఏ కంటిలోనో, బొడ్డులోనో ఉంటుంది. రావణుడి ప్రాణం నాభిలోని అమృత భాండంలో ఉన్నట్లుగా చెప్పబడింది. మైరావణుడి ప్రాణం తుమ్మెదల్లో ఉండింది. ఇలాంటివి ప్రపంచంలో అనేక ప్రదేశాల్లో కనిపిస్తాయి. ''ఏడు సముద్రముల కావల జీవిగడ్డ, ఆ జీవిగడ్డలో రాతిగోడ, రాతిగోడలో రాతికోట, నడుమ నుక్కుకోట, ఆ ఉక్కుకోటలోని నూరు వెలగచెట్లు, మున్నూరు ములగచెట్లు, నన్నూరు తాటి చెట్లు, ఏనూరు వేపచెట్లు, వీని నడుమ ముంతమామిడి చెట్టు, ఆముంత మామిడి తొఱ్ఱలో నేడు దొంతరలు. అడుగు దొంతరలో బంగారు పంజరము. ఆ బంగారు పంజరము లోని పంచవన్నెల చిలుక కంఠమున మాయల ఫకీరు తన ప్రాణములను దాచిపెట్టెను'' (నాయని కృష్ణకుమారి. 1977 : 88) ఈ మూలాంశం బాలనాగమ్మ కథలోది. ఈ కథలో ఇలాంటివి ఇంకా ఎన్నో ఉన్నాయి. బాలవద్దిరాజు పాముకాటు వల్ల ప్రాణాలు విడుస్తాడు. పెన తల్లుల దగ్గరుండే నాగమల్లె చెట్టు ఎండిపోతుంది. ఏదైనా చెట్టును సంకేతం చెప్పి దాని కాయలు, పువ్వులు సమృద్ధంగా ఉంటే బ్రతికి ఉన్నట్లు ఎండిపోతే చనిపోయినట్లు తెలుసుకోమనే మూలాంశం కథాగేయాల్లో కనిపిస్తుంది.

పైన పేర్కొన్న విధంగానే మూలాంశాలు విచిత్ర పాత్రల రూపంలో మాంత్రిక వస్తువుల రూపంలో, వివిధ సంఘటనల రూపంలో విరివిగా కనిపిస్తాయి. పౌరాణిక గేయాలు, వీరగాథలు, సాంఘిక గేయాలు, అద్భుత రస గేయాలు—ఈ అన్ని రకాల కథాగేయాలలోను ఇటువంటి కథాంశాలు కానవస్తాయి. వాల్మీకి రామాయణంలో కూడా జానపద మూలాంశాలు బోలెడన్ని ఉన్నాయి. ఇక జానపద రామాయణాల్లో సరేసరి. సీత కమలంలో పుట్టిన వృత్తాంతం అనేక కథాగేయాల్లో ఉంది. పసితనంలో ఆడుకుంటూ శివ ధనుస్సునే ఎత్తిన సీత జానపదుల కల్పనలో అద్భుత స్త్రీ, అలౌకిక శక్తులు కలది. 'సంక్షేపరామాయణం' మొదలైన కథాగేయాలలో లక్ష్మణుడు రాముడిని వెతుకుతూ వెళ్ళేముందు ఏడుగీతలు గీచి 'గిరిదాటవద్ద'ని సీతను శాసించినట్లు ఉంది. ఇది జానపదుల్లో అత్యంత ప్రసిద్ధమైన మూలాంశం. రాయిగా ఉన్న అహల్యను మానవమూర్తిగా మార్చడం, ఊర్మిళ పద్నాలుగేళ్ళు నిద్ర

పోవడం, కైకేయి చిటికెన వ్రేలితో రథాన్నెత్తడం, మారీచుడు మాయలేడిగా మారడం, సముద్రునికి కాకితో కబురంపడం, రాబోయే విపత్తులు కలలో కన్పించడం, హనుమంతుడు సంజీవిని పర్వతాన్ని తీసుకొని రావడం, సీతను చంపినందుకు గుర్తుగా రకసిక్తమైన ఖడ్గాన్ని తీసుకొన్ని రావడం, కుశనుంచి శిశువును సృష్టించడం మొదలైనవి జానపద మూలాంశాలు. ఇలాంటివే భారత భాగవత కథాగేయాలలో కూడా అనేకం కన్పిస్తాయి.

వీరగాథల్లోకూడా ఇలాంటి మూలాంశాలు ప్రధానంగా కనిపిస్తాయి. వీరుడు తల్లిదండ్రులకు లేకలేక పుట్టడం మామూలే. చిన్నతనలలో బొంగరాలాడడం, అందులో ఎవరైనా వీరుణ్ని గతాళి చెయ్యడం, అతడు శత్రువులపై దండెత్తి పోవడం బాలచంద్రుని కథలో మాత్రమేకాక ఇంకా అనేక వీరగాథలలో కన్పిస్తుంది. వీరగాథలలో కన్పించే మూలాంశ పాత్రలలో సవతి తల్లి, పేదరాసి పెద్దమ్మ, కడగొట్టుకొడుకు, కూతురు మొదలైనవారిని చెప్పుకో వచ్చు. బాలనాగమ్మలో కుక్క, ధర్మాంగద చరిత్రలో పాము, పల్నాటివీర కథలో గుర్రం, కోడిపుంజు, మరికొన్ని కథలలో చిలుక ముఖ్యమైన పాత్రలుగా ఉన్నాయి. ఇక వస్తువుల్లో మంత్రదండం. చంద్రాయుధం, రత్నకంబళి, చెప్పులు. తులసివనమాల మొదలైనవి కనిపిస్తాయి, ఇవికొన్ని సంఘటనల రూపంలోకూడా ఉండవచ్చు. స్వభావచిత్రణంలో ఉండవచ్చు. విశిష్టపద ప్రయోగాల రూపంలో ఉండవచ్చు. 'తెల్లని గుడ్లకుతెచ్చెర కతంబు' అని కోపాన్ని వర్ణించడం. 'కుడికంటిపుదకాలు కుంభవరషములాయె. ఎడమకంటి పుదకాలు ఏరులై పారె. అని శోకాన్ని వర్ణించడం కథా గేయాలలో కనిపిస్తుంది. వీరగాథల్లో వీరపత్నులకు, వీరమాతలకు దుస్స్వప్నాలు రావడం, రణరంగంలో నరుకుతపుంటే నల్లశిరసులు రాలడం, పొడుస్తపుంటే పొట్టప్రేగులు పడడం సర్వసామాన్యంగా చూడగలం.

సాంఘిక గేయాలలో అద్భుతరసగేయాలలో కూడా జానపద మూలాంశాలు కోకొల్లలుగా కనిపిస్తాయి. కన్యకామ్మవారి కథలలో కన్యక అగ్ని మధ్యలో నిలిచి ఉపన్యాసం ఇస్తుంది. తర్వాత పుష్పక విమానంలో వెళ్తుంది. సారంగధర చరిత్రలో ఆకాశవాణి రాజరాజు కొలువులో చిత్రాంగి మోసాన్ని పకట్రిస్తుంది. బ్రహ్మ మహిమ వల్ల సారంగ ధరుడికి కాళ్ళుచేతులు అమ

క్కుంటాయి. జానపదుల ప్రీతి విశ్వాసాలను గడించిన మరొక జానపద పాత్ర లక్ష్మమ్మది. అత్త, ఆడుబిడ్డల ఘాతుకానికి బలైపోయిన లక్ష్మమ్మ చితి చల్లారగానే శిలయైపోయి దేవతగా మారింది. భర్తవెంకయ్యకు, అత్తకు, ఆడుబిడ్డలకు కళ్ళు పోయాయి. లక్ష్మమ్మ వంటి వారికి మహిమలు తమంత తామే అబ్బుతాయి. జానపదుల ఈ నమ్మకాలే మూఢనమ్మకాలై వారి జీవితా లలో పెనవేసుకు పోతాయి. లక్ష్మమ్మ—

నూటవొక్క గుడిలోనేయమ్మ
పూజలైనను కొంటున్నదమ్మ
సంతులేకుంటె సంతు యిచ్చునమ్మ
బిడ్డలు లేకున్న బిడ్డలిచ్చునమ్మ

ఇటువంటి లక్ష్మమ్మకు ప్రతి ఊరిలో గుళ్ళు లేవడంలో ఆశ్చర్యంలేదు.

అద్భుత గేయాలలో జానపద మూలాంశాలు అడుగడుక్కీ కనిపిస్తాయి. మానవాతీత శక్తులే వాటిలో ప్రాధాన్యం వహిస్తాయి. బాలనాగమ్మలోని కొన్ని కథాంశాలను గురించి ఇంతకుముందే ప్రస్తావించడం జరిగింది. సంతాన ఫలాన్నారగించి సద్యోగర్భమై ఏడు గడియలకే సంతానం కలిగే వృత్తాంతా లిందులో ఉన్నాయి. మాయజంగం ఇచ్చిన సంతాన విభూతి వల్ల తలారి రాముని 'జుట్టులో తొమ్మిది వందల మంది బుట్టినారు, నెత్తి గుడ్డదీసి నేలను గొడితేను మూడువందలు ముందుగ వస్తారు, ఏడుగురి వో భార్యల చెంతాను నాలుగు మూడు వందలున్నారు'.(బి. రామరాజు 1978 : 587). కాంభోజ రాజు కథను గూర్చి వ్రాస్తూ డా. రామరాజుగారు 'అద్భుత కథలం దన్నింట నుండెడు వివిధాద్భుతము లీ యొక్క కథయందున్నవి. ఇట్టి కథలందిది యాదిమ కథయైనచో దీని నుండియే కొన్ని కొన్ని యద్భుత లక్షణము లాయా కథలందు చేరినవని భావింప వచ్చును' అన్నారు (1978 : 603) కాంభోజ రాజు పుత్ర సమేతంగా అరణ్యానికి వేటాడబోయినపుడు ముత్యంవంటి చినుకు రాజుగారి వీపున బడగా వెలగపండంత బొబ్బ అయిందట!

ఈ విధంగా జానపద కథాగేయాల్లో శ్రోతల ఆసక్తిని పెంపొందించే మూలాంశాలు అసంఖ్యాకంగా ఉంటాయి. కథలు గద్యరూపంలో ఉన్నా పద్య

రూపంలో ఉన్నా ఈ కథాంశాలు కథనంలో జానపదులకు సహాయపడతాయి. వీటిని బట్టి సాంస్కృతిక క్షేత్రాన్ని నిర్దిష్టంగా గుర్తించేందుకు కూడా వీలుంది. భారత దేశానికంతటికీ విశిష్టమైన మూలాంశాలు కొన్ని ఉండగా ఆంధ్ర దేశానికే పరిమితమైన మూలాంశాలు కూడా కొన్ని ఉంటాయి. ఇవన్నీ భౌగోళికంగా కథాగేయాల క్షేత్రాన్ని నిర్ణయించడానికి ఉపయోగ పడతాయి.

## ఇతర భాషల్లో

అన్నిభాషల్లోని కథాగేయాలకూ కొన్ని ప్రత్యేకతలు ఉన్నాయి; అలాగే ఇతర భాషలగేయాలతో పోలికలూ ఉన్నాయి. కథాగేయాలు లేని దేశంలేదు, ప్రాంతం లేదు, భాషలేదు, సంస్కృతిలేదు. రామాయణపు పాటలనే తీసుకుంటే ప్రాచ్యదేశాలలోని అనేక సంస్కృతులలోకి వీటి మూలాంశాలు ప్రవహించాయి. వాల్మీకి రామాయణంలో కనిపించని అనేక మూలాంశాలు జానపద రామాయణాలలోను, విదేశీ రామాయణాలలోను కనిపించడానికి కారణాలను అన్వేషించాల్సి ఉంది. బహుశా వాల్మీకి కాలంనుంచీ, అంతకంటె ముందే రామాయణ కథ జానపదులలో ప్రచారంలో ఉండేది. ఈ రామాయణ కథా స్రవంతే వివిధ దేశాలకు ప్రవహించింది. దానికి తోడు వివిధ మతాలు, సంస్కృతులు ఈ రామాయణ కథల్ని వర్ణరంజితం చేశాయి, వైవిధ్యాన్ని నింపి ఆసక్తికరంగా తయారుచేశాయి. వీరావేశంలో జానపదులు పాడుకునే వీరగాథలు డెన్మార్కు, స్కాట్లండు, స్పెయిన్ మొదలైన దేశాల్లో అత్యధికంగా ఉన్నాయి. కొన్ని దేశాలు వీరగాథల్ని తమకు గర్వ కారణమైన సాహిత్యంగా చెప్పుకుంటారు. పోర్చుగీసు సాహిత్యంలో వీరగాథలు తప్పవేరొక ప్రక్రియే కానరాదని డా. తంగిరాల అంటారు (1975 : 21). భారతదేశంలో రాజస్థాన్, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, పంజాబు రాష్ట్రాలు వీరగాథలకు పేరెన్నిక గన్నవి. దక్షిణదేశ మంతటా వీరగాథలున్నా ఆంధ్రప్రదేశానికే అగ్రస్థానమని చెప్పవచ్చు.

జానపద కథాగేయాలలో ఉపయోగించే వాద్యాలు, ఛందస్సు, ఉపమానాలు మొదలైన వాటిలో భేదాలుండవచ్చు కాని ప్రయోగ ప్రయోజనాలు ఒక్కటి గానే ఉంటాయి. తెలుగులో ప్రచారంలో ఉండేకొన్ని కథాగేయాలకు మూలాలు తమిళంలో ఉన్నాయి. మరికొన్ని కన్నడంలో ఉన్నాయి. అలాగే

తెలుగునుంచి కొన్ని ఆ భాషలకు వెళ్ళాయి. తెలుగు మాతృభాషగా కలిగిఉండిన వీరపాండ్య కట్ట బొమ్మన తమిళులకు ఆదర్శ వీరుడయ్యాడు. ఎన్నో కథా గేయాలకు నాయకుడయ్యాడు. అల్లే తమిళుల ఆడబడుచయిన కణ్ణిగి తెలుగు వారి కన్యక అయిందని కొందరి అభిప్రాయం. కణ్ణిగి నాయిక అయిన సిల ప్పది కారమనే తమిళ కావ్యంలో ప్రధాన పాత్రలందరూ వైశ్యులే. కన్యక ముఖ్యంగా వైశ్యుల ఆరాధ్యదైవం కావడం గమనార్హం. దేశింగురాజు కథ అరవదేశానికి సంబంధించింది. ఇది కథాగేయాల రూపంలో తమిళదేశంలో చాలా ప్రసిద్ధమై ఉంది. నల్లతంగాళ్ కథ కూడా తమిళదేశానికి సంబంధిం చిందే. కన్నడానికి తెలుగుకు కథాగేయాల విషయంలో కూడా దగ్గరి సంబంధం ఉంది. కన్నడంలో కథాగేయాలను ఇటీవల 'లావణి' అనే పేరుతో పిలుస్తు న్నారు. మామూలుగా లావణి అన్నది వీరరస ప్రధాన గేయానికి పేరుగా ప్రసిద్ధమై ఉంది. కన్నడ కథాగేయాలను పాడే వృత్తిగాయకులలో తెలుగు మాతృభాషగా కలవారు చాలామంది ఉన్నారు. మన పిచ్చుకుంట్లే కన్నడదేశం లోని హెళవరు. మన బలిజలే వారి బణజిగరు. తెలుగు దాసరులు కన్నడ దేశానికి కూడా వెళ్ళారు. ఈ కారణాల వల్ల బాలనాగమ్మ వంటి కథలు కన్నడ దేశం నుంచి తెలుగుదేశానికి కాక, తెలుగు దేశంనుంచే కన్నడ దేశానికి వెళ్ళా యనడం సమంజసం. ఆంధ్ర కర్నాటకాలు రెండిట్లోను ప్రచారంలోఉండేది కుమార రాముని కథ. ఆనెగొంది రాజ్యంలోని పసవల్లి దుర్గానికి సంబంధిం చిన గీతమిది. కన్నడంలో కుమార రామునికి సంబంధించిన సాంగత్య కావ్యాలు కూడా వెలశాయి. వీరరస ప్రధానమైన కుమార రాముని కథవంటివే కాక కన్నడంలో కొన్ని జానపద ఇతిహాసాలు, మహాకావ్యాలు ఉన్నాయి. మంటేస్వామి కావ్య, మలెయమాదేశ్వర, బెట్టద చాముండి మొదలైనవి సుదీర్ఘ కథాగేయాలు.

## మరికొన్ని విషయాలు - విశేషాలు

కథాగేయాలను అధ్యయనం చేసేటప్పుడు వాటిలో ముఖ్యంగా గమ నించాల్సిన అంశాలలో వారాను వర్తనాలు (common places) చేరుతాయి. ఈ వారాను వర్తనాలు కథాప్రణాళిక రూపంలో, వర్ణనల రూపంలో, అలం కారాలు, పదబంధాల రూపంలో ఉండవచ్చు. ఈ వారాను వర్తనాలు అనేక

కథాగేయాల్లో మళ్ళీ మళ్ళీ వస్తుంటాయి. వీటిలో చాలావరకు మూలాంశాలే. జానపదులకు బాగా పరిచితాలైన ఈ మూలాంశాలను పరిశీలించకపోతే కథాగేయాల అధ్యయనం సంపూర్ణం కాదు. వారాను వర్తనాల వల్ల శ్రోతలకు కథ బాగా హృదయానికి హత్తుకుంటుంది. గాయకులకు కూడా వీటివల్ల లాభం ఉంది. పడికట్టు వర్ణనలు, సంఘటనలు ఉండడంవల్ల కథాగేయాలను వాళ్ళు బాగా గుర్తుపెట్టుకోగలుగుతారు.

కథాగేయాలలో భాష కొన్నిట్లో సరళ గ్రాంధికమూ మరికొన్నిట్లో వ్యావహారికమూ అయివుంటుంది. పౌరాణికపు పాటలు సరళ గ్రాంథికంలో ఉండేవి కొన్ని, వ్యావహారికంలో కొన్ని ఉన్నాయి. వీరగాథలు సహజమైన, మధురమైన వ్యావహారిక భాషలో ఉంటాయి. శిష్ట వ్యాకరణ నియమాలకు కట్టుపడని భాషే ఈ అన్ని కథాగేయాలలో ఉంటుందన్న విషయాన్ని గమనించాలి. వీటిలో శబ్దాలంకారాల కంటె అర్థాలంకారాలకే ఎక్కువ ప్రాధాన్యం ఉన్నది ఒక విశేషం. ఉపమాలంకారమే జానపదులు మెచ్చిన అలంకారం. దృష్టాంతం, రూపకం, స్వభావోక్తి, అర్థాంతరన్యాసం మొదలైనవి ఉన్నా, ఇవన్నీ సామాన్య జనజీవనానికి దగ్గరగా ఉంటాయన్నది మాత్రం నిజం. జానపదుల భాష సామెతలతో, నుడికారాలతో వినడానికి ఇంపుగా ఉంటుంది. తెలుగుదనం ఉట్టిపడే జాతీయాలు, పదబంధాలు, అపురూపమైన దేశిపదాలు ఈ కథాగేయాల్లో దర్శన మిస్తాయి.

కథాగేయాల ఛందస్సు పరిశోధకుల పరిశీలనకు అర్హమైంది. ద్విపద వికారాలు, రగడ వికారాలు ఈ పాటలలో విరివిరిగా కనిపిస్తాయి. 'శాసన ప్రమాణమును బట్టి తెలుగు ఛందస్సులలో తరువోజ ప్రాచీనమైనదిగా కన్పట్టును కాని, ఛందః పరిణామమును బట్టి పరిశీలించినచో "కిటతకిట, కిట తకిట, కిటతకిట, కిటతకిట'' అని సాగు ఖండగతి అన్నిటి కంటెను ప్రాచీనమైనదిగా తోచును'' అంటారు డా. తంగిరాల(1975 ; 72). ఈ ఖండగతి నుంచే మంజరీ ద్విపద, దాని నుంచి ద్విపద, దానినుంచి తరువోజ, తరువోజ నుంచి సీసం వచ్చాయని ఆయన అభిప్రాయం. ఏ ఛందస్సయినా జానపద కథాగేయాలలో యతి ప్రాసలు ఐచ్ఛికాలేగాని నిర్దిష్టాలు కావు. కొన్ని వీరగాథలకు ఛందస్సును బట్టే పేరు వచ్చి వుండడం గమనించ దగింది. 'బొబ్బిలి

వరుస' అనేది అట్టి వాటిలో ఒకటి. ఈ వరుసను గురించి డా. తంగిరాల వివరించారు : ''బొబ్బిలి వరుసలో ఒక్కొక్క పాదమున 8+8+9 (10) మాత్ర లుండును. యతి ప్రాసలు కాకతాళీయములే కాని నిబద్ధములు కావు. ఈ బొబ్బిలి వరుసనుండి 8+8 మాత్రలొక పాదముగా ఒక వరుస, 8+9 (10) మాత్రలొక పాదముగా వేరొక వరుసగా పరిణమించినవి'' (తంగిరాల సుబ్బారావు 1975 : 71). ముగ్గురు మరాఠీల కథలోని వరుసను 'సైసై వరుస' అంటారు. సర్వాయి పాపని కథ వరుస 'ఏల వరుస' అంటారు. 'సైసై వరుసలో' కొన్ని పాదాలు 12-15 మాత్రలుండేవి. చివర 14–16 మాత్రలుండే ముక్తాయింపు ఉంటుంది. 'ఏల వరుస'లో 7+7 మాత్రలతో రెండుపాదాలు, 7+9 మాత్రలతో మరిరెండు పాదాలు ఉంటాయి. మూడో పాదం చివర 9 మాత్రల సంబోధన అధికంగా ఉంటుంది. 'జంపె వరుస' అన్నది మరొకటి. వీటినే హరిహరీ పదాలని, జముకల వడుస పదాలని చెప్తారు. ఐదు మాత్రల నాలుగు గణాలు వీటిలో ఉంటాయి. శారద వరుసలో 3+5+5+3 మాత్రలొక పాదంగా, అంత్య ప్రాసలుంటాయి.

కథాగేయాల సేకరణ పాశ్చాత్య దేశాలలో 17 వ శతాబ్ది పూర్వార్థం లోనే ప్రారంభమయింది. అధ్యయనం 18వ శతాబ్దినుంచే జరగ సాగింది. పెర్సి (Percy) 1765 లో ప్రచురించిన 'రెలిక్స్ ఆఫ్ ఏన్షియంట్ ఇంగ్లీష్ పొయ్‌ట్రీ'(Reliques of Ancient English Poetry) గొప్ప సంకలనం. ఇంగ్లండులో కాల్పనిక కవితోద్యమ ప్రాదుర్భావానికి ఈ సంకలనం చాలా వరకు దోహదం చేసింది. ఇంగ్లండు, జర్మనీ, స్కాండినేవియా మొదలైన దేశాల కథాగేయాలు ప్రచురితాలై విద్వాంసుల నాకర్షించాయి. సర్ వాల్టర్ స్కాట్ (Sir Walter Scott) ప్రచురించిన 'మిన్‌స్ట్రెల్సి ఆఫ్ ది స్కాటిష్ బార్డర్, (Minstrelsy of the Scottish Border–1802-03) జానపద కవిత్వ అధ్యయనంలో కొత్త దారులను చూపింది. యూరపులోని అనేక దేశాలలో 19 వ శతాబ్దినుంచి కథాగేయాల సేకరణ, అధ్యయనం పెద్ద ఎత్తున ప్రారంభ మయింది. ఈ విషయంలో ఫ్రాన్సిస్‌జేమ్స్‌చైల్డ్ (Francis James Child) అనే అమెరికా విద్వాంసుడు చేసిన సేవ గమనార్హమైంది. ఇంగ్లీష్ అండ్ స్కాటిష్‌బ్యాలడ్స్ (English and Scottish Ballads–1847-59) అనే పేరుతో 8 సంపుటాలలో ఆయన ప్రచురించిన కథాగేయాల వల్ల ఈ

క్షేత్రానికి చిరస్మరణీయమైన కానుక లభించింది. చైల్డ్‌దే మరొక బృహద్గ్రంథం 'ది ఇంగ్లీష్ అండ్ స్కాటిష్ పాపులర్ బ్యాలడ్స్–1882–98' ఐదు సంపుటాలలో ఉంది. గమరి, ఎల్. పౌండ్ మొదలైనవారు ఈ క్షేత్రంలో కృషిచేసిన మహనీయులు. ఫ్రాన్సిస్ బి. గమరి ప్రచురించిన 'ది పాపులర్ బ్యాలడ్' విద్వత్పూర్ణ విమర్శతోగూడిన ప్రశంసనీయ గ్రంథం. మాక్ ఎడ్వర్డ్‌లీచ్ వ్రాసిన 'ది బ్యాలడ్ బుక్', ఎవెలిన్ కెంద్రిక్ వెల్స్ వ్రాసిన 'ది బ్యాలడ్ ట్రీ' మొదలైనవి ఈ క్షేత్రంలో పరిశీలనార్హ గ్రంథాలు. ఎలియాస్ లోన్రాట్ (Elias Lonnrot) ఫిన్లాండుకు చెందిన వీరులను గురించిన కథాగేయాలను కలేవాలా (Kalevala) పేరుతో ప్రచురించి దానికి ప్రపంచ వ్యాప్తంగా ప్రసిద్ధిని చేకూర్చి పెట్టాడు.

1842 లోనే సి. పి. బ్రౌన్‌దొర ఒక జంగముణ్ని నెల రోజులపాటు తన ఇంట్లో ఉంచుకొని బొబ్బిలి కథ, కామారా రాముడి కథ మొదలైన వాటిని పాడించి, వ్రాయించి, భద్రపరచి నందుకు మనం ఆ మహనీయుడికి కృతజ్ఞులమై ఉండాలి. 1874 లో జె.ఎ.బోయల్ సర్వాయి పాపడి కథను సేకరించాడు. అనేక కథాగేయాలను సేకరించడమే కాక మొట్టమొదటి సారిగా తెలుగులో వాటిని విమర్శాత్మకంగా వివరించిన వారు డా. బి. రామరాజు (1958). డా. తంగిరాల వీరగాథల విషయంలో చేసిన మౌలిక పరిశోధన, సేకరణ మెచ్చదగింది. డా. నాయని కృష్ణకుమారి మానవ శాస్త్రం వెలుగులో కథాగేయాలను పరిశీలించి ఒక కొత్త పంథాను పరిచయం చేశారు. ఇంకా ఎంతో మంది పెద్దలు, పిన్నలు ఈ విషయంలో ఆసక్తిని చూపుతున్నారు. సాంఘిక ప్రయోజనాన్ని సాధించడానికి మహత్తర పాత్రను వహించే శక్తిగల జానపద కథాగేయాల పరిశీలన ఇంకా బాగా జరగాల్సి ఉంది.

టిప్పణి

1) "It is indeed tempting to surmise that in the Late Palaeolithic Age (30,000 - 15,000 B.C.) when men delighted in painting and carving and modelling, they delighted also in the melodious arrangement of words" C.M. Bowra, *Primitive song*, P.13.

2) "Sacred songs are, in the first place intended to establish a relation with supernatural powers and to influence them in a direction desired by the singers. They are composed against a background of accepted beliefs, and use its assumptions to make themselves felt"-C M. Bowra *Primitive song*. p. 55.

3) వీణాగానం వెన్నెల తేట—రాణమీరగా రమణుల పాట
పేరు చెప్పిన పినబ్రాహ్మణు వీట-జాణలు మెత్తురు జాజరపాట.

4) "Ballad is a song to which folk used to dance ; yet nearly every variety of short poem in English has been called a ballad"-F.B. Gummere. *The Popular Ballad*, p.3.

5) Ballads were at first always sung, and always had a refrain ; the refrain is incontestably sprung from singing of the people at dance, play, work, going back to that choral repetition which seems to have been the protoplasm of all poetry"- F.B. Gummere, *The Popular Ballad*, pp,73-74.

# గద్యకథనాలు

మౌఖిక జానపద విజ్ఞానంలో గేయాల రూపంలో కొన్ని, గద్య రూపంలో కొన్ని, ప్రత్యేక రూపాలు కొన్ని ఉంటాయి. గేయరూపంలో ఉండే వాటిలో కొన్ని కథా సహితాలు మరికొన్ని కథా రహితాలు. వాటిని చేర్చి జానపద కవిత్వం అనే పేరుతో ఇంతవరకు వివరించడమైంది. ఈ అధ్యాయంలో వివరింపబడుతుండేవి గద్యకథనాలు (Prose narratives). జానపదం పేరు వినగానే మనకు సామాన్యంగా గేయాలు మాత్రమే తలపుకు వస్తాయి. అందువల్ల గద్యకథనాలవంటి పేర్లు కొంత వింతగా ఉండవచ్చు, ఇలాంటి కొత్త కొత్త పేర్లకు మనమింకా అలవాటు పడవలసి ఉంది. ఇవి కొంత ఎక్కువ వివరణను కూడా అపేక్షిస్తాయి. ఎందుకంటే తెలుగులో వీటిని గూర్చి ఎక్కువ పరిశ్రమ జరగలేదు.

'గద్యకథనాలు' అనగానే ఇవి గద్యరూపంలో ఉండేవని, కథన రూపంలో ఉండేవని అర్థమవుతుంది. వీటినే కొందరు గద్యాఖ్యానాలన్నారు. గద్యరూపంలో కథలు మనకు బాగా పరిచితాలే. వాటిని కాకమ్మ కథలనీ, పేదరాశి పెద్దమ్మ కథలనీ ఏవేవో పేర్లతో పిలుచుకున్నా, రాత్రివేళ 'అవ్వా కథ చెప్పవూ, తాతా కథచెప్పవూ, అమ్మమ్మా కథ చెప్పవూ' అంటూ పిల్లలు ముసలివాళ్ల 'పక్క'ల్లో చేరి ఏడిపించుకు తింటారనే విషయం మనలో చాలా మందికి తెలిసిందే. అయితే కథలు అనకుండా వీటిని గద్యకథనాలని ఎందుకంటున్నారన్నది ప్రశ్న.

ఏదైనా విషయాన్ని కేవలం ప్రాదేశిక దృష్టితో, పాక్షిక దృష్టితో అధ్యయనం చేసేటప్పుడు మనకు వాడుకలో ఉండే పేర్లనే వాడుకొని, బాగా తెలిసిన వాటిని మాత్రమే మళ్ళీ మళ్ళీ చెప్పుకోవచ్చు. కాని ఏదైనా శాస్త్రాన్ని విశ్వజనీన దృష్టితో చూడాలంటే, దాన్ని ప్రపంచానికంతటికీ అన్వయించే కొన్ని సూత్రాల ఆధారంతో పరిశీలించక తప్పదు. ప్రపంచంలోని ప్రముఖ విద్వాంసులు కథలను మాత్రమే కాక పురాణాలను (myths) ఐతిహ్యాలను

(legends) కూడా ప్రత్యేకంగా పరిశీలించారు, పరిశీలిస్తున్నారు. పురాణం, ఐతిహ్యం అనేవి కొన్ని కారణాల వల్ల జనప్రియ కథకంటె వేరైనవి, ప్రత్యేకంగా పరిశీలించ దగినవి కావడం వల్ల ఈ మూడు రూపాలను వేరువేరుగా అధ్యయనం చేయాల్సిఉంది. పురాణం అంటే జానపద పురాణం. కొందరు అష్టా పురాణాలే పురాణాలనే దృష్టితో కాబోలు జానపద పురాణాలను పురాకథలని, పురాగాథలని వ్యవహరిస్తున్నారు. శిష్టకథ, జానపదకథ ఉన్నట్లే, శిష్టపురాణం—జానపద పురాణం ఉంటే తప్పులేదు. పద్యపురాణాలను (ఉదా : మాత పురాణం, జాంబ పురాణం, గౌతపురాణం) పురాణాల పేరుతో పిలిచినప్పుడు గద్యపురాణాలను మాత్రం ఎందుకు పిలవరాదు? పేరేమైనా మొత్తం మీద గద్యకథనాలలో మూడు ప్రధాన విభాగాలను గుర్తించవచ్చు.




పై మూడు విభాగాలలో పురాణం, కథ—ఈ రెండింటిని గురించి జరిగినంత పరిశోధన, పరిశీలన ఐతిహ్యాన్ని గురించి జరగలేదు. వీటిని విడమరిచి చెప్పి ఇదే పురాణం, ఇదే ఐతిహ్యం, ఇదే కథ అని నిర్దిష్టంగా చెప్పడం కూడా ఒక్కొక్కసారి కష్టమే. ఈ కష్టమంతా ఎందుకని కొందరు పురాణాన్ని ఐతిహ్యాన్ని కథ క్రిందే చేర్చి వాటిని పురాణకథ (mythological tale), ఐతిహ్యాత్మక కథ (legendary tale) అని పేరు పెట్టారు. అయితే పురాణం ఐతిహ్యం వేరుగా చెప్పాల్సిన కథన రూపాలనడమే సమంజసం. గద్యకథనం వాగ్రూప ప్రచారం కల్గిన, పాఠాంతరాలుండే, జనప్రియత్వం పొందిన గద్యరూపమని నిర్వచించ వచ్చు. దీని స్వరూపం స్పష్టం కావాలంటే పురాణం-ఐతిహ్యం—కథ అనే మూడు విభాగాల భేదసాదృశ్యాలు తెలుసుకోవాలి.

కుతూహలం, కల్పనాశక్తి, విచారశీలత మనిషికుండే స్వాభావిక గుణాలు. ప్రకృతిలోని సూర్యచంద్రాదులు, పశుపక్ష్యాదులు, పృథివ్యాపస్తే

జోవాయురాకాశాదులు మానవునికి అడుగడుగునా కుతూహలాన్ని రేపాయి. కల్పనా తరంగాలను సృష్టించాయి. అతన్ని వైచారిక పథాన నడిపించాయి. ప్రకృతి లోని సౌందర్యమూ, భీకర స్వరూపమూ, సుఖదుఃఖాలూ మానవునిక ఎన్నో ఆలోచనల్ని కల్పిస్తాయి. ఆ ఆలోచనల సుడిగుండాల్లో చిక్కి మనిషి ఉక్కిరి బిక్కిరి అవుతాడు. భౌతిక వస్తువులను గూర్చి, దాని వెనుక దాగి ఉందనుకునే శక్తిని గూర్చి, స్వర్గ మర్త్యపాతాళాదులను గూర్చి మనిషి ఆలోచించాడు. అతని ఈ ఆలోచనా శక్తి ఎంతోదూరం పోలేనప్పుడు కల్పనా శక్తే ఎక్కువై కాల్పనిక కథలు రూపుదాలుస్తాయి. తన తెలిసిందీ, తెలియందీ, జరిగిందీ, జరగందీ మనిషి ఎప్పుడైతే తోటి వారికి వర్ణరంజితంగా చెప్పడం ప్రారంభిస్తాడో అప్పుడే కథ పుడుతుంది. ఇలాంటి 'కట్టుకథలు' జరిగాయి అని మనం నమ్మే స్థలం చుట్టూనో, సంఘటన చుట్టూనో తిరుగుతూ వుంటే అవి ఐతిహ్యాలవుతాయి. ఇవి దైవాంశ సంభూతాలై, అద్భుతంగా పెరిగి, నిజంగా ఇవి జరిగినవే అని నమ్మకం పుట్టిస్తే పురాణాలవుతాయి. అవి నిజానికి 'పుక్కిటి పురాణాలే'కావచ్చు. ఈ విధంగా కథలే ఒక్కొక్క సారి, ఐతిహ్యాలై, ఆ తర్వాత పురాణాలుగా మారుతాయి అయితే మరికొందరు విద్వాంసుల అభిప్రాయంలో పురాణాలే సరళ రూపం చెంది కథలుగా మారుతాయి. దీనినే పురాణ మూల సిద్ధాంతం అని కూడా అంటారు. కథల పుట్టుకను గురించి చెప్పేటప్పుడు దీన్ని గురించి ప్రస్తావించడం జరుగుతుంది. స్థూలంగా, సరళంగా పురాణం-ఐతిహ్యం—కథ—ఈ మూడింటి స్వరూపాన్ని ఈ క్రింది విధంగా చెప్పవచ్చు. కథ సరళమైంది. కుతూహలాన్ని రేకెత్తించేది. కల్పనా ప్రతిభ భాసించేది. ఎక్కువ జనప్రియత్వం కలది. ఐతిహ్యం అంతకంటె కొంచెం గంభీరమైనది. ఇతిహాసం లేక చరిత్ర ఐతిహ్యానికి ఆధారం. కథలో కేవలం కల్పన మాత్రమే ఉండవచ్చు. కాని ఐతిహ్యంలో ఏదో మారుమూల కొంచెం చరిత్రాంశం ఉంటుంది. కనీసం అలా జరిగిందనే నమ్మకం జనులలో ఉంటుంది. పురాణంలో ఈ నమ్మకం ఇంకా బలపడుతుంది. అది మరింత గంభీరమైనది. చింతన శీలమైనది. ప్రజలలో గాఢంగా నాటుకుని పోయిన నమ్మకాలే దాని కాధారం. దానిలో వాతావరణం గంభీరమైనది. పాత్రలు దేవతా మూర్తులు. కథనం స్వర్గమర్త్య పాతాళాదులలో ఎక్కడైనా జరగవచ్చు.

పై కారణాలను పరిశీలిస్తే ఐతిహ్యం, పురాణం అన్నవి సాహిత్యానికి కొంత దూరంగా ఉంటాయన్నది స్పష్టమవుతుంది. అందువల్లనే 'జానపద సాహిత్యం' అన్నప్పుడు జానపద కథలను మాత్రమే పట్టికలో చేరుస్తారు (గేయం, కథాగేయం, కథ, సామెత, పొడుపు కథ), మౌఖిక జానపద విజ్ఞానం అన్నప్పుడు గద్య కథనాలన్నిటినీ చేరుస్తారు. ఈ క్రింది విధంగా దీన్ని స్పష్టం చేయవచ్చు.

1) 


2) 


పురాణాలు

పురాణాలు విజ్ఞాన ప్రదాలు. అయితే వాటిలో నిది విజ్ఞాన పూర్వ యుగాల విజ్ఞానం (science of pre-scientific ages). గేయాల్లో, కథల్లో ఇలాంటి విజ్ఞానం కనిపించదు. విశ్వసృష్టికి సంబంధించిన ఆలోచనలు, నమ్మకాలు పురాణాల్లో ఉంటాయి. ధార్మిక మహాపురుషులు, సాంస్కృతిక వీర పురుషులు, దేవతావ్యక్తులు పురాణాలలో నాయకులుగా ఉంటారు. ఒక్కొక్క సారి ఈ పురాణ పురుషులు ఐతిహ్యవ్యక్తులూ అయివుండవచ్చు. బుద్ధుడు, రాముడు, కృష్ణుడు, అగస్త్యుడు, వర్ధమానుడు మొదలైన వారిని ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు. వీరిలో కొందరు చారిత్రక వ్యక్తులూ ఉండవచ్చు. చరిత్రే సాంకేతిక భాషలో వికృత రూపం ధరిస్తే పురాణ మవుతుందని

కొందరు విద్వాంసుల తలంపు. అవి నిజం కాకున్నా మానవుని మనోవికాసాన్ని అర్థం చేసుకోడానికి సహాయ పడతాయనడంలో సందేహంలేదు. వాటిలో కొట్ట వచ్చినట్లు కనిపించే అద్భుత విషయాలను తొలగించి, వాటి వెనుక దాగివుండే విజ్ఞానాన్ని, సంస్కృతి స్వరూపాన్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తే చరిత్ర పూర్వయుగాలను గురించిన ఎన్నో మహత్తర విషయాలు తెలుస్తాయి. ఆదిమ మానవుని ఆలోచనా ప్రవంతికి అద్దం పట్టేవి పురాణాలు.

పురాణానికి, మూఢనమ్మకానికి (superstition) భేదం ఉంది. పురాణంలో విశేషమైన నమ్మకాలకు ప్రాధాన్యం ఉంటుంది. మూఢ నమ్మకాలలో వివేక రహితమైన నమ్మకాలతో గూడిన భయం ప్రధానంగా ఉంటుంది. పురాణాలే మూఢ నమ్మకాలుగా మారవచ్చు. మూఢనమ్మకాలే ఒక్కొక్కసారి పురాణాలుగా మారవచ్చు పురాణాలకు, జానపదుల నమ్మకాలకు ఉండే సంబంధంకూడా పరిశీలించ వలసి ఉంది. ఒక తరం మనుషులకు ఏదైనా విషయం మీద ఉండే నమ్మకం మరొక తరం వాళ్ళకు పురాణం అవుతుంది. ఈ విధంగా నమ్మకాలే పురాణాలుగా మారవచ్చు.

పురాణాలను నిర్వచించే ప్రయత్నాలు జరిగాయి. ''పురాణం దేవతల్ని, దేవతాపురుషుల్ని, సాంస్కృతిక వీరుల్ని గురించిన కథనం. పురాణం విశ్వ సృష్టిని గురించి, ప్రపంచం ప్రస్తుత స్థితికి ఎలా వచ్చిందన్న దాని గురించి, ప్రజల పుట్టుకను గురించి, జాతి, సాంస్కృతిక వర్గాల పుట్టుకను గురించి చెప్తుంది'' (తెలుగు అనువాదం—కెన్నెత్ ఈ మేరీక్లార్క్ 1963 : 27). "ది స్టాండర్డ్ డిక్షనరీ ఆఫ్ ఫోక్‌లోర్‌లో" పురాణాన్ని గురించిన వివిధ అభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. ప్రాచీనయుగాలలో జరిగినవని చెప్పబడేవే పురాణాలన్నదిబహుసమ్మతమైనఅభిప్రాయం.జి.యల్.గొమ్మె(G.L.Gomme ప్రకారం ఇవి విజ్ఞాన పూర్వయుగాల విజ్ఞానానికి సంబంధించినవి. పురాణంలో మత సంబంధమైన నేపథ్యం తప్పక ఉండాలని దేవతలే ప్రధాన పాత్రలుగా ఉండి తీరాలని పై కోశంలో అభిప్రాయం వ్యక్తమయింది (పు 778). కాని సంఘంలోని వ్యక్తుల నమ్మకమే ప్రధానం గాని, పురాణంలో దేవతా వ్యక్తులకు ప్రాధాన్యం లేదనే వారూ ఉన్నారు. ఒక సాంస్కృతిక ప్రదేశానికి (cultural area) చెందిన జనం మధ్య అవగాహనకు, మానవాతీత విష

యాలను అర్థం చేసుకోడానికి పురాణాలు సహాయం చేస్తాయని చెప్తూ, అర్థ సంబంధమైన వ్యవస్థకు(semantic system) సంబంధించిన శైలీసంబంధ విషయాలుగా పురాణాలను నిర్వచించడమూ జరిగింది. పురాణ శాస్త్రం (mythology)లో గొప్ప విద్వాంసులైన మరండా (Pierre Maranda) భాషా శాస్త్రదృష్టితో, మానవ శాస్త్ర దృష్టితో పైవిధంగా నిర్వచించడమే కాకుండా పురాణశాస్త్రం పేరుతో అత్యుత్తమ గ్రంథాన్ని సంపాదకత్వం వహించి ప్రచురించారు (Mythology, Ed. P. Maranda, Penguin Education Reprinted 1973).

పురాణాలు కొన్ని విషయాలను వివరిస్తాయి. గబ్బిలం ఎందుకు గుడ్డిదయిందో అవి చెప్తాయి. ఇంద్ర ధనుస్సు ఎందుకు వస్తుందో అవి వివరిస్తాయి. వాన ఎందుకు కురుస్తుందో, ఎవరు కురిపిస్తారో అవి చెప్తాయి. సూర్య చంద్రులు, ఉదయాస్తమయాలు, వానలు వరదలు మొదలైన వస్తువులకు సంఘటనలకు, ప్రకృతి లాస్యానికీ వైపరీత్యానికీ, వివరణలు పురాణాలలో కనిపిస్తాయి.

లక్షణాలు :

జానపద పురాణాలు సాంప్రదాయిక మైనవి (traditionl). పురాణాలకు చాలా ప్రాచీన సంప్రదాయం ఉంది. ఏ భాషకు చెందినవైనా, ఏ జాతికి చెందిన వైనా ఈ పురాణాలు ప్రాచీన కాలంనుంచి ఒక తరం నుంచి మరొక తరానికి సంక్రమిస్తూ బాగా పాత బడి పోయాయి. మొదట ఒక వ్యక్తి ఆలోచననుంచి పుట్టినా జానపద పురాణాలు సామూహిక ఆస్తిగా మారుతాయి. ఒక సమాజం సాంప్రదాయికంగా వ్యక్తం చేసేనమ్మకాల ఆధారంగా ఇవిరూపొందుతాయి. పురాణాలు కథన రూపంలో ఉంటాయన్నది రెండవ లక్షణం. పురాణాలకు కథలకు లాగా ఒక నిర్దిష్టకథన రూపం ఉండదు. కథలు అనేక పాఠాంతరాలతో కూడి ఉన్నా వాటికొక నిర్దిష్ట రూపమంటూ ఉంటుంది. కాని పురాణాలలో ప్రధాన వ్యక్తులు, ప్రధాన సంఘటనలు మాత్రం ఉంటాయి. మిగిలినదంతా ఒక్కొక్క వ్యక్తికీ మారుతుంటుంది. అంటే కథనం ఉన్నా అది నిర్దిష్టరూపంలో ఉండదు. కొన్ని పురాణాలు చిన్న వాక్యం రూపంలో కూడా ఉండవచ్చు. 'గుడ్ మార్నింగ్' అన్నదీ ఒక సూర్యపురాణమే

(Sun myth). సూర్యుడు ఉదయిస్తే శుభం కలుగు తుందనే నమ్మకంతో శుభోదయాన్ని పలుకుతున్నాం. దీన్ని ఆధారంగా చేసుకునే 'గుడ్ యాఫ్టర్ నూన్', 'గుడ్ఈవినింగ్' గుడ్‌నైట్' అన్నవీ ఏర్పడ్డాయి. మామూలుగా పురాణాలలో అనేక వాక్యాల కథనం ఉంటుంది. పురాణాలు వివరణాత్మకంగా ఉంటాయన్నది మూడవలక్షణం. కొన్ని వస్తువులను, నమ్మకాలను, ఆచారాలను, సంఘటనలను ఇవి వివరిస్తాయని వెనక పుటలలో చెప్పడమైంది. దేవతా వ్యక్తులు ప్రధాన పాత్రలుగా ఉండడం, మానవాతీత వ్యక్తులమీద నమ్మకాన్ని బలపరచడం, సమాజంలోని వ్యక్తుల నడుమ మత సంబంధమైన సంబంధాలను పెంపొందించడం పురాణాల లక్షణాలు, ప్రయోజనాలుకూడా అయివుంటాయని చెప్పవచ్చు.

పురాణాల విభజన :

'డిక్షనరి ఆఫ్ ఫోక్‌లోర్' లోని 'టైప్' (type) అనే ఆరోపం క్రింద ఆర్.ఎస్.బాగ్స్ ఇచ్చిన జానపద విజ్ఞాన వర్గీకరణలో ఈ క్రింది పురాణాల విభజన కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| బి 220 | సృష్టి కర్త | బి 260 | జంతువుల సృష్టి |
| బి 230 | దేవతలు | బి 270 | వృక్షజాతుల సృష్టి |
| బి 240 | విశ్వసృష్టి | బి 280 | జంతువులలక్షణాలు |
| బి 250 | మానవ సృష్టి | బి 290 | వృక్షజాతుల లక్షణాలు |

పురాణాలను నమ్మకాలనుబట్టి, వస్తువునుబట్టి వివరణనుబట్టి వర్గీకరించే ప్రయత్నాలు కూడాజరిగాయి (చూ. Encyclopaedia of Religion and Ethcs) ముఖ్యమైన పురాణ విభాగాలివి :— 1. ప్రకృతిలో కాలానుగుణంగా సంభవించే మార్పులకు, ఋతువులకు సంబంధించినవి : ఈ పురాణాల్లో సూర్య చంద్రాదులు పాత్రలు. అనేక పురాణాలలో సూర్యుడు మగవాడు. చంద్రుడు (చంద్రమ్మ అనవచ్చా?)ఆడుది. తెలుగువారికి చంద్రుడు చందమామ. అయినా 'చందమామ రావే జాబిల్లిరావే' అని 'మామ'ను ఒక వస్తువుగానే భావిస్తారు. 2. ప్రకృతి వస్తువులకు సంబం

ధించినవి. సూర్యచంద్ర నక్షత్రాలు కాలగమనానికి సంబంధించిన ప్రకృతి వస్తువులు. ఇతర ప్రకృతి వస్తువులకు సంబంధించిన పురాణాలు ఈ రెండవ విభాగం క్రిందికి వస్తాయి. నదిని దేవతగా నిరూపించే పురాణాలు తెలుగు లోనూ ఉన్నాయి. గోదావరి, కృష్ణమ్మ, కిన్నెరసాని మొదలైన నదులు వాగులు స్త్రీరూపంగా జానపదుల కల్పనలో భాసిస్తాయి. వనదేవత ఫలాలను ఇవ్వడం, వరాలను ప్రసాదించడం మనకు పరిచితాలే. 3. ప్రకృతి వైపరీత్యాలకు సంబంధించినవి : తుఫాను వచ్చినా, ఉప్పెన వచ్చినా, వానవచ్చినా, వరద వచ్చినా, అగ్ని పర్వతం బ్రద్దలయినా మానవాతీత శక్తుల కృత్యంగా భావించ డం సర్వసామాన్యం. పాతాళంలో ఉండే భయంకర రాక్షసాకార జీవుల వల్లనే భూకంపాలు సంభవిస్తాయని కొన్ని పురాణాలు చెప్తాయి. పోలేరమ్మ వంటి దేవతల వల్లనే సాంక్రామిక రోగాలు సంభవిస్తాయని మనలో బలమైన నమ్మ కం ఉంది. రాహుకేతువుల వల్ల గ్రహణం సంభవిస్తుందనే నమ్మకం, దానికి సంబంధించిన పురాణం మనకు బాగా పరిచితమే. 4. విశ్వ విశ్వ సృష్టి : అనేక ప్రాచీన పురాణాలలో సృష్టిని సంబంధించిన వివరణ కనిపిస్తుంది. భూమి ఒక దేవతగా మన పురాణాలలో ఎన్నో విధాలుగా సాక్షాత్కరిస్తుంది. విశ్వం నీటిలో నుంచి పుట్టినట్లుగా కొన్ని పురాణాలు చెప్తాయి. 5. దేవతల సృష్టికి సంబంధించినవి : శివ, విష్ణు, రామ, కృష్ణ, పార్వతి, గణపతి, కుమారస్వామి మొదలైన వారి జననానికి సంబంధించిన కథనాలు భారతదేశానికంతా పరిచితమైనవే. ఈ జాతీయ దేవతా గణం కాక ప్రతి ఊరికీ, ప్రతిపల్లెకూ దేవుళ్ళున్నారు, దేవతలున్నారు. వాళ్ళ సృష్టికి సంబంధించిన పురాణాలున్నాయి. 6. మానవసృష్టి ప్రాణిసృష్టి : ఈ రెండూ పరస్పరం సంబంధం కలవిగా చెప్పబడుతుంటాయి. ఒక్కొక్క సారి మానవులు చెట్లనుంచి కూడా పుట్టినట్లుగా పురాణాలలో ఉంటుంది. జంతువు లకు మనుషులు జన్మించినట్లుగా ఉండే పురాణాలు అధిక సంఖ్యలో దొరుకు తాయి. 7. పరివర్తనాత్మక పురాణాలు . రాళ్ళు మనుషులుగా మారటం, ఒక జంతువు మరొక జంతువు కావడం, మనిషి జంతువులుగా పరివర్తన చెందటం, ప్రకృతిలోని వస్తువులు మనుషులుగా మార్పుచెందటం కొన్ని పురాణాలలో కనిపిస్తుంది. 8. వీరులను గురించి, దేశాలను గురించి, స్థలాలను గురించి చెప్పేవి : చంద్రవంశం చంద్రునినుంచి వచ్చిందనటం, సూర్య

వంశం సూర్యునినుంచి వచ్చిందనటం. స్థలపురాణాలలో దేవతల పాత్రను అద్భుతంగా చెప్పటం కనిపిస్తుంది. వీటిలో అనేకం ఐతిహ్యాలనుంచి రూపు దాల్చినవే. 9. సాంఘిక సంస్థలకు, ఆచారాలకు సంబంధించినవి : సంఘం లోని ఆచారాలను, పద్ధతులను కల్పించినది దేవుడే అని చెప్పటం దానికి సంబంధించిన పురాణాలను చెప్పటం మనకు తెలిసిందే. 10. మరణానంత జీవితాన్ని గూర్చినవి : మరణానంతర జీవితాన్ని గూర్చిన నమ్మకం ప్రపంచ వ్యాప్తంగా ఉంది. చనిపోయిన వారుండే నరకాన్ని స్వర్గాన్ని రకరకాలుగా మనవారు ఊహించారు. యమలోకంలో మనకోసం కాచుకొని ఉన్న శండన రకరకాల పురాణాలుగా ప్రచారంలో ఉంది. 11. రాక్షసులకు, పిశాచులకు సంబంధించినవి : మానవుని కల్పనాశక్తి ఎన్నివిధాల రూపమెత్తగలదో ఇవి నిరూపిస్తాయి. భయంకర రూపాలెన్నో మనిషి మస్తిష్కంలో జన్మఎత్తాయి. దేవరాక్షస సంగ్రామాలను అతి సామాన్య రీతిలో సరళంగా కూడా జానపదులు తమ పురాణాలలో వర్ణించారు. 12. ఐతిహాసిక సంఘటనలు : చాలా ప్రసిద్ధ మైన ఉదాహరణలు ఏసుక్రీస్తు, బుద్ధుడు, బసవేశ్వరుడు మొదలైనవారికి సంబంధించినవి. వీరందరూ ఐతిహాసిక వ్యక్తులే. అయినా వారిజీవితాలకు ఎన్నో మహిమలను అంటగట్టి మన ప్రజలు వారిని పురాణ పురుషులుగా మార్చారు. ధార్మిక కర్మమార్గాన్ని నిరసించి నిజమైన కర్మయోగిత్వమే (పని చేయటం) కైలాసమని బోధించిన బసవేశ్వరుణ్ని వంగకాయలు లింగ కాయలుగా మార్చే పురాణ వ్యక్తిగా చేశాడు పాల్కురికి సోమన. అయితే సోమన కాధారమైన 'బసవగీతార్థ సమితి' రూపొందిన కాలానికే ప్రజలు బసవనను మహిమలుగల మహావ్యక్తిగా చేసేశారు కాబోలు ! ఈ విధంగా కొన్ని చారిత్రక సంఘటనలు కూడా పురాణాలుగా రూపొందాయి.

పురాణాలపుట్టుక — వికాసం :

పురాణాల ఉత్పత్తిని గూర్చిన కొన్ని సిద్ధాంతాలున్నాయి. వాటిలో మొదటిది దివ్య వస్తువుల కథనాలనుంచి ఇతర పురాణాలన్నీ ఆవిర్భవించాయని చెప్తుంది (Metearological theory). ప్రాచీనకాలంలో సూర్యచంద్రాదులు, ఇతర దివ్యవస్తువులను గురించిన కల్పనలు సమృద్ధిగా ఉండేవి. ఇవే ఇతర పదార్థాలనుగురించిన వివరణలకు తావిచ్చాయని కొందరి అభిప్రాయం. భౌతిక

మూల సిద్ధాంతం (physical theory) ప్రకృతిలోని ఇతర భౌతిక వస్తువులను గురించిన పురాణాలే అన్నిటికీ మూలమని చెప్తుంది. కర్మాచరణ (ritual) సిద్ధాంతం ప్రాచీన కర్మాచరణలను గూర్చిన వివరణలే పురాణాలయ్యాయంటుంది. చాలా పురాణాలలో సాంకేతికంగా ఏదో ఒక కర్మాచరణను గురించిన విషయం ఉంటుందని కొందరు విద్వాంసులు అభిప్రాయపడ్డారు. పురాణాల ఉత్పత్తిని గురించిన మరొక సిద్ధాంతం చారిత్రాత్మక సిద్ధాంతం. చారిత్రక వ్యక్తులు, సంఘటనలే పురాణాలు పుట్టడానికి కారణమని ఈ సిద్ధాంతం ప్రతిపాదిస్తుంది.

పురాణాలు విశ్వవ్యాప్తమైనవి. విభిన్న ప్రదేశాల పురాణాలలో కూడా సమానాంశాలుండడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. వస్తువులో, వివరణలో కూడా ఈ సమాన గుణాలు కనిపిస్తాయి. సృష్టికి సంబంధించిన పురాణాలు ప్రపంచమంతటా దర్శనమిస్తాయి. పురాణాల వికాసం ఒక పద్ధతి ప్రకారం జరుగుతుందని భావించిన విద్వాంసులు ఆ పద్ధతుల్ని గుర్తించే ప్రయత్నాలు జరిపారు. 1. ఒక విషయాన్ని రెండింతలు, మూడింతలు, నాలుగింతలు చేసి పురాణ కథనాన్ని పెంచడం కనిపిస్తుంది 2. జాతీయస్థాయిలో ప్రసిద్ధమైన పురాణాలను, వేరే భాషలనుంచి స్వీకరించిన పురాణాలను తమ ప్రాంతాలలోని విశిష్టసంస్కృతి సంప్రదాయాల ననుసరించి మార్పులు చేయడం 3. కొన్ని మూలకథా వస్తువులనుంచి వివిధ పురాణాలను కల్పించడం. 4. కొన్నిపురాణాలను విస్తరించడం.

తెలుగు పురాణాలు

తెలుగు వారు పుట్టిపెరిగిన వృత్తాంతమే ఒక పెద్దపురాణం. విశ్వామిత్రునిచేత శాపం పొందిన ఆంధ్రులెవరో, ద్రావిడులుగా పుట్టిపెరిగిన తెలుగువారెవరో, తెలగలెవరో, వికలాంగులెవరో, ఈనాడు ఆంధ్రదేశంలో నివసిస్తున్న తెలుగువారు ఎన్నెన్ని మూలాలనుంచి ఉద్భవించారో ఊహించాల్సిందే గాని, ఖచ్చితంగా నిర్ణయించడానికి ఆధారాలు లేవు. ఒక్కొక్క జాతికీ ఒక్కొక్క పురాణమూ, వంశచరిత్రా, ఐతిహ్యమూ ఉన్నాయి. తెలుగుగడ్డ మీద ఎన్నో పురాణాలు పుట్టాయి, పెరిగాయి, నశించాయి. ఈనాడు ప్రచారంలో ఉండే పురాణాల వివరణాత్మక అధ్యయనం (descriptive study)

మాత్రమేకాక తెలుగునాట వికాసం చెందిన పురాణాల చారిత్రక అధ్యయనం (historical study) కూడా చేయాల్సిఉంది. ఆంధ్రదేశానికి నాగజాతికి మొదటినుంచి సంబంధం ఉంది. మన ప్రాచీన గ్రంథాలలో నాగులనుగూర్చి పురాణాలనేకం సూచింపబడ్డాయి, వివరింపబడ్డాయి. నాగులపాడు, నాగవరం, నాగులేరు, నాగూరు, నాగపట్టణం వంటి ప్రదేశాలెన్నో వెలశాయి. నాగి, నాగన్న, నాగరాజు వంటిపేర్లు తెలుగువారి నామధేయాలయ్యాయి. నాగప్రతిష్ఠ, నాగులచవితి ఆచరణ, నాగపంచమి పూజలు, ఉపవాసాలు మొదలైనవన్నీ ఆంధ్రదేశంలో వాడుకలో ఉన్నాయి. నాగులను పాములను ఒకటిగా చేసి కథలల్లారు. సంతానానికి నాగపూజ, నాగప్రతిష్ఠ చేయటం ఆంధ్రులకు అలవాటే. మిథునకార్యానికి, నాగానికి సంబంధం మన సంస్కృతిలోనే కాక ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో కనిపిస్తుంది. ఈ కారణం వల్లనే నాగ పూజకు సంబంధించిన ఈ క్రింది పురాణం వంటివి ప్రపంచమంతటా ఉన్నాయి.

"ధరణికోట వంశంవారికి మగపిల్లలు పుట్టరు (పుట్టారనడానికి ఎన్నో ఉదాహరణ లివ్వవచ్చు కాని ఒకటి రెండు కుటుంబాలలో పిల్లలు పుట్టకపోతే అది విశ్వవ్యాప్తమైన సూత్రంగా భావించడం జానపదులకు మామూలే), ఒకవేళ ఎవరైనా 'ధరణికోట' ఇంటిపేరు గలిగిన వారికి దత్తుగా వెళ్ళినా సంతానం కలగదు. ఒకవేళ కలిగినా ఆడపిల్లలే పుట్టారు. దీనికి కారణం ఇది. వీరివంశంలో ఒకరికి పాముపుట్టింది. ఆ పాముకి నాగరాజని పేరుపెట్టి వీరు ప్రేమగా పెంచసాగారు. పాలుతాగి పెరుగుతూ ఎవ్వరికీ ఏహానీ చెయ్యకుండా, ఆ పాము అందరి ప్రేమనూ చూరగొన్నది. ఒకసారి ఇంట్లో ఏదో శుభ కార్యం జరుగుతున్నది. పాము వంటింట్లో ఒకమూల ముడుచుకొని పడు కుంది. అది ఉన్న విషయం తెలియక ఇంటివారు సలసల కాగే పాయసం గంగాళాన్ని పాముమీద పెట్టగా అది కమిలి చనిపోయింది. ఆ పాముకు మనిషి లాగే అంత్యక్రియలు జరిపారు. అప్పటినుంచి ఆ వంశంలో పుత్రసంతానమే కలగడం లేదు".

పుత్రసంతానమే లేకుంటే ఆ వంశం ఏ విధంగా ఈనాటికీ నిలిచి ఉంది అని ప్రశ్నించేవారు జానపదుల దృష్టిలో 'అతితెలివి' గలవారు. ఆ

విషయం ఎట్లున్నా నాగులకు సంబంధించిన పురాణాలు ఆంధ్రదేశంలో చాలా కాలం నుంచి ఉన్నాయన్నది మాత్రం నిజం. నాగులే అనార్యులైన ఆంధ్రులని, నాగులు — ద్రావిడులు వేరువేరు జాతులుకారని, ఒక్కరని కొందరు విద్వాంసులు భావించారు. ఆంధ్రవిష్ణువుకు సంబంధించిన పురాణం కొన్ని శిష్టపురాణాలలోనే గాక జనవ్యవహారంలో కూడా ఉంది. ఆంధ్రవిష్ణువు నిశుంభుడనే రాక్షసుడితో పదమూడు మహాయుగాలు యుద్ధంచేసి వాడిని వధించాడని చెప్తారు. ఆంధ్రవిష్ణువు "శ్రీశైలము, భీమేశ్వరము, కాళేశ్వరము నడుమ ప్రాకారములు నిర్మించి కోటగట్టి యాత్రిక్షేత్రములను త్రిద్వారములుగ జేసి త్రిశూలధారియైన యీశ్వరుని కాపుపెట్టి ఋషులతోగూడ గోదావరీ తీరమునందు నివసించెననియు అప్పటినుండియు నీదేశము త్రిలింగదేశమని వ్యవహరింపబడుచున్నదనియు చెప్పెడిగాథమూలముననే సత్యమును లేక కల్పింపబడినదని మాయభిప్రాయముగాదు" అన్నారు చిలుకూరి వీరభద్రరావుగారు (ఆంధ్రుల చరిత్రము, ప్రథమ భాగము, 1910, పు, 80). ఇది కల్పితకథో కాదో కాని నిశుంభాదులతో పోరాడడం, శివుణ్ని కాపు బెట్టడం మొదలైనవి చేరి దీన్ని పురాణంగా చేశాయి.

ఆంధ్రులను గురించిన పురాణాలేకాక దేవతలకు సంబంధించిన పురాణాలు ఆంధ్రదేశమంతటా అసంఖ్యాకంగా కనిపిస్తాయి శిష్టులకు రేణుకగా, జానపదులకు ఎల్లమ్మగా ప్రసిద్ధురాలయిన దేవతలను గురించి గద్యపద్యాలలో అనేక పురాణాలు ప్రాచుర్యం పొందాయి. జానపదుల దేవతలు చాలా వరకు స్త్రీలే. యుద్ధదేవతలు పురుషులు, గ్రామదేవతలు స్త్రీలు. శక్తిపూజాపద్ధతి భారత దేశంలో ప్రాచీనకాలంనుంచి ప్రచలితమై ఉంది. శక్తి దేవత విగ్రహ రూపంలో ఉండవచ్చు లేదా శిలారూపంలో ఉండవచ్చు. చిన్నకొయ్య రూపంలో కూడా ఉండవచ్చు. ఆంధ్రదేశంలోని గ్రామదేవతలలో ఎల్లమ్మ, మల్లమ్మ, చిన్నమ్మ, పెద్దమ్మ, అంకాలమ్మ, పోలేరమ్మ, కలుగోళమ్మ, ఇరగాళమ్మ, నూకాలమ్మ, మైసమ్మ, గంగమ్మ, ముత్యాలమ్మ మొదలైన వారిని గురించిన పురాణాలున్నాయి.

గంగమ్మ పురాణం రాయలసీమలో పెక్కుచోట్ల ప్రచారంలో ఉంది. "ఒక నాలవ జాతివాడు పురాణాలు, శాస్త్రాలు అన్నీ చదువుకొని బ్రాహ్మ

ఋడినని చెప్పుకొని మోసంతో ఒక బ్రాహ్మణ స్త్రీని పెళ్ళి చేసుకున్నాడు. ఒకసారి ఉగాదినాడు పోళీలు వడ్డించగా అతని కొడుకులు తండ్రి వల్ల వచ్చిన సంస్కారంతో పోళీలు ఎనుబోతు నాలుకలాగా ఉన్నాయన్నారట! అప్పుడా బ్రాహ్మణస్త్రీ జనం తెలుకొని భర్తను 'ఎనుబోతువు' కమ్మ'ని శపించింది. కుమారుల్ని మేక, గొర్రె, కోడి అయిపొమ్మనింది. ఎనుబోతు ఆమెను తరిమి కొట్టింది. ఆమె ఒక పుట్టలో దాగింది. ఎనుబోతురూపంలో ఆమె భర్త కాళ్ళతో, తలతో పుట్టను కుమ్మాడు. అప్పుడామె కోపం పట్టలేక 'నీ తలను నరికించి, నీ కుడికాలును నరికి నీ నోట్లో కరిపించి, నీ రక్తం నా నుదుట అలంకరించుకునేంత వరకు నా తాపం చల్లారదు' అన్నదట. ఆమే గంగమ్మయింది". ప్రతి ఏటా పుంగనూరు మొదలైన చోట్ల ఉగాదికిముందు వచ్చే మంగళవారంనాడు గంగమ్మ జాతర జరుపుతారు. జాతరకు ముందు రోజు గొర్రెల్ని, మేకల్ని ఇతర పశువుల్ని సంతలో అమ్ముతారు. మొక్కుబళ్ళు ఉండేవారు వాటిని కొంటారు. మంగళవారంనాడు ఎనుబోతును అలంకరించి ఊరేగిస్తారు. ఊరంతా ఊరేగింపు జరిగిన తర్వాత ఎనుబోతును ఒక్క ఏటుకు నరుకుతారు.

అలంపూరు బ్రహ్మేశ్వరాలయంలో మొండెం, నగ్నత్వం కల ఒక దేవతా శిల్పం ఉంది. స్థానికులామెను ఎల్లమ్మంటారు. రేణుకాదేవి తలనరకబడింది కదా! తండ్రి ఆజ్ఞ చేత తల్లిని పరశు రాముడు తల నరగ్గా తలయెగిరి మాలవాడలో పడిందట. మొండెం అక్కడే నిలిచిందట. ఆలంపురీ మహాత్మ్యమనే స్థానిక వ్రాతప్రతిలో ఆమె గొడ్రాళ్ళకు పిల్లలనిచ్చే దేవతని ఉందని సురవరం ప్రతాపరెడ్డిగారు 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'లో వ్రాశారు. ఎల్లమ్మ కథలు అనేక శతాబ్దాలనుంచి ఆంధ్రదేశంలోను, కర్నాటక దేశంలోను ప్రచారంలో ఉన్నాయనడానికి గ్రంథస్థాధారాలున్నాయి. కాకతీయుల కాలంలో కూడా బవనీలు, మాదిగస్త్రీలు ఎల్లమ్మ కథల్ని వీరావేశంతో చెప్పేవారు. వాళ్లు ఈ కథల్ని చెప్తుండగా' జవనిక జుకజుంజుం జుక జుంజుం జుమ్మనుచు సాగుంగడున్ వాద్యముల్' అని క్రీడాభిరామం వర్ణించింది. ఆనాడు ఈ గేయ కథలతో బాటు గద్యపురాణాలుకూడా ఉండేవనడంలో సందేహం లేదు. ఎల్లమ్మను గూర్చిన కథలు తెలుగుదేశంలోనే కాక కన్నడ దేశంలోను విరివిగా ప్రచారంలో ఉన్నాయి. గ్రామదేవతగా చాలా చోట్ల ప్రజలందుకునే ఎల్లమ్మలు కాక

ముఖ్యంగా బెల్గాం జిల్లా సపదత్తిలో వెలసిన ఎల్లమ్మను పేర్కొనవలసి ఉంది. ఈమెకు "ఏళుకొళ్ళద ఎల్లమ్మ' అని పేరు. ఎల్లమ్మ కొండకు ప్రతి ఏడాది 10—15 లక్షల మంది యాత్రికులు వస్తారట. ఈ 'ఏడులోయల ఎల్లమ్మ'కు జాతర నెలరోజులు జరుగుతుంది. ఆ సమయంలో సుమారు 2 లక్షలమంది ఎల్లమ్మను దర్శిస్తారు. పార్వతి సప్తసంతానాలలో ఎల్లమ్మ కడగొట్టు బిడ్డఅని కొన్నికథల్లో చెప్పబడింది. దేవతలై వెలసిన అక్కదేవతల కథలను ఆంధ్ర దేశంలోని పలుప్రాంతాలలో చూడవచ్చు. 'ద్రవిడియన్ గాడ్స్ ఇన్ మాడర్న్ హిందూయిజం' అనే పుస్తకంలో (1925) ఎల్ మోర్ అక్కదేవతల పురాణాన్ని ఇచ్చాడు. బైండ్ల వాని అక్కల కథ ఒకదానితో ఇది పోలుతున్న విషయాన్ని డా. నాయని కృష్ణకుమారి గుర్తించారు. "వీరు అక్కచెల్లెండ్రేడుగురనియు వారిలో వారు పోట్లాడు కొని మరణించిరనియు, అంతట లోకమునందు వ్యాధులు వ్యాపించెననియు, ప్రజలు పూజలు చేసి వేడుకొనగా వారు దేవతలై వెలసిరనియు నా కథ యొక్క సారాంశము. ఇది బైండ్ల వాని యక్కల కథలోని యంశముతో సరిపోలు చున్నది" (1977 : 218).

సూర్య చంద్రాదులు, గ్రహాలు; నక్షత్రాలు, నదీనదాలు జానపదులలో ఆలోచనల్ని రేపి పురాణాల ఆవిర్భావానికి కారణమయ్యాయి. కొండల్లో, అడవుల్లో నివసించే ఆదిమజాతుల వారు సూర్యుణ్ని, చంద్రుణ్ని పురాణాల్లో నాయకులుగా చేసి వర్ణించారు. సూర్యుడు చంద్రుడు అన్నదమ్ముళ్ళని చెప్పే పురాణాలు కొన్ని ఉన్నాయి. గ్రహణాన్ని గురించి పురాణాలు కొన్ని ఉన్నాయి. ఒక పాము ఆహారానికై వెళ్ళినపుడు కొందరు తుంటరి బాలకులు దాని గ్రుడ్లను పగులగొట్టారని, వాళ్ళను పాము తరుముకొని పోగా వాళ్లు సూర్యచంద్రుల వెనక దాక్కున్నారని, అందువల్లనే పాము సూర్యుణ్ని, చంద్రుణ్ని మింగుతుందని ఒక పురాణం చెప్తున్నది. ఇదే గేయరూపంలో కూడా ఉంది.

స్థలనామాలను గురించిన కథలు ఐతిహ్యాలేగాని పురాణాలు కావనే వారున్నారు. కాని 'ఇలా జరిగింది' అనే నమ్మకం మాత్రమే కాక ఒక విధమైన అలౌకిక వాతావరణం, దేవతా వ్యక్తుల ప్రాధాన్యం ఉంటే 'స్థల పురాణం' అన్నది రూపు దాల్చవచ్చు. ఇది కూడా పురాణాలలో ఒక భాగమే,

తెలుగు దేశంలోని అనేక స్థలాలను గురించిన పురాణాలున్నాయి. వీటిలో కొన్ని శిష్టకావ్యాలకు కూడా ఎక్కాయి. అటు వంటి వాటిలో చాలా ప్రసిద్ధ మైంది 'శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యము.' సాలెపురుగు పాము, ఏనుగు శివలింగాన్ని పూజించేవని వాటికి పరమేశ్వరుడు ముక్తి ప్రసాదించాడని ఈ పురాణం చెప్తుంది. ఇలాంటి స్థల పురాణాలు ఆంధ్రదేశంలోని సామాన్య జాన పదాలను గూర్చి అనేకం ఉన్నాయి (ఆంధ్రభూమి వారపత్రికల్లో ఇలాంటివి 1980లో చాలా ప్రచురితాలయ్యాయి).

పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం తాలూకాలో ఉండి అనే గ్రామం ఉంది. దుంతుడు అనే రాక్షసుడు ఆ గ్రామంలో ఉండేవాడట. ఆ రాక్షసుడు మరణించినా అతని పేరైన 'దుండి' ఊరిపేరుగా నిలిచి అదే తర్వాత ఉండి అయిందట. (అళఘరి సువర్ణజ్యోతి—27—11-80)

పరశురాముడు తండ్రి ఆజ్ఞ పరిపాలించడం కోసం మాతృహత్య చేసి ఆదోషాన్ని నివారించుకోడానికి తపస్సు చేశాడు. తపస్సువల్ల అతని దోషం నివారణ అయిన చోటు 'హత్యరాల' (హత్యరాలిన చోటు) అయిందని, అదే తర్వాత 'అత్తిరాల' అయిందని అంటారు. (ఎ. శ్రీరంగాచారి—11—9—80).

ఆంధ్రదేశంలో ఒకానొకప్పుడు గొప్ప సాహిత్య, సాంస్కృతిక క్షేత్రమై ఉండిన పిఠాపురం పేరు వెనక ఒక పురాణం ఉంది: "గయాసురు డనే రాక్షస సంహారం తర్వాత ఈశ్వరుడు కుక్కుటేశ్వర స్వామిగా వెలిశాడు. దేవతలు అక్కడ ఒక ఆలయాన్ని నిర్మించి ఒక ఉన్న పీఠమున అంబికా దేవిని ప్రతిష్ఠించి 'పీఠాంబిక' అని పూజలు చేశారు. అక్కడే ఒక పురాన్ని నిర్మించి 'పీఠికాంబపురం' అని పేరు పెట్టారు. తరువాత ఆ పేరు 'పీఠికా పురము'గా మారింది. ఇప్పుడా గ్రామాన్ని 'పిఠాపురం'గా పిలుస్తున్నారు" (దేవపల్లి సూర్యనారాయణ—11—9—80).

బెంగుళూరును గురించి ఒక ఐతిహ్యం ఉంది. రాజు వేటకు రావడం, దారి తప్పిపోవడం, అడవిలో ఆతిథ్యం పొందడం మొదలైన మూలాంశాలు కలిగి ఉండే ఇలాంటి ఐతిహ్యాలు ప్రపంచంలో పెక్కు చోట్ల కనిపిస్తాయి.

ప్రతాపరుద్రునికి సంబంధించిన ఒక ఐతిహ్యం పురాణంగా మారిన సందర్భం ఈ క్రిందిది :

"తన సామ్రాజ్యాన్ని చుట్టి వెడుతూ కాకతీయ ప్రతాపరుద్రుడు ఓ చోటికి వచ్చాడు. అక్కడ కొన్ని ఇళ్లు కనిపించాయి. చీకటి పడడంతో ఆయన పరివార సమేతంగా ఆ రాత్రికి అక్కడే బసచెయ్యాల్సి వచ్చింది. వాళ్ళకి ఆ ఇళ్ళలో ఒకగుడి కనిపించింది. ఆ గుడిలో దేముడి విగ్రహం మాత్రం లేదు. అందరూ ఆ రాత్రికి అక్కడే పడుకున్నారు. అర్ధరాత్రి పూట వాళ్ళలో ఒకడికి మెళకువ వచ్చింది. అప్పుడు కనిపించిన భయంకర స్త్రీ ఆకారాన్ని చూసి గట్టిగా కేకేశాడు. ఆ కేకతో చాలామంది మేల్కొన్నారు. ఇంతలో అక్కడున్న వారిలో ఒకామెకి ఒక స్త్రీ దేవత పూనింది. అందరూ భయభ్రాంతులయ్యారు. ఒకామె ధైర్యం చేసి "అమ్మా....తల్లీ....మీరెవరో గానీ శాంతించండి తల్లి....ఏదివ్యరూపం లేని ఈగుడిలో ఒక దేవిగా కావే అమ్మా" అన్నది.

వెంటనే అక్కడున్న వాళ్ళంతా చేతులు జోడించి "కావేఅమ్మా...." అన్నారు.

అప్పుడా స్త్రీ నావరించి యున్న దేవత నీడ రూపంలో ఆమెను వీడి, గుడిలో శిలగా నిలిచి పోయింది. అప్పటి వరకూ ఏపేరూ లేని ఆ పేటకు ప్రతాపరుద్రుడు 'కావే అమ్మ పేట' అని నామకరణం చేశాడు.

ఆనోట ఆనోట నాని ఆ పేరు చివరకు 'కావేరమ్మ పేట'గా మారి పోయింది. ఈ గ్రామం మహబూబ్‌నగర్ జిల్లాలోని జడ్చర్ల తాలూకాలో వున్నది (జె. చెన్నయ్య—ఆంధ్రభూమి సచిత్ర వారపత్రిక 21—8—80).

రామాయణ ఘాటాలకు సంబంధించిన పురాణాలు లేక ఐతిహ్యాలు అనేకం కనిపిస్తాయి. వీటిని ఐతిహ్యాలనీ చెప్పవచ్చు. ఎందుకంటే పురాణాల లోని మానవాతీత వాతావరణం వీటిలో అంతగా కనిపించదు.

## అధ్యయనం

గద్యపురాణాలను గురించిన అధ్యయనం తెలుగులో అసలు జరగ లేదనే చెప్పాలి. ఇతర దేశాలలో విద్వాంసుల దృష్టిని ఇవి అమితంగా

ఆకర్షించాయి. జానపద విద్వాంసులు మాత్రమేకాక మానవ శాస్త్రజ్ఞులు కూడా పురాణాలను ఎన్నో విధాలుగా అధ్యయనం చేసి సంస్కృతిని గూర్చిన పరిశీలనకు వాటిని చక్కగా ఉపయోగించుకున్నారు. పురాణాలను విశ్లేషించడం ద్వారా ఆయా సంస్కృతులకు చెందిన ప్రజల మనో విశ్లేషణ, సామాజిక వ్యవస్థ విశ్లేషణ సాధ్యమవుతుంది.

1884లో ఆంద్రూ ల్యాంగ్ 'కస్టమ్ అండ్ మిథ్' అనే వ్యాస సంకలనాన్ని ప్రచురించిన నాటినుంచే పురాణాలమీద విద్వాంసుల దృష్టి పడింది. మెల్‌విల్ హెర్‌స్కోవిట్స్, లీన్హార్ట్, ఇకాసిరెర్, మెకంజి, ఎలియడ్ మొదలైనవారు గొప్ప రచనల్ని ప్రకటించారు. హెంద్రిక్స్ (Rhoda A.Hendricks) సంకలనం చేసిన 'పురాణకోశం' (A Dictionary of Mythologies, granada Publishing limited, 1981) ప్రపంచంలోని పురాణ నామ చూడామణిగా పేర్కొనవచ్చు. తెలుగులోను, కన్నడంలోను శిష్ట పురాణాలకు సంబంధించిన కోశాలు ఉన్నాయిగాని జానపద పురాణాలకు సంబంధించిన పుస్తకాలులేవు. మరండా సంకలనమైన 'మైథాలజీ' (Mythology, penguin Education, Reprinted, 1973) పురాణాల అధ్యయనాన్ని గూర్చి అత్యాధునికమూ, శాస్త్రీయమూ అయిన పద్ధతుల్ని పరిచయం చేసే అత్యుత్తమ గ్రంథం. నిర్మాణాత్మక విశ్లేషణనుంచి, కంప్యూటర్ విశ్లేషణవరకు గల అత్యాధునిక అధ్యయన రీతుల్ని ఈ పుస్తకం వివరిస్తుంది. అసలు ఈ పుస్తకాలలోని పద్ధతుల్ని మనం అర్థం చేసుకోవాలన్నా ఇంకా కొంత కాలం పడుతుందంటే అతిశయోక్తికాదు.

నిర్మాణాత్మక మానవశాస్త్రానికి ఎనలేని సేవచేసిన లెవి స్ట్రాస్ పురాణాల అధ్యయనంలో క్రొత్త త్రోవలు చూపాడు. ప్రపంచంలోని అత్యుత్తమ సాంఘిక మానవశాస్త్ర వేత్తలలో ఒకరైన లెవిస్ట్రాస్ (Claude Levi-Strauss) నిర్మాణాత్మక విశ్లేషణకు పితామహుని వంటివాడు. అస్దివాల్ పురాణాన్ని లెవిస్ట్రాస్ విశ్లేషించి చూపిన విధానం (చూ, The structural study of Myth and Totemism, Ed. Edmund Leach, Tavistock publications. 1967) ప్రశంసార్హంగా ఉంది. అస్దివాల్ (Asdiwal) పురాణం మనకంత ముఖ్యంకాకున్నా, దాన్ని విశ్లేషించి చూపినతీరు చాలా ముఖ్యమైంది. ఒక పురాణాన్ని అధ్యయనం చెయ్యాలంటే దానికుండే పెక్కు

పాఠాంతరాలను సేకరించాలి. ప్రతి పురాణాన్నీ నాలుగు స్థాయిలలో విశ్లేషించ వలసి ఉంటుందని లెవిస్ట్రాస్ సూచించాడు.

అవి : 1. భౌగోళిక అధ్యయనం 2. ఆర్థిక అధ్యయనం 3. సాంఘిక అధ్యయనం 4. దేవతా సంబంధమైన అధ్యయనం. భౌగోళికంగా పురాణాల లోని పేర్లు, ఎల్లలు, ప్రదేశాలు పరిచితమైనవే ఉంటాయని లెవిస్ట్రాస్ చెప్తాడు. ఆర్థికసంబంధమైన అధ్యయనం ద్వారా పురాణాల్లో కూడా సంఘంలోని ఆర్థిక స్థితిగతులు, వృత్తి, సాంఘిక సంబంధాలు (ఆర్థిక సంబంధమైనవి) చాలా వరకు నిజమైనవే ఉంటాయని తేలింది. సాంఘిక సంస్థలైన వివాహం, బాంధవ్యం, కుటుంబం మొదలైన వాటిలో సగం నిజం, సగం కల్పితాలై ఉంటాయి దేవతా సంబంధమైన వన్నీ కల్పితాలే. ఈ విధంగా నాలుగు విధాల అధ్యయనం చేస్తే పురాణం నిర్మాణం గురించి స్పష్టమైన అవగాహన కల్గుతుంది. పురాణాలు కేవలం అసత్య కల్పనలనే భావన తప్పు. అవి అప్ర యోజకాలైన కల్పనలు కావచ్చు కాని అసత్య కల్పనలు కావు. ఎందుకంటె మానవ చరిత్రలోని అనేక స్థాయిలలో మనిషి మనఃస్థితిని సూచ్యాత్మకంగా పురాణాలు చూపుతాయి. వాటిని విశ్లేషించ గలిగితే మనిషి మనస్సనే ఆకాశంలో మినుకు మినుకు మనే ఆలోచనల నక్షత్రాలను అర్థం చేసుకోవచ్చు. ఆ కాంతి లోనే సంస్కృతి పాఠాలను చదువుకోవచ్చు.

## ఐతిహ్యాలు

పురాణాలకూ, ఐతిహ్యాలకు ఉండే భేదాన్ని గుర్తించడం కష్టసాధ్య మని వెనకటి పుటల్లోనే సూచించడమైంది. పురాణాలను గురించి అయినా మనం కొంత వరకు వింటుంటాం గాని, ఐతిహ్యాలను గురించిన అవగా హన మనకు లేదనే చెప్పవచ్చు. 'డిక్షనరి ఆఫ్ ఫోక్లోర్'లో ఐతిహ్యం అన్నది నిర్దిష్ట వ్యక్తులకు, స్థలాలకు, వస్తువులకు సంబంధించినదని చెప్ప బడింది. జరిగాయని మనం నమ్మేవాటిని ఐతిహ్యాలనవచ్చు. ఇతిహాసానికి (=చరిత్ర, historical fact) ఐతిహ్యానికీ (legend) ఉండే భేదాన్ని గుర్తించాల్సి ఉంది. ఇతిహాసం లేక చరిత్ర కొన్ని సాక్ష్యాధారాలతో కూడి ఉంటుంది. శాసనాలు, సాహిత్యం, నాణ్యాలు మొదలైన వాటి సహాయంతో

చరిత్రను పునర్నిర్మించవచ్చు. కాని ఐతిహ్యానికి పరోక్షమైన ఆధారాలు ఏవైనా ఉండవచ్చుగాని, ప్రత్యక్షాధారాలుండవు. మౌఖికమైన ప్రసారం ద్వారా ఒక తరం నుంచి మరొక తరానికి సంక్రమిస్తాయి కాబట్టి ఐతిహ్యాలు సత్యమైన వని చెప్పడానికి వీలుకాదు. వ్యక్తిని గురించిగాని, స్థలాన్ని గురించి గాని, ఏదైనా సంఘటవనుగాని సాంప్రదాయికంగా వివరించేది ఐతిహ్యం. పురాణంలో దేవతా సంబంధమైన పాత్రలు ముఖ్యంగా ఉంటాయి. కాని ఐతిహ్యాలలో వాటి పాత్ర ముఖ్యం కాదు. పురాణాలు జనసమూహం వాటి మీద ఉంచిన నమ్మకమే ప్రధానంగా జీవిస్తాయి. ఐతిహ్యాలు జరిగాయనే నమ్మకాన్ని జనంలో కలిగించ వలసి ఉంటుంది. పురాణం మత సంబంధమైందిగా దేవతా సంబంధమైందిగా ఉండడం వల్ల అది జనం మీద ఒక విధంగా అధికారాన్ని చెలాయిస్తుంది.

జనపదాలలో ఒక్కొక్క రాయికీ రప్పకీ, కాలవకూ, కొలనుకూ, చెలవుకూ కథవుంది, ఐతిహ్యం ఉంది. కొండలకు, బండలకు, వీరులకు, నారీమణులకు సంబంధించిన ఐతిహ్యాలున్నాయి; కరీంనగర్ జిల్లాలో కూనారం అనే గ్రామముంది. రామగిరిగుట్టల చివర ఈనాటికీ రాముని పాదముద్రలున్నాయట; అక్కడ ఉండే గ్రామమే ఈ కూనారం. రాముడు అరణ్యవాసం చేసేటప్పుడు రామగిరి గుట్టల కొన వరకు వచ్చి తన పాదాలను మోపాడు, 'కొన రాము' అన్నదే కూనారం అయింది! ఇదే విధమైన కథ ప్రతి ఊరిలో వినిపిస్తుంది. పాండవులు పాదాలు మోపిన ప్రదేశాలు, భీముడు వంట చేసిన ఇళ్ళు, ద్రౌపది స్నానం చేసిన ఘట్టాలు కూడా ప్రతి పల్లెలో దర్శనమిస్తాయి. ఇలాంటి గద్యకథనాలన్నీ ఐతిహ్యాలే.

ఐతిహ్యం అన్నపదాన్ని కథల కంటె చిన్నదానికి, గద్యరూపంలో ఉండే పరిమిత పాఠాంతరాల కథనానికి వాడుతున్నాం. నిర్దిష్ట స్థలం, వ్యక్తి లేక సంఘటనను గురించిన మౌఖిక, సాంప్రదాయిక వివరణమే జానపద ఐతిహ్యమని నిర్వచించవచ్చు.

సామాన్య జానపద బాలకుడు ఉత్తచేతులతో పులితో పోరాడి గెల్చిన వృత్తాంతం. శత్రువుల నుంచి తప్పించుకొని వీరుడు కొండపైనుంచి దూకడం మహిమాన్విత వ్యక్తుల పాదాలగుర్తులు శిలల మీద కన్పించడం—ఇలాంటి వన్నీ ఉత్కంఠను కలిగిస్తాయి. వీటిల్లో అత్యల్పమైన చరిత్రాంశం ఉండవచ్చేమో కాని ఐతిహ్యాలు ఎప్పటికీ చరిత్ర కాలేవు.

ఐతిహ్యాలు ఏ విధంగా ఉత్పత్తి చెందుతాయన్నది ఊహల ఉయ్యాలలో ఊగేదే కాని, స్థిరంగా పరిశోధనకు దొరికే విషయం కాదు. మానవుని విచిత్ర కల్పనా శక్తి ఆధారంగా ఉత్పత్తి అయ్యేవి కొన్ని. కొందరు వ్యక్తుల మీద, స్థలాల మీద జనులకు ప్రత్యేక భక్తి గౌరవాలుంటాయి. అట్టి వ్యక్తులకు, స్థలాలకు ఐతిహ్యాలలో ప్రధాన పాత్ర లభిస్తుంది. కలలుకూడా ఐతిహ్యాల ఉత్పత్తికి కారణం కావచ్చు. విన్నవీ కన్నవీ మానవుని కలలో అద్భుతంగా పెరిగి పెద్దవై ఎన్నో నమ్మకాలకు దారి చూపుతాయి. ఈ విధమైన అభూత కల్పనలే ఐతిహ్యాల రూపకల్పనకు కారణ భూతాలవుతాయి. విక్రమార్కుని సింహాసనం, మహాపురుషుల సమాధులు, ఖడ్గాలు, స్మారక శిలల వంటివి జానపదుల హృదయాల్లో బలంగా నాటుకొని, చిలువలు పలువలుగా పెరిగి వందలాది ఐతిహ్యాల పుట్టుకకు కారణమవుతాయి.

ఊళ్ల పేర్లకు సంబంధించిన ఐతిహ్యాలకు లెక్కలేదు. వీటిని గురించిన పరిశోధన జరిపితే సంస్కృతికిసంబంధించిన అసంఖ్యాక విషయాలు బయల్పడతాయి.

విభజన :

ఐతిహ్యాలలో ముఖ్యంగా స్థానిక ఐతిహ్యాలు (local legends) సంచారి ఐతిహ్యాలు (migratory legends) అనే రెండు రకాలున్నాయి. రహస్య నిధులకు సంబంధించినవి, ఊళ్ళ పేరకు సంబంధించినవి స్థానిక

పీరులకు సంబంధించినవి, మహిమకల రాళ్ళకు, కొండలకు సంబంధించినవి స్థానిక ఐతిహ్యాలు. ఇవి తమ ఎల్లలను దాటి బయటికి వెళ్ళవు. సామాన్యంగా ఒక ఊళ్లోనో, ఒక ప్రాంతంలోనో పుట్టి, పెరిగి, అక్కడే నశించి పోతాయి. సంచారి ఐతిహ్యాలు ఒక ప్రదేశంనుంచి మరో ప్రదేశానికి, ఒక్కొక్కసారి మరోదేశానికి కూడా ప్రయాణం చేస్తాయి. ఇవి చిన్నవి. కొన్ని పాఠాంతరాలు మాత్రం కలవి. ఒక చారిత్రక సంఘటనో, కాల్పనిక సంఘటనో మూలమై దాని చుట్టూ కథనం అల్లబడుతుంది. ఇవి నిర్దిష్టస్థలంలో, నిర్దిష్ట కాలంలో పుట్టి ఇతర ప్రదేశాలకు వెళ్తాయంటారు. చెరువు నిండడం కోసం, చెరువు కట్ట తెగితే నిలపడం కోసం, కోటగోడ భద్రత కోసం స్త్రీలు ఆత్మబలి చేసు కోవడం ప్రపంచంలోని వివిధ ప్రదేశాల ఐతిహ్యాలలో కనిపిస్తుంది. ఎక్కడో ఒకచోట ఇలాంటిది జరిగి వుండవచ్చు. అది అనేక రూపాలతో వివిధప్రదేశా లకు సంచారం చేస్తుంది. కలలో కనిపించిన నిధిని ఉపయోగించి రాజ్యాలను నిర్మించిన రాజుల వృత్తాంతాలు, మోసం చేసిన భార్యను గురించిన ఐతి హ్యాలు సంచారి ఐతిహ్యాలలో ఉన్నాయి.

కొందరు ఐతిహ్యాలలో నాలుగు రకాలను గుర్తించారు (Richard M. Dorson 1972 : 76) 1. వివరణాత్మక ఐతిహ్యాలు (Etiological legends) 2. చారిత్రక ఐతిహ్యాలు (Historical legends) 3. అలౌకిక శక్తులకు సంబంధించినవి (Superuatnral) 4. మతసంబంధమైనవి (Re: gious)

కన్నడ ఐతిహ్యాలను గురించి చక్కని పుస్తకాన్ని ప్రచురించిన జి. వి. డి. (1978) స్థానిక ఐతిహ్యాలు, సంచారి ఐతిహ్యాలు (కన్నడంలో వాడిన పేర్లు స్థళీయ ఐతిహ్యగళు, సంచారి ఐతిహ్యగళు) అన్న రెండు ప్రధానవిభాగాల క్రిందనే మరికొన్ని ఐతిహ్య రూపాలను ఇచ్చారు. తెలుగులో ఐతిహ్యాల సేకరణకు, పరిశీలనకు సహాయకంగా ఉంటుందనే ఉద్దేశంతో శ్రీ జి. వి. డి. ఇచ్చిన ఐతిహ్యాల విభాగాల సంక్షిప్త వివరణ ఈ క్రింద ఇవ్వడమైనది.

స్థానిక ఐతిహ్యాలు :

ఇవి ప్రాచీన సంస్కృతి, సంప్రదాయం, నమ్మకం, కర్మాచరణమొద లైన వాటినేపథ్యంతో స్థానికంగా వెలువడుతాయి. భూతప్రేత పిశాచాలు, మానవాతీత శక్తులు మొదలైన వాటిలో ఉండే నమ్మకం వీటిలో ప్రాధాన్యం వహిస్తుంది. ఒక కొలనో, చెరువో లోతుగా వుంటే దాని లోతులు చూడ డానికి వెళ్ళిన మనిషి మరణించే విషాద కథలు భారత దేశంలో, ఐరోపాలో కనిపిస్తాయి. స్థానిక ఐతిహ్యాలలో ఇంకా కొన్ని ప్రభేదాలున్నాయి.

నరబలికి సంబంధించినవి :

ఐరోపాలో భవ్యభవనాల పునాదులలో కొన్నిచోట్ల అస్థిపంజరాలు కని పించాయి. జర్మనీలో కూడా కట్టడాల భద్రతకోసం బలిఇచ్చే విధానం ఉండేది. ఇవి భారతదేశంలో ఇటీవల ఐతిహ్యాలుగా వచ్చాయి. దీనికి కారణం బ్రిటిషు వారి రాక తర్వాత వారి నమ్మకాలు మనకు సక్రమించడమే.

వీరుల్ని ఎల్లల్లో పూడ్చి పెట్టే కథలు :

ఐరోపా, ఐర్లెండ్, స్కాండినేవియాలలో వీరులు చనిపోతే ఆదేశం ఎల్లల్లో వారిని పూడ్చిపెడ్తే దేశాన్ని రక్షిస్తారనే నమ్మకముంది. చనిపోయిన వారిని పొలాల్లో తోటల్లో పూడ్చే పద్ధతికూడా ఈ నమ్మకం వల్లనే వచ్చి ఉంటుంది.

యుద్ధ సంబంధాలు :

కొన్ని చారిత్రక సంఘటన లాధారంగా ఐతిహ్యాలు రూపొందుతాయి. ఖడ్గ తిక్కనకు సంబంధించిన ఐతిహ్యాలు ఇలాంటివే. స్త్రీలు పురుషుల్నియుద్ధా నికి పురికొల్పడం, యుద్ధంలో పాల్గొనడం ఈ ఐతిహ్యాలలో కనిపిస్తాయి.

కుటుంబ సంబంధాలు :

పిల్లల్ని అనాథలుగా చేసి చనిపోయిన తల్లులు మమతల్ని చంపుకోలేక భూతరూపంలో తిరిగి వచ్చి పిల్లల లాలన పాలన చూచుకొనే వృత్తాంతాలు

కొన్ని ఉన్నాయి. దెయ్యాలు కుక్క, పంది, పిల్లి మొదలైన రూపాలలో వచ్చి భయపెడ్తాయని చెప్పే ఐతిహ్యాలు నమ్మకం ఆధారంగా ఏర్పడ్డవి.

భ్రమవల్ల పుట్టిన ఐతిహ్యాలు :

మనిషి తాను చూచిన ప్రకృతి వైపరీత్యాన్ని ఏదో అని భ్రమించడం వల్ల కొన్ని కల్పనలు ఉద్భవిస్తాయి. కొరివి దయ్యాలు మొదలైన వన్నీ ఇటువంటి భ్రమలే. ఆఫ్రికాలో ఒక నదీ తీరంలో రాత్రిపూట నురగలు తెల్లగా దర్శన మివ్వగా, చనిపోయిన ఒకతల్లి బట్టలారేసినట్లుందని ఒక ఐతిహ్యంగా రూపు దాల్చింది.

శబ్దసంబంధ ఐతిహ్యాలు :

విచిత్ర ధ్వని ఏదైనా వినబడితే దానినొక ఐతిహ్యంగా కల్పించడం కూడా కొన్ని చోట్ల కనిపిస్తుంది. అమావాస్యకు పున్నమికి లంకెబిందెల శబ్దాలు వినబడతాయనే నమ్మకంతో కొన్ని ఐతిహ్యాలు రూపు దాల్చాయి.

రహస్య నిధికి సంబంధించినవి :

లంకెబిందెల శబ్దానికి సంబంధించినవి కొన్నయితే, అలాంటిరహస్య నిధులే ఎక్కడెక్కడో ఉన్నాయని, వాటికి సర్పాలు కావలిగా ఉన్నాయని కొందరు చెప్తారు.

వంశకీర్తనలు :

ఏదైనా కుటుంబానికి సంబంధించిన బిరుదులు, ఆ వంశంలోని వారి ఆత్మబలి మొదలైన వాటికి సంబంధించిన మహిమాన్విత గాథలివి.

జానపద నిరుక్తి :

(ఊళ్ళపేర్లు) స్థలనామాలకు సంబంధించిన నిష్పత్తి ఈ రకపు ఐతిహ్యాలలో కనిపిస్తుంది. కొన్ని ఊళ్ళకు ఎందుకు ఆ పేరు వచ్చిందో

తెలియదు, కాని జానపదులు ఏదో ఒక కథ కడ్తారు. ఆ కథ నిజమోకాదో నిర్ణయించడానికి సరైన ఆధారాలుండవు. ఒక్కొక్క సారి జానపద నిరుక్తి సరైనదే కావచ్చు. కాని మధ్యమధ్య ఐతిహ్యాత్మక విషయాలు ఎన్నో చేరి పోయి ఉంటాయి,

సంచారి ఐతిహ్యాలు :

ఒక నిర్దిష్ట స్థలంలో పుట్టి, పెరిగి ఏదైనా నమ్మకానికో, కర్మాచరణకో, మతానికో సంబంధాన్ని కల్పించుకొని ఇతర ప్రదేశాలకు కొన్ని ఐతిహ్యాలు సంచారం చేస్తాయి. ప్రసారదృష్టితో చూసినప్పుడు ఇవి చాలా ప్రముఖమైనవి. అద్భుత కథలకంటె చిన్నవిగా, కుతూహలకరంగా ఉండడంవల్ల త్వరగా ఈ సంచారి ఐతిహ్యాలు ప్రయాణం చెయ్యగలుగుతాయి, ఒకచోట ఉన్నప్పుడు ఈ ఐతిహ్యాలు ఆయా ప్రదేశాల సాంప్రదాయిక పద్ధతుల్ని బాగా ఒంట బట్టించుకుంటాయి ; మరో ప్రదేశానికి వెళ్ళినప్పుడు అక్కడి పద్ధతుల్ని అనుసరిస్తాయి.

వీరుల భూమికి సంబంధించినవి :

మనకందరికీ పరిచితమైన ఒక ఐతిహ్యం విజయనగర సంస్థాపనను గురించింది. హరిహరరాయలు బుక్కరాయలు వేటకుపోగా కుందేలు కుక్కను తరుముతూ ఉండడం చూచి అదే మంచి చోటని విజయ నగరాన్ని స్థాపించారని ఐతిహ్యం. ఇదే కథను పిరియా పట్టణమనే చోటును గురించి కర్నాటకంలో చెప్తారు. పిరియా పట్టణానికి సంబంధించిన పూర్వికులు మంచి స్థలాన్ని వెతుక్కుంటూ వెళ్ళి ఒకచోట కుక్కను కుందేలు పైకి ఉసికొల్పగా కొంత సేపటికి ఆ కుందేళ్ళే కుక్కను తరిమి కొట్టిందట. బెంగుళూరు నిర్మించిన తెలుగు ప్రభువు కెంపే గౌడను గూర్చికూడ ఇదే విధమైన ఐతిహ్యాన్ని చెప్తారు.

ఆత్మబలికి సంబంధించినవి

ఇవి స్థానిక ఐతిహ్యాలలాగా కనిపించినా అంతర్గతంగా సంచార లక్షణాన్నే కలిగిఉంటాయి. మునలమ్మ మరణం కథ ఇట్లాంటిదే. ఊరికోసం తమనుతామే అర్పించుకున్న త్యాగమూర్తుల గాథ లెన్నో ప్రచారంలోఉన్నాయి. ఇవి ఆంధ్రదేశంలో మాత్రమే కాక కర్నాటకాది ఇతర ప్రదేశాల లోను ప్రచారంలో ఉన్నాయి, పాత్రలు వేరైనా మూలాంశం మాత్రం ఒకటే ఉంటుంది.

శీలవంతుల-శీలవతుల కథలు

శీలవంతులై కూడా ఎల్లదాటి వెళ్ళవలసిందనే ఆజ్ఞకు లోనైనవారిని గురించి, శీల సంరక్షణ కోసం ప్రాణత్యాగం చేసుకున్న వారిని గురించి ఎన్నో ఐతిహ్యాలు ప్రతిదేశంలోనూ ఉన్నాయి.

పౌరాణికాంశాలుండేవి :

భక్తి ప్రధానమైన ఐతిహ్యాలు కొన్ని ఉన్నాయి. పద్మావతి వెంకటేశ్వర కల్యాణాన్ని గూర్చిన కథలో వచ్చే గోవు వృత్తాంతం వంటివి కన్నడ దేశంలో కూడా లభిస్తాయి. మండ్య జిల్లాలోని గుత్తలు అనే ఊరిలో ఒక ఆవు గోపాలకుని కన్ను తప్పించి వెళ్తుండేది. దాన్ని పరీక్షించాలని వెన్నంటి వెళ్ళాడతను. ఒక పుట్టలో పాలు పిండుతూ ఉండగా గోపాలకుడు కోపంతో పశువును బాదాడు. అది వెళ్ళి పుట్టలో ఉండిన లింగానికి తగిలింది. దానిలోని ఒక భాగం వెళ్ళి మరొక ఊళ్లోపడింది, రెండుచోట్లా దేవాలయాలు వెలశాయి.

జనప్రియమైన నమ్మకాల ఆధారంగా పుట్టినవి :

పల్లెటూళ్ళనే కాక, పట్టణాలలో కూడా కొన్ని మూఢనమ్మకాలుంటాయి. అప్పుడప్పుడు ఈ నమ్మకాలు కొన్ని ఊళ్ళలో విజృంభిస్తుంటాయి. ఎవలో సన్యాసి వచ్చి తలుపుతట్టి పిలుస్తాడని, బదులు చెప్పినవారు వెంటనే చనిపోతారని ఒక నమ్మకం అప్పుడప్పుడు గాలివానలాగా వీస్తుంటుంది. దానికొక విరుగుడు కూడా చెప్తారు. ఇంటితలుపు మీద మూడునామాలు గీచి ఉంచితే

వచ్చిన వాడు వెళ్ళి పోతాడట! అదీకాకుంటే 'రేపురా' అని వ్రాసినా సరే. ఈ విధమైన నమ్మకాలు తెలుగుదేశం లోనే కాక కర్నాటక, తమిళనాడు మొదలైన చోట్ల కూడా ఉన్నాయి.

పైన వివరించిన ఐతిహ్యాల వంటివి తెలుగునాట స్థానికంగా పుట్టి పెరిగేవి కొన్ని. తెలుగుదేశం నుంచి ఇతర ప్రదేశాలకు కూడా ప్రయాణం చేసిన సంచారి ఐతిహ్యాలు కొన్ని.

ఒక్కొక్క ఊళ్లో వందలాది ఐతిహ్యాలు పుడ్తుంటాయి గిడ్తుంటాయి. కొన్ని ఐతిహ్యాలు సాంప్రదాయకంగా ఆనోట ఆ నోట నలిగి అలాగే పాతబడి ఉంటాయి. ఏ విధంగా పుట్టినా ఐతిహ్యం నమ్మకం పుట్టించేదిగా ఉంటుంది. ఉదాహరణకు నెల్లూరులో పిల్లలనుంచిపెద్దల వరకు చెప్పుకునే ఐతిహ్యం ఏమిటంటే అక్కడ ఏనుగులు బతకవని. సర్కసులు నెల్లూరికి ఎందుకురావు (వస్తూనే ఉంటాయనుకోండి) అని చిన్నపిల్లలు చర్చించుకొని, ఏనుగులు వస్తే అవి చనిపోతాయని, వాటి కలలో సింహాలు కనిపించి బెదరిపోతాయని చెప్పుకుంటారు. అందుకే నెల్లూరికి మరోపేరు 'విక్రమ సింహపురి' అట! ఒకవేళ సర్కస్ కంపెనీ వారు ఏనుగులను తీసుకొని వస్తే ఊరికి దూరంగా దర్గామిట్ట (నెల్లూరు పట్టణంలో ఒకభాగం)లో విడిది చేస్తారట! ఇట్లే నెల్లి చెట్టును గురించిన ఐతిహ్యం ఉంది. నెల్లి చెట్టునుంచే నెల్లూరు పేరువచ్చిందని అది వివరిస్తుంది. ఇలాంటి వివరణలు, కథలు, గాథలు, ఐతిహ్యాలు ప్రతి ఊరిలోను వినిపిస్తాయి.

గుట్టలు, కొండలు, బండలు ఎన్నో ఐతిహ్యాలకువస్తువులుగా ఉంటాయి. జానపద కథలకు ఇలాంటి నిర్దిష్టమైన ప్రదేశం కథాస్థలంగా ఉండదు. రాముడు, సీత సంచరించిన ప్రదేశాలుగా ఆంధ్ర దేశంలో ఎన్నో స్థలాలను చెప్పుకుంటారు. అట్లే భారత పాత్రలైన పంచపాండవులు, ద్రౌపది మావూరికి వచ్చారంటే, మావూరికి వచ్చారని చెప్పుకుంటారు. కుంతి భీముణ్ని ఎత్తుకొని వెళ్తుంటే పొరపాటున భీముడుక్రింద పడగా లోయ లేర్పడ్డ వృత్తాంతాలు కనీసం బండయినా చితికి గుంటయిన ఐతిహ్యాలు ఎన్నోచోట్ల వినిపిస్తాయి. సారంగధరుడు ఎక్కడివాడో ఏమోగాని నవనాథ చరిత్రలోని చౌరంగి సారంగ

ధరుడై, రాజరాజనరేంద్రుడి కొడుకై సారంగధర చరిత్ర ఆంధ్రదేశందే అనే బలమైన నమ్మకం కలిగేట్లు చేశారు కవులు. కన్నడిగులు మరో అడుగు ముందుకు వెళ్ళారు. చన్నపట్టణ తాలూకా, హబ్బూరు అనే గ్రామముంది. అక్కడ సారంగధరుని గుట్ట అన్నది ఉంది. అక్కడ కొన్ని ఎర్రమరకలు చూపించి జనులు సారంగధరుని కథ చెప్తారు. సారంగధరుడి పిన్నమ్మ అక్కడే అతని కాళ్ళుచేతులు నరికించిందని అందుకే అక్కడ రక్తపు మరకలు ఏర్పడ్డాయని అంటారు.

పల్లెల్లో ఎక్కడ పెద్ద రాతిగుండు కనిపించినా అది భీముడు తెచ్చి అక్కడ ఉంచాడంటారు. ఎక్కడ పాదాల గుర్తు వంటివి కనిపిస్తే అవి భీముని పాదాలనో, రాముని పాదాలనో, బుద్ధుని పాదాలనో చెప్తారు. బండల లోనే చిన్నచిన్న ఇళ్ళ వంటివి కనిపిస్తే అరణ్యవాసంలో పాండవులు ఇక్కడ ఒకరోజు ఉన్నారంటారు.

స్థలనామాలను గురించిన ఐతిహ్యాలు ఆంధ్రదేశంలో కోకొల్లలుగా ఉన్నాయి. వీటిలో కొన్ని పౌరాణిక అంశ ఉండేవి, మరికొన్ని నమ్మకానికి సంబంధించినవి. కొన్ని ఏదో ఒక సంఘటనను ఆధారంగా చేసుకుని ఉద్భవించినవి, కొన్ని చారిత్రక సంఘటనలు నేపథ్యంగా కలవి. ఈ క్రింద అలాంటివి కొన్ని ఇవ్వబడ్డాయి. వీటిని ప్రచురించి ఐతిహ్యాల శాఖకు ప్రాచుర్యం కలిగించిన వారు ఆంధ్రభూమి సచిత్రవార పత్రిక వారు. ప్రతి పత్రికలో ఈ విధమైన జానపద విజ్ఞాన విషయాలను ప్రచురిస్తే మన సంపద్భరిత సంస్కృతి లోని వైవిధ్యం తెలుస్తుంది.

విరాటరాజు గోవులను కౌరవులు తోలుకు పోతుండగా అజ్ఞాతవాసంలో ఉండిన అర్జునుడు వారితో పోరాడి ఆలమందను చేజిక్కించుకున్నాడు. అందువల్లనే అక్కడ 'ఆలమంద' అనే గ్రామం ఏర్పడి తర్వాత విజయనగరంజిల్లా లోని ఆలమండగా మారింది (నందగిరి రామారావు, 27-11-80).

కృష్ణాజిల్లా, గన్నవరం తాలూకాలో కాకులపాడనే గ్రామం వుంది. ఆవూరి మీదుగా ప్రయాణం చేసేవారు అక్కడి చెరువు గట్టుమీదున్న చెట్టు కింద విశ్రాంతి తీసుకునే వారట ! ఆ చెట్టుమీద ఎప్పుడూ ఒక కాకుల గుంపు ఉండేది. విశ్రాంతి తీసుకునే వాళ్ళు 'ఛీ ఛీ, కాకులు పాడుగాను' అనేవారట ! అందుకే 'కాకుల పాడు' అనే పేరువచ్చింది (కొత్తూరు జయశ్రీ.27-11-80).

కర్నూలు జిల్లా నందికొట్టూరు తాలూకాలోని ముచ్చుమర్రి పేరును గురించి ఆక్కడి వారు ఐతిహ్యం చెప్తారు. పూర్వం ముచ్చుకోతులు మర్రి చెట్టు మీద సంసారాలు చేస్తుండేవట । అందుకే ఈ పేరు వచ్చింది (తెల్లపల్లి సోమయాజులు 20-11-80)

పూర్వం తెలంగాణాలోని చేర్యాల ప్రాంతంలో చెంచులు దొంగతనాలతో ప్రజల్ని భయభ్రాంతుల్ని చెసేవారట. ఆ భయంతో ప్రజలు ఇతర గ్రామాలకు వలస వెళ్ళేవారు. చేర్యాల గ్రామానికి సమీపంలో రక్షణ కోసం ప్రజలు గోడ కట్టుక్కున్నారు. చెంచువారి బాధనుంచి తప్పించుకోడానికి కట్టింది కాబట్టి ఆ ప్రాంతానికి చెంచనకోట అనే పేరు వచ్చింది (యాంసాని ఆంజనేయులు 11-9-80). ఈ ఐతిహ్యం నిజమోకాదో కాని చెంచువారి పల్లెవంటిగ్రామాలు చెంచుజాతుల వల్లనే ఏర్పడ్డాయి. కర్నాటకంలో కూడా చంఘనగిరి అనేప్రసిద్ధ పుణ్యక్షేత్రం ఉంది.

ఏడుగురు అక్కల కథలు ఆంధ్ర కర్నాటకాలలో ప్రచార మయ్యాయి. వరంగల్ జిల్లా, జనగామ తాలూకాలోని 'ఏడు నూతుల' అనే గ్రామాన్ని గురించికూడా ఒక ఐతిహ్యం ఉంది. ఆవూళ్లో ఏడు అరలున్న బావి ఉంది. దాన్ని ఏడుమంది అక్కచెల్లెళ్ళు చెల్లించారని చెప్తారు. ఎంత ఎండా కాలమయినా ఈ బావిలో నీరు ఊరుతూనే ఉంటుంది. ఈ బావి పేరుతోనే ఊరి పేరు 'ఏడునూతుల' అయింది (ఎన్.రమేష్‌రావు, 21—8—80).

పులిని చంపిన సాహసుల ఐతిహ్యాలు చాలా చోట్ల కనిపిస్తాయి. ఒక చిరుతపులి ఎప్పుడూ ఒక గ్రామంమీద మెరుపుదాడులు చేస్తుండేది. దాని బాధకు జడిసి జనం ఇంట్లోనుంచి బయటికి రాకుండా ఉండే వారు. తర్వాత ఒక్కొక్కరే ఆ గ్రామాన్ని వదలి వెళ్ళసాగారు. వాళ్ళు వెళ్ళిన చోట మరో

గ్రామం తయారయింది. చిరుత పులి ఆహారం కోసం ఆ గ్రామానికి కూడా వచ్చింది. ఒక వడ్రంగి ఇంటికి వెళ్ళి తలుపు సందుల్లోంచి తలను ముందుకు పెట్టింది. ఏదో పని చేసుకుంటున్న వడ్రంగి తలుపువైపు చూచి ఉలిక్కిపడ్డాడు. ఒక్కక్షణం ఏం చెయ్యడానికీ తోచలేదు. తర్వాత మొండిధైర్యంతో చేతిలో ఉన్న బాడ్సెతో చిరుత తల నరికాడు. బాడ్సెతో పులిని చంపినందువల్ల ఆ వూరికి 'బాడ్సె' అనే పేరు వచ్చి తర్వాత అది 'బాడ్సి' అయింది. (ఎం. గంగాధర్, 14-8-80).

## ప్రసారం – అధ్యయనం

ఐతిహ్యాలు ఏవిధంగా ప్రసారం అవుతాయి అన్నదాన్ని గురించి అనేక విద్వాంసులు వివిధ అభిప్రాయాలను వ్యక్తంచేశారు· ఏకోత్పత్తివాదం, బహుళోత్పత్తి వాదం వీటి ప్రసారం విషయంలో కూడా అన్వయింపబడ్డాయి. సంచారి ఐతిహ్యాలన్నవి ఒక ప్రధాన భాగంగా ఉండడంవల్ల వీటి సంచారం ఏవిధంగా జరుగుతుందనే విషయం కుతూహలం రేకెత్తిస్తుంది. వెనకటి కాలంలో వివిధ దేశాలలో సంచారం చేస్తుండిన సాహసయాత్రికులవల్ల ఐతిహ్యాలు ప్రసారం అయ్యేవి. ఐతిహ్యాలు ఒకదేశం నుంచి మరొక ప్రదేశానికి ప్రయాణం చెయ్యటానికి బౌద్ధులు చేసిన సహాయం కూడా గమనార్హమైంది. మతంతోబాటు భారతదేశంలోని ఎన్నో ఐతిహ్యాలను అనేక ప్రాచ్యదేశాలకు బౌద్ధులు తీసుకొని వెళ్ళి ప్రచారం చేశారు. మత ప్రచారకులవల్ల ఐతిహ్యాలు ప్రచారం పొందడం మన దేశంలోనేకాక ఇతర దేశాలలో కూడా జరిగింది·

స్థానిక ఐతిహ్యాల విషయంలో బహుళోత్పత్తి వాదమే సమంజసమని పించినా, ప్రవేశికలో చెప్పినట్లు ఏకోత్పత్తి వాదమే ఇటీవలి కాలంలో ఎక్కువమంది శాస్త్రజ్ఞుల సమ్మతిని పొందింది. సంచారి ఐతిహ్యాలు ఒక ప్రదేశంలో పుట్టి ఇతర ప్రదేశాలకు వెళ్తాయనడంలో సందేహం లేదు. అయితే అవి ఎక్కడ జన్మించాయని ఖచ్చితంగా చెప్పడం ఒక్కొక్కసారి సాధ్యం కాక పోవచ్చు ఉదాహరణకు 'ముసలమ్మ మరణము' లోని ముసలమ్మలాగా ఊరికోసం ప్రాణత్యాగం· చేసే ఉత్సాహవంతుల కథలు భారతదేశమంతటా ఉన్నాయి. వీటికి మూలం ఏదేశపు ఐతిహ్యాలని నిర్ణయించగలం ? ఏప్రాంతపు ఐతిహ్యాలని నిర్ణయించగలం ?

ఐతిహ్యాలను గురించి ఎక్కువ పరిశ్రమ జరగలేదనే చెప్పాలి. పురాణాల విషయంలో, కథల విషయంలో జరిగినంత కృషి ఈ క్షేత్రంలో జరగలేదు. ఐతిహ్యాల వర్గీకరణ, అధ్యయనం చేసిన వారిలో ప్రముఖులు రైడార్ క్రిస్టియన్సన్ (Reidar Chritiansen). ముఖ్యంగా సంచారి ఐతిహ్యాలను గురించి ఆయన కృషిచేశారు. ఐతిహ్యాల అట్లాసులను తయారుచేసే ప్రయత్నాలుకూడా జరిగాయి (రిచర్డ్ ఎం. డార్సన్ 1972 : 482, 490, 494).

జానపదకథలు

జానపద విద్వాంసులనేకాక మానవశాస్త్రజ్ఞులను, మనస్తత్వ వేత్తలను భాషాశాస్త్ర ప్రవీణులను ఆకర్షించిన ప్రక్రియ జానపద కథ. పేదరాసి పెద్దమ్మ కథలు, అమ్మమ్మ కథలు, తాతయ్య కథలు, కాకమ్మ కథలు అనే పేర్లతో జానపదుల కందరికీ సుపరిచితాలైన ఈ గద్యకథనాల్ని వందలు, వేల ఏళ్ళ నుంచి సామాన్య జనుల కల్పనాశక్తికి ప్రతీకలై ప్రచారం పొందుతున్నాయి. ఇటీవలి కాలంలో జానపద విజ్ఞానానికి సంబంధించిన అనేక సిద్ధాంతాల పుట్టుకకు కారణమైంది కూడా కథల అధ్యయనమే. జానపదుల మనస్తత్వాన్ని అర్థం చేసుకోవాలంటే కథల కంటె మూలధనం మరొకటి లేదు.

పురాణం—ఐతిహ్యం—కథ అనే ఈ మూడు గద్యకథనాలను పోల్చి చూచినప్పుడు పురాణం అన్నిటి కంటె గంభీరమైనదిగా, సామాన్య జనుల మీద ప్రభుసమ్మితమైన అధికారాన్ని చలాయించేదిగా కనిపిస్తుంది. ప్రజలకు పురాణాలమీద ఉండే నమ్మకమే వాటిని బతికిస్తుంది. పురాణాలలో దేవతా సంబంధమైన పాత్రలు అధికంగా కనిపిస్తాయి. అవే పురాణాలని పిలవడానికి కొలబద్దలని కొందరు విద్వాంసులు భావించినా, మరికొందరు అసలు ముఖ్యమైనది ప్రజల నమ్మకాన్ని చూరగొనడమే అంటారు. పురాణం విషయం ఈ విధంగా ఉంటే ఐతిహ్యాలు కొన్ని విషయాలనుచెప్పి మనల్నినమ్మమంటాయి. ఏదో ఒక ప్రదేశానికి సంబంధించిందో, వ్యక్తికో, సంఘటనకో సంబంధించిందో అయిన వృత్తాంతాన్ని నమ్మకం కలిగించేట్లుగా చేస్తాయి. కథలు ముఖ్యంగా మనస్సును రంజింప జేయడానికి, ఉల్లాసానికి ఉద్భవించాయి. అందువల్లనే వీటిలో అద్భుత విషయాలు, రోమాంచకవృత్తాంతాలు, కాల్పనిక

సంఘటనలు అనేకం ఉంటాయి. ఈ కారణాల వల్ల పురాణ ఐతిహ్యాలకంటె కథలు ఎక్కువ జనప్రియమైనవి జానపదుల ఊహల్నీ, మనఃస్థితిని ప్రతిబింబించడంలో కథల కంటె ఉత్తమమాధ్యమం మరొకటి లేదు.

జానపద కథలకు లక్షణాలను నిర్దేశించిన వారు చాలామంది ఉన్నారు. వాటిలో విస్తృతంగా, బహుజన సమ్మతంగా లక్షణాలను నిర్దేశించిన వాడు ఆక్సెల్ ఓల్రిక్ (Axelolrik). అవి ఈ క్రిందివిధంగా ఉన్నాయి (చూ. స్టిత్ థామ్సన్ 1946 : 456).

1. కథలు ముఖ్యమైన క్రియతో ప్రారంభంకావు. ఉన్నట్టుండి ముగిసిపోవు.

2. పునరావృత్తి సామాన్యంగా అన్నిచోట్లా కనిపిస్తుంది. అదే కథకు నిండుదనాన్ని ఇస్తుంది. ఈ పునరావృత్తి ఒక్కొక్కసారి మూడుసార్లు ఉండవచ్చు.

3. మామూలుగా ఒక్కసారి ఇద్దరు వ్యక్తులు మాత్రం ఒక దృశ్యంలో కనిపిస్తారు. ఇంకా ఎక్కువగా ఉన్నా, ఇద్దరు మాత్రం క్రియాశీలురై ఉంటారు.

4. విభిన్న పాత్రల కలయిక కనిపిస్తుంది. ఉదాహరణకు నాయకుడు-ప్రతినాయకుడు, శిష్టుడు—దుష్టుడు.

5. ఒకే రకమైన పాత్రలు రెండు ఉంటే, వాళ్ళు చిన్నవాళ్ళుగా గాని లేక అశక్తులుగాగాని చిత్రింప బడతారు. ఒకవేళ ఇద్దరూ శక్తిగలవాళ్ళు అయితే విరోధులయ్యే అవకాశం ఉంది.

6. దుర్బలులైనవారు మంచివాళ్ళుగా ఉంటారు. సోదరులలో చిన్నవాళ్ళు మామూలుగా జయం సాధిస్తారు.

7. పాత్రచిత్రణ సరళంగా ఉంటుంది. కథకు నేరుగా సంబంధించిన పాత్రలు, సంఘటనలు మాత్రమే చిత్రితమవుతాయి. పాత్రలకు, కథకు అతీతమైనవేవీ కనిపించవు.

8. కథావస్తువు సరళంగా ఉంటుంది. ఏక కాలంలో ఒకే కథ వివరింపబడి ఉంటుంది. రెండుగాని, అంతకంటె ఎక్కువగాని కథలు ఏకకాలంలో

చెప్పవలసి వస్తే అప్పుడది సాహిత్య సంబంధమైన కథ (literary tale)ను పోలుతుంది.

9. మామూలుగా అన్ని విషయాలూ సరళంగా ఉంటాయి. వైవిధ్యమయంగా తీర్చిదిద్దాలనే ప్రయత్నం కనిపించదు.

పైలక్షణాలను బట్టి సాధ్యమైనంతవరకు కథల్ని సరళంగా తయారు చేస్తారని తేలింది. అయితే ఈ లక్షణాల వల్ల జానపద కథల సమగ్ర స్వరూపం గోచరిస్తుందని చెప్పడానికివీలులేదు. మొత్తం మీద కథలలో మనకు కనిపించే విషయాలను కొన్ని విభాగాలుగా చేసుకొని వివరణాత్మకంగా వాటి లక్షణాలను పరిశీలించవచ్చు.

కథలలో కనిపించే పాత్రలను గురించి మొదట చెప్ప వలసి ఉంది. జానపద కథలలో మానవులే కాక జంతువులు, దేవతలు, దయ్యాలు, బ్రహ్మరాక్షసులు, కిన్నరులు, కింపురుషులు, నరసింహులు, నరనాగులు వగైరా పాత్రలన్నీ కనిపిస్తాయి, నాయకుడు, నాయిక, ప్రతినాయకుడు ముఖ్యపాత్రలై ఉంటారు. సామాన్యంగా చిన్నకొడుకు కథానాయకుడుగా ఉంటాడు. పెద్ద కొడుకు ఇంటి విషయాలను చూచుకొంటూ ఉంటాడు. ఒక్కొక్క సారి అప్రధాన పాత్రలే ప్రాధాన్యాన్ని కలిగి ఉంటాయి. నాయకుడికి జంతువుల సహాయం లభిస్తుంటుంది.

జానపద కథలలోని సన్నివేశాలు స్వర్గ మర్త్య పాతాళాలలో జరుగుతుంటాయి. నాయకులకు ఈ అన్నిలోకాలతో సంబంధం ఉంటుంది. ఇవికాక జానపద కథలను గురించి చెప్పేటప్పుడు వాటిలోనికొన్ని వస్తువులను గురించి చెప్పవలసి ఉంది. మంత్రదండాలు, ఉంగరాలు, భూతద్దాలు మొదలైనవి కథలలో ఉంటాయి. దుష్టశిక్షణ, శిష్ట రక్షణ అన్నది కథలలో ముఖ్యోద్దేశంగా ఉంటుంది. గద్య కథలు సామాన్యంగా సుఖాంతాలే. 'అనగనగా' అనో 'ఒకానొక కాలంలో' అనో కథ మొదలై "కథ కంచికి వెళ్ళింది, మనం ఇంటికి వెళ్ళాం" (తెలుగు కథలైతే) అనో, "తర్వాత వాళ్ళు సుఖంగా ఉన్నారు" అనో ముగుస్తుంది. పెళ్ళి చివరి సన్నివేశంగా ఉండడం కథలలో సామాన్యంగా కనిపిస్తుంది.

## మూలాంశం (motif)–మాదిరి (type)

జానపద సాహిత్యంలో-అందులోనూ ముఖ్యంగా జానపద కథలలో మూలాంశం, మాదిరి అనే వాటికుండే ప్రాముఖ్యం గమనించదగ్గది. కథాగేయాలలోని మూలాంశాలను గురించి అదే అధ్యాయంలో చెప్పడం జరిగింది. గద్యకథలలోని మూలాంశాలూ అలాంటివే అయినా వీటిని గురించే విద్వాంసులు ఎక్కువగా కృషి చేసి ఉండబట్టి ఇక్కడ మరికొంత చెప్పాల్సి వస్తున్నది. గద్యకథల వర్గీకరణ చేసేటప్పుడు, పరిశోధనచేసేటప్పుడు మూలాంశం మాదిరి అంటే ఏమిటి, వాటి స్వరూపం ఏ విధంగా ఉంది అన్నదాన్ని తప్పక పరిశీలించాల్సి ఉంది. మూలాంశాలు కథా వస్తువుకు సంబంధించవని, మాదిరి కథానిర్మాణ పద్ధతికి సంబంధించిదని స్థూలంగా చెప్పవచ్చు కథలో కనిపించే కనిష్ఠాంశాలే మూలాంశాలనవచ్చు. ఇవి సామాన్యమైనవి కాదు ; అసామాన్యమైనవి. అంటే కథ వినగానే ఈ చెవిలోంచి ఆ చెవిలోకి వెళ్ళి పోయేవి కాక మనసుకు హత్తుకొనే కొన్ని విషయాలని చెప్పవచ్చు. ఈ మూలాంశాలను మూడు ముఖ్య విభాగాలక్రింద పరిశీలించవచ్చు. 1.బ్రహ్మరాక్షసి, మాంత్రికుడు, పిశాచాలు, దేవతలుమొదలైనవిపాత్రలు. ఇవి సామాన్య పాత్రలు కావు. తల్లి మూలాంశం కాదు : సవతి తల్లి మూలాంశం. ఇలాంటి పాత్రలు తమ చేష్టలవల్ల మన మనస్సు నాకట్టుకుంటాయి. 2. కథల్లో కొన్ని వస్తువు లుంటాయి. మంత్ర దండం, మాంత్రిక విభూతి, భూతద్దం, ఆకాశంలో విహరించడానికి ఉపయోగించే చాప మొదలైనవి వస్తురూప మూలాంశాలు. 3. మూడవ విభాగం కొన్ని సంఘటనలు. సప్తసముద్రాలను అవలీలగా దాటడం, ఎంతటి వాడినైనా, ఎంత మందినైనా సులభంగా ఓడించడం, కొండలు—నదులు—సముద్రాలు దాటి వెళ్ళి ప్రతినాయకుని ప్రాణాన్ని తీయడం మొదలైన సంఘటనల రూపంలో కూడా మూలాంశాలు ఉండవచ్చు. పైన చెప్పిన మూలాంశాల సహాయంతో కథ పెరుగుతుంది ప్రపంచ జానపద సాహిత్యంలో ప్రచలితమై ఉన్న మూలాంశాలను ఒకచోట చేర్చి "మోటిఫ్ ఇండెక్స్ ఆఫ్ ఫోక్ లిటరేచర్" అనే పేరుతో బృహత్సంపుటాలను తయారుచేసిన వారు స్టిత్‌థామ్సన్. ఈ సంపుటాల సహాయంతో ప్రపంచంలోని ఏ ప్రాంతంలో ఎలాంటి మూలాంశాలు వాడుకలో ఉన్నాయోతెలుసు

కోవచ్చు. కథ ఏ ప్రాంతానికి చెందింది అన్న విషయాన్ని ఈ మూలాంశసూచి సహాయంతో కనిపెట్టడం సాధ్యమవుతుంది.

"మాదిరి'' అంటే స్వతంత్రమైన, స్వయం సంపూర్ణమైనకథ. ఒక మాదిరిలో ఒక్కమూలాంశమే ఉండవచ్చు. లేదా అనేక మూలాంశాలు ఉండ వచ్చు. మాదిరి చిన్నదైనా కావచ్చు లేక పెద్దదిగా ఉండవచ్చు. ఒక మాదిరిలో ఒక మూలాంశం ఉండవచ్చు అని చెప్పినంత మాత్రాన, అన్నిమూలాంశాలు ఒక్కొక్క మాదిరి అవుతాయనుకోవడం పొరపాటు. ఒక విధంగా ఒక్కొ రకం కథ ఒక్కొమాదిరి అని చెప్పవచ్చు. ఇలాంటి సమానాంశాల కథల మాదిరులను గుర్తించి మాదిరిసూచిని కూడా తయారుచేయడం జరిగింది. జానపద కథల వర్గీకరణకు, కథానిర్మాణ పద్ధతిని తెలుసుకోడానికి అత్యంతో పయుక్తమైన ది టైప్స్ఆఫ్‌ది ఫోక్‌టేల్ (The Types of the Folk-Tale) అనే ఉద్గ్రంథం ఆంటీఆర్నె, స్టిత్‌థామ్సన్ అనే ఇద్దరు విద్వాంసుల కృషిఫలి తంగా 1928లో వెలువడింది. మూలాంశసూచి, మాదిరి సూచి జానపదకథల స్వరూపాన్ని తెలుసుకోగోరే వారికి సహాయపడడమే కాకుండా కథల అధ్య యనంలో మహత్తరమైన పాత్రను వహిస్తున్నవి.

## కథలపుట్టుక – వికాసం

కథలు చెప్పడం—వినడం ఈనాటివి కావు. మనకు తెలిసి కొన్ని వేల సంవత్సరాలనుంచి కథలు చెప్పే పద్ధతి ఉంది. మానవ సంస్కృతి చరిత్రలో పిరమిడ్లు అత్యంత ప్రాచీనకాలానికి చెందినవని మనం చెప్పుకుంటాం. కథలు పిరమిడ్లకంటె ఇంకా ఎన్నో వేల ఏళ్ళు ప్రాచీనమైనవి. పిరమిడ్లు కట్టిన చియోప్స్ (Chepos) దగ్గర వృత్తి కథకులుండేవారట.[3] విశిష్టమైనవి అన్నదే కాక సంఖ్యవల్లకూడా కథలకు జానపద సాహిత్యంలో ప్రముఖస్థానం ఉంది.

కథల పుట్టుకనుగురించి చెప్పుకునేటప్పుడు కొన్ని జానపద సిద్ధాంతా లను జ్ఞాపకం తెచ్చుకోవలసి ఉంటుంది. జేకబ్‌గ్రిమ్, విల్‌హెల్మ్‌గ్రిమ్ అనే జర్మన్ సోదరులు తాము ప్రచురించిన కిండర్ అండ్ హౌస్ మార్షెన్ (1812-14 రెండు సంపుటాలు) అనే కథా సంపుటాలలో ఇండోయూరోపియన్ సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. ప్రపంచంలోని కథలన్నిటికీ ఇండోయూరో

పియన్ కథలే మూలమని ఈ సిద్ధాంతం చెప్తుంది. సంస్కృతభాషకు గ్రీకు భాషకు ఉండేపోలికలను పరిశోధించిన విద్వాంసులు ఇండో-ఆర్యన్, ఇండో యూరోపియన్ భాషలకు మూలం ఒక్కటే అని చెప్పేసరికి అవి గ్రిమ్ సోద రులకు ప్రేరణ అయింది.

గ్రిమ్ సోదరులే మరొక సిద్ధాంతం ప్రచారం కావడానికి కూడా కారకు లయ్యారు. అది పురాణ మూల సిద్ధాతం. ఆర్యులపురాణాలే ముక్కలుచెక్కలై పోయి కథలుగా మారాయని ఈ సిద్ధాంతం ప్రతిపాదిస్తుంది (Broken down Myth theory) మాక్స్ ముల్లర్, కాక్స్ మొదలైనవారు ఈ సిద్ధాంతాన్ని బల పరిచారు. ఆంద్రూల్యాంగ్ ఈ సిద్ధాంతాన్ని కటువుగా విమర్శించిన వారిలో ప్రముఖుడు.

పై సిద్ధాంతంవల్ల విద్వాంసులదృష్టి భారతదేశంవైపు ప్రసరించింది. మాక్స్‌ముల్లర్ వేదాలను అధ్యయనం చేస్తే, బెన్ఫె (Benfey) పంచతం త్రాన్ని విశ్లేషించాడు. పంచతంత్ర కథలను ఆంగ్లంలోకి అనువదించిన బెన్ఫె (1859) ఆ గ్రంథానికి ఆరువందల పుటల అమూల్యమైన పీఠిక రాశాడు. ప్రపంచంలోని పెక్కు ప్రాంతాలలోని కథలకు భారతీయ కథలే మూలమని బెన్ఫెవాదం. ఇది భారతమూల సిద్ధాంతం (India origin theory)గా పేరు పొందింది. భారతదేశం నుంచి కథలు ఇతరదేశాలకు బౌద్ధులమూలంగా అరబ్బుల మూలంగా ప్రసారమయ్యాయని బెన్ఫె భావించాడు. ఇంకా కొన్ని విధాలుగా కూడా కథలు ప్రసారమయ్యాయి.[4] భారతదేశమే అన్ని కథలకు మూలమని చెప్పకున్నా, కోహ్లర్ (Kohler), కాస్క్వీన్ (Cosquin) మొద లైనవారు భారతదేశం కథలకు కాణాచి అనీ, అనేక కథలకు ఈ దేశపు కథలు ప్రేరణ యిచ్చాయని ఒప్పుకున్నారు. అయితే కొందరు భారతమూల సిద్ధాం తాన్ని తీవ్రంగా విరోధించారు. అలాంటి వారిలో జోసెఫ్ బెడియర్ ముఖ్యుడు (Les fabliaux; 1893). ఆంద్రూల్యాంగ్ భారత కథలకంటె ఈజిప్టు కథలే ప్రాచీనమైనవని భావించాడు.

ల్యాంగ్ తనే ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. జానపదకథలలో కనిపించే ప్రాచీన భావనల్ని పరిశీలించినప్పుడు అవి పురాతనకాలంయొక్క అవశేషాలని చెప్పవచ్చునని అతని అభిప్రాయం. ఇదే మానవ శాస్త్రీయ

సిద్ధాంతం (Anthropological theory) పేరుతో ప్రసిద్ధమయింది. కథలలో సమానాంశాలు కనిపించడానికి కారణం అవి సంస్కృతి వికాసంలో ఒకానొక దశలో ఉద్భవించడమని ల్యాంగ్ అభిప్రాయపడ్డాడు. బహుళోత్పత్తి వాదానికి ఈ అభిప్రాయం నాంది అయింది.

జానపద విజ్ఞానం పుట్టుకను గురించి చెప్పేటప్పుడు వివరించిన స్వప్న మూల సిద్ధాంతం ఆచరణాత్మక సిద్ధాతం మొదలైనవి కూడా జానపద కథల ఉత్పత్తిని గురించి తెలుసుకోడానికి ఉపయోగ పడ్తాయి.

కథల వర్గీకరణ

కథలన్నిట్నీ స్థూలంగా సంకీర్ణకథలు (Complex tales, సరళ కథలు (Simple tales) అని రెండు విభాగాలుగా చెయ్యవచ్చు. (కెన్నెత్ క్లార్క్, మేరి క్లార్క్ 1963:21–26) సంకీర్ణ కథలలో కట్టుకథ (marchen) ముఖ్యమైంది. మాదిరి సూచి (ఆర్నె-థామ్సన్)లోని 300–749 మాదిరులు ఈరకం కథలకు ఉదాహరణలు. మానవాతీతశక్తులు పాత్రలుగా ఉండేకథలను ఈ శీర్షిక క్రింద ఆసూచిలో చూపడం జరిగింది, దీనిలోని ఉపశీర్షికలుఇవి : మానవాతీత శత్రువులు – అభిమంత్రితులైన భార్యాభర్తలు – బంధువులు – మానవాతీత కార్యాలు – మానవతీత సహాయకులు – మాంత్రికవస్తువులు - మానవాతీత శక్తి అవగాహన. సంకీర్ణకథలలో రెండవవిభాగం ధార్మిక కథలు లేక మత సంబంధకథలు (religious tales) 'నావెల్లా' అనే పేరుగల కాల్పనిక కథ (romantic tale) కూడా సంకీర్ణ కథలలో ఒకరకం. ఇక సరళ కథలలో ముఖ్యమైనవి ప్రాణికథలు (animal tales) వినోదకథలు (Jokes and amecdotes), ఇతరలాక్షణిక కథలు పై కథారూపాలను ఈ క్రింది విధంగా పట్టికలో చూపించవచ్చు.



అయితే పై పట్టిక తెలుగుకథల విషయంలో అనుసరించదగిందికాదు. ప్రపంచంలోని అన్ని కథారూపాలకు సామాన్యంగా అన్వయించేది. అయితే కథల వర్గీకరణ విషయంలో ప్రాదేశికమైన లక్షణాలకు హెచ్చుప్రాధాన్యంఇవ్వవలసి ఉంటుంది.

కథనుగురించి పరిశ్రమ చేసిన విద్వాంసులు పేర్కొన్న కొన్ని కథాప్రక్రియలను గురించి సంక్షిప్తంగా చెప్పి తర్వాత తెలుగు కథా ప్రపంచానికి అన్వయించదగిన ప్రధానరూపాలను పేర్కొనడం జరుగుతుంది.

మార్షెన్ లేక కట్టుకథ

సంకీర్ణమైన ఇతివృత్తంతో, అనేకానేక కల్పనలతో భాసించే ప్రత్యేక కథారూపాన్ని మార్షెన్ అనే పేరుతో పిలుస్తారు. ఇది జర్మన్ భాషాపదం. దీనికి సమానమైన పేరు ఇంగ్లీషులో లేదు. కొందరు 'ఫేరీటేల్' (అద్భుత కథ) కు ఇది సమీపమైనదని అంటారు. మార్షెన్‌లో అద్భుత విషయాలు, అసహజ ప్రపంచాలలో అసంభావ్య పాత్రలు పెక్కు ఉంటాయి. మంత్ర తంత్రాలు, పరకాయ ప్రవేశాలు చాలాఉంటాయి. చిన్నకూతురు మామూలుగా నాయికై ఉంటుంది. 'మూడు' సంఖ్యకు ఎక్కువ ప్రాధాన్యం కనిపిస్తుంది. ముగ్గురుకూతుళ్ళుండడం. మూడు కోరికలు కోరడం వగైరా కనిపిస్తాయి. మంచివాళ్ళకు ఎప్పుడూ విజయం చేకూరుతుంది. రాజులు, రాజకుమారులు మంచివారై ఉంటారు. రాజు చెడ్డవాడైనా. రాజకుమారుడు మంచివాడై ఉంటాడు (వివరాలకు కెన్నెత్‌క్లార్క్, మేరిక్లార్క్ 1963 ; 21-23).

సాగె (sage)

ఇతిహ్యాలను, మరికొన్ని రకాల కథలను చేర్చుకొని జర్మన్‌భాషలో 'సాగె' అన్నపదాన్ని వాడుతారు. జరిగినవే అని జానపదులు నమ్మిన సంఘటనలను గూర్చిన కథలివి. వీటి ముఖ్యోద్దేశం సత్య ప్రతిపాదనమేగాని, నిజంగా సత్యమనుకోరాదు. సాగెలో వ్యక్తి ఐతిహ్యాలు, స్థల ఐతిహ్యాలు అద్భుతకథలు, సంఘటన ఐతిహ్యాలు మొదలైన విభాగాలున్నాయి.

నావెల్లా (novella): కాల్పనిక కథలలో ఒక రకంగా కొందరు విద్వాంసులు ఈ కథారూపాన్ని పేర్కొన్నారు. ఇవికూడా మార్షెన్ వంటివే. అయితే దానిలో ఉన్నంత అద్భుతగుణం ఉండదు. నావెల్లా కథలు సాహసోపేతమైనవి శోకాత్మకమైనవి, రసవంతమైనవి. మానవ స్వభావానికి అద్దం పట్టే కథలివి.

పై కథారూపాలను కాకపురా కథలు (mythological tales), ఐతిహ్యాత్మక కథలు (legendarytales), సృష్టిస్థితులకు సంబంధించిన కథలు (etiological tales) మొదలైన కథారూపాలను విద్వాంసులు పేర్కొన్నారు.

## తెలుగు కథలు

తెలుగులో జానపద కథలు వందలకొద్దీ, వేలకొద్దీ ఉన్నాయి. కాని జరిగిన కృషి చాలా తక్కువ. అన్ని ప్రదేశాల్లో పర్యటించి, కథలను సేకరించి ప్రకటించిన వారెవ్వరూ లేరు. నిజమైన జానపద కథల ఉత్తమ సంకలనం ఒక్కటి కూడా ప్రచురితం కాలేదు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో కె. సుమతి గారు జానపద కథలను గురించి పరిశోధన చేసి పి.హెచ్.డి. పట్టం పొందారు. ఈ క్షేత్రంలో సరైన పరిశోధనకు ఈ విధంగా నాంది పలకడం జరిగింది. తాతాచార్ల కథలు, పరమానందయ్య శిష్యుల కథలు, కాశీమజిలీ కథలు మొదలైన పేర్లతో కొన్ని జానపద కథలు—అనుకరణ కథలు (tales of imitation) ప్రచురితాలయ్యాయి. 'ఫోక్‌టేల్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్' పేరుతో డా. బి. రామరాజు సంకలనం చేసిన 30 కథలను స్టెర్లింగ్ పబ్లిషర్స్ వారు ప్రచురించారు. మొత్తం మీద గేయాలకు, కథాగేయాలకు ఇచ్చినంత ప్రాధాన్యం మనం గద్య కథలకు ఇవ్వలేదనిపిస్తుంది. ఇక పురాణాలు, ఐతిహ్యాల విషయంలో మనవారికి పెద్ద ఆసక్తి లేనేలేదు. తెలుగులోని జానపద కథలలో ఈ క్రింది ముఖ్యరూపాలను గుర్తించవచ్చు.

తెలుగు జానపద కథలు

| అద్భుతకథలు (fairy tales) | వినోదకథలు (mery tales) | ప్రాణికథలు (animal tales) | నీతికథలు (fables) | సమస్యాత్మకకథలు (riddle tales) |
|---|---|---|---|---|

## అద్భుత కథలు

ఇంగ్లీషులోని 'ఫేర్‌టేల్స్'ను. మానవాతీత కథలను చేర్చి అద్భుత కథలుగా చెప్పుకోవచ్చు. కథాసాహిత్యంలో అత్యధిక ప్రచారం కలవి ఇవి. రాజకుమారులు. మంత్రులు, మంత్రతంత్రాలు. వీటన్నిటికంటే ముఖ్యంగా సాహస ప్రవృత్తి ఈ కథలను నడిపిస్తాయి. 'ఒకానొక కాలంలో, ఒకానొక ప్రదేశంలో జరిగినట్లుగా నడిచేవి ఈ కథలు. అక్కడక్కడా హాస్యం కనిపించినా మొత్తం మీద ఇవి గంభీరంగా ఉంటాయి. యక్షులు, గంధర్వులు, కిన్నరులు, రాక్షసులు, పిశాచాలు సామాన్యంగా కనిపించే పాత్రలు. జానపద కథల కల్పనకు ప్రాణప్రదమైన మూలాంశాలు ఈ కథలలో మనకు పందల కొద్దీ కనిపిస్తాయి. 'ఫేరీటేల్స్' పేరుతో ఇంగ్లీషులో అనేక కథాసంకలనాలు ప్రకటింప బడ్డాయి. కానీ అన్ని విధాల కథలకూ కొందరు 'ఫేరీటేల్'అన్న పదాన్ని వాడడం సమంజసంకాదనే విషయాన్ని విద్వాంసులు గుర్తించారు. అద్భుత పాత్రలు లేని కథలుకూడా చాలా ఉన్నాయి. అయినా కథాప్రపంచంలో అద్భుత కథలకు ఎంత ప్రాధాన్యం ఉందనే విషయాన్ని ఇది తెలుపుతుంది. పిల్లలను ఎక్కువగా ఆకర్షించేవి ఈ కథలే. ఈ క్రింది చిన్న కథ చిత్తూరు జిల్లాకు సంబంధించింది (నివేదకుడు ఎం. ప్రకాష్, మేడికుర్తి, వాయల్పాడు తాలూకా).

"ఒక ఊళ్లో బ్రాహ్మణుడొకడుండేవాడు. అతను మంత్ర వేత్త. అతన్ని మించిన వారు ఆ చుట్టుపక్కల ఊళ్ళలో ఎవ్వరూ లేరు. అత నొక రోజు ప్రక్కగ్రామంలో పెళ్ళి జరిపించ డానికి వెళ్ళి వస్తుండగా సాయంకాల మయింది. అతని వెంట ఒకడు మూట మోసుకొని వస్తున్నాడు.

ప్రక్కగ్రామానికి, ఆ బ్రాహ్మడి గ్రామానికి మధ్య నది ఉంది. నదికి ఆవలి వైపు ఒక శ్మశానం, ఈవలివైపు ఒక శ్మశానం. ఆ శ్మశానాల నిండా దయ్యాలున్నాయని ప్రతీతి.

బ్రాహ్మడి వెంట వచ్చేవాడు అసలే పిరికి వాడు. సాయంకాలం అయింది కాబట్టి వాడికి భయమూ ఎక్కువవుతూ వచ్చింది. శ్మశానం దగ్గరికి రాగానే వాడికి కాళ్ళు వణకసాగాయి. అడుగులుముందుకు పడలేదు, బ్రాహ్మణు

డేమో త్వరత్వరగా వెళ్ళసాగాడు. అతనేదో ధ్యానంలో వెళ్తా వున్నాడు. కొంత దూరం వచ్చిన తర్వాత వెనక్కు తిరిగి చూస్తే, వెనక వస్తున్నవాడు కన్పించ లేదు ఇదేదో దయ్యపుచేష్టో. భూతపు చేష్టో అయివుంటుందని బ్రాహ్మణుడు భావించాడు. బ్రాహ్మణుడిని అనుసరిస్తున్నవాడు నదిలోకి దిగాడో లేదో అతని అనుమానం ప్రకారమే ఒక నల్లని గొర్రె అడ్డంగా వచ్చింది. 'గొర్రెతాలూకు ఆసామీ ఎవ్వరూ లేరు, దీనిని తీసికెళ్తే డబ్బు చేసుకోవచ్చున'నే ఆశతో దాన్ని భుజంపైన వేసుకొని బయలుదేరాడు అతను. మొదట అంత బరువులేని గొర్రె 'రాంగరాంగ రాజువారి గుర్రం గాడిదాయ' అన్నట్లు బరువు ఎక్కువ కాసాగింది. ఇంక అతను దాన్ని మోయలేక క్రిందికి విసరి వేయాలనుకునే వరికి అది రాక్షసాకారమై అతని గొంతు నులమ సాగింది.

బ్రాహ్మణుడు అతన్ని వెతుక్కుంటూ వెనక్కివచ్చి దయ్యాన్ని మంత్ర శక్తితో వెడల గొట్టేసరికి అది వాడితో 'బతికి పోయావు పోరా' అని చెప్పి వెళ్ళింది"

ఈ క్రిందిది ఒక విశిష్టమైన కథ. కోలారు జిల్లా కర్నాటకంలో చేరినా ఇంకా అక్కడ తెలుగు జానపద సాహిత్యం సజీవంగా ఉందనడానికి ఉదాహరణగా దీన్ని చెప్పవచ్చు. శ్రీనివాస పురానికి చెందిన పెద్ద వెంకటప్ప (వయసు 75) చెప్పిన ఈ కథను ఆయన మాటల్లోనే ఇవ్వడం జరుగు తున్నది.

"ఒక వూళ్లో దొర దొరసాని వుండిరి. బిడ్లు (బిడ్డలు) వుండలేదు. తపస్సుచేసిరి. భగమంతుడు ఆడబిడ్డకావలెనా మొగబిడ్డకావల్నా అని అడిగె. ఆడబిడ్డను ఇవ్వమనె. దొరసానికి బిడ్డాయ. బాగా చదివించిరి. బడికి పోయే టప్పుడు వచ్చేటప్పుడు వెలుగు కనిపించాలని ముక్కర చేయించె, ఒక దినం బిడ్డ నిద్రలేవలేదు. బడికి వద్దని తండ్రి ఉద్యోగానికి పోయె. బిడ్డ లేచిన తర్వాత తల్లి బడికి వద్దనె, నేస్తకత్తెలకు చెప్పలేదు, గురువుకు చెప్పలేదు, చెప్పివస్తాన'ని పోయె. వచ్చేటప్పుడు ముక్కర (నత్తు) కిందపడిపోయె. ఇంటికి వచ్చిన తర్వాత తండ్రి "వెలుగుపడలేదే, నత్తుచూడ" మనె, రాయి లేదు. ఎందుకీ బిడ్డ అని పెట్టె చేయించి బిడ్డను పెట్టి, బీగాలువేసి ఎక్కడైనా పారేసి రమ్మనె. ఊరి దగ్గర ఒక రాగిమాను ఉంది. సేవకులు పెట్టెను తగల గట్టేసి వచ్చిరి.

పట్నంలో ఒక దొర, దొరసాని, వారికొక కొడుకు. పరదాని (ప్రధాని) కొక కొడుకు. ఇద్దరూ మంచి స్నేహితులు. వీండ్లిద్దరు రాగిమాను దగ్గరికి వచ్చే అలవాటు. పెట్టెను చూచి పరదానికొడుకు "దొరకొడకా దొరకొడకా. అక్కడి పెట్టెనాది" అనె. దొరకొడుకు "పెట్టెలో ఉండేది నాది" అనె. పెట్టెలో బిడ్డను చూచి కళ్లు చెదిరె, పరదాని కొడుకు పెట్టె అక్కడే వదిలేసె. దొరకొడుకు ఆ బిడ్డ నాది' అనె. పరదాని కొడుకు మాట్లాడ లేదు. ముందుండే స్నేహమే పోయె. ఆబిడ్డ పెద్దదయ్యె. పెళ్ళిచేసుకొనె. పరదాని కొడుకు కనిపెట్టుకొనే ఉండె. ఆ బిడ్డకొక బిడ్డపుట్టె. పరదాని కొడుకు కనిపెట్టుకొనే ఉండె. ఆ బిడ్డ మొగునితో "నాతల్లి దండ్రులు నన్ను ఎందుకు పారేశారో తెలియదు. మీరెంతో సహాయం చేశారు. నా తప్పు ఏమిటో తెలుసుకోవలె' అని యజమానుల నడిగి సైన్యం తీసుకొనె. పరదాని కొడుకుదండుకు పెద్ద అయ్యె. అందరు వెళ్ళిరి పరదాని కొడుకుఎక్కడెక్కడో తీసుకొనిపోయె. రాత్రికి అడవికి వెళ్లిరి. అన్నానికి ఏర్పాట్లు జరిగె, అన్నం చేయించిపరదానికొడుకు కూరలో మిఠాయి వేసె. అవి తిని అందరికి మత్తు ఎక్కె. ఆమెకు మాత్రం పెట్టలేదు. ఆమె దగ్గరికి వచ్చి 'ఆదినం నిన్ను కనుక్కుంది నేను, నీవు దొరకొడుకు పట్టుకున్నావు, ఇప్పుడు నాతో రా' అనె– ఆమె ఎక్కడికిఅనె. 'ఎక్కడికోరా' అనె, ఆమె 'నేను బైటికిపోయివస్తాన'నె. వాడుఇక్కడేపో', అనె, 'నమ్మకంలేకపోతే కొంగుపట్టుకో' అన్నది వాడు ఆమెచీర పట్టుకోగా ఆమె చీర విడుస్తూపోయి చీరను చెట్టుకుకట్టిపోయె.బిడ్డ పరదాని కొడుకు దగ్గరే ఉండె. వాడుదాన్ని నరికి వేసె. పొద్దున అందరు పైకిలేచిరి. దొరకొడుకు చూచె, పరదానికొడుకు చేసిందంతా తెలుసుకొని దేశంమీద పోయె.

అక్కడ్నుంచి వెళ్ళిన ఆబిడ్డ ఒకపల్లెచేరె. చినిగిన చీర, గాయాలు వైదిదానిలాగుండె. పల్లెలో ఒక పేదవాడు వక్కాకు వ్యాపారం, చేస్తుండె. ఈమెవేషం బాగలేకున్నా రాజకళ ఉట్టిపడుతుండగా 'ఏమితల్లీ' అనె. 'నాకెవ్వరూ దిక్కులేర'ని ఆమె చెప్పగా ఇంటికి పిలుచుకొనిపోయె. చీర అంతా ఇచ్చె. ఆమె అన్నంవండి పెడుతూ ఉండె. ముసలోడు పొద్దునపోతే సాయంత్రం వచ్చేవాడు. ఈమె ఒకని కంటబడింది. వాడు 'నాదానికంటె బాగుంది. జతకుంటుంది' అని అక్కడేకూచోనె. ముసలోని రాకపోకలు తెలుసుకొని అన్నంతిని కాచుకొనె.మూడోదినం ముసలోడురాలేదు. వీడు రాత్రివచ్చి వాకిలి

తన్నె రాకపోతే ప్రాణం తీస్తాననె. ఆమె వస్తానని కాయితంమీద తన విషయం రాసి పటందగ్గర పెట్టి వాడితో పోయె ఈమె తన్ను తాకితే కాలిపోతావనె మూడునెలలు నోముపట్టినట్లు చెప్పి, మూడునెల్లేకదా మూడువాళ్ళలాగా అనుకొని వాడు వరే అనె పండుగ జరపాలనిందామె, ఏంకావాలంటె ఏమీ వద్దు ఆకాశంమీద దుమ్ము అరసోలడు, నీళ్ళమీద బుడగలు రెండు, తూగుల మానుపండు (కదలని మానుపండు), నక్కపిట్టగుడ్లు రెండు తీసుకొని రమ్మనె. అవి ఇమ్మని బజారులో అడగగా అంగడివాడు నేలదుమ్ము డబ్బిలో వేసిఇచ్చె, ఊరిలో బావిలో నీటిమీద బుడగల కోసం ప్రయత్నించె. బురదంతా వచ్చిందిగాని దానినే దుమ్ముమీద వేసుకొనె. ఇంటికివచ్చేసరికి ఆమె అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

పట్నానికి వెళ్ళిన ఆమెకు అక్కడివాండ్లు బాగా మర్యాదచేసిరి. రాత్రి ఆమెకు పడకలు అన్నీ ఇచ్చిరి. ఆమెకు నిద్రపట్టలేదు. అర్ధరాత్రిఎక్కడ చూచినా బీగాలువేసి ఉండె. 'నేను సత్యవంతురాలినయితే, పతివ్రతనయితే, బీగాలునేల పడిపోవాల'నె. అవి పడిపోయె. అక్కడేగుఱ్ఱం రెడీగా ఉండింది. కూచోని నేరుగా ఇంకో పట్నానికి పోయింది. రాజు లేదక్కడ, ఏనుగుకు సింగారంచేసిపెట్టారు. ఆ ఏనుగు పూలహారాన్ని ఆమెకువేసె. ఆమే రాజయ్యె. రాజుకుమీసాలులేవు. ఎవరికీ అడిగేధైర్యంలేదు. ఒకనాడు మంత్రిని పిలిచి కోనేరు తవ్వించాలనె. తర్వాత బొమ్మలు చేసేవాళ్ళను పిలిపించమనె. కొంత దూరంలో జీనిగల పావన్న ఉండె. నచ్చిన ప్రతిమ చేసివ్వవలనె. లోపలికి రమ్మనె వాడు భయపడె. లోపలికి తీసుకొని వచ్చి వాకిలివేసె. మంచి చీర, రవిక అన్నీకట్టుకుని బంగారుప్రతిమలావచ్చి నిలిచె. అలాంటి ప్రతిమను చేయమనె. వాడు మూడు నెలలకు చేసిస్తాననె, ఈ రహస్యం చెప్పావంటే తలబ్రద్దలవుతుందనె, ప్రతిమపూర్తిఅయినతర్వాత దానిని బావిదగ్గర పెట్టమనె. 'ప్రతిమనుచూచి మంచిమాటలాడితే బాగా చూడండి లేకుంటే కొట్టండ'ని రాజు ఆజ్ఞాపించె. ఆమెకు చిన్నప్పుడు చదువు చెప్పినగురువు అటువచ్చి బొమ్మను చూచి ఏడ్చె, గురువుకు ఆమె అన్నిసౌకర్యాలు చేయించింది. వరదాని కొడుకు వచ్చె బొమ్మను నరకడానికిపోయె. భటులువానిని పట్టుకొనివచ్చిరి. వానిని చంపుమనిఆజ్ఞఇచ్చె. తర్వాత ముసలాడువచ్చె, చాలా బాధపడె. ఆయనకూ సత్కారాలు లభించె, తర్వాత ఆమెను పిలుచుకొని వెళ్ళినవాడువచ్చె, వరదాని

కొడుక్కు పట్టినగతే వాడికీపట్టె. చివరికీ మొగుడువచ్చి మొగుణ్ణి తీసుకొని పోయె. తర్వాత ఆమె దొరసాని, అతను దొర అయిరి. రాజ్యానికి దొంతవం చేసుకొని తర్వాత తల్లిదండ్రులు అందరినీ పిలిపించి వైభోగంగా ఉండిరి."

పై కథలో నాయకునికి ఏమీ ప్రాధాన్యంలేదు. స్త్రీకేఎక్కువప్రాధాన్యం ఉండే పై కథవంటివి, స్త్రీ సాహసాన్ని వ్యక్తంచేసేవి కోకొల్లలుగా దొరుకుతాయి. అద్భుతకార్యాలు ఎక్కువగా లేకున్నా, ఎన్నో కష్టాలను ఎదిరించి చివరకు జీవితంలో గెలుపును పొందిన సాహస జీవనాన్ని చక్కగా వ్యక్తం చేస్తున్నదీ కథ.

### వినోదకథలు లేక తమాషాకథలు

'ఒక తమాషాకథ చెప్పనా' అని ప్రారంభించగానే పిల్లలు తాతయ్యా చుట్టూ చేరుతారు. హాస్యం వీటిలో ప్రధానంగా ఉంటుంది. హాస్యం పుట్టించడానికి ఒక్కొక్కసారి అద్భుతపాత్రలుండవచ్చు, జంతువులుండవచ్చు. ఇవి సరళ కథలు. ఇవి సంక్షిప్తంగా, ఆసక్తికరంగా ఉంటాయి. మానవ మాత్రులే ఎక్కువగా పాత్రలుగా ఉంటారు గాని మానవాతీతులు కాదు. కొన్ని కథలు అసభ్యంగా కూడా ఉండడం కద్దు. సోమరి పోతులు, మూర్ఖులు, మోసగాళ్ళు, దొంగలు మొదలైన వాళ్ల పాత్రలుగా ఉంటారు. అయినా వాస్తవ జీవితానికి ఇవి దగ్గరగా ఉంటాయి. కొన్ని కథల్లో హాస్యానికి తోడు నీతికూడా ఉంటుంది.

ఈ క్రింది తమాషా కథ మానవాతీత మూలాంశం ఉన్నా వినోదమే ప్రధానంగా కలది (నివేదకులు వెంకటలక్షమ్మ, నారాయణరెడ్డి పేట, నెల్లూరు జిల్లా).

"ఒక వూళ్లో బ్రాహ్మడుండేవాడు. అతను స్నానానికి పొయ్యి నమస్కారం చేస్తే సూర్యుడు ప్రత్యక్షమై ఏం వరం కావాలన్నాడు. పెళ్ళాన్నికనుక్కొని వచ్చి చెప్తానన్నాడా మూర్ఖుడు, తను వచ్చేంతవరకు సూర్యుణ్ణిఅక్కడే వుండమన్నాడు. పెళ్ళాంతో "సూర్యుడు వరంకోరుకోమన్నాడు. ఏంవరం కోరేది" అని అడిగాడు. "ఒకటి అనుకుంటే రెండుకావాలి" అని అడగమంది అతని పెళ్ళాం. అట్లే అడిగాడు సూర్యుణ్ణి. ఇంటికివచ్చి పెట్టె తాళం

తీసి రూపాయి తీసుకుని పప్పు ఉప్పుకొని మూటకట్టుకొని, దట్టీ కట్టి భుజాన పెట్టు కున్నాడు. రెండు అయ్యాయవి. మళ్ళీ భుజాన పెట్టుకొనే సరికి రెండయ్యాయి. ఇట్లా చేస్తూపోయాడు. ఎన్నిపెట్టుకున్నా రెండురెండయ్యాయి. ఇంటికి వచ్చాడు. తలుపుదియ్యమన్నాడు. మూటలన్నీ చింపాడు, దాహమియ్యవే అన్నాడు. పెళ్లాం మంచినీళ్ళు ఇచ్చింది. అవీ రెండురెండు అయ్యాయి. తొమ్మిది లోటాల నీళ్ళు తాగాడు. పొట్ట పగిలి చచ్చాడు. భార్య తపిసించి పొయ్యింది. పొద్దున నలుగురు మగాళ్ళు బిచ్చానికి వచ్చారు. పీనుగను ఎత్తమని చెప్పింది పెళ్ళాం. వాళ్ళు ఎత్తుకోబోయి కాల్చివచ్చారు. మళ్ళీ ఇంకో పీనుగ ఉంది. మళ్ళీ ఎత్తుకొని బోయి చెరువులో నీళ్ళలో పారేశారు. మళ్ళీ ఇంకోటి ఉంది. 'ఎంత మందిని చంపుతావమ్మా' అన్నారు వాళ్లు. 'నాకున్నది ఒక్కడే మొగుడు' అంది ఆమె. నరేనని మళ్ళీ పీనుగను తీసుకోబోయి లోతుగా గుంట దవ్వి బాగా కూరి పూడ్చి పెట్టారు. మళ్ళీ వచ్చే సరికి గుంటలో మంచి లేచి వస్తున్నాడు అతను. నలుగురూ పట్టుకొని తన్నారు. ఇంక మావల్లకాదని పరుగెత్తి పెళ్ళారు"

పైకథలో కొంత నీతి, కొంత మానవాతీత విశ్వాసాలకు ప్రాధాన్యం ఉన్నా మొత్తం మీద ఎక్కువగా కనిపించేది వినోదమే. ఇలాంటి కథల కోసం పిల్లలు చెవికోసుకుంటారు.

తన తెలివి వల్లగాక పరిస్థితులు అనుకూలించడం వల్ల సమస్యలను పరిష్కరించుకొని బహుమానాలు పొందే వారి కథలు ఆంధ్రదేశంలో పరమానందయ్య శిష్యుల పేరిట, మిడతం భొట్లు పేరిట, మర్యాద రామన్న పేరిట ప్రచారమై ఉన్నాయి, మిడతం భొట్లు చేతిలో మిడతను కనుక్కోలేక 'చెడితివి మిడతంభొట్లు' అని చెప్పి అదృష్టవశాత్తు బ్రతికి బయట పడ్డకథ ఆంధ్ర దేశంలో ఆబాల గోపాలమూ పరిచితమే. మిడతం భొట్లు పేరుతోనే కోలారు జిల్లాలోనూ బహుళ ప్రచారం పొంది నదీ క్రింది కథ (పెద్ద వెంకటప్ప, శ్రీనివాస పురం, కోలారు జిల్లా, వయసు 75). ఒక వూర్లో ఐవారు ఉండిరి. ఆయప్పపేరు మిడతంబొట్లు. పూటకు అన్నానికే వాళ్ళకి కష్టంగా వుంటూ వుండె. ఆమె పని చేసేది. ఆయప్ప అమలుదారు నింట్లో జవాను. వాళ్ళిస్తే తినడం, లేకుంటే పస్తు. ఇట్లుంటే ఏం బాగుంది. చదువు బాగా నేర్చుకో

కూడదా' అనెభార్య. అతను' నాకు రెండు కజ్జాయాలు చేసి. నేర్చుకొస్తా'ననె. ఆమె ఏడెనిమిది కజ్జాలు చేసిచ్చె. సంక కేసుకొని వెళ్ళి ఒక చోట కజ్జాయాలు తిని చుట్టూరా చూచె. దగ్గర ఒక చిన్నె వుండె పందికొక్కులు తవ్వుతుండె "బ్రాహ్మడా, బ్రాహ్మడా ఏం తింటున్నావు" అనె" 'కజ్జాలు' అనె బ్రాహ్మడు. చదువు మేం చెప్తాం. అని కజ్జాలు తిని పందికొక్కులు బొక్కలోకి పోయె మరి కొంత దూరంలో తాటి మానులుండె, అవి 'కజ్జాలు మాకివ్వు' అనె. అవితిని పైకి పోయె. పందికొక్కు లాగా తోడుతారు. తాటి మానులాగా నిలుచుంటారు అని రెండు ముక్కలు మాత్రం బ్రాహ్మడు నేర్చుకొనె. తర్వాత గువ్వలు వచ్చె అవీ తిని పారిపోయె. గువ్వలాగా కూచుంటారు. అనిబ్రాహ్మడు నేర్చుకొనె. తర్వాత జింకలు వచ్చె. అవీ తిని పరుగెత్తిపోయె.

బ్రాహ్మడు అటుదిరిగి ఇటు దిరిగి ఇంటికి వచ్చె. పెళ్ళామూ అడగ లేదు. ఆ వూరి దొర ఆడబిడ్డకు పెళ్ళి జరుగుతుండె. దొర పెళ్ళికి పోతూ బ్రాహ్మణ్ణి కాపలి పెట్టి, బీగాలు వేయకుండా భత్యం ఇచ్చి వెళ్ళి పోయిరి. పది దినాలు రాలేదు. ఒకదినం దొంగలు వచ్చిరి. ఇంటి వెనక కన్నం వేస్తుండిరి. ఆలుమొగలు పడుకొని వుండిరి. పెళ్ళాంమొగుణ్ణి" నీవు విద్య ఏం నేర్చుకుంటివి' అని అడిగె. "పంది కొక్కులాగ తోడుతారు" అనెబ్రాహ్మడు. దొంగలకు ఆ మాటలు వినపడె. వీడెక్కడ వస్తాడోఅని దొంగలు నిలుచు కొనిరి; 'తాటిమానులా నిలుచుంటారు' అనె. దొంగలు కూర్చొనిరి. "గువ్వలాల కూర్చుండారు" అనె. ఉరికిరి. 'జింకలాల పారతారు' అనె. దొర పెళ్ళినుంచి తిరిగి వచ్చె. పురోహితుణ్ణి పిలిచె. దొంగలు పట్టు బడిరి. వాండ్లు బ్రాహ్మణ్ణిపొగిడిరి. "తవ్వితిమి—ఇట్లనె, నిలుచుకొంటిమి-అట్లనె, కూర్చుంటిమి మళ్ళ అనె—ఉరికితిమి ఇంకా అనె' అని చెప్పిరి. దొర తక్షణం ముప్పయి రూపాయల సంబళంతో అతన్ని ఇంట్లోనే పెట్టుకొనె.

దొర ఎక్కడికో పల్లెకు రమ్మనె. బ్రాహ్మడు కూడా దొరతో పోయె. పోతుంటె మిడత దొరమీద కూర్చునె. చేతిలో పట్టుకొని 'నా చేతిలో ఉండేది ఏందో చెప్పు లేకుంటే తల తీస్తాన'నె. బ్రాహ్మణుడికి చెమటలు పోసె. 'నాడు చెడలేదు. నేడు చెడితి మిడతం ఖొట్లు' అనె. రాజు చాలా సంతోషించి మరో ఐదు ఎక్కువ చేసె.

మళ్ళీ ఒకనాడు కంటి, కాలి అనే పేరుగల దాదులు కంటిసరం దొంగిలించిరి. రాయికింద దాచి పెట్టిరి, మిడతంభొట్లను పిలిచి అడిగిరి. చెప్పక పోగా బంచి ఖానాలో వేసిరి. 'నేను కంటినందునా, కాలినందునా' అనుకొనె. అది విన్నదాదులు భయమేసి అతనికి చెప్పివేసిరి. అతని కింకా ఎక్కువ సంబళమాయె. యాభై రూపాయల సంబళంతో మిడతంభొట్లు ఆనందంగా ఉండె."

ఈ కథల్లో మిడతంభొట్లుగాని, పరమానందయ్య శిష్యులుగాని, మరొకరుగాని నిమిత్తమాత్రులు. అవివేకులను, అనూహ్య సంఘటనలను ఆధారంగా చేసుకొని హాస్యాన్ని పోషించడం జరుగుతుంది.

## ప్రాణి కథలు

ఇవి అత్యంత ప్రాచీనకాలంనుంచి ప్రచారంలో ఉన్నాయని చెప్పవచ్చు. ఇవి సంక్షిప్తంగాను, సరళంగాను ఉంటాయి. ముఖ్యంగా ఈ కథలలో జంతువులు, పక్షులు ఉండేవి ఒక వర్గంగా, పశుపక్ష్యలతో బాటు మనుషులూ ఉండేవి మరో వర్గంగా భావించవచ్చు. మానవుడూ ద్విపాదప్రాణి కాబట్టి వీటిని జంతుకథలనడంకంటె ప్రాణి కథలనడం సార్థకమే అవుతుంది. జంతువులేకాక పక్షులు కీటకాలు గూడా పాత్రలుగాఉంటాయి కాబట్టి ఇంగ్లీషులో 'అనిమల్ టేల్స్' అని వున్నా తెలుగులో ప్రాణికథలనడం మేలు. ఇవి ప్రతి సంస్కృతిలోను అన్ని దశలలో ఉద్భవించాయి. జానపద కథలనుకరించే పంచతంత్రం వంటి అనేక సాహిత్య కథలకు ప్రాణి కథలు ప్రేరణనిచ్చాయి.

ప్రాణి కథల్లో పశుపక్ష్యాదుల మానవీకరణం కనిపిస్తుంది. మనిషి చేసే సాహసాలను ప్రాణులుకూడా చేస్తాయి. చాలాకథల్లో పరస్పరం పాత్రల మధ్య ఘర్షణ సామాన్యంగా కనిపిస్తుంది. మంచి పాత్రలు చెడ్డపాత్రలు తప్పకుండా ఉంటాయి. మాయలాడి నక్కో, తోడేలో, మరో జంతువో మోసం చేయడం ఒక్కొక్కసారి తను తవ్వుకున్న గోతిలోనే తాను పడడం ఈ కథల్లో కథాంశం. కథల మాదిర్లను పట్టీ చేసిన ఆర్నెథాంప్సన్ తమ సూచిలో ప్రాణి కథలలో ఈ క్రింది ప్రధాన శాఖల్ని గుర్తించారు. 1. అడవిజంతువులు

2. అడవి జంతువులు-పెంపుడు జంతువులు 3. మనిషి- అడివిజంతువులు 4 పెంపుడు జంతువులు 5. పక్షులు 6. చేపలు 7. ఇతర జంతువులు,వస్తువులు.

అయితే ఈ పట్టీలోని జంతువులు ఆయా కథల్లో అలాగే ఉంటాయని ఎలా చెప్పడం ? ఇక్కడి జంతువులే వేరువేరు కథల్లో ఉండవచ్చు. ఒక్కొక్క సారి నీతికథలనుంచి ప్రాణికథల్ని వేరు చెయ్యడం కూడా చాలా కష్టమవు తుంది. సాహిత్య కథల్నికూడా జానపద కథల్నుంచి వేరు చెయ్యడమూ ఒక్కొక్కసారి కష్టమే. పంచతంత్ర, హితోపదేశాల కథలూ, ఈసపునీతి కథలూ కూడా ఎన్నో విధాలుగా జానపదుల్లోకి చొచ్చుకు వెళ్ళాయి. పాత్రల పేర్లు కూడా, పంచతంత్రాదులలోవి (కరటక దమనక మొదలైన పేర్లను 'కరి కాటకుడు' వగైరా పేర్లుగా మార్చి వాడుకోవడమూ వుంది) జానపద కథల్లోకి వెళ్ళాయి. ఈ క్రిందికథలో మేకకూ కరికాటకుడనే పేరును చెప్పాడు నివేద కుడు (పెద్ద వెంకటప్ప, శ్రీనివాసపురం, కోలారు జిల్లా).

"ఒకమేక ఉరేసుకొని ఉండె. కాలు చిక్కుకు పోయె. నక్కచూని దాన్ని తినవాలని 'నీ పేరేమి' అని అడిగె. 'గడ్డ గలిబిలిగాడ'ని ఆ మేకా కరికాటకుడు చెప్పె. నక్క తనను తినవాలని వచ్చిందని తెలుసుకొని మేక ఇట్లనె. "రేపొద్దున కాళికకు పూజ, నూటొక్క పులులు బలికావాలి. మింటికీ మంటికీ టాదులెత్తి ఉన్నాననె. నక్క పారిపోయె, దానికి పులి అడ్డమొచ్చె, నక్క యెగబోసుకొని పోతుండె. మేకను గూర్చి చెప్పి 'ఇంకేంగతి' అనె. పులిభయపడవద్దని నక్కకు చెప్పె, తీగలుపెకి నానడుముకు కట్టు అని చెప్పి అట్లే కట్టించుకొనె.

నక్క, పులి కలిసి మేకదగ్గరికి వచ్చె. 'ఏమయ్యా, పట్టుకొస్తివా' అనె మేక. 'నూటొక్కపులి కావాలంటిని కదా ఒకే పులిని తెస్తివే' అనె. పులికీ బేదెత్తుకొనేసె. నక్క ఒకచెట్టుమీద, పులి ఒక చెట్టుమీద పడె. నక్కకు మరీ ఆయాపమాయె. 'నీకు ఆయాసం తీర్చడానికి ఇక్కడ ఉయ్యాల పీట ఉంది. పణుకోబెడతా' అని నక్కను పడుకోబెట్టి పులిఊచె. నక్క పాట పాడ మనె. నక్కను పడుకోబెట్టి 'నీకొమ్ముల్లే గొరుసుల్లే నిన్ను మింగతా' అంటూ పాడె. నక్కబాగా యోచించె. 'నీవు పడుకో. నేను పాడతా' అనె. పులి పడు

కొనె. నక్కదాన్ని ఊచె. పులికూడా పాట పాడమనె. "నీఇంటికి తలుపులే దారబందములే, నే నురుకుతా' అని అది ఉరికిందే ఉరికిందే."

ఈ కథ సరళమైందే: నీతికథ కాకున్నా దీనిలో జీవితసత్యం సరళ రూపంలో సూచ్యంగా కనిపిస్తున్నది. 'మేరిపోతు గాంభీర్యం' అనే మాటకు పేటుగా మాటలతో మాయచేసే మేకలాంటి వాళ్ళయితే పులిని కూడా భయపెట్ట వచ్చునన్నది ఒక సత్యం. పులి ఎట్టిపరిస్థితుల్లోనూ తనక్రూరబుద్ధి పోనిచ్చుకోద నేది ఇంకోసత్యం. నక్క ఈ కథలో మోసగాడికి ప్రతీకగా కాక తెలివిగల జంతువుగా, పిరికి పందగా చిత్రితమైంది. పులి దుర్బుద్ధిని పసిగట్టి తెలివిగా తప్పించుకోగలిగింది.

నీతి కథలు :

పైన చెప్పిన కథవంటివి నేరుగా ఏ నీతినీ బోధించవు. కాని పశు పక్ష్యాదులు పాత్రులుగా ఉండే అనేక కథలలో నీతి ప్రధానంగా ఉంటుంది. ప్రాణి కథలే కొంతకాలానికి నీతి కథలుగా పరిణమించాయంటారు. అయినా ప్రాణి పాత్రలకంటె నీతికే వీటిలో ఎక్కువ ప్రాధాన్యం ఉంటుంది. ఇవి కూడా సంక్షిప్తంగా ఉంటాయి. నాటకీయంగా, నీతి వాక్యంగా అంతమవు తుంటాయి. నీతికథల చివర ఉండే వాక్యాలు అనుభవసారాలైన సామెతలను పోలి ఉంటాయి. ఈసపు నీతి కథలే పెక్కు కథలకు మూలమైనవనే అభి ప్రాయముంది. ప్రపంచంలో వివిధదేశాల కథలకు స్ఫూర్తినిచ్చిన పంచ తంత్రం ఉండనే ఉంది. పశుపక్ష్యాది పాత్రల ద్వారా మానవ స్వభావాన్ని అత్యంత రమణీయంగా ఆవిష్కరించిచూపే కథల్లో మొట్టమొదట పంచ తంత్రాన్ని చెప్పుకోవాలి. బుద్ధుని జాతక కథలలో కూడా జానపద మూలాం శాలే ఎక్కువగా కనిపిస్తాయి.

ప్రాణికథలూ, నీతికథలూ సామాన్యంగా ఇతర కథలకంటె చిన్నవిగా ఉంటాయి. మూలాంశాల సంఖ్యకూడా తక్కువగా ఉంటుంది. ఆదిమానవుడు పశుపక్ష్యాదుల దేహనిర్మాణం, స్వభావం మొదలైనవాటిని పరిశీలనాదృష్టితో చూడడమే ప్రాణికథలు రూపొందడానికి కారణమంటారు. అయితే మొదట

వీటి ఉద్దేశం ఉపదేశం చేయడం కాదు. తర్వాత తర్వాత గుప్తంగా ఉండిన బోధనాంశాలు స్పష్టమై నీతికథలుగా పరివర్తన చెందాయని చెప్పవచ్చు. పెద్ద లెవరైనా చనిపోతే వాళ్ళు పశుపక్ష్యాదుల దేహాలలో నివసిస్తారనే నమ్మకమూ, మానవునిలాగా మిగిలిన ప్రాణులూ ప్రవర్తిస్తాయనే భావమూ నీతికథలు ఉత్పత్తి కావడానికి కారణాలని కొందరు విద్వాంసుల భావన. కార్యకారణ సంబంధాల అన్వేషణలో ఉద్భవించిన ప్రాణికథలు నీతికథలకు మూలంకావనే అభిప్రాయం కూడా ఉంది. రూడో (E Rohde) అనే విద్వాంసుని ప్రకారం భారతదేశమే నీతికథలకు పుట్టినిల్లు. బెన్ఫె ఈసపు నీతికథల ద్వారా గ్రీస్‌లో ప్రవేశించిన ఈ కథారూపం అక్కడినుంచి భారతదేశానికి వచ్చిందని భావించాడు. మరికొంతమంది పాత ఒడంబడికలోని (Old Testament) అతి ప్రాచీన భాగాలలోనే నీతి కథలున్నాయని, అందువల్ల పూర్వ సెమిటిక్ నుంచి ఇవి అయోనియాన్‌కు వెళ్ళి అక్కడ్నుంచి మెసపటోమియా నాగరికత మూలంగా భారతదేశానికి వచ్చి ఉండవచ్చునని భావించారు.

తెలుగుదేశమంతటా ప్రచారంలో ఉండే నీతికథల్లో పేలపిండి బ్రాహ్మణుడి కథఒకటి, దీనికి ఎన్నో పాఠాంతరాలున్నాయి. వాటిలో నెల్లూరు జిల్లా పాఠాంతరం ఈ క్రిందిది.

"ఒకఊర్లో బ్రాహ్మడొకడుండేవాడు. అతని భార్య పేలపిండి దొంతి కుండల్లో అమర్చి పెట్టింది. వాటి దగ్గరగా పడుకున్న బ్రాహ్మడికి ఎన్నో ఆలోచనలు రాసాగాయి. ఈ పేలపిండిని అమ్మాలి. వచ్చిన డబ్బుతో ఒక కోడిని కొనాలి. ఆ కోడి గుడ్లు పెడుతుంది (బ్రాహ్మణుడు కోడినికొని గుడ్లు పెట్టించి వ్యాపారంచేస్తాడా అని ప్రశ్నించాలనే భావన ఈ కథ పసితనంలో వింటుండగా కలగలేదు.) కొన్ని దినాలకు కోడిపిల్లలువచ్చి, అవి పెద్దవై మళ్ళీ గుడ్లు పెడతాయి. కోళ్ళనన్నిటినీ అమ్మి ఒక మేకను కొనాలి. మేక పిల్లలిష కంటుంది. మేకలన్నీ ఎక్కువ కాగానే వాటిని అమ్మి బర్రెల్ని కొనాలి. పాలు అమ్మి డబ్బుచేసుకొని, బర్రె దూడల్ని వేస్తే వాటిని పెంచి పెద్దచేసి అన్నిటినీ అమ్మి పొలంకొనాలి. వ్యవసాయం చేసిచేసి భూస్వామినై, బాగా ఐశ్వర్యం సంపాదించిన తర్వాత ఇల్లు వాకిళ్ళతో సుఖంగా కాపురం చేస్తుంటాను. సుష్టుగా భోంచేసి పడుకొని తాంబూలం తేవే అని భార్యతో చెప్తాను. భార్య

కథల అధ్యయనం :

ప్రపంచంలో విద్వాంసుల దృష్టి ముఖ్యంగా జానపద కథలమీదనే పడిందని ఇంతకుముందే చెప్పడమైంది. వీటిని గురించిన అధ్యయనం వల్లనే అనేక సిద్ధాంతాలు ఉద్భవించాయి. పందొమ్మిదవ శతాబ్దినుంచే జానపద కథల అధ్యయనం ప్రారంభమయింది. గ్రిమ్ సోదరులు 1812లో ప్రచురించిన కథా సంకలనం జానపద కథాక్షేత్రంలో అనేక విద్వాంసులకు ఆసక్తిపుట్టేట్లు చేసింది. భారతదేశంలో ఉద్భవించి ప్రపంచంలోని పలుప్రాంతాలకు వ్యాపించిన పంచ తంత్ర కథలు, జాతక కథలు మొదలైనవి కూడా కొన్ని సిద్ధాంతాల ఆవిర్భావానికి దోహదం చేశాయి. గ్రిమ్ సోదరులు, ఆంద్రూల్యాంగ్, బెన్ఫె, టేలర్, స్టిత్ థామ్సన్ మొదలైనవారు సిద్ధాంత ప్రతిపాదకులయ్యారు. ఈ సిద్ధాంతాలు జానపద కథల పుట్టుక, వికాసాలను గురించి మాత్రమేకాక జానపద విజ్ఞానం లోని అనేక శాఖలను గురించిన పెక్కు విషయాలను అర్థంచేసుకోడానికి ఉపయోగపడతాయి.

జానపద కథల అధ్యయనంలో పరిశీలించవలసిన కొన్ని విషయాలున్నాయి. అధ్యయనంలో సేకరణ, పరిష్కరణ, విశ్లేషణ అనే మూడు దశలున్నాయి. కథలను సేకరించేటప్పుడు నివేదకులు చెప్పింది ధ్వని ముద్రణ (tape recording) చేసుకోవడం ముఖ్యం. ఒకవేళ ఇది వీలుకాకపోతే కనీసం నివేదకులు చెప్పింది చెప్పినట్లుగా రాసుకోడమైనా చాలా ముఖ్యం. ఒకే నివేదకుడు రెండవసారి ఒకే కథను చెప్పినా దానిలో భేదం కనిపించవచ్చు. పాఠం (text) మాత్రమే కాక కథా సందర్భం (context) కూడా ముఖ్యమన్నది మరిచి పోకూడదు. కథలు మొదలైన జానపద విజ్ఞాన రూపాలను సేకరించేటప్పుడు అనుసరించాల్సిన పద్ధతులను గురించి అనేక విద్వాంసులు కొత్తకొత్త సిద్ధాంతాలను రూపొందిస్తున్నారు. కథ చెప్పేటప్పుడు నివేదకులు మధ్య మధ్య తమ అభిప్రాయాలను వెల్లడిస్తుంటారు. అవి కూడా జానపద విద్వాంసునికి చాలా ఉపయోగిస్తాయి. ఇలాంటి వాటికి అలన్ డండెస్ మౌఖిక సాహిత్య విమర్శ (Orar literary criticism) అని పేరు పెట్టారు (1978 : 38 — 49). కథను సేకరించే వాళ్ళు కథతో బాటు దాని సందర్భాన్ని, పాఠాంతరాలను, నివేదకుల మౌఖిక విమర్శను కూడా సేకరించాలి. ఇక కథ

చెప్పే కాలం, చెప్పేవారి వయస్సు, కులం, అతనా కథను ఎక్కడ విని నేర్చు కున్నది కూడా తెలుసుకోవాలి.

సేకరించిన కథల పరిష్కరణలో ఎన్నో మెళకువలున్నాయి. కథలో పదాలు, వాక్యాలకంటె కథావస్తువు, మూలాంశాలు ప్రధానమైనవి. వీటి సహా యంతో మూల పాఠాన్ని గుర్తించే ప్రయత్నాలు జరపవచ్చు. ఈ పనుల్లో స్టిత్‌థామ్సన్ మూలాంశ సూచి; ఆర్నె – థామ్సన్ల 'మాదిరిసూచి' బాగా ఉపయోగిస్తాయి. ఏయే మూలాంశాల ఏయే ప్రదేశాలకు సహజమైనవనే విష యాన్ని మూలాంశ సూచి ద్వారా తెలుసుకోవచ్చు. అట్లే కథాతంత్రం గురించిన విశేషాలను, ప్రాదేశిక వైశిష్ట్యాలను 'మాదిరిసూచి' ద్వారా తెలుసుకోవచ్చు. మూలపాఠ నిర్ణయం, పాఠపరిష్కరణ అయిన తర్వాత నిర్మాణాత్మక అధ్య యనం, సాంస్కృతిక అధ్యయనం జరిపి కథావిశ్లేషణ చెయ్యవచ్చు. భాషా శాస్త్రంలో లాగానే కథలను కూడా వర్ణనాత్మకంగా (descriptive), తులనాత్మ కంగా (comparative) చారిత్రకంగా (historical) పరిశీలించవచ్చు. ఒక కథలోని నిర్మాణాత్మకమైన విశేషాలను తెలుసుకొని వివరిస్తే అది వర్ణనాత్మక పరిశీలన అవుతుంది. కథ మూలం, వికాసం, ప్రచారం మొదలైన వాటిని గురించి తెలుసుకొని ఆ కథ చరిత్రను పునర్నిర్మించడానికి ప్రయత్నిస్తే అది చారిత్రక విశ్లేషణ అవుతుంది. అనేక ప్రదేశాలలో కనిపించే వివిధ పాఠాంత రాలను, ఇతర భాషలలోని కథారూపాలను తులనాత్మకంగా పరిశీలించి, పరిశో ధించడం తులనాత్మక విశ్లేషణ అవుతుంది. ఈ విధంగా కథలను సేకరించి, పరిష్కరించి, విశ్లేషించడం వల్ల సమస్త మానవజాతికి సమానమైన అనేక విషయాలు అవగతమవుతాయి. మానవ సంస్కృతిని అధ్యయనం చేయడానికి జానపదకథలు సహాయం చేస్తాయనడంలో సందేహం లేదు.

## విద్వాంసుల కృషి

తెలుగు భాషలో జానపద కథలకుండే వ్యాప్తిని, ప్రచారాన్ని ఒకవైపు తలచుకొని, ఈ క్షేత్రంలో జరిగిన కృషిని తలుచుకుంటే ఎవరికైనా బాధ వేస్తుంది. తెలుగువారి సంస్కృతిని అర్థం చేసుకోవాలంటే భారత రామాయ ణాల శిష్టకల్పనల కంటె కథలు, సామెతలు, గేయాలు మొదలైనవే ఎక్కువగా పనికి వస్తాయి. కాని మనం వాటిని ఉపయోగించుకోక పోవడం దురదృష్టకరం.

నిజమైన జానపద కథల ఉత్తమ సంకలనం ఇప్పటికీ తెలుగులో ఒక్కటికూడా ప్రచురింపబడలేదంటే అతిశయోక్తికాదు, అబద్ధం అంతకన్నా కాదు. మధిర సుబ్బన్న దీక్షితుల కాశీమజిలీ కథలు, ముసునూరి వెంకటశాస్త్రిగారి తెలుగు జాతీయముల కథలు, పరమానందయ్య శిష్యుల కథలు, మర్యాద రామన్న కథలు మొదలైన వాటిలో కొన్ని జానపద కథలు, జానపద కథలవంటివి కని పించవచ్చు. కాని ఇవి చాలా వరకు లిఖితప్రతుల ఆధారంగా రూపుగొన్నవి. డా॥ బి. రామరాజుగారి 'Flok tales of Andhra Pradesh' 1974లో వెలు వడ్డది. (Sterling Publishers PVT LTD). ఉస్మానియా విశ్వవిద్యా లయంలో కె. సుమతి జానపద కథలను గురించి పరిశోధించి పిహెచ్. డి. పట్టం పొందారు.

ఇరుగు పొరుగు భాషల్లో, ముఖ్యంగా కన్నడంలో జరిగిన కృషి మనకు కనువిప్పు కలిగించేటటు వంటిది. కన్నడంలో జానపదకథల సంకలనాలు అత్యంత ప్రామాణికంగా, శాస్త్రీయరీతిలో వెలువడ్డవి. 1969లో రాగౌ (రామే గౌడ) ప్రచురించిన 'కర్ణాటక జనపద కథెగళు' రెండవ ముద్రణ భాగ్యాన్ని కూడా పొందింది (1979). ఇందులో సుదీర్ఘమైన మున్నుడితోబాటు కిన్నర కథెగళు (అద్భుతకథలు), నీతి కథెగళు, ప్రాణికథెగళు, అతి మానుష కథె. గళు, వినోదకథెగళు, ఒగటు కథెగళు అన్న ఆరు శీర్షికలక్రింద 63 అచ్చ మైన జానపదకథలున్నాయి. డా. జీ. శం. పరమశివయ్యగారి 'కన్నడ జానపద కథెగళు' (1970, మైసూరు విశ్వవిద్యాలయ ప్రచురణ) మరో గమనార్హ సంకలనం. కథలలోని మూలాంశాల ఆధారంతో కన్నడ జానపద కథలను విభజించి 71 పుటల విలువైన పీఠిక రాసి ఒక గొప్ప సంకలనాన్ని అందిం చారు డా. జీశంప. అతిమానుషపత్నులు, అతిమానుష పతులు, అతిమానుష విరోధులు, రమ్య కథలు, అద్భుత కథలు, బుద్ధిమంతుల కథలు, హాస్యకథలు, ప్రాణికథలు అనే శీర్షికలక్రింద ఈ సంకలనంలో 68 కథలున్నాయి. కథల సేకరణ కర్ణాటకంలో ఎంత విస్తృతంగా సాగిందంటే వివిధజిల్లాలకు సంబంధించిన ప్రాదేశిక కథాసంకలనాలు కూడా ప్రచురించబడ్డాయి.

ఇక ఇంగ్లీషు భాషలో జానపద కథాసంకలనాలకు లెక్కలేదు. అధ్య యన దృష్టితో చక్కగా కథల్ని విశ్లేషిస్తూ వ్రాసిన గ్రంథాలు కూడా

కోకొల్లలుగా ఉన్నాయి. ఇటీవలనే (1981) కీర్తిశేషులైన ప్రముఖ జానపద విద్వాంసులు రిచర్డ్ ఎం. డార్సన్ మాలికా సంపాదకులుగా చిలీ, చైనా, ఇంగ్లండు, ఫ్రాన్స్, జర్మనీ, గ్రీస్, హంగరీ, ఐర్లండు, ఇజ్రేల్, జపాన్, మెక్సికో, నార్వే దేశాల జానపదకథలు వేరువేరు సంపుటాలుగా వెలువడ్డాయి. గ్రిమ్, బెన్ఫె మొదలైనవారు చేసిన కృషిని గురించి ఇంతకు ముందే సూచనా ప్రాయంగా చెప్పడం జరిగింది.

కథాక్షేత్రానికి స్టిత్ థామ్సన్ చేసిన సేవ మరువరానిది. ఈ క్షేత్రంలో కృషి చెయ్యాలనుకునే ఏ విద్యార్థి అయినా థామ్సన్ రాసిన 'దిఫోక్ టేల్' (New York : Holt Rinehart, and winston, Inc; 1946) అనే విద్వద్గ్రంథాన్ని సంప్రతించి తీరాల్సిందే. ఈ పుస్తకంలో నాలుగు భాగాలున్నాయి : జానపద కథల స్వరూపం, వివిధ రూపాలు; ఐర్లండునుంచి ఇండియా వరకు జానపదకథ; ఆదిమ సంస్కృతిలో జానపదకథ; జానపదకథల అధ్యయనం. థామ్సన్ తయారుచేసిన మూలాంశసూచి, ఆర్నె – థామ్సన్ల 'మాదిరిసూచి' గురించి కూడా చెప్పడం జరిగింది. ప్రాప్ 'మార్ఫాలజి ఆఫ్ ది ఫోక్ టేల్' ద్వారా కథల అధ్యయనంలో విప్లవాత్మకమైన మార్పులను తీసుకొని వచ్చాడు. తర్వాత లెవిస్ట్రాస్ నిర్మాణాత్మక అధ్యయన విధానాలను అవలంబించి ఈ క్షేత్రాన్ని మరింత ఫలవంతం చేశాడు. జానపద కథాక్షేత్రంలో పలువురు విద్వాంసులు ఇంకా ఎన్నో విధాల కృషిని కొనసాగిస్తూనే ఉన్నారు. కథలను నిర్మాణాత్మకంగా, సామాజికంగా, సాంస్కృతికంగా, భాషాశాస్త్రపరంగా, విశ్లేషణాత్మకంగా ఇంకా అనేక విధాల పరిశీలించడం ద్వారా ఒక సంస్కృతి ప్రత్యేకతను తెలుసుకోవడం సాధ్యమవుతుందనే విషయాన్ని విద్వాంసులు గుర్తించారు.

టిప్పణి

1. "Myths display the stuctural, Predominantly culture specific, and shared, semantic systems which enable the members of a culture area to understand each other and to cope with the unknown. More stri–

ctly, myths are stylistically definable discourses that express the strong components of semantic systems"— P. Maranda (Ed) *Mythology*, Penguin Education, Reprinted 1973, p p. 12–13

2. ఇది మా బంధువుల వంశానికి సంబంధించిన పురాణం. ఇదే పురాణాన్ని ఇంకా అనేక వంశాలకు అన్వయించి చెప్పడమూ విన్నాను. కొన్ని జానపద కథల్లో, కథాగేయాల్లో కూడా ఇలాంటివి వస్తాయి. కన్నడంలో ఇలాంటిదే ఒక కథనం ఉంది. దానిలోని మూలాంశమూ తెలుగు వంటిదే. నేను విన్న తెలుగు పురాణం సుమారు 20 — 25 సం॥ క్రితమే.నా చెవిని పడింది. ఈ కన్నడ కథనం ఇటీవలనే (1978) ప్రచురితమైంది (జి.వి.డి. "కన్నడ ఐతిహ్యగళు", తేజస్విని ప్రకాశన, మడికేరి). "గుత్తలు గంగణ్ణ గారి వంశపు విషాదకథ" అనే పేరుతో ఇది ప్రచురితమైంది. "గంగణ్ణగారి పూర్వీకుల్లో ఒకరికి భార్యలిద్దరుండేవారు. ఒకరికి బిడ్డలు కలిగారు. మరొకరికి కలగలేదు. చాలామంది దేవుళ్ళకు మొక్కుకొన్నందువల్ల ఆమెకూ గర్భం వచ్చింది. తొమ్మిది మాసాలు మోసి కనింది. కాని బిడ్డను కాదు, పామును. ఆ పామునే ఆమె ప్రీతిగా పెంచింది. పండుగలు — పబ్బాలు వచ్చినప్పుడు 'నాగప్ప, ఎందుకు వూరకున్నావు. అక్కా-చెల్లెళ్ళను పిలుచుకురావా' అంటే, నాగప్ప తోడబుట్టిన వాళ్ళను పిలుచుకొని రావడానికి వెళ్ళేవాడు. వెళ్ళి గడప దగ్గర పడగ విప్పి నిలుచుకునేవాడట. అప్పుడు ఇంట్లోవాళ్ళు 'పంపిస్తాం రావయ్యా' అంటే పాలు తాగే వాడట. "పంపించం" అంటే తాగేవాడు కాదట. ఇంటికి తిరిగి వచ్చి పంపించలేదని తలాడించే వాడట.

ఇంట్లో నాగప్ప తల్లిని అంటిపెట్టుకొని ఉండేవాడట. ఎప్పుడూ ఆమె దగ్గరే ఉండేవాడు. పండుగ రోజుల్లో తీరికే లేకున్నా ఆమెను వదిలే వాడు కాదు. ఒకమారు పనుల ఒత్తిడిలో తిరుగుతూ కాళ్ళకు చుట్టుకుంటుండగా 'ఎందుకయ్యా ఇలా ఏడిపిస్తావు. ఎక్కడైనా ఒకమూల కూచోలేవా?' అనే సరికి నాగప్ప కోపగించి ఒక మూల పడుకున్నాడు. నాగప్పతల్లికి కళ్ళు సరిగా కనిపించేవి కాదు. రాగిపాత్రలో అన్నంవండి మూల పడుకున్న నాగప్పమీద పెట్టింది. చురచురఅని శబ్దంవచ్చేసరికి అనుమానం కలిగి 'నాగప్పా'

"నాగప్పా' అని పిలపగా, రాకపోయేసరికి పాత్రకింద చూచారు. నాగప్ప చచ్చిపడివుండే సరికి దుఃఖంతో నాగప్పను ఒళ్ళో వేసుకొనివచ్చి గుడిప్రక్కన అగ్నిప్రవేశం చేసిందట. నాగప్పచనిపోతూ 'వీరి వంశాభివృద్ధి కాగూడదు' అని శాపం ఇవ్వడంవల్ల ఇప్పుడు ఆ ఇంటిపేరు చెప్పేమగవాళ్ల లేరు. ఆడవాళ్ళు మాత్రం ఉన్నారు. ఇప్పటికీ ఆ ఇంట్లో ఆ పండుగను ఆచరించరట"

3. "It is an activity more ancient than the pyramids and in no wise dependent on the extent of our western culture, cheops, the great pyramid builder, 5,000 years ago had his professional story-tellers"- Stith Thompson, *A Folklore, the Readar*, Kennete and Mary clarke (Ed.). 1965, P. 40.

4. "......tales invaded Europe through the Arab conquest in Spain and the influx of Levantine traders into Byzantine Empire, affecting mainly literary media. A third impulse came through the Mongolian invasion that helped import oral tales into eastern Europe"-Linda Degh, *Folklore and Folklife*, Richard M. Dorson, 1972, p. 56.

# సామెతలు

"ఏదో సామెత చెప్పినట్లు" సామెతను గురించి
సింది ఏముంది అని ఎవరైనా అనుకోవచ్చు. కాని
అనుభవం వెనక ఒక పరిపూర్ణజీవిత సత్యమే దాగి ఉండవచ్చు. ఒక సంపూర్ణ
జీవిత సారమంతా ఒకే వాక్యంలో అడగి ఉండవచ్చు. తెలుగు వారి సామె
తల్లో తెలుగువారి జీవితంలోని అనేక ముఖాలు తొంగి చూస్తుంటాయి. అట్లే
కన్నడిగుల సామెతలు, తమిళులవి, వంగభాషవారివి, చైనా వారివి, జపాన్
వారివి, అమెరికా వారివీ.

సామెత అనే మాట "సామ్యత' నుంచి వచ్చింది. వీటి ముఖ్యగుణా
లలో సామ్యతను చెప్పడం కూడా ఒకటి. దృష్టాంతమనే అర్థంలోనే హంగరీ
భాషలో పెల్దబెగెడ్ (pelda begged) అనీ, అరబ్బీ భాషలో
మతల్ (mathal) అనీ సామెతకు పేర్లున్నాయి. ఆంగ్లంలో సామెతను
'ప్రోవెర్బ్' (proverb) అంటారు, సంస్కృతంలో సూక్తి అని, సుభాషిత
మని, తమిళంలో పళమొళి (పాతమాట) అని, కన్నడంలో గాదె (గాథా శబ్ద
భవం) లేక నాణ్ణుడి అని అంటారు. జనజీవితాని కున్నంత వైవిధ్యం సామె
తలకుంది. సామెతను నిర్వచించాలంటే పుస్తకం చివర చెయ్యాలిగాని, పుస్తకం
ప్రారంభంలోకాదని (ఎ. కె. రామానుజన్ 1968:6) చెప్పడంలో సామెతల్లోని
వైవిధ్యంఎలాంటిదని తెలుస్తుంది. రోగర్ డి. అబ్రహామ్స్ సామెతనునిర్వచిస్తూ,
ఈ జానపద సాహిత్యరూపంలోని వైవిధ్యాన్ని సాధ్యమైనంతవరకు సూత్ర
రూపంలోకి కుదించాడు : "సామెతలు సంక్షిప్తంగా, వివేకయుతంగా ఉండే
సాంప్రదాయిక అభివ్యక్తులు'' అన్నది ఆయన మాటల్లో ముఖ్యమైంది.[1]

జానపద విజ్ఞానం లోని అన్ని అంశాలలాగే సామెతలు కూడా సాంప్ర
దాయికమైనవి. వాటి ప్రత్యేకత వివేక వంతమైనవి కావడం, సంక్షిప్తంగా
ఉండడం. వివేకవంతంగా ఉండడమన్నది సామెతలపుట్టుకకు సంబంధించింది.
సంక్షిప్తంగా ఉండడమన్నది స్వరూపాన్ని గురించి చెప్తుంది. పలువురి జ్ఞానం

ఒక్కవి వివేకంగా వెలువడడం (లార్డ్ జాన్ రసెల్ నిర్వచనం, రాగొచే ఉదాహృతం, రాగొ 1975 · 12, కన్నడం) సామెత పుట్టుకకు సంబంధించింది.

సామెతలు సంక్షిప్తంగా ఉంటాయి. వాటిలో ఇరవై పదాలకంటె ఎక్కువ ఉండవని, ఉంటే అవి సామెతలు కావని కొందరు విద్వాంసుల అభిప్రాయం (ఇలాంటి అభిప్రాయం ఉందన్నవారు రాగొ 1975 : 17, కన్నడం) దీనివల్ల సామెతలకు సంక్షిప్తత అన్నది ముఖ్యగుణం అని తేలుతుంది.

'అల్పాక్షరాలలో అనల్పార్థ రచన' అన్న వాక్యానికి సామెతలు ఉదాహరణలుగా ఉంటాయి. సామాన్యంగా సామెతలలో ఒక్క వాక్యం మాత్రం ఉంటుంది. ప్రాచీన కళాత్మక అభివ్యక్తులలో సామెతలు ముఖ్యమైనవి. అయితే సామెతలు ఎప్పుడూ సంక్షిప్తంగానే ఉంటాయని అనుకోడానికి వీలులేదు. నాతి దీర్ఘమై, గంభీరంగా, సూచ్యంగా అనుభవాన్ని అభివ్యక్తీకరించేట్లయితే అలాంటి వాక్యాలను సామెతలని పిలవడంలో తప్పులేదు.

సామెతలో ఒక వాక్యంగాని, ఒకే పరిమాణంగల రెండు వాక్యాలుగాని ఉండవచ్చు. చివరికి అక్షరాల సంఖ్యలోకూడా పోలిక కనిపిస్తుంది. అంటే సామెతలోని రెండు భాగాల అక్షరాల సంఖ్య సమానంగా ఉంటుందన్నమాట. 'చేసింది పోదు, చేయంది రాదు'—'చేసేవి లోపాలు, చెప్పితే కోపాలు'—'నలుగురు నడిచిందే బాట, పలువురు పలికిందే మాట'

సామెతల్లో సమానభాగాలు ఒకవేళ లేకున్నా ప్రాసాను ప్రాసలతో గూడిన లయ కనిపిస్తుంది, ఛందో దృష్టితో చూస్తే వీటిలో ద్విపద పాదాలూ, తేటగీతి పాదాలూ, ఆట వెలది పాదాలూ కనిపించవచ్చు, ఛందస్సు పేరు ఏదైనా ఇంగ్లీషులో, కన్నడంలో, తమిళంలో కూడా ఈ ఛందో బద్ధత కనిపిస్తుంది. లయ అన్నది ప్రాచీన కవితాగుణాలలో ఒకటి. ప్రాక్తన మానవుని భాష మామూలుగా లయబద్ధంగానే ఉండేదని మానవశాస్త్రం చెప్తుంది. అందుచేత ప్రాచీన మానవ సంస్కృతిని ప్రతిబింబించే సామెతల్లో కూడా లయ ఉంటుందని చెప్పవచ్చు. ఈ లయ సామెతలను గుర్తు పెట్టుకోడానికి ఉపయోగిస్తుంది, కవితాగుణం సామెతల్లో ఉంటుందని చెప్పవచ్చు.

మౌలికమైన ప్రతిభ. కల్పనాశక్తి, అన్వేషణాసక్తి ఉండిన అతి ప్రాచీన మానవుడే సామెతలను సృష్టించాడనడంలో సందేహంలేదు. సామెతలను వాటి ఉత్పత్తిని గురించి ఆలోచించేటప్పుడు కూడా మనం మిగిలిన జానపద విజ్ఞాన విభాగాలకు అన్వయించే సిద్ధాంతాలనే అన్వయించవచ్చు. వీటన్నిటిని మూడు ప్రశ్నల క్రింద పరిశీలించవచ్చు. సామెతలుగాని, ప్రక్రియ గాని 1 ఎందుకు పుట్టింది? 2. ఎక్కడ పుట్టింది? 3. ఎప్పుడు పుట్టింది? అన్నవే ఆ మూడు ప్రశ్నలు. మనోవిశ్లేషణ సిద్ధాంతం, స్వప్న సిద్ధాంతం మొదలైనవి సామెతలు ఎందుకు పుట్టాయి అన్న దాన్ని తెలుసుకోడానికి కొంత వరకు ఉపయోగిస్తాయి. సామెత ఏ కాలంలో పుట్టిందనడానికి ఎక్కడైనా ఒక పదంలో చరిత్రకు సంబంధించిన వెలుగును ప్రసాదించే అర్థం వుంటే కొంత ప్రయత్నం జరపవచ్చు. లేదా మానవ సంస్కృతి వికాసంలోని వివిధ ఘట్టాలలో దేన్నయినా ప్రతి బింబించే విషయ ముంటే దాన్ని బట్టి కొంత పరిశోధన జరపవచ్చు 'ఇంట్లో ఈగల మోత, బయట పల్లకీల మోత' అనే సామెత వీధిలో కారు హారన్లు వినిపించే ఈ కాలంలో పుట్టింది కాదన్నది స్పష్టమే. 'కాలితో నడిస్తే కాశీకి పోవచ్చునుగాని, తలతో నడిస్తే తలవాకిలి దాటగలమా' అన్నది ఈ కాలందని చెప్పగలమా?

భౌగోళికంగా ఒక సామెత ఏ ప్రదేశానికి చెందిందనే విషయాన్ని పరిశీలించడానికి చారిత్రక—భౌగోళిక సిద్ధాంతం ఉపయోగిస్తుంది. ఫిన్నిష్ పద్ధతి అని ప్రచారమైన ఈ విధానం మామూలుగా కథల అధ్యయనంలో ఉపయోగంలో ఉంది. అయినా సామెత మొదలైన వాటికి కూడా ఈ విధానాన్ని వాడుకోవచ్చు. ఈ సిద్ధాంతం ప్రకారం సామెత ఒక ప్రదేశంలో పుట్టి మిగిలిన ప్రదేశాలకు వ్యాపిస్తుంది.

కొన్ని సామెతలు పురాణాలు, ఐతిహ్యాలు, కథలు మొదలైన వాటిని ఆధారంగా చేసుకొని ఉద్భవిస్తాయి. పురాణేతి హాసాలు చాలా సామెతలకు ప్రేరణ నిచ్చాయి. రామాయణ మహాభారతాలు, బైబిలు, పంచతంత్రం మొదలైనవి ఇలాంటి గ్రంథాలు. ఉదా: 'రామాయణంలో పిడకల వేట'—'వింటే భారతం వినాలి, తింటే గారెలే తినాలి' — 'రామాయణమంతా విని రాముడికి సీతేం కావాలని అడిగినట్లు?'

కొన్ని సామెతలు స్థల పురాణాలకు, దేశ చరిత్రకు సంబంధించిన విషయాలను సూచించేవిగా ఉంటాయి. 'తిరుపతి క్షౌరం' అన్న నానుడి అందరికీ పరిచితమైనదే. 'రామేశ్వరానికి పోయినా శనేశ్వరం వదలదు' "కాశీకి పోయిన వాడు కాటికి పోయినవాడు ఒకటే'' మొదలైనవి ఇలాంటివే. *See Naples and die* అనే సామెత ఒకానొక కాలంలో నేపల్స్ వ్యాపారానికి, కళలకు కేంద్ర స్థానంగా ఉండిన విషయాన్ని తెలుపుతుంది. *All roads lead to Rome* అన్న సామెత రోమనులు రహదారులు వేయడంలో నిపుణులన్న విషయాన్ని తెలుపుతుంది. 'హంపెగె హోగువుదక్కింత తన్న కొంపెయే వాసి, (హంపీకి వెళ్ళడంకంటె తన కొంపే నయం) అనే కన్నడ సామెత విషాద భరితమైన విజయనగర సామ్రాజ్య పతనాన్ని సూచిస్తుంది, "ఫ్రాన్సు వాళ్ళు ఆకలేసే కాకిని కూడా వదలరు' అనే ఆంగ్లసామెత ఉంది. నెపోలియన్ రష్యామీదికి దండెత్తి వచ్చినప్పుడు వేల కొలది ఫ్రెంచి సైనికులు అన్నం నీళ్ళు లేక కాకులనుకూడా చంపి తిన్నారని ప్రతీతి. ఇలా ఎన్నో చారిత్రక విషయాలు, స్థల ఐతిహ్యాలు సామెతలు పుట్టడానికి కారణమవుతాయి.

అనుభవమే సామెతల పుట్టుకకు ప్రధాన కారణమనేవిషయం తెలిసిందే. ప్రతిదినం జీవితంలో మనం కన్నవీ, విన్నవీ, అనుభవించినవీ సామెతల రూపంలో వెలువడుతాయి. చాలా సామెతలు సరళమైన ఉపమలరూపంలోను, అనుభవసారాలైన వాక్యాలుగాను, హాస్యపూరితమైన చెణుకులుగాను వెలువడుతుంటాయి. రోట్లోతలపెట్టి రోకటి దెబ్బకు జడిసినట్లు' అన్నది ఏ దంపుడు పాట వింటూ చెప్పిన అనుభవ వాక్యమో ! 'చిన్నమిరపకు కారం హెచ్చు' అన్నది అనుభవమేకదా. 'తీట గలవాడికి తోటగలవాడికి తీరిక వుండదు' అన్నది అనుభవ సిద్ధమే తిరిగే కాలు, తిట్టేనోరు వూరుకోవు' అని వూరికే అన్నారా? ఈ విధంగా సామెతలు మన జీవనానుభవం ఆధారంగా అవతరిస్తాయి.

పైన చెప్పినట్లు ఏవిధంగా అవతరించినా సామెతలు సామూహిక వికాసం పొందుతాయనేది సత్యం. అవి పుట్టడమేమో ఒక్కని వివేకంవల్ల కావచ్చు కాని, బహుళ ప్రచారం పొందిన తర్వాతనే సామెతలవుతాయి. తరతరాలుగా మనిషి సంపాదించుకున్న అనుభవం ఎవరినోటిలోనైనా వివేకవంత

మైన మాటగా వెలువడుతుంది, దాన్ని జనం గ్రహించి ప్రాచుర్యాన్ని కలిగించిననాడు ఆ మాట సామెత అవుతుంది. వేరు వేరు ప్రదేశాల్లోని సామెతల్లో సమానాంశాలు కనిపించవచ్చు. దానికి కారణం ఒక సామెత మరొకచోటికి ప్రయాణం చెయ్యడం కావచ్చు. లేక ఒకే రకమైన అనుభవం ఒకే విధమైన సామెత ఉద్భవించడానికి కారణం కావచ్చు. డా చాంపియన్ ఈ విధంగా అంటాడు. 'సామెతలగురించిన జ్ఞానం ప్రపంచమంతటా ఒక్కటే. భిన్నత్వం కన్పించేది సామెతల అభివ్యక్తిలో మాత్రమే. మనుష్యులంతా ఒకే పిండి నుంచి చేయబడినవాళ్లే. మూల భూతంగా ప్రాచ్యులనీ పాశ్చాత్యులనీ భేదం గాని, తెలుపు నలుపన్న భేదంగాని లేదు. మానవులంతా ఒక్కటే. మానవుని మూలభూత ప్రవృత్తులైన ప్రేమ, ఆకలి, భయం మొదలైనవి సంస్కార హీనులు' సంస్కారులని లేక అందరికీ సమాన గుణాలుగానే ఉంటాయి. మానవుల ఈ మూలభూత ప్రవృత్తులను తరతరాల నాగరికతలేవీమార్చలేవు'' (Racial proverbs, p. xxiv).

సామెతల్లోకెల్లా అత్యంత ప్రాచీనమైనవి ఏదేశంలో ఉద్భవించాయి. అన్న విషయంకూడా విద్వాంసులను ఆకర్షించింది. బాబిలోనియా, ఈజిప్టుడి ఇండియాదేశాల అతిప్రాచీన గ్రంథాలలో కూడా సామెతలు కనిపిస్తాయి. ఏసు సువార్తలలో సామెతలను వాడు కొన్నాడు. ముస్లిముల ఖురానులో సామెతలు, సామెతలను పోలిన వాక్యాలు చాలా ఉన్నాయి. వేదాలలో ఉపనిషత్తులలో సుభాషితాలు, నుడికారాలు కోకొల్లలుగా కనిపిస్తాయి. ప్రాచీనకాలానికి చెందిన భారతీయ ఋషులు, అరిస్టాటిల్, ప్లాటో లాంటి తాత్వికులెన్నో సామెతల్ని వాడారు. ఆచారాలు, ఆదర్శాలు, ప్రకృతి పరిశీలన, స్వభావపరిశోధన, చారిత్రక స్థలాలు, ప్రాచీనపురాణాలు, నిత్యజీవితంలో చూచి మనం అనుభవించే ప్రతి విషయమూ సామెతల పుట్టుకకు కారణం కావచ్చు. (ఇలాంటికారణాలు పెక్కింటికి చూ. తెలుగు సామెతలు. ఆం.ప్ర. సాహిత్య అకాడమి ప్రచురణ పీఠిక)

## విభజన

సామెతలు చాలా సంక్షిప్తమైనవీ, వైవిధ్యమైనవీ కావడంచేత వాటిని వర్గీకరించడం కష్టసాధ్యం, వీటి విభజనకు విద్వాంసులు ఎన్నోమార్గా

లను సూచించారు కాని అందులో ఏదీ సమగ్రంకాదు. సామెతలను విభజించడంలో ముఖ్యంగా రెండు పద్ధతులున్నాయి. అకారాదిగా విభజించడం మొదటిది. దీనిలో మళ్ళీ రెండు ఉపమార్గాలున్నాయి. సామెతల మొదటి మాటను తీసుకొని అకారాదిగా అమర్చడం. లేక సామెతల్లో ముఖ్యమైన పదాన్ని తీసుకొని అకారాదిగా కూర్చడం. ఈ మొదటి పద్ధతికాక మరో పద్ధతి ఉంది. అది వస్తువును ఆధారంగా చేసుకొని వర్గీకరించడం. మొదటిదాని కంటె ఇదే ఉత్తమ మైనదనిపిస్తుంది. లేకుంటే సామెత ఏదైనా కావాలంటే పుస్తకమంతా వెతకవలసి ఉంటుంది. మొదట వస్తువునుబట్టి వర్గీకరించి తర్వాత ఒక్కొక్క వస్తువుకు సంబంధించిన సామెతల్ని అకారాదిగా కూర్చవచ్చు. ఇలాంటి విభజనలో అకారాది పద్ధతిని అనుసరించినా ఉపవిభాగాలుంటాయి కాబట్టి సులభంగా సామెతల్ని వెతుక్కోవచ్చు.

ఆర్. ఎస్. బాగ్స్ సామెతల్లో 6 విభాగాలను చెప్పాడు (Standard Dictionary p. 1147) అవి; 1 ఉపయోగాన్ని గురించిచెప్పే Proverbial Metaphor Ex. A new broom sweeps clean 2. సూటిగా సాధారణీకరణం చేసి చెప్పే Proverbial Apothegm, Maxim Ex. seeing is believing 3. జనులను గూర్చి స్థలాలనుగూర్చిచెప్పే Blason populaire Ex. It takes nine tailers to make a man 4. ఉదాహృత వాక్యం తమాషాగా అంతమయితే wellerism Ex. "Everyman to his taste" said the farmer when he kissed his cow" 5. సామెతలను అనుకరించేపదబంధాలు proverbial phrases Ex. to break the ice 6. సామెతలాంటి పోలికలు proverbial comparison EX. As white as snow; wiser than Solomen.

వారన్ రాబర్ట్స్ (Warren Roberts) సూచించినవిభజన గమనించదగింది. (As quoted by Kenneth and Mary clarke 1963:120), దశమాంక పద్ధతిని ఉపయోగించే ఈ వర్గీకరణలో మొదటి సంఖ్య ప్రధానవిషయాన్ని సూచిస్తుంది. రెండవ సంఖ్య ఆ విషయంలోని ఉపభాగాలను తెలియజేస్తుంది. మూడవసంఖ్య ఈ ఉపవిభాగంలో సామెత స్థానాన్ని తెలియజేస్తుంది. ఇంకా ఏదైనా విశేషాన్ని చెప్పదలచుకుంటే చివరి

సంఖ్య ద్వారా సూచించవచ్చు. ఉదాహరణకు వయస్సుకు సంబంధించిన సామెతలకు 7 సంఖ్య ఇచ్చామంటే, ఆ వయస్సులోని పెద్దవారిని 4 అంకెతో సూచించ దలచుకుంటే అప్పుడలాంటి సామెతలు 7.4 అనే అంకెల క్రిందికి వస్తాయి. మళ్ళీ వీటిలోని ఉపవిభాగాలను 7. 4: 14. 1—ఈ విధంగా విభజిస్తూ పోవచ్చు. ఇందువల్ల సామెతలలో కనిపించే వైవిధ్యాలతో కూడిన విషయాలను చాలావరకు ఈ వర్గీకరణలో ఇమడ్చడానికి వీలవుతుంది.

ఇలాంటిఎన్నోరకాల వర్గీకరణలున్నా ఏదీసమగ్రంకాదని మొదటే చెప్పడమైంది. దీనికి కారణం ప్రతి సామెతా ఏదో ఒక విధంగా విశిష్టమైనది కావడమే. వారెన్ రాబర్ట్స్ చేసిన పై వర్గీకరణ గ్రంథాలయాలలో పుస్తకాలను వివిధ విషయాలనుబట్టి చేసే విభజనవంటిది. ఆర్. ఎస్. బాగ్స్ చేసిన విభజనలో ఆరురకాల సామెతలను చెప్పడం జరిగింది. ఇది విషయాన్ని బట్టి చేసే స్థూల వర్గీకరణ. బాగ్స్ పేర్కొన్న సామెతలతోబాటు మరి కొన్ని రకాలను పేర్కొంటూ ఆర్చెర్ టేలర్ రాసిన వ్యాసం గమనార్హమైంది. (Standard Dictionary of Folklore pp 902 - 905).

సామెతలలో కొన్ని ఏదో సత్యాన్నిగాని, నీతినిగాని చెప్పేవిగా ఉండవచ్చు.

ఉదా : పరులసొమ్ము పాపిష్టి సొమ్ము

*Honesty is the best Policy*

ఒక సూత్రాన్నిగాని, అనుభవాన్నిగాని చెప్పేవి కొన్ని.

ఉదా: మౌనం అంగీకారసూచకం.

*Silence gives Consent*

కొన్ని సామెతలు కథలను సూచించేవిగా, పాతకాలపు సంప్రదాయాలను సూచించేవిగా ఉంటాయి. ఈసపు కథకు సంబంధించినవి, పంచతంత్రం కథలకు సంబంధించినవి అనేకం ఉన్నాయి.

అందని ద్రాక్ష పళ్ళు పుల్లన

*Sour grapes*

కొన్ని సంప్రదాయాలను, ఆచారాలను తెలిపే సామెతలున్నాయి.

*Good wine needs no bush* అనే సామెత మద్యం అంగడి ముందు తీగను వ్రేలాడ దీసే సంప్రదాయాన్ని గురించి తెలుపుతుంది. కొన్ని సామెత లకు అనుకరణలుగా మరి కొన్ని సామెతలు పుట్టుకొస్తాయి. వీటిని అనుకరణ సామెతలుగా పేర్కొనవచ్చు.

*The nearer the Church, the farther from God* అన్నది ఒకసామెత (దేవాలయానికి దగ్గరయ్యే కొద్దీ దేవుడికి దూరం). దీని నుంచే *The nearer Rome, the worse Christian* అనేసామెత పుట్టిందంటారు. సామ్యతను చెప్పేసామెతలదే ఒక వర్గం.

Enough is as good as feast
కూటికుండ కుక్కముట్టినట్లు
కూడిన కొద్దీ కుండలమ్ముకొని తిన్నట్లు

వైద్యానికి సంబంధించిన సామెతలను ఒక వర్గంగా విభజించవచ్చు. గృహవైద్యానికి అనుభవమే జీవగఱ్ఱ. శాస్త్రీయాధారం లేకున్నా గృహవైద్యం ఒక్కొక్కసారి చక్కగా పనిచేస్తుంది. లాటిన్ సామెత అయిన Like cures like అన్నదే హోమియోపతి వైద్యానికి ప్రేరణ నిచ్చింది. 'ఉల్లి చేసిన మేలు తల్లి కూడా చెయ్యదు' అని అనుభవజ్ఞుల మాట. An apple a day keeps doctor away అన్నదీ వైద్యసంబంధమైన సామెతల్లో ఒకటి.

వాతావరణానికి సంబంధించిన సామెతలు కూడా అనుభవమూలకమైనవే. 'కృత్తికలో విత్తితే కుత్తుకలు నిండవు' అని వ్యవసాయదారుడు అనుభవంతో తెలుసుకున్నాడు. ఆరుద్ర వానను గురించి బోలెడన్ని సామెతలున్నాయి.

ఆర్‌ద్రిమళె కైతుంబ బెళె (ఆరుద్రవాన చేతినిండా పంట) అన్నదొక కన్నడ సామెత. ఇలాంటివే కొన్ని తెలుగు సామెతలు.

ఆరు కార్తెలకు పోతు ఆరుద్రకార్తె
ఆరుద్రకార్తె విత్తనానికి. అన్నంపెట్టిన ఇంటికి సేగిలేదు
ఆరుద్రకురిస్తే ఆరుకార్తెలు కురుస్తాయి
ఆరుద్రలో అడ్డెడు చల్లితే, పునాసకు పుట్టెడు పండుతుంది.

ఆరుద్రలో తడిస్తే ఆడది మగవాడగును. (ఇది నిజానికి ఆడది మగవాడవుతాడని అర్థం కాదనిపిస్తుంది. ఆరుద్రలో కష్టించి పని చెయ్యాలి కాబట్టి ఆడవాళ్ళు కూడ మగవాళ్ళతో సమానంగా పొలంలో పని చేస్తారని అర్థమై ఉండవచ్చు). ఇంగ్లీషులో కూడా వాతావరణానికి సంబంధించిన సామెతలు ప్రత్యేక విభాగంగా ఉన్నాయి. ఉదా : April showers bring may flowers. కొన్ని న్యాయశాస్త్రానికి సబంధించిన సామెతలు కూడా ఉన్నాయి. Ignorance of the law excuses no men మొదలయినవి ఒకవిధమైతే కొన్ని జనసామాన్యానికి సంబంధించిన న్యాయాన్ని తెలుపుతాయి. Don't kick a man when he is down, చచ్చిన పామును ఎందుకు చంపుతావు ? మొదలయినవి ఇలాంటివే.

సామెతలలోని ప్రధానరూపాలను పై విధంగా గుర్తించడం ఒక పద్ధతి అయితే వేరువేరు విధానాలను అనుసరించి వర్గీకరించడం మరో పద్ధతి. సామెతలలో ముఖ్యంగా రెండురకాలున్నాయి.: జనప్రియ సామెతలు, గ్రంథస్థ సామెతలు. కొందరు నాగరీకుల సామెతలనే మూడో విభాగాన్ని కూడా చేరుస్తారు. జనప్రియ సామెతలు ప్రజల్లో సహజంగా పుట్టినవి. మిగిలినవి చాలావరకు కల్పితమైనవి. ప్రాస, లయ, ఛందస్సు వగైరాలను ప్రయత్నపూర్వకంగా చేర్చి కవులు, విద్యావంతులు అటువంటి సామెతల్ని రూపొందిస్తారు. జానపదుల సామెతలది గ్రామ్యభాష. నాగరీకుల సామెతలది. గ్రంథస్థభాష సామెతలుకూడా జనబాహుళ్యంలో ప్రాచుర్యాన్ని సంపాదించి జానపద సామెతలుగా పరిణమించవచ్చు. వేమనపద్యాలలో మూడవపాదాలు చాలా సామెతలుగా చలామణీ అవుతుండడం దీనికి ప్రత్యక్ష నిదర్శనం. అయితే సామెతల్ని పని గట్టుకొని సృష్టింపబూనడం, గ్రంథాల్లో నుంచి సుభాషితాల్ని ప్రచారం ఉన్నా లేకున్నా వెలికిలాగి సామెతలుగా నిరూపింపబూనడం జానపద విజ్ఞానానికిచేసే అపచారం (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ ముద్రించిన తెలుగుసామెతల గ్రంథంలో సంపాదకవర్గంవారు ఇలాంటిపనేచేయడం శోచనీయం.)

గేయాలు మొదలైన సాహిత్య రూపాలలాగే సామెతల్నికూడా వస్తువును బట్టి, రచనను బట్టి, భాషనుబట్టి; ప్రాసాదులను బట్టి వర్గీకరించవచ్చు, మార్గరెట్ ఎం. బ్రయాంట్ (Margaret M. Bryant) చేసిన విభాగం భాషా

శాస్త్రపరమైంది (Standard Dictionary of Folklore. p. 907). సామెతల్లో ఈ క్రింది విభాగాలను గుర్తించవచ్చు 1. పూర్తి వాక్యాలు 2. విద్యావంతుల సంగ్రహ వాక్యరూపాలైన సామెతలు 3. అనుప్రాసలు 4. అసంపూర్ణ వాక్యాలు 5. క్రియారహిత అసంపూర్ణ వాక్యాలు 6. ఉపమలు 7. ఉదాహృత వాక్యాలు 8. ఆధునిక పరిహాసోక్తులు.

వస్తువును బట్టి సామెతల్ని విభజించేట్లయితే పౌరాణికాలని, చారిత్రకాలని, సాంఘికాలని రూపాలేర్పడతాయి. కొన్ని సామెతలు స్థల పురాణాలు. అంటే అవి ఆయా స్థలాల వైశిష్ట్యాన్ని తెలుపుతాయి. వస్తువును బట్టి చేసే వర్గీకరణలో ప్రకృతి వస్తువులను గురించిన సామెతలను కూడా చేర్చవచ్చు.

సామెతలలో ఎంత వైవిధ్య ముందంటే నిజానికి ఒక్కొక్క సామెతా ఒక్కొక్క ప్రత్యేక విభాగమని చెప్పదగి ఉంది. మానవుని అనుభవానికి, స్వభావానికి సంబంధించిన సామెతల్ని పెద్ద విభాగంగా పేర్కోవచ్చు. వేదాంత పరమైన సామెతల్ని కూడా ప్రత్యేక విభాగంగా చెప్పవలసి ఉంది. సలహాలు, చమత్కారాలు, విజ్ఞానానికి సంబంధించిన సామెతల్ని మరో విభాగంగా పేర్కోవచ్చు. కథలకు తోకలుగా పుట్టుకొచ్చే సామెతల దొక విభాగం. శృంగారం, హాస్యం మొదలైన వాటికి సంబంధించిన సామెతలను ప్రత్యేకంగా పేర్కోవాలి. ఇవికాక ఆలంకారికమైన సామెతల నన్నింటినీ కలిపి ఉపమలు, రూపకాలు, శబ్దాలంకారాలు కలవి—ఈ విధంగా కొన్ని విభాగాలను ఏర్పరచవచ్చు. ఇవి కాక ఆయా ప్రదేశాలలో ఉండే విశేషాలను గుర్తించి వర్గీకరణ చేయవలసి ఉంది.

## సామెతల అధ్యయనం

సామెతల వల్ల జరిగే ప్రయోజనాన్ని అతి ప్రాచీన కాలంలోనే గుర్తించడం జరిగింది. అందువల్లనే వేదకాలపు ఋషుల మాటల్లో కూడా సామెతలు చోటు చేసుకున్నాయి. ప్లాటో, అరిస్టాటిల్, ఏసుక్రీస్తు మొదలైన వాళ్ళు తమ ధార్మిక ప్రసంగాలలో సామెతల్ని వాడుకున్నారు. ప్రాచీన గ్రంథాలలో వాటి రచయితలు ఆనాడు వాడుకలో ఉండిన సామెతల్ని సందర్భానికి తగినట్లుగా ఉపయోగించుకున్నారు. జాన్ హేవుడ్ (John Haywood) 1546లో

రచించిన 'ఎడైలాగ్ఆఫ్ ప్రొవెర్బ్స్, (A Dialogue of proverbs) సామె తలతోనే కావ్యం వ్రాసే సంప్రదాయానికి మార్గదర్శకమైంది. పాశ్చాత్య దేశా లలో సామెతల్ని గురించి ప్రశంసనీయమైన అధ్యయనం జరిగింది. లక్షలాది సామెతల్ని సేకరించడం జరిగింది. చాంపియన్ సంకలనంచేసిన 'Racial Proverbs' అన్న పుస్తకం చాలా విలువయింది. ప్రపంచం నలుమూల ల్నుంచి వేలకొద్ది సామెతల్ని సేకరించి, వాటిని ఇంగ్లీషుకు అనువాదం చేసి, విలువైన పీఠికతో చాంపియన్ ఈ గ్రంథాన్ని ప్రచురించాడు.

జానపద విజ్ఞానంలోని అన్ని విభాగాలలాగే సామెతల విషయంలో కూడా అధ్యయనం సక్రమంగా జరగాల్సి ఉంది. సేకరణ, పరిష్కరణ, విశ్లే షణ శాస్త్రీయంగా జరగాలి. ఇలాంటి అధ్యయనం కోసం పాశ్చాత్య దేశాలలో కొన్ని సంస్థలు వెలశాయి. అలాంటి వాటిలో Proverbial Sayings Com_ mitte ఒకటి. ఈ సంస్థ 1944లో American Dialect Society కి అను బంధంగా ఏర్పడింది. సామెతల అధ్యయనానికి ఈ సంస్థచేస్తున్న కృషి మహ త్తరమైంది. సామెతలంటే ఏమిటి, వాటిని ఏ విధంగా సేకరించాలి, అసలు ఎటువంటి వాటిని సేకరించాలి, ఎక్కడనుంచి సేకరించాలి, మొదలైన విష యాలను గురించిన కొన్ని సూచనలను కూడా ఈ సంస్థ ప్రచురించింది. సామెతలను సేకరించే టప్పుడు వాగ్రూపంగాగాని. వ్రాత ప్రతుల రూపంగా గాని ఉన్న సామెతల్ని యధాతథంగా ఏమీ మార్పు చేయకుండా లిఖితం చేయాలి. సామెతలకు మెరుగులు పెట్టే పని చేయరాదు. పాఠాంతరాలు ఉంటే గుర్తించాలి. ఎక్కడ, ఎప్పుడు, ఎవరివల్ల వినింది, లేక ఏ గ్రంథం నుంచి సేకరించింది నమోదు చేసుకోవాలి. ఇలాశాస్త్రీయంగా సామెతలను సేకరించి, విశ్లేషించి అధ్యయనం చేస్తే సంస్కృతిని గురించిన ఎన్నో విశేషాలు తెలిసి వస్తాయి. సామెతల వల్ల ఉపయోగాన్ని మనం ఇంకా సరిగ్గా గుర్తించలేదని పిస్తుంది. ఇంకా న్యాయశాస్త్రాల వెలుగు క్రిందికి రాని సమాజాలలో అను భవజ్ఞుడైన 'కులంపెద్ద' చెప్పిన ఒక్కసామెత గ్రామంలోని సమస్యల్ని విడ గొట్టే సందర్భాలు నేటికీ కనిపిస్తాయి. ఆకారంలో చిన్నదైనా సామెతలో ఉండే అర్థగాంభీర్యం గొప్పది. కాబట్టి అది చూపే పరిణామమూ విలువైనదే. అయితే సామెతలకుండే ప్రయోజనానికి పోల్చిచూస్తే వాటిని గురించి మనం తీసుకునే శ్రద్ధ చాలా తక్కువని చెప్పాలి. వాక్సంప్రదాయంలో బ్రతికే సామె

తల మాట అట్లుంచి, వ్రాతప్రతులలో ఉండే సామెతల మీద కూడా మనకు శ్రద్ధలేదు. "Racial Proverbs" పీఠికలో డా. చాంపియన ఇలా అంటారు; "బ్రిటిషు మ్యూజియం, లండన్ లైబ్రరీ మొదలైన చోట్ల సామెతల్ని అన్వేషిస్తూ వెళ్ళినప్పుడు, నాకు పేనాకంటే పేనాకత్తి (వ్రాతప్రతులను విడదీయడానికి) అవసరమే ఎక్కువగా కన్పించింది" సామెతలను గురించి మనకుండే ఔదాసీన్యం ఎలాంటిదని ఈ మాటలు తెలుపుతాయి. నాగరికతను ముట్టిన ప్రదేశాలమాట అటుంచి, ఇంకా వెనకబడిన ప్రాంతాలుగానే మిగిలివున్న చోట్ల కూడా సామెతలు దినదినానికి మరుగున పడిపోతున్నాయి. ఆఫ్రికా లోని బెచువానాలో నివసించే సెచువానా తెగలలో ప్రచారంలో ఉండే సామెతల్ని జె. ప్లాజె 191 లో ప్రచురించాడు. పీఠికలో ఆయన చెప్పిన మాటలు గమనించ దగ్గవి. "ఈ సామెతల్ని నేను ముప్ఫై సంవత్సరాల ముందు సేకరించి ఉంటే ఈ సంకలనం ఇంతకంటె మూడింతలు పెద్దదిగా ఉండేది. దక్షిణాఫ్రికాలో ఐరోపా భాషలు, భావాలు వ్యాప్తి చెందుతూ ఉండడం వల్ల ఈ పాత పలుకుబళ్ళన్నీ త్వరత్వరగా మరుగునపడి పోతున్నాయి".

ప్రపంచంలో ఇంకా ఎంతోమంది ఇలాంటి అభిప్రాయంతోనే సామెతల్ని సేకరించి సంకలనాలను ప్రచురించారు. గ్రీకు సామెతల్ని సేకరించిన అరిస్టాటిల్ ప్రపంచంలోనే మొట్టమొదటి శాస్త్రీయ సంకలనకారుడని ప్రఖ్యాతి చెందాడు. కన్నెల్ వ్యాక్స్ట్రోమ్ 20,000 స్వీడిష్ సామెతల్ని సేకరించాడు. ఎస్టోరియన్ జానపద భాండారంలో లక్షకు పైగా ఎస్టోరియన్ సామెతలున్నాయని తెలుస్తున్నది. మన చిలుకూరి నారాయణరావుగారుకూడా లక్షసామెతల్ని సేకరించారట.

జర్మన్ సామెతల క్షేత్రంలో కార్ల్ వాండర్ సేవ చిరస్మరణీయమైంది 1880లో ఆయన సంకలనం చేసిన సామెతల 5 సంపుటాలు ప్రతి ఒక్కదానిలో 50,000 సామెతలున్నాయి. భారతదేశంలో ఏమైనా ప్రయత్నమంటూ జరిగిందంటే అది పాశ్చాత్యుల వల్లనే. రె. మార్టన్ 1832 లో ప్రచురించిన వంగ సామెతల పుస్తకమే భారతీయ భాషల్లో మొట్టమొదటి సంకలనమంటారు. 1881లో పి. ఆర్. టి. గుర్డన్ కొన్ని అస్సామీ సామెతల్ని ప్రచురించారు. ఎం. డబ్ల్యు కార్ ఆంగ్లానువాదంతో సహా తెలుగుసామెతల్ని ప్రచురించి

ఆవైపు మనదృష్టి వెళ్ళేటట్లు చేశారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారి సంకల్పంలో సామెతలు కాని పన్నీ వచ్చిచేరి రాశి ఎక్కువైందిగాని వాసితక్కువైంది. నేదునూరి గంగాధరంగారి పసడిపలుకులు, వ్యవసాయసామెతలు గమనించదగ్గవి. యువభారతివారు ఒకచిన్న సంకలనాన్ని వేశారు. డా. జి. ఎస్. మోహన్ కన్నడ-తెలుగు సామెతలను ప్రచురించారు. దక్షిణభారతీయ పుస్తక సంస్థవారు దక్షిణభారతీయ భాషల్లోని సమానార్థకాలైన సామెతల్ని చిన్నపుస్తకంగా ప్రచురించారు.

తమిళంలోని ప్రాచీన సాహిత్యమైన సంగ కాలంలోనే పళమొళి నానూరు (నాలుగువందల సామెతలు) అనే గ్రంథం వెలువడడం గమనించదగ్గది. మౌఖిక సాహిత్యం మీద తమిళులకుండిన అభిమానాన్ని తలచుకొని మనం సిగ్గుపడాలి. వారిలాగే మౌఖిక సాహిత్యాన్ని మనమూ భద్రపరచి ఉంటే మనకు తమిళంతో సమానమైన ప్రాచీనసాహిత్యం ఉండేది. కన్నడంలో సామెతలక్షేత్రంలోగణ నీయమైన కృషి జరిగింది. 1894 లో కన్నడ-ఇంగ్లీషు ఘంటువును ప్రచురించిన కిట్టెల్ అర్థ వివరణం చేసేటప్పుడు వాడిన సామెతల సంఖ్య 4000 కు పైబడి వుంది. వీటిని ఒకచోట చేర్చి రాగౌ ఒక సంకలనంగా ప్రచురించారు (1969).

1944 లో ఎచ్. ఎస్. అచ్చప్ప కన్నడ సామెతల సంకలనాన్ని ప్రచురించారు. అప్పనుంచి కన్నడంలో అనేక సంకలనాలు వెలువడ్డాయి. వీటిలో కొన్ని ప్రాదేశికమైనవి (ఒక్కొక్క జిల్లాకు సంబంధించినవి) కూడా ఉన్నాయి. ఎచ్. ఎస్. అచ్చప్పగారే 1969లో గ్రంథస్థ గాదెగళు (గ్రంథస్థ సామెతలు) అనేపేరుతో బృహత్సంకలనాన్ని అచ్చువేశారు. రాగౌ ప్రచురించిన నమ్మ గాదెగళు (మనసామెతలు) అన్ని విధాలా ఉత్తమ సంకలనం. నం. తపస్వీకుమార్‌గారి కన్నడ సామెతల సమీక్ష ఈ క్షేత్రంలో పరిశీలనార్హ విమర్శ, ఇలాంటివెన్నో తెలుగులోను రావలసిఉంది.

తరతరాల తెలుగు సామెతలు

సమాజంలో సామెతలకుండే ప్రాధాన్యాన్ని ప్రాచీన కవులు కూడా గుర్తించారు. లేకుంటే నన్నయ నాటినుంచి కవులు తమకావ్యాలలో వీటిని వాడుకునేవారు కాదు. ప్రజా జీవనంలో ముఖ్యపాత్ర వహించే సామెతల్ని గ్రాంథిక భాషలోకి మార్చి ఒకవిధంగా కవులు వాటి అభివ్యక్తిలోని సహజత్వాన్ని

పాడుచేశారు. ఉన్నవాటిని ఉన్నట్లుగా కనుక భద్రపరిచి ఉంటే శరతరాల తెలుగు సామెతల స్వరూపమేకాక సాంస్కృతికంగా వాటికుండిన ప్రాముఖ్యాన్ని తెలుసుకోడానికి తోడ్పడినట్లయ్యేది.

నన్నయనాటినుంచి కావ్యాలలో ఎన్నో సామెతలు, పలుకుబళ్ళు, నుడికారాలు, లోకోక్తులు కనిపిస్తాయి కాని వాటితోవచ్చిన చిక్కల్లా కవి కల్పితాలా లేక జనవ్యవహారంలో ఉండిన సామెతలా అన్నది తెలీకపోవటమే. ఏది ఏమైనా గ్రంథస్థ సామెతలు శిష్టసాహిత్యం మీద జానపద సాహిత్యం ప్రభావాన్ని సూచిస్తాయి.

ఈ క్రింది కొన్ని వాక్యాలు సామెతలుగా చలామణీ అవుతుండినవి, సామెతల్ని పోలినవి, సామెతలను చూచి కవులు కల్పించినవి అని ఏవిధంగానైనా చెప్పుకోవచ్చు. అయితే మొత్తంమీద ప్రాచీనకాలంనుంచి తెలుగునాట సామెతలు జనజీవితంలో భాగంగా ఉండేవనడానికి ఇవి నిదర్శనాలు.

| | |
|---|---|
| గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్ | (నన్నయ) |
| వృద్ధుల బుద్ధులు నంచలింపవే | (") |
| యజమాన భక్ష్యమగు పురోడాశ మదిగుక్క కర్హమగునె | (") |
| లేడికడుపున పులిపుట్టునె | (") |
| కయ్యమున కొండొకరుండిటు లొంటి వచ్చునే | (తిక్కన) |
| పాలలో బడిన బల్లివిధంబున నుండకుండునే | (") |
| నడికంటె చావుమేలని యెడిపలుకు దలంపవలదె | (") |
| పతులు మెచ్చని చెటవు నిష్ఫలముగాదె | (శ్రీనాథుడు) |
| చెప్పుకు మిట్టి తుచ్ఛ సుఖముల్ మీసాలపై తేనియల్ | (పెద్దన) |
| కలంచునే సతులు మాయల్ ధీరచిత్తంబులన్ | (") |
| పట్టిన పదడైన పసిడియై వెలిగె | (పాల్కురికి సోమన) |

పైవన్నీ ఒకఎత్తు. వేమన పద్యాలే ఒకఎత్తు. వేమనపద్యాల మూడవ పాదాలు చాలావరకు సామెతల వంటివే. వేమన జీవితానుభవంతో కవిత చెప్పినవాడు కావడంచేత అనుభవమే మూలద్రవ్యమైన సామెతలు

వేమనసూక్తులలో కోకొల్లలుగా కనిపిస్తాయి. ఈ వాక్యాలు వేమనను అచ్చమైన ప్రజాకవిగా చేశాయి.

'భక్తికలుగు కూడు పట్టెడైననుచాలు'
'అనువుగానిచోట అధికులమనరాదు'
'పదుగురాడు మాట పాటియై ధరజెల్లు'
'ఊరకుండువాని కూరెల్ల నోపదు'
'స్థానబల్మికాని తనబల్మికాదయా'
'చెప్పుతినెడి కుక్క చెఱకుతీపెరుగునా'
'తప్పులెన్నువారు తమతప్పులెరుగరు'
'కంచుమ్రోగునట్లు కనకంబుమ్రోగునా'
'విత్తనంబు మర్రి వృక్షంబునకు నెంత'
'సాధనమున జనులు సమకూరు ధరలోన'
'మనసు విరిగెనేని మరియంట నేర్చునా'
'పంది బురదమెచ్చు పన్నీరు మెచ్చునా'
'బలిమిలేనివేళ పంతంబు చెల్లదు'
'బొగ్గుపాల గడుగ పోవునా మలినంబు'
'చిత్తశుద్ధిలేని శివపూజలేలరా'

కవుల కావ్యాలలో పై విధంగా సామెతలు, పలుకుబళ్ళు అధిక సంఖ్యలలో దొరకడం వాటి ప్రాచుర్యాన్ని తెలుపుతుంది. శిష్టకవుల కావ్యాలలోనే తొంగిచూచే సామెతలు జానపద సాహిత్యంలో అసంఖ్యాకంగా కనిపిస్తాయనడంలో సందేహం లేదు. గేయాలలో, కథాగేయాలలో, గద్యకథలలో సామెతలు బోలెడన్ని కనిపిస్తాయి. ఉదాహరణకు కొన్ని (బి. రామరాజు 1979: 727–730)

'ఉలవ లెత్తామంటె ఊళ్ళనడిగెదవు'
'పేదవాని కోపము పెదవులతీట'
'ముంజేయి కంకణ మరయుట కున్నిట ముకురము కావలెనా'
'చల్లకోసము వచ్చి ముంచదాచంగనేల మనకూ'

'ఉసురువున్న ఉప్పమ్మవచ్చును ఊరికి పోవన్నా'
'రాజుల హృదయము రాయితో సమమంద్రు
నాడుసామెతలెల్ల నేడు నిజమయ్యె'
'ఆడబోయిన తీర్థమరయ నెదురైనట్లు'
'తను గట్టుటకు త్రాళ్ళు తాదెచ్చుకున్నట్లు'
'తానొకటి తలచితే దైవమొకటి తలచు'
'తాతకు దగ్గులు నేర్పినగతి. నా దగ్గర వదరెదవు'
'ముందుచెవులకన్న వెనుకకొమ్ములువాడి'
'ఉడుమునకేలరా ఊరిపెత్తనము వీరయ్య'
'కడవంత గుమ్మడి కత్తిపీటకులోకువ'
'దాసునితప్పు దండముతోసరి'

తెలుగు సామెతల సమీక్ష

తెలుగులో ఉండే వేలకొద్దీ సామెతలను ఏం చేస్తారు, ఎప్పుడు వాడుతారు, ఎలా వాడుతారు అన్నది చాలా కూతూహలకరమైన విషయం. తెలుగు సామెతలను గురించి ఏవో అక్కడా ఇక్కడా ఒకటి రెండు వ్యాసాలు తప్ప (నాయని కృష్ణకుమారి, తెలుగు స్వతంత్ర, జనవరి 1954) సమగ్రమైన పరిశీలన జరగలేదు. సామెతల విలువను, సమాజంలో వాటి పాత్రను లోతుగా పరిశీలించవలసిన అవసరం ఎంతయినా ఉంది. సాహిత్యపరంగా, సామాజికంగా, సాంస్కృతికంగా సామెతలను విశ్లేషించ వలసిఉంది.

సాహిత్య పరమైన సౌందర్యం:

సామెతలు అర్థగాంభీర్యం కలవి కావడంచేత సాహిత్య పరంగా వాటికి చాలావిలువ ఉంది. అల్పాక్షరాలలో అనల్పార్థరచనకు చక్కని ఉదాహరణలుగా సామెతల్ని చెప్పుకోవచ్చు. అయితే అన్ని సామెతలూ సాహిత్య గంధం ఉండే వనడానికి కూడా వీలులేదు. ఎందుకంటే సామెతల్లో పౌరాణికాలు, చారిత్రకాలు, నీతి సంబంధాలు మొదలైనవి అనేకం ఉన్నాయి. అయితే ధ్వని ప్రధానాలై, మనిషిలోని అనుభవసారాన్ని సూచనా ప్రాయంగా తెలిపే సామె

తలు కూడా అసంఖ్యాకంగా కనిపిస్తాయి. ప్రాసానుప్రాసలే పరమావధిగా భావించి. శబ్దాడంబరంతో అకవిత్వాన్ని కవిత్వంగా భాసింప జేసిన కవులెంతో మంది మనకున్నారు. అలాంటి కవిత్వంకంటే రసాత్మక వాక్యాలైన సామెతలే ఎంతోమేల నిపిస్తాయి. అర్థానికి అర్థం. శబ్ద సౌందర్యానికి శబ్ద సౌందర్యం—రెండూ వుండే సామెతలు సాహితీ విమర్శకులను ఎక్కువగా ఆకర్షించక పోవడం దురదృష్టమనాలి.

'కాలుజారితే తీసుకోవచ్చుగాని—నోరు జారితే తీసుకోగలమా'

ఏ విధంగా చూచినా మహార్థం భాసించే సామెత ఇది. జీవితంలో మాటకు ఉండే విలువను, సమాజంలో వ్యక్తికి వ్యక్తికి ఉండే సంబంధాన్ని, సంఘంలో మనిషి తీసుకోవలసిన జాగ్రత్తను ధ్వని ప్రధానంగా చెప్తున్న ఉత్తమ వాక్యమిది. కాలు అన్నది వస్తువు. ఒక వస్తువును స్థలాంతరం చెయ్యడం సులభం. కాలు జారితే దేహానికి బాధ కలగవచ్చు. కాని నోటి మాట గాలిలో పయనించేది. ఒక సారి మాట నోటి నుంచి వెలువడితే మళ్ళీ దాన్ని వెనక్కి తీసుకోడం సాధ్యం కాదు. మాట ప్రభావం మనసు మీద ఉంటుంది, దేహం మీద కాదు, దేహానికి కలిగే బాధకన్నా మనసుకు కలిగే బాధ గొప్పది. అందువల్ల నోరు జారేముందు నాలుగుసార్లు ఆలోచించ వలసి ఉంటుంది. ఇది జీవితంలో మనకు కలిగే అనుభవం. దీన్ని వివరించే ఉపాఖ్యానాలు మన పురాణాలలో, ఇతిహాసాలలో చాలా దొరుకుతాయి. కైకేయి దగ్గర నోరు జారిన దశరథుడు ఎన్నిపాట్లు వడ్డాడో మన మెరిగిందే. సూర్యుని దగ్గర నోరు జారిన కుంతి కర్ణుణ్ణికని ఎన్ని అవస్థలు పడిందో మనకు తెలిసిన విషయమే. ఇలాంటి సందర్భాలు పురాణాలలో చెప్పుకుంటూ పోవచ్చు.

'పడమట క్రుంకిన పొద్దు తూర్పున లేవదా'

అల్పాక్షరాలలో అనల్పార్థ రచనకు మరో చక్కని ఉదాహరణమిది. కేవలం వాచ్యార్థమే రమణీయంగా ఉంది, సూచ్యార్థం పరమ రమణీయంగా ఉంటే అది రసవత్కావ్యం కాక మరేమవుతుంది! ప్రకృతిలోని సూర్యుని చవినర్యను చూచిన వారికి తూర్పున ఉదయించడం, మళ్ళీ పడమట అస్త

మించడం, మళ్ళీ ఉదయించడం నిరంతరంగా సాగిపోతూ కనిపిస్తాయి. లోక వ్యాపారమూ అంతే. మనం ఉన్నాలేకున్నా అది సాగిపోతూనే ఉంటుంది, ఉదయాస్తమయాలంటాము గాని అస్తమయోదయాలనం. కాని పై సామ తలో మొదట పొద్దు క్రుంకడాన్ని చెప్పి తర్వాత ఉదయం వస్తుందనడంలో విశేషార్థం స్ఫురిస్తున్నది. మానవునికీ మొదట జన్మ తర్వాత మరణం. కాని జీవితాన్ని చవిచూచిన తాత్వికులకు మొదట మరణం, తర్వాత జన్మ. భారతీయ సమాజంలో మానవుని చావుపుట్టుకలు నిరంతరంగా సాగుతుండే వ్యాపారాలని గట్టి నమ్మకం ఉంది. చనిపోయే ప్రతి వాడూ మళ్ళీ జీర్ణవస్త్రాన్ని తీసివేసి మరో వస్త్రాన్ని ధరించినట్లుగా ఇంకో దేహాన్ని పొందుతాడని మన నమ్మకం. 'పడ మట క్రుంకిన పొద్దు తూర్పున లేవదా' అనడంలో తాత్విక దృక్పథం కని పిస్తున్నది. ఈ వాక్యంలో మరో అర్థంకూడా స్ఫురిస్తుంది కష్టసుఖాలు కావడి కుండలనేది మనం జీవితంలో రుచిచూడగల్గిన సత్యం. ఈనాడు కష్టం అనుభ విస్తున్నా రేపు సుఖం లభించగలదనే ఆశే జీవిని నిలబెడ్తుంది. ఈ ఆశావాదమే పై వాక్యంలో ధ్వనిస్తుంది. సూర్యుడు పడమట క్రుంకుతూ చీకటిని మన మీదికి తోలుతున్నా రేపు మళ్ళీ తూర్పున అరుణ రేఖలు పొడచూపుతాయనే విశ్వాసమే మనకు ధైర్యాన్నిస్తుంది. ఈ విధంగా సామెతలలో రమణీయార్థక ప్రతిపాదక శబ్దాలను మనం చూడవచ్చు.

సాంస్కృతిక పరమైన విలువ : సామెతలు సంస్కృతికి ప్రతి రూపా లని చెప్తే అందులో అతిశయోక్తి లేదు. అనుభవాల వేర్ల ద్వారా ప్రపంచ జ్ఞానాన్ని గడించి సంస్కృతి అనే లత పూచిన పూవులే సామెతలు. చిక్క నైన చొక్కపు మాటలలో మన సంస్కృతిలోని అనేక ముఖాలను దర్శించేట్లు చేస్తాయి సామెతలు. సంఘానికి, సంస్కృతికి విడదీయరాని సంబంధం ఉంది. సంఘం లేకుంటే సంస్కృతి లేదు, సంస్కృతి లేకుంటే సంఘం లేదు. సంఘం లోని కట్టుబాట్లు, ఆచారాలు, మర్యాదలు, సంప్ర దాయాలే సంస్కృతి అనిపించుకుంటాయి. ఒక్కొక్క సామెతకూ సాంస్కృతి కమైన విలువ కొద్దిగానో గొప్పగానో ఉండనే ఉంటుంది.

అత్తకు సంబంధించిన సామెతలే ఒక ప్రత్యేక విభాగమంత ఉన్నాయి. ఆంధ్రుల సామాజిక జీవితంలో అత్తకుండే స్థానం ఎలాంటిదని ఈ సామె

తలు తెలుపుతాయి. మాతృ ప్రధాన కుటుంబంలో అయితే తల్లికి విశిష్ట స్థానం ఉంటుంది. పితృప్రధానకుటుంబంలో అత్త వారింటికి వెళ్ళిన స్త్రీ ఒక విధమైన మానసిక వేదనకు గురి అవుతుంది. దానిసత్వానికి ప్రతీకగా బ్రతకాల్సిన భారతీయ మహిళ బహుశా తనమానసిక వేదనను కోడలిని పీడించడం ద్వారా తీర్చుకుంటుందేమో. ఇది మన తత్వవేత్తలు తీర్చాల్సిన సందేహం. అత్తాకోడళ్ళ సంబంధం మన సంస్కృతికి ఒకనల్లమచ్చ. నేడు పరిస్థితి మెరుగవుతున్నా, సామాన్య మానవుని మనస్సులో అత్తగారి పాత్రకు మసి ఏర్పడిందన డానికి అనేక జానపదగేయాలు, కథలు, సామెతలే సాక్ష్యం. కుటుంబంలో అత్తగారి పాత్రను వ్యక్తం చేసే సామెతలు కొన్ని.

'అత్తకాలం కొన్నాళ్ళు—కోడలికాలం కొన్నాళ్ళు'
'అత్తకు మంచిలేదు, చింతకు పచ్చిలేదు'
'అత్తకు లేక అటికలు నాకుతూ వుంటే అల్లు డొచ్చి
దీపావళి పండగన్నాడట'
'అత్త చేసిన పనికి అరళ్ళు లేవు'
'అత్తమీద కోపం దుత్తమీద చూపినట్లు'
'అత్తసొమ్ము అల్లుడు దానం చేసినట్లు'
'అత్తవారింటి సుఖం మోచెతి దెబ్బ'

సంబంధ బాంధవ్యాలను తెలిపే సామెతలు కొన్నయితే జీవితంలోని సత్యాలను సూచ్యంగా చెప్పేవి కొన్ని. మానవ జీవితంలో డబ్బుకుండే ప్రాధాన్యం ఇంకదేనికుంది ? 'ధనమూల మిదం జగత్' అన్నారు కదా ! ప్రాచీన మానవ సమాజంలో సమష్టికృషికి ప్రాధాన్యమేగాని డబ్బుకు లేదు. ఎస్కిమోల వంటి ఆదిమ జాతులకు డబ్బులు దాచి పెట్టుకోడమంటే ఏమిటో, డబ్బులు దాచుకోడానికి ఎంత స్వార్థానికైనా పాల్పడడ మంటే ఏమిటోతెలీదు. డబ్బుతో బాటే స్వార్థం, పిసినారితనం అన్నీ వస్తాయి. దీన్ని ఎంతో చక్కగా చెప్పే సామెత 'ఎన్నడూ దొరకనమ్మకు ఏగాని దొరికితే ఏడుముళ్ళు వేసిందట' అన్నది.

మనుషుల్లోని ఒక్కొక్కగుణాన్ని సమాజంలోని ఒక్కొక్కముఖాన్ని కుటుంబంలోని బాంధవ్యాలను, వృత్తులను, విద్యలను, అలంకరణాలను, ఆహార విధానాలను ఈ సామెతలు చెప్తాయి. 'పాడి ఆవును దానం చేసి, పాలు తాను పితుక్కునే' ఆ సామీని గురించి చెప్తుందొక సామెత. 'పాడిగుట్టు–పంటరట్టు' అని ఈ రెండు ముఖ్యవృత్తుల తారతమ్యాన్ని నాలుగే నాలుగక్షరాలలో అద్భుతంగా చెప్తుంది మరో సామెత. పాడిలో అనుభవం కలవారు 'పాడి పసరం పసిబిడ్డ ఒకటి' అంటారు మన సమాజంలో మనుషుల స్వభావాలు ఏ విధంగా ఉంటాయంటే 'పెట్టిన పెళ్ళి గోరు, పెట్టుకున్న చావు గోరు'.

మన సంస్కృతిలో ఏమిటి, ప్రపంచంలోన్కేసాంస్కృతికఅధ్యయనంలో వివాహానికి అత్యంత ప్రాధాన్యం ఉంది. జీవితంలోని ప్రముఖ సంఘటనల్లో పెళ్ళి ఒకటి. శుభకార్యంగా పెళ్ళిని గురించి చెప్పడమే కాక, సామెతలు దాంపత్యంలోని ఎదుగుబొదుగుల్నికూడా అనుభవ పూర్వకంగా చెప్తాయి. 'పెళ్ళాం బెల్ల తల్లి దయ్యం' అని భావించే వాళ్ళను చూచే ఈ సామెత పుట్టింది. మన సమాజంలో పెళ్ళి కొందరి పాలిటి వరమైతే మరికొందరికి శాపం. కూడబెట్టిన నాలుగుకాసులు పెళ్ళికి కరిగి పోగా జీవితమంతా విలపించే తండ్రు లెంతమందో! అందుకే అన్నారు "పెళ్ళి అయిన ఇంట్లో ఆరు నెలలు కరువు' అని. ఈనాడు ఒక విధమైన ఖర్చులైతే కొన్ని దశాబ్దాల ముందు మరో విధమైన ఖర్చులుండేవి. స్నేహితులు, పేరంటాండ్రు, బంధు వర్గం నిండుగా ఉంటేనే పెళ్ళిఇంటికి కళ. అది ఒక్కొక్కప్పుడు మితిమీరు తుంది. "పెళ్ళికి చేసిన పప్పు, పేరంటాండ్రు చవిచూడను సరిపోయింది". పెళ్ళి శుభకార్యమైతే, పిల్లి అశుభానికి గుర్తుగా మన సమాజం భావిస్తుంది. "పెళ్ళికి పోతూ పిల్లిని చంకను పెట్టుకొని పోయినట్లు" అన్న సామెతను వేరువేరు సందర్భాలలో ఉపయోగించ వచ్చు.

నానాటికి సంఘంలో కనిపించే, మార్పులను, సంఘంలోని వ్యక్తుల సంపర్కం వల్ల కలిగే వివిధ అనుభవాలను జానపదులు సామెతల రూపంలో ఎంత చక్కగా వ్యక్తం చేస్తారో చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. ఇవి ఏ సందర్భంలో వెలువడినా అనేక సందర్భాలలో వాడడానికి అనువుగా ఉండడం

వీటి ప్రత్యేకత. కొత్తనీరు వచ్చి పాతనీరు కొట్టుకొని పోయినట్లు యంత్రాలు వచ్చి అనేకులకు పని లేకుండా పోయింది. దీన్ని తెలపడానికి పుట్టిన సామెత కాకున్నా ఇలాంటి సందర్భంలో వాడదగిన సామెత "మేకలే మడకలు దున్నితే ఎద్దులు ఎవరికి కావాల?' అన్నది. ఈ విధంగా సామెతలు చెప్పని విషయం లేదు అందుకే వాటికి సంఘంలో విశిష్టమైన స్థానం ఉంది.

ఇరుగు పొరుగు సామెతలు

సామెతలు చాలా చిన్నవి కాబట్టి ఎక్కడి నుంచి ఎక్కడికి ప్రయాణం చేశాయన్నది చెప్పడం కష్టసాధ్యం. సోదర భాషల్లో ఉండే సమానార్థకాలైన సామెతల విషయంలో ఇది ఇంకా నిజం అనవచ్చు. ఇరుగు పొరుగు భాషల్లో సమానార్థకాలైన సామెతలు వందలు, వేలు ఉంటాయి. పంచతంత్ర కథలు, ఈసపు నీతి కథలు మొదలైన పరభాషా సాహిత్యాల నుంచి కూడా కొన్ని సామెతలు ఉద్భవించాయి. చాలా దగ్గరి సంబంధం ఉండే తెలుగు, కన్నడం, తమిళం మొదలైన భాషల్లో అయితే ఇలాంటి సామెతలు సమానార్థకాలుగా దాదాపు ముక్కాలు భాగం ఉంటాయనవచ్చు. అన్నిరకాల సామెతల్లోనూ ఇటు వంటివి ఉంటాయి. దక్షిణ భారతీయ భాషల్లోని ఇటువంటి సామెతల్ని దక్షిణ భారతీయ పుస్తక సంస్థవారు ప్రచురించారు. ఇదే పుస్తకాన్ని కన్నడం, తమిళం మొదలైన దక్షిణ దేశ భాషల్లోనూ ప్రచురించి ఈ సంస్థవారు మహోప కారం చేశారు. కన్నడం—తెలుగు సామెతల్ని డా. జి. ఎస్. మోహన్ ప్రచు రించారు. అయితే ఇలాంటి పని చేసేటప్పుడు ఒక విషయం గమనించాలి. ఒక భాషలోని సామెతల్ని మరో భాషలోకి కేవలం అనువాదం చేసి చూపించడం సరికాదు. అచ్చంగా అదే భాషలో ప్రచారంలో ఉండే సామెతల్ని, కొంత అర్థభేదం ఉన్నాసరే అట్లే ఇవ్వవలసి వుంటుంది. అప్పుడే ఆయా భాషల ప్రత్యేకత, నుడికారపు సొంపు తెలిసివస్తుంది.

"రాత్రంతా రామాయణం విని రాముడికిసీతేమవుతుందని అడిగినట్లు'' అని తెలుగు సామెత. కన్నడంలో 'బెళగానె రామాయణ కేళి బెళగ్గె రామనిగె సీతేనాగ బేకంద్హాగె' అని సామెత (పొద్దుటిదాకా రామాయణంవిని పొద్దున్నే రాముడికి సీతేం కావాలన్నట్లు). రెండు సామెతల అర్థం ఒక్కటే అయినా చెప్పే విధానంలో కొంత మార్పువుంది. 'పనిలేని మంగలి పిల్లి తల గొరిగాడు'

అని తెలుగు సామెత (ఇది పిల్లతల గొరిగాడని ఉండాలేమో అనిపిస్తుంది.) కన్నడంలో సామెత "కెలస విల్లద మురవ హెండతి తలె బోళిసిద" (పనిలేని మంగలి పెళ్ళాం తల గొరిగాడు). తెలుగు సామెతలో బెల్లం చుట్టూ చీమలు చేరితే కన్నడం సామెతలో బెల్లం చుట్టూ ఈగలు ముసురుతాయి. (బెల్లక్కె నొణముత్తిదహాగె) కొన్ని సామెతలు పూర్తిగా సమానార్థకాలుగా ఉంటాయి. "నివురు గప్పిన నిప్పులాగా" అని తెలుగు వాళ్ళంటే "బూది ముచ్చిద కెండద హాగె" అని కన్నడిగులంటారు.

సామెతల పరిశీలన విషయం ఎట్లున్నా, ప్రతిభాషలోను వీటి సేకరణ విస్తృతంగా జరగాల్సి వుంది. జానపద సాహిత్య ప్రక్రియల్లో చాలా త్వరగా పుట్టి, త్వరగా నశించి పోయే వాటిలో సామెతల్ని ముందు చెప్పుకోవాలి. దీనికి కారణం స్పష్టమే. అనుభవమున్న ప్రతివాడూ సందర్భానికి తగ్గట్లుగా ఏదో ఒక మాట అంటాడు. అవి గట్టిదైతే అలాగే ఆ నోట ఆ నోట ప్రచారమై చివరికి సామెతగా స్థిరపడుతుంది. ఇది మనం చెప్పినంత నిదానంగా జరగదు. కొన్ని దినాలలోనే సామెత రూపకల్పన జరగవచ్చు. అయితే దానికి తగిన నేపథ్యం లేకపోతే మళ్ళీ అది మరుగున పడిపోవచ్చు. ఉదాహరణకు కొన్ని సామెతలు ప్రజాన్యాయ స్థానాలలో శక్తివంతంగా ఉపయోగపడతాయి. ఈ నాటికీ ఆఫ్రికా ఖండంలోని కొన్ని ప్రదేశాలలో సామెతల సహాయంతోనే తీర్పు చెప్పే పద్ధతి ఉంది. అయితే ప్రభుత్వ న్యాయస్థానాల పరిధిలోకి ఇటువంటి ప్రదేశాలు వస్తే అక్కడి సామెతలలో చాలా వరకు వాడుకనుంచి తప్పిపోతాయి. అట్లే నాగరికత వికాసం చెందేకొద్దీ ప్రాచీన సంస్కృతికి సంబంధించిన అనేక ఆచారాలు, సంప్రదాయాలు నశించి వాటితోపాటే సామెతలను కూడా తీసుకుపోతాయి. ఈ విధంగా కొన్ని సంవత్సరాలలోనే వందల కొద్దీ సామెతలు వాడుక తప్పిపోతాయి. ఈ కారణాల వల్ల ఆంధ్రుల సామెతలను సేకరించి భద్రపరచవలసిన అవసరం ఎంతయినా ఉంది. కొత్తగా సామెతల పేరుతో వాక్యాలను సృష్టించే పనికి పూనుకోకుండా, ఇంకా నాశన మవకుండా జనుల నోళ్ళలో మిగిలివున్న సామెతల్ని మాత్రమే సేకరించి భద్రపరచవలసిన అవసరాన్ని కూడా గుర్తించాలి

టిప్పణి

1. "Proverbs are short and witty traditional expressions that arise as part of everyday discourse as well as in the more highly structured situations of education and judicial proceedings" – Roger D. Abrahams, *Folklore and Folk life*, Richard M. Dorson (Ed.) p. 119.

2. "... Proverbs use all of the devices we commonly associate with poetry in English: meter, binary construction and balanced phrasing, rhyme, assonance and alliteration, conciseness, metaphor, and occasional inverted word order and usual construction"– Roger D. Abrahams, *Folklore and Folklife*, Ed, Richard M. Dorson, p. 119.

# పొడుపు కథలు

జానపద విజ్ఞానంలో ప్రత్యేకశాఖగా పరిగణించదగినంత వ్యాప్తికలది పొడుపుకథ. జానపద కవిత్వం, గద్యకథ, సామెత వైవిధ్యంగల ప్రక్రియ లైతే, పొడుపు కథల్లో వాటన్నిటికంటె ఎక్కువ వైవిధ్యం ఉంది. పొడుపు కథల్ని జానపద సాహిత్యంలో భాగంగా పేర్కొంటున్నా వీటిలోకొన్ని గణిత రూపంలో, చిత్రరూపంలో కూడా చూపించవచ్చు. జానపద గేయరూపంలో, కథాగేయరూపంలో, కథారూపంలో, సామెతల రూపంలో కూడా పొడుపు కథలుంటాయి.

వినోదాన్ని, విజ్ఞానాన్ని సమానంగా పంచిఇచ్చే ప్రక్రియల్లో పొడుపు కథను మించిలేదు ఇలాంటి ప్రయోజనాత్మక దృష్టితోనే ప్రపంచంలోని ప్రతి సమాజంలోని వ్యక్తులూ వీటిని ఉపయోగించుకుంటారు. ఇవి నిత్య జీవితంలో భాగమైపోయాయి. ఆదిమ మానవుని చిత్తవృత్తి బుద్ధి వికాసం పొందుతున్న దశలో మానవుని తహ తహను,అభివ్యక్తి శక్తిని ఇవి ప్రతిబింబిస్తాయి.

పొడుపుకథలకు జీవితమే మూలధనం. జీవితంలో సమస్యల్నివిడగొట్టడానికి మనిషిచేసే ప్రయత్నమే వీటికి ప్రేరణ. ఎదుటివాని బుద్ధికుశలతకు ఒక పరీక్షగా ఉద్భవిస్తాయి పొడుపుకథలు. సామాన్య మానవునిలోనిబుద్ధిచాతుర్యం, హాస్యప్రియత్వం, సమస్యలను పరిష్కరించుకోవాలనే మనస్తత్వం పొడుపు కథలను తీర్చిదిద్దుతాయి. "ప్రత్యుత్తరం తెలియని వారి బుద్ధికుశలతను పరీక్షించడానికి వారిని తికమకపెట్టడానికి తయారుచేసిన ప్రశ్నలు పొడుపుకథలు"[1] అన్నారు రోగెర్ డి. అబ్రహామ్స్, అలన డండస్ (రిచర్డ్ ఎం. డార్సన్ 1972:130).

నిర్వచనాలు—లక్షణాలు

ఇంగ్లీషులో పొడుపుకథను 'రిడిల్' Riddle అంటారు. దీనికి మూలమైన (raedan) అనే పాతఇంగ్లీషు పదానికి 'సలహాఇవ్వడమ'ని అర్థం.

సంస్కృతంలో ప్రహేళికలు వేదకాలంనుంచీ ప్రచారంలో ఉన్నాయి. తెలుగులో, ఇంగ్లీషులో, కన్నడంలో ఇతరభాషలలో పొడుపుకథలనిర్వచనాలున్నాయి. "పొడుచుట, విప్పుటలో ఆనందమును వెల్లివి యించునవి పొడుపుకథలు" అన్నారు శ్రీ నేదునూరి గంగాధరం (1961). పొడుపుకథ అనే పేరులోని కథవల్ల, బహుశా సమస్యాత్మక కథలకు (riddle stories) ముందు ఈ పేరుండి తర్వాత అన్నిరకాల సమస్యలకూ ఈ పేరు వచ్చిందేమో అనిపిస్తుంది. 'పొడుపు' అంటే చాలేమో. కన్నడంలోఇదేఅర్థంలో 'ఒగటు' అన్నపేరు ప్రచారంలో ఉంది. ఒగటిన కథె అంటే సమస్యాత్మక కథ అని అర్థం. తమిళంలోని విడుకతై అనే పేరు మన పొడుపుకథను పోలిందే.

తెలుగులోనే వేరు వేరు ప్రాంతాల్లో వేరువేరు పేర్లువాడుకలో ఉన్నాయి. పొడుపుకథ అన్నది సాగరప్రాంతాల పదం. తెలంగాణాలో కొన్ని ప్రాంతాలలో దీనికి శాస్త్రం (శాత్త్రిం)అంటారు. 'శాస్త్రార్థమెంత కఠినమో దీనిని విడదీయుట యంత కష్టమని కాబోలు పొడుపు కథలకు శాస్త్రములని పేరువచ్చినది' అన్నారు. డా. బి. రామరాజు (1958:519) కొన్నిప్రాంతాల్లో శాస్త్రమంటే సామెత—చిత్తూరు మొదలైన చోట్ల మారుకధ అనేది ప్రచారంలో ఉంది. ఇచ్చుకత, విచ్చుకత, విప్పుకత, అడ్డకత అడ్డుకత, ఒడ్డుకత మొదలైన పేర్లుకూడా ప్రచారంలో ఉన్నాయి.

పొడుపు అంటే పొడవడం, పొడుచునట్లుగా ప్రశ్నించడం అనే అర్థాలను చెప్తుంటారు.'ఎందుకట్లా గుచ్చిగుచ్చిచూస్తావు,' 'గుచ్చి గుచ్చిమాట్లాడుతావ్' మొదలైన మాటలు వినబడుతుంటాయి. పొడుపు కథలో పొడిచిపొడిచి లేక గుచ్చిగుచ్చి అడగడం ముఖ్య లక్షణం కాబట్టి ఈ పేరు వచ్చి వుండవచ్చు. గుచ్చడమే ప్రధాన క్రియగా ఉండే పచ్చపొడుపు మనకు పరిచితమే. నేరుగా చెప్పడానికి మారుగా (బదులుగా) మరొకటి చెప్పడం వల్ల మారుకధ అనే పేరు వచ్చివుండవచ్చు. ఒక అడిగిన సమస్యను విప్పడం వల్ల విప్పుకధ, విచ్చుకత మొదలైన పేర్లు వచ్చి వుంటాయి. పందెం ఒడ్డినట్లుగా సమస్యను ఒడ్డే గుణం ఉండడం చేత ఒడ్డుకత లేక ఒడ్డకత అని పేరు వచ్చి ఉండవచ్చు.

పొడుపు కథల్లోని వైవిధ్యాన్నంతటినీ ఒక్క నిర్వచనంలో ఇమడ్చడం సులభసాధ్యం కాదు. ఆర్చర్ టేలర్ పొడుపు కథల్లో ముఖ్యంగా రెండు వివరణాత్మక గుణాలున్నాయంటాడు. వాటిలో ఒకటి రూఢం (positive) మరొకటి వ్యతిరేకం (negative). రూఢంగా ఉండేది వాచ్యంగా ఉండకుండా అలంకారికంగా ఉంటుంది. టేలర్ నిర్వచనం ప్రకారం "పొడుపు కథలో ఒక వస్తువుకు సంబంధించిన ఆలంకారిక వివరణ, సాహిత్య వివరణ ఉంటాయి. అవి వినేవారిని తికమక పెట్టే విధంగా ఉంటాయి"[2] టేలర్ చెప్పినట్లుగా ఒకటి రూఢంగా, మరొకటి వ్యతిరేకంగా ఉండే గుణం అన్ని పొడుపు కథల్లోనూ కన్పించదు. పొడుపు కథను వివరణాత్మకంగానిర్వచించడానికి కొందరు ప్రయత్నించారు. ఈ క్రింది నిర్వచనం అలాంటిది :

"పొడుపు కథ నిజమైన అర్థాన్ని కప్పిపుచ్చేదిగా ఉండవచ్చు. ప్రశ్న రూపంలో ఉండవచ్చు, కాని ఇది జవాబును నేరుగా సూచించదు"[3]

గంభీరమైనవిగా ఉండడం పొడుపు కథల ప్రధాన లక్షణంగా పేర్కొనవచ్చు. బుద్ధి చాతుర్యానికి వీటిలో ఎక్కువ ప్రాముఖ్యం ఉంటుంది. ఊహాతీతంగా కన్పించడం, గూఢంగా వుండే జవాబు తెలియగానే ఎదుటి వాడికి దిగ్భ్రమ కలిగేట్లుగా చేయడం పొడుపు కథ లక్షణం. పొడుపు కథను గాంభీర్యం ఉట్టిపడేలా ఒడ్డడం ప్రశ్నించేవాడి వంతు. దాన్ని ప్రతిభావంతంగా విప్పడం విన్నవాడి వంతు. గాంభీర్యానికి సంబంధించిందే అర్థగోపన మనే లక్షణం. చెప్పాల్సిన విషయాన్ని గోప్యంగా ఉంచడం ప్రయత్న పూర్వక సృష్టికి సంబంధించింది. అప్రయత్నంగా వెలువడే జానపద గేయాల వంటి ప్రక్రియల నుంచి పొడుపు కథను వేరుచేసే గుణమిదే. ఎదుటి వ్యక్తి బుద్ధి శక్తిని పరీక్షించడానికి పొడుపు కథలు ప్రయత్న పూర్వకంగా వెలువడ్డాయి.

రూపకంగా ఉండడం పొడుపుకథకుండే మరోలక్షణం. ఇది వాచాలత్వానికి సంబంధించిన ప్రక్రియ కాదు. ఏదో ఒక వస్తువునుగాని, వ్యక్తినిగాని సూచించే ధ్వని ప్రధానరూపం ఇది. పొడుపుకథల్లోని అలంకారం, రూపకం, వ్యాజోక్తి, గూఢోక్తి మొదలైన వాటిల్లో ఒకటి. ప్రాచీన సంస్కృతాలంకారికులు వ్యాజోక్తికి, గుఢోక్తికి, వక్రోక్తికి ఇచ్చిన ఉదాహరణలు వివిధ ఏకాల పొడుపు కథలే. చిన్నపిల్లలు మాట్లాడు కొనే 'క' భాష (ప్రతి అక్షరం

ముందు 'క'ను చేర్చి మాట్లాడడం) కూడా ఒక విధమైన పొడుపుకు ఉదాహరణమే. ఆలంకారికంగా ఉండడం పొడుపు కథకు చమత్కారగుణాన్ని కలిగిస్తుంది. పదగూఢత, భావగూఢత, వస్తుగూఢత, అన్వయగూఢత కనిపించే పొడుపు కథ సంస్కృతంలోని ప్రహేళిక నిర్వచనాలకు దగ్గరి ఉదాహరణ మన వచ్చు.[1] జేమ్స్ ఎ. కెల్సో "పొడుపు కథ అర్థ స్పష్టతలేని రూపకం లేక రూపక సముదాయం" అనడం (Encyclopaedia of Religion and Ethics, p 765) పొడుపు కథకుండే ఆలంకారిక గుణాన్ని తెలుపుతుంది. పొడుపు కథకు, రూపకానికి ఉండే సంబంధాన్ని గుర్తించిన వారిలో మొదటి వాడు అరిస్టాటిల్. పొడుపు కథల్లో ముఖ్యంగా రెండు భాగాలుంటాయి. ఒకటి ఉపమానం మరొకటి ఉపమేయం. ఉపమానం వాచ్యంగా ఉపమేయం సూచ్యంగా ఉంటాయి. ఉపమానాల సహాయంతో ఉపమేయాన్ని తెలుసుకోవలసి ఉంటుంది. పొడుపుకథల్లోని ఉపమానాలు నిత్యజీవితంలో మనకు పరిచితమైనవే ఉంటాయి.

పొడుపు కథల్లో మరోగుణం హాస్యస్ఫోరకంగా ఉండడం. కొన్నిట్లో హాస్యం మితిమీరి అశ్లీలమవుతుంది. అయితే అశ్లీలం పదాలవరకే పరిమితమై ఉంటుంది గాని అర్థంలోకాదు. హాస్యానికి తోడు ఒక్కొక్కసారి వ్యంగ్యగుణం కూడా పొడుపు కథల్లో కనపిస్తుంది. మనిషిలో సహజంగా ఉండే హాస్య ప్రవృత్తి కొన్ని పొడుపు కథలు రూపొందడానికి కారణం. బ్రిటానికా విజ్ఞాన సర్వస్వం వీటిని గురించి చెప్తూ "పొడుపు కథలు బహుశా హాస్యగుణం కలిగిన ప్రక్రియల్లో చాలా ప్రాచీన మైనవి" అంటుంది (Riddles are probably the oldest extant forms of humour vol xx. p.549), గాంభీర్యం సూచ్యంగా ఉండడం, హాస్యం వాచ్యంగా ఉండడం పొడుపు కథలకు ఒక వింత అందాన్నిస్తుందనడంలో సందేహం లేదు.

ప్రకృతితో సంబంధం ఉండడం పొడుపు కథల మరొక లక్షణం. ప్రకృతికి సంబంధించిన అనేక వస్తువులు వీటిలో స్థానం సంపాదించుకున్నాయి. ప్రాచీనకాలంనాటి మానవుడు తన జీవితంలో ప్రకృతికి ఇచ్చిన ప్రాముఖ్యాన్ని ఈ గుణం తెలుపుతుంది. ప్రకృతిలోని వస్తువుల్ని ఉప

మానంగా కొన్నిట్లో ఉపమేయంగా కొన్నిట్లో జానపదులు ఉపయోగించు కుంటారు జానపద విజ్ఞానంలోని అనేక ప్రక్రియల్లో లాగానే పొడుపు కథ లకు కూడా సార్వజనీనగుణం ఉంది. ప్రపంచంలో ఒకమూల కనిపించే పొడుపుకథలాంటిదే మరో మారుమూల ప్రదేశంలో కనిపించవచ్చు. ప్రపంచం లోని వివిధ ప్రదేశాలలో దొరికే పొడుపు కథలను సేకరించి పరిశీలిస్తే కొన్ని సార్వత్రిక గుణాలు బయల్పడుతాయి. మానవ మనస్తత్వంలోని సమానాంశాలు తెలిసివస్తాయి. మొత్తం మీద చాతుర్యంతోకూడిన, కళాత్మకమైన, లయబద్ధ మైన సంక్షిప్తగూఢోక్తిగా పొడుపు కథను చెప్పుకోవచ్చు. ఇది బుద్ధికి కసరత్తు నిస్తుంది. ప్రాక్తన మానవుని బౌద్ధిక సృష్టి ఇది.

పుట్టు పూర్వోత్తరాలు

పొడుపు కథలో కనిపించే ఆలోచన,బుద్ధిశక్తి జానపదులు వీటిని ప్రయత్న పూర్వకంగా కల్పించారనేందుకు తార్కాణాలుగా ఉన్నాయి. పొడుపు కథల ప్రాచీనత, మానవ సంస్కృతిలోని ప్రారంభదశల్లో వీటి ఉపయోగంగురించిన ఆలోచనలు విద్వాంసులకు కలిగాయి. మొత్తం మీద గేయాలు, కథాగేయాలు మొదలైనవి మొదటి ఘట్టంలోను, గద్య కథనాలు రెండవదశలోను, పొడుపు కథలు మూడవ ఘట్టంలోను వెలువడ్డాయని ఊహించవచ్చు. "దిసైన్స్ ఆఫ్ ఫోక్ లోర్'లో అలెగ్జాండర్ క్రాప్పె పొడుపు కథను గురించి చెప్తూ, అది జానపద విజ్ఞానంలో చివరిది (A last department of oral Folklore is the so-called popular riddle) అని చెప్పటం (పు.201) లో సత్యం ఉన్నదనిపిస్తుంది. మౌఖిక ప్రక్రియల్లో చాలా వాటికంటె పొడుపు కథ ప్రాచీన మైనదని అర్థం వచ్చేట్లుగా సి.ఎఫ్. పాటర్ చెప్పిన మాటల్ని అంగీకరించడం కష్టం (Standard Dictionary of Folklore, p 938), ఆయన అభి ప్రాయం ప్రకారం పొడుపు కథల్లో కనిపించే ఆలంకారిక గుణం ప్రాథమిక మనస్తత్వానికి నిదర్శనం. అయితే గేయాలవంటి వాటిలో లేని క్రమబద్ధత పొడుపు కథల్లో ఉండడం, వాచ్యంకంటె వ్యంగ్యానికి వాటిల్లో ప్రాధాన్యం ఉండడం పొడుపు కథ చాలా ప్రాచీన మనడానికి అడ్డువస్తాయి. అంత మాత్రం చేత పొడుపు కథలు ఇటీవలివి అని చెప్పడానికి కూడా వీలులేదు. మానవ మనో వికాసం బాల్యావస్థలో ఉన్నప్పుడే పొడుపు కథలు అవతరిం చాయి అవి జానపద గేయాలు, కథలు మొదలైన కొన్ని ప్రక్రియల కంటె

ప్రాచీనమైనవి కాకపోవచ్చు. "సంస్కృతిలోని ప్రారంభ దశల్లో అందరూ పొడుపు కథలను ప్రేమించిన వారే"[5] అన్నమాట సత్యమనవచ్చు.

కూట రచనలనే పేరుతో సాహిత్య సంబంధమైన పొడుపు కథలు కూడా చాలా ప్రాచీన కాలం నుంచే కనిపిస్తాయి. ఇలాంటివి జానపద సాహిత్యంలోను ఉన్నాయి. సాహిత్య సంబంధమైన పొడుపు కథలు మలీయ వాతావరణమూ, ఎక్కువ గాంభీర్యమూ కలవి. భారత దేశంలో వేదకాలం నుంచి ఇవి ప్రచారంలో ఉన్నాయి. వేద పురాణాలలో, బౌద్ధ జైనాది ధర్మ గ్రంథాలలో ఇలాంటి కూట రచనలనేకం కనిపిస్తాయి. వేదాలలో అత్యంత ప్రాచీనమైన ఋగ్వేదంలోని మొదటి మండలంలోనే పొడుపు కథలున్నాయి. "ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య న శ్నన్నన్యో ఒభిచాక శీతి" అన్న ఋగ్వేదంలోని ప్రహేళిక సుప్రసిద్ధం చెట్టుమీద రెండు పక్షులున్నాయి. ఒకటి పండును తింటున్నది. మరొకటి తినడం లేదు. ఇక్కడ జీవాత్మ పరమాత్మలను ధ్వన్యాత్మకంగా చెప్పాడు వేదఋషి. జీవిత రహస్యాన్ని నిగూఢంగా చెప్పే అభిలాష ఇందులో వ్యక్తమవుతున్నది. ఇలాంటి ప్రహేళికలు ఇంకా ఉపనిషత్తులు, పాణిని అష్టాధ్యాయి, భారతం మొదలైన వాటిల్లో కనిపిస్తాయి. యజ్ఞయాగాదుల్లో, పెళ్లిళ్ళలో పొడుపు కథలను వాడడం తరతరాలుగా ఆచారంగా ఉంది.

భారతదేశంలోని పొడుపు కథల వికాసాన్ని గురించి చెప్పేటప్పుడు వేదాల తర్వాత మహాభారతాన్ని పేర్కొనవలసి వుంది. ప్రకృతికి, నీతికి సంబందించిన చాలా పొడుపు కథలు మహా భారతంలో ఉన్నాయి. ప్రశ్నోత్తర రూపంలో ఉండే పొడుపు కథలనేకం వెలువడడానికి యక్ష ప్రశ్నలు కారణమై ఉండవచ్చు. నీతికి సంబంధించిన పొడుపు కథలు జాతక కథలో ఉన్నాయి. వాటిలో కొన్ని సమస్యాత్మక కథా రూపంలో కూడా ఉన్నాయి. రాజు చనిపోయిన తర్వాత మరొకర్ని ఎన్నుకోడానికి పొడుపు కథల ద్వారా పరీక్ష జరిపే విధానాలు జాతక కథల్లో ఉన్నాయి.

సంస్కృతం నుంచి మహా భారతాదుల పొడుపు కథలు తెలుగుకూ దిగుమతి అయ్యాయి. ఎర్రన మహాభారతాంధ్రీకరణంలో ఉండే యక్ష ప్రశ్నలలో కొన్ని :

మొనసి నిద్రించియును గన్ను మూయదెద్ది
పుట్టియును జేతనత్వంబుఁబొరయదెద్ది
యరయ రూపు గల్గియు హృదయంబులేని
దెద్ది ? వేగంబు కతమున నెద్ది పొలుచు.

ధర్మజుని ప్రత్యుత్తరం :

అనినఁగన్ను మూయదు సుప్తమయ్యు మీను
పుట్టియును గ్రుడ్డు చేతనం బొరయకుండు
హృదయ రహితంబురా రూపుమేఁబురయము
కతన వర్తించునని చెప్పెఁ గౌరవుండు.

మన దేశంలో తరతరాల నుంచి పొడుపు కథలున్నట్లే ఇతర దేశాల సంస్కృతులలో కూడా ఉన్నాయి. గ్రీక్, సెమెటిక్, బాబిలోనియా సంస్కృతులకు చెందిన కావ్యాలలో చాలా పొడుపు కథలున్నాయి. ప్రాచీన హీబ్రూ కావ్యాలలో, బైబిలులో ఆధ్యాత్మిక చింతన కల్గిన సమస్యలు కనిపిస్తాయి, మధ్యయుగాల తర్వాత వీటి మీద సాహిత్య వేత్తల ఆసక్తి చాలా వరకు తగ్గిందని చెప్పాలి. కాని ప్రాక్తన కాలం నుంచి నేటి వరకు పొడుపు కథలు జానపదులకు వినోద సాధనాలుగా, ఆలోచనను రేకెత్తించే శక్తులుగా నిలిచి ఉన్నాయి.

ప్రాచీన కాలపు పొడుపు కథలను పరిశీలించినప్పుడు అవి ఇప్పటిలాగా కేవలం వినోదం కోసం కాకుండా ధార్మిక నేపథ్యంతో వెలువడ్డాయని చెప్పవచ్చు. పొడుపు కథ పుట్టుకకు మానవుని ప్రకృతి పరిశీలన, ధార్మిక చింతన కారణాలై ఉండవచ్చు. ప్రాచీన మానవుని జీవితం ధార్మిక ఆచరణలతో, మానవాతీత శక్తులపై నమ్మకాలతో నిండి ఉండిందని మానవశాస్త్ర అధ్యయనం వల్ల తెలుసుకోవచ్చు. గహనమైన ప్రకృతి రహస్యాలను అస్పష్ట భాషలో చెప్పడానికి ప్రయత్నించిన ఆదిమమానవుని ప్రయత్నాల వల్ల పొడుపు కథలు అవతరించాయని ఊహించవచ్చు. ప్రకృతిని అర్థంచేసుకోవాలనే కుతూహలంకలిగిన ప్రాచీన మానవుని మనస్సు పొడుపు కథలను సృష్టించింది, వీటి

సమగ్ర పరిశీలనవల్ల ఆదివాసుల జీవితం, అనుభవాలు, ఆలోచనలు మొదలైన వాటిని గురించిన కుతూహలకరమైన అనేక విషయాలు తెలుస్తాయి.

భౌగోళికంగా పొడుపు కథలను గురించిన వివరాల కోసం ప్రయత్నిస్తే దొరికే ప్రత్యుత్తరాలు చాలా తక్కువనే చెప్పాలి. ప్రాచీనమైన పొడుపు కథలు అనేక దేశాల సాహిత్య గ్రంథాల్లో లభ్యమవు తున్నాయి. వీటికి ఒకే మూలం ఉన్నదా లేక అవి వేరు వేరు స్థలాల్లో స్వతంత్రంగా పుట్టినవా అన్న ప్రశ్న ఉండనే ఉంది. ప్రపంచంలో ఏ సంస్కృతి ప్రాచీన తమమైందో తెలిస్తే,ఆ సంస్కృతిలో ఉదయించిన పొడుపు కథలే మిగిలిన స్థలాలకుకూడా వ్యాప్తి చెందాయని ఊహించవచ్చు. అయితే ఇది ఏమంత సులభమైన పని కాదు. బహు ప్రదేశ అస్తిత్వం పొడుపుకథలకు ఉండడం కూడా నిజమే కాని ఈ విధంగా అవి ప్రపంచంలోని వివిధ ప్రదేశాలలో ఉండడం, వాటిలో పోలి కలు కనిపించడం ఒకే మూలనుంచి పుట్టడం వల్లనా (ఏకోత్పత్తివాదం) లేక మానవుల మనస్సులోనే ఉండే సమాన గుణంవల్లనా (బహుళోత్పత్తివాదం) అన్నది ఇంకా చర్చనీయాంశంగానే ఉంది. ఈ రెండు విధాలలో ఎలా పుట్టినా కూడా, పొడుపు కథ మానవుని కుతూహలాన్ని, ఇంకా ఇంకా బుద్ధిశక్తిని సంపాదించాలనే భావనను ఉత్సాహాన్ని ప్రతిబింబిస్తుందన్నది మాత్రం నిజం.

## విభజన

సామెతలు మొదలైన జానపద సాహిత్యరూపాలలాగే పొడుపు కథల విభజనకు ఎన్నో విధానాలు వాడుకలో ఉన్నాయి. పొడుపు కథలలో ముఖ్యంగా జానపదుల పొడుపు కథలు, సాహిత్య పరమైన పొడుపు కథలని రెండు రకాలున్నాయి. జానపదుల పొడుపు కథలు ముఖ్యంగా వినోదం కోసం ఏర్ప డ్డవి. సాహిత్యంలో కనిపించేవి తాత్విక పరమైనవి, మతప్రాధాన్యం కలవి.

విభజన చేసే విషయంలో ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలోని పొడుపు కథలను దృష్టిలో పెట్టుకొని చేసేది ఒక రకమైతే తెలుగులోని పొడుపు కథల్ని దృష్టిలో ఉంచుకొని చేసేది మరో రకం. మొదట విభజనలో కొన్ని సార్వజనీన రూపాలను గురించి చెప్పి తర్వాత తెలుగులోని ప్రత్యేక రూపాలను, ఉదాహరణలను పేర్కొనడం జరుగుతుంది. పొడుపు కథల్లో

కానన్‌డ్రమ్ (conundrums), ఎనిగ్మా (Enigma) అనే రెండురకాలను అనేక విద్వాంసులు పేర్కొన్నారు. మొదటిదానిలో పదాడంబరం, రెండో దానిలో ఊహాత్మక వివరణ ముఖ్యంగా ఉంటాయని స్థూలంగా చెప్పవచ్చు. పదసమస్య అనే పొడుపు కథలో ఒక పదంలోని ప్రతి అక్షరాన్ని లేక పదాన్నంతటిని పొడుపు కథ రూపంలోనో,నటన మూలకంగానో సూచించినప్పుడు పదాన్నంతటిని ఊహలో కనిపెట్టడం జరుగుతుంది. నటనతో సూచించే ఒక విధానమే నేత్రావధానం. గణిత సంబంధమైన పొడుపు కథలు కూడా ఒక విభాగంగా ఉన్నాయి.

ప్రశ్నోత్తర రూపంలో ఉండే పొడుపు కథలు తెలుగులోనూ ఉన్నాయి; వేరే భాషల్లోనూ ఉన్నాయి. ఇవి పాటల రూపంలో ఉండవచ్చు లేక గద్య రూపంలో ఉండవచ్చు. పెళ్ళిళ్ళలో ఇలాంటి వాటిని వాడుతుంటారు. నేత్రావధానం మొదలైన వాటితో బాటు, చిత్రాలతో సూచించే పొడుపు కథలను దృశ్యసంబంధమైన పొడుపు కథలని (visual riddles) చెప్పవచ్చు. తర్క సంబంధమైన సమస్యలు (puzzles) బుద్ధికి పదును పెడ్తాయి.

ప్రపంచంలోని వివిధ ప్రాంతాల పొడుపు కథలను భాషా శాస్త్రపరంగా కూడా వర్గీకరించ వచ్చు. గొలుసు కట్టు పదాలు, సామాన్య వాక్యాలు, సంకీర్ణ వాక్యాలు, వ్యతిరేక వాక్యాలు, పద్యరూప పొడుపు కథలు, కథారూపంతో ఉండే పొడుపు కథలు -ఈ విధంగా భాషాశాస్త్ర పరంగా విభజన చెయ్యవచ్చు.

సంస్కృతంలో పొడుపు కథకు ప్రహేళిక అని పేరు. దండి ప్రహేళికల్లో పదహారు భేదాలు చెప్పాడు. విశ్వనాథుడు సాహిత్య దర్పణంలో చ్యుత దత్తాక్షరాదికములన్నాడు కాని సంఖ్య చెప్పలేదు. భోజరాజు చ్యుతాక్షర, దత్తాక్షర, చ్యుత దత్తాక్షర,ముష్టిక, బిందుమతి, అర్థవతి అనే ఆరువిధాలనుచెప్పాడు.

సామెతలకు లాగానే పొడుపు కథలకు కూడా దశమాంక పద్ధతిలాంటి వర్గీకరణనే ఆర్చర్ టేలర్ చెప్పాడు (కెన్నెత్ డబ్ల్యు క్లార్క్, మేరి డబ్ల్యు క్లార్క్ 1963 : 120). దీన్ని బట్టి పొడుపు కథల్లో ఐదు వర్గాలను గుర్తించ వచ్చు. 1. మనుష్యులు, జంతువులు అని గుర్తించలేని జీవాలతో పోలిక.

2. జంతువులతో పోలిక 3. మనుష్యులతో పోలిక 4. వృక్షాదులతో పోలిక 5. వస్తువులతో పోలిక.

నా జాతుల్లో ఒకటి నాలుగు ముక్కులది(దిండు)అనే చెరెమిస్ భాషలోని పొడుపు కథ పశుపక్ష్యాదులకు సంబంధించింది కాబట్టి 2—వ వర్గానికి చెందుతుంది. ఇది ప్రత్యేకంగా పక్షిజాతికి సంబంధించింది కాబట్టి2.2అని సూచించవచ్చు. పక్షులలో జాతు 4—వది కావడం చేత 2.2.4. ఇంకా సూక్ష్మాంశాలను సూచించడానికి 2.2.4.1.2 ఈ విధంగా అంకెల ద్వారా సూచిస్తూ పోవచ్చు. ఇలాంటి విభజన విధానాన్ని జానపద విజ్ఞానంలోని ఏ విషయానికైనా అన్వయించి చెప్పవచ్చు. లైబ్రరీలలో పుస్తకాలను విభజించే పద్ధతిని పోలిన ఈ విధానం సరళంగానూ ఉంటుంది. అధ్యయనానికీ తోడ్పడుతుంది.

తెలుగు పొడుపు కథల విభజన :

తెలుగు పొడుపు కథలకు కూడా పైవాటిలోనే ఏదో ఒక విభజన విధానాన్ని అనుసరించవచ్చు. రెండు విధానాలను మాత్రం ఈక్రింద సూచించడం జరుగుతున్నది. పొడుపు కథలనే ప్రహేళికలని పేర్కొన్న టేకుమళ్ళ కామేశ్వరరావుగారు కొన్ని ముఖ్యశాఖలను పేర్కొని వాటికి ఉదాహరణలను ఇచ్చారు (జానపద సరస్వతి, ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్, హైదరాబాదు). వారి విభజనలో ఒక క్రమమంటూ లేకున్నా, తెలుగులోని కొన్ని ముఖ్యమైన పొడుపు కథా రూపాలు వారి వ్యాసం వల్ల తెలిసి వస్తాయి. టేకుమళ్ళ వారు పేర్కొన్న మొదటి రకం 'పదకల్పన.' ప్రతి చరణంలో చివర చెప్పాల్సిన వస్తువును ఒకే అక్షరం ద్వారా సూచించడం జరుగుతుంది. మిగిలిన అక్షరాలను ఆ అక్షరం ద్వారా గ్రహించాల్సి ఉంటుంది.

ఉదా :

వంకర టింకర శొ (శొంఠి)
వాని తమ్ముడు అ (అల్లము)
నల్లగుడ్డ మి (మిరియములు)
నాలుగు కాళ్ళ మే (మేక)

పొడుపు కథల నిడివిని బట్టి చిన్నవని, పెద్దవని, రెండు రకాలుగా విభ జించ వచ్చునని ఓకుమళ్ళవారు సూచించారు.

(1) చిన్నవి : చిటారు కొమ్మని మిఠాయి పొట్లం (తేనె పట్టు)
గుడినిండ ముత్యాలు గుడికి బీగం (దానిమ్మపండు)

(2) పెద్దవి : రాచవారికి నచ్చేచిన్నది
రాజ్యాలెల్ల మెచ్చేనన్నది
బంగారు వారింటి కోడలు
పట్టుమంటే రాదు చేతులు
చేంతాడుతో తోడకుండ
చెంబుతో ముంచకుండ
నీటుగా కులుకు తున్నది
నీళ్ళు తెస్తానంటు వున్నది (కొబ్బరికాయ)

(3) వచనంలాగా ఉండేవి కొన్ని :
కొందరు తిందురుముందు పెట్టుకొని ఏడుస్తారు (ఉల్లిగడ్డ)

(4) గేయాలలాగా ఉండేవి అనేకం :
చెక్కని స్తంభం, చేతికందదు
చెయ్యనికుండ, పొయ్యని నీళ్ళు
వెయ్యని సున్నం, తియ్యంగా (=కొబ్బరి నీళ్ళు)

(5) పొడుపు కథలను గుర్తుంచుకొనేట్లు చేసేవి వాటి అంత్యప్రాసలు. చాలా పొడుపుకథల్లో చివరి అక్షరమో, చివరి రెండక్షరాలో, పదాలో అంత్య ప్రాసల రూపంలో ఉంటాయి.

వంకర టింకరిమాను
వయ్యారిమాను
రాజులెక్కేమాను
కష్టజీవులమాను

ఎత్తుకుతిరిగేమాను
ఇతరుల పెండ్లికౌను (పల్లకి)

(6) ఒకే గేయంలోనే ఒక్కొక్క చరణానికీ ఒక్కొక్క జవాబుండే పొడుపుకథలు కొన్ని ఉన్నాయి. వీటిని గొలుసు పొడుపుకథలనవచ్చునేమో.

డిబడిబలాడేవి రెండు (కాళ్ళు)
దిబ్బెక్కిచూచేవి రెండు (కీళ్ళు)
ఆలకించేవి రెండు (చెవులు)
ఆదుకునేవి రెండు (చేతులు)

(7) వివరణాత్మకంగా ఉండే పొడుపు కథలు కొన్ని. ఒక్క విషయాన్ని తెలపడానికి దీర్ఘ వర్ణన అవసరమయ్యే వాటికి ఉదాహరణాలివి.

నూతిలోపాము నున్ననిపాము,
పొడలపొడలపాము, పొట్టిపొడుగుపాము,
వాడవాడలపాము, వాలైనపాము,
చారాచారలపాము, చక్కనిపాము,
పామునుపట్టి కూరచేస్తే
పంటికిందికే రాదు (పొట్లకాయ)

(8) మనదేశంలో ముఖ్యవృత్తి అయిన వ్యవసాయం సహజంగానే వందలకొద్ది పొడుపుకథల ఆవిర్భావానికి కారణమయింది. వీటిలో కొన్ని వాతావరణానికి సంబంధించినవి, కొన్ని పంటలకు సంబంధించినవి.

(i) చిత్త చిత్తగించి, స్వాతి చల్లజేసి
విశాఖ విసరకుంటె. అనూరాధలో
అడిగినంత పండుతాను (జొన్నచేను)

(ii) వస్తూఇల్లునింపుతుంది, పోతూ పెరళ్ళునింపుతుంది (అరికెధాన్యం)
(iii) స్వాతికురిస్తే. చల్లపిడతలోకి రావు (జొన్నలు)

(9) సంబోధనాంతాలైన పొడుపుకథలదొకరకం, 'తిరుమలేశ' అనే మకుటంతో కొన్నిపద్యాలు, పద్యాలుకానివి కూడా ఉన్నాయి. 'దీనిభావమేమి తిరుమలేశ' అనే సంబోధననే ఇది సమస్య అని తెలుపుతుంది.

కుతిక నలుపుగాని శితికంధరుడుగాడు
పాముకాదు, నెమిలిపక్షిగాదు
గంతులిడుచు నడుచుగాని కప్పయుగాదు
దీనిభావమేమి తిరుమలేశ! (ఊరపిచ్చుక)

కూటములు : వేదాంత సంబంధమైన పొడుపుకథలివి. చేకుమళ్ళవారు తమ వ్యాసంలో వేమన పేరుతో ఉన్నపద్యాలను, వేమనపద్యాలను ఇటువంటి వానికి ఉదాహరణలుగా ఇచ్చారు. మార్మికభావాలుగల ఈ పద్యాలు, పాటలు తాత్వికార్థంకలిగి ఉంటాయి. ఒక్కొక్కసారి వీటిలో పదాలు అశ్లీలంగాఉన్నా అర్థం తాత్వికంగా ఉంటుంది. అలాంటివాటికొక ఉదాహరణం ఈ క్రిందిది. ఇది వీరబ్రహ్మం, సిద్ధయ్య సంవాదం రూపంలో ఉంది.

సిద్ధయ్య; బోడివాడెవడయ్య? బొచ్చువాడెవడయ్య,
మొలచుట్టుకత్తులున్నవాని పేరెవరయ్య?
పోతులూరో, శివపోతులూరో!

వీరబ్రహ్మం: బోడివాడు వెలక్కాయ, బొచ్చువాడు కొబ్బరికాయ
మొలచుట్టు కత్తులున్న వాని పేరు వంకాయ
సిద్ధయ్యగారూ, జ్ఞాన సిద్ధయ్యగారూ!

సిద్ధయ్య: ఊరుకొన్న దేదయా? ఊగులాడేదేదయా!
కాళ్ళసందుదేదయా, కమ్మకొచ్చేదేదయా?
పోతులూరో, శివపోతులూరో!

వీరబ్రహ్మం; ఊరుకొన్నదావయా, ఊగులాడేది దూదయా
కాళ్ళసందుది ముంతయా కమ్మకొచ్చేవి పాలయా
సిద్ధయ్యగారూ, జ్ఞానసిద్ధయ్యగారూ!

కొన్ని పొడుపుకథల సంకలనాలలో అకారాది విభజన కనిపిస్తుంది. 'గోడమీదబొమ్మ' పేరుతో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమివారు ప్రచురించిన సంకలనంలో (సంకలనకర్త: వెలగా వెంకటప్పయ్య) ఇలాంటి విభజనే ఉంది. ఇది పూర్తిగా పిల్లలకోసం ఉద్దేశించబడింది కావడంచేత పొడుపు కథలను గురించిన శాస్త్ర విషయాలేవీ చర్చించడంగాని, విభజన మొదలైన వాటినిగురించిన వివేచనగాని లేదు. 'పొడుపుకథాపరిచయం' అనే పేరుతో ఉండే పీఠికలో మాత్రం డా. పి. యశోదారెడ్డి కొన్ని విషయాలను చర్చించారు. ఈ సంకలనంలోని పొడుపుకథల్లో ప్రశ్నార్థకాలు, గేయాలు, శబ్దాలంకారాలు, వాటిలోను ఆద్యక్షర ఆవృత్తులు, అంత్యాక్షరావృత్తులు, ముక్తపద గ్రస్తాలు, అనుప్రాసలు ఉన్నాయి. వీటిని పరిశీలిస్తే తెలుగు పొడుపుకథల్లోని కొన్ని రకాలను మనం పట్టీ చెయ్యవచ్చు.

కొన్ని పొడుపు కథలు విశ్వంలోని ఖగోళ వస్తువులను గూర్చినవి. ఆకాశం, నక్షత్రాలు, చంద్రుడు మొదలైన వాటిని ఉపమేయాలుగా కలిగినవివి.

చాప చుట్టనూ లేము
రూక లెంచనూ లేము (ఆకాశం, చుక్కలు)

కొన్నిట్లో ఆకాశం, చంద్రుడు మొదలైన ప్రకృతి వస్తువులే ఉపమానాలుగా ఉంటాయి. విప్పాల్సిన విషయం వేరే ఉంటుంది.

ఆకాశంలో ఉంటుంది - కాని మేఘం కాదు
తోకతో ఉంటుంది - కాని ఎద్దు కాదు
అటు ఇటు ఎగురుతుంది - కాని పక్షి కాదు
పట్టు తప్పితే చాలు - పరుగు లేస్తుంది

(గాలి పటం)

మాను గడను బోలు - ఆకు హస్తమును బోలు
పువ్వు చందమామను బోలు - కాయలరసి చూడ
కాయురుద్రాక్షలై (ఆముదం చెట్టు)

ప్రకృతిలోని చెట్లు చేమలు, ఆహార పదార్థాలు లెక్కకు మీఁరిన పొడుపు కథలో దాగి ఉంటాయి. అసలు పొడుపు కథల ఉత్పత్తికీ ప్రకృత్యారాధకుడైన మానవుని మనస్సుకీ సంబంధం ఉందని విద్వాంసుల నమ్మకం. అందువల్లే ప్రకృతిలో మన చుట్టూ కనిపించే వస్తువులనేకం పొడుపు కథాలోకంలో ఉప మేయాలుగా ఉంటాయి. వీటిలో కొన్ని అద్భుతమైన వర్ణనలు, మరికొన్ని వస్తువుల గుణాన్ని తెలిపేవి, కొన్ని ధ్వని ప్రధానమైనవి.

(1) చక్కని స్తంభం
చెయ్యని గుండి
పొయ్యని నీరు
వెయ్యని సున్నం (కొబ్బరి కాయ)

(2) చింపిరి చింపిరి గుడ్డలు
ముత్యాల వంటి బిడ్డలు (మొక్కజొన్న కంకి)

(3) ఓరోరి అన్నరో
నీ వొళ్ళంతా ముళ్ళురా
కారాకు పచ్చరా
నీ కండంతా చేదురా (కాకరకాయ)

(4) కుండ నిండా ఉండ్రాళ్లు
కుండకు తాళం (వెలగ పండు)
గుడి నిండా ముత్యాలు
గుడికి తాళం (దానిమ్మ పండు)

వీటిని వివరిస్తూ డా. పి. యశోదారెడ్డి ఇలా వ్రాశారు.

"వెలగ పండూ, దానిమ్మ పండూ రెండూ దాదాపు గుండ్రం ఉంటాయి. ఈ రెండింటిలో విత్తనాలుంటాయి. కాని వెలగ విత్తనాలు టుగా గట్టి ఉండ్రాళ్ల పాయసంలో వలె ఉంటాయి. దానిమ్మ గింజలు అంద

ముత్యాలు కూర్చినట్లుంటాయి. ఈ ఉపమానం రంగుకన్నా ఆకారాన్ని బట్టే వచ్చిందని చెప్పవచ్చు. అందుకే ముద్దుగా, ముత్యాలవంటి పలువరసను చెప్పేటప్పుడు 'ఆమె పళ్లు దానిమ్మగింజలు' అని అనడం పరిపాటి. అందుకే వెలగ విత్తనాలు ఉండ్రాళ్ళని, దానిమ్మ గింజలు ముత్యాలని సంకేతింప బడ్డాయి'' (గోడమీద బొమ్మ, 1979, పు.9).

డా. యశోదారెడ్డిగారు తమ మున్నుడిలో గుర్తించినట్లు తందానపదాల రూపంలో కూడా కొన్ని పొడుపు కథలున్నాయి. 'తానతందానితాన' అన్నది జానపద గేయాల్లో వాడుకొనే ఊత పదాల్లో(పల్లవి) ఒకటి. అందువల్ల బహుశా అది పొడుపు కథలో కూడా ప్రవేశించి ఉండవచ్చు.

తాన తందాని తాన
తక్కైతె తాన తందాని తాన
వల్లనల్లని పక్షి యొకటి
నడి నెత్తిన రెక్కలు వచ్చే
చెవుల వందున కొమ్ములొచ్చే ॥తందాన తాన॥
దాని పచ్చరత్నములు
కత్తి కత్తిన కోసి
బ్రాహ్మలన బంటులన
బంతిన భోంచేసిరంట—కాని తందాన తానా
ఇంత చెప్పిన వేదశాస్త్రం
తెలియదాయె దాని భావం
దాని భావం బట్టబయలు (అరటి పండు)

తాత్వికార్థం కల పొడుపు కథల్లో చెప్పే ఉపమానాలు, రూపకాలు సామాన్యమైనవిగా ఉంటాయి. కొన్నిట్లో దీనికి విరుద్ధంగా కూడా ఉండవచ్చు. అంటే, లక్ష్యం చేసిన వస్తువు చాలా సామాన్యమైంది. కాని పైకి మాత్రం చాలా గంభీరంగా ఉంటుంది.

పండు పండుకు ముప్పది విత్తులు
15 విత్తులు నలుపు
15 విత్తులు తెలుపు (వెన్నెల—చీకటి)

## వైశిష్ట్యం— అధ్యయనం

'ఒకదాన్ని మించి మరొకటి' అన్నట్లుగా జానపద విజ్ఞానక్షేత్రంలో చెప్పుకుపోతుంటే, ఒకదాన్ని మించింది మరొకటి అయివుంటుంది. అల్లే మనం చేసిన కృషిని తలచుకున్నా కూడా, కృషిలేమి ఒకదాన్ని మించి మరొకటి అన్నా తప్పులేదు. జానపద సాహిత్యంలోని వివిధ ప్రక్రియల్లో జరిగిన కృషిని పరిశీలిస్తే ఇది నిజమనిపిస్తుంది. ఎక్కువగా గేయాలను గురించిన అధ్యయనం మాత్రమే జరిగింది. తర్వాత కథాగేయాలు, తర్వాత కథలు. అటు తర్వాత సామెతలు, చివర పొడుపు కథలు వస్తాయి.

పొడుపుకథ కాలక్షేపానికిమాత్రమేకాదు. మానవజీవితంలోనికటసంబంధం ఉండే సాహిత్యప్రక్రియగా పొడుపుకథను పేర్కొనవచ్చు. ఇది వినోదసాధనం మాత్రమేకాక విజ్ఞానసాధనంకూడా. రాజకీయంగా, సాత్త్వికంగా, మతపరంగా పొడుపు కథకు మానవ సంస్కృతితో సంబంధం ఉంది. ఇది జానపదుల బుద్ధి వికాసానికి తోడ్పడే బలమైన మాధ్యమం. పొడుపుకథను అడగడం, ఎదుటివారు దానిని విప్పడం పిల్లలకు వినోదాన్ని, దానితోబాటు బుద్ధి వికాసాన్ని కలిగిస్తాయి. పొడువుకథలతో ఆదిమ మానవునికి సంబంధించిన అనేక ఆచారాలు, సంప్రదాయాలు ముడిపడి వున్నాయి. వానను రప్పించడం కోసం, పెళ్ళిళ్ళలో వినోదం కోసం, పంటల సమృద్ధికోసం కూడా పొడుపుకథలను వాడుతారు. వీటికి సంబంధించిన కొన్ని నిషేధాలు కూడా ఉన్నాయి. కొన్ని సందర్భాలలో పొడుపుకథలను ఉపయోగించరాదు. ముఖ్యంగా నాట్ల సమయంలో, కోతల సమయంలో ఇలాంటి నిషేధాలున్నాయి. అన్ని వేళల వినోదాలతో కాలం వెళ్ళబుచ్చితే పొలం పనులు సరిగా సాగవనే అభిప్రాయం దీనికి కారణం కావచ్చు. పంటచేతికి వచ్చినతర్వాత పండగ చేసుకొని వినోదంగా కాలం గడిపితే తప్పులేదు.

పొడుపు కథలను గురించి పరిశీలన జరిపిన వారిలో అరిస్టాటిల్ మొదటివాడు కావచ్చు. (The Rhetoric, Book III, chapter 2 and The Poetics, X x i i). పాశ్చాత్య దేశాలలో 19 వ శతాబ్దిలోనే జానపద విజ్ఞానంలోని అన్ని శాఖలతో బాటు పొడుపు కథల అధ్యయనం కూడా ప్రారంభమైంది. ఆర్చర్ టేలర్, ఆంటిఆర్నె, సి. ఎఫ్.పాటర్ మొదలైన వారు పొడుపు కథలను గురించి అధ్యయనం చేసిన విద్వాంసులలో కొందరు.

భారతీయులలో శ్రీ దుర్గా భాగవత్‌గారి పుస్తకం చాలా ప్రసిద్ధమయింది. (The Riddle in Indian Life lore and Literature). ఇతర భారతీయ భాషల్లో, ముఖ్యంగా కన్నడంలో పొడుపు కథలను గూర్చి చక్కని కృషి జరిగింది. రాగౌ సంకలనం·నమ్మ ఒగటుగళు' చాలామంచి సేకరణ. మైసూరు విశ్వవిద్యాలయంవారు 'ఒగటుగళు' (పొడుపు కథలు) అనే పేరుతో మంచి సంకలనం ఒకటి వేశారు, సంపాదకులు శ్రీ ఎచ్. జె. లక్కప్పగౌడ. తెలుగులో అక్కడా ఇక్కడా వచ్చిన కొన్ని వ్యాసాలు తప్పిస్తే పొడుపుకథలను గురించి ఏమీ పరిశ్రమ జరగలేదు.

తెలుగులో అనుకోదగిన సంకలనాలు కూడా ఏవీరాలేదు ఇరుగు పొరుగుభాషల్లోనైనా కొంత మేలు.

పొడుపు కథల విషయంలో కూడా మనం ఇతర భాషలవైపు కొంత దృష్టి సారించవచ్చు. సోదర భాషల్లోని పొడుపుకథలు కొన్ని తెలుగును పోలి ఉన్నాయి. దీనికి కారణం భారతీయ సంస్కృతిలో ఎన్నో సమానాంశాలు ఉండడం. ఒక భాషనుంచి మరొక భాషకు ప్రయాణంచేసే అవకాశం కూడ ఉంది.

ఒకే అర్థాన్ని కప్పి ఉంచడానికి వేరువేరు భాషల్లో ఏ పద్ధతిని అనుసరిస్తారన్నది కుతూహలకారి కాగలదు. కొబ్బరిని చెప్పడానికి తెలుగులో –

చెక్కని స్తంభం చేతి కందదూ
చెయ్యని కుండ పొయ్యని నీళ్ళు
వెయ్యని సున్నం తియ్యంగా

అని పొడుపు కథ ఉంది. కన్నడంలో -

అగసమాడిద మడియల్లి
కుంబారమాడిద మడకెయల్ల

అని ఉంది. చాకలి ఉతికిన గుడ్డకాదు, కుమ్మరిచేసిన కుండకాదని దీనిఅర్థం.

పేలనుగూర్చిన తెలుగు పొడుపుకథ నిడివి ఎక్కువగా ఉంది.

అంభాల మీద కుంభాలు
కుంభాల మీద కుడిత్రొట్టి
కుడిత్రొట్టి మీద గుంద్రాయి
గుంద్రాయి మీద కోరింతా
కోరింత మీద ఆరిక అవురూ
అవురు గడ్డిలో ఆవులు వేలూ

కన్నడంలో ఇదే అర్థాన్ని చెప్పడానికి మూడే పాదాలు ఉపయోగిస్తారు.

కంబ – కంబదమేలె
గుంభ - గుంభదమేలె
హుల్లు – హుల్లినలి హుళు
(కంబం—కంబం మీద కుంభం, కుంభం మీద గడ్డి, గడ్డిలో పురుగు)

ఈ విధంగా వేరు వేరు భాషల్లోని పొడుపు కథలను పరిశీలించినప్పుడు విభిన్న జనసముదాయాలలో అభివ్యక్తిరీతులెలా ఉంటాయన్నది తెలుస్తుంది.

టిప్పణి

1. "Riddles are questions that are framed with the purpose of confusing or testing the wits of those who donot know the answer", Roger D. Abrahams; Alan Dundes, *Folklore and Folklife*, Richard M. Dorson (Ed.) P. 130.

2. "A riddle consists of two descriptions of an object one figurative and one literal, and confuses the

hearers who endevour to identify an object described in conflicting ways", Archer Taylor quoted in M.N.V Panditaradhya's *On Riddles, a definition and an analysis p.11.*

3. "A Riddle may either have an apparent sense which serves as a disguise to the real one, or it may be in the form of a question, the terms of which do not directly indicate the nature of which do not directly indicate the nature of the answer required"
*The new popular Encyclopaedia, P. 112*

4. "వ్యక్తీకృత్య కమప్యర్థం స్వరూపార్థస్య గోపనాత్
యత్ర బాహ్యార్థ్యంతరా వర్థౌకథ్యతే సా ప్రహేళికా"

"క్రీడా గోష్ఠీ వినోదేషు తజ్జ్ఞైరా కీర్ణ మంత్రణే
పరవ్యామోహనే చాపి సోపయోగాః ప్రహేళికాః"

—ఈ రెండింటిని ఉదహరించినవారు భాష్యం విజయసారధి, ప్రహేళికలు. ప్రథమభాగము, పు. vii–viii.

5. "All peoples in the first stages of culture were lovers of riddles' – *Encyclopaedia of Religion and Ethics P. 768.*

# జానపద భాష

గ్రాంథిక భాష, వ్యావహారికభాష, విశిష్టభాష, గ్రామ్యభాష మొదలైన మాటలుగాక ఇదొకటి అదనంగా ఎందుకని కొందరు ప్రశ్నించవచ్చు. గేయాలు, కథాగేయాలు, సామెతలు మొదలైనవానిలో అన్నిరకాల భాషారూపాలను మనం చూడవచ్చు. అయితే కాలానుగుణంగా మార్పుచెందుతూ, జీవద్భాషగా చలామణీ అయ్యేదే జానపద భాష అన్నది మాత్రం తిరుగులేని నిజం. సాహిత్యరూపాలలో ఒక్కొక్కసారి గ్రాంథికం పొడసూపవచ్చుగాని జానపదులు వ్యవహరించేది మాత్రం సజీవభాషనే.

తెలుగు జానపద భాషను క్షుణ్ణంగా ఒకపథకం ప్రకారంపరిశీలిస్తే భాషావేత్త పొందేలాభాలను డా. నాయని కృష్ణకుమారి పట్టీచేశారు. (1979:127)

1. ద్రావిడ కుటుంబంలో తెలుగుకు ఉన్న సంబంధాన్ని స్థాపించి దాని స్థానాన్ని నిర్ణయించగలగడం.
2. తెలుగు మాండలిక భేదాన్ని స్థాపించి, మాండలికాలను నిర్ణయింపగలగడం.
3. ప్రాచీన కావ్యాల్లో మారుమూల పదాలుగా (ఇంకా పండితులు దిద్దకుంటాఉన్నవి) మిగిలి అర్థనిర్ణయం చెయ్యడానికి కొరుకుడుపడని పదాల స్వరూపాన్ని ఈ పరిశోధనసహాయంవల్లవివరించగలగడం.

జానపద భాష అన్నపేరున్నా లేకున్నా, భాషగురించి తెలుగులో అధ్యయనం బాగానే జరిగిందని చెప్పవచ్చు. తెలుగు విద్వాంసుల్లో అనేకులుభాషాశాస్త్రంలో ప్రత్యేక పరిశ్రమ చేసిఉండడంవల్ల కొంత కొంత భాషాధ్యయనం చక్కగా సాగింది. తెలుగులో వచ్చిన మాండలిక వృత్తి పదకోశాలవంటివి అన్ని భాషల్లోనూ రాదగినవి. జానపద భాషాధ్యయానికి ఇవి చేసే సహాయం అంతా ఇంతాకాదు మామూలు నిఘంటువుల్లో సంస్కృతపదాలు తెలుగు

పదాలను కబళించి వేస్తాయి. మన భాషకుండే నిజమైన సత్యాన్ని పరీక్షించు కోవాలంటే మాండలిక పదకోశాలే శరణ్యం. ఆంధ్రవిశ్వవిద్యాలయం మరొక అడుగుముందుకువేసి తెలుగు వ్యుత్పత్తిపదకోశం తయారుచేసే బృహత్ప థకం చేపట్టింది. మన దౌర్భాగ్యంవల్ల ఇంకా ఈపదకోశాన్నిపూర్తి చేయలేక పోయాంగాని, లేకుంటే దేశంలోనే గొప్ప పదకోశం తయారుచేశామనే ఖ్యాతి మనకుండేది.

## తెలుగుభాష పుట్టుపూర్వోత్తరాలు

తెలుగులో కావ్యభాష నన్నయనుంచి ప్రారంభమై ఉండవచ్చు. లేదా మరో ఒకటి రెండు శతాబ్దుల ముందునుంచి కావ్యభాష రూపొందింపబడి ఉండవచ్చు. కాని జానపదుల భాషకు మాత్రం సుమారు రెండువేల సంవత్స రాల చరిత్ర ఉంది. తెలుగు శాసనాలు 6 వ శతాబ్దంనుంచి కనిపించ వచ్చును గాక! వ్యవహారంలో మాత్రం తెలుగు భాష క్రీస్తు పూర్వంనుంచే ఉందేదన డానికి ఆధారాలున్నాయి. క్రీస్తుపూర్వంనుంచి తెలుగు స్వరూపాన్ని శాస్త్రీయంగా నిరూపించే ప్రయత్నాలు ఎన్నోజరిగాయి.

తెలుగుభాషలో తెలుగుదనాన్ని తెలుసుకోవాలంటే మనకు సహాయ పడేవి ప్రాచీన గ్రంథాలు కావు. తెలుగంటే చిన్నచూపుండే పండితులు మాత్రమే, తెలుగు పదాలలో సత్త్వం లేదని, ఉత్తమ కావ్యరచనకు తగిన శక్తి తెలుగుకు లేదని చెప్తారు. సంస్కృతమే భాషలన్నిటికీ తల్లి అని నమ్మే పండితులు కూడా కొందరు ఈ నాటికీ ఉన్నారు. ఆంధ్రభాషా భూషణాన్ని వ్రాసిన కేతన సుమారు ఏడు శతాబ్దాల క్రితం గుర్తించినంత మాత్రం కూడా గుర్తించని విద్వాంసులు 20 వ శతాబ్దంలో ఉంటే ఏమనుకోవాలి ? కేతన 'తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును, దాని వలనఁ గొంత గానఁబడియె కొంత తాసకలిగె నంతయు నేకమై తెనుగుబాసనాగ వినుతికెక్కె' అని తెలుగుకూ తనది అని చెప్పుకోగలిగింది కొంత ఉందనే విషయాన్ని చెప్పాడు.

తెలుగు వంటి దేశీయ భాషల్లో ఉండే దేశ్యపదాల సంఖ్య తక్కువేమీ కాదు. "తెలుగులోని దేశీయ క్రియాధాతువులే పన్నెండు వందలకు పైగా

వుంటాయని పరిశోధకులు నిర్ధారించారు. ఇక, నామధాతువులకు లెక్కలేదు. ఈ రెండు రకాల ధాతువులపై యేర్పడ్డ జన్యపదాలు తెలుగులో ముప్ఫయ్‌వేల పైమాట" (టి. దొణప్ప 1972 : 126).

తెలుగు భాషలోని దేశ్యభాగం జానపద భాషకు అయువు పట్టు. తర తరాలనుంచి తెలుగు భాషకు జీవనాడిగా ఉండే దేశ్యపదాలు జానపద భాషకు మూల స్తంభాలు. ఈ పదాలు సంస్కృతం నుంచో, ప్రాకృతంనుంచో ఎరవు తెచ్చుకొన్న సొమ్ములు కావు. వందలకొద్దీ సంవత్సరాల నుంచి తెలుగు వారి నాలుకలపైన నాట్యమాడే పదాలవి. దేశ్యవిభాగాన్ని తొలగిస్తే అది తెలుగు భాష అన్న శబ్దానికే అర్థంకాని పరభాష అవుతుంది.

ప్రాచీనకాలం నుంచి తెలుగుభాష ఏ విధంగా వికాసం చెందిందనే విషయాన్ని తెలుసుకోవాలంటే పండితుల కావ్యాల కంటె శాసనాలు, తర తరాలనుంచి మౌఖికంగా బ్రతుకుతూ వచ్చిన జానపద సాహిత్యం, దేశి సాహిత్య విభాగానికి చెందిన ప్రక్రియలు దోహదం చేస్తాయి. జానపదుల భాష గలగల పారే జీవనది వంటిది. పండితుల భాష ఆనకట్టతో నిలిపిన ప్రవాహం వంటిది. తెలుగు భాషలో నన్నయకు పూర్వం ల,ళలు కాక ఱ అనే అక్షరం కూడా ఉండేదని శాసనాలు సూచిస్తున్నాయి. ఆనాటి వర్ణమాలలో రేఫ శకటరేఫ ఉండేవి. సంధిని పరిశీలించి నప్పుడు 6 వ శతాబ్దిలో పదాంతంలో అత్తుమీద చివరికి ఉత్తుమీద కూడా సంధి చెయ్యని సందర్భాలు శాసనాలలో కనిపిస్తాయి. ఇవన్నీ ఆనాటి వ్యవహారంలోని రూపాలను తెలియ జేస్తాయి, ఉదా : పన్నస ఇరవది, రేనాణ్ణు ఏళన్ ఉచ్చారణలో ఉండిన అనేక రూపాలను పరిశీలించాలంటే నన్నయకు ముందుండిన శాసనాలే మనకు ముఖ్య ఆధారం. నన్నయగాని తదితర వ్యాకరణ వేత్తలు గాని అంగీకరించని వ్యావహారిక రూపాలనేకం ప్రాఙ్నన్నయ కాలంనాటి శాసనాలలో కనిపిస్తాయి,

ఉదా : ఎట్టి వుమ్మయును ; వారు యిట్లుకాను
అన్వారు ; ఏను వుట్లు
విషయంబు యేళ ; రట్టగుడియు వుద్దిని

పదకొండో శతాబ్దం వరకు తెలుగులో ఎరువు మాటలు బహుశా 25 శాతం ఉండవచ్చు. కాని ఆ తర్వాత శాసనాల భాషను, కావ్యభాషను పరిశీలిస్తే యాభై శాతం, ఒక్కొక్కసారి అంత కంటె ఎక్కువా ఎరువు మాటలు కనిపిస్తాయి.

పదకొండో శతాబ్ది తర్వాత కూడా తెలుగు భాషా పరిణామాన్ని సక్రమంగా తెలిపేవి ముఖ్యంగా శాసనాలే. పద్నాలుగో శతాబ్ది వరకు సుమారు రెండు వేల శాసనాలు కనిపిస్తాయంటే వాటి వ్యాప్తి ఎంత గొప్పదో తెలుస్తుంది. ఈ కాలంనాటి శాసనాల్లో ఋకారం రుగా మారిన రూపాలు కూడా కనిపిస్తాయి. ప్రుదివి, రుతు మొదలైనవి ఆనాటి ఉచ్చారణను తెలుపుతాయి. తాలవ్యాచ్చు పరమైతే సకారం శకారంలో మారడం పదమూడో శతాబ్ది నుంచి కనిపిస్తుంది. చేశిన, పడశినవంటి రూపాలు శాసనాల్లోఉన్నాయి. ఈ కాలంలో అక్కడక్కడా సంజ్ఞావాచకాల్లో 'ఱ' వర్ణం కనిపిస్తుంది కాని తర్వాత రానురాను పూర్తిగా కనుమరుగై పోయింది. ఋఋూలను ఏనాడూ తెలుగువారు సరిగ్గా ఉచ్చరించిన పాపాన పోలేదు. రిరీలుగానో, రురూలుగానో ఉచ్చరిస్తుండే వారు. బ్రుందావనం. సుక్రుతం, పిత్రుస్థానము వంటి రూపాలు 15–16 శతాబ్దుల శాసనాల్లో కూడా కనిపిస్తాయి.

మొత్తం మీద తెలుగు భాషావికాసాన్ని కాలానుక్రమంగా అధ్యయనం చేసేటప్పుడు కొన్ని దశలుగా విభజించుకొని పరిశీలించవచ్చు. భద్రిరాజు కృష్ణమూర్తిగారు నాలుగు దశలను సూచించారు (1979 : 458). అవి 1. క్రీ.శ. 200-700 ; 2. క్రీ.శ 700 – 1200 ; 3. క్రీ.శ, 1200–1600 ; 4. క్రీ.శ. 1600–1900. భద్రిరాజు కృష్ణమూర్తిగారి అభిప్రాయం ప్రకారం "కావ్యసాహిత్యం నన్నయ కాలానికి అయిదారు శతాబ్దుల ముందే తెలుగులో ఏర్పడి ఉండాలి. శాసనస్థమైన వ్యవహార భాషకు-నన్నయ కాలపు సాహిత్య భాషకు గుర్తించ దగినంత వ్యత్యాసం కనిపిస్తుంది (1979 : 458).

కాలానుక్రమంగా తెలుగు భాషలోవచ్చిన మార్పుల్ని పరిశీలిస్తేధ్వనుల్లో, సంధిలో, నామపద, నామవిభక్తుల్లో, వాక్యాల్లో వ్యవహారభాషకు, కావ్యభాషకు భేదం ఉండేదనితెలుస్తుంది. శాసన భాషద్వారా ప్రాతినిధ్యం పొందిన జానపద

భాషలో ఉత్వసంధికూడా నిత్యం కాదని స్పష్టమవుతుంది. వ్యవధానం ఉంటే రెండచ్చులూ సంధికాకుండా అలాగే ఉంటాయి. ఒక్కొక్కసారి యడాగమమూ, వకారాగమం కూడా కావచ్చు.

మాండలికాలు

తెలుగుదేశం నిజంగానే ఒక దేశమంత విస్తీర్ణం కలది; కొన్ని దేశాల కంటె ఎక్కువ జన సంఖ్యకలది. స్థూలంగాచూస్తే తెలుగుభాష ఒకేరూపంగా తోచినా ఒక్కొక్క జిల్లా కొన్నయినా భేదాలు తప్పక గోచరిస్తాయి. ఇలాంటి అవాంతర భేదాలను తులనాత్మకంగా పరిశీలించాల్సిన ఆవశ్యకత ఉంది. శిష్ట భాషకంటె జానపద భాషలో వ్యత్యాసాలు ఎక్కువ. నిర్ణీత జనసమూహాన్ని గాని, నిర్దిష్ట భౌగోళిక పరిధిని గాని మండలం అని పిలవడం కద్దు. మాండలిక భాష అన్నది ఈ వివిధ మండలాల విశిష్టతలను ప్రతిబింబించే భాషాశాఖ. జానపద భాష వ్యక్తుల కులాన్ని బట్టి, వృత్తినిబట్టి, వయస్సును బట్టి, సంస్కారాన్ని బట్టి. స్త్రీ పురుష భేదాన్ని బట్టి మారుతూ ఉంటుంది. మాండలిక భాష లక్షణాలను ఇలాచెప్పవచ్చు.

(టి. దొణప్ప 1972:73)

1. పరిమితమయిన మండలంలో ఏకదేశంగా వ్యవహరిచబడటం.
2. ప్రామాణిక భాషలో అంతర్భూతమై వుండటం.
3. న్యూన ప్రామాణిం (Sub-standard) గా వర్థిల్లటం.
4. ప్రచురమయిన ప్రామాణిక సాహిత్యం లేకపోవటం.
5, ప్రాంతీయవైలక్షణ్యంపాలు ఎక్కువ కావటం.
6. ఇన్ని విశిష్టలక్షణాలున్నా, వ్యవహర్తల మధ్య పరస్పరం వ్యవహారహాని జరక్కుండా అవగాహన క్షమత్వం చాలావరకు నిల్చివుండటం.

ఈ మొదలైనవి మాండలికాల లక్షణాలు.

డా టి. దొణప్పగారే మాండలికాలు ఏర్పడటానికి హేతువుల్ని కూడా వివరించారు. (1972:73)

1. వ్యవహార ప్రాంతంలోని అన్ని భాగాలకూ భాషావ్యాపక సాధనా లయిన రాకపోకలూ,ఇతర సంబంధబాంధవ్యాలూ సన్నగిల్లి, భాషావ్యవహారం లోని సమరూపత లోపించటం.

2. వ్యవహార ప్రాంతం విస్తరించటం,

3. విస్తరించిన ప్రాంతాలకు ఇరుగు పొరుగున ఉన్న నూతన భాషల తోడి సంసర్గంవల్ల ఎరవుపదాలు నూరార్లుగా వచ్చిచేరి వ్యాకరకమయిన విలక్ష ణత ఏర్పడటం.

4. విస్తరించిన ప్రాంతాలలోని నూతన వాతావరణం-అంటే గొడ్డూ గోదా, చెట్టూ చేమా, తావూ రేవూ, పురుగూ బుట్రా, రాయీరప్పా, గాలీ వానా, చలీ చెమ్మా మొదలయిన వాటి సాహచర్యంలో కలిగే నూతన భావా లను బోధించే పదాలను కొత్తగా సృష్టించటమో, స్థానిక భాషలంటూ ఏవ యినా ఉంటే వాటి నుంచి తత్తద్బోధక పదాలను ఎరవుతెచ్చుకోవటమో, లేక పాత మాటలనే కొత్త అర్థాలలో ఉపయోగించటమో జరుగుతుంది. వెరసి యెన్నెన్నో కొత్తకొత్త పదాలు రూపెత్తటం తప్పనిసరి.

5. వ్యవసాయం, చేనేత, జాలరి, పంచాణం—మొదలయిన వృత్తుల వారు వాడేపనిముట్లనూ చేసే పనులనూ బోధించే పదాలు ఆయావృత్తులకే, ఆయాప్రాంతాలకే పరిమితం కావటం.

6. బ్రహ్మాండమయిన పర్వతశ్రేణులూ, దుస్తరాలయిన నదులూ, దుర్గమాలయిన అడవులూ మొదలయినవి రాకపోకలకు ప్రతిబంధకాలై ఉభయ పార్శ్వాలలోని భాషావ్యవహారంలోని భేదాలకు కారణమవటం.

7. రాజకీయ కారణాలు, తెలుగు అరవ నాడులకు భౌగోళికమయిన సరిహద్దంటూ స్పష్టంగా ఏదీ లేకపోయినా, ఈ రెండునాడులలో అవిచ్ఛిన్నంగా వెలసిన సామ్రాజ్యాల సరిహద్దులే చారిత్రక కాలం నుంచీ యెట్టి మార్పులూ లేకుండా ఈ భాషాప్రాంతాల సరిహద్దులుగా కూడా నిల్చివున్నాయి.

| శిష్టోచ్చారణలో | జానపదోచ్చారణలో |
|---|---|
| 4. సంయుక్త హల్లులు నిలుస్తాయి : భక్తి, చేస్తాడు, కలెక్టర్ | 4. (a) హల్లులు సమీకరణం పొందుతాయి : బత్తి. సేత్తాడు. (b) స్వరభక్తి రావచ్చు. కలకటేరు. |
| 5. శ, ష, స, ల భేదం ఉంటుంది : శాస్త్రి, భాష, కాసు. | 5. శ, ష, లు సకారంగా మారతాయి. సేత్రి, బాస, కాసు, |
| 6. మూర్ధన్య దంతమూలీయభేదం నిలుస్తుంది : పల్లం, పళ్ళెం, దాన్ని, వాణ్ణి | 6. మూర్ధన్యాలు, దంతమూలీయాలవుతాయి : ళ> ల. ణ> న పల్లం, పల్లెం, దాన్ని: వాన్ని. |
| 7. 'f', 'ప' వేరుగా ఉంటాయి. ఆఫీసు, కాఫీ, తోఫు. | 7. 'f', 'ప'గా మారుతుంది : ఆపీసు. కాపీ, తోపు. |
| 8. పదాది గకారం దేశ్య శబ్దాల్లో నిలుస్తుంది : గట్టు, గడ్డ, గండి | 8, 'గ', 'గె'గా మారుతుంది. గెట్టు, గెడ్డ, గెండి. |

భౌగోళికంగా, శిష్ట—జానపద భేదం వల్ల. సామాజికంగా ఏర్పడిన మాండలికాల నన్నిటినీ సేకరించి సమగ్రాంధ్రమాండలిక పదకోశాన్ని తయారు చేయాల్సిన అవసరం ఎంతయినా ఉంది. దీన్నిగురించి డా. టి దొణప్పగారు చెప్పిన మాటలు గమనించ దగ్గవి (1972:66) "సమగ్రాంధ్రపదనిఘంటువును నిర్మించటానికీ, వృత్తి పరమయిన పారిభాషిక పదావళిని వాడుకలో వున్న దేశ్య పదాలతోనే ఏర్పర్చుకోవటానికీ, ఈ పారిభాషిక పదాలను వుపయోగించి సామాజిక శాస్త్రసంబంధి పాఠ్యగ్రంథాలను ప్రామాణిక భాషలో రచించటానికీ ప్రాచీనాంధ్ర కావ్య ప్రయోగాల్లోని విభిన్నార్థచ్ఛాయల్ని నిర్దుష్టంగా నిరూపించ టానికీ, తెలుగువారి సంస్కృతి స్వభావాల్ని సమ్యగ్రుచిరంగా సందర్శించ టానికీ, విశిష్ట నవీన భాషా విజ్ఞాన ప్రగతికీ సర్వాంధ్ర మండలాల్లో వాడుకలో వుంటున్న అన్ని మాండలిక పదాలనూ శాస్త్రీయ పద్ధతిలో సేకరించి గ్రంథస్థం కావించవలసిన ఆవశ్యకత యెంతైనా వుంది.''

జానపద భాష–స్వరూపం

శిష్టభాషకు జానపద భాషకు ఉండే భేదాన్ని కొంత వరకు మాండలి కాలను గురించి చెప్పేటప్పుడే చెప్పడం జరిగింది. జానపదభాషాస్వరూపాన్ని వివరించేటప్పుడు వివిధ భాషాంగాలను, వాటిలో జరుగే మార్పులను గుర్తించ వలసి ఉంది. జానపదుల ఉచ్చారణలో భాషాస్వరూపంలో కలిగే మార్పులను కొన్ని శీర్షికల క్రింద విభజించి పరిశీలించవచ్చు.

అచ్చులలో కలిగే మార్పులు: అ–ఇగా మారడం, అ–ఒగా మారడం, అ–ఎగా మారడం మొదలైనవి, ఇ-ఉగా, ఇ–ఎగా, ఉ–ఇగా, ఉ-ఎగా, ఎ–ఒగా మారడం మొదలైనవి. అయ్యగోరు, మొగుడు, రుమాల, కావిడి, రేత్రి మొదలైన వాటిలో ఇలాంటి మార్పులు జరిగాయి.

హల్లులలో కలిగే మార్పులు: క–గగా మారడం, ట–డగా, డ–నగా, త–దగా, ప–వగా, చ–సగా, న-రగా, స–లగా, ర–నగా మారుతుంటాయి. ఇలాంటి మార్పులు ఇంకా కొన్ని ఉన్నాయి. కడప–గడప, ముఖం-మొహం, కపిల–కవిలి, చక్కగా-సక్కగా, హెచ్చు–ఎచ్చు, పందిలి–పందిరి తక్షణం–తచ్చనం.

జానపద భాషలో కలిగే ధ్వనుల మార్పును పరిణామ క్రమంలో అమర్చి సుస్పష్టంగా, నిశ్చితంగా నిర్ణయించే ప్రయత్నాలు జరిగాయి. అలాంటి ప్రయత్నాలలో ఈ క్రిందిది ఒకటి (నాయని కృష్ణకుమారి 1979 : 139–140).

1. వర్ణసమీకరణం (Assimilation )

| | |
|---|---|
| కంబడి | కమ్మడ |
| మంచె | మచ్చె |
| వర్ది | వద్ది |

2. వర్ణవ్యత్యయం (Metathesis )

| | |
|---|---|
| బర్లు | బర్రు |
| చర్నకోల | చంద్రకోల |

| | |
|---|---|
| గుండెబగులు | గుండెబలుగు |
| పగల జీరు | పలగజీరు |

3. అజ్లోపము (Synecope)

| | |
|---|---|
| ఎలవ | ఎల్వ |
| జులుము | జుల్మ |
| కొపిర | గొబ్ర |
| ఎముక | ఎంక |

4. లోపదీర్ఘత (Compensatory lengthening)

| | |
|---|---|
| గ్రహణము | గ్రాణం |
| పెండ | పేడ |
| వెంప | వేప |
| మొహరీలు | మోరీలు |

5. దీర్ఘలోపము ( Loss of length )

| | |
|---|---|
| దూడ | దుడ్డె |
| తోవ | తొవ్వ |
| తీనె | తిన్నె |
| సోరలు | సొర్రలు |

6. వర్ణనాశము (Haplology)

| | |
|---|---|
| జోగుకోల | జోకోల |
| తోడెమంత | తోమంత |
| ఎదురురొమ్ము | ఎరురొమ్ము |
| పోకచెక్క | పోచెక్క |

7. స్వర భక్తి (Anaptyxis )

| | |
|---|---|
| ఉల్ఫా | ఉలపా |
| ఫర్మానా | పరమానా |
| ప్రదక్షిణ | పరదక్షణ |

అన్యదేశ్యాలు :

వేరే భాషల సంపర్కం అనివార్యం. సజీవ భాష ఎప్పటికప్పుడు కొత్త మాటల్ని చేర్చుకుంటూనే ఉంటుంది. సంస్కృతాది భాషలనుంచి పదాలను తీసుకునేటప్పుడు జానపదులు వాటిని వాడే తీరు ఒక్కొక్క సారి చేతోహారిగా ఉంటుంది. అన్యభాషా సంపర్కం భాష పెరగడానికి దోహదం చేస్తుంది. సంస్కృత భాషలో కూడా ద్రావిడ పదాలనేకం ఉన్నాయి. తెలుగు మొదలైన దేశ భాషలకు సంస్కృతం వల్ల పద సమృద్ధి కలిగిందనడంలో సందేహం లేదు.

తెలుగు జానపద భాషలో సంస్కృత ప్రాకృతాలు వైకృతాలై చోటు చేసుకున్నట్లుగానే ఇతర దేశభాషా పదాలు కూడా అసంఖ్యాకంగా చేరిపోయాయి. మహమ్మదీయులు దక్షిణ దేశాన్ని పరిపాలించినప్పుడు వాళ్ళ పదాలు వచ్చి చేరాయి. ఆంగ్లేయుల ప్రభుత్వం వచ్చిన తర్వాత ఆంగ్ల పదాలూ వచ్చి చేరాయి ఈ పదాల చేరికలో ఒక్కొక్క ప్రాంతానికీ భేదం కనిపిస్తుంది. తెలంగాణా ప్రాంతంలో ఉర్దూ ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. చిత్తూరుజిల్లాలోని పదాలపై తమిళ ప్రభావంకనిపించడమే కాక, తమిళ పదాలే అనేకం వచ్చి చేరడమూ కనిపిస్తుంది. కర్నాటక రాష్ట్రంతో నికట సంపర్కం ఉండే జిల్లాలలో కన్నడ పదాలు వచ్చి చేరాయి. ఉత్తరం వైపు ఒరిస్సా నుంచి వచ్చి చేరిన పదాలు కొన్ని. అన్యదేశ్యాల నుంచి మన భాషకు కలిగిన లాభాన్ని కవి హృదయం ఇలా వర్ణించింది.

> "అన్య దేశ్యంబులను, సంస్కృతాది పూర్వ
> వాఙ్మయస్థ శబ్దంబులన్, పాటెరింగి
> నుడికరింతురు జాను తెనుంగు నందు;
> మధురిమార్థ గౌరవముల్ ప్రమాణములుగ.
> ఇరుగు పొరుగు సీమలలోన నింపులొలయు
> పలుకులను జాతి సానల పలక దీర్చి
> తెనుగు బంగారు తీవె సూత్రింతు రెలమి
> చేతనాహ్లాద రమణీయ చిత్రరచన"

(రాయప్రోలు సుబ్బారావు. రమ్యాలోకము, పు.25)

సంస్కృత పదాలు, ప్రాకృతపదాలు తెలుగులో ప్రారంభకాలం నుంచి ఉండడం వల్ల వాటిని మనం అన్యదేశ్యాలుగానే పరిగణించడం లేదు. అయితే తత్సమ తద్భవాది పారిభాషిక పదాల వల్ల ఆ భాషలు మన భాషకంటె భిన్న మైనవనే విషయాన్ని మన లక్షణకారులు గుర్తించారని తెలుస్తుంది. ఇతర భాషలనుంచి వచ్చిన పదాలను మనవారు దేశ్యభాగంలోనే చేర్చుకున్నారు. పారసీ, అరబ్బీ, ఉర్దూ, ఇంగ్లీషు మొదలైన భాషల నుంచి వచ్చి చేరిన అసంఖ్యాక పదాలు కావ్యాలలోనే కాక జానపదుల భాషలో కూడా అత్యంత సహజంగా భాగమై పోయాయి శ్రీనాథుని కాలం నుంచే అన్యదేశ్యాలు పందల సంఖ్యలో కావ్యాలలో చొచ్చుకొని పోయిన విషయం పరిశీలన వల్ల స్పష్టమవుతుంది. శ్రీనాథుడు వాడిన అరబీ పదాలలో కుందనము, కుల్లా, ఖుసి, తరుణాసీరి, దుకాణము, బొందిలి, మసీదు, సురతాణి, సేబాసు, హజారము మొదలైనవి ఉన్నాయి. శ్రీనాథుని సమకాలికులు వాడిన పదాలలో గలబ, చవుక, జులుము, లూటి, శాలువు, సామ్రాణి మొదలయిన పదాలున్నాయి.

తెలుగులో పోర్చుగీసువార పదాలు కూడా పందల సంఖ్యలో వచ్చి చేరాయి. 15 శతాబ్ది చివర బుడత కీచులు మన దేశం పశ్చిమ తీరంలో అడు గెట్టారు. పోర్చుగీసు వారి నుంచి మనకు సంక్రమించిన పదాలలో సైనిక సంబంధమైనవి కమాను, పటాలము, బారకాసు మొదలైనవి. గృహనిర్మాణా నికి సంబంధించిన మాదిరి. మేస్త్రీ; దుస్తులకు సంబంధించిన ఇస్త్రి, తువ్వాలు, బొత్తాము; వర్తకానికి సంబంధించిన ఏలము. కోస్తా, గిడ్డంగి, గోదాము, బంకు; వ్రాత కోతలకు సంబంధించిన పురోయి, పేనా; వృక్ష జాతులకు సంబంధించిన అనాస, గొయ్యా, గోబి; గృహోపకరణాలైన పీపా, బొంబాయి మేజా, సబ్బు మొదలైనవన్నీ బుడతకీచు పదాలు-వాటి, విరూపాలు (వివరాలకు టి. దొణప్ప 1972: 255–256).

కృతక ప్రామాణిక రూపాలు : జానపద భాషను గురించి పరిశీలన జరిపేటప్పుడు ఆసక్తిని రేకెత్తించే మరో అంశం కృతక ప్రామాణిక రూపం. వేద పండితులైనా సరే, అగ్రవర్ణాలకు చెందిన వారిలో చాలామంది జానపదులు కావచ్చునని నిరూపించేవి కృతక ప్రామాణిక రూపాలు. ఇలాంటి వాటిని గురించి చక్కని వ్యాసాన్ని వ్రాసిన వారు డా. టి. దొణప్ప (1972 :

330–353). "పూర్వాచార పరాయణములగు కొన్ని బ్రాహ్మణ శాఖల భాషా వ్యవహారములలో విశిష్టమాండలిక భేదములుగా పేరూనిన వింత వింత ఉచ్చారణ రీతులు వీనికి కొన్ని ఉదాహరణములు. 'వేమయ్యా, వింద్రయ్యా వేబుళం పొగాకు వెంతికు విస్సావు'—అని యిట్లు అజాది రూపములను వకారాదులుగా మార్చి 'వ్రొత్తి వ్రొత్తి' యుచ్చరించుట ఈ యున్నత వర్గముల వారి యలవాటు. 'ప్రైదీకుల యింటి పిల్లిగూడ మ్రావు మ్రావు మంటుం'దని అభియుక్తులు కొందఱు చమత్కరించుట కద్దు' (పైది : 331-332).

భాషలో మార్పు తప్పదు. దానికి అడ్డుకట్ట వెయ్యాలని కొందరు ప్రయత్నిస్తూ ఉంటారు. మరికొందరు ప్రాచీనమయిందే ఉత్తమమని తలచేవారుంటారు. నియమం పేరుతో అప్రామాణికమైన వాటిని కూడా ప్రామాణికాలుగా భావించడం ఉపయోగించడం భ్రాంతి వల్ల కలుగుతుంది. ఇలాంటి భ్రాంతి పండితులలోనే ఉండగా పామరులలో ఉండడంలో ఆశ్చర్యం లేదు. ఒక యథార్థ రూపము కంటె మిక్కిలి నిర్దుష్టమను మిథ్యాబుద్ధి వలన యే తద్యథార్థ రూపమును త్రోసి రాజు సేయు నిచ్ఛతోపునర్నిర్మించిన రూపము కృతక ప్రామాణిక రూపము (Hyper Form or super – standardised form) అని భాషా శాస్త్రకారుల నిర్వచనము(టి. దొణప్ప : 1972 :333)[1]

జానపదులంటే పల్లెపట్టులలో నివసించే వారే కానక్కరలేదని సమాన సంప్రదాయాలు కల ఏ జనసముదాయమైనా జానపద శబ్దం చేత వ్యవహృతం కావచ్చని ఈ గ్రంథ ప్రారంభంలోనే చెప్పబడింది. కృతక ప్రామాణికాలను సృష్టించే జానపదుల విషయంలో ఈవిషయం మరింత స్పష్టంగా తెలుస్తుంది. పామరులు మొదలు పండితుల వరకు అందరూ కృతక ప్రామాణిక రూపాలను సృష్టించేవారే.

రేఫ లేని చోట్ల రేఫను వ్రాయడం అనేక కృతక ప్రామాణిక రూపాలలో కనిపిస్తుంది. చిన్నయసూరి మొదలైన 'దక్షిణాది తెలుగు పండితులు' వ్రేల్చు, త్రావు, వ్రేయు మొదలైన చోట్ల లేని రేఫాన్ని ప్రయోగించడాన్ని గిడుగు రామమూర్తి పంతులుగారు ఎత్తి చూపారు. అంతేగాక 'వేల్చు' అనే ప్రయోగాలు ప్రాసస్థానంలో కూడా ఉన్నాయనే విషయాన్ని సోదాహరణంగా తెలిపారు.[2] ఇలాంటి కొన్ని పదాల విషయంలో జానపదులే మేలనిపిస్తారు.

ఎందుకంటే శిష్టులు తప్పుగా వాడే త్రావు, త్రుళ్ళు, త్రెగు, త్రోము, త్రిండు వంటి వాటిని జానపదులు సరిగ్గానే పలుకుతారు. అయితే జానపదులు కృతక ప్రామాణిక రూపాలను వాడరని కాదు. ద్రయ, ద్రేహము, వ్రెందుకు వంటివి వారి ఉచ్చారణలో కోకొల్లలుగా కనిపిస్తాయి. 'వైందునాకై వుంచీ నావో బ్రందిఖానాలో' అని పాడితేనే జానపదులకు తృప్తి. కృతక ప్రామాణిక రూపాలలో పండితులు ఈ క్రింది విభాగాలను గుర్తించారు (టి. దొణప్ప 1972: 335)

1. పదాది రేఫ ఘటితములు-త్రావు. త్రెగు. మొ॥వి.

2. ఎదంత ములియాంతము లగుట-తేనియ, నూనియ మొదలయినవి.

3. తాలవ్యవ్యంజనముల మీది తాలవ్యేతర స్వరములు తాలవ్య స్వరములగుట-ఛాందసము > చాదస్తము > చేదస్తము; చారు > చేరు, జలగ> జెలగ.

4. సాధురేఫములు శకట రేఫములుగ పరిణమించుట బాజారు > బాజాఱు, బురుజు > బుఱుజు; రేవు > ఱేవు; వరకు > వఱకు.

5. అజాది పదములు వకారాదులుగా మాఱుట — ఎండ-వెండ; ఎంద్ర కాయ— వెంద్రకాయ; ఎడము — వెడము; ఎన్ను- వెన్ను; ఎసరు—వెసరు.

6. అజాది పదములు హకారాదులగుట — హకారాది పదాలు అజాది రూపాలుగా మారడం సర్వసాధారణం. అయితే సహజంగా అకారాదిగా ఉండే పదాలను హకారాదిగా చేయడం కృతక ప్రామాణిక రూపాల ఉత్పత్తికి దోహదం చేస్తుంది. అంశ- హంశ; ఆశ్చర్యం — హాశ్చర్యం; అడలు — హడలు; ఎచ్చరికె — హెచ్చరికె — హెచ్చరిక.

## జానపద నిరుక్తులు

జానపద నిరుక్తి (Folk etymology) అన్నది జానపదుల మనస్తత్వానికి అద్దం పడుతుంది. అర్థం కాని పదాలను కూడా జానపదులు తమకు బాగా పరిచయం ఉండే వాటిలాగా మార్చుకుంటారు. జానపదులు ఒక పదాని

కుండే అర్థంగాని, అక్షరాలుగాని సరిగ్గా అర్థం కాకుంటే ఆ పదాన్ని మరో విధంగా మార్చుకోడమో లేక ఎక్కువ పదాలుగా చేయడమో చేస్తారు. వీటి వల్ల ఒక్కొక్క భాషలోని పదజాలం పెరుగుతుంది. ఇంగ్లీషులో ఇలాంటి పదాలు వేలసంఖ్యలో ఉన్నాయి.[3] ఇంగ్లీషులో ఓవరాల్ (overhaul) అనేపదాన్ని తప్పుగా అర్థంచేసుకొని ఓవరాయిల్ (over oil) అని వాడటం మనకు తెలిసిందే. ఇలాంటివే తెలుగులోను కనిపిస్తాయి.

ప్రతి భాషలోను సమీపోచ్చారణ, సదృశార్థం వుండే మాటలెన్నో ఉంటాయి. ఒక భాషారూపానికి కృత్రిమంగా జానపదులు కల్పించే వ్యుత్పత్తిని అనుసరించి సిద్ధించే రూపాంతరాలను జననిరుక్తులంటారు. కృతకప్రామాణిక రూపాలు శాబ్దికమైన తికమకల వల్ల ఏర్పడితే, జానపద నిరుక్తులు అర్థ పరమైన తికమకల వల్ల ఏర్పడతాయి. "సవ్యమైన చారిత్రిక దృక్పథం కరవైతే, దృఢమయిన శాస్త్ర జన్య పరిజ్ఞానం లోపిస్తే, పారంపరీణమైన సంప్రదాయం విచ్ఛిన్నమయితే భాషా పరంగా జరిగే రకరకాల భ్రమ ప్రమాదాలు అసంద ర్భపు వ్యుత్పత్తి నిర్ణయానికెలా దారి తీస్తాయో" (టి. దోణప్ప 1972:131) జానపద నిరుక్తులు తెలుపుతాయి.

తెలుగులోని జానపద నిరుక్తుల్లో అరవ చాకిరీ చాలా ప్రసిద్ధమయింది. కష్టపడి పనిచెయ్యడానికి అరవవాళ్ళు ఎప్పుడూ ముందుంటారని అందువల్లనే ఈ పదం వాడుకలోకి వచ్చిందని అంటారు. కాని ఇది అరువు చాకిరీ—అంటే అప్పుచాకిరీ; అంతేగాని అరవ చాకిరీ కాదు.

ముత్తయిదువ అనే పదాన్ని వినని వారుండరు. దానికి చెప్పే అర్థాన్ని కూడా నిఘంటుకారులు చెప్తుంటారు. నిఘంటుకారుల ప్రకారం పసుపు, కుంకుమ, చెవ్వాకు, గాజులు, తాళిబొట్టు ఉండేవారు అయిదువలు. ఒకవేళ ఎవరైనా నల్లపూసలు, పువ్వులు, ముక్కెర మొదలైనవి కూడా స్త్రీకి ముఖ్య మైనవే కదా అని ప్రశ్నిస్తే దానికి జవాబులేదు. అసలీపదం 'అవిధవా' అన్న సంస్కృత శబ్దం నుంచి పుట్టింది.

ఒకే పదాన్ని జానపదులు ఎన్ని విధాలుగా అర్థం చేసుకోగలరో చెప్ప డానికి తిరగమూత అనే పదబంధమే ఉదాహరణ. పోపుపెట్టాక మూత

మూత పెట్టడం వల్ల (తిరుగామూత) ఈ పేరువచ్చిందని కొందరంటే, పోపుపెట్టగానే మోత వస్తుంది కాబట్టి తిరగమోత అనాలంటారు. అసలిది తిరుగుబోత (టి. దొణప్ప 1972 B : 140). ఇది కొందరి నోట తిరగవాత కూడా అయింది. తిరగమాత, తిరుగమేత, తిరగవేత మొదలయినవి కూడా వాడుకలో ఉన్నాయి.

ఉపమాది అలంకారాలు

సామాన్య జనుల భాషలోని కొన్ని విశేషాలను గమనించిన తర్వాత జానపదులే కావ్య నిర్మాణం చేస్తే శైలీ సంబంధమైన భాషా విశేషాలు ఏ విధంగా రూపొందుతాయనే విషయమూ పరిశీలనార్హం అవుతుంది. జానపదుల సాహిత్యంలో గేయాలు, కథాగేయాలు, కథలు, సామెతలు, పొడుపు కథలు ఉన్నాయి. లాక్షణికమైన నియమాలకు జానపదులు కట్టుబడక పోయినా, సహజంగా వారి భాషలో, కావ్యాలలో ఆలంకారిక శైలి మనోహరంగా రూపొందుతుంది. అయితే అది కృతకమైనది మాత్రం కాదు. నిసర్గ మనోహరమైన కల్పనా వైభవంతో జానపద సాహిత్యం ఎవరి హృదయాన్నయినా ఇట్టే ఆకట్టుకొంటుంది.

జానపద సాహిత్యంలో నానుడులు, పలుకుబళ్ళు, సామెతలు అసంఖ్యాకంగా కనిపిస్తాయి. నిజమైన జీవద్భాష స్వరూపం తెలుసుకోవాలంటే ఇవే శరణ్యం.

'చేటు కాల మత్ర శంకరుడ నీకు
ఆలిమీద పెండ్లి యెట్లాడినావు'

అని శంకరుణ్ణికూడా నిలదీసి ప్రశ్నించడంలో జానపదుల అమాయకత్వం ప్రస్ఫుటంగా తెలుస్తుంది. 'సూసీసూసీ కళ్ళు కాసినై కాయాలు' అంటేనే జానపదులకు తృప్తి. 'కలిగిన కంట్లో కాటుక బెడితే నా కన్ను మెరమెర లాడె దొయ్యో కొయ్యోడ' అంటారు జానపదులొక గేయంలో. జానపదుల శైలిలో ధ్వన్యనుకరణ లెన్నో చోటు చేసుకుంటాయి. చెప్పాల్సిన విషయాన్ని స్పష్టం చెయ్యాలను కున్నప్పుడు, చెప్పేదాన్ని ఆలంకారికంగా చెప్పామనే స్పృహ కలిగినప్పుడు ఇలాంటి శైలి తనంత తానే అలవడుతుంది.

పులపుల వానొచ్చె పులు మొగ్గ దొడిగె
రవరవ గాలిసరె రాలె మల్లెల్లు
ప్రకృతిలోని ఒక వింత సోయగాన్ని సొగసుగా చెప్పాడు జానపదుడు.

కొన్ని గేయాలు సామెతలు, పలుకు బళ్ళతోనే నిండి ఉంటాయి. ఇవి అనుభవజ్ఞుల మాటలు. వీటిలో కల్పనకంటె అనుభవాలు, భావాలు సూటిగా హృదయాన్ని తాకేలా ఉంటాయి.

'కానివారితోను కావించు చెలిమి
కట్టె విరిచీ పొయిని పెట్టి నట్లుండు
అయినవారీతో కావించు చెలిమి
ఆకుమడచీ మడత పెట్టినట్లుండు
కానివారీమాట కంట్లోది నలుసు
ప్రాణం పోయిందాక పక్కలో పోటు
అయినవారీ మాట అమృతంపు తేట
బ్రతికి ఉన్నందాక భాగ్యంపుమూట....'

అలంకారాలు : 'కావ్యశోభాకరాన్ ధర్మాన్ అలంకారాన్ ప్రచక్ష్యతే' (దండి-కావ్యాదర్శము). ఉపమాలంకారమే సర్వాలంకారాలకు బీజమైనా కావ్యశోభకోసమని అలంకారాల సంఖ్యను కవులు పెంచుకుంటూ వచ్చారు. జానపదులకు అన్ని ప్రభేదాలు తెలియనూ తెలియవు; వారి రచనల్లో అవి కనిపించనూ కనిపించవు. ఉపమ, రూపకం, దృష్టాంతం, కొన్ని శబ్దాలంకారాలు జానపదులకు నచ్చినవి. స్వభావోక్తి అన్నిటికంటె వారు మెచ్చిన అలంకారమేమో ! 'అందమగు స్త్రీకి నొసట తిలకమువలె, కొప్పులో నొక బంతిపూవు వలె, ముక్కునకు ముక్కరవలె, చెవులకు పోగులవలె నీ సహజాలంకారములు జానపద గేయ సాహిత్యమునకు శోభను గూర్చునట్టివి. ముత్యాల కంఠసరులు, కేయూరములవంటి భూషణములు జానపదుల కుండనటులే వారి భాషయందు, గేయము లందును అపురూపములగు నలంకారము లుండవు" (బి. రామరాజు 1958 : 67?)

అలంకారాలనే పదంగాని, దాని లాక్షణి కార్థం గాని తెలియని జానపదులు అత్యంత సహజంగా వాటిని వాడేస్తుంటారు.

చుక్కల్లో చంద్రుడమ్మ మా పెండ్లి కొడుకూ
చుప్పనాతి దానివమ్మ పెండ్లి కూతుర

చంద్రుడు శిష్టులకు, జానపదులకు—ఇద్దరికీ ఇష్టమైన వాడే. అయితే చుక్కల్లో చంద్రుడనే సహజ కల్పన జానపదులది. వేరే పెళ్ళి కొడుకులు చుక్కల్లాంటి వారుకాగా 'మా' పెళ్ళికొడుకు చంద్రుడనడం పత్యేకతను తెలుపుతుంది.

ఒక జానపద స్త్రీ అన్న ఉరుకులతో, పరుగులతో గుర్రం మీద వచ్చాడు. అతనికి చెమట పట్టింది. చెమట ముత్యంలా కనిపించింది. ఎద మీద పతకాలు పడగల్లా కనిపించాయి.

ముక్కునా సెమటలూ ముత్యమై మెరిసే
యెదమీద పదకమూ అద్దమై మెరిసే
బంగారు జులపాలు పాము పడగల్లు
చేరెడు కన్నుల్లు చింత నిప్పుల్లు

కొన్నికొన్ని ఉపమలు జానపదులకు మాత్రమే తట్టేవి. వారిది పుస్తక పాండిత్యం కాదు. అందువల్ల బహుశా స్వతంత్రంగా కొత్తకొత్త ఉపమల్ని సృష్టించే శక్తి వారికి అబ్బి వుంటుంది. 'పచ్చి కొబ్బరి వాలె పాయామున్నది సామీ', 'చెరకు తుంటల వాలె చేతులున్నవి సామీ'వంటి పోలికలు అలాంటివి.

కొన్ని గేయాల్లో శబ్దాలంకారాలు కూడా చోటు చేసుకొని వుంటాయి. ముఖ్యంగా బాలగేయాల్లో శబ్దాలంకారాలు నిండుగా ఉంటాయి. పిల్లలు గుర్తు పెట్టుకోవాలంటే ప్రాసలు తప్పక ఉండాలి. అప్పుడే అవి పసి పాపల నాలు కలపైన నాట్యం చేస్తుంటాయి. కొన్ని శిశుప్రాసల్లో ముక్తపదగ్రస్తాలున్నాయి.

| | |
|---|---|
| పిట్టమ్మ పిట్ట | హంస తెలుపు |
| ఏమి పిట్ట | ఏమి హంస |
| చిలక పిట్ట | రాజహంస |
| ఏమి చిలక | ఏమిరాజు |
| తెలుపు చిలక | మృగరాజు |
| ఏమి తెలుపు | ఏమి మృగము |
| | వన మృగము.... |

ఈ శిశుప్రాసలో నిజానికి గ్రస్తమయింది ముక్తపదం కాదు ; ముక్త పదానికి ముందు పదం. పిల్లల పాటల్లో అంత్య ప్రాసలు కూడా ఎక్కువగానే ఉంటాయి. గేయం పిల్లల మనస్సులో స్థిరంగా ఉండడానికి ఈ అంత్యప్రాసలు దోహదం చేస్తాయి.

సీళ్ళకు బోరా తిమ్మ
నిద్దరొస్తాదమ్మ
కట్టేలు తేర తిమ్మ
కడుపు నస్తాదమ్మ
నట్టుకు బోర తిమ్మ
నడుము నస్తాదమ్మ

అధ్యయనం :

జానపద భాష అనే పేరుతో కాకున్నా, తెలుగు లోని వివిధ భాషా రూపాలను గురించిన అధ్యయనం బాగా సాగిందనే చెప్పాలి· ఆధునిక భాషా శాస్త్రంలో లోతైన పునాదులు తవ్వి శాస్త్రీయ సౌధ నిర్మాణం ప్రారంభించిన భద్రిరాజు కృష్ణమూర్తి వంటి వారి దృష్టికూడా సామాన్య జనుల భాషమీద పడడం వల్ల మేలే జరిగింది. మాండలిక వృత్తి పద కోశాల నిర్మాణానికి మంచి వరవడి నేర్పరచి తెలుగుకు కీర్తి తెచ్చారు డా. భ. కృష్ణమూర్తి. మాండలిక వృత్తి పదకోశాలను తయారు చేసే భారాన్ని వివిధ విద్వాంసులకు అప్పగించి, అపూర్వ రీతిలో వాటిని తయారు చేయించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య

అకాదమీ వారు ప్రశంస నీయులు. వృత్తి పద కోశాలనే కాక, మాండలిక పదకోశంకూడా తయారు చేయించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ వారు గొప్ప పథకానికి అంకురార్పణ చేశారు.

తెలుగు అకాడెమీ వారు కూడా గుంటూరు మాండలికం వంటి ప్రాదేశిక భాషా స్వరూపానికి సంబంధించిన పుస్తకాలను ప్రచురించి ఈ క్షేత్రంలో కొంత కృషి జరిపారు జానపద భాష విషయంలో ఎక్కువగా కృషి సల్పిన వారిలో డా. టి. దొణప్పగారిని మొదట చెప్పుకోవాలి. రాయలసీమ, తీరాంధ్రాల భాషాభేదాల నికట పరిచయమూ, అన్ని మాండలికాల స్వరూప స్వభావాల నిర్ణయాధికారమూగల ఉత్తమ పండితులైన శ్రీదొణప్ప విలువైన అనేక వ్యాసాలను ప్రచురించారు. జానపద భాషాస్వరూపాన్ని తెలుసుకోడానికి వారి 'భాషా చారిత్రక వ్యాసావళి', 'తెలుగులో కొత్త వెలుగులు' ఎంతో ఉపకరిస్తాయి. భద్రిరాజు కృష్ణమూర్తి గారు సంపాదకులుగా ఆంధ్రప్రదేశ్‌సాహిత్య అకాడెమీ వెలువరించిన 'తెలుగుభాషా చరిత్ర'లో (2వ ముద్రణ 1979) వివిధ విద్వాంసులు వ్రాసిన విలువైన వ్యాసాలున్నాయి. డా. బి. రామరాజు తమ పరిశోధన గ్రంథం (1958)లో జానపద కవిత్వంలోని భాషను గురించి చర్చించడమే కాక వివేచన (పరిశోధన పత్రిక 1976)లో మంచి వ్యాసం వ్రాశారు. డా. నాయని కృష్ణకుమారి, డా. టి. వి. సుబ్బారావు మొదలైన పరిశోధకులు తమతమ పరిశోధన గ్రంథాలలో జానపద భాషను గురించి చర్చించారు. డా. నాయని కోటీశ్వరి ముద్రిత జానపద గేయాలలో నిఘంటువుల కెక్కని పదాలను గురించి పరిశోధన చేసి పిహెచ్.డి. పట్టాన్ని పొందారు.

టిప్పణి :

1. Mario A. Pei, Dictionary of Liguistics, P. 44.

2. క॥ పావకునకు నభిమంత్రిత

మై వేల్వంగఁబడిన హవ్యమధిక....(హరివంశము. పు. 8–93)

ఓ॥ కావున నిత్తను వనలము

లో వేల్చెద ననియు విని యులూచి వలికె.... (జైమిని భారతము 9-66)

3. " This process, which is the result of applying false logic to puzzling linguistic situations, has contributed greatly to the vocabulary of the Engish language, having given us, among thousunds of others, such disparate words as bridegroom, hiccongh, and sparrow grass,'–w, Edson Richmond, *Folklore and folklife,* Richard M. Dorson (Ed.) 1972, P. 154.



# సాంఘికాచారాలు

ఆంధ్రుల జానపద విజ్ఞానంలో ఇంతవరకు పరిశీలించినవి మౌఖిక శాఖకు చెందినవి. మౌఖికేతర జానపదవిజ్ఞానంలో మొదట చెప్పుకోదగినవి సాంఘికాచారాలు. జానపద కవిత్వం, గద్యకథనాలు, సామెతలు, పొడుపు కథలు, భాష శబ్దసంబంధమైనవి. అందుకే భాష తప్పించి మిగిలిన వాటిని కొందరు శాబ్దిక కళలన్నారు; మరి కొందరు జానపద సాహిత్యం అన్నారు. భాషతో కూడా సాహిత్య ప్రక్రియలను చేర్చితే మౌఖిక జానపద విజ్ఞానమనే పేరును వాడవచ్చు. మౌఖికేతర ప్రక్రియల్లో కళాత్మకమైనవాటిని కళల క్రింద చేరిస్తే ఇక మిగిలేవి సాంఘికాచారాలు, వస్తు సంస్కృతి.

మౌఖిక జానపద విజ్ఞానానికి వస్తు సంస్కృతికి నడుమ వారధిలాగా సాంఘికాచారాలున్నాయి. వీటిలో కొన్ని మౌఖికప్రక్రియల సహాయాన్ని, మరికొన్ని వస్తు సంస్కృతిని అపేక్షిస్తాయి. దీనిని ఈ క్రింది విధంగా సూచించవచ్చు.

మంత్రాలు, స్తుతులు
ఆటల్లో పాటలు,
వినోదగీతాలు
వేడుకలు మొ॥వి



మౌఖిక జానపద విజ్ఞానం

పూజావిధానాలు, ధార్మిక
కర్మకాండలు, ఆటల
వస్తువులు, వైద్యవస్తువులు
మొ॥వి



వస్తు సంస్కృతి

అయితే మొత్తంమీద సాంఘికాచారాలు మానవుని సామూహిక జీవనానికి సంబంధించినవి. ఇవి కొన్ని శాబ్దికకళల సహాయాన్ని అపేక్షిస్తాయన్నది నిజమేగాని వీటిలో ముఖ్యమైంది తరతరాల ఆచారమేగాని భాష, వస్తువు కావు. సాంఘిక జీవితంలో మానవునికి ఒక తరంనుంచి మరోతరానికి

సంక్రమించే ఆచారాలలో ఎన్నో విధానాలున్నాయి. ఇవి వ్యక్తిగతమైన కౌశలంకంటె ఒక సంఘం ఆశయాలను ప్రతిబింబిస్తాయి.

సాంఘికాచారాల శీర్షికక్రింద ఈ క్రింది వాటిని పరిశీలించవచ్చు.

సాం — పుట్టుక, పెళ్ళి, మరణం మొ॥వాటికి సంబంధించిన ఆచారాలు
ఘి — జానపదుల నమ్మకాలు
కా — జానపదుల మతం, దేవతాగణం
చా — నోములు, వ్రతాలు, జాతరలు, పండగలు
రా — ఆటలు, వినోదాలు
లు — జానపద వైద్యం

మనిషి జీవితచక్రంలో కొన్ని ముఖ్యమైన సంఘటనలున్నాయి. అన్నిటికంటె ముఖ్యమైంది పుట్టుకే. మనిషి సాంఘికంగా అనుసరించే ఆచారాలు పుట్టుకతోనే ప్రారంభమవుతాయి. జీవితంలో ముఖ్యమైన సంఘటనల్లో పుట్టుక తర్వాత మరణాన్నే చెప్పుకోవాలి. ఈ మధ్యలో ఎన్ని ఆటలైనా ఆడవచ్చు. మరణానికి సంబంధించిన నమ్మకాలు, ఆచారాలు, కర్మకాండలు ప్రతిసంఘంలోను ఏదోరూపంలో ఉండనే ఉంటాయి. ఈ మధ్యలో జరిగితే పెళ్ళి ముఖ్యమైన సంఘటన. మనిషి మనుగడకు, వంశాభివృద్ధికి ప్రేమాభిమానాల వ్యక్తీకరణకు ఏర్పరచుకొన్న ఒక వ్యవస్థ వివాహం. ఇదికాక మధ్యమధ్య ఉపనయనం, సమర్త మొదలైనవాటికి సంబంధించిన ఆచారాలు. సంప్రదాయాలు ఉన్నాయి. ఇవన్నీ కూడా ఒక విధంగా నమ్మకాలకు సంబంధించినవే. అయినా కొన్ని ప్రత్యేక సందర్భాలకు సంబంధించినవి కావటంచేత విశేష ప్రాధాన్యాన్ని ఇవ్వవలసి ఉంటుంది.

మానవ జీవితంలో నమ్మకాలకుండే పాత్ర చాలా గొప్పది. నమ్మకాల పుట్టుక మానవుని మస్తిష్కంలోనే. నమ్మకం అన్నది సంఘం నుంచి మనిషికి సంక్రమించేది. దయ్యాలుగాని, భూతాలుగాని, పిశాచగణాలుగాని సంఘం నుంచి మనిషికి సంక్రమించే వ్యాధులేగాని, అస్తిత్వం ఉండే శక్తులుకావు. ఇలా భయంతో కూడిన నమ్మకాలే చాలా వరకు మూఢనమ్మకాలనే (superstitions) అనే పేరుతో వ్యవహరింపబడుతున్నాయి. మామూలు నమ్మకాల వల్ల మనిషికి పెద్ద బాధలేదుగాని, మూఢనమ్మకాలు అతన్ని అన్నివిధాలా క్రుంగదీస్తాయి.

నమ్మకాలు ఒక మొత్తమై, కొన్ని నియమాలకు లోబడి మత వ్యవస్థను ఏర్పరుస్తాయి. జానపదులకు నిజానికి ఒక మతమంటూలేదు. సమాజంలోని నిమ్న స్థాయికి వెళ్ళేకొద్దీ మత వ్యవస్థలోని కఠిన నియమావళి, కర్మకాండలు కనిపించవు. గ్రామదేవతలు, ప్రకృతి దేవతలు, మాతృదేవతారాధనం మొదలైన స్థాయిలో జానపదుల మతం ఉంటుంది. మతానికి సంబంధించిన కొన్ని ఆచారాలు ప్రాథమిక స్థాయిలో మాత్రమే జానపద జీవితంలో దర్శనమిస్తాయి. ఆచారాలలో మంత్రతంత్రాలకు, పవిత్ర పద్ధతులకు స్థానం లభించే కొద్దీ అవి ధార్మిక కాండలుగా రూపుదిద్దుకుంటాయి.

జనం గుంపుగా ఆచరించే వాటిలో నోములు, వ్రతాలు, పండగలు, మొదలైనవి వస్తాయి. వ్రతాదులన్నీ ఎక్కువమంది పాల్గొనకపోతే వ్యర్థమవుతాయి. నోములు, వ్రతాలు, పండగలు గృహానికి సంబంధించినవే అయినా వాటిలో ఎక్కువమంది పాల్గొనడం జరుగుతుంది. కొన్ని పండగల్లో, జాతరల వంటి ఉత్సవాలలో తప్పక ఎక్కువ జనం పాల్గొంటారు. ఈ ఉత్సవాలలో సంగీతం, నృత్యం, ఊరేగింపు, రంగురంగుల దుస్తులు ఉంటాయి. వీటిలో కొన్ని ధార్మిక నేపథ్యంతో, మరికొన్ని లౌకిక దృష్టితో వెలువడ్డవి. ధార్మిక కర్మకాండలు లౌకిక స్థాయికి దిగి వ్రతాలు, నోములై, తర్వాత పండగలై చివరికి కేవలం వినోదాలుగా మిగలవచ్చు. మనిషి తన సంతోషాన్ని వ్యక్తం చెయ్యడానికి, సంతోషపడడానికి, ఇతరులతో పంచుకోడానికి వినోదాలను ఏర్పరచుకున్నాడు. ఇలాంటి వినోదాలు జానపదులకు చాలా ఉన్నాయి. వీటిలో కోలాటం, కోడి పందాల వంటివి కళాత్మక దృష్టిని కూడా అలవరచుకొని ప్రదర్శన కళల స్థాయికి ఎదిగాయి. కొన్ని కేవలం వినోదాలుగా మిగిలాయి. పిల్లల ఆటలు, పెద్దల ఆటలు జానపదుల వినోద సాధనాలే వీటిలో అన్నిట్లో అనేకులు పాల్గొంటారు.

జానపద వైద్యం కూడా సాంఘికాచారాలలో ఒకటి. వైద్యం వస్తు సంస్కృతిలో చేరుతుందని అనిపించవచ్చు. అయితే జానపద వైద్యానికి వస్తువులు ముఖ్యంకాదు. మందులు ముఖ్యంకాదు, నమ్మకంముఖ్యం. ఏ మందూ వాడకపోయినా నమ్మకం ఉంటే జానపదులకు రోగాలు నయమవుతాయి, లేదా అయినట్లు అనిపిస్తుంది. జానపద వైద్యంలో అనుసరించే పద్ధతులన్నీ శాస్త్రీయమైనవి కాదు. మంత్రతంత్రాలతో సహా నానా పద్ధతులెన్నో జానపద వైద్యంలో ఉన్నాయి. ఇవన్నీ సాంఘికాచారాలే.

# పుట్టిననాటినుంచి గిట్టేవరకు

'పుట్టిననాటి బుద్ధి పుడకలతోగాని పోద'ని సామెత. పుట్టిననాటి నుంచి సంఘం మనకు ఎన్నో ఆచారాలను నేర్పుతుంది. అవి మనిషి జీవితంతో పెన వేసుకు పోయి గిట్టేవరకు అలాగే వుంటాయి. మానవ జీవిత చక్రంలోని ముఖ్య ఘట్టాలలో మనం అనుసరించే ఆచారాలు నమ్మకాల పునాదిమీద లేచిన మేడలు.

## జననం

మనిషి జీవితంలో మొదటి ఘట్టమైన పుట్టుకకు సంబంధించిన ఆచారాలు ప్రతి సమాజంలోనూ కనిపిస్తాయి. మొదటి కాన్పు పుట్టింటిలోనే జరగాలనే ఆచారం తెలుగు వారిలోనేకాక అనేక సంఘాలలో కనిపిస్తుంది. పితృప్రధాన కుటుంబాలలోని ఈ ఆచారానికి కారణం లేక పోలేదు. వివాహానంతరం భర్త ఇంటికి వెళ్ళిన స్త్రీకి కొన్ని నెలల తర్వాత ఇంటిమీద — అంటే తనుపుట్టి పెరిగిన ఇంటిమీద - గాలి మళ్ళడం సహజమే. భర్త ఇంటికి వెళ్ళిన స్త్రీకి కొద్ది కాలానికేమైనా కడుపు పండితే స్త్రీకి పుట్టింటికి వెళ్ళాలనే కోరిక తీరు తుంది. ఏది ఏమైనా మొదటికాన్పు పుట్టింట్లో జరగాలనే ఆచారం వెనక సమం జసమైన కారణం కూడా కనిపిస్తుంది. స్త్రీకి మొదటికాన్పు ఒక కొత్త అనుభవం కాబట్టి మానసిక ఆందోళనకు గురికాకుండా ఉండాలంటే కని పెంచిన వారి సాన్నిధ్యం చాలా అవసరం. పుట్టి పెరిగిన పరిసరాలు ఇచ్చే నెమ్మది అవసరం.

జనన సంస్కారాలకు సంబంధించిన ఉల్లేఖనాలు మన ప్రాచీన కావ్యా లలో కూడా కనిపిస్తాయి. తరతరాలనుంచి మన సమాజంలో ఇవి చోటు చేసు కుని ఉన్నాయనడానికి ఇవన్నీ సాక్ష్యం ఇస్తాయి. స్త్రీ, జీవితంలో సంతానానికి చాలా ప్రాముఖ్యం ఉంది. ప్రపంచంలోని ఏ సంఘమయినా సరే సంతానం కోసం తపించే మాతృప్రవృత్తి ఉండనేఉంటుంది. సంతానార్థం చేసేపూజలు, వ్రతాలు మొదలైనవి జానపద, శిష్ట సాహిత్యాల్లో కోకొల్లలుగా ఉల్లేఖింప బడ్డాయి. "అతిథి సత్కారాలు, వాయసాలకు దధిబలి, జ్యేష్ఠాదేవిని కొలవడం, పుణ్యసంహితావ్రాతాన్ని కొలవడం, మూలికా మాణిక్యాలను ధరించడం,

తన్వంగి గంధాక్షతలను చిరంటుల కివ్వడం, విప్రపశ్నికల గారవించడం. కుమ్మరావం కడవలు కొల్ల విడవడం, బాలురకు తియ్యపండులు పంచి ఇవ్వడం, వ్రతాలు సలపడం" అలాంటివే (శివరాత్రి మాహాత్మ్యం 6—40).

స్త్రీలు గర్భవతులయినప్పుడు మూడు నెలల ముద్దలు పెట్టడం, అలరు కుడుములైదునెలల బెట్టడం. ఏడు నెలల ఎఱ్ఱపోలమ్మకు మొక్కడం కావ్యాలలో వర్ణించబడ్డాయి. శ్రీనాథుడు శివరాత్రి మాహాత్మ్యంలో (2—70,71) పురుడుపోసే విధానాన్ని వర్ణించాడు.

తలయంపి ధవళ నిద్రాకుంభ మిడువారు
రక్షాభసిత రేఖ వ్రాయువారు
గౌరసర్షపరాజికలయ జల్లెడివారు
బలివిధానంబుల బరగువారు
లవణంబునింబ పల్లవము ద్రిప్పెడువారు
ప్రేము మంచంబుతో పెనుచువారు
గవల ధూపంబు సంఘటియించు వారును
మంచి మట్టెడద యోజించువారు

కదసి దీవించు వారును గండతైల
మందుకొనువారు గాయంబులందువారు
పాడువారును పరిహాస మాడువారు
నైరి శుద్ధాంత సతుల రిష్టాలయమున.

ప్రాచీన కావ్యాలలో పుట్టుకకు సంబంధించిన ఆచారాలు కూడా వర్ణించబడ్డాయి. సింహాసన ద్వాత్రింశికలో ఈ క్రిందివర్ణన ఉంది(భా 1—ప్ర59,60).

క్రమమున దాదులక్కడను ముప్పటిలిన
జలకంబు దేర్చి యా చెలువసుతుని
కొనరగ కాటుకయును చుక్కబొట్టును
పాటించి యాగడపకు వెలుపట

పొదికిళ్ళ తపుడ నిప్పులు ప్రత్తిగింజలు
నిడియడ్డముగ చిట్టు పడిసిపైచి
వేపరెమ్మలు నీళ్ళ పెసలలోపల నించి
కాపులు పురిటింట గట్టిచేసి

వాయనముల కెల్ల వనితల రప్పించి
వారుదెచ్చినయవి వరుసనంది
పచ్చకప్పురంబు బలుకులు వెట్టి వి
డీయము లిచ్చిరింపు నయము గలుగ.

ఈనాడు వీటిల్లో చాలావరకు మరుగున పడిపోయాయి. అయినా స్థూలంగా స్త్రీ గర్భవతి అయినప్పటినుంచి ప్రసవించేవరకు అనుసరించాల్సిన ఆచారాలు ఇంకా మిగిలిఉన్నాయి. గర్భవతిని ఏడవనెలలో పుట్టింటికి పిలుచుకొనివస్తారు. సీమంతమన్నది గర్భవతిగా ఉన్నప్పుడు చేసే వేడుక, ఆచారం. ఆ గర్భిణీస్త్రీని చక్కగా అలంకరించి, ముత్తయిదువులచేత పసుపు కుంకుమలు, అక్షతలు ఇప్పించి ఆశీర్వదిస్తారు. గర్భిణికి ఇష్టమైన పదార్థాలన్నీ చేసి పెడ్తారు. ప్రసవమయిందంటే ఆయింటిలో పురుడని చెప్తారు. బిడ్డకు పదో రోజు వచ్చేవరకు ఈ పురుడు ఉంటుంది. మరణం ఎవరింట్లోనైనా సంభవిస్తే 'అంటు' అనే పేరుతో మైలగా భావించడం, జననకాలంలో కూడా అలాగే మైలగా భావించడం చూస్తే పుట్టుకను, మరణాన్ని మనవారు జీవితంలోని రెండు అతి ముఖ్య ఘట్టాలుగా ఎలా భావించిందీ తెలుస్తుంది.

బిడ్డ జన్మించిన తర్వాత జాతకకర్మ ముఖ్యమైంది. ఊరి పురోహితునికి బిడ్డ జన్మదినం, సమయంచెప్పి జాతకం వ్రాసి ఇవ్వాల్సిందిగా చెప్తారు. బిడ్డ పుట్టిన తిథి, నక్షత్రాలను శుభాశుభాలను పురోహితుడునిర్ణయిస్తాడు మూలా నక్షత్రం వంటివి మేనత్తకు అశుభమని, మరో నక్షత్రం మరొకరికి అశుభమని శాంతిచేయించడం ఈనాటికీ ఉంది. ప్రసవమైన పదకొండోరోజు సామాన్యంగా నామకరణం జరుపుతారు. బిడ్డను తొట్లలోవెయ్యడంకూడా జరుగుతుంది. ఉయ్యాలలో బిడ్డను పడుకోబెట్టి ఉయ్యాలపాటలను పాడే సంప్రదాయం ఉంది. నామకరణం చేసి బిడ్డచెవిలో పేరుచెప్పి లోకానికి అప్పజెప్తారు.

పైన చెప్పినలాంటి ఆచారాలు తెలుగువారి ఇండ్లలోనే కాక ప్రపంచ మంతటా అనేక జాతుల్లో కనిపిస్తాయి. కన్నడిగుల ఇళ్ళలో ఆచరించే సంప్రదాయాలు చాలావరకు తెలుగు వారిళ్ళలో ఆచరించేవే.

గర్భంగురించి విచిత్రమైన నమ్మకాలన్నీ ఆదిమజాతుల్లో ఉన్నాయి. సుఖప్రసవానికి మంత్రతంత్రాలను ఉపయోగించడం వారిలో కనిపిస్తుంది. కొన్ని ఆచారాలైతే చాలా తమాషాగా ఉంటాయి. కొందరిలో ప్రసవం కాగానే స్త్రీ మామూలు కార్యకలాపాలను కొనసాగిస్తుంది. కాని భర్త మంచమెక్కుతాడు. అతను మంచంలో ఉన్నప్పుడు చెయ్యకూడని నిషేధాలు ఎన్నో విధిస్తారు. హోపి ఆదివాసుల్లో నామకరణం ఇరవయ్యోరోజు జరుగుతుంది. షోషోన్ తెగల్లో నలభై రోజులు తల్లిని బిడ్డను దూరంగా ఉంచి ఆ తర్వాత నామకరణం జరుపుతారు. ఓమహా ఇండియన్లలో ఎనిమిదవరోజే బిడ్డను, తల్లిని అందరికీ పరిచయంచేసి, నామకరణంచేస్తారు. ఇది విశ్వావ్యాంతం ఉండే ఆచారం. నామకరణంతో వ్యక్తిత్వం వచ్చినట్లులెక్క. పేరు పెట్టగానే బిడ్డకొక సాంఘిక పరమైన హోదా లభిస్తుంది. పేరు ప్రతిష్ఠ లార్జించడానికి అసలు పేరు అవసరం.

పెద్దమనిషి

మగవాడికి నూనూగుమీసాల నూత్నయౌవనం వస్తే పెద్దమనిషి అయినట్లులెక్క. అయితే స్త్రీ విషయం అలా కాదు, అమ్మాయి పెద్దమనిషి అయిందంటే అది స్త్రీ విషయంలో పెద్దవిషయంగానే లెక్క. సమర్తకు సంబంధించిన ఆచారాలుకూడా ప్రపంచమంతటా కనిపిస్తాయి. ఋతుమతి కావడం ఎవ్వరిచేతిలోనూ ఉండేది కాకున్నా, ఒక్కొక్కవారం సమర్త అయితే ఒక్కొక్క ఫలమని మనవారు నిర్ణయించి పెట్టారు.

ఆదివారమునాడు అతిరోగియౌను
సోమవారమునాడు సుదతి పతివ్రత
మంగళవారము నాడు మతిమంతురాలు
బుధవారమునాడు బుద్ధిమతియౌను

అనుకోడంకద్దు. అయితే నేడు చాలావరకు వివాహం వేడుకగా తయారైంది వివాహానికి సంబంధించిన ప్రస్తావనలు, వివరాలుమన సాహిత్యం ప్రారంభమయి. నాటినుంచీ ఉన్నాయి. వివాహ సంబంధమైన ఆచారాలు ఒక్కొక్క ప్రాంతానికి, కులానికి, కాలానికి మారుతూఉంటాయి. తెలుగువారిలో పెళ్ళిళ్ళు నాలుగు రోజులు జరుగుతుండేవి. ఉత్తరపెళ్ళి జరిగిన తరువాత 'దినచతుష్టయానంతరమున' బంధువులు వెళ్ళినట్లుగా సంస్కృతమూలంలో లేనిదాన్ని తిక్కన వర్ణించాడు (ఉద్యోగ 1-2). మేనమరదల్ని పెళ్ళాడే ఆచారం తెలుగు వారిలో మొదటినుంచి ఉంది. మేనగోడల్ని పెళ్ళాడే ఆచారం కూడా కొంతకు కొంత కనిపిస్తుంది.

వివాహంముందు నిశ్చితార్థం ఒకఆచారం. వధువును పెద్దలు చూడడం, పెళ్ళి నిశ్చయించడం, నిశ్చయతాంబూలాలు పుచ్చుకోవడం ఆచారం. నిశ్చితార్థకాలంలో కన్యకకు 'ముద్రారోహణం' చేయడం (తలపైపేలాలుంచడం) ఆ కాలంలో తెలుగువారి ఆచారం.

వివాహానికి సంబంధించిన అవైదిక దాక్షిణాత్యాచారాలను సోమేశ్వరదేవుడనే పశ్చిమ చాళుక్యరాజు (క్రీ. శ. 1130) 'అభిలషితార్థ చింతామణి' అనే సంస్కృత గ్రంథంలో వర్ణించాడు. ఈ రాజు కర్ణాటకుడైనా అతను వర్ణించిన ఆచారాలు తెలుగు నాటకూడా ఉన్నాయి. వివాహ మంటపాన్ని తోరణాలతో, పుష్పాలతో అలంకరించాలని, వివాహవేదికపైన బియ్యం పొయ్యాలని, వధూవరులను కూర్చోబెట్టి ఇద్దరి చేతుల్లో జీలకర్రతో కూడిన బియ్యాన్నుంచాలని, వివాహ విధానం ముగియగానే వధూవరులు పరస్పర మాజీరికాయుక్త తండులములను చల్లుకోవాలని, వివాహోత్సవాన్ని నాలుగు దినాలు చెయ్యాలని, నాలుగోదినం వధూవరులను ఊరేగించాలని సోమేశ్వరదేవుడు వ్రాశాడు.

వివాహాచారాలు ఒక్కొక్క కులంలో ఒక్కొక్క రకంగా ఉంటాయి. తాళిబొట్టు. తాటికమ్మలు ద్రావిడాచారాలని కొందరి అభిప్రాయం. అయితే ప్రాచీన కాలపు తెలుగు గ్రంథాలలో తాళిబొట్టును గురించిలేదు.

తెలుగునాటి వివాహాచారాలన్నిటినీ వివరించాలంటే అదే ఒక పెద్దగ్రంథ మవుతుంది. మచ్చుకు తెలంగాణా ప్రాంతంలో వివాహాచారాలను, దక్షిణ ప్రాంతంలో వివాహాచారాలను కొన్నింటిని పేర్కొనవచ్చు. తెలంగాణా ప్రాంతంలో పెళ్ళిపనులు కట్నములతో ప్రారంభమై అప్పగింతలతో పూర్తి అవుతాయి. కట్నాలపాటలు త్రిశ్రగతిలో ఉంటాయి.

సువ్వీ సువ్వీ రామచంద్ర సువ్వీ సువ్వీ కీర్తిసాంద్ర
సువ్వీసీతమ్మా మాకు శుభములిమ్మా

అన్న పాట అధిక ప్రచారంలో ఉంది. కొన్ని జానపద గేయాలలో వివాహ వర్ణన, వధూవరుల వర్ణన, వివాహమంటప వర్ణన మొదలైనవి కనిపిస్తాయి. 'అత్తరులోన మేలిమత్తరులోన అంబరుగూర్చి. క్రొత్తసంపంగితో గోవిందునకు' నలుగుపూసేపాటలు నలుగు సంప్రదాయాన్ని తెలుపుతాయి. అవిరేణులను పూజించే సంప్రదాయం బ్రాహ్మణేతరులలో కనిపిస్తుంది. లక్ష్మీపూజకే అవిరేణిపూజ అని పేరు. నాకబలి సమయంలో అవిరేణులను నాకబలిధాన్యానికి ఎదురుగా ఉంచుతారు. బ్రాహ్మణేతరులలో ప్రత్తివిత్తులు నాటే ఆచారంకూడా ఉంది. వధూవరులతో కూరాటి కుండలముందు ప్రత్తి విత్తులు నాటిస్తారు.

'పన్నెండు స్తంభాల పందిరి క్రిందా
ప్రత్తివిత్తులగుమ్మి మెత్తైనదీసి
గోవుపెండాదెచ్చి గోతెలగలిపి
ఆవుపెండాదెచ్చి అలుకైనా జల్లి
వెండిది తక్కెడ పైడిదీబాటు
జోకిరిఅన్నట్లు జోడుపందిట్ల
జోకిరీ అన్నట్లు జోడుతక్కెట్ల
నల్లని విత్తులు తెల్లబడరాకి.... .......

ఇలా సాగుతుంది పాట (బి. రామరాజు 1978:483)

నెల్లూరు జిల్లాలో పెళ్ళిళ్ళ స్వరూపం ఇంచుమించు ఈ క్రింది విధంగా ఉంటుంది:

మొదట పెళ్ళి చూపులు జరుగుతాయి. సామాన్యంగా ఈ తంతు ఆడ పిల్ల ఇంట్లో జరుగుతుంది. పెళ్ళి సంబంధాలలో కొన్ని ఆచారాలున్నాయి. మేనమామ మేనత్త బిడ్డలయితే జాతకాదులు చూడవలసిన అక్కరే లేదు. మేన గోడల్ని పెళ్ళి చేసుకొనే సంప్రదాయం బాల్యవివాహాల కాలంలో ఉండేది కాని ఇప్పుడు చాలా వరకు తగ్గిపోయింది. బంధువుల్లో పెళ్ళి సంబంధంచూసే టప్పుడు పిల్లనిచ్చి మళ్ళీ పిల్లను తీసుకోకూడదనే నియమాన్ని పాటిస్తారు.

దీన్ని కొండమార్పు అని పిలుస్తారు. పెళ్ళి చూపులకు వెళ్లినప్పుడు ఆడపెళ్ళివారింట్లో భోజనం చెయ్యకూడదనే నియమం ఉంది "కతికితే అతక ద"ని సామెత. నిశ్చితార్థం ప్రత్యేకంగా చేస్తే చేస్తారు, లేకుంటే వరపూజ సమయంలోనే అదీ అయించనిపిస్తారు.

వివాహకార్యంలో మొదట గణపతి పూజ జరుపుతారు. రేపు పెళ్ళి అనగా ఈ దినం సాయంత్రం ఏదైనా గుడిలో వరపూజ జరుపుతారు. ఇది సాయంత్రం జరుగుతుంది. దేవాలయం నుంచి రాగానే ఎదురు కోల జరుగు తుంది. ఒకవైపు నుంచి ఆడపెళ్ళివారు, మరోవైపు నుంచి మగపెళ్ళివారు, అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చి, చివరికి పూలమాలలు మార్చు కుంటారు వధూవరులు. తర్వాత ఊరేగింపు జరుగుతుంది. ఎదురుకోల, ఊరే గింపు పూర్తి అయిన తర్వాత బువ్వపు బంతి ఏర్పాటవుతుంది. మంగళారతు లతో, కుక్క మంగళాలతో, వియ్యాలవారి సరసాలతో పసందుగా ఉంటుంది బువ్వపుబంతి.

మరునటి రోజు పొద్దున స్నాతకవ్రతంతో ప్రారంభిస్తారు. నలుగు పాటలు పాడుతూ చక్కగా నలుగు పెట్టి స్నానాలు చేయిస్తారు. ముహూర్తం ముందు కాశీయాత్ర జరుగుతుంది. ముహూర్తంలో భాగంగా మధుపర్కం, మహాసంకల్పం, కన్యాదానం, నాతిచరామి, మాంగల్యపూజ, మాంగల్య ధారణం, తలంబ్రాలు, దీపాల పళ్లాలు పట్టడం, బ్రహ్మముళ్ళు, చదివింపులు

అనే శాస్త్రాలు జరుగుతాయి. తెలుగువారికి ఏవి ఉన్నా లేకున్నా తలంబ్రాలు చాలా ముఖ్యం.

మాంగల్య ధారణంతో ముఖ్యమైన తంతు ముగిసినట్లే. మధ్యాహ్నం ప్రధాన హోమం, ప్రవేశ హోమం, బావమరిది పేలాలు పెట్టడం, సప్తపది, గంధర్వ పూజ, స్థాలీపాకం జరిపిస్తారు. అర్ధరాత్రి శేషహోమం చేస్తారు. నాగవల్లి అనే పేరుతో కందిపప్పు, ఉప్పు, చక్కిలాలు, పాత్రలు పెట్టి పూజ చేస్తారు. నల్లపూసలను ధరించడం, నాగవల్లి పాటలు పాడడం చేస్తారు. పెళ్ళి నాడు రాత్రి హరి బూవం జరుగుతుంది. బువ్వపుబంతిలాగే సరస సల్లాపాలతో, వియ్యాల వారి పాటలతో హుషారుగా సాగే విందు ఇది. ఎంగిలి హారతులు పట్టి వియ్యాల వారి దగ్గర డబ్బులు వసూలు చేస్తారు. చివరి ఘట్టం అంపకాలు. ఎవరి కళ్ళల్లోనైనా కన్నీటిని తెప్పించే కరుణామయ సన్నివేశమిది. ఇప్పుడంతా రెండు దినాల పెళ్ళిళ్ళే కాబట్టి పైన చెప్పిన విధులన్నీ రెండు రోజుల్లో ముగిసిపోతాయి. ఈ దినం పొద్దున పెళ్ళి వారు విడిదింట్లో వచ్చి దిగితే, మరుసటి రోజు రాత్రికి ప్రయాణం కట్టవచ్చు.

ఇవన్నీ నాగరికత రుచి మరిగిన జనుల పెళ్ళి వరసలు. అయితే ఆంధ్ర దేశంలోనే తరతరాలుగా జీవనం సాగిస్తున్న యానాదులవంటి ఆదిమ జాతుల వారికి ఇలాంటి కట్టుబాట్లు అక్కరలేదు. అగ్నికార్యాలు, ముహూర్త నిర్ణయాలు, బంధువులకు ఆహ్వానాలు మొదలైనవేమీ అక్కరలేదు. యానాదుల పెళ్ళిళ్ళను యానాది రాఘవయ్య అని పేరు వహించిన మహనీయులు శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య ఇలా వర్ణించారు. (యానాది. 1974: 200)

యాన్దోళ్ళ పెళ్ళిళ్ళు, ఎంత మంచి పెళ్ళిళ్ళు  
బొట్టుతో పనిలేదు, బోనాలక్కర లేదు  
క్రొత్త చీర లొద్దు, అత్తపోర్లు వద్దు  
చుట్టాలు రావొద్దు, చూడనైనా వద్దు  
కలుసుకుంటే చాలు, మురుసుకుంటుండొచ్చు  
అల్లుళ్ళ పోరొద్దు, ఆస్తిపాస్తులు వద్దు

మేళతాళాలొద్దు, మంత్రతంత్రాలొద్దు
మంగమూరు దేముడికి మ్రొక్కుకుంటే చాలు
గోత్రాలు మాకేల గీత్రాలు మాకేల
నేత్రాలు ఒకటైతే సూత్రాలెందుకయ్యా
మంగళ సూత్రాలెందుకయ్యా
తినడానికి తిండిలేదు, కట్టడానికి బట్టలేదు
వండుకోను కుండలేదు, పండుకోను పంచలేదు
ఎందుకయ్య పెండ్లి ఎందుకయ్య మాకు

అయితే ఆదివాసులందరూ ఈ విధంగానే పెళ్ళిని సరళంగా ఆచరిస్తారని లేదు. అసలు చాలామంది ఆదివాసుల్లో మనకంటె ఎక్కువ కర్మకాండ ఉంది. ధార్మిక వ్యక్తుల పాత్ర ఆదివాసుల వివాహాలలో ఇంకా ఎక్కువగా కనిపిస్తుంది. పితృప్రధాన కుటుంబాలలో ఆడపడుచును అత్తవారింటికి పంపేటప్పుడు ఆవేదన అందరికీ సమానమే. హృదయాన్ని కదిలించే ఈ సన్నివేశాన్ని మన అప్పగింత పాటల్లోలాగే చిత్రించిన పిగ్మీ ఆదిమవాసుల పాట ఈ క్రిందిది. (C.M. Bowra 1962 : 176–177)

Slowly, slowly,
Child, counting your steps,
Go away, go away with tears,
With a large heart, with a weary heart,
Without turning your face,
From the house, from the village,
Where your eyes so gaily
Laughed at every corner.
Counting, counting your steps,
Today you go away,
With a large heart, with a weary heart,
Go away, go away below !

Counting, counting your steps,
With a large heart, with a weary heart,
Today you go away.
Keep on your heart
And guard well the flower
Of your mother's garden,
The flower which will say to you :
"I am still loved below !"
Keep on your heart
And guard well the flower
In memory for ever.
Counting, counting your steps,
Today you go away,
With a large heart, with a weary heart,
Go away, go away below !
With a large heart, with a weary heart,
Today you go away.

మరణం

జనన మరణాల మధ్య ఇంకా కొన్ని కర్మకాండలు ఉన్నాయి. ఆయా జాతులకు, భాషలకు, సంస్కృతులకు సంబంధించిన విశేష కర్మకాండలెన్ని ఉన్నా జననమరణాలనే రెండూ మాత్రం సర్వజన సామాన్యమైనవి; ప్రాణి సహజమైనవి.

కావ్యాలలో మరణం వర్ణితమైనా అపరకర్మలను గూర్చిన ఉల్లేఖనాలు తక్కువగానే కన్పిస్తాయి. మన కవులు 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని కావ్యాని' అని నమ్మినవారు కావడంచేత, మరణమన్నా అపర కర్మలన్నా భయమూ, ఏహ్యభావమూ ఉండడం వల్ల ఇలాంటివి కావ్యాలలో ఎక్కువగా చోటు చేసుకోలేదు.

విచారించిన వారు స్నానం చెయ్యాలి. చావును చూచినవారు, శవాన్ని మోసిన వారు, చివరికి చావును విన్నవారు కూడా తలకు స్నానం చెయ్యాలి.

మరణాన్ని చాలా గొప్ప సంఘటనగా భావించి, మంత్రతంత్రాలను, కర్మకాండలను విపరీతంగా ఆచరించే ఆదిమజాతులూ ఉన్నాయి. చాలా సరళమైన రీతిలో, అదీ అతి సహజమైన ఒక సంఘటనే అన్నట్లుగా ప్రవర్తించే వారూ ఉన్నారు. యానాదులు చావును గురించి ఏ విధమైన భావన కలిగివున్నారనేందుకు వెన్నెలకంటి రాఘవయ్య గారి వివరణ ఈ క్రింది విధంగా ఉంది (యానాది, 1974, పు. 198).

''మానవుడు మరణించిన పిదప ఏమవుతాడు అనే ప్రశ్న అతన్ని కలలో కూడ బాధించదు. బ్రతికియుండగా సుఖం అనుభవిస్తే కదా చచ్చిన పిదప వచ్చే కష్టాలను తలుచుకొని తారుమారు కావడానికి. అతని ప్రాణానికి చావుకు మధ్య ఉండేది పాడె పుల్లలు, మోసేవాండ్లు నోచుకోక శవానికి చుట్టు చుట్టిన చినిగి పోయిన ఈతాకుల చాపేకదా! యానాదుల మరణ సమీప కాలంలో బంధువులని, కొరివి పెట్టే వారసులని, స్నేహితులని, ఆత్మీయులనే వారు తరచుగా ఎవ్వరు ఉండరు. పొలాల కావిళ్ళలోని శవం అక్కడే శిథిలమయ్యే దృశ్యాలు లేకపోలేదు. బంధువులకు తంతులు పంపడం, ముందుగా జాబులు వ్రాయడం జరుగదు. త్రాగగలవాడు కర్మ చేస్తాడు. లేని వారికి అదికూడ ఉండదు. ఊపిరి పోయిన తరువాత చేయబడే కర్మలవల్ల వల్లెవేసే మంత్రాల వల్ల, అతని ఆత్మ ఒక్కొక్క అంతస్థు దాటి పైకి ఎక్కడికో పోతుందనే నమ్మకం యానాదికి లేనేలేదు.''

అయితే చాలా వరకు ఆదివాసుల్లో చావు తర్వాత ఏదో అవుతుందనే భావన మాత్రం తప్పకుండా ఉంటుంది. అపర కర్మలన్నవి ఏదో ఒక విధంగా జానపదుల జీవితంలో చోటు చేసుకున్నవి. వాటివల్ల ఏమిటి ప్రయోజనం అని తార్కికంగా ప్రశ్నిస్తే ఏమీలేదనే సమాధానం. అయితే జానపదుల దృష్టిలో వాటి ప్రయోజనమేమిటి అని ప్రశ్నించినప్పుడు ఈ క్రిందివి చెప్పుకో వచ్చు: (1) మరణించిన వారికి సంబంధించిన కర్మకాండల్లో పాల్గొనడం వల్ల బ్రతికున్నవారు మరణానికి తయారైనట్లవుతుంది. ఒక విధంగా చావుని గురించిన తాత్వికాలోచనకు ఇది దారితీస్తుంది. (2) కర్మకాండ దేహంనుంచి

ఆత్మను వేరుచేయడానికి తోడ్పడుతుంది. (3) కర్మకాండవల్ల ఒకమనిషి చని పోగా ఏర్పడిన దుఃఖభారాన్ని ఇతరులతో వంచుకోడానికి వీలవుతుంది. చని పోయిన వ్యక్తివల్ల నష్టపోయినవారు, ఆ ఖాళీని భర్తీచేయడానికి మార్గాలు వెతుక్కునేందుకు కర్మకాండలు సహాయంచేస్తాయి. (4) చనిపోయినవ్యక్తి ఆస్తిపాస్తులు వినిమయం అయేందుకు తోడ్పడుతాయి. (5) కర్మకాండల ఆచరణవల్ల జీవితానికి ఒక కొత్తమలుపు గాంభీర్యం వస్తాయి. (Hoebe!, Admson E.1958:382-383)

పైన పేర్కొన ఆచారాల వంటివాటిని ఊరక తెలుసుకుంటే ప్రయో జనంలేదు. వాటిలో ఒక్కొక్కదానికీ అర్థమేమిటనే విషయాన్ని వీలయినంత వరకు శోధించి సాధించాల్సిఉంటుంది. డా. నాయని కృష్ణకుమారిగారు చెప్పి నట్లు (1979:149) ఈ ఆచారాల వల్ల ప్రాచీన మానవ సంఘజీవన విధా నాన్ని రూపొందించవచ్చు. ముఖ్యమైన పై ఆచారాలుకాక మరికొన్ని ఆచా రాలను డా. నాయని కృష్ణకుమారి పట్టీ చేశారు (1979;149-150)

(1) ముడుపు కట్టడం: తలనీలాలివ్వడం

(2) దేవిముందు నిమ్మకాయ కోయడం, గృహప్రవేశసమయాన ఇంటివాకిట గుమ్మడికాయను పగలగొట్టడం.

(3) ప్రసూతిగృహమందు వాకిలికి చెప్పులు, ఉల్లిపాయలు, కలబందమట్టలు మొ॥ ఉంచడం.

(4) చిన్న పిల్లలకు తాయెతులు, రక్షరేఖలు కట్టడం, దిష్టితియ్యడం.

(5) వివాహసమయంలో పెండ్లికూతురి నడుముకు తాడు బిగించడం—గళసూత్ర ధారణ, క్రిష్టియనులలో వివాహచిహ్నంగా ఉంగరం ధరించడం, గాంధర్వ వివాహమైతే మాలికాధారణ.

(6) వ్యక్తిమరణించినప్పుడు ఖననం చేయవలసివస్తే, శవాన్ని బోర్లగిలవేసి మన్నుకప్పడం, ఇంట్లో మరణిస్తే ముహూర్తం మంచిది కానప్పుడు, గోడ పగులగొట్టి ఆ వివరం నుండి శవాన్ని తీసుకుపోవడం, ఇల్లుపాడు పెట్టడం, మూడవరోజున పాలుపోయడం; ఇంకా అప్పుడు పాటించే రకరకాల శ్రాద్ధక్రియలు.

(7) ఎన్నో శకునాలను పాటించడం. పాలపిట్ట పలికితే శుభం. పైడికంటి జంట కూస్తే శుభం. నక్క కుడినుండి యెడమకు పోతే శుభం. అందుకు వ్యతిరేకిస్తే అశుభం. పాముఅడ్డమైనా పిల్లిఎదురైనా అశుభం. బల్లి పలికితే శుభం. బల్లి శరీరాంగాలమీద పడితే ఎన్నో శుభాశుభాలు.

పైన డా కృష్ణకుమారిగారు పేర్కొన్నవాటిలో కొన్ని ఆచారాలు మరి కొన్ని నమ్మకాలు. ఇవి ఒక్కొక్కసారి పరస్పరం పూరకాలై ఉంటాయి. నమ్మకాలు, మతం, దేవతాగణాలు జానపదుల జీవితంలో ఎలా పెనవేసుకొని ఉంటాయో చూద్దాం.



# జానపదుల నమ్మకాలు

సమాజంనుంచి జానపదులకు సంక్రమించే సాంస్కృతికాంశాలలో నమ్మకాలనూ చేర్చుకోవాలి. ఆదిమమానవుని జీవితంనుంచి ఆధునిక జీవితం వరకు నమ్మకాలు ప్రధాన స్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. అవిద్యావంతులైన గ్రామీణుల సంగతి ఎలాఉన్నా ఉన్నత విద్యావంతులైన నాగరికులు కూడా మూఢనమ్మకాలవలలో తగుల్కొని బయట పడలేక సతమతమవుతుండడం ఒక ఆభాసమని చెప్పవచ్చు. ఒక్కొక్కసారి మూఢనమ్మకమని మనకు స్పష్టంగా తెలిసినా, దాని వలయం నుంచి బయట పడలేని మానసిక పరిస్థితి ఏర్పడడం కూడా అనుభవంలోని విషయమే.

నమ్మకాలు సాంఘికాచారాలలో ఒక భాగమే. సంఘం అన్నది లేక పోతే మూఢనమ్మకాలుండవు. అసలు ఈ నమ్మకమన్నది ఏమిటి, నమ్మకానికి మూఢనమ్మకానికి ఉండే భేదమేమిటి, నమ్మకాలుద్భవించేది ఎట్లా, నమ్మకా లలో ఎన్నిరకాలున్నాయి—ఇలాంటి విషయాలను పరిశీలించవలసి ఉంది. నమ్మకమన్నది ఒక ఉక్తిమీదగాని, వస్తువుమీదగాని, పరిస్థితిని గురించిగాని మనిషి సమ్మతిని వ్యక్తంచేసే మానసికస్థితి. పరంపరానుగతంగా తరతరాల నుంచి పునరావృత్తిని పొందుతూ సామూహికమైన సమ్మతిని పొందే మాన సిక స్థితిని నమ్మకమని చెప్పవచ్చు. అసంఖ్యాక మానవులు నమ్మకాలకు స్వాగతం చెప్పి, పెంచి పోషించి వాటికి దినదినానికి ప్రబలశక్తిని ప్రసాదిం చారు. జానపదుల ఆహ్వానం పొంది వచ్చిన నమ్మకాలు చివరికి వారి జీవి తాలనే అదుపుకు తెచ్చుకొని పెత్తనం చెలాయిస్తాయి. ఒక్కొక్కసారి భయాన్ని పుట్టించి, అకారణంగా సామాన్య మానవుని మనస్సును అల్ల కల్లోలం చేస్తాయి మూఢనమ్మకాలు. ఒక్కొక్కసారి ఉన్న భయాన్ని పోగొట్టి తనమీద తనకు విశ్వాసాన్ని కలిగిస్తాయి కొన్ని నమ్మకాలు. కాని జానపదుల నమ్మకాలు చాలావరకు మూఢనమ్మకాలు. వీటికి ఏవిధమైన వైజ్ఞానిక ఆధారమూ ఉండదు. సమాజంలోని వ్యక్తిని బలవంతాన తనవైపులాక్కుంటుంది మూఢవిశ్వాసం. మంత్రతంత్రాలలో, క్షుద్రశక్తులలో

నమ్మకం కలిగేట్లుగా చేయడమేకాక, మూఢవిశ్వాసాలు మనిషిని ఎప్పుడూ భయంతో ముంచెత్తుతుంటాయి. అయితే కొన్ని నమ్మకాలలో వైజ్ఞానిక సత్యాలుకూడా ఇమిడిఉంటాయి. పౌరాణిక విషయాలు, ఐతిహ్యాంశాలు, ప్రాచీన కథల్లోని కొన్ని అంశాలు నమ్మకాలలో ఉండవచ్చు. నమ్మకాలలో భావన, క్రియ అనే రెండు అంశాలుంటాయి పిల్లిఅడ్డంవచ్చిందంటే ఏమైనా కీడు సంభవించవచ్చనే భావన కలగడం నమ్మకంలోని ఒక ముఖమైతే, వెళ్ళకుండా వెనక్కి తిరిగిరావడం క్రియ. నమ్మకాలు మానవుని స్వభావంలోని వివిధ ముఖాలను చక్కగా చిత్రిస్తాయి. జానపదుల జీవితంలో ఇవి ఎంత వరకు పెనవేసుకొని పోయాయంటే, వాటిని అనుసరిస్తున్నామనే జ్ఞానంకూడా వారికుండదు.

నమ్మకాన్ని నిర్వచించిన కొందరు అది కొన్ని అనుభవాలకు ప్రతినిధి మాత్రమేకాని అభివ్యక్తికాదన్నారు. నమ్మకం ముఖ్యంగా మనస్తత్వానికి సంబంధించింది. మానవుని మనస్సు కష్టపరిహారంకోసం, సంతోష ప్రాప్తి కోసం సదా శ్రమిస్తూ ఉంటుంది. ఈవిధమైన ప్రవృత్తి అనేకవిధాల నమ్మకాలలో ముఖ్యంగా కనిపిస్తుంది. అందువల్ల నమ్మకం ఒక విధమైన మానసిక అనుభవమన్నా తప్పులేదు. అనుభవాలన్నీ సత్యమే కానక్కరలేదు; వాటిలో కొన్ని భ్రమలుకూడా కావచ్చు.

## పుట్టుక

జానపదుల నమ్మకాలు అత్యంత ప్రాచీనకాలంనుంచి. ఒక తరం నుంచి మరొక తరానికి సంక్రమిస్తూ వస్తున్నాయనడానికి ఏమాత్రం సందేహంలేదు. మానవుని పుట్టుకతోనే కొన్ని నమ్మకాలూ పుట్టాయేమో అనిపిస్తుంది. అయితే మానవుడు సంఘంగా ఏర్పడిన తర్వాతే నమ్మకాలకు బలం ఏర్పడింది. స్థిరత్వం కలిగింది. మానవుని భావనల వ్యక్తీకరణకు భాష ఏర్పడిన అనంతరం ఈ నమ్మకాలు ఒకమనిషి నుంచి మరొక మనిషికి సంక్రమించాయి. ప్రకృతి ఆధారంగా చుట్టుపట్ల తిరిగే పశుపక్ష్యాదుల స్వరూప స్వభావాల ఆధారంగా ఎన్నో నమ్మకాలు ఏర్పడ్డాయి. మెరుపు, ఉరుము, వాన, వరద లాంటివి నమ్మకాల ఉత్పత్తి కారణమయ్యాయి. అయితే రానురాను ఏ ఆధారమూలేని మూఢ విశ్వాసాలు కూడా ఉత్పత్తి అయ్యాయి. ప్రకృతి

లోని భయానకదృశ్యాలు, సంఘటనలు కూడా మానవుని మానసిక ఆందోళ నకు కారణమయ్యాయి. మానవాతీత శక్తులమీద విశ్వాసమూ ప్రారంభమై ఇంకా కొన్ని నమ్మకాలు పుట్టడానికి దారితీసింది.

నమ్మకాల పుట్టుకను గురించి పరిశీలించేటప్పుడు వేరే ప్రక్రియలో లాగానే అవి ఎప్పుడు పుట్టాయి, ఎక్కడ పుట్టాయి, ఎందుకు పుట్టాయి అనే ప్రశ్నలను వేసుకొని వాటికి సమాధానాలను ఆలోచించవలసి ఉంటుంది. మాన వుని పుట్టుకతో బాటే నమ్మకాల పుట్టుక కూడా సంభవించి ఉండవచ్చు ననుకుంటే తెలుగువారి నమ్మకాలుకూడా ఐతరేయబ్రాహ్మణమంత ప్రాచీనమైన వనే చెప్పవలసి ఉంటుంది. పోనీ, ఆంధ్రుల నమ్మకాలైనా అంత ప్రాచీన మని చెప్పవచ్చునేమో ! ఈ ఊహలెట్లున్నా తెలుగులో నన్నయ నాటినుంచి కావ్యాలలో, అంతకుముందే శాసనాలలో ఎన్నో రకాల నమ్మకాలు చోటు చేసుకున్నాయి నన్నయ పూర్వ శాసనాలలో కూడా ఏదైనా దానాన్ని పాడు చేసిన వాడు పంచమహాపాతకాలకు లోనవుతాడని, కాశిలో గోవునుచంపినపాపాన పోతాడని ఇంకా ఇలాంటి శాపనార్థాలతో నమ్మకాలను వ్యక్తం చేసిన సంద ర్భాలున్నాయి. ఇక భారతంనుంచి అన్నికావ్యాలలో ఏదోవిధమైన నమ్మకాలు వ్యక్తం చేయబడి ఉన్నాయి.

'గ్రువ్వ, గ్రద్ద, దివ్యారుపుఁ బ్రువ్వ, గూబ
యిల్లు సొచ్చిన శాంతి సేయింపవలయు'

అని తెలుగు భారతం అనుశాసనిక పర్వం (4-119)లో చెప్ప బడింది. మరులు, మందులు స్త్రీలు పెట్టి పురుషుల్ని వశం చేసుకుంటారనే నమ్మకం నాటికీ నేటికీ ఉంది. వీటివల్ల లాభం లేక పోగా నష్టం, ప్రాణహాని కలుగు తుందని ద్రౌపది సత్యభామతో అన్నట్లుగా తెలుగు భారతంలో చెప్పబడింది (అర, 5–296). రక్షకోసం తాయెతులు కట్టుకోడంకూడా చాలా శతాబ్దులుగా ఉంది. పల్నాటి వీరచరిత్రలోనే—

'మేనికి రక్షకై మించు తాయెతులు
దండ చేతులరెంట ధారణ చేసి' అని వుంది. తాయెతు తావీజ్ అనే అరబ్బీపదం. ఖురాన్ మంత్రాలను రాసి రక్షగా తురకలు కట్టుకుంటారు

(సురవరం ప్రతాపరెడ్డి, రెండవముద్రణ, 97). అయితే దీనికి జానపద నిరుక్తిని చెప్పాడు అప్పకవి. తాయి (తల్లి) శిశువుకు కట్టే ఎతు (రక్ష) అన్నాడు.

ముహూర్తాలు, శకునాలు తెలుగు కావ్యాలలో లెక్కకు మిక్కుటంగా వస్తాయి. గోధూళి లగ్నంలో పురం ప్రవేశించాలని, విశేషించి ఉషఃకాలం సర్వప్రయోజనారంభాలకు ప్రశస్తమైనదని చెప్పబడింది. శ్రీనాథుడు భీమేశ్వర పురాణంలో వ్రాసిన క్రింది పద్యం ప్రసిద్ధం,

'గార్గ్య సిద్ధాంత మత ముషఃకాలకలన
శకున మూనుట యది బృహస్పతి మతంబు
విప్రజన వాక్యమరయంగ విష్ణుమతము
సర్వ సిద్ధాంత మభిజిత్తు సమ్మత మగు'(ఆ.3-ప.41)

జానపద విజ్ఞానానికి గనిఅనదగిన క్రీడాభిరామంలో శకునాలనుగూర్చి, ముహూర్తాలనుగూర్చి కొన్ని పద్యాలలో ఉంది.

'చుక్క యొకింత నిక్కి బలసూదను దిక్కున రాయుచుండుటన్
జక్కగ వేగదిప్పుడు నిశాసమయంబిది ప్రస్ఫుటంబుగా
ఘుక్కని మాటిమాటికిని గోటడు పల్కెడు వామ దిక్కునన్
జొక్కటమై ఫలించు మన శోభన కార్యములెల్ల టిట్టిభా!'
'మాగిలి మాగిలి వృక్షము
పూగొమ్మన నుంచి షడ్జము ప్రకాశింపన్
లేగొరదమ నెమలి పల్కెడు
గేగోయని వైశ్యమునకు గెలుపగు జుమ్మా'
'కొనకొనంగోడి యేట్రింత కొంక నక్క
నమలి యీ నాలుగిటి దర్శనంబు లెస్స
వీని వల తీరు బలుకు నుర్వీ జనులకు
కొంగుబంగారమండ్రు శాకునిక వరులు'

క్రీడాభిరామకారుడు కొంగు బంగారమయ్యే మంచి శకునాలను పేర్కొన్నాడు. అయితే ఈనాడు పట్టణాలలో ఆ మంచి శకునాలొక్కటీ మానవులకు తగలవు. మంచి శకునాలు చేసేమంచికన్నా, అపశకునాలు చేసే కీడే ఎక్కువ. సింహాసన ద్వాత్రింశికలో అటువంటి అపశకునాల పట్టికే ఒకటి వుంది (భాగం 1 పుట 25).

"పిల్లులు పోరాడె, బల్లి యూరక త్రెళ్ళె
తమ్మళి పొడసూపె, తుమ్మిరెదుర
తొరగు పోయిన లేగ కొరలుచు నొక కుర్రి
పరతెంచె, క్రంపపై నరచె కాకి,
ఉలువ డొక్కడు నూనె తలతోడ నేతెంచె
మైల చీరల చాకి మ్రోల నెదిరె
కాకియును, గోరువంకయు, రెక్కల పోతు
నేటిరింతయు దాటె నెడమ దిశకు

బైట వెరవు దప్పు పాలగుమ్మయు పారె
ఒంటిపాట పైడి కంటి వీచె
ఎలుగు చేసె పెద్దపులుగు, పాముటుతోచె
దబ్బి బొబ్బలిడియె నుబ్బులడర"

సింహాసన ద్వాత్రింశికలోనే మరొక నమ్మకాన్ని గురించి ఉంది. పూడ్చిపెట్టిన ధనాన్ని భూమి నుంచి త్రవ్వితీసుకోడానికి ముందు దాని నావరించిన భూతాలను తృప్తిపరచాలని ఇప్పటికీ కొందరు నమ్ముతారు. "....ఎట్టి వారి సొమ్మో యిది పెద్దకాలమయ్యె పృథివి నణగి దీని వెడలదివియ బూనిన యప్పుడు భూతతృప్తి వలయు భూతలేంద్రా!"(భాగం 1—పు. 21)

పైవిధంగా నమ్మకాలు అన్నికాలాలలో ఉన్నా, అవి ఎక్కడ ఉద్భవించాయి అని చెప్పడం కష్టమవుతుంది. వీటిలో కొన్ని సార్వజనీనంగా ఉంటాయి. మరికొన్ని ప్రాదేశికంగా ఉంటాయి. కోట భద్రంగా ఉండాలన్నా ఇల్లు భద్రంగా ఉండాలన్నా పసిపిల్లల్ని బలి ఇస్తారనే నమ్మకం ప్రపంచ

మంతటా ఉంది. కొన్ని విశ్వాసాల విషయంలో మూలభావం ఒకటే అయినా ఆచరించే విధానాలలో వ్యత్యాసం ఉంటుంది. కొన్ని బలివిధానాలు ఇలాంటివే. మరికొన్ని నమ్మకాల విషయంలో పూర్తి భేదం ఉంటుంది. కోయిల మనకు మృదుమధురంగా పాడే మంచి పక్షిగా అనిపిస్తే పాశ్చాత్యుల పాలిటికి అది మోసంచేసే పక్షులకు సంకేతం. గుడ్లగూబ అన్ని విధాలా మనకు చెడ్డపక్షి అనిపిస్తే పాశ్చాత్యులకు వివేకవంతమైన పక్షి.

నమ్మకాల పుట్టుక ఏ విధంగా జరిగింది అన్నదాన్ని కొంతవరకు ఇంతకు ముందే చర్చించడమైంది. ప్రారంభకాలంలో నమ్మకాలు ప్రకృతి మూలకంగా ఉద్భవించాయి. ప్రకృతి శక్తులను ఆశ్చర్యంతో. భయంతో, సంతోషంతో వీక్షించిన మానవుడు ఎన్నోరకాల నమ్మకాలను ఏర్పరచుకున్నాడు. ఇవి ముందు వైయక్తికంగా ప్రారంభమయినా, రానురాను సామూహికాలై తర్వాత సమాజం నుంచే మానవునికి మళ్ళీ సంక్రమిస్తూ వచ్చాయి. మొదట మామూలు స్తుతులుగా శరణాగతి భావంతో వెలువడిన విశ్వాసాలు ఆ తర్వాత ఆచరణల రూపాన్ని దాల్చాయి. బలివిధానాలు, యజ్ఞ యాగాదులు ప్రబలాయి. ఇలా దినదినానికీ ఎన్నో కారణాల వల్ల విస్తరిస్తూ వచ్చిన విశ్వాస ప్రపంచాన్ని ఉత్పత్తి దృష్టితో మూడు మూలాల ద్వారా గుర్తించవచ్చు. మతీయమైన ఉత్పత్తి, సాంస్కృతిక సంబంధమైన పుట్టుక వైయక్తికమైన ఉత్పత్తి అన్నవే ఆ మూడు మూలాలు,

యజ్ఞయాగాదులు, జాతరలు, వ్రతాలు, నోములు, పూజలు మొదలైన మత సంబంధ కార్యకలాపాలు నమ్మకాలు ఉద్భవించడానికి కారణమవుతాయి. కొన్ని నమ్మకాలు సాంస్కృతిక కారణాల వల్ల ఉద్భవిస్తాయి. మాతృప్రవృత్తి అన్నది ప్రాణి సహజమైన గుణమే. కాని గొడ్రాలిని హీనంగా చూచేది మాత్రం సాంస్కృతిక కారణాలవల్ల. గొడ్రాలి ఆశీర్వాదం పొందరాదనే నమ్మకం సాంస్కృతికంగా వెలువడింది. పై కారణాల వల్లనే వ్యక్తిలో అనేక విధాల విశ్వాసాలు ఉద్భవిస్తాయి, అయితే ఒక్కొక్క సారి ఇలా సమాజం నుంచి సక్రమించిన విశ్వాసాలు కూడా వ్యక్తినుంచి వ్యక్తికి వేరవుతుంటాయి. ఏదైనా వారం మంచిదని మంచిది కాదని నమ్మకం సమాజంనుంచి వస్తుంది. వ్యక్తి దాన్ని ఏదో ఒకవారానికి పరిమితం చేసుకోవచ్చు. ఏదైనా సంఖ్య

అదృష్టాన్నిస్తుందనే నమ్మకం సామాన్యమైంది. వ్యక్తి దాన్ని ఏదో ఒక్క సంఖ్యకు పరిమితం చేసుకోవచ్చు.

పై మూడు కారణాల వల్లనే కాక నమ్మకాలు ఇంకా వేరు వేరు కారణాల వల్ల పుట్టవచ్చు. మనోదౌర్బల్యం ఉండేవాళ్ళు, భయగ్రస్తులు ఎన్నో విధాలైన మూఢ విశ్వాసాలకు బలి అవుతుంటారు. మహత్కార్య సాధనకు బయలుదేరినవ్యక్తి అపశకునమని వెనుదిరిగితే ఒక గొప్ప కార్యమే విఘ్నం కావచ్చు. రోగపీడితుడైన వ్యక్తి 'తూ తూ మంత్రం తుమ్మాకు మంత్రం' అని సరిపుచ్చితే ప్రాణానికే అపాయం కలగవచ్చు.

విభజన

నమ్మకాలలో ముఖ్యంగా వైజ్ఞానికమైనవి, అవైజ్ఞానికమైనవి అని రెండు స్థూల విభాగాలను కొందరు గుర్తించారు. కొన్ని నమ్మకాలలో సత్యాంశ ముంటుంది. తెలిసో తెలియకో ఒక్కొక్కసారి మంచి జరగడానికే విశ్వాసం పనికి వస్తుంది. వైద్యానికి సంబంధించిన అనేక విశ్వాసాలకు ఆధారం లేకపోయినా, అనుభవ గృహవైద్యమూ ఒక్కొక్కసారి మంచిదే అని చెప్పవచ్చు. అయితే ఇదే నమ్మకంతో అన్నిటికీ జానపద వైద్యాన్నే ఉపయోగిస్తే కీడుకూడా జరగవచ్చు. వాతావరణానికి సంబంధించిన కొన్ని నమ్మకాలు, పశుపక్ష్యాదుల స్వభావానికి సంబంధించిన కొన్ని నమ్మకాలు పరిశీలన వల్ల కలిగినవి. అందువల్ల వాటిలో సత్యాంశం ఉండేందుకు వీలుంది. ఒక్కొక్కసారి నమ్మకాలలో ఏవిధమైన వైజ్ఞానికాంశమూ లేకున్నా మానసిక శాంతి కలగవచ్చు. పాముమంత్రం వల్ల విషం దిగుతుందనుకోడం భ్రమ. పాము బాగా కరిస్తే మనిషి బ్రతకడం లెల్ల. అయితే పాము ఊరక తాకినా భయంవల్ల చనిపోయేవాళ్ళే చాలామంది ఉన్నారు. అటువంటి వారికి మంత్రంవల్ల ఉపయోగం కలగవచ్చు. ఇలాంటి నమ్మకాల వల్లే కొంతమంది వైద్యులు మందు అని రంగునీళ్లు ఇచ్చినా రోగం నయమయ్యే సందర్భాలనూ మనం చూస్తూ ఉంటాం.

నమ్మకాలను మరొక విధంగా కూడా విభజించవచ్చు. మానవాతీత శక్తులకు సంబంధించినవి, మానవ జీవితానికి సంబంధించినవి, పశుపక్ష్యాదులకు

సంబంధించినవి, ప్రకృతి లోని ఇతర వస్తువులకు సంబంధించినవి, కుటుంబ సంబంధములు, ప్రకీర్ణాలని విభజించవచ్చు. వైద్యానికి సంబంధించిన నమ్మకాలు, పౌరాణిక మూలం గల నమ్మకాలు, ఐతిహ్యాత్మక విశ్వాసాలు, నీతి సంబంధమైనవి కూడా ప్రత్యేకంగా పరిశీలించ దగ్గవి.

మానవా తీత శక్తుల వల్ల రోగాలు సంక్రమిస్తాయని నమ్మేవాళ్ళు ఇంకా ఉన్నారు. దెయ్యాలు, భూతాల వల్ల అనేక విధాల కష్టాలు సంభవిస్తాయని, వాటిని తప్పించుకోడానికి మనిషి ప్రయత్నాలు సాగించాడు. దయ్యాలను, భూతాలను పోగొట్టుకోడానికి తాయెతులు కట్టుకోడం, ఆంజనేయదండకం పఠించడం, భూతమాంత్రికుల సహాయాన్ని అర్థించడం చేస్తుంటారు. చెప్పులు చేతుల్లో ఉంటే దయ్యాలు దగ్గరికి రావని, దయ్యాలకు కాళ్ళు ఉండవని, ఉన్నా పాదాలు తిరగద్రిప్పి ఉంటాయని నమ్మకాలు. యజ్ఞయాగాదుల్లో, జాతరల్లో బలి ఇచ్చి దాని వల్ల రోగాలను పోగొట్టుకోవచ్చు ననే నమ్మకం వల్ల ఇంకా అనేక పరిణామాలు సంభవించాయి. దేవుడు, దేవతలు ఒంటిపైకి వచ్చి కోరికలు కోరడం ప్రారంభించారు. కోళ్ళు కావాలనో, గొర్రెలు కావాలనో, బర్రెలు కావాలనో పూజారుల ద్వారా, భక్తుల ద్వారా అడగడం ప్రారంభించారు. ఆదిమ మానవుని విషయం ఎట్లున్నా విద్యాసంస్కారా లలవడిన మనిషి కూడా మూఢనమ్మకాలను ఏవిధంగా ప్రోత్సాహిస్తాడన్నది ఆశ్చర్యకరమని చెప్తూ వేలాండ్ డి. హాండ్ అనేక ఉదాహరణల నిచ్చారు.[1] మానవాతీత శక్తులకు, మతీయ ఆచారాలకు దాసులై మూఢనమ్మకాలను ప్రచారం చేస్తూ, ఆచరిస్తూ ఉండే విద్యాధికులూ ఉన్నారనే విషయాన్ని ప్రస్తావిస్తూ మైసూరు విశ్వవిద్యాలయం మాజీకులపతి ప్రొ॥దే. జవరేగౌడఇలాఅంటారు : 'అష్టగ్రహకూటమి అమంగళ పరిహారార్థం మహానాయకులు మంత్రతంత్రాలు వగైరా మౌఢ్యాలను ప్రదర్శించే వారున్నారు. ఇప్పటికీ జందాలు ధరించేవారు, విభూతులు పెట్టుకునేవారు, పురోహితుల పాదాలు కడిగి ఆ నీళ్ళు తాగేవారు, గ్రహణ కాలంలో తప్పెటకొట్టి సూర్యుణ్ణి రాహువునుంచి తప్పించే ఆస్తికమహాశయులు, దేవుడికి ముడుపులు కట్టుకునేవారు, నోటికి తాళాలు వేసుకొనేవారు, పిల్లలకు మొక్కులర్పించేవారు. దేవుడికి తలనీలాలర్పించేవారు, సత్యనారాయణపూజలు నాగపూజలు చేసేవారు, తాగని నాగశిలకు పాలుపోసేవారు, గంగానదిలోని మురికినీటిని తీర్థమని తెచ్చేవారు. ఇంటి

చూరుకు బూడిదగుమ్మడికట్టేవారు, చింతచెట్టుమీద దయ్యాన్నిచూచేవారు, పెద్ద పదవికోసం చెయ్యిచూపించుకొనేవాళ్ళు, క్షౌరానికి తిథినక్షత్రాలు చూచేవారు, ఇలాంటి మూఢనమ్మకాలలో అంధాభిమానం కలవారు నూటికి తొంభై పాళ్లు దొరుకుతారు. (జానపద అధ్యయన. 310)

మానవాతీత శక్తులమీద నమ్మకాలతోబాటు మానవజీవితానికి సంబంధించిన నమ్మకాలూ కొన్ని ఉన్నాయి. పుట్టుక, పెళ్ళి, మరణం, స్వప్నం, కుటుంబం, బాంధవ్యం మొదలైనవి, మనిషి అలవాట్లకు అభిరుచులకు సంబంధించినవి ఇవి. మామూలుగా ఎలావున్నా పండగనాడు పిల్లలనుకొట్టకూడదని, తిట్టగూడదని చెప్పడం, విఘ్నేశ్వరుని పూజనాడుమాత్రం ఎంతమంచిపేత తిట్టించుకుంటే అంతమంచిదని చెప్పడం ఏవోకొన్ని కారణాలవల్ల కలిగే నమ్మకాలు. రాత్రిపూట సున్నం, మజ్జిగ మొదలైనవి ఇవ్వకూడదని చెప్పడం, ఉప్పుచేతికి ఇవ్వకూడదనడం ఒక రకమైనవి. మంగళవారం అశుభం అని చెప్పడం, శనివారంకొత్తగుడ్డలు ధరించరాదనడం, శుక్రవారం ఆడబడుచును ఇంటినుంచి పంపించకూడదనడం మరికొన్ని ఆచారాలు. ఆరువేళ్ళుఉంటే అదృష్టవంతులని, మెల్లకన్ను ఉంటే అదృష్టమని దైహికస్వరూపాన్నిబట్టిచెప్తే, కుడికన్ను కుడిభుజం అదిరితే మంచిదని చెప్పేవి చలనాన్ని గురించిన నమ్మకాలు.

పశుపక్ష్యాదులకు సంబంధించిన నమ్మకాలు వాటి చాతుర్యాన్ని తెలిపేవి కొన్ని. వాటి అరుపులద్వారా, కనిపించడంద్వారా మనిషికి కలిగే శుభాశుభాలను తెలిపేవి కొన్ని. పశుపక్ష్యాదులు తరతరాలనుంచి మానవునితో అవిభాజ్య సంబంధాన్ని కలిగివుండడమే ఇలాంటి నమ్మకాలు పుట్టడానికి కారణం. వీటిలో కొన్ని ప్రాణికోటితో మానవునికుండే మధుర బాంధవ్యాన్ని తెలిపేవైతే మరికొన్ని కేవలం అజ్ఞానంవల్ల ఉద్భవించిన మూఢనమ్మకాలు.

రాత్రిపూట కుక్క ఏడుస్తూఉంటే ఏదో అశుభం జరగవచ్చుననేనమ్మకం ఉంది. బల్లిపలికితే శుభం, దేహంమీద వేరువేరుచోట్ల పడితే శుభాశుభాలు కలుగుతాయని నమ్మకం— పిల్లిని చంపితే దానికి గుడికట్టించాలంటారు. గుడ్లగూబ ఇంటిమీద వాలితేఅశుభం. ఇలాగే పాములు, కాకులు, గద్దలు, నక్కలు, నెమళ్ళు, కోళ్లు, పశువులను గురించిన నమ్మకాలు వందలు, వేలు ఉన్నాయి.

ప్రకృతిలోని ఇతరవస్తువులను గురించిన నమ్మకాలూ కోకొల్లలు. అరటి చెట్టు గెలవేస్తే కలిగేఅశుభాలను గురించి, తులసిచెట్టు పవిత్రగుణంగురించి విశ్వాసాలున్నాయి. నువ్వులు, పత్తిమొదలైనవి ఊరకతీసుకొనరాదనే నమ్మకం వంటివి బహుశా అవి కొంత అపురూపమైనవో, లేక వాటిని పవిత్రకార్యాలకు వాడుతున్నాం కాబట్టి ఊరక తీసుకోరాదనిగాని ఉండవచ్చు.

పౌరాణిక కథలు, ఐతిహ్యాలు కూడా కొన్నిసార్లు నమ్మకాలు పుట్టడానికి కారణమవుతాయి. గర్భవతిని పుట్టింటికి పిలుచుకొని రావడానికి అన్నను పంపగూడదంటారు. దీనికి బహుశా పౌరాణికకథ కారణమయి వుండవచ్చు. శ్రీకృష్ణుడు సుభద్రను పిలుచుకొనివస్తూ ఒక చెట్టుకింద విశ్రమించాడట. సుభద్రకు పద్మవ్యూహాన్నిగురించి చెప్పగా అభిమన్యుడు విన్నాడు. అయితే కథను పూర్తిగావినకపోవడంవల్ల అభిమన్యుడికి పద్మవ్యూహంనుంచి బయటపడడం తెలియకపోయింది. బహుశా దీనికి మరొక కారణమూ ఉండవచ్చు. కంసుడు తన చెల్లెలు కడుపుపండి పుట్టిన బిడ్డలనందరినీ పొట్టనబెట్టుకున్నాడు కదా! అట్లే మేనమామలకు ఏ నిముషంలోనైనా, ఏగ్రహప్రభావంవల్లనో దుర్బుద్ధి పుట్టవచ్చుననే భీతిఉండవచ్చు.

కొన్ని నమ్మకాలు నీతిప్రధానమైనవి, కొన్ని కేవలం నీతులాలేక నమ్మకాలా అని వేర్పరచి చెప్పలేనట్లుగా ఉంటాయి. తిన్న ఇంటి వాసాలులెక్కబెట్టరాదనేది నమ్మకమనైనా చెప్పవచ్చు లేదా ఒకనీతిగానో, కేవలం ఒక ఆచారంగానో పరిగణింపవచ్చు. ఆకలి అయినవాడికి అన్నంపెట్టాలనేది నీతి అయితే అలా చేస్తే పుణ్యంవస్తుందన్నది నమ్మకమని చెప్పవచ్చు.

అధ్యయనం

జానపద విజ్ఞానంలో ఏ ప్రక్రియలో అధ్యయనం జరిగినా జరగకున్నా నమ్మకాలను గురించి మాత్రం ఆమూలాగ్ర పరిశీలన జరగాల్సిన అవసరం ఎంతయినా ఉంది. వేలాండ్ హాండ్ చెప్పినట్లు ప్రపంచంలోని మానవసమాజంలో అన్ని స్థాయిలలో మూఢనమ్మకాలను విద్యాభ్యాసంలో భాగంగా మనం బోధిస్తున్నాము. (Wayland D. Hand 'The fear of the Gods superstition and popular Belief' *American Folklore*

Ed:Tristram coffin p. 245). ప్రపంచంలోని మనుషుల్నివివేకవంతులు మూఢనమ్మకాలున్నవారని విభజించడానికి వీలులేదు. తక్కువ మూఢనమ్మకాలున్నవారు, ఎక్కువ ఉన్నవారని మాత్రం విభజించగలం. చాలా విద్యావంతులని, అన్నిరంగాలలో పురోభివృద్ధిని సాధించారని మనమనుకుంటున్న పాశ్చాత్యదేశాల ప్రజలలోకూడా ఎన్నో మూఢనమ్మకాలున్నాయి.[3] అందువల్ల ఈ నమ్మకాల కథాకమామిషు ఏమిటి, వాటివల్ల ఎంతవరకు లాభం కలుగుతున్నది, ఎంతనష్టం కలుగుతున్నది అని విశ్లేషించడం అవసరం. తెలుగులో ఈ క్షేత్రంలో జరిగిన పని శూన్యమనే చెప్పాలి. డా. జి. సమరంగారి కొన్ని పుస్తకాలు, గోరాగారి ఉత్తమ రచనలుకొన్ని, మూఢవిశ్వాసాలకు సంబంధించిన ఒకటి రెండు పుస్తకాలను తప్పిస్తే మరేమీరాలేదు. ఈ విషయంలో కూడా కన్నడిగులు చాలా ముందున్నారు. రాగౌ, ఎం.సి. వసంతకుమార్ ప్రచురించిన జనపద నంబికెగళు (1972), జి.వి. దాస్‌గౌడ ప్రచురించిన నమ్మ జనపద నంబికెగళు (1972), డి. కె. రాజేంద్రగారి నమ్మసుత్తిన నంబికెగళు (1973) మొదలైనవి పేర్కొవచ్చు. నాగార్జున విశ్వవిద్యాలయం ఈ విషయంలో ముందడుగు వేయడం ముదావహం.కుమారి సత్యభూషణరాణి అక్కడ జానపదుల నమ్మకాలను గురించి ఎం. ఫిల్. కోసం పరిశోధన చేస్తున్నారు. ఇలాంటి పరిశోధనలు ఇంకా విస్తృతంగా జరగాల్సిన ఆవశ్యకత ఉంది.

## తెలుగువారి నమ్మకాలు కొన్ని

### మానవాతీత శక్తులకు సంబంధించినవి:

1. దేవాలయం నుంచి రాగానే కాళ్ళుకడుక్కోకూడదు. దేవాలయానికి వెళ్ళి దేవుణ్ణి చూడగానే కొంచెంసేపు కూర్చోవాలి.
2. దేవాలయం కొలనులో నీళ్ళుఎట్లున్నా అసహ్యాపడకుండాస్నానంచెయ్యాలి.
3. దేవుడికి పూజచేసిన పూలను చీపురుతో చిమ్మకూడదు.
4. దేవుడి కోసం పెట్టిన పూలను వాసన చూడకూడదు.
5. డబ్బులు లక్ష్మీదేవితో సమానం, అందువల్ల కిందపడితే కళ్ళ కద్దుకొని తీసుకోవాలి.

6. పుస్తకాలు, కాయితాలు సరస్వతితో సమానం, అందువల్ల కాళ్ళతో తన్న కూడదు, వేసుకొని కూచోకూడదు.

7. కాళ్ళుపూర్తిగా కడుక్కోవాలి, మడమ దగ్గర ఖాళీవుంటే శని ప్రవేశిస్తాడు (పౌరాణికం).

8. దేవుడి కర్పించిన టెంకాయ చెడిపోతే అశుభం.

9. పసిపాపకు మొదట వచ్చిన తల నీలాలను దేవుడికే అర్పించాలి.

10. పిల్లలు మొదటిసారి గడపదాటితే, గడపకు పూజ చెయ్యాలి.

11. తీర్థయాత్రకు వెళ్ళినవాళ్ళు పన్నెండేళ్ళు రాకుంటే చనిపోయినట్లులెక్క. ఒకవేళ తిరిగివచ్చినా చనిపోయే వరకు చూచుకోకూడదు.

12. ఏదైనా ఆశతో చచ్చిపోతే దయ్యంగా మారుతాడు.

13. బాలింతరాలు చచ్చిపోతే తప్పక దయ్యమవుతుంది.

14. చనిపోయినవారి కాళ్ళు చేతులు కట్టేస్తే వాళ్ళు దయ్యంగా తిరిగి రారు.

15. అసలు సంధ్య(అసుర సంధ్య) వేళ అన్నం తినగూడదు. అది దయ్యాలు అన్నం తినేవేళ.

16. చింత చెట్టు మీద, మర్రి చెట్టు మీద దయ్యాలుంటాయి.

17. దేవుడి చిత్రం ఉండే వైపు కాళ్ళు పెట్టి పడుకోకూడదు.

18. నాగుపామును చంపితే అంత్యక్రియలు చెయ్యాలి. సగం ప్రాణంతో వదిలేస్తే పగబడుతుంది.

19. చచ్చినవారిని పూడ్చిపెట్టి వచ్చేటప్పుడు తిరిగి చూడకూడదు.

20. చావు కబురు తెలిపినప్పుడు, శ్రాద్ధకర్మలకు రమ్మని రాయకూడదు. చావు కబురు వినగానే స్నానం చెయ్యాలి. జాబువస్తే చించివెయ్యాలి.

మనుష్య జీవితానికి సంబంధించిన నమ్మకాలు:

21. లేక లేక పుట్టిన పిల్లల్ని పుల్లాకుల్లో పొర్లించి పుల్లయ్య అని పేరు పెడితే మంచిది.

22. చెల్లెల్ని కాలితో కొట్ట కూడదు.

23. పుట్టగానే పిల్లల్ని చేటలో పడుకో బెట్టాలి.

24. ఆడపిల్ల శుక్రవారం పుడితే మంచిది.

25. పెళ్ళి అయినవారు ఒక్క ఏడాది శ్రాద్ధ భోజనాలు తినకూడదు.

26. పెళ్ళి చూపులకు వెళ్తే ఏమీ తినగూడదు.

27. ఉపనయనం అయిన తర్వాత తల్లి దండ్రుల దగ్గర కూడా ఎంగిలి తిన కూడదు.

28. అమావాస్యనాడు పుడితే దొంగ అవుతాడు.

29. ఒక బిడ్డ తర్వాత మళ్ళీ బిడ్డలు లేకుంటే అట్లు చేసి పిర్రకు అంటిస్తే (శిశువుకు) తమ్ముడో. చెల్లెలో, పుడ్తారు.

30. పిండాన్ని కాకి తినకపోతే పితృదేవతలకు కోపం వచ్చినట్లు.

31. శవానికి తలవైపు దీపం వెలిగించి పెట్టాలి.

32. చావు కబురు తెలిపే జాబులకుఅంచున మసి పూయాలి. శుభకార్యాలయితే పసుపు పూయాలి.

33. చావును గురించి పరామర్శించడానికి నేరుగా చావయిన ఇంటికి వెళ్తే ఏ బంధువులింటికీ వెళ్ళడానికి లేదు.

34. కాశీ, రామేశ్వరం వంటి పుణ్య స్థలాల్లో చనిపోయినా, శివరాత్రి, వైకుంఠ ఏకాదశి వంటి పుణ్యదినాలలో చనిపోయినా ఉత్తమ లోకాలు ప్రాప్తమవుతాయి.

35. చవితి చంద్రుని చూస్తే అపవాదు వస్తుంది.

36. శ్రాద్ధం చేసే ముందు ముగ్గులు వెయ్యకూడదు, అయిన తర్వాత వెయ్యాలి.

37. శివరాత్రి మొదలైన పుణ్యదినాలలో జాగరణ చెయ్యాలి.

38. వారం వారం ఒక దినం ఉపవాసం ఉండాలి.

39. ఉగాదినాడు ఏమైనా తగవులాడితే సంవత్సరమంతా అలాగే తగవులాడు తుంటారు.

40. గాజులు పగిలిపోయినా, అద్దం పగిలిపోయినా అశుభం.

41. నిద్రలేచేటప్పుడు కుడివైపు నుంచి లేవాలి.

42. నిద్రపోయేటప్పుడు అలంకరించకూడదు.

43. నిద్రపోయే వాళ్ళను దాటకూడదు.

44. కూర్చున్నవాళ్ళ కాళ్ళు దాటితే మళ్ళీ ఈ వైపుకి దాటాలి. లేకుంటే దాటుడు కురుపులు లేస్తాయి.

45. దూలాల కింద పడుకోకూడదు,

46. నిద్రలో అన్నంతినకూడదు, కోతి కనిపించకూడదు., పెళ్ళి చూడకూడదు

47. నిద్రలో శవం కనిపిస్తే మంచిది.

48. వేకువ జామున వచ్చిన కలలు నిజమవుతాయి.

49. అన్నం తినేటప్పుడు కాళ్ళు చాచుకోకూడదు, అరచేయి నేల మీద ఉంచ కూడదు.

50. రాత్రి పూట సూదితో కుట్టకూడదు.

51. రాత్రిపూట తలదువ్వుకోకూడదు.

52. పిల్లలకు నీళ్ళుపోసి శతాయుష్కుడవు కమ్మని చెప్పాలి.

53. అన్నంతిని ఒళ్ళు విరవ కూడదు.

54. పొలమారితే నెత్తిమీద కొట్టి దూలం వైపు చూడమనాలి.

55. మలిసంజెవేళ పడుకోకూడదు.

56. మలిసంజెవేళ పెరటితలుపు వేసిపెట్టాలి.

57. దీపం పెట్టిన తర్వాత ఇల్లుచిమ్మకూడదు.

58. ఇంట్లో గోళ్ళు, వెంట్రుకలు వెయ్యకూడదు.

59. పళ్ళుఊడితే పూడ్చిపెడితే బంగారం దొరుకుతుంది.

60. ఆరువేళ్ళుంటే అదృష్టవంతులు.

61. ఇంటినుంచి వెళ్తుంటే 'వెళ్ళిరా' అనాలి. వెళ్ళేవారు 'వెళ్ళివస్తాను' అని చెప్పాలి.

62. పగిలిన అద్దంలో చూసుకోకూడదు.

63. వెడల్పుచెవి ఉంటే అదృష్టవంతులు.

64. తలమీద కొట్టకూడదు.

65. ఎవరైనా కావలసినవారు తలచుకుంటే పొలమారుతుంది, ఆవలింతలు వస్తాయి.

66. తలమీద చేతులు పెట్టుకొని కూర్చోకూడదు.

67. ఒంటిమీది గుడ్డల్ని కుట్టకూడదు.

68. ఎక్కడికీ ముగ్గురు వెళ్ళకూడదు.

69. ఫాలభాగం విశాలంగా ఉంటే అదృష్టవంతులు.

70. ఏది ఇవ్వాలనుకున్నా కుడిచేత్తో ఇవ్వాలి.

71. వక్షస్థలంమీద, వీపుమీద పుట్టుమచ్చఉంటే శుభం

72. మొలతాడులేక గాడిదఅరిస్తే వరిబీజం వస్తుంది

73. మగవాళ్ళకు కుడిభుజం, కుడికన్ను, ఆడవాళ్ళకు ఎడమభుజం, ఎడమ కన్ను అదిరితే శుభం.

74. గొడ్రాలు పిల్లల్ని తాకకూడదు

75. పిల్లల్ని తలమీద కొట్టకూడదు

76. అన్నప్రాశనం కాని పిల్లలకు అద్దంచూపించకూడదు

77. పడుకొని వుండే పిల్లలను దాటకూడదు.

78. పుట్టువెంట్రుకలు ఇచ్చేంతవరకు దువ్వెనతో దువ్వకూడదు

79. ఎవరైనా వెళ్తూ ఉంటే ఎక్కడికి అని అడక్కూడదు

80. పిల్లి అడ్డంవస్తే అపశకునం

81. ఒంటిబ్రాహ్మణుడు, వితంతువు, కట్టెలు, తుమ్మడం అపశకునాలు

82 ఇద్దరు బ్రాహ్మణులు ఎదురువస్తే మంచిది.

83 శవం కనిపిస్తేమంచిది

84 మొదటి ముద్దను కళ్ళకద్దుకుని తినాలి

85 ఎంగిలి కంచాన్ని దాటకూడదు

86 పచ్చడిబండను కాలితో తన్నకూడదు

87 అన్నంపాత్రను ఖాళీచెయ్యకూడదు

88 రోకలిని పడుకోబెట్టకూడదు, కాలితో తన్నకూడదు

89 కాకి అరిస్తే బంధువులు వస్తారు

90 పొయ్యిలో సుయ్యిమని శబ్దంవస్తే బంధువులు వస్తారు

91 గడపనుకాలితో తన్నకూడదు

92 గడపమీద తుమ్మితే తలమీద పుసుపునీరు చల్లాలి

93 ఉప్పు, చీపురుకట్ట మొ॥వి చేతికి ఇవ్వకూడదు

94 తలుపు చిలుకు శబ్దంచెయ్యకూడదు

పశుపక్ష్యాదులకు, పకృతికి సంబంధించిన నమ్మకాలు

95 పాము పుట్టలో పాలుపోస్తే తాగుతుంది

96 పాటబాగాపాడకపోతే గాడిదలు వస్తాయి (గార్దభ స్వరం అనుకొని పస్తాయనే భావన కావచ్చు)

97 ఎలుగుబంటి వెంట్రుకలను తాయెతులోపెట్టికడ్తే అన్నిపీడలు తొలగిపోతాయి

98 పాములు కలుసుకొనగా చూస్తే అశుభం

99 పిల్లిఈనడం చూస్తే చాలాపుణ్యం

100 గుడ్లగూబ ఇంట్లోచేరితే ఆరునెలలు ఆ ఇల్లు వదిలిపెట్టాలి

101 బల్లి వెంట్రుకలచివర పడితే మరణం సంభవిస్తుంది.

102 పిల్లిని చంపితే బంగారు పిల్లిని చేసిదానం ఇవ్వాలి లేదా పిల్లికి దేవాలయం కట్టించాలి

103 కుక్కను చీపురుతో కొట్టకూడదు

104 కుక్కనుకాలితో కొట్టకూడదు

105 మాట్లాడుతూఉండగా గాడిద అరిస్తే మంచిది

106 పాము పగబడితే పన్నెండేళ్ళు ఉంటుంది

107 పాలుతొక్కకూడదు నేలమీద పడితే తుడిచివెయ్యాలి

108 పొద్దున లేవగానే మేకనుగాని గొర్రెనుగాని చూస్తే శుభంకలుగుతుంది.

109 గాడిద పొర్లాడిన బూడిదను తొక్కకూడదు

110 ఒంటిమీద సాలెపురుగు పడితే కొత్తగుడ్డలు వస్తాయి

111. పాముకుబుసం విడిచేటప్పుడు చూడకూడదు.

112. ఏనుగు కలలో సింహం కనిపిస్తే ఏనుగు చనిపోతుంది.

113. నక్క ఆగ్నేయదిక్కున అరవకూడదు.

114. కప్ప పడమటి దిక్కున అరవకూడదు.

115. నల్లచీమలు బారులు దీరితే వానవస్తుంది.

116. ఎండా వానా కలసి వస్తే కుక్కల నక్కల పెళ్ళవుతుంది.

117. కాకికి ఒక్కకన్నే కనిపిస్తుంది.

118. నల్లిని చంపి వాసన చూస్తే తలనొప్పి తగ్గుతుంది.

119. తేనెపట్టు పెడ్తే శుభం.

120. తేనెటీగలు కరిస్తే అదృష్టం కలిసి వస్తుంది.

121. కాకి నెత్తిమీద కొడ్తే చావు ప్రాప్తిస్తుంది.

122. తూనీగలు ఎక్కువగా ఎగురుతుంటే వానవస్తుంది.

123. రావి చెట్టును నరక కూడదు.

124. తులసి చెట్టుకు ప్రదక్షిణాలు చేస్తే శుభం

125. గుమ్మడి కాయను ఊరక తీసుకోకూడదు.

126. దేవుడికి సమర్పించే టెంకాయ పాడయివుంటే అశుభం.

127. నైవేద్యంపెట్టేటప్పుడు అరటిపండు, జామపండు మొదలైన వాటిని కొంచెం గిల్లాలి.

128. తోక చుక్క కనిపిస్తే అశుభం,

129. పిడుగు పడేటప్పుడు అర్జునుణ్ణి తలుచుకుంటే అది ఎక్కడో దూరాన పోయి పడుతుంది

130. పెరట్లో ఆముదపు చెట్టు ఉండకూడదు.

131. రాత్రిపూట కోడి అరవకూడదు.

132. కోడి ఆదివారం గుడ్లుపెడ్తే దాన్ని కోసెయ్యాలి.

133. శుక్రవారం తేలునుగాని, పామునుగాని చంపకూడదు.

134. విరాటపర్వం చదివితే వాన వస్తుంది

135. గోపుచుట్టూ ప్రదక్షిణాలు చేస్తే పుణ్యం

136. పిల్లి తనకు తానే ఇంటికి వచ్చి ఉంటే ఆ యింటి వారికి శుభం జరుగుతుంది

137. గోదానం చేస్తే దాని పలుపుతో సహా ఇవ్వాలి

138. పువ్వును చేత్తో చూపించకూడదు. అలా చేస్తే అది వాడిపోతుంది.

139. గ్రహణం సమయంలో రాహుకేతువులు సూర్యుణ్ణి, చంద్రుణ్ణి మింగుతారు.

140. గ్రహణం సమయంలో ఏమైనా తింటే కడుపు నొప్పి వస్తుంది.

141. గ్రహణం అయినప్పుడు గర్భవతులు బయటికి వస్తే పుట్టే బిడ్డలు అవిటి వాళ్ళవుతారు.

142 సూర్యగ్రహణం సమయంలో రోకలిని నీళ్ళలో నిలబెట్టవచ్చు.

143. గ్రహణం సమయంలో నీటి మీద, ఆహారపదార్థాలమీద, ఊర గాయలమీద దర్భలు వేసి పెట్టాలి,

144. తొలకరి వానలో తడవ కూడదు.

145. నీటిమీద చేపలు ఆడుతుంటే ఆ దినం వానవస్తుంది.

146. వాన వస్తున్నప్పుడు నీటి బుడగలు వస్తే ఇంకా ఎక్కువగా వాన వస్తుంది.

147. చంద్రుని చుట్టూ ప్రభ వస్తే ఆ నెల వానరాదు.

148. పనసచెట్టు ఫలవంతం కాకపోతే రాత్రిపూట చీలలుకొట్టాలి.

149. సుడిగాలిలో దయ్యాలుంటాయి.

140. పిడుగు పాటుకుగురియై బ్రతుక గల్గిన వారు ఐశ్వర్యవంతులవుతారు

151. పిల్లలు ఏద్దైనా తుంటరి తనం చేస్తున్నా, నలత చేసినా గరికతో కాని, పీనపుల్ల వెలిగించి కాని దిష్టి తీయాలి. నిజంగా దిష్టి అయి వుంటే టపటప శబ్దం వస్తుంది. పీనపుల్ల కాలగా వచ్చిన మసితో బొట్టు పెట్టాలి.

టిప్పణి :

1. "Leaving primitive man out of account, since much of his mental and spiritual life is based on but the most rudimentary knowledge of the physical world that surrounds him, let us look rather to representative people of our own time and condition for examples that will suggest the range of irrational beliefs and practices that help to make up the total body of modern-day mental baggage known as superstition"–*American Folklore*, Tristram Coffin III (Ed.),p. 245.

2 "One cannot divide the peoples of the world into the superstitions and the enlightened, but only into those, by and large, more or less superstitions"– *The story of superstition*, Philip F. Waterman,p. 33

3 "In England, one person in six believes in ghosts and nearly one quarter are uncertain whether or not they exist; one person in fourteen thinks he or she has actually seen or heard a ghost. In England, one in three has been a fortune teller; one in ten believes in lucky numbers etc"– *The Psychology of Superstition*, Gustar Jahoda, p.25.



# దేవతలు-మతం-మంత్ర తంత్రాలు

'దీపమున్నప్పుడే ఇల్లు చక్కబెట్టుకోవాల'నే సామెతలోకూడా తాత్వికార్థాన్ని వెదికే మనకు ఇహలోకం చింతకన్న పరలోకం చింతే మిన్న. జానపదుల స్థాయిలో మతమనే పారమార్థిక వ్యవస్థ ఉండదనీ అక్కడ వుండేది కేవలం కొన్ని నమ్మకాల మొత్తమని కొందరంటారు.

మానవాతీతశక్తుల మీద నమ్మకమన్నది మానవుని పుట్టుకతోనే వచ్చిన ప్రవృత్తి. ఆధారాలు దొరికినంత వరకు లక్షయాభై వేల సంవత్సరాలనుంచి మనిషి మానవాతీత శక్తుల్ని ఆరాధిస్తున్నాడు. పందొమ్మిదో శతాబ్దిలో అనేక విద్వాంసులు ప్రపంచంలోని వివిధ జాతుల నమ్మకాలను, దేవతా గణాలను, మత సంప్రదాయాలను మంత్ర తంత్రాదుల స్వరూపాన్ని అధ్యయనంచేశారు. కొంతమంది ఆదిమజాతుల్ని అధ్యయనం చేస్తే. మరికొందరు గ్రామీణ జానపదుల్ని, ఇంకా కొందరు నాగరికుల్ని పరిశీలించారు.

ప్రాచీనమైనవి, జానపదీయమైనవి, నాగరికమైనవి అయిన మతాలు ప్రపంచంలో ఐదువేలకంటె ఎక్కువ ఉన్నాయని విద్వాంసులు లెక్కవేశారు. ఈ మతాలు వేరువేరు నమ్మకాలను, స్వభావాలను, ప్రత్యేకతలను, జన సమూహాలను కలిగి ఉన్నాయి. ఏది ఏమైనా మానవాతీత శక్తులలో నమ్మకమన్నది సమానమే.1

మతం అనగానే మానవాతీతుల శక్తులను గూర్చి మానవుని భావాల మొత్తమని ఒక్కమాటలో చెప్పవచ్చుగాని ఇది ఇంత సరళమైంది కాదు. అమిత సంకీర్ణ స్వభావం కలది. మత సంబంధమైన ఆచరణల్లో కొన్ని స్వభావాలఅభివ్యక్తి, పవిత్రీకరణపద్ధతులు, నిషేధాలు, దివ్యత్వం, కర్మకాండలు, మంత్ర తంత్రాలు మొదలైన వన్నీ చేరి ఉంటాయి. ఇందులో మళ్ళీ ఒక్కొక్క దానిలో ఉపవిభాగాలుంటాయి. ప్రతినబూనడం, ముడుపులు, స్తుతులు, మంత్రాలు, పూజలు, తీర్థయాత్రలు, పవిత్రస్నానాలు, విభూతి మొ॥ వాటి ధారణం ఇలాంటివి ఒక్కొక్క శాఖలో ఉండవచ్చు.

మానవుడు ప్రాథమిక దశలో ప్రకృతిని గూర్చి, ప్రకృతిలోని శక్తులనుగూర్చి ఎన్నో కల్పనలకు లోనై, నమ్మకాలను రూపొందించుకొని ఉండవచ్చు. తర్వాత కాలంలో సాంస్కృతిక, ఆర్థిక, కౌటుంబిక, వైవాహిక రంగాలలో కొన్ని పద్ధతులను ఏర్పరచుకొని ఒక వ్యవస్థను రూపొందించుకొన్నప్పుడే మతీయ వ్యవస్థనుకూడా కట్టుకున్నాడు.

నాగరిక సమాజంలో మాత్రమే వ్యవస్థ ఉంటుందని అనాగరిక సంఘాలలో మతమనే వ్యవస్థిత పద్ధతులుండవని విద్వాంసులు కొందరంటారు. కాని జానపద మతమనేది కూడా ఒకటుంటుందని, ఆదిమవాసులకు కూడా ఒక వ్యవస్థ అంటూ ఉందని మరికొందరు విద్వాంసులంటారు. మొత్తం మీద జానపద మతంలో ముఖ్యంగా కనిపించేవి నమ్మకాలు, ఆచరణలు అని చెప్పవచ్చు. ఒకటి సిద్ధాంత భాగమయితే మరొకటి క్రియాభాగం. మతంలో సిద్ధాంత భాగం కన్న క్రియాత్మక భాగమే ముఖ్యమని కొందరి అభిప్రాయం. వ్యక్తికి మానవాతీత శక్తికి నడుమ సంబంధాలు స్థాపిత మవ్వాలంటే క్రియ ముఖ్యంగాని కేవలం విశ్వాసం కాదు. విశ్వాసం ఆచరణలు కొనసాగడానికి శాసనాలలాగా పనిచేస్తాయి.

ప్రాచీన మత సిద్ధాంతాలలో, జానపదమత స్థాయిలో తాత్విక చింతనకు వివేకానికి ప్రాధాన్యం తక్కువగానే ఉంటుంది. జానపద మతం ఒక్కొక్క ప్రదేశానికి, తెగకు, కాలానికి మార్పు చెందుతూ వుంటుంది. కొన్ని చోట్ల మానవాతీత క్షుద్రశక్తులకే ఎక్కువ ప్రాధాన్యం ఉండవచ్చు. మరికొన్ని చోట్ల వ్యక్తి రూపాన్ని ధరించిన దేవతాగణం ప్రాముఖ్యం వహించ వచ్చు, ఇంకా కొన్ని చోట్ల వ్యక్తి రూపంలేని శక్తికి ప్రాధాన్యం ఉండవచ్చు. మొత్తం మీద మతంలో పవిత్రభాగం కొంత, లౌకిక భాగంకొంత ఉండనే ఉంటుంది. పవిత్ర భాగం దేవతా గణంతో, భక్తి శ్రద్ధలతో, మత సంబంధమైన ఆచరణలతో, పారలౌకిక చింతనతో కూడిఉంటుంది. లౌకిక భాగం తంత్ర సంబంధమైంది. ఐహికమైన కోరికలు తీర్చుకోడానికి, శత్రు నిర్మూలనానికి, క్షుద్ర విద్యలు పొందడానికి ఈ భాగం పనికి వస్తుంది. ఈ రెండు భాగాలూ కలిసి మతం అవుతుంది. ఒక్కొక్కసారి ఈ రెండూ విడదీయరానంతగా కలిసి ఉంటాయి. పవిత్రభాగానికి ప్రతినిధిగా ఉండే పురోహితుడే ఒక్కొక్కసారి

తాంత్రికులూ కావచ్చు. దేవుడినీ దయ్యాన్ని కూడా మానవునికి సన్నిహితుల్ని చేసే ప్రతినిధులు కొందరుంటారు.

ప్రపంచంలోని వివిధ మతాలను, మానవుని విశ్వాసాలను తులనాత్మకంగా పరిశీలించి, వాటి ఉత్పత్తి వికాసాలను, వైవిధ్యాన్ని దర్శించే ముందు ఆంధ్రుల మతం, దేవతలు, పూజావిధానాలను చారిత్రికంగా కొంత పరిశీలిద్దాం.

## ఆంధ్రుల మతం-దేవతలు-మంత్ర తంత్రాలు

కావ్యాలు, శాస్త్రగ్రంథాలు శాసనాలు మొదలైన ఆధారాలతో ఆంధ్రుల మత సంప్రదాయాలను చారిత్రకంగా సమీక్షించినప్పుడు మనకు ఎక్కువగా దొరికే ఆధారాలు నాగరికమతాలైనబౌద్ధం, జైనం, శైవం, వైష్ణవం, అద్వైతం మొదలైన మతసంప్రదాయాలను గురించే. తెలుగు దేశంలో ఏడవ శతాబ్దికే బౌద్ధమతం కనుమరుగయింది. నన్నయకాలానికి వైదిక మతం రాజ్యమేలుతూ ఉంది. నన్నెచోడుడు వైదిక సంప్రదాయాలతోబాటు కౌళ మార్గాది వామాచారాలు కూడా కలవని సూచనలిచ్చాడు. ఆనాడు అభిచారం (చేత బడి) ఇంద్రజాలం మొదలైన వాటిపైన నమ్మకాలు వాటి ఆచరణలు ఉండేవి, 'కర్పర ఖండంబున మంత్రకాటుక తగన్ ఫాలాక్షు గూర్పింప నగ్గిరి రాజాత్మజ పట్టె, (కుమార సంభవం 6-96). నన్నయ నన్నెచోడకవుల కాలానికి శిష్ట మత సంప్రదాయాలతోబాటు చేతబళ్ళుర,సవిద్యలు (కుమార సంభవం6-146) మొదలైనవీ ఉండేవి. ఆపత్కాలంలో నమ్మిన దేవుడికి ముడుపులు కట్టేఆచారం ఆనాటికే ఉండేది (కుమారసంభవం 8-64).

కాకతీయుల కాలానికి బౌద్ధం నామమాత్రావశిష్టమయినా జైనం మాత్రం ప్రబలంగానే ఉండింది. ఆంధ్ర కర్నాటకాలలో జైనుల్ని వీలయినంతగా ధ్వంసం చేసినవారు వీరశైవులు. జైన విగ్రహాలను లాగివేసి శివలింగాలను అమర్చారు. కొన్ని నగ్న జైన విగ్రహాలను వీరభద్రులుగా కూడా మార్చి ఉండవచ్చు. వేముల వాడలోని జినాలయం శివాలయమయింది. ఆది జైన విగ్రహాలు గుడికావలి బంట్లలాగా దేవాలయాల బయట నిలబడ్డాయి. జైనులపైన ఎంతగా ఆగ్రహాన్ని సామాన్య జనంలో కల్పించారంటే జైనుల

నగ్నవిగ్రహాన్ని చూస్తే మట్టి బెడ్డలు వేసి, నగ్నతను కప్పడానికి కాబోలు గుడ్డ పేలికను వేసి పోతారు.

కాకతీయుల కాలంలో జైన, శైవ, వైష్ణవాలు పరస్పర ప్రాబల్యం కోసం పోరాడుతుండేవి. కులభేద నిర్మూలనం మూడింట్లోనూ సమానమే అయినా, మూడూ మూడుమార్గాల్లో పయనించాయి. వీరశైవుల్ని విప్రులే ముఖ్యంగా ప్రతిఘటించారు. వారిని 'పతితు'లుగా నిర్ణయించారు. వీరశైవులే మో జైనుల్ని రాళ్ళతో కొట్టి హింసించారు. మరొకవైపు వీర వైష్ణవం విజృంభించ సాగింది. ఈ శిష్టమతాల దేవుళ్ళ కొట్లాటల మధ్య నలిగిన జానపదులు 'మీ శిష్టదేవతలకంటె మా క్షుద్రదేవతలే మేలు' అని చెప్పివుండవచ్చు. శైవులు, వైష్ణవులు అన్ని జాతుల్లో మూఢ భక్తిని వంట బట్టించి శివలింగాల్ని కట్టలేక మూడు నామాలు పెట్టి వదిలారు. ఇక యుద్ధం తీవ్రమయింది. అయితే ఒక విధంగా మేలు జరిగింది. మతం పేరుతో అయినా చాలా జాతులు దగ్గరయ్యాయి. బ్రహ్మనాయుడు బ్రాహ్మణాది చండాల పర్యంతం అందర్నీ పెళ్ళాడాడట. యుద్ధరంగంలో మాల, మాదిగ, వెలమ, కమ్మరి, వడ్ల, కుమ్మరి మొదలైన వారంతా వైష్ణవులై ఏకపంక్తిలో 'చాప కూడు'కుడిచారట. ప్రోలరాజువరకు కాకతీయులు జైనులు, ఆ తర్వాత శైవులయ్యారు. కొత్తగా పుచ్చుకొన్న మతం మత్తులో జైనాదులను హింసించి ఉండవచ్చు. కాకతీయుల కాలంలో తెలుగుసీమలో వీరశైవులు మత ప్రచారం కోసం గోళకీమఠాలను ఏర్పాటు చేశారు. ఇవి పండితమఠాలు. తర్వాతజంగాలు మఠాలను స్థాపించారు. సిద్ధేశ్వర చరిత్రను బట్టి కాకతీయుల కాలంలో అద్వైత వాదులు, బ్రహ్మవాదులు, పాంచరాత్రవాదులు, ఏకాత్మవాదులు. అభేదవాదులు, శూన్యవాదులు, కులవాదులు, కర్మవాదులు, నాస్తికులు, చార్వాకులు, ప్రకృతి వాదులు, శబ్ద బ్రహ్మవాదులు, పురుషత్రయైక వాదులుండేవారని తెలుస్తున్నది.

శిష్టమతానికి చెందినవారు ఎంత అశిష్టంగా ప్రవర్తించారన్నదాన్నిగురించి సురవరం ప్రతాపరెడ్డిగారు ఇలా అభిప్రాయపడ్డారు : 'శైవులు మతము పేర బసివిరాండ్రను జన్మ విడిచిరి. బసవని పేర స్త్రీలను పెండ్లి చేయక వదలి వారిని వ్యభిచారిణులనుగా చేసిరి. వైష్ణవులు కూడా ముద్రలు వేసి దేవదాసీలను సిద్ధము చేసిరి. కాకతీయానంతర కాలములో శైవులుచాలామంది వైష్ణవులైరి. అందు ముఖ్యులు రెడ్లు' (ఆంధ్రుల సాంఘిక చరిత్ర, రెం.ము. 46)

జానపదుల దేవతారాధనాన్ని గురించి కూడా కాకతీయుల కాలంనాటి గ్రంథాలలో, అనంతరకాలపు గ్రంథాలలో కొన్ని ఆధారాలు కనిపిస్తాయి. కాకతీయుల కాలంలో ఏకవీర ఒక జనప్రియ దేవత. 'కాకతమ్మకు సైదోడు ఏకవీర' అంటుంది క్రీడాభిరామం. ఈమె రేణుక అవతారం. మాహూరము అనే గ్రామంలో ఉండడంవల్ల మాహూరమ్మ అనికూడా అంటారు. ఇప్పుడు ఈమెను ఎల్లమ్మ అంటారు. ఆంధ్రదేశంలోనే కాక, కర్నాటకంలో కూడా ఎల్లమ్మ ప్రసిద్ధ దేవత. అలంపూరు బ్రహ్మేశ్వరాలయంలో తలలేని మొండెం, నగ్నత్వంతో వుండే శిల్పాన్ని ఎల్లమ్మ అంటారు. కాకతీయుల కాలంలో పూజల్ని పొందుతుండిన దేవతాగణంలో భైరవుడు, చముడేశ్వరి, వీరభద్రుడు, మూసానమ్మ, కుమార స్వామి, పాండవులు, స్వయంభూదేవుడు, ముద్దరాలు మూసానమ్మ ఉన్నారు. కలని పోతులయ్య, గురిజాల గంగమ్మ మొదలైన గ్రామదేవతలు జనుల పూజల నందుకునే వారు.

రెడ్డిరాజుల కాలంలో కూడా శైవశక్తుల పేరుతో అనేక దేవతల్ని ప్రజలు కొలిచేవారు. కోమలార్ధేందుధరు కొమ్మ గోగులమ్మ', 'మహిత గుణము తల్లి శ్రీ చుండతల్లి', నూకాంబ, ఘట్టాంబిక, మాణికాదేవి మొదలైన వారిని గూర్చి శ్రీనాథుడు వ్రాశాడు. మైలారుదేవుడు ప్రబల శక్తిగా తయారయ్యాడు. ఏకవీరాదేవి పూజకూడా కొనసాగింది. జానపదులు పూజిస్తుండిన దేవతాశక్తులు కొందరిని సింహాసన ద్వాత్రింశికలో పేర్కొనడం జరిగింది (పు. 103).

'కామాక్షికిని, మహాకాళికి, చండికి,
నక్కజియ్యకు, కాశి, కంబికకును,
వింధ్యవాసిని, కేశ వీరకు, మున్నుగా
నెల్ల వేల్పులకు బిందించి మ్రొక్కి
త్రావుచు నెడనెడ తాల్పుగావండిన
నంజుటి పొరకలు నంజుకొనుచు'

భైరవాది శివభక్తులను, కాళికాది శక్తులను పశుబలులతో సామాన్య జనులు సంతృప్తిపరచేవారు శైవ సంబంధంగా శాక్తేయం, భైరవ తంత్రం మొదలైన వామాచారాలను పురికొల్పే తంత్ర విద్య తత్సంబంధ సాహిత్యం

వచ్చింది, శివపూజలో భాగంగా ఆత్మబలి చేసుకున్న వాళ్ళకు వీరుల స్థానం లభించింది. వాళ్ళపేర వీరగల్లులు వెలశాయి. వాళ్ళను పూజించడానికి వీరగుడ్లను కట్టించారు. గ్రామాల బయట ఛురికల్తో కడుపుల్ని ఛేదించుకున్నట్లు తల పండు సమర్పించినట్లు శిలావిగ్రహాలను నిలిపారు.

స్థానికులైన శక్తిదేవతలే నిజమైన జానపద ఆరాధనకు పాత్రులు. వీళ్లు ద్రావిడ దేవతలని కొందరి అభిప్రాయం. చనిపోయిన కొందరు దయ్యాలై, శక్తి స్వరూపిణులై, దేవతలుగా మారుతారని జానపదుల నమ్మకం. 'వీరులు, దివ్యలింగములు, విష్ణుడు, చెన్నుడు, కల్లుపోతరాజారయ కాలభైరవుడు, సంకమ శక్తియు సన్నపూర్ణ' కొందరు దేవతలని, పలనాటి వారని చెప్పే చాటువులు కొన్ని శ్రీనాథుని పేరుతో చలామణీ అవుతున్నాయి.

గ్రామదేవతల విషయం ఇలా వుండగా నేడు పట్టణమైన బెజవాడలో కనకదుర్గగా వెలసిన దేవతను గురించే ఎన్నోకథలున్నాయి, ఒక గ్రామంలో ఏడుగురు విప్రసోదరులుండేవారు. వాళ్ళకు కనకమ్మ అనే చెల్లెలు. ఆమె శీలాన్ని వారు సందేహించగా బావిలోపడి జనులను బాధించే శక్తి అయిందామె అందుకని ప్రజలామెకు గుడికట్టి కనకదుర్గగా చేసి పూజించారు. నెల్లూరు జిల్లాలోని పొదిలెమ్మ కూడా సందేహింపబడి శక్తిగా మారినామే. అట్లే నెల్లూరుజిల్లా దర్శితాలూకాలో లింగమ్మ అనే బీదరాలు ఒక ధనికురాలి ఇంట సేవకురాలిగా ఉండేది. ఆమెపైన సొమ్ము అపహరించిన నేరం మోపబడగా బావిలోపడి దేవతయింది. కోటయ్య అనే లింగ బలిజ ఒక గొల్ల స్త్రీని కూడి ఆమె భర్తచేత వధింపబడి కోటప్పకొండ దేవర అయ్యాడు. ఏటేట తిరునాళ్ళ కూడా చేయించుకుంటున్నాడు.

వీరశైవంతో కొన్ని ఘోరాచారాలు ఆంధ్రదేశంలో ప్రవేశించాయి. అక్కడక్కడా నరబలులు కూడా జరిగేవి. నిర్జన ప్రదేశంలోని శక్తిదేవాలయాలలో ఇలాంటివి జరుగుతుండేవి. సింహాసన ద్వాత్రింశికలో ఇలాంటి చంపుడు గుడిని గురించిన ఉల్లేఖనం ఉంది (భాగం 1, పు. 78).

చంపుడుగుడియిది యని యా
దంపతుల కళేబరములు తలలుంగని తత్

సంపాదిత భయరౌద్రా
కంపితుడై సెట్టి బెగడి కన్నులుమూసెన్

ఇవిగాక శివార్పణంగా అంగాలు ఛేదించుకోడం, తలల్ని నరుక్కోడం మొదలైనవి చేసేవారు. శ్రీశైలంలో భక్తులు సులభంగా చావడానికి 'కనుమారి' అన్నదిమార్గం. తిక్కన, పాల్కురికి సోమన, నాచన సోమన ఈ పదాన్ని వాడారు. శ్రీశైలంలో కర్మారీశ్వరమనే పుణ్యస్థలముంది. అది కొండకొమ్ము. పుణ్యలోక ప్రాప్తికోసం అక్కడినుంచి భక్తులుదూకేవారు. కనుమారి ఉర కడం మహాప్రస్థానంగా కవులు వర్ణించారు. నాచన సోమన ఇలా అంటాడు:

పాయదగు మిమ్ము, కనుమారిబడ బోనంగు
విషము ద్రాపుట యోగ్యంబు, వెల్లిలోన
మునుగుటుచితము, మీరెల్ల కనుగొనంగ
ఆత్మ విడుచుట చను, నాకుననుచు నడలి (4—56)

శ్రీశైలంలో శివరాత్రినాడు భక్తులు ఎడతెగక దూకి ఆత్మబలి చేసుకొనేవారని పాల్కురికి సోమన వ్రాశాడు.

కరమర్థి చేసి యా కర్మారినురుకు
నవ్యసుల భవ పరిత్యక్తమానసుల
అరిమురి నపలి కర్మారీశ్వరమున
నురుకు పుణ్యులజూచి........

పండితారాధ్య చరిత్ర చివరి భాగంలో కర్మహరి మహిమ అనే భాగం ఉంది. కర్మహరేశ్వరంలో పూర్వం బల్లహుడనే రాజు భార్యతో కూడా మల్లి కార్జునుణ్ణి ధ్యానిస్తూ దూకాడట.

మైలారుదేవుడు ఆంధ్రదేశంలోనే కాక కర్నాటకంలో కూడా పాటలి కెక్కాడు. ఇతన్ని కొలిచేవారు మైలారు భటులు, జానపదుల మతపద్ధతుల్లో ఎలాంటి భయంకరమైన ఆచారాలుంటాయో మైలారు భటుల చర్యలను గమనిస్తే తెలుస్తుంది. క్రీడాభిరామంలో మైలారు భటుల గూర్చి ఈ క్రింది విధంగా ఉంది.

రవరవమండు నెర్రని చంద్ర మల్లెల
చోద్యంపు గుండాలు చొచ్చువారు
కరవాడి యలుగుల గవపపాతర్లలో
నట్టి చేరులు గోపి యురుకువారు
గాలంపు గొంకి గంకాళ చర్మముగ్రుచ్చి
యుడు వీధినుయ్యెల లూగువారు
కటికి హొన్నాళంబు గండక త్తెర వట్టి
మిసిమింతులును గాక మ్రింగువారు

సందులను నారసంబులు సలుపువారు
యెడమ కుడిచేత నారతు లిచ్చువారు
సాహసము మూర్తి గైకొన్న సరణివారు
ధీర హృదయుల మైలారు వీరభటులు.

పైన వర్ణించిన భీకర తంత్రాలను నేటికీ మతంపేరుతో కొందరు చేస్తూనే ఉన్నారు. ఇలాంటివన్నీ మతంలో సాత్వికతను నాశంచేసి, తమోగుణాన్ని పెంపొందించాయి. ఆలోచనను పక్కకునెట్టి మూఢభక్తిని ఎక్కువ చేశాయి.

ఆరాధనలో అనేక విధాలు

సర్వాత్మవాదం మానవుని మతీయ భావనల్లో ఒకటి. మనిషి, ప్రాణి, పశులన్నిట్లో ఆత్మ ఉన్నదనేది దీనికి మూలం. ఇక్కడ ఆత్మను మన శిష్ట భావనల్లోని ఆత్మభావానితో ముడిపెట్టరాదు. ప్రాచీనమానవుడు చనిపోయిన వారిని స్వప్నాలలో మరలచూచినప్పుడు వాళ్ళింకా ఎక్కడో ఉన్నారనే భ్రమ కలిగేది. నిద్రకూడా అతని పాలిటికి ఒకచావే, ఏదో ఒక అగోచరశక్తి తనలో ఉన్నప్పుడు సచేతనంగా ఉండి, అది వెళ్ళగానే అచేతనంగా పడి వుంటానని మానవుడు భావించేవాడు. అయితే దేహాంతర్గతమైన ఈ ఆత్మకాక, స్వతంత్రాత్మ మరొకటి ఉండవచ్చుననే భావన అతనికి కలిగింది. ఈ విధంగా రెండు ఆత్మలుండబట్టే రెండు విధాల సంస్కారాలను మరణానంతరం

ఆచరించే సంప్రదాయం వచ్చిఉండవచ్చని విద్వాంసులు కొందరు అభిప్రాయ పడ్డారు. చనిపోగానే చేసే కర్మకాండ ఒకటైతే, స్వతంత్రాత్మ కోసం చేసే కర్మకాండ మరొకటి. రెండవదే ఆబ్ధిక రూపంలో కొనసాగుతూనే వుంటుంది. మరణానంతర జీవితంగురించిన భయ సందేహాలు సమృద్ధిగా ఉండిన ప్రాచీన మానవ జీవితంలో సమాధులే దేవాలయాలు.

మతంలోని ప్రాథమిక రూపాలలో వస్తుపూజ ఒకటి. భౌతిక వస్తువుల్లో ఏదో శక్తిదాగివుందనే ఊహ ప్రకృతిలోని వస్తువులపూజకు దారి తీసింది. ఇదీ ఒకరకంగా మానవాతీత శక్తిలోఉన్న నమ్మకమే. సజీవమైన వస్తువులైనా, నిర్జీవ వస్తువులైనా అన్నిట్లో ఏదో ఒక అనిర్వచనీయశక్తి ఉంటుందనే నమ్మకమే ఈ వస్తుపూజకు దారితీసింది.

ఇదే కొద్ది మార్పుతో ప్రకృతి ఆరాధన అయిందని చెప్పవచ్చు. మత సంబంధమైన ఆరాధనల్లో ప్రకృతి ఆరాధన అత్యంత ప్రాచీనమైన వాటిల్లో ఒకటి అని చెప్తారు. ప్రకృతిలోశక్తి ఉందనేభావన ప్రాచీనమానవునికి కలగడం అత్యంత సహజం. ప్రకృతితో నేరుగా సంబంధం ఉండినవాడు కాబట్టి ఆనాటి మానవుడు, ప్రకృతిని జయించేవరకు దానికి దాసుడై ఉండడంలో ఆశ్చర్యమేమీలేదు. సూర్యచంద్రోదయాలు, అస్తమయాలు, వానలు, పిడుగులు వరదలు, వెల్లువలు నానావిధ రసానుభూతుల్ని మనిషిలో కల్గించివుంటాయి.

పైన పేర్కొన్న ఆరాధన పద్ధతుల సూచ్యరూపాలు నేటికీ ఉన్నా. ఇప్పటి ఆరాధనా పద్ధతి ముఖ్యంగా దేవతలకు సంబంధించిందని చెప్పవచ్చు. కులదేవతాపద్ధతి (Totemism), వీరారాధనా పద్ధతులను కూడా కొంతవరకు చూడవచ్చు. జానపదుల మతాన్ని గురించి చర్చించేటప్పుడు మొట్టమొదట మన దృష్టిని ఆకర్షించేది దేవతారాధనే.

## జానపద దేవతలు

లిఖితరూపంగా కాకుండా, మౌఖిక ప్రచారంవల్లనే తరతరాలుగా జానపదుల పూజలందుకొంటున్న దేవతా గణాన్ని జానపద దేవతలనవచ్చు.

వీళ్లల్లో చాలావరకు గ్రామదేవతలనే పేరుతో ఉన్నవారే. శిష్టదేవతలకంటె వీరంటేనే జానపదులకు భయమూ, భక్తీ.

శిష్టదేవతలుగాని, జానపదదేవతలుగాని ఉద్భవించడానికి మానవులే కారణం. దేవుడు చేసిన మనుషులనే భావన రాకముందే, మనుషులుచేసిన దేవుళ్ళు అసంఖ్యాకంగా పుట్టుకొచ్చారు. అజ్ఞాన యుగాలలో మనిషి ఎదిరించ వలసిన అనేక సమస్యలను పరిష్కరించవలసిన ప్రయత్నాలలో భాగంగా దేవతాగణం కూడా ఉద్భవించింది.

దేవతల పుట్టుకకు కారణమేమై వుండవచ్చునని విద్వాంసులెన్నో విధాలుగా ఊహించారు. మొదటి కారణం భయంగా తోచింది. ప్రాచీనమానవుని జీవితంలో భయాన్ని కలిగించే సంఘటనలే ఎక్కువ. భూకంపాలుకాని, ఉరుములుకాని, పిడుగులుకాని ఏ ప్రకృతివైపరీత్యమైనా మానవుణ్ణి కొండవల్లోకి, చీకటి గుహల్లోకి, కొండల్లోకి, కనుమల్లోకి పరుగెత్తేట్లు చేసింది. తనను కాపాడేశక్తి ఏదీలేదా అని ఆక్రోశించిన ఆనాటి మానవునికి, ఏదోశక్తివుంది అనే భావన వూరట కలిగించి వుంటాలి. అయితే ఆ శక్తి ఉగ్రశక్తి, దాన్ని ఎలాగైనా మంచిచేసుకోవాలి అనేభావం కలిగినప్పుడు మనిషి ఎన్నోపూజా విధానాలను, ఆచరణలను కల్పించుకున్నాడు.

అయితే అందరు దేవతల సృష్టికీ భయమొక్కటే కారణంకావచ్చు. తినడానికి ఫలాలను వృక్షం ఇచ్చినప్పుడు, కడుపునింపుకోడానికి అన్నాన్ని పుడమితల్లి ప్రసాదించినప్పుడు, చూడడానికి వెలుగును సూర్యుడు ప్రసాదించినప్పుడు, మనస్సుకు చల్లదనాన్ని చంద్రుడు కలిగించినప్పుడు మనిషి కృతజ్ఞతా భావంతో తలవంచి వుండాలి. అట్లె నిరంతరం జరుపుచుండిన జీవన సమరాలలో బాసటగా నిలిచి విజయం చేకూర్చిన వ్యక్తులను కూడా కృతజ్ఞతతో స్మరించుకొని దేవునిస్థానాన్ని ఆనాటి మానవుడు పెంచి పూజించాడు.

భయం, కృతజ్ఞతేకాక ఆశ్చర్యం కూడా దేవతాగణం ఉద్భవానికి కారణమయింది. అన్నీ తెలిసిన లేక తెలిసినవనుకునే మనకు ఏదీ ఆశ్చర్యకారణం కాదు. ప్రకృతిలో ఏది ఎందుకు జరుగుతుందనే విషయమే తెలియని ప్రాచీన మానవునికి సూర్యోదయమైనా, చంద్రోదయమైనా, మెరపయినా ఉరుమయినా

ఆశ్చర్యకారణమే. ఈ ఆశ్చర్యమే దేవుని కల్పనకు కొంతవరకు దారితీసి ఉండ వచ్చు. స్వప్నాలలో ప్రాచీనమానవుడు చూస్తుండిన అద్భుతరూపాలు, దృశ్యాలు దేవుళ్ళను, దయ్యాలను రూపకల్పన చెయ్యడానికి కారణమయ్యాయని కొందరు భావించారు. ఇలా నానా కారణాల వల్ల అసంఖ్యాకంగా మనిషి మస్తిష్కంలో ఉదయించిన దేవతాగణం తర్వాతి కాలంలో శిష్టుల వర్ణనకు, ఆదరణకు, ఆరాధనకు పాత్రమై శిష్టదేవతా గణం స్థాయికి ఎదిగింది. ఈ శిష్టదేవతాగణం సంఖ్యతగ్గుతూ, హెచ్చుతూ, కొత్తదేవతల సృష్టి జరుగుతూ, ఒకళ్ళే అందరూ ఒక్కటే అనే భావన కలుగుతూ వచ్చింది.

జానపద దేవతలు లేని గ్రామమంటూ ఏదీ లేదు. ఈ దేవతల ప్రీతి కోసం పూజలు, జాతరలు, ఉత్సవాలు జరపని జానపదులు లేరు. అయితే ఈ పూజలు ఎగ్గైరా నిత్యోత్సవాల వంటివి కావు. కొందరు దేవతలు ఆల యాలూ ఉండవు, పూజార్లూ ఉండరు, దీపం వెలిగించే నాథుడూ ఉండడు. ఏ సంవత్సరానికో, ఆరునెల్లకో ఉత్సవం జరుగుతుంది అంతే. అసలు మానవ రూపం కూడా ఉండవలసిన అవసరం లేదు. చిన్నరాయి, బండ, కొమ్మ, చెట్టు, పుట్టకూడా దేవతగా ఆరాధింపబడవచ్చు. ఒక విధంగా గ్రామదేవతలు గ్రామానికి కావలివాళ్ళు, గ్రామాన్ని సర్వరోగాలనుంచి కాపాడే వారనే నమ్మ కాన్ని గడించుకున్న శక్తులు, గ్రామదేవతల ఆలయాలలో భక్తునికి దేవతకు మధ్య ఉండేవాడు సామాన్యంగా బ్రాహ్మణేతరుడే. అర్థం కాని భాషలో అష్టో త్తర శతనామాలు చదివే సంప్రదాయమూ అక్కడ లేదు. గ్రామదేవతల రూపాలూ కొన్నిసార్లు భయంకరంగా ఉంటాయి. సౌమ్యదేవతలూ లేకపోలేదు. అయినా చూడని పసివారు మొదటిసారి చూస్తే జడుసుకోవలిసిందే. ఈ దేవ తల్ని సంతృప్తి పరచాలంటే కోళ్ళు, గొర్రెలు, బర్రెలు, మేకలు, దున్నలు బలికావాలి. పసుపు, కుంకుమ, వేపమండలు, రక్తాన్నం, పెరుగన్నం మొద లయినవి ప్రీతికరమైన వస్తువులు.

గ్రామదేవతల్లో చాలావరకు స్త్రీదేవతలే. పురుష దేవతలు చాలాతక్కువ. ఒకవేళ ఉన్నా వారు స్త్రీ దేవతల సోదరులో, భర్తలో, బంధువులో అయి వుంటారు. ఆర్యదేవతల్లో ఎక్కువమంది పురుషులుగా ఉండడం, గ్రామదేవ తల్లో చాలామంది స్త్రీలుగా ఉండడం ఎన్నో అభిప్రాయాలకు దారితీశాయి.

విద్వాంసులు అనేక కారణాలను చెప్పారుగాని ఏవీ తృప్తికరంగా లేదు. కొందరి ప్రకారం ప్రపంచంలోని యుద్ధదేవతలంతా సామాన్యంగా పురుషులే. వ్యవసాయ దేవతలు స్త్రీలు. వ్యవసాయమే ప్రధానవృత్తిగా ఉండిన ద్రావిడులలో ఎక్కువగా స్త్రీలే ఉండడంవల్ల గ్రామదేవతలు స్త్రీలని వీరివాదం. ఏదిఏమైనా స్త్రీ శక్తి స్వరూపిణి అని భావించి గ్రామీణులు ఆరాధించారు, ఆరాధిస్తున్నారు. నాగరికత కొంతవరకు ప్రబలినా కూడా గ్రామదేవతల స్థాయిలో ఉన్న శక్తులను శివుని భార్యయైన పార్వతితో పోల్చి, సమీకరించి, ఆదిశక్తి స్వరూపంగా ఆరాధించే సంప్రదాయం కొనసాగుతుంది.

జానపదదేవతలకు చేసే పూజా విధానాలు, ఆరాధనా పద్ధతులు ఒక్కొక్కసారి చాలా విచిత్రంగా ఉంటాయి. ఇవి కఠోరమైనవి, భయంకరమైనవి కూడా అయివుండవచ్చు. బలి విధానాలు మొదలైనవి భయంకరమైనవే గాని వాటివల్ల మనిషికేమీ బాధలేదు. అయితే తన్నుతాను హింసించుకునే అనేక విధానాలను కూడా భక్తుడు అవలంబిస్తాడు. చారిత్రకంగా ఇటువంటి కొన్ని పద్ధతుల ఉల్లేఖనాలను గురించి ఇంతకుముందే చెప్పడమయింది. కొండకొమ్ము నుంచి దూకి ఆత్మహత్య చేసుకోడం, శూలాలు గుచ్చుకోడం, వాతలు పెట్టుకోడం, తడిగుడ్డలతో దేవాలయం చుట్టూ పొర్లుదండాలు పెట్టడం, అడుగడుగు దండాలు, దేహం నిండా సూదులు దబ్బనాలు గుచ్చుకొనిఆడుతూపాడుతూ చేసే సేవలు, తనబరువు బెల్లాన్ని సమర్పించుకోవడం, తలజుట్టు సమర్పించడం, తలనే సమర్పించడం, నిప్పుల గుండాలు తొక్కడం, స్త్రీ వేషాన్ని ధరించి సేవించడం, తనకు బాగా ఇష్టమైన పండునో కాయనో దేవుడి పేరుతో వదలిపెట్టడం లాంటి 'పవిత్రహింస'ల్ని అనుభవించే జానపదులను మెచ్చుకోవాలో, విమర్శించాలో, జాలిపడాలో తెలియని స్థితి మనది. మొత్తానికిది ఒక భయంకర వాతావరణం, జీవితంలో అశాంతిని నింపుకొని మళ్ళీశాంతిని పొందడానికి చేసే ప్రయత్నాలివి.

### కుల దేవతాపద్ధతి

జానపదులు ఆరాధించే దేవతామూర్తులు, వారికి సంబంధించిన పూజలు, జాతరలు, ఆచారాలు వగైరా ఒకరకమైతే కులదేవతా పద్ధతి పేరుతో తమ వంశానికి, కులానికి, తెగకు ఏదో ఒక వస్తువునో, ప్రాణినో, పక్షినో సంకే

తంగా ఉంచుకోడం ఒక పద్ధతి. దీన్ని ఇంగ్లీషులో టోటమిజం అంటారు. ఒక కులం లేక సమాజం ఆరాధించే దేవతాస్వరూపాన్ని గురించిన ఈ పద్ధతిని కులదేవతా పద్ధతి అనవచ్చు. జంతువురూపంగా, వృక్షరూపంగా, వస్తురూపంగా పూజలు పొందేది, లేక పవిత్ర వస్తువుగా భావింపబడేది ఈ కులదేవత. ఒక జనసముదాయంలోని వ్యక్తి తన కులదేవతను భయభక్తులతో ఆరాధిస్తాడు. ఒకవేళ జంతువయితే, దాన్ని వేటాడడు, హాని చెయ్యడు, ఇతరులు చంపబోయినా సహించడు. కులదేవతలను పచ్చరూపంలో దేహంమీద పొడిపించుకునేవాళ్ళున్నారు. ఒకవేళ పొరపాటున కులదేవతయైన జంతువును తింటే ఇంక వంశం నిర్నామ మవుతుందని, వ్యాధులు సంక్రమించవచ్చునని జానపదుల నమ్మకం, కులదేవత చనిపోతే మనుషులకుచేసినట్లే యధావిధిగా కర్మకాండలు కూడా జరుపుతున్నారు.

దీనికి విరుద్ధమైన పద్ధతులుకూడా ఉండవచ్చు. కులదేవతనే జీవనాధారంగా ఉపయోగించుకొనేవారున్నారు. తొొదజాతివారు తమ కులదేవతయైన గేదెనే పాడిపశువుగా ఉపయోగించుకుంటారు. కులదేవతను పవిత్రంగా ఎంచి చంపని జాతుల్లో కూడా ఏడాదికో, కొన్నిఏళ్ళకో జరిపే ఉత్సవాలలో వాటిని చంపి తినడం చేస్తారు. అయితే దీనికి ప్రత్యేక కారణముంది, తమ సంఘంలోని వారంతాచేరి ఈ విధంగా కులదేవత మాంసాన్ని భుజించడంవల్ల తమకందరికీ కులదేవత శక్తులన్నీ లభిస్తాయని వారి నమ్మకం. తరతరాల వంశజుల రక్తగతమైన మహాశక్తి కులదేవతలో నిక్షిప్తమై ఉంటుందని కులదేవతను ఆచరణాత్మకంగా భుజించినప్పుడు ఆశక్తి తమకూవస్తుందనివారినమ్మకం.

ప్రపంచలోని వివిధతెగల్లో అనేకకులదేవతలున్నాయి. గేదె, పాము, బాతు, హంస, కుక్క, మొసలి, కోతి, అడవిపంది మొదలైనవి కులదేవత స్థానం పొందాయి. తెలుగు కథాగేయాలలోని కులదేవతా పద్ధతిని గురించి డా. నాయని కృష్ణకుమారి పరిశీలించి అనేకాంశాలను వివరించారు. (1977: 134—183). వీరారాధనాంశములను గూర్చికూడా డా. కృష్ణకుమారి సవివరంగా చెప్పారు (1977:247—301)

## వీరారాధన

జానపద విజ్ఞానంలో వీరారాధన గేయాలలో, కథాగేయాలలో, కథలలో ఎన్నోచోట్ల వ్యక్తమైంది. సాంఘిక ఆచారాలలో ఒకటిగా ఒకతరంనుంచి

మరొకతరానికి సంక్రమించే జానపద విషయాలలో ఇదీ ఒకటి. సాహస ప్రియత్వం ఆదిమమానవుని జీవితంలో ప్రధానమైంది. అనునిత్యమూ ప్రకృతితో పోరాడవలసిన స్థితిలో ప్రాచీన మానవుడుండేవాడు. వేట ప్రధాన వృత్తిగా ఉండినకాలంలో దినానికొక సాహసంచేస్తేనే తనకు, సంఘానికి తిండిపెట్టగలిగిన స్థితిలో ఉండేవాడు మానవుడు. ఆటవిక సంఘంలోకూడ క్రమక్రమంగా మానవ సమూహాలు ఏర్పడి నాయకులు తయారయ్యారు. నాయకత్వం నిలుపుకోడానికి యుద్ధాలు చేయవలసి వచ్చేది. కొన్నిదేశాల్లో వేటలోచంపే జంతువులను బట్టి, శత్రువుల్లో చంపిన వ్యక్తుల సంఖ్యనుబట్టి నాయకత్వ నిర్ణయం జరిగేది సంఘంలోని సభ్యుల ప్రశంసలుపొందేవిధంగా సాహసాన్ని ప్రదర్శించినవాడు వీరపూజలందుకునేవాడు. అతని చిత్రాలతో వీరగల్లులు వెలశాయి, శాసనాలు వ్రాయబడ్డాయి. ఇది మనదేశంలో మాత్రమే కాదు, అన్ని దేశాలలో ఈ సంప్రదాయం ఏదో ఒక రూపంలో ఉండనేఉంది వీరారాధనగురించి డా. నాయని కృష్ణకుమారి ఈ క్రింది విధంగా వివరించారు. జపాన్‌దేశపు చక్రవర్తి మరణానంతర మాతనిని సూర్యదేవత (Sun goddess) గా కొలుచు నాచారము కలదు. అట్లే అచట యుద్ధభూమియందు మరణించిన వీరుని సర్వలాంఛనములతో సమాధిచేసి, గుడికట్టి పూజించునాచారము కలదు. ప్రాచీన గ్రీసుదేశమున వీరులకు సంబంధించిన పూజావిధానము (Hero Cult) చాల ప్రాముఖ్యమై యొప్పారినది. ఇచ్చట వీరులందరును దైవాంశము కలవారే. వారీ భూమిని వదలి వెడలిన వెనుక పూర్తిగా దైవ రూపము నందుదురు. ఇట్లు వీరుల నారాధించుటవలన వారు మనుష్యజాతికి మార్గదర్శకులుగా, సంరక్షకులుగా సంతానఫలప్రదాతలుగా, యుద్ధవిజయము నందించు సహాయకులుగా వెన్నుకాగి యుందురని యానాటి మనుష్యులు నమ్మెడివారు ఫోషియన్లలో (Phocians) వీరుల సమాధులయందు, తాము యుద్ధమున జయించి చెఱగొన్న బందీల రక్తమును చల్లి, వారిని పూజించు నాచారము కలదు.

హాటిన్‌టూట్స్, వారి ముఖ్యదేవతయగు 'సుయిగోబ్' (Tsui goab) యొక్క వీరచర్యలను కథనము చేయుచు, వానిని వీరునిగనేపూజింతురు.

క్రేటనలు తమ దేవుడగు జీయస్ Zeus సమాధినొక దానిని చూపుచు నాతని వీరచర్యలనుగ్గడింతురు. ఈ యంశముల నితోధికముగా పరిశీలించియే Herbert-spencer పండితుడు, ఆదిమ జాతులయందు వీరకార్యాచరణ పరాయణుడైన.మానవుడే భగవంతుడుగా నారాధింపబడెనని నిర్ణయించెను. వీరులనిట్లు పూజించునాచారము భారతదేశమంతటను కలదు'' (1977: 252-253)

మంత్రం-తంత్రం

మంత్రం (religion)తంత్రవిద్య (magic) అతిమానుష శక్తుల మీద నమ్మకానికి రెండు ముఖాలు. దైవం వికృతే దయ్యమైనట్లుగా మంత్రాలొకవైపు మతానికి సహకరిస్తే, తంత్రాలు తాంత్రికునికి సహకరిస్తాయి. 'మాజిక్' అనే పదం 'మాగి' నుంచి వచ్చింది. దానికి అద్భుత మంత్రశక్తి గల ప్రాచీన పర్షియాపురోహితుడని అర్థం దీనికి మంత్రవిద్య, తంత్రవిద్య గారడి. కనుకట్టు' ఇంద్రజాలం, అభిచారం మొదలైన పేర్లున్నాయి, దేవతలకు సంబంధించిన మంత్రవిత్య, దయ్యాలకు సంబంధించిన మంత్రవిద్య, ఏ శక్తులకూ సంబంధించని మంత్రనిద్య ఉన్నాయి.

తంత్రవిద్య వైజ్ఞానికమనే భ్రమపుట్టిస్తుంది, దానిలోను విజ్ఞానంలో లాగే తర్కం ఉంది. అయితే విజ్ఞానంలోని తర్కం ఆధారసహితమైంది. తంత్ర విద్యలోనిది దోషభరితమైంది. భ్రమే తంత్రవిద్యకు మూలం. ఇది నిజమేనేమో అనేభ్రమను అది పుట్టిస్తుంది. గారడీవాడు ఏదైనా మహిమను ప్రదర్శించినపుడు అది నిజమేనేమో అని మనకు భ్రమకల్గుతుంది. కాని అది నిజంకాదు. ఏది ఏమైనా తంత్రవిద్య విజ్ఞానంకంటె ప్రాచీనమైనది ఒక విధంగా విజ్ఞానానికి తంత్రవిద్యేమూలం, అయితే దానిలోని దోషాలను పరిశీలించుకొని విజ్ఞానం వికాసం చెందింది. తంత్రవిద్యకు కాణాచి అయిన అధర్వవేదం అందుకే ఒక్కొక్కసారి వైజ్ఞానిక గ్రంథమనే భ్రమ పుట్టిస్తుంది.

తంత్ర విద్య పుట్టుకకు కారణమేమై వుండవచ్చునని విద్వాంసులు కొందరు ఆలోచించారు. ఆదిమానవుడు ప్రకృతిలో కొన్ని సమస్యలను

విద్య (Sympathetic magic) అనే పదాన్ని వాడారు. దీన్ని కొందరు సాంక్రామిక తంత్రవిద్య (contagiousmagic ) అన్నారు. అలెగ్జాండర్ క్రాప్పె సంవేదనాత్మక తంత్ర విద్యను, హోమియోపథిక్ తంత్రవిద్యను గూర్చిచెప్పాడు.ః

తంత్రవిద్యలో పునరావృత్తి అన్నది మరొక ముఖ్య గుణం. ఎవరైనా జ్వరంతో బాధపడుతుంటారు. తనకు తన సంఘంలోని వ్యక్తులకంటె ఎక్కువ మహిమలున్నాయని నమ్మిన వ్యక్తి కొంచెం విభూతిని మంత్రించి ఇస్తాడు. అప్పటికే తగ్గుముఖం పట్టిన జ్వరం విభూతి తీసుకోగానే తగ్గిపోయింది. వెంటనే ఈ విషయం పదిమందికి తెలుస్తుంది. ఇలా బలపడిన నమ్మకమే పునరావృత్తి తంత్రానికి కారణమవుతుంది.

తంత్ర విద్యను ఎప్పుడూ చెడ్డ పనులకే ఉపయోగిస్తారనీ చెప్పడానికి లేదు. పై ఉదాహరణలలోనే కొన్ని శత్రునిర్మూలనానికి, కొన్ని రోగనిర్మూల నానికి ఉపయోగించే సందర్భాలను పేర్కొనడం జరిగింది. వంధ్యాస్త్రీకి సంతానం కలగాలని, సుఖప్రసవం కావాలని, రోగాలు నివారణ కావాలని తంత్రవిద్యను ఉపయోగించడం కూడా జరుగుతుంది. చివరికి చనిపోయిన వారిని బ్రతికించే వారు కూడా ఉన్నారు ! 'చావుఆట'ను ఆడి రోగాలను నయం చేసే పద్ధతులు కూడా ఉన్నాయి ఒక మంత్రగాడు చనిపోయినట్లు పడు కుంటాడు. మరొక మంత్రగాడు చనిపోయిన ఈ మంత్రగాడిని బ్రతికిస్తాడు. ఊరక పడుకున్న రోగికి నయమై పోతుండి !

పై ఉదాహరణలను పరిశీలించిన తర్వాత తంత్ర విద్యలో ప్రయోజ నాత్మకమైనది కొంత భాగమైతే, విరుద్ధాత్మకమైనది మరో భాగం అని తెలు స్తుంది. నిజానికి రెండూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో హాని చేసేవనే విషయం మాత్రం మరిచి పోరాదు.

మతానికి తంత్రవిద్యకు కొన్ని పోలికలు, కొన్ని భేదాలు ఉన్నాయి. మతంలోను మంచి చెడ్డ ఉన్నాయి. అయితే మతం తంత్ర విద్యంత భయం కరమైంది కాదు. దానిలో అనుసరించే విధానాలలో కూడా తంత్ర విద్యకంటె సరళమైనవి, సర్వజనులు పాల్గొనేవి ఎక్కువగా ఉంటాయి. తంత్రవిద్య రహస్యమైనది. కొందరు మాత్రం చెయ్యగలిగింది· నిషేధాలకు నిలయం

తంత్ర విద్య. మాంత్రికులనే ప్రత్యేక వ్యక్తుల సృష్టికి కారణమయింది తంత్ర విద్య. ప్రాచీన సమాజాలలో కూడా పురోహితుడు, మాంత్రికుడు ఉండేవారు. మామూలుగా మత సంప్రదాయాలను సంరక్షించడానికి పురోహితుడు, తంత్ర విద్యను ప్రయోగించడానికి మాంత్రికుడు ఉంటారు. ఈ ఇద్దరు వ్యక్తులు వేరువేరుగా రూపొందినా కూడా చాలాకాలంవరకు సామాన్య జనులకు వీరిమధ్య భేదం ఏమిటని అర్థం కాలేదు. అందువల్ల పురోహితుడు కూడా సామాన్య జనుల మౌఢ్యాన్ని బట్టి కొంత వరకు తంత్ర విద్యను కూడా ప్రయోగించవలసిన అవసరం ఏర్పడింది. అందువల్లనే నేటి మత సంప్రదాయాలలో తాంత్రిక సంబంధమైనవి కూడా చాలావరకుభాగం సంపాదించాయి మాంత్రికుడే పురోహితుడై ఆ తర్వాత పురోహితుడే ఊరికి నాయకుడు, సంఘానికి నాయకుడయిన సందర్భాలున్నాయి. వాన రప్పించడం, పంటలు పండేట్లు చేయడం, రోగ నిర్మూలన చేయడం, ప్రకృతి శక్తులను తన వశం చేసుకోడం పురోహితుడి పని అయింది.

మంత్ర తంత్రాలకు సహకారులుగా ఇంకా ఎన్నో విద్యలు ఉద్భవించాయి, కర్మ సిద్ధాంతం, జ్యోతిషం, హస్తసాముద్రికం మొదలయినవి మంత్ర తంత్రాల పైఫల్యాన్ని సమర్థించుకోడానికి మంచి బలాన్ని ఇచ్చాయి. మంత్ర తంత్రాలను ప్రయోగించిన తర్వాతకూడా నయం కాని రోగాన్ని గూర్చి జనులు ఇది మన కర్మ. దేవుడేం చేస్తాడు దయ్యమేం చేస్తుంది' అని అనుకునే పరిస్థితి ఏర్పడింది. శకునాలు మొదలైనవి కూడా ఇలా బుకాయించడానికి మాంత్రికులకు, పురోహితులకు సహాయం చేశాయి, ఉదాహరణకు వానకోసం మంత్రాలు చదివి కర్మకాండలు జరిపి అప్పటికీ ఒక్క చినుకుకూడా పడకపోతే పురోహితుడు గాని, మంత్రగాడుగాని సమర్థించుకోడానికి ఏదో ఒక నెపం చూపిస్తాడు. 'వానరావాలంటే ఒక్క మేఘమైనా గర్భవతిగాఉండాలి. అన్నీ తెల్లమేఘాలే ఉంటే మన మంత్రాలు వినపడవు' అంటారు' లేదా 'కాకి కుడినుంచి ఎడమకు వెళ్తే వానరాదని మన శాస్త్రాలలో చెప్పలేదా? అందుకనే వాన రాలేదు' అంటాడు కొన్ని వైజ్ఞానిక సత్యాలను కూడా మంత్ర తంత్ర విద్యలకు సహకారులుగా మార్చుకున్న సందర్భాలను గమనిస్తే ఈ విషయం చక్కగా బోధపడుతుంది.

నిప్పులగుండం తొక్కడం మరీయకర్మకాండలలో ఒకటి. ఇది వైజ్ఞానిక సత్యమేగాని. మరీయమైన మహిమ గాని, అద్భుతశక్తిగాని ఇందులో ఏమీ లేదు. కొంత అనుభవంతో ఎవరైనా, ఏ సందర్భంలోనైనా నిప్పులను త్రొక్కవచ్చు. అందుకు కావలసింది నిప్పులను కణకణమండేటట్లుగా, ఎర్ర నిప్పులుగా చెయ్యటం, నిప్పులమీద నిలవకుండా ఈ వైపుకు ఆవైపుకు పరుగెత్తడం, నిప్పులు తొక్కేవాళ్ళ కాళ్ళు బాగా కడుక్కొని పరుగెత్తడంవల్ల ఇది ఇంకా సులభం అవుతుంది. మన ఇళ్ళలో స్త్రీలు చేతులు కడుక్కొని చంద్రనిప్పులను అవలీలగా పట్టుకొని బయట పడేసే విధానంలో రహస్యం ఇదే. నాలుకమీద కర్పూరం వెలిగించుకోడం.చేతిలో కర్పూరం వెలిగించుకొని కొన్ని క్షణాలు, అట్లే ఉంచి నోట్లో వేసుకొని మింగడం, ఇలాంటి వన్నీ వైజ్ఞానిక సత్యాలే, అయితే ధార్మిక పరిసరాలలో జరగడం వల్ల ఇవన్నీ అద్భుతాలనే భ్రమను కల్గిస్తాయి. ఇలాంటి మూఢ విశ్వాసాలన్నీ అనేక వామాచారాలకు దారితీసి సమాజంలో వీటిని గురించిన భయసందేహాలకు, ఆశ్చర్యానికి దారితీశాయి. మనిషిని మరింత అంధకారంలోకి తీసుకు వెళ్ళాయి.

మంత్ర తంత్రాలకు కావలసిన సామగ్రిని పట్టీచేస్తే అది కొండవీటి చాంతాడంత అవుతుంది. చుట్టుపక్కల దొరికే ఏ వస్తువైనా మాంత్రికునికి పవిత్రవస్తువే. రాళ్ళు, రప్పలు, చెట్లు, చేమలు, మట్టి, తోలు, ఎముకలు, కపాలాలు, గవ్వలు, పసుపు, కుంకుమ, వెంట్రుకలు, గోళ్ళు, సూదులు, కత్తులు, కటార్లు, యంత్రాలు, బీజాక్షరాలు, తాయెతులు, నూనెలు మొదలైన వన్నీ వాడుకలో ఉన్నాయి.

జంతువులకు సంబంధించిన భాగాలను ధరించడం వల్ల ఆ జంతువుకుండే ఉన్నతగుణాలు లభ్యమవుతాయనే నమ్మకం వల్ల పులిగోరు మొదలైన వాటిని ధరించే పద్ధతులు వచ్చాయి ఎలుగుబంటి వెంట్రుకలను తాయెతులో పెట్టి ధరించడం వల్ల గ్రహబాధలు, భూతప్రేత పిశాచాదుల బాధలు తగ్గుతాయని కొందరి నమ్మకం. చెట్లు చేమల భాగాలను ధరించడమూ మరికొందరు చేసేవని. మహామ్మారిని, కొన్ని రోగాలను ఇంట్లోకి రాకుండా చెయ్యడానికి ముళ్ళు, కొన్ని చెట్ల భాగాలు వ్రేలాడ దీయడం వంటి పద్ధతులున్నాయి.

మతం ఒకవైపు మానవుని ఆత్మశాంతికి, అభ్యున్నతికి, సుఖజీవనానికీ సోపానమని చెప్పుకుంటుంటే మరొకవైపు మతం పేరుతో వేసే వెర్రితలలను కూడా చూస్తున్నాం. జనులలో నిరక్షరాస్యత, మౌఢ్యం గూడుకట్టుకొని ఉన్నంత కాలం తంత్రవిద్య కూడా ప్రబలమవుతూనే ఉంటుంది. అందువల్లనే తంత్రవిద్య మతంలోని సౌమ్యభాగానికంటె అపాయకరం, ఎందుకంటే మనుషుల్ని మభ్యపెట్టే తర్కం అందులో ఉంటుంది.

టిప్పణి

1. "Primitive, folk and civilized religions number more than 5,000 in the world today, and each is a composite of varying beliefs, behavior, specialists, and groups. Religious beliefs, to be so defined, must involve supernatural entities toward which sacred attitudes are directed by groups of people" John C. Messenger, *Folklore and Folklife*, Richrard M. Darson (ED.), 1972. p. 218.

2. Alexander H. Krappe చెప్పినSympathetic magic నిర్వచనం., "Its logic assumes the continuance of a relationship that has in fact ceased". Homeopathic magic ను గురించిచెప్తూ క్రాప్పె" Its logic may rendered by the latin proverb Similia Simlibus "అన్నాడు పై విషయాలను వ్రాసిన వారు దేజగౌ "జానపద అధ్యయన" (కన్నడం). పు. 260.

# పండుగలు - నోములు -
# ఉత్సవాలు - జాతరలు

తెలుగునాట పండుగలు — పర్వాలు - నోములు - వ్రతాలు, ఉత్సవాలు, ఊరేగింపు, జాతరలు - కొలువులు తరతరాలుగా సమాజంలోని వివిధవర్గాల వ్యక్తుల్ని ఒక్కచోట చేరుస్తున్నాయి. ఎక్కువమంది పాల్గొనకపోతే పండుగలకు గాని, ఉత్సవాలకు గాని, ఇలాంటి మరే సాంఘికాచారాలకుగాని 'కళా కాంతులు' రావు. ఇటువంటి ఉత్సవ సంప్రదాయాలను గురించిన ఉల్లేఖనాలు తెలుగు కావ్యాలలో పెక్కుచోట్ల కనిపిస్తూ, వీటి చరిత్ర సుదీర్ఘమైనదని నిరూపిస్తున్నాయి.

శివరాత్రి మాహాత్మ్యంలో వివిధ ఋతువులలో వచ్చే పండుగలను గూర్చి చెప్పబడింది.

'చలి ప్రవేశించు నాగుల చవితివాడు
మెఱయు వేసవి రథసప్తమీ దినమున
అచ్చ సీతు ప్రవేశించు పెచ్చుపెరిగి
మార్గశిర పౌష మాసాల మధ్యవేళ.
ఇండ్ల మొదలను నీరెండ నీడికలను
అనుగుదమ్ముడు నన్నయు నాటలాడు
అత్తయును కోడలును గుమ్మలాడు కుమ్మ
గాచు చోటికి మకర సంక్రాంతి వేళ' (ఆ4 - 25, 27).

సింహాసన ద్వాత్రింశికలో దివ్వెల పండుగను గురించి ఉంది (2వ భాగం - పు. 39). తెలంగాణాలో నేటికీ దివిలి పండుగ అన్నపేరు వాడుకలో ఉంది. పున్నమకు, అమావాస్యకు చేసే పూజలు, పండుగలు అనేకం ఉన్నాయి. ప్రతి పున్నమి, ప్రతి అమావాస్య పండుగే. దవన పున్నమ (ఏరు

వాక). నూలిపున్నమ (శ్రావణ పూర్ణిమ) అనే వాటిని పాల్కురికి సోమ నాథుడు పండితారాధ్య చరిత్రలో పేర్కొన్నాడు.

ఉత్సవాలు, జాతరలు పెక్కు ప్రాచీనకావ్యాలలో వర్ణించబడ్డాయి. ఆ కాలంలో రాజులు, మంత్రులు ఉత్సవ కాలంలో రూకలు చల్లి బీదలకు దానం చేసేవారట. శ్రీకాకుళం తిరునాళ్ళకు ప్రసిద్ధమై ఉండేదని మంచన కేయూర బాహుచరిత్రలో వర్ణించాడు (1–45).

'నలువుగ కాకుళేశు తిరునాళులలోపల గుండమంత్రి నిర్మలమతి బిట్టు వేగముగ మాడలు రత్నచయంబు చల్లె'నని గుండమంత్రి వితరణశీలి అనే విషయాన్ని తెలిపాడు. కాకతీయుల కాలంలో శ్రీకాకుళం తిరునాళ్ళకు ప్రసిద్ధమై ఉండేదని క్రీడాభిరామంలో ఉంది.

## పండుగలు

సంప్రదాయాలు లేకుండా ప్రయోగాలు లేవు. ఆదిలో లేనిది అంత్యంలో లేదు. తరతరాలుగా జనసమూహంలో నిలిచి ఉన్న నమ్మకాలు, సంప్రదాయాలు క్రియారూపాన్ని దాల్చగా పండుగ లేర్పడ్డాయి. మొదట ప్రకృత్యారాధనగా ప్రారంభమై, వ్యవసాయ సంస్కృతికాలంలో స్పష్టరూపాన్ని పొంది, తర్వాతి కాలంలో ఇంకా క్లిష్టస్వరూపం సంపాదించి, చివర ప్రాచీన ఆచారాల సూచ్యగుణాన్ని మాత్రంకలిగి ఉత్సాహాన్ని, ఉల్లాసాన్ని కలిగించేవిగా పండుగలు రూపొందాయి. "సాంఘిక సంక్షేమంకోసం విశేష సందర్భాలలో జానపద విశేషాలు, సంప్రదాయాల కలబోతగా ఆచరించే సంక్లిష్టమైన అంశమే పండుగ"- అని బాగ్స్ పండుగను నిర్వచించాడు.

పండుగ సాంఘిక సంక్షేమంకోసం అన్నదానిలో ఇది సంఘానికి సంబంధించిందని, వ్యక్తికి సంబంధించింది కాదని స్పష్టమవుతుంది. సంఘానికి సంబంధించిందన్నంత మాత్రాన అందరూ ఒకచోట చేరాలని అర్థం కాదు, ఉదాహరణకు దీపావళినే తీసుకుందాం. దీపావళిని అందరూ ఒక్క చోట కలిసి ఆచరించరు. అక్కడక్కడా పిల్లలు గుంపుగూడి టపాకాయలు కాల్చవచ్చు. అయితే ఇది ఒక్కొక్క కుటుంబంలో జరుపుకొనే పండుగ మాత్రమే. ఇది సంఘానికి సంబంధించిందని ఎందుకంటున్నామంటే, అదే

రోజు ప్రతి ఇంట్లో పండుగను జరుపుకుంటారు కనుక. పండుగనగానే కొడుకులు, కోడళ్ళు బంధువులు ఒక్కచోట చేరడం ఉండనే ఉంటుంది. క్రొత్త బట్టలు ధరించడం, నలుగురూ పలకరించడం, కబుర్లు చెప్పుకోడం, సంతోషాన్ని పాలు పంచుకోడం జరుగుతుంది.

విశేష సందర్భాలలో వీటిని జరుపుతాన్నది మరోలక్షణం. మహాత్ముల జన్మదినాలుగానో, విశేష తిథివార నక్షత్రాలలో వస్తాయన్న కారణంగానో పండుగ అనగానే ఏదో ఒక విశేషం స్ఫురిస్తుంది. అది ఒక కుటుంబానికి చెందిన విశేషమో, ఏదైనా తిథినాడో, మాసంలో ఒక దినంనాడో వచ్చిన పండుగో అయితే ఒక్కొక్క కుటుంబంలో ఆచరిస్తారు. దేశానికంతటికీ సంబంధించిన పండుగో, జాతీయ ప్రాముఖ్యంగల స్వాతంత్ర్యోత్సవం లాంటివో, ఊరికంతటికీ సంబంధించిన ఊరేగింపు, జాతర మొదలైనవాటిల్లో అందరూ పాల్గొంటారు.

పండుగలు ఏ విధంగా అవతరించాయి, ఎప్పుడు ఉద్భవించాయి, ఎందుకు అనే ప్రశ్నలకు సమాధానాలను రాబట్టడం చాలా కష్టం. ప్రకృతికి సంబంధించిన పండుగలు, వ్యవసాయానికి సంబంధించిన పండుగలు చాలా ప్రాచీనమైనవని చెప్పవచ్చుగాని ఖచ్చితంగా ఏ దశలో అవి వెలువడ్డాయని చెప్పడమూ కష్టమే. చాలా వరకు పండుగలకు మూలం ప్రాచీన కాలపు కర్మకాండలనడంలో సందేహంలేదు. ఒకప్పుడు మత సంబంధమైన ఆచరణలుగా ఉండినవే తర్వాతి కాలంలో మతానికి సంబంధించిన విషయాలను చాలా వరకు కోల్పోయి, జనులు ఆనందం కోసం ఆచరించే పండుగలయ్యాయి. ప్రాచీన యుగాలలో సమాజంలోని ఇతరులకోసం యుద్ధాలలో, సాహస కార్యాలలో అసువులు బాసిన అమరవీరులు, గ్రామంకోసం, ప్రజా సంక్షేమం కోసం ఆత్మబలికి కూడా సిద్ధమైన నారీమణులు ప్రజలచేత పూజలందుకున్నారు. ఇటువంటి మహనీయుల సంస్మరణ కోసం కూడా కొన్ని పండుగలు రూపుదాల్చాయి. మత సంప్రదాయాలను, నీతి నియమాలను బోధించిన ఉన్నత వ్యక్తులు, ధార్మిక మహాపురుషుల గౌరవంకోసం కూడా కొన్ని పండుగలు ఉద్భవించాయి.

మొదట మానవాతీత శక్తులమీద అచంచల భక్తిని ప్రదర్శిస్తుండిన ఆది మానవుడు, తర్వాత తర్వాత ఉత్సవ ప్రియుడై తన యిష్టాన్నే దేవుడికీ అంట గట్టి, దేవుని ప్రీత్యర్థమంటూ తనకు కావలసినవి చేయనారంభించాడు. మనిషి మనిషిని మంచిచేసుకోవడానికి ఉపయోగించే పద్ధతుల్నే దేవుణ్ణి మంచి చేసు కోవడానికి కూడా ఉపయోగించనారంభించాడు. ఇలా చెయ్యగా చెయ్యగా ఉత్సవ సంప్రదాయాలు పెరుగుతూ వచ్చాయి. మొత్తంమీద మానవుని జీవి తంలో సమస్యల్ని కొంతవరకు మరిచి పోవడానికి పండుగలు అవకాశా న్నిచ్చాయి. మనిషి యాంత్రిక జీవితాన్ని ఇవి కొంతవరకు విడుపును ప్రసాదిం చాయి. అయితే పరోక్షంగా మత సంబంధమైన ప్రయోజనాన్ని కూడా పండు గలు నెరవేర్చకపోలేదు. ప్రత్యక్షంగా కాకున్నా, పరోక్షంగానైనా ఈ పండు గలు మత సంబంధమైన గంభీర కర్మకాండల వైపు మనిషి మనస్సును ఆకర్షిం చడానికి తోడ్పడ్డాయి. ఇదో విధంగా చెప్పాలంటే, మనిషి ఒకవైపు ధార్మిక కర్మ కాండలనుంచి తప్పించుకోడానికి పండగల నేర్పరచుకుంటే, ఇంకోవైపు వీటి ద్వారానే పండుగల వైపు ఆకర్షితుడయ్యాడు

సమాజంలోని నలుగురినీ ఒకవైపు చేర్చడంవల్ల, చేర్చకున్నా ఒక్క సారే పలువురు ఒకే విధమైన ఆచరణను జనపదంమూలంగా ఏకాభిప్రాయ సాధనకు దోహదం చేయడంవల్ల పండుగవల్ల మంచి ప్రయోజనమే జరుగు తుందనడంలో సందేహంలేదు. సమాజంలోని వ్యక్తుల మధ్య పరస్పరాభి ప్రాయ వినిమయం జరగడం వల్ల, చింతన మంథనాలై క్రొత్త ధీయుక్తుల అవతరణకుదారి ఏర్పడుతుంది. జనజీవనానికి సంబంధించిన అనేక విషయాలు ఈ సందర్భంలో ప్రస్తావనకు వస్తాయి. కొంగ్రొత్త సంబంధా లేర్పడతాయి; బలపడతాయి. సాంస్కృతికమైన స్ఫూర్తిని కలిగించడంలో ఇవి ప్రధాన పాత్రవహిస్తాయి జానపదుల రస దృష్టికి, ఉత్తమాభి రుచులకు తార్కాణగా ఉంటాయి పండుగలు.

ఎన్నో ఉద్దేశాలతో, ఎన్నోరకాలుగా వెలువడిన పండుగలను వర్గీక రించడం కూడ కష్టమైనపనే. వీటిలో కొన్ని జాతీయస్థాయిలో జరపబడేవి, మరి కొన్ని రాష్ట్రస్థాయిలో జరిగేవి లేక ప్రాదేశికమైనవి. ఈ రెండోరకంవి ఒక సాంస్కృతిక క్షేత్రానికో, భాషాప్రాంతానికో, భౌగోళిక పరిధికోలోబడి

ఉంటాయి. ఇక మూడవ రకం పల్లెపట్టులలో చేసే పండుగలు. ఒక్క-ఆంధ్రులనే దృష్టిలో పెట్టుకొని చెప్పినాకూడా ఈ విధమైన మూడు విభాగాలను చేసేందుకు వీలుంది.

1. ఆంధ్రులందరూ ఎక్కడున్నా ఆచరించే ఉగాది, సంక్రాంతి మొదలైన పండుగలు,
2. ఆంధ్రప్రదేశంలోనే కొన్ని ప్రాంతాలలో మాత్రం వాడుకలో ఉండేవి. బ్రతుకమ్మ, బొడ్డెమ్మ, కాముని పండుగ మొ॥వి వీటిలో కొన్ని ఒకానొక కాలంలో రాష్ట్రీయ స్థాయిలో ఉండి ఉండవచ్చు.
3. పల్లెల్లో ఒక్కొక్క దేవుడికీ చేసే ఉత్సవాలు, ఆచరించే పండుగలు మొదలగునవి.

తెలుగువారి పండుగలు

తెలుగువారి పండుగలను ఒక్కొక్కసారి ప్రత్యేకంగా వివరించడం కష్టం. ఉత్సవాలు, ఊరేగింపులు, జాతరలు కూడ ఒక విధంగా పండుగలే, నోములు, వ్రతాలు పండుగలు కావని ఎవరనగలరు ? అయినా మనంవాడుకునే పదాలను బట్టి వీటిలోనే కొన్నింటిని పండుగలని, కొన్నింటిని వ్రతాలని. కొన్నింటిని ఉత్సవాలని పిలవడం జరుగుతున్నది.

తెలుగువారు పండుగలను ఆచరించేటప్పుడు ఏమేమి చేస్తారు అన్నది కుతూహలాన్ని రేకెత్తిస్తుంది. పండుగలకు మనం చెప్పుకునే ఆచారాలు జానపదులకు సంబంధించినవే కాని శిష్టులకు సంబంధించినవికావు, ఎందుకంటే శిష్టుల పాలిటికి చాలా వరకు పండుగలు విలువను కోల్పోయాయి. చివరికి మిగిలింది వీలయితే కొత్తగుడ్డలు కట్టుకోవడం, సుష్టుగా భోంచెయ్యడం మాత్రమే. కానిజానపదులకు పండుగ వచ్చిందంటే ఎక్కడలేని సంభ్రమమూ వస్తుంది.

పండుగ ముందురోజు రాత్రే ఇల్లంతా కడిగి, పుట్టి యిల్లయితే గోమయంతో అలికి, ఎర్రమట్టి గోడలకు తీర్చిదిద్ది క్రొత్తకళను తెస్తారు. ఇల్లు అలకగానే పండగ కాదని జానపదులకు తెలుసు. తెలిసిన అన్ని రంగవల్లులతో

తీర్చిదిద్దితేనే అసలైన కళ వచ్చేది. ఎప్పుడూ ఎలాఉన్నా పండుగనాడు మాత్రం ప్రతిఒక్కరూ తెల్లవారుఝామునే లేవాల్సిందే. లేవగానే సరికాదు చక్కగా తలంటి స్నానం చేయాలి. తలంటు మాత్రం చాలదు. అభ్యంజనమే కావాలి. ఇక పండుగను బట్టి పూజా విధానాలు, వాటికి సమకూర్చుకునే వస్తువులు ఉంటాయి. ఈ పూజా విధానాలు వాటి కథాకమామీషంతాపండుగల పుట్టుపూర్వోత్తరాలను తెలుసుకోడానికి ఉపయోగిస్తాయి. కాని పండుగలను ఆచరించే వారికి వీటితో ఎక్కువగా నిమిత్తంలేదు. మొదటే చెప్పినట్లు పండుగలలో కర్మకాండల ప్రత్యక్షపాత్రకు ప్రాధాన్యం తగ్గి ఉల్లాసానికి ఆనందానికే ఎక్కువ ప్రాధాన్యం వచ్చింది.

చాంద్రమానం: ఆంధ్రుల పండుగలు చాలావరకు చాంద్రమానాన్ని అనుసరించేవి కాలాన్ని గణించడానికి మనదేశంలో ఉండిన తొమ్మిదివిధాలలో ముఖ్యమైనవి చాంద్రమానం సౌరమానం. ఈ విషయంలో తెలుగువారు కన్నడిగులకు సన్నిహితులు తమిళులు సౌరమానాన్ని అనుసరిస్తారు. చాంద్రమానాన్ని అనుసరించే తెలుగు వారికి మొదటిపండగ ఉగాది. యుగాదినికూడా ఉగాదిగా చేసుకొని, అచ్చమైన తెలుగుపండుగలాగే ఆచరించే సంప్రదాయం మనది. యుగాది ఎందరికైనా ఉండవచ్చు, కాని తెలుగువారి ఉగాదికే కొన్ని ప్రత్యేకతలు ఉన్నాయి.

ఉగాది

చైత్ర శుద్ధ పాడ్యమినాటి ఉగాదితో చాంద్రమానాన్ని అనుసరించే తెలుగువారి క్రొత్తసంవత్సరం ప్రారంభమవుతుంది. అయితే ఎప్పుడూ ఇలాగే జరుగుతుండినదని అర్థంకాదు. రామాయణంలో 'పన్నెండో మాసమైన చైత్రంలో నవమి దినంనాడు శ్రీరాముడు జన్మించాడని చెప్పబడింది. అందువల్ల ఆ కాలంలో వైశాఖమాసం నుంచి క్రొత్తసంవత్సరం ప్రారంభమవుతుండినదని తెలుస్తున్నది. క్రీ. శ. 5వ శతాబ్దిలో వరాహమిహిరుడు చైత్రమాసంనుంచి క్రొత్తసంవత్సరం ప్రారంభమయ్యే సంప్రదాయాన్ని ప్రారంభించాడంటారు. ఆంధ్ర, కర్నాటక, మహారాష్ట్రిలలో ఈ దినమే ఉగాదిని పాటిస్తారు.

ఉగాది జీవనంలోని సుఖదుఃఖాలను ప్రతిబింబించే ఉత్తమ పర్వదినం. కన్నడిగులు సుఖదుఃఖాలకు ప్రతీకగా వేపపూలను బెల్లాన్ని కలిపితింటాడు. తెలుగువారి ఉగాది పచ్చడి సుఖదుఃఖాలను మాత్రమే కాక జీవితంలోని వగరును, రౌద్రాన్ని, పులుపును కూడా ప్రతిబింబిస్తుంది. పండుగలు సాంకేతికమైనవని చెప్పడానికి తెలుగు వారి ఉగాది పచ్చడి ఒక్కటే చాలు. వేపపూలు, కొత్తబెల్లం, ఉప్పు. కొత్తచింతపండు, పచ్చిమిరపకాయలు, మామిడిపిందెలు కలిపిన ఉగాది పచ్చడి షడ్రుచులతో వింత అనుభవాన్ని కలిగిస్తుంది. పంచాంగ శ్రవణం కూడా ఉగాది పండుగలో ఒక భాగమై పోయింది. పల్లెటూళ్ళలో ఇది కేవలం ఒక ఆచారంగా కాక, రాబోయే శుభాశుభాలను తెలుసుకోవాలనే ఉత్సుకతను రేకెత్తించే సందర్భంగా ఉపయోగిస్తుంది.

శ్రీరామనవమి

చైత్రమాసంలోనే వచ్చే మరో పండుగ ఇది. చైత్రశుద్ధ నవమినాడు జన్మించిన శ్రీరాముణ్ణి భక్తితో తలచుకునే ఈ దినం మహాపురుషుల జన్మ దినాలు పండుగలుగా అయిన విధానానికి ప్రతినిధిగా ఉంది. ఇతర రాష్ట్రాల మాట ఎలా ఉన్నా, ఆంధ్రరాష్ట్రంలో మాత్రం శ్రీరామ నవమి అనగానే నిప్పులు చెరిగే ఎండల్లో చల్లగా పానకాన్ని, వడపప్పును, విసనకర్రలను ఇచ్చే భక్తకోటి గుర్తుకు వస్తారు నీళ్ళలో బెల్లంగడ్డ వేస్తే పానకమవుతుంది. అయితే శ్రీరామ నవమి పానకం అలాంటిదికాదు. కొత్తబెల్లం నీళ్ళలో కరిగించి, ఏలకుల పొడిని వేసి ఘుమఘుమ లాడించి, మిరియపు గింజతో ఎంత రుచిని కలిగించి దివ్యమైన పానకాన్ని ఇస్తే మనసుకు, నోటికిహాయిగా ఉంటుంది. పానకం, వడపప్పుకోసమైనా పిల్లలు నాలుగు గడపలు దాటడం అలవాటు. పెద్దవాళ్ళకైతే విసనకర్రలు కూడా దక్కుతాయి. ఇండ్లలోనే పండుగను జరుపుకొని, అంతటితో సరిపుచ్చకుండా పందిళ్ళువేసి శ్రీరాముని పటాలను పెట్టి, అక్కడికి వచ్చిన వారందరికీ పానకం, వడపప్పు పంచిపెట్టి రామభక్తిని ప్రచారం చేసే సంప్రదాయం మనలో ఇంకా ఉంది. కర్నాటకంలో కూడా శ్రీరామ నవమి ఉత్సవాలు చాలా ప్రసిద్ధమయ్యాయి. ఉగాది నుంచి తొమ్మిది రోజులు గాని, శ్రీరామనవమి నుంచి తొమ్మిది రోజులుగాని ఈ ఉత్సవాలను జరుపుతారు. ముఖ్యంగా శ్రీరామ భజన, పూజ, రథోత్సవాలు, అన్నిటికంటె ఎక్కువగా సంగీతోత్సవాలు ప్రత్యేకంగా జరుగుతాయి.

ఏనాడు వానకురిసినా కురవకున్నా శ్రీరామనవమి నాడు నాలుగు చినుకులైనా పడతాయని, ఎక్కడ పడకున్నా భద్రాచలంలో మాత్రం తప్పక ఆదినం చినుకులుపడి వాతావరణం చల్లబడుతుందని అంటారు. ఇందులో నిజమున్నా లేకున్నా జానపదులకు శ్రీరామునిపై ఉండే భక్తిని ఈ నమ్మకంతెలుపుతుంది.

## నృసింహ జయంతి

పౌరాణిక పాత్రలకు ప్రాధాన్యం గల మరొక పండుగ నృసింహ జయంతి. తెలుగునాట అహోబలం, సింహాచలం, మంగళగిరి, యాదగిరి మొదలైన నృసింహ క్షేత్రాలున్నాయి. ఆయాక్షేత్రాలలో నరసింహ రూపుడైన విష్ణువుకు గొప్ప ఉత్సవాలు జరుగుతాయి. ఆంధ్రదేశంలోని పలుప్రాంతాలలో వైశాఖ శుద్ధ చతుర్దశినాడు అపరసంధ్యలో అవతరించిన నరసింహుని ప్రీత్యర్థం నరసింహ జయంతిని జరుపుతారు. ప్రహ్లాదుడు తెలుగువారికి ఇష్టుడైన బాలపాత్ర. హిరణ్య కశిపుడు పెట్టిన బాధలను సహించిన ప్రహ్లాదుణ్ణి వాత్సల్యభావంతో చూడని వారుండరు. పోతనాది కవులు భాగవతంలోని ఈ పాత్రలకు జీవంపోసి, జనప్రియం చేశారు. స్తంభంలో పుట్టినందువల్ల నరసింహస్వామి రూపంగా స్తంభాలకు కూడా పూజ చెయ్యడం ఈనాటి పూజా విధానంలో ప్రత్యేకత.

## తొలేకాసి (తొలిఏకాదశి)

'తొలేకాసికి పండుగలు తోసుకొస్తాయి' అని సామెత. ప్రతినెల రెండు ఏకాదశులు వస్తాయి. అవి రెండూ పుణ్యదినాలే. ఏకాదశి ఏదైనా ఉపవాసం ఉండడానికి శ్రేష్ఠమైనదే. అయితే భీష్మైకాదశి, ముక్కోటి ఏకాదశి పరమ పవిత్రమైనవి. వీటన్నిట్లో ఆషాఢమాసం, శుక్లపక్షంలో వచ్చే ఏకాదశికి ఒక ప్రత్యేకత వుంది. దీనితో బాటు చాలా పండుగలు తోసుకొని వస్తాయి. అందువల్ల దీనికి తొలేకాసి అని పేరు. నాగులచవితి, వరలక్ష్మీ వ్రతం, కృష్ణాష్టమి, వినాయకచవితి వరసగా వస్తాయి. తొలేకాసిని పెద్ద వైభవంగా జరపక పోయినా ముందుముందు చాలా పండగలు వస్తాయనేందుకు హెచ్చరికగా నైనా దీన్ని జరుపుకుంటారు.

నాగుల చవితి

నాగులకు, ఆంధ్రులకు ఉండే సంబంధాన్ని గూర్చి అనేక విద్వాంసులు చర్చించారు. నాగులే ఆంధ్రులైనా కాకున్నా, నాగజాతికి తెలుగువారికి నికట సంబంధం ఉన్నా లేకున్నా, నాగపూజ మాత్రం ఈనాటికీ ఉండే నిజం. అయితే నాగపూజ అన్నది ఆంధ్రులు ఒక్కరికే పరిమితం కాదు. పాము కుల దేవతగా ఉండే అనేక తెగలు ప్రపంచంలోని పలుప్రాంతాలలో ఉన్నాయి. కర్నాటక, తమిళనాడు, కేరళ మొదలైన మన ఇరుగు పొరుగు రాష్ట్రాలలోనే కాక, జపాన్, చైనావంటి దేశాలలో కూడా సర్పపూజ ఉంది. ఋగ్వేదంలో నాగపూజను గురించి లేకున్నా ఇంద్రుడు నాగుల్ని ధ్వంసం చేసినట్లుగా ఉంది. తైత్తరీయంలో నాగపూజకు సంబంధించిన విషయాలున్నాయి. జైన, బౌద్ధ, శైవ, వైష్ణవాది మతాలలో నాగపూజ విషయం ఉంది. నాగరాజు విష్ణువుకు పడక, శివుడికి కంఠమాల, పార్శ్వనాథతీర్థంకరునికి శిరోభూషణము. శ్వేతాంబర జైనులు శ్రావణశుద్ధ పంచమినాడు నాగపంచమి వ్రతాన్ని, మార్గశిరశుద్ధ పంచమినాడు నాగదీపావళిని ఆచరిస్తారు. సర్పం మనో విజ్ఞానంలో కామానికి సంకేతంగా, యోగంలో కుండలిని శక్తికి సంకేతంగా, జానపదుల కల్పనలో రోగనివారక శక్తికి ప్రతీకగా మాత్రమే కాక ఎన్నో ఆధ్యాత్మిక అర్థాలకు తావు కల్పించే సూచ్య వస్తువుగా కూడా ఉంది. సర్పం మండలాకారం పూర్ణవృత్తం లేకశూన్యం. ఈ పూర్ణంలో పూర్ణాన్ని తీసివేస్తే శేషమూ పూర్ణమే. ఈశేషమే ఆదిశేషమంటారు. అందువల్లనే అనంతమనే శేషశాయిగా విష్ణువుంటాడట !

నాగులచవితికి చిమ్మిరి, చలిమిడి తయారుచేసి నాగరాజుకు నైవేద్యం పెడ్తారు. పండుగనాడు ఇల్లలికి, ముగ్గులుపెట్టి ఇంట్లో పండుగ చేసుకోడంతో పరిపెట్టుకోక పుట్టను వెతుక్కుంటూ వెళ్తారు స్త్రీలు. నాగుల చవితి సగం పండుగ సగంవ్రతం అని చెప్పవచ్చు. నాగరాజు ప్రీతికి జానపదులు ఏంచేసినా చెయ్యకపోయినా పాము పుట్టలో పాలుపోయడం, ఉపవాసం ఉండడం ముఖ్యంగా భావిస్తారు. సర్పాలవల్ల ఏ హానీ జరగకూడదనే ఉద్దేశంతో జానపదులు కల్పించుకున్న ఆచారాల ఫలితమే నాగులచవితి, నాగపంచమి.

## గోకులాష్టమి

కృష్ణ జన్మాష్టమినే గోకులాష్టమి అనడం వాడుక. రాముడు కృష్ణుడు జానపదుల హృదయాలలో స్థిరనివాసం ఏర్పరచుకున్న దైవాంశ సంభూతులు. శ్రావణబహుళాష్టమి నాడు కృష్ణ జన్మాష్టమిని పండుగగా జరుపుకుంటారు. కొంతమంది పగలంతా ఉపవాసముండి, సాయంకాలం పూజాదికాలు నిర్వర్తిస్తారు. ఒకప్పుడు వైభవంగా జరిపే వారేమోకాని, ఇప్పుడు సాధ్యమైనంత సరళంగానే ఈ పండుగను ఆచరిస్తున్నారు. ఈ దినం చేసే ప్రత్యేకమైన పిండి వంటలలో పాల కాయలు పేర్కొనదగినవి.

## వినాయక చవితి

వ్రతమూ, పండగా అని సంశయంలోముంచే మరో ఆచారం వినాయక చవితి. వ్రతాలు, నోములు స్త్రీలు ఆచరించేవి కాబట్టి, అందరూ పాల్గొనే వినాయక చవితిని పండుగల్లోనే చెప్పుకోవచ్చు. భాద్రపద శుక్ల చతుర్థినాడు వినాయకుళ్ళతో, పూలు, పళ్ళు, ఆకులు, అరటిపిల్లలు, వెలగపళ్ళు, చెరకు గడల వంటి వాటితో బజారులన్నీ నిండుగా ఉంటాయి. గణపతి ఆర్యదేవత అయినా, శుద్ధ ద్రావిడులమని చెప్పుకుంటున్న తమిళులకు కూడా పిళ్ళయ్యార్ పేరుతో ఇష్టదైవమైపోయాడు. ఏపండుగ చెయ్యాలన్నా, వ్రతమాచరించాలన్నా, పూజ చెయ్యలన్నా ముందు సిద్ధివినాయకుడు ప్రత్యక్షమవుతాడు. కోలాటం వెయ్యాలన్నా, నృత్యం చెయ్యాలన్నా ముందు గణపతి స్తుతి ఉండాల్సిందే. వినాయకుడు ప్రకృతి ఉపాసనకు చక్కని ప్రతీక అని కొందరంటారు. సర్వ విఘ్నాలను పరిహరించేవాడని మరికొందరంటారు. విద్యను ప్రసాదించే విద్యా గణపతి విద్యార్థుల పూజలందుకుంటాడు, బుద్ధి, సిద్ధిభార్యలుగా గల వినాయకుడు జ్ఞానమూర్తిగా మరికొందరికి దర్శనమిస్తాడు. ఇలా ఏ రూపంలో కొలిచినా వినాయకుడు అన్ని దోషాలను పోగొట్టి మేలు చేకూర్చడం మాత్రం నిజమని జానపదులు నమ్ముతారు.

వినాయక చవితిలో ఇంకా ప్రాచీన కర్మకాండల అంశలు పూర్తిగా కనుమరుగు కాలేదు. అందువల్ల పూజా విధానం కూడా కొంత దీర్ఘంగానే ఉంది, విఘ్నేశ్వరుడికి మండపం నిర్మించి, మామిడాకులతో, అరటి పిలక

లతో అలంకరించి, మధ్య తొమ్మిది ధాన్యాలను పోసి వినాయకుడిని నిలిపి అర్ఘ్యపాద్యాది విధులతో ఆవాహన చేసి అంగపూజను చేయాల్సి ఉంటుంది.

వినాయక చవితికి ముఖ్యంగా కుడుములు, ఉండ్రాళ్ళు చెయ్యాల్సిన పిండివంటలు, వాయనం ఇవ్వాల్సినవివే. వీటితోకూడా కలిపి 21 పిండివంటలు చెయ్యాలి. 21 ఆకుల 'పత్రి'తో పూజ చెయ్యాలి. వినాయకుడికి గుంజిళ్లు తియ్యడం పిల్లలకొక వ్యాయామం. ఇది కర్నాటకంలో అయితే ఇంకా వైభవంగా జరుగుతుంది. పసిపిల్లలు అక్షింతలు తీసుకొని ప్రతిగడప ఎక్కి వినాయకుణ్ణి దర్శించి అక్షింతలువేసి. గుంజిళ్ళుతీసి వస్తారు. ఆంధ్రకర్నాటకాలలోకొన్నిచోట్ల ప్రజలొక్కచోటచేరి చందాలు వేసుకొని, పెద్దవినాయకుణ్ణి చేసి, నడివీధిలో ప్రతిష్ఠించి కొన్నిరోజులు పూజలు జరిపి తర్వాత వైభవంగా ఊరేగింపుచేసి గణపతిని నీళ్ళలో వదలివేస్తారు. ఇంట్లోపూజచేసేవారు గణపతి విగ్రహాలను ప్రతిసంవత్సరమూ ధాన్యపుగాదెలోపెడ్తారు. ఏటేటా ధాన్యం వృద్ధిఅవుతుందని వారి నమ్మకం. వినాయకుణ్ణి నీటిలో వదిలిన వారుకూడా, బురదను కొద్దిగా తెచ్చి ఇంట్లోగాదెలకు పూస్తారు.

దసరా :

ఒకప్పుడు తెలుగువారు వైభవోపేతంగా జరుపుకుంటుండిన ఉత్సవం దసరా. నేటికీ దసరా పండుగలో పూర్వపువైభవం తాలూకు చిహ్నాలు కొంతకు కొంత కనిపిస్తూనే ఉంటాయి. ఆంధ్రకర్నాటక ప్రజల కూడలిగా ఉండి, శ్రీకృష్ణదేవరాయల మహోజ్వల కీర్తి కిరణాలను నల్దెసలకు ప్రసరింప జేసిన హంపీలో దసరా వైభవాలను చూచేందుకు రెండు కన్నులు చాలకుండా ఉండేవి. దసరా ఉత్సవాలను తిలకించిన దేశవిదేశీయాత్రికులు విజయనగరరాజుల రసికతను వేనోళ్ళ కీర్తించారు. జాతీయపర్వంగా దసరాను ఆచరిస్తుంటే కర్నాటక రాజ్యప్రజలందరూ రాజధానిలో సమావేశ మయ్యేవారని అబ్దుల్ రజాక్ అనే చరిత్రకారుడు వ్రాశాడు. నేడు మహార్నవమిదిబ్బ ఆనాటి వైభవానికి విషాదభరితస్మృతి చిహ్నంగా మిగిలిఉంది.

ఆశ్వయుజమాసంలో పాడ్యమినుంచి, నవమివరకు నవరాత్రులను పదవరోజు విజయదశమిని జానపదులు ఈ నాటికీ ఆచరిస్తారు. మొత్తంపది

రోజులు వరుసగా పండుగరోజులంటే. సంవత్సరంలో ఈ సందర్భానికి ఎంత ప్రాముఖ్యం ఉందో ఊహించగలం. నవరాత్రుల సందర్భంలో బొమ్మల కొలువు తీర్చి. పేరంటాండ్రను ప్రతిదినం ఆహ్వానించి, పాటలుపాడి, ఆరతు లిచ్చి సంతోషంగా కాలం గడపడం నవరాత్రులవిశేషం.

దసరా దశరాత్రులు జరపకపోయినా సరస్వతిపూజ, దుర్గాష్టమి, మహా ర్నవమి, విజయదశమి అయినా తప్పక ఆచరిస్తారు. ఆంధ్రులు సరస్వతిపూజ నాడు పిల్లలు చదువుకొనే పుస్తకాలు పెట్టిపూజచేస్తారు. నవరాత్రులలో పూజలు పొందే వస్తువులు ఆయుధాలు, ఆయుధపూజ రాజాధిరాజులకాలంనుంచి సంక్ర మించి నేడు అన్నివస్తువులకు చేసేపూజగాతయారయింది. సైకిలు, మోటారు సైకిలు, ఓరువాలు, కుర్చీ, బెంచీ, ఏదైతేనేం-పసుపుకుంకుమలు, పూలు అలంకరించుకుంటాయి. వివిధ వృత్తులకు సంబంధించిన పరికరాలను కూడా పూజలు చేస్తారు. విజయదశమికి విద్యాభ్యాసం ప్రారంభించాల్సిన పిల్లలకు ముఖ్యమైనది. అన్నివిధాలా శుభారంభానికి విజయదశమి మంచిదని మన నమ్మకం.

దీపావళి:

దసరాకంటె ఎక్కువగా దేశమంతటా ఆనందంతో ఆచరించే పండుగ దీపావళి. దీపాలపండుగగా ప్రసిద్ధిచెందిన ఈ ఉత్సవం రెండుమూడురోజులు వైభవంగా సాగుతుంది. ఆశ్వయుజ బహుళ చతుర్దశిని నరక చతుర్దశిపేరుతో అమావాస్యను దీపావళి పేరుతో జానపదులు, శిష్టులు అనే భేదంలేకుండా అందరూ ఆచరిస్తారు. దీపావళిని గురించి రెండుమూడు కథలున్నాయి. మొత్తంమీద సత్యభామసహకారంతో శ్రీ కృష్ణుడు నరకాసురుణ్ణి సంహారం చాడనేది మాత్రం అందరికీ తెలిసినకథ.

నరక చతుర్దశినాడు తెల్లవారుఝామున లేచి తలంటుస్నానం చెయ్యాలి ఈస్నానంతో నరకాసురుని పీడవదలిపోతుందని నమ్మకం. దీపావళిఅమావాస్య రోజు వస్తుంది కాబట్టి ఆ దినం కొందరు కొత్తగుడ్డలు కట్టుకోరు. అలాంటి వారు నరక చతుర్దశినాడే కొత్తగుడ్డలు ధరిస్తారు. కొత్తఅల్లుళ్ళు ఇంటికివచ్చి ఉంటే, తప్పక అత్తవారింట్లో దీపావళికి తిష్ఠవేస్తారు. దీపావళికి ఎంతలేని

వాళ్ళయినా కూతురికి కొత్తఅల్లుడికి బట్టలు పెడ్తారు. పండుగ, బట్టల సంబర మంతా చతుర్దశినాడే ముగుస్తుంది. దీపావళినాడు టపాకాయలతో ఊరువాడ అంతా మార్మోగుతుంది. ఈ శబ్దాలు తర్వాతకూడా కొన్ని దినాలవరకు విని పిస్తూనే ఉంటాయి. దీపావళినాడు వరుసగా దీపాలనుపెట్టి అమావాస్యనాడు వెలుగును కొని తెచ్చుకుంటారు.

నరకచతుర్దశికి ముందురోజును కొందరు ధనత్రయోదశిగా ఆచరిస్తే. అమావాస్యకు తర్వాత రోజును కొన్నిచోట్ల బలిపాడ్యమిగా ఆచరిస్తారు. కార్తీక శుద్ధపాడ్యమే ఈ బలిపాడ్యమి. బలిచక్రవర్తిని మించిన దానశూరు లుండరు వస్తువులను దానమివ్వడంకాక తన్నుతానే శత్రువుకు దానం ఇచ్చుకున్న వితరణశీలి బలి. బలిచక్రవర్తిని. ఆయనభార్య విద్యావతిని పూజించే సంప్ర దాయం ఒకటి ఈ విధంగా వచ్చికొన్ని చోట్ల ఈ నాటికి అమలులో ఉంది. కేరళలో అయితే బలిచక్రవర్తి తమను పరిపాలించాడనినమ్మి, వారు తమ జాతీయ పర్వమైన ఓనంను బలిప్రీత్యర్థం జరుపుకుంటారు.

## సంక్రాంతి

పెద్దపండుగ అనేపేరుతో తరతరాలుగా ఆంధ్రదేశంలో అందరి సంతోష సంభ్రమాలకు కారణమైన పండుగ సంక్రాంతి. ప్రతి దేశంలో ప్రతిప్రాంతంలో ఆహారధాన్యాలు ఇంటనుండి కళకళలాడుతుండగా జరుపు కునే పండగ ఒకటి తప్పక ఉంటుంది. ప్రాచీనకాలంలో వేట ప్రధాన వృత్తిగా ఉన్నప్పుడు ఏదైనా మంచి జంతువుదొరికితే అదేపెద్దపండుగ చేపలు పట్టి జీవించేవారికి పెద్దచేప దొరికితే పర్వం. వ్యవసాయం ముఖ్యవృత్తిగా జీవించేవారికి ఇంటికి ధాన్యలక్ష్మి వస్తే అదేపెద్దపండుగ, దేశానికి వెన్నెముక అన్నప్రదాత అని మనం మనస్ఫూర్తిగా పొగిడి ఆరాధించవలసిన రైతుకు ముఖ్యమైనపండుగ సంక్రాంతి. నిజమైన అర్థంలో జానపదుల పండుగఇది. ఇతర పర్వాలన్నీ పూర్తిగా జానపదాలు అనిచెప్పడానికి వీలుకాదు. కొన్ని పట్టణాలకు సంబంధించినవి కొన్ని పల్లెపట్టుల్లో చాలావరకు కనుమరుగవు తున్నవి.అయితే సంక్రాంతి ఈనాటికీ నిజమైన జానపదుల పండుగగా నిలచి ఉంది. దీనికి ముఖ్యకారణం ఇది రైతుల పండగ కావడమే.

సంక్రాంతిని ఎంత కాదన్నా మూడు రోజులైనా జరుపుకుంటారు. మొదటిరోజు భోగిపండుగ. మకరసంక్రమణకాలం పితృదేవతలను సంస్మరించుకోదగిన పుణ్యదినంగా భావించేవారు. భోగిపండుగనే నిజమైన పండుగగా, సంతోషకరమైన పర్వంగా ఆచరిస్తారు. ఆనాడే తలంటుస్నానాలు, కొత్తగుడ్డలు కట్టుకోవడం చేస్తారు.

భోగినాడు తెల్లవారు ఝామున లేచి ఇంట్లో ఉండే పాత తట్టబుట్ట, చేట, చీపురు కట్ట మొదలైనవన్నీ పోగుచేసి భోగిమంట వేసి చుట్టూ కూర్చుని చలికాచుకుంటారు. తర్వాత తలంటి పోసుకొని, కొత్త గుడ్డలు కట్టుకుంటారు. ఇప్పటి వరకు చెప్పిన పండుగలు చాంద్రమానాన్ని అనుసరించేవయితే సంక్రాంతి మాత్రం సౌరమానాన్ని అనుసరించేది. జనవరి 13, 14 తేదీలలో భోగి, సంక్రాంతి వస్తాయి. సూర్యుడు మకరరాశిలోకి ప్రవేశించేది కాబట్టి మకర సంక్రాంతిగా పేరు తెచ్చుకున్న ఈ పండుగకు ఖగోళంలో మార్పు జరిగినట్లే, రైతు జీవితంలో మార్పువస్తుంది. వాతావరణంలో మార్పువస్తుంది. అందుచేత ఈ పండుగకు అన్ని విధాలా వైశిష్ట్యం ఉంది.

సంక్రాంతి జానపదులకు చాలా ఇష్టమైన పండుగ. జానపద కళ లెన్నో ఈ సందర్భంలో ప్రదర్శన భాగ్యాన్ని పొందుతాయి. ఒకవైపు హరిదాసులు, మరొక వైపు బుడబుక్కలవారు. ఇంకొక వైపు 'గొబ్బియళ్ళో గొబ్బియని పాడరమ్మా గొబ్బియళ్ళో' అంటూ గొబ్బి తట్టే జానపద స్త్రీలు దర్శనమిచ్చేది సంక్రాంతి శుభ సమయంలోనే. భోగిపళ్ళు పోయించుకునేది పసి పిల్లలు, సంక్రాంతిరోజు పూజలు పొందేది పితృ దేవతలు. మూడవ రోజు అలంకరణ పొందేది పశువులు. పిల్లలు, పెద్దలు, ఉండేవారు, చనిపోయినవారు, పాడి, పంట, రైతు చెలికాడైన ఎద్దు—ఇలా ఇన్ని పాత్రలు భాగం వహించే పండుగ మరొకటి లేదేమో. ఇంత వైవిధ్యం కలదీ మరొకటి లేదు. గొబ్బిళ్ళు, భోగిమంటలు, భోగిపళ్లు, హరిదాసుల గీతాలు, బుడబుక్కలవారి భవిష్యత్తులు, దాన ధర్మాలు, సంక్రాంతి పొంగళ్లు, రంగురంగుల రంగవల్లులు, కనుమనాడు పశువుల అలంకరణలు, పరుగు పందాలు, తర్పణాలు, రకరకాల పిండివంటలు — జీవితంలో ఇంతకంటె వైవిధ్యం ఇంకెప్పుడు చూడగలం !

హోళీ పండుగ :

యావద్భారత ఖ్యాతి నార్జించిన పండుగల్లో హోళీ ఒకటి. ఆంధ్ర దేశంలో ఈనాడు కొన్ని ప్రాంతాల్లో మాత్రం హోళీ ఆచరించడం జరుగుతున్నది. అయితే ఒకప్పుడు చాలా వైభవంగా జరిగేదనడానికి అల్లోనేరేళ్ళు, కాముని పాటలు, జాజర పాటలు మొదలయినవి తెలుపుతున్నాయి. ఫాల్గుణ శుద్ధ పౌర్ణమికి కాముని పున్నమ అని పేరు. కొండవీటి రాజుల కాలంనుంచి కూడా ఇది ఆంధ్ర దేశంలో వైభవంగా జరుగుతుండేదనటానికి దాఖలాలు ఉన్నాయి. విజయనగర రాజులు తమ రసికతకు అనుగుణంగా కామోత్సవాన్ని ఇంకా గొప్పగా జరిపేవారు 'హోలి హోలిర రంగ హోలి. హోలిర చెమ్మ కేళి' అని పాటలు పాడుతూ నేటికీ తెలంగాణాలో, రాయల సీమలోని కొన్ని ప్రాంతాలలో హోలిని ఆచరిస్తారు. ఉత్తర భారతంలో 'హోళిక' అనే రాక్షసి బొమ్మను చేసి, దాన్ని కాల్చి 'చంపుతారు.' శివుడు కాముని దహనం చేసినందుకు సంకేతంగా కాముని పేరుతో పాత వస్తువులను భోగిమంటలుగా వేసి కాల్చడం కూడా కొన్ని ప్రాంతాలలో ఉంది.

వ్రతాలు, నోములకు దగ్గర సంబంధముండే మరి రెండు పండుగలను పేర్కొని, స్త్రీల వ్రతాలను గురించి వివరాలను ఇవ్వడం జరుగుతుంది. బ్రతుకమ్మ పండుగ, బొడ్డెమ్మ పండుగ అనేవి తెలంగాణా ప్రాంతంలో బాగా ప్రచారంలో ఉండేవి. వీటిని గురించిన వివరాలను డా. బి. రామరాజుగారు తమ 'తెలుగు జానపద గేయ సాహిత్యము'లో ఇచ్చారు. (1978 : 457–463).

నవరాత్రి తొమ్మిది దినాలు బ్రతుకమ్మ పండుగ, అంతకుముందు తొమ్మిది రోజులు బొడ్డెమ్మ పండుగ జరుపుతారు. బొడ్డెమ్మ ముఖ్యంగా పిల్లల పండుగ. ఊరిలోని వారు ఒక్కచోట సమావేశమయ్యే సామాజిక పర్వమిది. పుట్టమన్నుతో బొడ్డెమ్మను చేసి గోరంట, బీరపువ్వులతో అలంకరించి, పల్లెటూరి వాడకొక్క కుటుంబం వారు నిల్పితే అక్కడే మిగిలిన వారు చేరుతారు. తొమ్మిది రోజులు పాటలతో, ఆటలతో గడిచిపోతుంది. తర్వాత బొడ్డెమ్మను అర్చించి, ప్రతిదినం పిల్లలు తెచ్చిపోసే బియ్యంతో పరమాన్నం వండి పంచిపెడ్తారు. తర్వాత బొడ్డెమ్మను పాటలు పాడుతూ ఒక బావిలో వదలిపెడ్తారు.

బ్రతుకమ్మ పండుగ కూడా సామాజిక ప్రాధాన్యం కలది. పల్లెటూళ్ళ లోని స్త్రీ పురుషులంతా ఒక్కచోట చేరే అవకాశాన్ని ఈ పండుగ కల్పిస్తుంది. ఈ పండుగదినము లందు ప్రతిదినము వెదురు లేదా దుసేరు తీగెలతో నల్లిన సిబ్బిలో గుమ్మడి పూవులు పరచి వానిపై తంగెడు, పైడి తంగెడు, గునుగు, నువ్వు, రుద్రాక్ష, కట్ల, గట్టు గోరిమిడి, కాకర, బీర, గన్నేరు, పొట్ల, కిట్లాయి పువ్వులతో బ్రతుకమ్మను పేర్చి దానిపై గౌరమ్మను నిల్పెదరు. పసుపు కుంకుమలతో నర్చించి పగలే బ్రతుకమ్మలను నోమట్టిలో నొక పీటపై పెట్టి యుంచెదరు. సాయంకాలము నాలుగు గంటలవరకు పెద్దలు, పిన్నలు తమకున్న విలువగల వస్త్రములు, భూషణములు ధరించి బ్రతుకమ్మ''ను తలకొకటి చేతు లలో పట్టుకొని ఊరిబయట చెరువుదరినో, కాలువ కడనో, గుడియందో గుమి గూడి బ్రతుకమ్మలను మధ్యన నిలిపి చుట్టు తిరుగుచు చేతులు తట్టుచు పాటలు పాడెదరు (బి. రామరాజు 1978 : 459). ఈ పండుగలో కోలాటపు పాటలు, చందమామ పాటలు, ఉయ్యాల పాటలు వినిపిస్తుంటాయి.

## నోములు - వ్రతాలు

స్థూల దృష్టికి పండుగలు—వ్రతాలు ఒక్కటిగానే కనిపిస్తాయి. అయితే పేరే సూచిస్తున్నట్లుగా 'వ్రతం' అనగానే ఏవో దీక్ష పూనడమనే అర్థం వస్తు న్నది. కుటుంబ సంక్షేమం కోసం కర్మప్రధానంగా ఆచరించే వ్రతంలో పూజా విధానానికి ఎక్కువ ప్రాధాన్యం ఉంది. పురుషులు మొదటి నుంచి కర్మకాండ లలో స్త్రీలకు ఎటువంటి పాత్రనూ ఇచ్చేవారు కాదు. నేటికీ ఆబ్దికాలలో, యజ్ఞయాగాదులను బోలిన కర్మకాండలలో స్త్రీకి స్థానం లేదు. ఆదిమవాసులలో అయితే ఈ నిషేధం ఇంకా ఎక్కువగా ఉంది. కొన్ని రకాల కర్మకాండలలో స్త్రీ ప్రవేశానికి ఎంత వరకు నిషేధం ఉంటంటే, స్త్రీ గనుక ఆ ఆచరణ విధా నాలను చూస్తే చంపివేస్తారు. ఇలాంటి నిషేధాలు, నియమాలే బహుశా నోములు, వ్రతాలు ఉద్భవించడానికి కారణమై ఉండవచ్చు. పురుషుల యజ్ఞ యాగాదులను, జాతరలను సరళం చేసి, సూక్ష్మం చేసి, సాత్విక పద్ధతులుగా మార్చి స్త్రీలు నోములను, వ్రతాలను తయారు చేసుకున్నారు.

'వ్రతములలోకెల్ల నుత్తమ వ్రతము' అని ప్రతి వ్రతము చేసేటప్పుడు చెప్పడం అలవాటే. ఇక వ్రతాల వల్ల కలిగే లాభాలను పట్టీ చేసుకుంటే మన జీవితానికి ఒక వ్రతం చేసినా సుఖ సంతోషాలకు ఏ లోటూ రాదనిపిస్తుంది. అష్టైశ్వర్య సిద్ధి, పుణ్యలోక ప్రాప్తి, అన్ని రకాల కష్టాలనుంచి విముక్తి ప్రతి వ్రతం వల్ల జరిగేవే. అయినా ప్రతి సంవత్సరం మళ్ళీ మళ్ళీ నోములు, వ్రతాలు ఆచరిస్తూనే ఉంటాం. కలలు కంటూనే ఉంటాం.

మనిషి ఆశాజీవి. నన్నయ నాటికే తెలుగునాట నోము. వ్రతాలు స్త్రీల నమ్మకాలకు ప్రతీకలుగా ఆచరింపబడుతుండేవి. శకుంతల దుష్యంతుని తిరస్కారానికిలోనై విసిగి వేసారి ఇలా అంటుంది: 'నుడువులు వేయు నింకేల యిప్పాటి నోములు దొల్లి కడగినోచితిని గాకేమి?

## నోములు వ్రతాలలో కొన్ని

వరలక్ష్మీవ్రతం, మదనద్వాదశీవ్రతం, ఏకాదశీవ్రతం, మంగళ గౌరీ వ్రతం. కామేశ్వరీ వ్రతం, చిక్కుళ్ళ గౌరీ వ్రతం, నిత్యదానం నోము, దీప దానం నోము, పసుపు గౌరీ నోము, చల్లచిత్త నోము, మోచేటి పద్మం నోము, చిట్టిబొట్లు నోము, కృత్తిక దీపాలనోము, మూసివాయనాల నోము, ములగగౌరి నోము, తరగని అయిదువతనం నోము, లక్షవత్తులనోము, నెలసంక్రమణ దీపాలనోము.

## వరలక్ష్మీ వ్రతం

తెలుగు పడుచులకు చాలాముఖ్యమైన వ్రతమిది. మగధదేశంలో కుండిన మనే పట్టణం . అక్కడ చారుమతి అనే పతివ్రత. ఆమెకు లక్ష్మీదేవి కలలో కనిపించి 'నేను వరలక్ష్మిని, శ్రావణ శుక్రవారంనాడు నన్ను పూజిస్తే నీకు సకల ఐశ్వర్యాలను ప్రసాదిస్తాన'ని చెప్పింది. ఈ వ్రతాన్ని చేసి ఇల్లంతా బంగారం చేసుకున్నదా ఇల్లాలు. శ్రావణమాసంలో శక్తి ఉన్నవారు అన్ని శుక్రవారాలు వరలక్ష్మీపూజ చేసుకుంటారు. లేకుంటే మొదటి శుక్రవారం పూజ చేసుకుంటారు. పౌర్ణమికి ముందువచ్చే శుక్రవారమే ఈ వ్రతమని మరి కొందరంటారు. వ్రతంరోజు ఇల్లలికి, ముగ్గులుపెట్టి, మంటపాన్ని తయారు

చేసి, దానిమధ్య చెక్కపీటను వేసి. బియ్యంపోసి. మధ్యలో కలశం పెడ్తారు, రాగి చెంబునో, వెండి చెంబునో. ఏవీ లేకుంటే ఇత్తడి చెంబునైనా పెట్టి, దానికి కళ్ళు, ముక్కులు, చెవులు అతికిస్తారు. తమతమ శక్త్యానుసారం ఆ కలశానికి ఆభరణాలతో అలంకరిస్తారు. చెంబుపైన టెంకాయను ఉంచి వరలక్ష్మీ దేవిని ఆవాహన చేసి పూజకు ఉపక్రమిస్తారు. ధూపదీప నైవేద్యాలతో వరలక్ష్మీదేవిని పూజించి, తోరాన్ని కట్టుకుని, వాయనాన్ని ఇచ్చి, పన్నెండు రకాల పిండివంటలతో షడ్రసోపేతంగా భోజనం చేయడం వ్రతంలో భాగమే. ఇలాంటి వ్రతాలను ఎవరో ఒక్కరే చేసుకొనే ప్రశ్నేలేదు. నలుగురు ముత్తయిదువలు చేరితేనే నోముగాని, వ్రతంగాని.

శ్రావణమాసమంతా స్త్రీలమాసం. ఈ మాసం పెట్టగానే ప్రతిఇల్లూ కళకళలాడుతుంటుంది లక్ష్మీ పార్వతులకు ఈ మాసమంతా పూజలే, ముగ్గులు, తోరణాలు, పసుపుకుంకుమలు, నూతనవస్త్రాలు, పేరంటాళ్ళతో సంభ్రమంగా, ఉంటుంది. శ్రావణమాసంలో వరలక్ష్మీవ్రతంతోబాటు శ్రావణసోమవారం, శ్రావణమంగళవారం, శ్రావణ శుక్రవారం, శ్రావణశనివారం ఈ అన్నీ పవిత్రమైనవే. ముఖ్యంగా శ్రావణమంగళవారం, శ్రావణశుక్రవారం స్త్రీలకు సుఖశాంతులనిచ్చే వ్రతాలుగా ప్రఖ్యాతాలు.

శ్రావణమంగళవారానికి చెందినకథ చాలాస్వారస్యకరంగా ఉంటుంది. రాజదంపతులకు శివుని మహిమవల్ల పుత్రుడు కలిగాడు. అయితే అతని ఆయుస్సు పదహారు సంవత్సరాలే. అతను పెద్దవాడై ఒక ఉద్యానవనంలో విశ్రమించి ఉండగా శ్రావణమంగళవారం పూజకోసం పూలు కొయ్యడానికి సత్యవతి అనే రాచకుమార్తెవచ్చి రాజకుమారుణ్ణిచూసింది. నారాయణుడనే పేరుగల ఆ రాజకుమారుడికి, సత్యవతికి వివాహమయింది. శోభనంనాటికి అతనికి ఆయుర్దాయంపూర్తిఅయింది. చంపడానికి వచ్చిన పామును కలశంలో పెట్టి సత్యవతి వాసెనకట్టు కట్టేసింది. దీనితో గండందప్పి రాకుమారుడు బ్రతికిపోయాడు. అత్తగారు తనకొడుకును కోడలు ఎట్లాబ్రతికించిందీ తెలుసుకోగోరగా, మాంగళ్యములుగల మంగళ గౌరును పూజించి ఈ మహిమ పొందినట్లుగా ఆమె చెప్పింది. ఈ వ్రతాన్ని ఐదు సంవత్సరాలు చెయ్యాలని చెప్తారు. మొదటి సంవత్సరము ఐదుగురు ముత్తయిదువలకు, రెండవఏడు

పదిమందికి, మూడవఏడు పదిహేనుమందికి, నాల్గవఏడు ఇరవైమందికి, ఐదవఏడు ఇరవైఅయిదుమందికి పసుపు, బొట్టు, గంధం, జ్యోతులపై పట్టిన కాటుకను ఇచ్చి, సెనగలు వాయనం ఇవ్వాలి.

పై రెండు ముఖ్యమైనవ్రతాలు కాక ఇంకా స్త్రీలు ఆచరించే నోములు, వ్రతాలు అనేకం ఉన్నాయి. వీటిలో బాల్యంలో, యౌవనంలో, కౌమారంలో, వార్ధక్యంలో ఆచరించే నోములున్నాయి. సంసారసుఖంనుంచి, కైవల్య ప్రాప్తినందు అన్నిటినీ ఇవ్వగలిగిన వ్రతాలున్నాయి.

పెళ్ళిఅయిన సంవత్సరం మాఘమాసంలో రథసప్తమిరాగానే మొదట ఉదయకుంకుమనోముతో ఆరంభిస్తారు. ప్రతిదినం పొద్దున్నేలేచి, మొగం కడుక్కొని, బొట్టుపెట్టుకొని మరొక ముత్తయిదువుకుకూడా బొట్టుపెట్టాలి. ఒక్కఏడాది ఈ విధంగాచేసి చివరవాయనమిచ్చి ఉద్యాపన చేసుకోవాలి.

ఉదయ కుంకుమనోము పట్టినవారు దానితోబాటే చిట్టిబొట్టుకాటుకగౌరి, నిత్య శృంగారం మొదలైన వాటినికూడా ఆచరిస్తారు. అయితే ఇవన్నీచేసే వాళ్ళు ఇప్పుడు అరుదైపోయారు. ఎందుకంటే ఇప్పుడు అంతనమ్మకంగాని ఓపికగాని, స్తోమతగాని ఉండేవారు తక్కువ. చిట్టిబొట్టు నోము పట్టేవారు పొద్దున్నేలేచి, స్నానంచేసి, మడిగుడ్డలుకట్టుకొని పసుపుగంధం పూసుకొని, బొట్టుపెట్టుకొని కథచెప్పుకోవాలి. తర్వాత ఆయిదుగురు ముత్తయిదువులకు పసుపు, బొట్టు, గంధం ఇచ్చి ఆశీర్వాదాలు పొందాలి. ఈ విధంగా సంవత్సరం చెయ్యాలి. ఐదు బొట్టుపెట్టెలుకొని వాటిలో అద్దం, దువ్వెన, పసుపు, కుంకుమ, కాటుకకాయ, పండుపెట్టి దక్షిణతాంబూలాదులతో ముత్తయిదువకు దానం ఇవ్వాలి.

పళ్ళనోములు కొన్ని ఉన్నాయి. వాటిలో పాతికపళ్ళనోము ఒకటి. ఏడాదివరకు దినమ్మూ కథచెప్పుకొని చివర పెద్దముత్తయిదువును పిలిచిబొట్టు పెట్టి పాతికపళ్ళను, చీర, రవికలతో, తాంబూలంతోపాటు పళ్ళాన్నికూడా దానంఇవ్వాలి. ముత్తయిదువకు షడ్రసోపేతంగా భోజనం పెట్టాలి. పదహారు పళ్ళనోమయితే ఇంకా ఎక్కువఖర్చు ఉంటుంది. ఒక్కొక్కసారికిఒక్కొక్క

రకం పండ్లు పదహారువంతున దానమివ్వాలి. చివరికి టెంకాయలు పదహారు పెట్టి తాంబూలం ఇచ్చి, ముత్తయిదువకు భోజనంపెట్టి శక్త్యానుసారం రవికల గుడ్డయినా పెట్టిపంపించాలి.

ఒక్కొక్కనోముకు ఫలితాలు ఒక్కొక్కసారి వేరువేరుగా ఉంటాయి. ఆదివారంనాడు ఉపవాసం ఉంచే బిడ్డల ఆరోగ్యానికి మంచిదని ఒకనమ్మకం. కడుపుశోకం లేకుండా చేసుకోడానికి పూర్ణాది వారముల నోము నోస్తారు. ప్రతిఆదివారం కథచెప్పి అక్షింతలు వేసుకొని, ఒక్కపొద్దు ఉండాలి. కొన్ని వారాలు ఇలా ఆచరించిన తర్వాత ఒక ముత్తయిదువకు తలంటినీళ్ళుపోసి అయిదుతూనికల బియ్యం, ఉండ్రాళ్ళువండి దక్షిణతాంబూలాదులనుఇవ్వాలి.

ఎవరైనా మాట్లాడకపోతే 'మూగనోము' పట్టారంటూంటారు. మోచేటి పద్మం నోముకే మూగనోము అనిపేరు. ఆశ్వయుజబహుళ అమావాస్య నుంచి కార్తికశుద్ధ పూర్ణిమవరకు సాయంత్రంవేళ స్నానంచేసి, తులసమ్మ దగ్గర నాలుగుపద్మాలు పెట్టినాలుగు వత్తుల దీపం వెలిగించి మాట్లాడకుండ నలుగురు ముత్తయిదువలకు బొట్టుపెట్టి నాలుగు నక్షత్రాలు లెక్కపెట్టాలి. రెండవసంవత్సరం ఎనిమిదిపద్మాలుపెట్టి, ఎనిమిదివత్తుల దీపం వెలిగించి, ఎనిమిది మంది ముత్తయిదువులకు బొట్టుపెట్టి ఎనిమిది నక్షత్రాలు లెక్కపెట్టాలి. మూడోఏట పన్నెండు పద్మాలుపెట్టి, పన్నెండువత్తుల దీపంవెలిగించి, పన్నెండుమంది ముత్తయిదు వులకు బొట్టుపెట్టి, పన్నెండునక్షత్రాలు లెక్కపెట్టాలి. ఇదేలెక్కన ముత్తయిదు వలకు నల్లపూసలు, లక్కజోళ్లు, దక్షిణ తాంబూలాలు ఇయ్యాలి.

పెళ్ళి గుమ్మడినోము అనే పేరుతో బూడిద గుమ్మడి పళ్ళను దానం ఇస్తే సకల సంపదలు కలుగుతాయని నమ్మకం. సవతితల్లిబాధ తప్పించుకోడానికి మొగదోసిళ్ళనోము అన్నది ఉన్నది. దినమ్మ పసుపుకలిపిననీళ్ళు మూడుదోసిళ్ళ వంతున లెక్కచూచుకొని పోసుకోవాలి. సంవత్సరంతర్వాత మూడుదోసిళ్ళ ముత్యాలు, మూడుదోసిళ్ళ పగడాలు శివాలయంలో పూజచేసి, దక్షిణ తాంబూలాదులతో ఇవ్వాలి.

ప్రసిద్ధ వ్రతాలలో సావిత్రిగౌరీవ్రతం ఒకటి. సంక్రాంతి తర్వాత రెండవ దినం చెయ్యాల్సిందిది. ఇది ప్రత్యేకంగా ఇళ్ళలో ఆచరించేదికాదు. ఒకరి ఇంట్లోగాని, దేవాలయంలోగాని చాలామందిస్త్రీలు చేరి నోచుకుంటారు. పొద్దున స్త్రీలు తలంటిపోసుకొని, మడి గుడ్డలు కట్టుకొని, కంసాలిఇంటికివెళ్ళి సావిత్రీగౌరిని మంగళవాద్యాలతో తీసుకొని వస్తారు ఒక్కొక్కరోజు ఒక్కొక్క పిండివంటవంతున పులగం చిమ్మిలి, ముద్దకుడుములు, నానుబాలు, అప్పాలు, వడలు, అట్లు, పాయసంచేసి చివరిరోజు తొమ్మిది రకాల కాయలు వేసిన పులుసుచేసి అమ్మవారికి నైవేద్యంపెట్టాలి. ఈవ్రతంలో తొమ్మిదికి చాలా ప్రాధాన్యం ఉంది. నోము చెయ్యాల్సింది తొమ్మిదేండ్లు తొమ్మిది సూత్రాలతోరం. తొమ్మిది భక్ష్యాలు, తొమ్మిది ఆకులు, వక్కలు, తొమ్మిది నల్లపూసలు. తొమ్మిది మూసివాయనాలు, ఇవ్వాలి. నలుగురూకలసి ఒక్కచోట నోచుకునేది కాబట్టి దీనికి ఎక్కువప్రాధాన్యతఉంది.

నోములు, వ్రతాలవల్లకలిగే లాభాలేమిటిఅని ఆలోచిస్తే మొదట నలుగురూచేరి సంతోషంగా కాలంగడపడమని చెప్పవచ్చు. "బీజమునందు వృక్షగుణ ధర్మములన్నియు గర్భితములై యున్నట్లు ఈ వ్రతములయందు దయ, సత్యము. శౌచము, నీతి, ఆరోగ్యము, మోక్షము మొదలయినసంప్రదాయము లన్నియు గర్భితమైయున్నవి. సమస్తఅభీష్టములు నెరవేరుటకు పురుషులకు తపస్సు ఎట్లు నిర్దేశింపబడినదో స్త్రీలకు వ్రతము అట్లు నిర్ణయింపబడినది.....ఈ వ్రతములందు నిగూఢమైన మొదటి ధర్మము వితరణవ్రతము పేర కలిగినంతలో పండో, పత్రమో, వస్తువో వస్త్రమో, ధనమో, ధాన్యమో, భోజనమో ఇతరులకు చెందజేయుట యనునది ముఖ్యలక్ష్యముగా కనిపించును" (తెలుగువిజ్ఞాన సర్వస్వము–సంస్కృతి–పు. 909–910)

నోములు, వ్రతాలవల్ల ఏమి లేకున్నా పొద్దున్నే లేవడం, స్నానం చేయడం, నివేదిత ప్రసాదాన్ని ఇంటిలోనివాళ్ళకు, ఇరుగుపొరుగు వాళ్ళకు పెట్టినతర్వాత తాను భుజించడం మొదలైన సదాచారాలు అలవడతాయి. అక్కచెల్లెండ్రను నిరాదరంగా చూడరాదని, ఆడపడుచును ప్రేమతో చూడాలని ఇంటికి వచ్చిన వారిని మర్యాదగా చూడాలని, ఐశ్వర్యం వల్ల, అధికారం వల్ల గర్వంతో విర్రవీగరాదని, శుచిత్వం లేకుండా ఉండరాదని నోములు, వ్రతాలు,

బోధిస్తాయి. అయితే మూఢనమ్మకాలకు, తలాతోక లేని కథలకు, అర్థం లేని ఆచారాలకు కూడా ఇవి ఆలవాలాలయ్యాయన్న విషయం కూడా అర్థం చేసుకోవాలి.

ఉత్సవాలు, జాతరలు :

ప్రతి ఊళ్ళో ఏదో ఒక ఉత్సవం, జాతర, పరష, ఊరేగింపు ఎప్పుడూ జరుగుతూ ఉంటుంది. రథోత్సవాలు, తెప్పోత్సవాలు, నానావిధ సేవలు దేవుడి పేరుతో జరుగుతూ ఉంటాయి. ఇవన్నీ కూడా ఇంటి బయట జరిగేవి. పండుగలు, పబ్బాలు, వ్రతాలు నోములు కొన్ని సామూహికంగా జరిగినా చాలా వరకు అవి ఇళ్లలో జరిగేవే. అయితే ఉత్సవాలు, ఊరేగింపులు, జాతరలు మాత్రం సామూహికంగానే జరుగుతాయి.

ఊళ్ళో ప్రతి ఒక్కరిని ఒక్కచోట చేర్చే ప్రయత్నం ఈ సందర్భంగా జరుగుతుంది. ఉత్సవాలు, జాతరలు తేదీల ప్రకారమైనా రావచ్చు. లేదా ఏదైనా మంచి రోజు నిర్ణయం చేసి ఆ దినం జరపవచ్చు లేదా ఏదేవతో, దేవుడో కలలో కనిపించి ఉత్సవంగాని, జాతర గాని జరపమంటే జరపవచ్చు.

జాతర కూడా ఒక విధంగా పండుగే. ఇది యాత్రాశబ్దతద్భవం. బహుశా యాత్రార్థులను ఆకర్షించే పండుగ కాబట్టి ఈ పేరు వచ్చి ఉండవచ్చు. జాతరలో పండుగ సంప్రదాయాలు చేరి వుంటాయి, అయితే అన్ని పండుగల్లో జాతర సంప్రదాయాలుండవు. కొన్ని జాతరలు కేవలం కర్మకాండలతో కూడి వుండి, పండుగ సంప్రదాయాలు లేకుండా ఉండవచ్చు. ఇంతకు ముందు ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలలో జాతర జరిగేది. దేశం నలు మూలల నుండి లక్షలాది ప్రజలు ఒక్క చోట చేరేవారు. తర్వాత తర్వాత ఇవి ఒక్కొక్క పల్లెకూ ప్రత్యేకమైన పండగలుగా మారిపోయాయి. దేవుడు కొంత ప్రభావశాలి అనుకుంటే ఒక్క దినం జాతర రెండు దినాలకు, మూడు దినాలకు కూడా వ్యాపిస్తుంది. దీనితో బాటు కేవలం ధార్మిక వాతావరణంకాక, జన సమూహానికి తగ్గట్లుగా వ్యాపార కార్యకలాపాలుకూడా ప్రారంభమవుతాయి. జాతర, 'ఉత్సవాలనగానే బొమ్మలు అమ్మేవాళ్ళు, తిండి దినుసులు అమ్మేవాళ్ళు, వినోద కార్యకలాపాలతో డబ్బు చేసుకునే వారు, బొమ్మల నాడించేవారు, రంకుల

రాట్నాల వారు అందరూ తయారవుతారు. చిన్న చిన్నగా ఎద్దుల పరషలు కూడా జాత్రకు తోడయ్యాయి. పశుల సంతలతో పాటు, ఇతర పదార్థాల సంతలు కూడా ప్రారంభమయ్యాయి. ఇలా ఒక్కొక్కటే సమకూరగా ఉత్సవం అన్నది నిజమైన అర్థంలో మహోత్సవమే అయికూర్చున్నది. 'జాతర'గా ఉంది. 'పెద్ద తిరనాళ్ళలాగా ఉంది' 'ఒట్టి సంతలాగా ఉందిగాని నిశ్శబ్దంగా లేదు' వంటి పలుకు బళ్ళలో ఈ పదాలు జనసందోహానికి పర్యాయ పదాలయ్యాయి.

ఆంధ్రదేశంలో లాగే భారతదేశంలోని మిగిలిన ప్రాంతాలలో కూడా జాతరలు జరుగుతున్నాయి. కర్నాటకంలో మన లాగానే ప్రతి పల్లెల్లో ఏదో ఒక సందర్భంగా జాతర జరుగుతుంది. పంజాబులో జాతరలను నాలుగు విధాలుగా చేయడం జరుగుతుంది 1) వసంతగమనాన్ని సూచించే బసంత పంచమి వంటి ఋతు సంబంధమైన జాతరలు 2) పౌరాణిక ప్రాధాన్యం ఉండే జాతరలు 3) గుగ్గ పీర్ వంటి వారి పేరుతో జరిపే జాతరలు. 4) పండుగలకు సంబంధించిన జాతరలు (Sohinder Singh Bedi, *Folklore of the Puhjab*, p. 71). మధ్య ప్రదేశ్‌లోని జాతర లలో పౌరాణిక సంబంధమైనవి నేపథ్యంగా ఉంటాయని తెలుస్తున్నది. (Shyam Parmar, *Flok lore of Madhya Pradəsh*,p. 48.

ఉత్సవాలకు జాతరలకు భేదాన్ని కల్పించడం ఒక్కొక్కసారి సాధ్యం కాకపోవచ్చు. బలి విధానాలు మొదలైనవి లేక సర్వ జనులూ స్వచ్ఛంద వాతావరణంలో పాల్గొనేవి సామాన్యంగా ఉత్సవాలని చెప్పవచ్చు. శ్రీరాముడు కృష్ణుడు, రంగనాథుడు మొదలయిన వారికి చేసే ఊరేగింపులు, ఉత్సవాలు ఒక రకం. వాన కోసం. పంటల కోసం, ఊరి సంక్షేమం కోసం, జరిపే ఆచరణలు. ఉత్సవాలు మరొకరకం. సాంక్రామిక రోగాలు మొదలైనవి నిర్మూలం కావాలని. దేవతలకు సంతోషం కలగాలని, దేవతల కోరిక నెర వేర్చాలని చేసే జాతరలు మూడవ రకం.

మామూలు ఉత్సవాలు, ఊరేగింపులు ఒక్కొక్క ఊరిలో ఒక్కొక్క పండుగనాడు జరుగుతాయి. లేదా ఆ దేవుడి పేరిట ఉండే పండుగనాడు జరుగుతాయి. ఉదాహరణకు రంగనాధుడు' వేంకటేశ్వరుడు వంటి దేవతలకు

వైకుంఠఏకాదశినాడు పెద్దఎత్తున ఉత్సవం జరుపుతారు శ్రీరాముడికి శ్రీరామనవమినాడు, కృష్ణుడికి గోకులాష్టమినాడు, నరసింహుడికి నరసింహ యంతినాడు ఉత్సవం జరుగుతుంది. ఉత్సవంతోపాటు లేక ఉత్సవంలో భాగంగా పూల సేవలు, పవళింపు సేవలు అర్చనలు మొదలైనవి జరుగుతాయి. ఉత్సవాలలో కల్యాణోత్సవం, రథోత్సవం, తెప్పోత్సవం వంటివి ఉన్నాయి.

వానకోసమో, మరేదైనా ప్రయోజనాన్ని ఆశించి కొన్ని పండుగలు, ఉత్సవాలు జరుపుతారు. వాన కోసం జరిపే ఎన్నో రకాల ఉత్సవాలున్నాయి. రెండు రోకళ్లకు కప్పనుకట్టి ఇంటింటికీ ఊరేగిస్తారు. ప్రతి ఇంటి దగ్గర దానికి నీళ్లు పోసి, పసుపు కుంకుమ చల్లుతారు. దాన్ని మోసుకొచ్చిన ఇద్దరి తల మీద నీళ్లుపోస్తారు. మరుసటి రోజే వానకురుస్తుందని జానపదుల నమ్మకం. బెంగుళూరులో, రాయలసీమలోని కొన్ని ప్రాంతాలలో కరగ ఉత్సవం లేక గరిగ చేస్తారు. బెంగుళూరులో అయితే దీనిలో కొన్ని లక్షల మంది పాల్గొంటారు. కరగ అనే పేరుతో కుండను, పూలకిరీటాన్ని తల మీద ఉంచుకొని అర్ధరాత్రి నుంచి పొద్దుటి వరకు ఊరిలోని అన్ని ముఖ్య దేవాల యాలకు వెళ్ళి బయలుదేరిన దేవాలయానికి వెళ్తారు కరగ ఉత్సవం రెండు మూడు వారాలున్నదనగా, కరగనుమోసే పూజారి నిష్ఠతో దినమ్మూ పూజలు చెయ్యాలి. మితభుక్తం ఆచరించాలి. స్త్రీ సంపర్కం పనికిరాదు. కరగ మోసే వాడిని ద్రౌపదీదేవి ఆవహిస్తుందని, అందువల్లనే అతనికి దాన్ని మోసే శక్తి వస్తుందని చెప్తారు,

జాతరలు జానపదులకు యజ్ఞయాగాదులతో సమానం. నిజానికి రెండింటి వెనుక ఉన్న నమ్మకం ఒక్కటే. రెండూ కర్మ మార్గానికి చెందినవే అయితే యజ్ఞయాగాదులు శిష్టులాచరించేవి, జాతరలు జానపదులాచరించేవి, రెండింటిలోను బలివిధానాలున్నాయి. మానవాతీతశక్తుల మీద మానవునకుండే నమ్మకాన్ని ప్రతిబింబించే ఈ రెండు రకాల ఆచరణలు ఒకే నాణానికి రెండు ముఖాలు.

లక్ష్మి, గౌరి, మొదలైన దేవతలు వ్రతాల ద్వారా, నోములద్వారా, ఉత్సవాలద్వారా పూజలందుకుంటారు. అయితే ఆదిమ వాసులకాలంనుంచి,

నేటి వరకు సామాన్య ప్రజల చేత పూజలందుకొనే స్థానిక దేవతలు కొందరు న్నారు. వీరిలో కొందరు శిష్ట దేవతల స్థాయినుంచి గ్రామ దేవతల స్థాయికి దిగినవారు. కొందరు వీర నారీమణుల స్థాయినుంచి దేవతల స్థాయికి ఎదిగిన వారు. ఎల్లమ్మ, పోచమ్మ, మైసమ్మ, బాలమ్మ, గంగమ్మ, చెంగాళమ్మ, ఇరగాళమ్మ, కలుగోళమ్మ, పోలేరమ్మ, కుంకాళమ్మ, అక్కమ్మ, అంకమ్మ, ముత్యాలమ్మ మొదలైనవారు జాతరలందుకుంటారు. గ్రామాలను కాపాడు తుంటారు.

గ్రామాన్ని కాపాడే దేవత ఆలయం ఊరి పొలిమేరల్లో ఉంటుంది, అక్కడ ఉండి గ్రామాన్ని ఆ దేవత రక్షిస్తూ ఉంటుందని నమ్మకం. గ్రామ దేవతలకు బలి తప్పనిసరి అనే అభిప్రాయం ఉంది. బలి విధానాలను ఆధు నిక కాలంలో ఎన్నో చట్టాలతో నిషేధించినా ఏదో రూపంలో అవి ఉండనే ఉంటాయి. అంతగా బలివిధానాలు జానపద జీవితంలో ఒక భాగమైపోయాయి.

గ్రామ దేవతల జాతరలలో ఎల్లమ్మ దేవతలకు జరిగే జాతర ఆంధ్ర లోనే కాక కర్నాటకంలో కూడా ప్రసిద్ధి వహించింది. ఏళుకొళ్ళద ఎల్లమ్మ అనే పేరుగల సవదత్తి దేవతకు జరిగే జాతరకు 10–15 లక్షల మంది జనం వస్తారట! నింబ ప్రసూన మాల్యాలు ధరించి స్త్రీలు జాతరకు రావడాన్ని నిగమశర్మోపాఖ్యానంలో తెనాలి రామకృష్ణుడు వర్ణించాడు. ఎల్లమ్మ జాతరకు స్త్రీలు అలంకరించుకొని వచ్చే విషయాన్ని తెలిపే పాటలు కన్నడంలో చాలా ఉన్నాయి. తెలుగులో రేణుకాదేవి అవతారమైన ఎల్లమ్మనుగూర్చి చాలా పాట లున్నాయి. క్రీడాభిరామంలో 'పరశురాముని కథలెల్ల ప్రౌఢిబాడె చారుతరకీర్తి బవనీల చక్రవర్తి' అని ఉంది. ఎల్లమ్మనే వేరు వేరు పేర్లతో పిలిచే సంప్ర దాయముంది. తెలంగాణాలో పాములనుకూడా ఎల్లమ్మ దేవతగా భావించే సంప్రదాయం ఉంది. (బి. రామరాజు 1978:466) 'స్వప్నమున పాములు కనపడిన ఎల్లమ్మ దేవతయని మొక్కుకుందురు. చేనులో చెలుకలో పామువలన నపాయము గలిగిన ఎల్లమ్మకు కొలువులు చేయుదురు. లక్కపోతలో గవ్వలు నతికించిగాని గోడకు పసుపు కుంకుమబొట్లు వినసకట్టి వెడల్పుతో దగ్గరదగ్గరగా బెట్టికాని ఎల్లమ్మ దేవతయని పూజలొనర్తురు. ఎరుక చెప్పువారి బుట్టలో గవ్వ లతో చేయబడిన ఎల్లమ్మ దేవత యుండును' (బి.రామరాజు 1978:466-467).

రాయలసీమలోని అనేక ప్రాంతాలలో గంగమ్మ జాతర వైభవంగా జరుపుతారు. ముఖ్యంగా చిత్తూరు జిల్లాలో, కర్నాటకంలోని కోలారు జిల్లాలో, తమిళనాడులోని కొన్నిప్రాంతాలలో గంగమ్మ చాలా గ్రామాలకు దేవత. గంగమ్మను గురించి పౌరాణికసంబంధమైన కథలు, జానపదులలో ప్రచారమై ఉండే కథలు అనేకం ఉన్నాయి. గంగను స్వర్లోకం నుంచి భూలోకానికి భగీరథుడు తెప్పించిన కథ ప్రసిద్ధమైంది. ఈశ్వరుడు గంగ వేగాన్ని తగ్గించి గంగను జటాజూటంలో ధరించడం కూడా ప్రసిద్ధమే. జనుల్లో ప్రచారంలో ఉండే 'కథ ఒకటి ఇలా చెప్తుంది.' ఈశ్వరుడు భూమిలోని ప్రజల ప్రార్థనను మన్నించి గంగాదేవిని అనుగ్రహించాడు. ఆమె తిరుపతిలోని కపిల తీర్థంలో శిశువై తేలుతుండగా ఒక బ్రాహ్మణుడామెను పెంచాడు. ఆ బాలిక మశూచికం వంటి భయంకర వ్యాధుల్ని లోకంలో వ్యాపింపజేయసాగింది.

ఆమెను శాంతింపజేయడానికి జాతర ఏర్పడింది. పుంగనూరు, వాయల్పాడు తాలూకా (చిత్తూరుజిల్లా)ల్లో కథ మరో విధంగా ఉంటుంది. శూద్రుడొకడు పురాణాదులను పఠించి బ్రాహ్మణుడినని చెప్పుకొని ఒక బ్రాహ్మణ స్త్రీని వివాహం చేసుకున్నాడు. ఒకసారి ఉగాదికి పోళీలుచేయగా వాటినిచూచి ఎనుబోతునాలుకలాగా ఉన్నాయన్నాడట. అప్పుడా బ్రాహ్మణస్త్రీ ఎనుబోతు కావలసిందని భర్తను శపించింది. ఎనుబోతు ఆమెను తరిమికొట్టింది. ఆమె ఒక పుట్టలో దాక్కుంది. ఎనుబోతు పుట్టను కాళ్ళతో, తలతో కుమ్మింది. అప్పుడాస్త్రీ ఎనుబోతుతలను నరికి, రక్తాన్ని నుదుట అలంకరించుకుంటానంది. ఆమే గంగమ్మని చెప్తారు. ఉగాదికి ముందువచ్చే మంగళవారం గంగమ్మజాతర జరుపుతారు. జాతరకు ముందురోజు సంత ఉంటుంది. ఎనుబోతుబలి మొదలైనవి ఉండనే ఉంటాయి.

కొన్నిచోట్ల చైత్రవైశాఖ మాసాల్లో ,ఒకమంగళవారంనాడు గంగమ్మ జాతర జరుపుతారు. ఆ ముందు మంగళవారంనాడు ఊరంతటా వచ్చేమంగళవారం జాతర జరుగుతుందని చాటింపు వేస్తారు. జాతరనాడు బజారువీధిలో పందిరివేసి గంగమ్మను కొయ్యతోగాని, బంకమట్టిలోగాని నిలుపుతారు. ఉదయం పల్లెలోని ప్రతిఇంటివారు అంబళ్ళనుతెచ్చి అమ్మవారికి నైవేద్యం పెట్టి భిక్షుకులకు పంచిపెడ్తారు. సాయంత్రం దీపాలు పెట్టగానే అంతా పూర్తి

కుంభాలతో ఆహారాన్ని సమర్పిస్తారు. మరుసటిరోజు ఊరేగింపు చేస్తారు. రోగాలతో బాధపడుతూ ఉండేవారు గంగమ్మకు ముడుపులు కట్టుకుంటారు. వాళ్ళంతా జాతరనాడు ముడుపులు చెల్లిస్తారు. రోగనివారణకు, నీటిఎద్దడిని తప్పించుకోడానికి సామాన్యంగా జాతర జరుపుతారు.

నెల్లూరుజిల్లాలో ఉండే దేవతల్లో లేబూరు కుంకాళమ్మ (గుడ్డి) ఒకరు ఎవరైనా కళ్ళుసరిగ్గా కనపడలేదంటే గుడ్డి కుంకాళమ్మ' అని ఎగతాళిచేయడం కద్దు. నెల్లూరికి దగ్గరలో ఉండే నారాయణరెడ్డిపేట పుట్టినప్పుడే కుంకాళమ్మ పుట్టిందట, ఆమె తిరనాళ్ళజరిపి మంట వెయ్యాలని నియమముందట! ఒకసారి అలావెయ్యకపోయేసరికి ఊరికిఊరే మండిపోయిందట: అప్పుడెవరో కుంకాళ్ళమ్మ కళ్ళుపొడిచేశారు. ఆ పొడిచినవాణ్ణి కాళ్ళకిందవేసి చంపేసింది కుంకాళమ్మ.

కుంకాళమ్మజాతర చేసేముందు 'పిలుపు' చేస్తారు. అప్పుడు కొబ్బరి, దుస్తులు. బియ్యం మొదలైనవి ఇచ్చి మాలవానితో ఊఎపతిలికిపోయి కుంకాళమ్మ పెళ్ళిచేసి ఊరిలోకి తీసుకొస్తారు. కుంకాళమ్మ జాతర ఒకరోజు కాదు, రెండురోజులుకాదు, పదకొండురోజులు జరుగుతుంది.

మొదటిరోజు కుంకాళమ్మను నిలిపి. ఊరవతలనే పెళ్ళిచేసి ఊళ్ళోకి తీసుకొని వస్తారు. రెండవరోజు ముత్తరాశివాళ్ళు ఆడవేషం వేసుకొని వెళ్ళి, మంచానికి రెండు సులగలు కట్టుకొస రాత్రి తొమ్మిది నుంచి అమ్మణ్ణి ఉత్సవం చేస్తారు. ప్రతిరోజు ఇట్లే ఉత్సవం జరుగుతుంది. అందరు కులాలవాళ్లు ఇట్లే వేషాలువేసుకుంటారు. తొమ్మిదవరోజు నిప్పులగుండం తొక్కుతారు. పచ్చికట్టెలతో గుండంచేసి, అన్నంవండి, తొమ్మిది బొమ్మలనుతెచ్చి గుండంచుట్టూపెట్టి, అన్నం నైవేద్యం పెడతారు. తొమ్మిదిబావులలో స్నానం చేసి నిప్పుగుండం తొక్కుతారు. పదవరోజు పోతురాజు ఉత్సవం జరుగుతుంది. ఈత సువ్వలతో పోతులాగాచేసి దాన్ని ఉత్సవంచేసి నైవేద్యం పెడతారు. పూర్వకాలంలో అంతానిజంగానే ఎనుబోతును బలిఇచ్చేవారు. ఇప్పుడు కేవలం సాంకేతికమైన కొన్ని పద్ధతులతో సరిపెట్టుకుంటున్నారు. చిన్న జంతువులనేగాని పెద్దజంతువులను నరికేది అరుదైపోతున్నది. కుంకాళమ్మ

జాతరలో పదకొండవ రోజును కొర్లబండి అంటారు. ఆ దినం పొట్టేళ్ళబలి జరుగుతుంది. మునుపు ఇరవై అయిదు పొట్టేళ్ళను నరికేవారట. ఇప్పుడు మూడు పొట్టేళ్ళతో సరిపెట్టు కుంటున్నారు. ఊరపతల కయ్య (పొలం)లో బండిచక్రాన్ని వేస్తారు. ఏవైపు ఆబండిచక్రంపడితే ఆవైపు బాగా పండు తుందని నమ్మకం. ఈ విధంగా జాతర ఈనాటికీ అప్పుడప్పుడూ జరుగుతూనే ఉంది.

జానపదుల జీవితంలో పైనపేర్కొన్న పండుగలు, వ్రతాలు, ఉత్స వాలు. జాతరలు భాగమైపోయాయి· వీటిలో కొన్ని సంతోషంకోసం ఏర్పడ్డ వైనా మరికొన్ని కేవలం మూఢనమ్మకాలకు, మూఢాచారాలకు నిలయాలై ఉన్నాయి.

ఇటువంటి జానపద కర్మకాండలు. పండుగలు ప్రాచీనకాలంనుంచి ఉన్నవే. ఆదిమవాసుల జీవితంలో కర్మకాండలకు ఎక్కువ ప్రాధాన్యం ఉంది. నగర జీవితానికి దగ్గరగా ఉండే జానపదుల జీవితంలో పండగలపాలు ఎక్కు వైతే, అటవీ జీవితంలో దగ్గర సంబంధం ఉండే జానపదులకుకర్మకాండలపై నమ్మకం ఎక్కువ. తిరునాళ్ళ, జాతర, ఊరేగింపు ఉత్సవాలలో యానాదుల వంటి వెనుకబడిన జాతులవారూ సంభ్రమంగా పాల్గొంటారు దసరా వేషాలలో యానాదులపాత్ర గమనార్హమైనది. కృష్ణుడు, గోపికలు, రాముడు. సీత, హనుమంతుడు మొదలైనవేషాలనువేసి చిందులు తొక్కుతూ బహుమతుల కోసం అంగడి అంగడికి తిరగడం నెల్లూరుజిల్లా మొదలైనచోట్ల కనిపిస్తుంది. జాతరల్లోకూడా వీరుపాల్గొంటారు. సాంక్రామిక వ్యాధులు ప్రబలినప్పుడు మహా లక్ష్మమ్మ జాతరజరుగుతుంటే 'అమ్మామాయమ్మా మహాలక్షమమ్మా, అందరికి నీ సేవ ఆనందమమ్మా' అని పాడుతూ తిరుగుతుంటారు యానాదులు.

ప్రపంచంలోని అన్నిజాతుల్లోను నమ్మకాలు. అవి వ్యవస్థ రూపం దాలిస్తే మతం, దేవతాగణం, స్తుతి విధానాలు, కర్మకాండలు, నమ్మకాలు, వివిధరకాలపూజలు, మంత్రతంత్రాలు ఒకరకమైతే తమమాధ్యంపాలుకొంత తగ్గించి, నలుగురూ సంతోషంగా జరుపుకునేదిగా పండుగలు అవతరించాయి. మత సంబంధమైన కర్మకాండలు ఒకవైపు, లౌకిక సంబంధం ఎక్కువగా ఉండే పండుగలు మరొక వైపుఉంటే, ఈ రెండింటిమధ్యలో జాతరలు,

వ్రతాలు, నోములు మొదలైన సాంఘికాచారాలు వస్తాయి. ఇవన్నీ జానపదుల నమ్మకాలు మూలధనంగా, మూలశక్తిగా ఉండే ఆచారాలే. సంఘంలోని అనేక వ్యక్తులు ఒక్కచోట చేరితేనే పండగలు మొదలైనవన్నీ సార్ధకమవుతాయి. మానవుని సాంస్కృతిక వికాసంలో పండుగలు మొదలైనవి వహించినపాత్ర మరువలేనిది.

టిప్పణి

1. "Someone has said that there is nothing in the end which is not in the beginning and the un-broken continuity can be traced between most of our customs and those of our barbarian forefathers, who, in their turn, received them from their savage ances-tors. Existing barbarians and savages are belated stragglers in the race of life, and that is why we con-sider that their customs are not curiosities to be gaped at or scoffed at, since for us, as well as for them they are full of significance - *Customs of the World* (Ed. by Walter Hutchinson). Introduction by A. C. Haddon,p. xxiv.

2. "Festival is a complex unit of customs and other folklore to celebrate a special occasion usually annually; and of public interest :
SDFML, Boggs, Vol. II. p. 1144.



# జానపద వైద్యం

వీధుల్లో మూలికలను పరిచిపెట్టుకొని అన్ని వ్యాధులకు మూలికా వైద్యంచేస్తామని అరిచి పిలిచి అంతో ఇంతో వసూలు చేసుకునే వారు కొందరు. నాడిచూచి వ్యాధిపేరు చెప్పి ఏదో వేరునో, కాండాన్నో, ఆకునో ఇచ్చి నమ్మకంగా నమిలి మింగమనేవారు కొందరు. జ్వరానికీ, తలనొప్పికీ, కడుపునొప్పికీ, కాలుతీపికీ ఒకటే మందుగా విభూతి మంత్రించి ఇచ్చేవారు కొందరు. తేలుకాటుకు, పాముకాటుకు, ఏపురుగుకాటుకైనా మంత్రంవేసి నమ్మకంగా తగ్గిస్తామనేవారుకొందరు. నీళ్ళుమంత్రించి కొందరుఇస్తే, విభూతిమంత్రించి మరికొందరిస్తే, దిష్టితీసి రోగం మరొకరుతగ్గిస్తే, భూత ప్రేతపిశాచాలను కూడా పరుగెత్తేట్లు చేస్తామని మరికొందరు వస్తారు. ఇవన్నీ జానపద వైద్యానికి సంబంధించినవి. మూలికా వైద్యమైనా, నాటువైద్యమైనా, మంత్రవైద్యమైనా, దిష్టిఅయినా, తంత్రవిద్యతో తగ్గించే విధానమైనా అంతటా ఒక్కటే మూలమంత్రం—నమ్మకం. ఈ నమ్మకమన్నది లేకుంటే ఏ వైద్యమూ పనిచేయదు. అందులో జానపద వైద్యానికి ముఖ్యంగా అవసరం నమ్మకమే, ఔషధికాదు అన్నది గుర్తుంచుకోవాలి. అందుకే ఇది వస్తు సంస్కృతిలో చేరదు. సాంఘికాచారాలలో ఒకటిగా ఉంటుంది. జానపద వైద్యంలో వస్తువుల్ని వాడవచ్చు. కాని అవి ప్రధానంకాదు. సాంఘిక ఆచారంగా, సంప్రదాయంగా, నమ్మకం ప్రధానంగా తరతరాలనుంచి వస్తున్న అనుభవ గృహవైద్యమే జానపదవైద్యం. అందువల్లనే ఇది సాంఘికాచారాలలో భాగమయింది.

తెలుగువారు ఈ వైద్యాన్ని ఎప్పటినుంచి వాడుతున్నారు అంటే కొన్ని వందల సంవత్సరాల నుంచి అన్నదిమాత్రమే జవాబు. వైద్యాన్ని గూర్చిన ఉల్లేఖనాలు ప్రాచీనకాలంనుంచే లభిస్తున్నాయి. బసవపురాణంలో వాపులకు వాయుతైలాలు, వావిలచిగుళ్ళు, ఉమ్మెత్త, ఆముదపుచివుళ్ళు జిల్లేడాకులు, వీటితోకాచడం మొదలైనవి చేసేవారని చెప్పబడింది (పు.77). గోవులను

కాచే గోపబాలురకు కూడా కొంతకొంత పశువైద్యం తెలిసిఉండేది. దూడ చచ్చిన ఆవులను సేపునట్లుచేయడం, కడుపులోపలనే దూడచచ్చిన ఆవులకు మందులివ్వడం వాళ్ళకుతెలుసు. ఆవులకువచ్చే రోగాలపట్టీ ఒకదాన్ని నవనాథ చరిత్రలో చూడవచ్చు (పు. 29–30)

> నరుదు కన్నును నీరు నాలిక చేర్లు
> గురు దెవులును గంటికురుమ కట్టూర్పు
> కప్ప నాపురు గాలిగజ్జి పల్ తిక్క
> పుప్పిపంపరయూడు బొడ్డుబొల్లూత
> మొల విడిసెల తెవులు ముకుబంతి కవటు
> తలయేరు తొడకు వాతము కల్లవాపు
> నలదొబ్బ దెవులును నాదిగా నెన్న
> గల పసరాల రోగములకు నెల్ల
> మందుల బెట్టరు, మంత్రింపతెవులు
> కందువుగని చూడగా నేర్తునొప్ప....

గిరిజనుల్లో, ఆదిమజాతులకు చెందిన అనేకుల్లో మూలికావైద్యంబాగా ప్రచారంలో ఉంది. సర్పగంధి, సుగంధపాల వంటి వాటిని రోగాలకు తగ్గట్టుగా ఉపయోగించడం వీరికి అనుభవంవల్ల సిద్ధించింది. అటవీజనం నడిచేటప్పుడు వారిదృష్టి మూలికల మీదనే ఉంటుంది. గాయాలకు, రక్తపోటుకు, గర్భస్రావానికి, గర్భనిరోధానికి గిరిజనులవద్ద శక్తివంతమైన ఔషధాలున్నాయి. యానాదులు మొదలైన గిరిజనులు భార్యకు నవమాసాలు నిండగానే పది పన్నెండు రకాలవేళ్ళను తెచ్చి సిద్ధంగా ఉంచుకుంటారు. నొప్పులువచ్చినప్పటి నుంచి పదవరోజువరకు మంచినీటికి బదులు ఈ మూలికల కషాయాన్నే తాగడానికి ఇస్తారు. దీనివల్ల ఏ జబ్బులూరావని వారినమ్మకం. "పెద్దమాను, ఆకు చెముడు, ఎర్రవాలుడు, నల్లమునుకుడు పొరముమొక్క, వారగోగు తెల్లబులుగుడు, నల్లబులుగుడు, సోమి. విషబుద్ధి, నేలవేము, చేదుపుల్ల, నేల గుమ్మడి, చిల్ల, బాలింత సందుమిచెక్కలు'' వీరువాడే వేళ్ళు (వెన్నెల కంటి రాఘవయ్య, యానాది, పు. 75) తెలిసిన రోగాలకు తెలిసిన మందులు

ఉంటే సరే. లేకుంటే అన్నిటికీ ఒకేమందు "సోదె". గుంటూరు, కృష్ణ, గోదావరి జిల్లాలలో దీనినే రంగం అంటారు. ఇది ఒకవిధంగా దేవతాస్తుతి. సోదె నేర్చుకోవాలంటు నియమనిష్ఠలతో ఉండాలి. స్త్రీ ముఖం చూడకూడదు నీళ్ళల్లో ఒంటికాలుమీద నిలుచుకొని దినానికి పదిసార్లు జపం చెయ్యాలి. ఒక్కపొద్దు ఉండాలి. ఆఖరిరోజున శిష్యుడికి శిష్యుడి భార్యకు మళ్ళీపెళ్ళి చేస్తారు. సోదెచెప్పేటప్పుడు, లేక ప్రారంభమయినప్పుడూ ఉపవాసం ఉండి, స్నానాలుచేసి, దేవుణ్ణిపూజ చేసుకొని వ్యాధులుపోగొట్టుమని దేవుణ్ణిప్రార్థించాలి.

## జానపద వైద్య స్వరూపం

జానపద వైద్యం తరతరాలనాటిది. ప్రకృతే మొట్టమొదటి ఔషధశాల. ప్రాచీనమానవుడు ఈ ఔషధశాలనుంచి వైద్యానికికావలసిన పరికరాలను ఎంచుకున్నాడు. మనిషి ప్రపంచంలోని ఒక ప్రాంతంనుంచి మరొకప్రాంతానికి వెళ్తూఉంటే ఈ పకృతివైద్యశాలకూడా విస్తరించసాగింది [1] జానపద వైద్యాన్ని నిర్వచించే ప్రయత్నాలు జరిగాయి. ఇటీవలికాలంలో జరిగిన ఈ ప్రయత్నాల వెనక అనేక శతాబ్దాల చరిత్రఉంది. వైద్యమే వైద్యులకంటె ప్రాచినమైంది. అందువల్ల వైజ్ఞానిక వైద్యానికి భిన్నమైంది జానపదవైద్య మని ఒక విధంగా నిర్వచించవచ్చు. ఆస్వాల్డ్ ఎ. ఎరిచ్, రిచర్డ్ బైబిల్ ప్రకారం జానపదవైద్యం అన్నది అనారోగ్యాన్ని గురించి సాంప్రదాయికంగా పూజల్లో ఉండిన అభిప్రాయాలసారం. [2]

నాటువైద్యమని, కూరగాయవైద్యమని, అనుభవ గృహవైద్యమని పేరుపొందిన జానపదవైద్యానికి శాస్త్రీయమైన ఆధారాలేమీలేవు. అయినా అది అనుభవంవల్ల రూపొందింది కావడంవల్ల ఒక్కొక్కసారి కారణం తెలీకనే మంచిమందు ఈ పద్ధతిలో దొరకవచ్చు. మానవుడు ఎన్నో విషయాలను ప్రకృతినుంచి నేర్చుకున్నాడు. కొన్ని అకస్మికంగా నేర్చుకుంటే మరికొన్నింటిని అవసరంకొద్దీ నేర్చుకున్నాడు. వేటకు వెళ్ళినప్పుడో, యుద్ధానికి వెళ్ళినప్పుడో గాయం తగిలితే ఏదో ఒక ఆకుపసరునుపూసి తగ్గుతుందేమో చూసి ఉంటాడు ప్రాచీన మానవుడు. ఇలాంటి ప్రయోగాలవల్ల ఒక్కొక్కసారి ప్రాణాపాయం సంభవించిన సందర్భాలులేకపోలేదు. అయినా వైద్య

శాస్త్రాన్ని గురించిన శాస్త్రీయపరిజ్ఞానంలేని ప్రాచీనమానవుడికి, జానపదుడికి ఏదో విధంగా రోగాలను నయంచేసుకోవాలనే తాపత్రయం ఉండడం సహజమే, ఇలాంటి తాపత్రయమూ, తద్వారా చేసిన ప్రయోగాలు, వాటి మూలంగా కలిగిన అనుభవమూ అనేక విధాల వైద్యవిధానాలు ఉద్భవించడానికి కారణమయ్యాయి.

దేహాంశాల సూక్ష్మాతిసూక్ష్మ పరిశీలనవల్ల, శాస్త్రీయపరిశోధనవల్ల రూపు దాల్చిన వైద్యపద్ధతి అలోపతి (Allopathy) . ఎంత శాస్త్రీయమైనా అలోపతి వల్ల ఎప్పుడూ మేలే జరుగుతుందని కాదు. అదీ నిరంతరం మార్పులకు లోనవుతూనే ఉంది. ఈనాడు ఏదో రోగానికి ఇదే సరైన మందుఅంటే, రేపు ఆ మందు అసలు పనికిరాదు అనవచ్చు. అదీకాక 'ఇంగ్లీషు మందు'లు ఎక్కువగా రాసాయనిక పద్ధతుల వల్ల తయారయిన వపడంవల్ల దేహానికి జరిగే హాని కూడా ఎక్కువగానే ఉంటున్నది. రానురాను మరీ 'అవసరమైతే తప్ప ఇంగ్లీషు మందులు వాడకూడదు' అనే అభిప్రాయం ప్రబలమవుతున్నది. దేశీయ విధానాలకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వాలనే వారు ఎక్కువవుతున్నారు,

భారతీయ వైద్యపద్ధతుల్లో ఆయుర్వేద పద్ధతి శిష్టమూ, అనుభవైక వేద్యము, శాస్త్రీయమూ, జానపద వైద్యమే ఆయుర్వేదానికి మూలమైనా అది విద్యావంతుల చేతిలో, శాస్త్రపరిశోధకుల దృష్టిలో పడడంవల్ల పరిష్కృత వైద్యవిధానమయింది. అయితే అలోపతి వైద్య విధానం లాగా ఆధునిక విజ్ఞాన పద్ధతుల ఆధారంతో రూపు దాల్చిందికాదు ఆయుర్వేదం. ఇటీవలి కాలంలో మాత్రం నవీన శాస్త్రీయ పద్ధతులననుసరించి ఆయుర్వేదంలో కూడా పరిశోధనలు జరుగుతున్నాయి. జానపద వైద్యానికి దగ్గర సంబంధం ఉందేది కాబట్టి, ఆయుర్వేదాన్ని దానితో పోల్చి చూడవలసిన ఆవశ్యకత ఉంది. జానపద వైద్యంలో శుద్ధీకరణ విధానాలు లేవు. అది నమ్మకాల మీదనే ఆధారపడి ఉంది. అందువల్ల రహస్యగుణం ఎక్కువ. మూలికా వైద్యం తెలిసిన వారెవ్వరూ ఆ మూలికల పేరుచెప్పరు, ఆకుపసరు పూస్తారేగానీ, ఆ ఆకు ఏమిటో చెప్పరు. మరీ ఒత్తిడి చేస్తే ఆకు చూపిస్తామంటారుగాని దాని పేరు చెప్పరు. కాని ఆయుర్వేదంలో ఈ విధమైన గోపనం లేదు. అది శాస్త్రం కాబట్టి ఎవరైనా అభ్యాసం చేయవచ్చు. జాన

రోగాలకు కాకున్నా చాలా రోగాలకు తేనె మందు — సర్వరోగనివారిణి కూడ. పరదేశాలకే పోనక్కరలేదు. మన చుట్టూ అరణ్యాలలోనే తెనెనే ప్రధానా హారంగా తీసికొనే వారున్నారు. అదే తేనె మనం ఎక్కువగా తీసుకొంటే వేడి చేసి సన్నబడి పోతామని జానపద వైద్యం తెలిసినవారంటారు.

లాభాలు - నష్టాలు - రకరకాల ఔషధాలు

జానపద వైద్యంలో అసంఖ్యాక జనులు వాడి తప్పక పని చేస్తుందని నమ్మకం కలిగిన తర్వాత ఏదైనా ఔషధం శిష్టవైద్యంలో కూడా స్థానం పొందవచ్చు. కొన్ని విధానాలు ఏ వైద్యానికి చెందినవి అని చెప్పడం కూడా కష్టమే. యోగమనే పేరుతో చేసే ఆసనాది వ్యాయామాలనే ఎన్నెన్నో పేర్లతో సామాన్యుల నుంచి స్వామీజీల వరకు ఉపయోగించటం చూస్తున్నాం. పాము కాటుకు కట్టుకట్టి రక్త ప్రసారం కాకుండ నిలిపివేసి. కాటువేసినచోట ఏదైనా ఆయుధంతో కోసి రక్తంకారేటట్లుగా చేస్తే విషం పోతుందని జానపదుల నమ్మకం. ఈ నమ్మకంలో నిజం లేకపోలేదని తెలుసుకొన్న తర్వాత ఈ విధానం వేరే వైద్యవిధానాలలో కూడ వాడబడుతున్నది.

వ్యాధి వచ్చిన తర్వాత వైద్యం చేసుకోడం కంటె అసలు వ్యాధి రాకుండా చేసుకోడం మేలని ప్రతివైద్యంలో చెప్పే విషయమే. ఈవిషయంలో జానపద వైద్యంకూడా ఏమీ వెనుకపడి లేదు. జానపదులు చెప్పేకొన్ని ఆరోగ్య నియమాలు నిజానికి ఎవరైనా అనుసరించదగినవే. గోళ్ళు కొరక కూడదనేది అటువంటి విషయాలలో ఒకటి. వేపపుల్లతో పళ్ళు తోముకోడం మంచిదనేది మంచి నియమాలలో ఒకటి. వెల్లుల్లి పొట్టును పొగవెయ్యడమూ అలాంటిది. సాంబ్రాణి పొగకూడా క్రిమిసంహారిణిగా ఉపయోగపడుతుంది

మానసికంగా మనం తరతరాలుగా మూఢనమ్మకాల సముద్రంలో పడి కొట్టుకుంటున్నాం. దీని వల్ల మన మనస్సులోని అంతరాంతరాల్లో ఇలాటి నమ్మకాలన్నీ పాతుకొని పోవడంవల్ల కొన్ని వ్యాధులకు మంత్రాలే మందు లుగా పనిచేస్తాయి. ముఖ్యంగా తేలుమంత్రాలు, పాము మంత్రాలు అలాంటివే. నిజంగా మంత్రం వల్ల ఏమీ తగ్గదు. అయినా తేలుకాటుకో, పాముకాటుకో గురైన మనిషి గట్టినమ్మకం ఉన్నవాడైతే మంత్రం వల్లమేలే జరగవచ్చు,

అటువంటి వారికి మంత్రం వెయ్యక తప్పదు. దిష్టివల్ల, కళ్లుపడడం పల్లి, ప్రయోగాలవల్ల తలనొప్పులు, కడుపునొప్పులు, వాంతులు, మొదలైనవి వస్తాయని మనలో నమ్మకం. నిజానికి వీటివల్లఏవీరావు. అయితే మానసికంగా దుర్బలురైన వారికి ఇలాంటి రోగాలు వచ్చినా ఆశ్చర్యపోనక్కరలేదు ఇవి ఒక రకంగా మానసిక రోగాలని చెప్పదగినవేకానిదైహిక రోగాలుకావు. దెయ్యం, భూతం మొదలైనవి కూడా పూర్తిగా మానసిక రోగాలు. మిథ్యా కల్పన వల్ల ఇలాంటివి వస్తాయి. వాటికి విరుగుడుగా కూడా మిథ్యనే వైద్యంగా ఉపయోగించాల్సి వస్తుంది.

ఆదివాసుల వైద్యాలు: జానపదుల వైద్యానికి దగ్గరగా ఉండే ఆదివాసులు, గిరిజనుల వైద్య పద్ధతులు కొన్ని చాలా బాగా పనిచేస్తాయనడంలో సందేహం లేదు. గిరిజనులు ఎక్కువగా నాడీ వైద్యం ద్వారా తెలుసుకున్న రక్తపు పోటుకు సర్పగంధిని తత్సంబంధమైన వేళ్ళనుఇస్తుంటారు. సర్పగంధి రక్తపు పోటుకు మంచి ఔషధంగా శిష్ట వైద్యంలో కూడా ప్రవేశించింది. ఆదివాసులకు వేపచెట్టు పరమౌషధం. వేప ఆకులు, ఇగుళ్ళు అంటువ్యాధులకు ఎత్తిన ఔషధాలు. వేపనూనె పేలకు ఇంకా కొన్ని క్రిమికీటకాలను చంపడానికి ఉపయోగపడుతుంది. వేపపుల్ల ఉపయోగం తెలిసిందే. వేపనూనె దీపం కంటికి మంచిదని, వేపగంధం చల్లదనాన్ని ఇస్తుందని, వేపదీపపు మసితో చేసిన కాటుక చాలా మంచిదని చెప్తారు. ఒళ్ళు చల్లబడాలంటే నెత్తి మీద ఆముదం పెట్టుకోడం మనకు తెలిసినదే.

యానాదుల ఔషధాలు కొన్నింటినిసేకరించి వెన్నెలకంటి రాఘవయ్యగారు తమ 'యానాది' గ్రంథంలో ఇచ్చారు. అవి ఇలా ఉన్నాయి. (పు. 81-84); "చిత్రమూలం పాలు రాచితే కీళ్ల నొప్పులు, తలనొప్పులు కుదురుతాయి. పాలతీగ కొనను ముక్కుల్లో చొప్పిస్తే జలుబు నివారణ అవుతుంది. రొమ్ము పడిశాన్ని రంక చెక్క నివారిస్తుంది. ఎర్రగడ్డ, తెల్లగడ్డ, అల్లము కలిపినూరి మ్రింగితే జ్వరాలు కుదురుకుంటాయి. వాకుడు గింజలను కాల్చి పొగను కుడి చెవిలోనికి పోనిస్తే కుడి దవడ దంతముల నొప్పి కుదురుతుంది. చిగుళ్ల వాపుకు కారణమైన పురుగులు క్రిందపడుతాయి. తేలుకొండె ఆకు పసరులో గచ్చకాయల గంధము కలిపిపూస్తే తేలు విషము హరిస్తుంది. పాము కాటుకు

నాగముష్టివేరు ఎత్తినమందు. పాము కరచిన చోట కొరివితో కాలిస్తే పాము విషమునిలవదు.

టాన్సిల్సు వ్యాధికి రైలాకు సరియైన ఔషధము. తులసి పసురు గాయాలకు మంచిమందు జీలగకట్టను. తెల్లపాయలను నూరి మాత్రలను మింగిస్తే విరేచనాలు కట్టుకుంటాయి. నల్లేరు. తెల్లతుమ్మ, వేపఆకులను, మోదుగ తెల్ల పులుగుడు, వెంపలి, తంగేడు, జిల్లేడువ్రేళ్లు నీళ్ళలో కాచి ఆ కషాయాన్ని తొమ్మిది దినాలు సేవిస్తుంటే బాలింత జబ్బులు రానేరావు.... ....(పు.81) యానాదులు కొన్ని వ్యాధులకు వాడే మరికొన్ని ఔషధాలు ఈ క్రిందివి:

"జ్వరాలకు: నల్లఉప్పలచెక్క, కోలముక్కుచెక్క, ఈసరివేళ్ళు, నేల వేముచెక్క, వాగుడిచెక్క. పునగానిచెక్క, వెట్టిబిల్లుచెక్క, మంచిబిల్లు చెక్క, గుమ్మడిచెక్క, బాలింత నుదుముచెక్క, ఏనుగ నరగుంజి చెక్క. మంచినరగుంజిచెక్క, కరకాయచెక్క, తిప్పతీగె, దంతివేళ్ళు, పెద్దమాను చెక్క, ఆకుచెముడుచెక్క,

విరోచనాలు కట్టుకొనుటకు: వేపబంక, ఉల్లిందరబంక, ఎద్దుసోగచెక్క

భేదికావడానికి: భేదిచెక్కకషాయము. కరకాయ కషాయము, నుంకేశలఆకులు, రేల ఆకులు, లేక పళ్ళు

కడుపునొప్పికి: కోలముల్కచెక్క కషాయము, తంగేడుచెక్కకషాయము. జిల్లేడుచెక్క కషాయము,

తీటకు: దేవదారు రసము, సన్నమల్లి ఆకులరసము.

గాయాలకు: ఊటిఆకు, పిచ్చికబీరఆకు, గబ్బుఆకు, రాగిచెక్క, పూడిమద్ది చెక్క. ఏద్దుసాగచెక్క.

బెణుకులు: ముష్టిపండ్లు, కణింమూలుగు, గంజేరుఆకులు, తుత్తరేణి ఆకులు.

పాముకాటుకు : వెఱ్ఱిబిల్లిచెక్క, వెఱ్ఱిబిల్లి, మంచిబిల్లి. పల్లముష్టిచెక్క లేకవేళ్లు, నల్లముష్టిచెక్క లేకవేళ్ళు, పొనగాని, నేలవేము, నాగముష్టి, పిచ్చికబీర, పాముదొండ, తిప్పతీగె, తంతివేళ్ళు''

వర్గీకరణ: జానపదవైద్యంలో ముఖ్యంగా ప్రకృతి జానపద వైద్యమని మంత్రతంత్ర సహితవైద్యమని రెండురకాలనుచెప్పుకోవచ్చు. ప్రకృతినుంచి లభించే వస్తువులతో చేసే వైద్యంలో మూడురకాలుంటాయి. చెట్లు. చేమలు, వేర్లు, ఆకులు, కాయలు, పళ్ళుమొదలైన వాటితో చేసే వృక్షసంబంధమైన వైద్యం మొదటిరకం, దీనినే వృక్షవైద్యమని లేక సస్యవైద్యమని చెప్పవచ్చు రెండవది ప్రాణివైద్యం. దీనిలో మళ్ళీఉపవిభాగాలున్నాయి. పెంపుడుజంతువులకు. ఇతరజంతువులకు మనంచేసేవైద్యం ఒక విభాగం. జంతువులద్వారా లభించే వస్తువులతో వైద్యం చేసుకోవడం మరో విభాగం. ఉదాహరణకు పాలు, పెరుగు, నెయ్యి, వెన్న. గోమూత్రం మొదలైనవి అనేక వ్యాధులకు ఉపయోగిస్తారు. మూడవరకం వైద్యం ఖనిజం వైద్యం,నీరు, మట్టి,గంధకం, ఉప్పు మొదలైన పదార్థాలనుకూడా వైద్యానికి వాడుకుంటాం. ప్రకృతిజానపద వైద్యంలోని విభాగాలను ఈ క్రింది విధంగా చూపవచ్చు.




నమ్మకాల క్రిందనే జానపద వైద్యాన్ని చేర్చిన ఆర్. ఎస్. బాగ్స్ వైద్యానికి సంబంధించి అధ్యయనం చెయ్యాల్సిన విషయాలను ఈ క్రింది విధంగా పట్టీ చేశాడు. (Standard Dictionary of Folklore, P. 1146)




## మంత్ర తంత్రాలు

యంత్రాదులు తప్ప ఔషధాలను వాడకుండా మంత్రతంత్రాలమీద మాత్రం ఆధారపడి వైద్యం చేసేవారుకూడా ఉన్నారు. మాంత్రిక జగత్తులో బ్రతికే ఆదిమవాసుల్లో ఇటువంటి వైద్యానికే ఎక్కువప్రాధాన్యం ఉంది. కొన్నిరకాల ఉంగరాలుధరించినా, రత్నాలు ధరించినా రంగునుబట్టి, లోహాన్ని బట్టి వివిధప్రయోజనాలు సిద్ధిస్తాయని నమ్మకాలున్నాయి. పగడాలుధరిస్తే జీర్ణ శక్తిని అభివృద్ధి పరుస్తాయని గాయాలనుంచి కారేరక్తం కడుతుందనిచెప్తారు. గోమేధికమణిని ధరిస్తే పిచ్చికుదురుతుందట. తృణికాంత మణిని ధరిస్తే రక్త విరేచనాలు కట్టుకుంటా యంటారు. కాంతపు రాయిని ధరిస్తేప వ్యాధీరాదంటారు, కంటివృష్టినిబలపరుస్తుందని, గాయాలను త్వరగామాన్ప తుందని నమ్మకం ఉంది.

కొన్నికొన్ని వ్యాధులకుమంత్రతంత్రాలీవిధంగా ఉన్నాయి.

భూతబాధ తొలగడానికి: ఓంనమో ఓంహ్రీంహ్రోంహ్రాంనమో భూత నాధాయ సమస్తభువనభూతాని సాధయ సాధయహుంయీ" అంటూనెమలి ఈకలతో దిగదుడిస్తె భూతాలు వదలిపెట్టి వెళ్ళిపోతాయంటారు.

పాము మంత్రం : ఈ క్రింది మంత్రాన్ని చదువుతూ కంకర రాళ్ళు పడవేస్తే పాము కట్టుబడి పోతుందట ; 'బజ్‌రీ బజ్‌రీ వజర్ కివాడ్ బజ్‌రీ కొలుం ఆస్ పాస్ మర్ ; సాంప్ హోయ్ ఖాఖ్ మేటాకీల్యా పత్థర్‌కలై పత్థర్ పూహై నమేరా కీలా ఛుహై మేరీ భక్తిగురుకీ శక్తి పురో మంత్ర

ఈశ్వరో వాచ'. కట్టు బడి పోయిన పామును మళ్ళీ విడిపించాలంటే 'కీలన భయీా కుకీలనీ బాచాభయీా కువాచ్। జాహూా సర్పఘర్ అప్నే చుగఫిర్ చారో మాప్' అనాలి. కంటినొప్పి పోవడానికి: 'ఓం నమో ఆదేశ గురుకో సముద్ర సముద్రమే ఖాయీా ఇస్ మరద్‌కీ అంఖ్‌మే ఆయీా। పాకై ఫ్లటేన పీడాకరై గురుగోరఖ్ జీ ఆజ్ఞాకరే। గురుకీ శక్తి మేరీ భక్తి పురోమంత్ర ఈశ్వదోవాచ.' ఇది చదువుతూ ఏడు ఉప్పురాళ్ళను మంత్రించి దిగదుడచాలి. సంధ్యాదోష నివారణకు కూడా మంత్రాలు, తాయెత్తులు ఉన్నాయి.




పై యంత్రాన్ని కాయితం మీద వ్రాసి బంగారు లేదా రాగి తాయెతులో పెట్టి స్త్రీ తన కంఠములో ధరించాలి. అలాంటి స్త్రీకి అచిర కాలంలోనే సంతానం కలుగుతుంది.

పైన ఇచ్చినటువంటి యంత్రాలు జ్వరానికి కూడా ఉన్నాయి. కుండ పెంకుమీద కింది యంత్రాన్ని రాసి జ్వరం వచ్చిన వ్యక్తి బావిలో పడవేస్తే జ్వరం తగ్గిపోతుంది.

| | | | |
|---|---|---|---|
| 82 | 89 | 2 | 7 |
| 6 | 3 | 86 | 85 |
| 88 | 83 | 8 | 1 |
| 4 | 5 | 84 | 80 |

సంతానానికి, సుఖప్రసవానికి, కడుపునొప్పికి, ఋతుశూలకు. మొలల వ్యాధికి ఇలాంటి యంత్రాలు ఉన్నాయి.

కేవలం మంత్రాలు, యంత్రాలు ఉపయోగించి కొన్ని వైద్య సంబంధమైన ఉపయోగాలను పొందడం ఒక విధమైతే, ఆకులు, మూలికలు, తీగలు మొదలైనవి ఉపయోగించినా, వీటిని కేవలం నమ్మకం మూలకంగా ఉపయోగించి, వాటి భౌతిక గుణాన్ని ఏమాత్రం ఉపయోగించుకోక పోవడం కూడా నమ్మకాల వైద్యం కిందికే వస్తుంది.

తుమ్మపువ్వు, ప్రియంగుపుష్పం, మారేడువేరు, దేవదారు పుష్పం మెత్తగానూరి ధూపంవేస్తే దయ్యాలు, భూతాలు, గ్రహాలు, శాకినీ డాకినీ రాక్షస పిశాచాదులన్నీ పారిపోతాయని నమ్మకం, పుష్యమీ నక్షత్రంతో కూడిన ఆదివారం తెల్లగురివిందవేరు పెరికి తెచ్చి చంటిపిడ్డ మెడకు కడ్తే పిశాచాల బాధ ఉండదట. పుష్యమీ నక్షత్రంనాడు తిప్పతీగెవేరును తెచ్చి మాలగా తయారు చేసుకొని మెడలో వేసుకుంటే పాములవల్ల భయమే ఉండదట. ఆదివారం తెల్లగన్నేరు వేరుతెచ్చి కుడిచేతికి కట్టుకున్నా కూడా అగ్నిభయం అన్నదే ఉండదని జానపదుల నమ్మకం. దృష్టిదోషం వల్ల జ్వరమో, భయమో, దయ్యమో పట్టుకుంటే అర్థం పర్థంలేని ఈ క్రింది మంత్రం చెప్పి నెమలి ఈకతో దిగదుడిస్తే దోషం పోతుందంటారు.

"ఓంనమో సత్యనామ ఆదేశగురుకో – ఓం నమోనజర్ జహాపర్ పీర్ నజానీబోలే – ఛల్నో అమృతవానీ కహానజర్ కహాతే ఆయీ యహాకీ ఠార్ తోహి కౌన్ బతాయీ – కౌన్ జాత్ తేరీ–కహాతామ్-కిస్కీ-బేటీ–కహా తేరీనామ్-కహాసే ఉడీ-కహాకోజాయ్–అబ్హీ బస్ కర్లే-తెరీమాయా మేరీ జాత్ సునోచిత్ లాయ్–జసీహోయ్ సునా ఊ అయ్-తేలన్ తమోలన్ చడ్హీ. చమారీ కాయథనీ ఖత్రానీ కుంహారీ మహతరానీ-రాజాకీ రానీజాకో దోష్ తాహీకే సిర్పడే-జాహరే పీర్ నజర్సే రక్షాకరే - మేరీభక్తి గురుకీశక్తి-ఫురో మంత్ర యీశ్వరోవాచ."

యంత్రాలు, మంత్రాల మీద నమ్మకం బలంగా ఉండే జానపదులను మభ్య పెట్టడానికి తప్ప ఇలాంటివి మరెందుకూ పనికిరావు.

అన్ని వ్యాధులకూ పెరట్లోనే మందులు

ఏ మందుకూ నయంగాని వ్యాధికూడా పెరట్లో ఉండే మామూలు ఆకు తోనో, వేరుతోనో నయంకావచ్చు. ఆహారంలో వాడుకొనే కూరగాయలు, పళ్ళు, పదార్థాలతోనే కొన్ని జబ్బులను నయం చేసుకోవచ్చు. ఒక్కొక్క సారి అలోపతి మందులకన్న ఇవే బాగా పని చేస్తాయి. కాని ఏ మందూ పని చేయకపోతే గృహవైద్యాన్ని అనుసరించడం మనకు అలవాటయింది. ఆంధ్రుల జానపద వైద్యంలోని కొన్నిటిని మాత్రం ఈ క్రింద పేర్కొనడం జరుగుతున్నది.

నొప్పులు

తలనొప్పిగా ఉంటే నల్లిని అడగడానికి వచ్చానని ఒక విటుణ్ణి గూర్చి అతని ప్రేయసి తనభర్తతో సాకు చెప్పడం ఒక జానపద గేయంలో వస్తుంది. నల్లిని చంపి వాసన చూస్తే తలనొప్పి పోతుందని ఒక నమ్మకం ఉంది. శొంఠి కణతలకు రాచినా తలనొప్పి పోతుంది. తల దిమ్ముగా వుంటే చితగ్గొట్టి కట్టాలి. వేడివల్ల తలనొప్పి వస్తే మల్లెపూలు, ఆముదపు ఆకులు తలకు కట్టాలి. శీతాకాలమైతే పారుడు మట్టిని ఉపయోగిస్తారు. గంధం తీసి ఫాలభాగానికి బాగా పట్టించుకోవాలి. వెల్లుల్లిని బాగా నలగగొట్టి నుదుట, కళ్ళకు రెండు వైపుల రుద్దాలి.

### చెవి నొప్పి

తులసిరసం చెవిలో పొయ్యాలి. వెల్లుల్లి నూనెలో కాచిపోసినా కూడా చెవినొప్పి తగ్గుతుంది. నజ్జా ఆకురసం పోస్తారు. నువ్వులనూనెలో ఒక లవంగం వేసి కాచి పోస్తే చెవిపోటు తక్కువవుతుంది నిమ్మరసాన్ని నీళ్ళలో కలిపి కొంచెం వెచ్చచేసి చెవిలో బొట్టు బొట్టుగా వేసినా చెవిపోటు తగ్గుతుంది.

### పళ్ళ నొప్పి

మిరియాలు, ఉప్పు మెత్తగా పొడిచేసి నొప్పిగా ఉండే పన్నుమీద కొంచెంసేపు ఉంచాలి. రెండు మూడు లవంగాలు మెత్తగా నూరి నిమ్మకాయ రసంతో కలిపి చిగురుకు, పన్నుకు తాపిస్తే నొప్పితగ్గుతుంది. నీళ్ళలో ఉప్పుకరిగించి ఆ నీళ్ళతో నోరు పుక్కిలించినా పళ్ళనొప్పి తగ్గుతుంది.

### గొంతునొప్పి

కొత్తసున్నం గొంతుకు పూయాలి. సున్నం, మునగాకురసం కలిపి గొంతుకు పూసినా నొప్పి తగ్గుతుంది. కఫం ఉంటే మిరియాలు పొడిగిన బెల్లం మింగితే పోతుంది. వెచ్చని నీళ్ళలో ఉప్పువేసి అది కరిగిన తర్వాత గొంతులో పోసుకొని మింగకుండా గుళగుళమని శబ్దం చేసి ఉమ్మివెయ్యాలి.

### కడుపు నొప్పి

వాము, ఉప్పు కలిపి తినాలి బొడ్డు దగ్గర నొప్పిగా ఉంటే జిల్లేడుపాలు వేసి పసుపు అద్దుతారు. నీళ్ళలో చక్కెర కలిపి కొంచెం వెచ్చజేసి తాగినా పొట్ట ఉబ్బరంతో కూడిన కడుపు నొప్పి పోతుంది.

### కళ్ళ నొప్పి

నందివర్ధనంపూలు, పొన్నగంటాకు కంటికి కట్టాలి. కలబంద, పచ్చకర్పూరం కలిపి పైన పెట్టుకోడం వల్ల కూడా పోతుంది.

## గాయాలు, పుండ్లు

చిన్న చిన్న గాయాలకు సున్నం పూయడమే పరమౌషధంగా భావిస్తారు జానపదులు ఆముదంలో రంగరించిన సున్నమైతే శ్రేష్ఠం. చిన్నచిన్న గుల్లలుంటే ఎర్రమట్టి పూస్తారు. గోడలకుండే ఎర్రమట్టి మీద కొంచెం నీళ్ళు చల్లి చేతితో ఎర్రమట్టితీసి దాన్ని గుల్ల మీద వేస్తే అది ఎండగానే గుల్ల పగిలి చీము బయటికి వచ్చేస్తుంది. శాంతరసాకు ఉప్పువేసి నూరి కట్టినా గాయాలు మానుతాయి గడ్డలు మొదలైన వాటికి పసుపు, గుడ్డ పేలిక, వేప ఇగుళ్ళు దంచి కడ్తారు. కుళ్ళి వాసన కొడ్తుండే పుండయినా వెల్లుల్లిని వెన్నలో బాగా వాది తేపిస్తే నయమవుతుందట. ఎండిన మామిడి ఆకుల్ని బూదిచేసి ఈ బూదిని గాయాలమీద వేస్తే నెత్తురు కారుతుంటే వెంటనే నిలిచి, గాయంకూడా త్వరగా మానుతుంది. కాలిన గాయాలకు మంచినూనె పూసినా, కొబ్బరినూనె పూసినా మంచిదే.మంచి తేనె పూసినా మంటతగ్గి గాయం త్వరగా మానుతుంది. దానిమ్మ ఆకులను నున్నగా నూరి కాలిన గాయానికి లేపించినా మంట తగ్గుతుంది. కాలిన గాయం వల్ల ఏర్పడిన మచ్చలు పోవాలంటే నేరేడు ఆకులను నున్నగా నూరి పూస్తూ వుండాలి.

## పాము, తేలు కాటుకు

పాముకరిస్తే ఆ భాగానికి పైన గట్టిగా గుడ్డనుగాని, దారాన్ని గాని బిగించాలి. రెండు మూడు చోట్ల కడితే మంచిది. కరిచిన చోట కోసి రక్తం బయటికి వచ్చేట్లు చెయ్యాలి. పాముకరవగానే గుడ్డకట్టి, అక్కడ గాయం చేయాలి. కోడిని పట్టుకొని దాని గుదద్వారం దగ్గర కొన్ని రెక్కలు పీకి అక్కడ గాయంచేసి దాన్ని గాయం దగ్గర పెట్టాలి. ఆ కోడి చనిపోతుంది. ఇట్లా రెండు మూడు కోళ్ళను చేస్తే విషమంతా పోతుంది.

తేలుకాటుకు ఎర్రగడ్డగాని, తెల్లగడ్డగాని నలగగొట్టి గాయమైన చోట కట్టాలి. తేలుకుట్టగానే ఎర్రగడ్డ, బెల్లం నమిలి తినాలి. ఎర్రగడ్డ రసాన్ని కుట్టిన చోట పూయాలి. తేలుకుట్టగానే కుట్టిన తేలునుగాని, మరో తేలునుగాని పట్టుకొని దాని కొండిని కాల్చాలి. కాల్చేటప్పుడు వచ్చే పొగను కుట్టినచోటికి పట్టాలి. కొండిని కాల్చి, వచ్చిన భస్మాన్ని కూడా అదే చోట పూయాలి.

తేనెటీగలు కరిస్తే మంచి తేనెపూస్తే మంటతగ్గుతుంది అంటారు. ఎర్రగడ్డను సగానికి కోసి దాన్ని తేనెటీగలు కరిచిన చోట రుద్దితే మంట తగ్గుతుంది.

పిచ్చికుక్క కరిస్తే చాలాప్రమాదం. కుక్కలాగే అరిచి అరిచి చచ్చి పోతారంటారు. రాబిస్ రాకుండా ఇంజక్షన్లు తీసుకోడం అవసరం. కాని జాన పదులకు ఇంజక్షన్లు ఎక్కడినుంచి వస్తాయి? వాళ్ళుచేసే వైద్యమిది. ఉత్త రేణి చెట్టును వేళ్ళతో సహా పీకి తెచ్చి రోట్లోవేసి బాగాదంచి రసం తీస్తారు. దాన్ని వడబోసి, రసానికి కొంచెం నీళ్ళుకలిపి ప్రతిదినం పొద్దున లోటా వంతున వారంరోజులు తాగాలి. పిచ్చికుక్క కరవగానే ఈ వైద్యం ప్రారం భించాలి. మనిషి కూడా పిచ్చి పిచ్చిగా ప్రవర్తించడం ప్రారంభించిన తర్వాత వైద్యం చేస్తే ఏమీ లాభంలేదు.

చర్మ వ్యాధులకు :

ముఖంలో మొటిమలుంటే ఎర్రమట్టిని వెచ్చజేసి వేస్తే పోతాయంటారు. దాల్చిన చెక్కను నిమ్మరసంలో చాది మొటిమలకు పూయాలి. కాలిమడమ పగిలిఉంటే నలగగొట్టిన ఎర్రగడ్డను కడితే ఫలం కనిపిస్తుంది. ముఖంలో అక్కడక్కడ పగుళ్ళు కనిపిస్తే పాలమీగడలో కొన్నిబొట్లు నిమ్మకాయరసం వేసి చర్మంమీద మృదువుగా అద్దాలి. కాలుగంట తర్వాత ముఖం చల్లని నీళ్ళతో కడగాలి. చర్మం బిరుసుగా ఉంటే పచ్చికొబ్బరి తురిమి బాగా పిండి పాలు తియ్యాలి. దానిలో గ్లిసరిన్ వేసి కలిపి పూసుకోవాలి. ప్రతిరోజు సున్నిపిండితో బాగారుద్ది నీళ్లుపోసుకుంటే చర్మంమీది మచ్చలు పోతాయి. బొప్పాయి పండు చెక్కులతో చర్మాన్ని రుద్దుతూ ఉన్నా మచ్చలుపోతాయి.

గజ్జి, దురద, దద్దులు మొదలైనవి చర్మరోగాలు. చర్మానికి సంబం ధించిన ఎలాంటి దురదలుగాని, గజ్జిగాని పోవడానికి గరికను, పసుపును గోమూత్రంలో చాది పూసుకోవాలి. అరగంటతర్వాత వేపాకులు వేసిమరిగించిన నీటితో స్నానంచెయ్యాలి. దురద, గజ్జి పోవాలంటే చింతాకుల్ని నున్నగానూరి పూసుకోవాలి. నిమ్మకాయరసంలో గంధకం పొడిని కలిపి పూసుకుంటే దురదలుపోతాయి. వాము, పసుపుపొడిని సమంగా తీసుకొని నీటిలోబాగా

కలిపి వేపించినా గుణంకనిపిస్తుంది. చర్మవ్యాధులేమున్నా తేనెపూస్తే తగ్గుతాయి. సముద్రస్నానంచేస్తూ ఉంటే కుళ్ళికంపుకొడుతున్న గాయాలు కూడా మానుతాయి,

జలుబు. దగ్గు, జ్వరం

మామూలుగా మనకు పట్టుకునేవి జలుబు-దగ్గు—జ్వరమే. ఎవైనామరీ తగ్గని దీర్ఘకాలిక వ్యాధులైతేతప్ప మామూలు జలుబులకు దగ్గులకు జానపదులు కషాయాలు. పూతలు, పథ్యాలతోనేపొద్దుపుచ్చుతారు. జలుబుకుకరక్కాయ తాడికాయ, ఉసిరిగ వరుగు కలిపి కషాయం చేసుకొని తాగుతారు, శొంఠి మిరియాలు, పిప్పళ్ళు, బెల్లంవేసి కషాయంచేసి తాగినా జలుబుకు గుణం కనిపిస్తుంది. ముక్కు దిబ్బడకు పసుపు నిప్పులమీదవేసి వాసన చూస్తారు. మిరియాలు కాల్చి వాసనచూడడం కూడా ఉంది. ముద్దకర్పూరంగాని గుడ్డలో ఉంచుకొని అప్పుడప్పుడు వాసనచూస్తూఉన్నా ముక్కుదిబ్బడ తగ్గుతుంది.

దగ్గు ఎన్నోకారణాలవల్ల రావచ్చు. మామూలు దగ్గుచిన్నచిన్న వైద్యాల వల్ల తగ్గుతుంది. తాళిసపత్రికషాయం దగ్గుకు మంచిది. మామూలుదగ్గుకు ఉప్పు. కరక్కాయ బుగ్గన పెట్టుకొన్నాచాలు, రసం మింగుతూ ఉంటే దగ్గు తగ్గుతుంది. పొడిదగ్గయితే పెద్దఎర్రగడ్డ ఒకటి తీసుకొని, కొంచెం బెల్లం చేర్చి, పొద్దున—మధ్యాహ్నం—రాత్రిపడుకునేటప్పుడు తినాలి. నెయ్యితో ఎర్రగడ్డను వేయించి తిన్నా మంచిది. కఫంతోకూడిన దగ్గయితే ఉప్పు,మిరియాలు, తెల్లగడ్డచేర్చి, దంచి కొంచెంసేపు నోటిలో ఉంచుకొని, గొంతువరకు తీసుకు వెళ్ళాలి.

జ్వరం ఎన్నివిధాలుగానైనా రావచ్చు. నిజానికి అసలు జ్వరానికి కారణమేమిటో తెలియకుండా ఏదో ఒక మందు తీసుకోకూడదు. అయినా అన్నిటికీ కషాయాలే ఇవ్వడం జానపదులకు తెలిసిన వైద్యం. 'లంఘనంపరమౌషధం' కాబట్టి ఉపవాసంకంటె మంచివైద్యంలేదు. జ్వరానికి ఉపవాసమే మంచిమందు జ్వరం చాలా ఎక్కువగా ఉంటే చల్లనీటిలో తడిపిన గుడ్డలను మడతవేసి నుదుటవెయ్యాలనేది జానపద వైద్యానికేకాక, ఇంగ్లీషు వైద్యానికి కూడా సమానమే. దీనివల్ల ఎక్కువగాఉండే జ్వరం తగ్గుముఖంపడుతుంది.

చలిజ్వరమయితే అడివి జీలకర్రను తీసుకొని బాగా పొడిచేసి, నెయ్యికలిపి నీటిలో మరగపెట్టాలి. సగానికిసగం నీళ్ళు ఇంకిపోయేవరకు మరిగించాలి. దానిలో అదేకొలత ఆవుపాలుచేర్చి తీసుకోవాలి. ఈ విధంగా దినానికి రెండు సార్లు తీసుకుంటూ ఉండాలి.

అజీర్ణం—వాంతులు—భేదులు

అజీర్ణం అనేక రకాల వ్యాధులకు మూలం. ఇదే వాంతులు భేదులు. జ్వరం, తలనొప్పి-ఇంకా ఎన్నో రోగాలకు కారణం కావచ్చు. నీళ్ళలో నిమ్మకాయ రసాన్నిచేర్చి తాగితే అజీర్ణంతగ్గుతుంది. శొంఠి, జీలకర్రబాగా పొడిచేసి, మరిగే నీళ్ళలో ఈ పొడివేసి ఐదునిముషాలు ఉంచి. వడబోసి తాగితే అజీర్ణంపోతుంది. శొంఠిబదులు అల్లాన్నికూడా వాడవచ్చు. ఎర్రగడ్డను గాని, తెల్లగడ్డనుగాని కాల్చితింటే అజీర్ణం పోతుంది. పొదిన ఆకుతో కషాయం చేసుకొని తాగినా అజీర్ణం తగ్గుతుంది. పొట్టఉబ్బరంకూడా తగ్గుతుంది.

భోజనం ఎక్కువై పొట్ట ఉబ్బరిస్తే వెచ్చని నీటిలో చక్కెర. నెయ్యి వేసుకొని తాగితే తగ్గుతుంది. ప్రతిదినం ఆహారంలో తెల్లగడ్డ (వెల్లుల్లి) వాడుకుంటే జీర్ణశక్తి ఎక్కువవుతుంది.

పసిపిల్లలు పాలుకక్కుతుంటే పాలలోకొంచెం లేతకొబ్బరినీళ్ళుకలిపి ఇవ్వాలి. వాంతులు ఎవరికైనా నిమ్మకాయరసం మంచిది. ఈ రసంలో చక్కెర కలుపుకోవచ్చు. లేదా జీలకర్ర, నాలుగయిదు ఏలకులుపొడిచేసి కలుప వచ్చు. నలిపిన ఎర్రగడ్డను వాసనచూస్తూ ఉంటే వాంతి తగ్గుతుంది. కొంచెం చింతపండు, జీలకర్రకలిపితింటే వాంతి వచ్చేటట్లుండడం తగ్గుతుంది.

వాంతులు భేదులు అవుతుంటే దోసకాయ తురిమి శుభ్రమైనవస్త్రంలో ఉంచి పిండి రసంతియ్యాలి. దానిలో కొంచెం నిమ్మరసంకలిపి దినానికి రెండుసార్లు తీసుకోవాలి. అజీర్ణంవల్ల విరేచనాలవుతుంటే జాజికాయ చూర్ణాన్ని అరటిపండుతోబాటు తినాలి. నీళ్ళభేదులకు మంచినేరేడు పళ్ళుతెచ్చి నీళ్ళలో పిండి దానిలోకొంచెం ఉప్పువేసి తాగితే తగ్గుతాయి· అతిసారం ఒక్కొక్క సారి ప్రాణాంతకం కావచ్చు. అతిసారానికి జానపద ఔషధాలు కోలెడన్ని

ఉన్నాయి. వీటిలో చాలామందులు చక్కగా పని చేస్తాయికూడా. లేతజామకాయ కషాయం చేసి మజ్జిగతోబాటు తీసుకోవాలి. ఏ కషాయమూ చేసే ఓపికలేకున్నా మెంతులు నోట్లోవేసుకుని మజ్జిగ తాగితే రక్తవిరేచనాలు, బంకవిరేచనాలుకూడా కట్టుకుంటాయి. దానిమ్మచెక్కతో కషాయం తయారుచేసి దానితోబాటు మెంతుల కషాయంతో కలిపి సేవించినా మంచిది. నిమ్మకాయరసాన్ని బాగా మాగిన అరటిపండు, తేనె కలిపి తింటే మంచిది.

## మరికొన్నివ్యాధులకు మంచిమందులు

జుట్టురాలిపోతుంటే దాసానిపువ్వులు కాగే కొబ్బరి చమురులో వేసినూనె తయారుచేసుకొని దాన్ని పూసుకోవాలి, నిమ్మకాయ, నువ్వులనూనె కలిపిపూసు కుంటే చుండ్రుపోతుంది. ప్రతిదినం నల్లవేప ఆకులను మూడునెలలవరకు తింటూఉంటే మధుమేహం నయమవుతుందంటారు. నేల ఉసిరిగ ఆకులను కాయలతో సహానలగగొట్టి, పసరుతీసి మజ్జిగలో తీసుకుంటే పచ్చకామెర్లు నయమవుతాయి లేతవేపాకుసూరి, కొంచెం పసుపు, జీలకర్ర, మిరియంవేసి ఉండలుగా చేసి మింగించడం ప్రతిపల్లెటూళ్లో, ప్రతిఇంట్లోఉన్నదే, దీనివల్ల కడుపులోఉండేకొన్నిరకాల పురుగులు వగైరా నాశనమవుతాయి. బొప్పాయి కాయ పైన తోలుతీసి, సన్నసన్న బద్దలుగాకోసి చక్కెరకలిపి తింటే కొన్ని రకాల పురుగులను సంహారం చెయ్యవచ్చు. మూలవ్యాధికి కూడా జానపద వైద్యమే శ్రేష్ఠమంటారు. అప్పుడేపిండిన ఆవుపాలు నురగతోసహా కొంచెం నిమ్మపండు పిండుకొని తాగితే మంచిది.

అమ్మవారు అనే పేరుతో పిలిచే అన్నిరకాల సాంక్రమికరోగాలకూ వేపఆకులను, ఇగుళ్ళను, పువ్వులను వైద్యంగా వాడడంలో జానపదుల అను భవం తెలుస్తున్నది. నేటికీ వేపచెట్టే చక్కని రోగనిరోధకశక్తిగల సాటిలేని ఔషధంగా పనికివస్తున్నది. మనం ఆహారపదార్థాలుగా తీసుకునేఆకులు, కూరలు బియ్యం, పప్పు, తిరగమాత సామానులు, పెరట్లో పెరిగే ఎన్నోరకాల మొక్కలు, అడుగడుక్కూ కనిపించే వేపచెట్టు, చింతచెట్టు, ఈతమాను, తాటిమాను, అడవులలో దట్టంగా పెరిగిఉండే పొదలు, లతలు, మూలికలు-ఇలా జానపద వైద్యం నిత్యాహారం నుంచి అడవిలో అన్వేషించాల్సిన మూలికల

వరకు విస్తరించి ఉంది. ఇవేవీ వాడకుండా ఊరక ఉపవాసమున్నా అదీ జానపదవైద్యంలో భాగమే అవుతుంది అయితే అన్నివ్యాధులు ఈ కూరగాయ వైద్యానికే నయమవుతాయా అంటే లేదని ఏ బుద్ధిమంతుడయినా చెప్తాడు అన్నిరోగాలు తమ వైద్యంతోగాని, మంత్రతంత్రాలతోగాని నయంకావని జానపదులకూ తెలుసు అందుకే ఒక్కొక్కసారి 'తూ తూ మంత్రాలు తుమ్మాకు మంత్రాలలో తగ్గుతాయా' అనికూడా జానపదులు చెప్తుంటారు. అయితే అన్వేషించి కనుగొనవలసింది వారివైద్యంలో కూడా ఎంతో ఉంది అన్నది మాత్రం సత్యం.

టిప్పణి

'Flok medicine reaches very far back in time. Nature, opened the first drugstore. Primitive man and the animals depended on preventive use of its stock of plants and herbs to avoid disease and to maintain health and vigor. Because man and the animals were constantly on the move, Nature's drugstore had branches every where. Wherever in the world you were sick, you would find in the fields' its medicines to cure you, 'its materials for curative herbal teas and Ointments" D. C. Jarvis, *Flok Medicine*, A Fawcelt Crest Book, 1958, p.9.

2. "Folk medicine is the substance of all the traditional view points on sickness and the healing methods applied against disease which exist among the people" Oswald A. Erich and Richard Beitle, As quoted in *Folklore Folklife*, 1972' p. 193-194.



# ఆటలు - వినోదాలు

మంత్రాలు - తంత్రాలు - యంత్రాలలో మునిగితేలేవారికి ఆటలు, వినోదాలు కొంత విడుపును ఇస్తాయి. 'సాంఘికాచారాలలో ఆటలేమిటి' అని అనుమానం రావచ్చు. ఒక విధంగా సాంఘికాచారాలలో లౌకికమైనవి ఆటలు, వినోదాలే. మిగిలినవన్నీ ప్రత్యక్షంగానో పరోక్షంగానో నమ్మకాలకు, మతాచారాలకు, మానవాతీత శక్తులకు సంబంధించినవే.

ఆటలు — వినోదాలు ఒక వైపు సాంఘికాచారాలకు మరొకవైపు జానపదకళలకు మధ్యలో ఉంటాయి. కోలాటం వంటి వినోదాలు కళాత్మకమైనవి కావడంవల్ల వాటిని కళల్లో చేర్చడమైంది. ఆటలన్నీ చాలావరకు వినోదంకోసం ఏర్పడ్డవే. అయితే వినోదాలన్నీ ఆటలు కావు.

ఆటలవల్ల జానపదులకు చాలా ప్రయోజనాలున్నాయి. తెలుగు జానపద విజ్ఞానానికి ఎనలేని సేవ చేసిన మహనీయులు శ్రీనేదునూరి గంగాధరంగారు 'ఆటల' ఆవశ్యకత'ను గూర్చి చెప్పిన మాటలు గమనార్హం (1965, పీఠిక).

1. కార్యభారం చేత కొంచెము అలసియుండే మనస్సులకు, శరీరానికి మంచి ఆటలు మనశ్శరీరాలకు ఉల్లాసము కల్గించి బలం నిస్తాయి.

2. ఎల్లప్పుడూ ఒకే పని చేయుటచేత కలిగే విసుగును పోగొట్టుతాయి.

3. బుద్ధివ్యాపారాలను చురుకుగా సాగిస్తాయి.

4. ప్రయోజనముల కనుగుణముగ, తత్సం పాదకములగు మార్గాల నమర్చుకొను నేర్పును పుట్టిస్తాయి.

5. లోకయాత్ర కత్యావసరములగు సమయాలను విచారించి, ఆ సమయాను కూలత నెరుగునటుల చేసి, అప్పుడు పని జరుపుటనే శక్తులను దృఢపరుస్తాయి.

6. కొందరికుండే మేకపోతు గాంభీర్యము పోయి, వాస్తవికములగు మన స్థితులను వెలిబుచ్చి, వారిలో పరస్పర సహాయము, భావైక్యము, ప్రయోజనైక్యము మొ॥ బుద్ధి చాతుర్యాలు కల్గిస్తాయి.

7. ప్రజలను సంఘీభావులుగా, సంఘటిత పరుస్తాయి.

8. జాతిపునరుద్ధారణమునకు హేతువును కల్పిస్తాయి.

9. స్వధర్మము, స్వభాష, స్వాభావము మొదలగునవి అనుష్ఠించుట వీనిలోని ఒకభాగం. అందుచేత నీతి నియమాలను పూనిస్తాయి.

10. మనోవాక్కాయ కర్మలను ఏకకాలమున ప్రవృత్తి కల్గిస్తాయి.

పైన పేర్కొన్నట్లుగా అనేక ప్రయోజనాలుండే ఆటలు మనిషిలోనే కాదు సకల ప్రాణుల్లో ఏదో ఒక రూపంలో ఉన్నాయి. జీవితంలో పోరాడుటే ఒక ఆట. ఆ పెద్ద ఆటను ఆడటానికి తెలిసో తెలియకో సహాయంగా తీసుకుంటూ ఉంటూ, పసితనంలో కేవలం వినోదం కోసం ఆడే ఆటలు కొన్ని. కొంచెం పెద్దయ్యాక వినోదాన్ని కళాత్మకంగా ప్రదర్శించాలనే ఉబలాటతో కోలాటలాడవచ్చు. అంతటితో తృప్తి కలగకపోతే తోలుబొమ్మలాటలు, బయలాటలు కూడా ఉన్నాయి. అన్నీ ఆటలే. అయినా ఒక్కొక్కదానికీ ఏదో కొంత భేదం ఉండనే ఉంది. 'వాడు తైతక్కలాడుతున్నాడు.' 'ఏవిట్రా ? ఆటగా వుందా ?' 'ఎన్ని ఆటలు ఆడుతావో నేనూ చూస్తాను,' 'ఇంతటితో నీ ఆట సరి.' 'వాడి జీవితం ఆటల పాటలతో సాగిపోయింది' - ఇలా మాటలతో ఎన్ని ఆటలైనా ఆడవచ్చు.

లేగదూడ తోక పైకెత్తి ఇటూ అటూ గెంతుతూ తల్లికి వినోదాన్ని సమకూరుస్తుంది. తోకను తమాషాగా ఆడిస్తూ తల్లి మీద పడుతూలేస్తూ ఆడుకుంటుంది కుక్కపిల్ల. ఇక మనుషుల ఆట పుట్టగానే ప్రారంభమవుతుంది. పుట్టిన పసిపాపతో తల్లి ఆడుకుంటుంది. నెలబాలుడయినప్పటినుంచి తనతో ఆడుకొమ్మని లాలిస్తుంది, పాలిస్తుంది. ఆట అన్నది అందరు మానవుల్లో ఉండే స్వభావాభివ్యక్తి ప్రక్రియ అని, అది అన్ని సంస్కృతుల్లో కనిపిస్తుందని రాబర్ట్ ఎ. జార్జెస్ (Robert A. Georges) నిర్వచించాడు (రిచర్డ్ ఎం. డార్సన్ 1972 : 173).[1] భాషను, కళను, మతాన్ని నిర్వచించడం

కష్టం. ఎందుకంటే అవన్నీ సంకీర్ణ స్వభావం కలవి, వివిధ విషయాల సమాహారంగా ఉండే ఆటను కూడా నిర్వచించడం కష్టమే.

ఆట అనుకరణవల్ల వచ్చేది. ఏదైనా ఆటపిల్ల ఇతరులు సంతోషపడడం చూచి నేర్చుకుంటారు పిల్లలు ఆట ఒక కల్పనా ప్రపంచంలో జరుగుతుందనే విషయం కూడా దాని లక్షణాలలో ఒకటి. ఆటలో మునిగిన వారు కాల దేశాలకు అతీతులు. ఆటముగిసేవరకు ఎంతసేపు ఆడుతున్నదీ, ఎక్కడ ఆడుతున్నదీ కూడా తెలియదు. ముఖ్యంగా పిల్లలకు ఇది వర్తిస్తుంది. ఆటలో ఏదో ఒకరకమైన పోటీ ఉంటుంది. కేవలం వినోదమైతే పోటీ ఉండదు. ఆటలు, వినోదాలు ఒక్కొక్క వయస్సులో ఒక్కొక్క విధంగా ఉంటాయి. చాలా చిన్నతనంలో పసిపిల్లలను నవ్వించడమే ఒక ఆట. 'ఏనుగొచ్చిందేనుగు-మావూరొచ్చిందేనుగు' అని పిల్లలకు చిన్నచిన్నగా వ్యాయామం చేయిస్తూ పాడడమూ ఒక ఆట బొమ్మలతో పిల్లలు ఆడుకునే ఆటలు మరొకరకం.

వయస్సు పెరిగేకొద్దీ ఆటల్లో కూడా సంకీర్ణత ఎక్కువవుతూ వస్తుంది. ఆడమగకలిసి ఆడేవి, ప్రత్యేకంగా ఆడేవి, పిల్లలు పెద్దలు కలిసి ఆడేవి - ఇవన్నీ ఒక్కొక్క విధంగా ఉంటాయి. అందువల్ల అన్ని రకాల ఆటలను కలిపి నిర్వచించడం కష్టమని విద్వాంసుల అభిప్రాయం. ఆట అన్నది మూలభూతంగా ఒక సాంఘికచర్య. ఆటలో కనీసం ఇద్దరైనాపాల్గొనాలి. పసిపాప బొమ్మలతో ఆడుకోటంగాని, తుంటరి పిల్లవాడు చెట్టుమీది చింతకాయలను రాళ్ళతో కొట్టడంగాని, వేటగాడు బాణాలతో ఎదైనాకొట్టూ గురినేర్చుకోడం గాని నిజానికి ఆటలు కావని, ఆటల మూలరూపాలు మాత్రమేనని విద్వాంసుల అభిప్రాయం.2 ఆట అన్నది ఒకవిధంగా నాటకీయత ఉండేది. నాటకమూ ఒక ఆట; ఆటా ఒకనాటకం. అందుకే బయలాటవంటి పదాలేర్పడ్డాయి.

ప్రతి ఆటకు కొన్ని నియమాలంటూ ఉంటాయి. ఇవి సామాన్య నియమాలుకావచ్చు. లేదా ఆటగాళ్ళు తమలోతాము సంప్రదించుకొని ఒప్పుకొన్న నియమాలు కావచ్చు. ఈ నియమాలు చాలా సరళమైనవీ కావచ్చు, క్లిష్టమైనవీ కావచ్చు. వేటగాడి పాలిటికి జింక తప్పించుకొని పోకూడదన్నదొక్కటే నియమం. జీవితంలోని సంఘటనలకు, ప్రకృతిలోని ప్రాణి ప్రపంచపు ఆట

లకు అనుకరణలుగా వెలసినా ఆటలు అప్పటమైన అనుకరణలు మాత్రంకావు. పెళ్ళిని అనుసరించేవారు పెళ్ళి మంత్రాలన్నీ చదవవలసిన అవసరం లేదు. పై విషయాలను చేర్చి ఆటలను నిర్వచించిన వారు జెరోమ్‌ఫ్రైడ్ (Jerome Fried) : "A game then may be defined as form of play in which two or more participants vie, either as individuals or as groups or teams, under limitations of rules either tacitly or explicitly understand by the cantestants, for the purpose of determining play; a game is a dramatic play contest" (Standard Dictionary of Folklore. P. 433).

తరతరాలుగా ఆటలు

నెమళ్ళు, పులులు. పిల్లులు, లేగదూడలు, మేకలు, కుక్కలు చేసే పనులు, ఆడే ఆటలు, ఎగురుళ్ళు, దుముకుళ్ళు ఇవన్నీ ప్రాచీన మానవునికి ఆటలు నేర్పాయి. ప్రకృతిలోనే అన్నిరకాల పాఠాలను నేర్చుకున్న ప్రాచీన మానవుడు ఆటను కూడా అనుకరణ వల్లే నేర్చుకున్నాడు. జీవికకోసం వేటను ప్రధానవృత్తి చేసుకున్నా ఆదిమవాసులు రానురాను దాన్ని ఒక క్రీడలాగే వినోదంగా ఆడేవారు. జీవనాధారానికి వేరువేరు వృత్తులు బలపడిన తర్వాత వేట, చేపలు పట్టడం మొదలైనవి కూడా క్రీడలే అయ్యాయి. పెద్ద ఎత్తున యుద్ధాలు జరిగేకాలం వచ్చేసరికి మల్లయుద్ధమూ ఒక క్రీడే అయింది. మెషిన్ గన్నులు. టాంకులు. అటంబాంబులు వచ్చేసరికి రైఫిలుషూటింగు కూడా ఒక క్రీడే.

ప్రకృతి పరిసరాలే ఆటల స్వరూపాన్ని నిర్ణయిస్తాయి. చెట్లు చేమలే బిళ్ళంగోడికి, ఇతర క్రీడలకు సాధనాలను సమకూరుస్తాయి. ఎస్కిమోలు చేపల ఎముకలతోనే బొమ్మలు చేసి ఆడుకొంటారు. చుట్టూ ఉండే మట్టి, ఆకులు, పువ్వులతోనే ఇళ్ళు కట్టుకొని, పెళ్ళిళ్ళు కూడా జరిపేస్తారు చిన్న పిల్లలు. వీన పుల్లలతోనే విల్లు బాణాలు చేసి ఆడుకోడం మనకు తెలిసిందే.

ఆటలో నరి - బేసి ఆట చాలా ప్రాచీనమైందని విద్వాంసుల అభిప్రాయం. పగడాలాటకు వాడుతుండిన సాధనాలు ఈజిప్టులో, రోములో గోరీల్లో

దొరికాయి. ఋగ్వేదంలో కూడా జూదానికి వాడుతుండిన సాధనాలను గురించి ఉంది. గోలిఆట అనేక శతమానాల నుంచి ఉంది. రోము చక్రవర్తి అగస్టస్‌గోలి ఆట ఆడేవాడట. అప్పుడు పళ్ళగింజల్ని వాడేవారు. తర్వాత రాళ్ళను ఉపయోగిస్తూ వచ్చారు. చైనాలో ఇనుపగుళ్ళను వాడేవారట ; గ్రీకు, ఈజిప్ట్, రోమ్ గోరీలలో బంతులు, బొంగరాలు, బొమ్మలు దొరికాయి. మొహంజొదారో, హరప్పాలలోని నాగరికత అవశేషాలలో పాచికలు కూడా ఉన్నాయి.

సంస్కృత సాహిత్యంలో అనేక క్రీడల ప్రసక్తి, వర్ణనలు కనిపిస్తాయి. భారతంలో వేట వర్ణనలు, ద్యూతం, మల్లయుద్ధం, గురిచూచి బాణం వదిలే పోటీలు, నీటిలో మునిగి ఊపిరి బిగబట్టే ఆటలవంటివి ఉల్లేఖితమయ్యాయి భాగవతంలో శ్రీకృష్ణుడు గోపబాలురతో ఆడిన ఆటలనేకం వర్ణింపబడ్డాయి. బంతిఆట, సూత్ర వికర్షణం, దాగుడుమూతలు మొదలైనవాటిని గురించిఉంది.

## తెలుగు సాహిత్యంలో ఆటలు

తెలుగు సాహిత్యంలో కవులు ఎన్నోరకాల ఆటలు ఆడారు. ఆటలను గురించి కూడా చెప్పారు. తిక్కన కాలంనుంచే తోలుబొమ్మ లాటలవంటి కళలుకూడా ఉండేవని తెలుస్తున్నది (విరాటపర్వం 3–164). బాలికలు చిలక బొమ్మలు, దంతపు బొమ్మలు, మేలిగాజు బన్నరులు, ప్రూని చొప్పికలు మొదలైన వాటితో ఆడేవారని 'బొమ్మరిండ్లు జేయనగు కూళ్ళను వండుచు బొమ్మపెండ్లి' అని నన్నెచోడుడు చెప్పాడు (కుమా. 3-36). కోళ్ళపందాల వంటి జానపద స్పర్ధలను మాత్రమేకాక చదరంగం, పాములాట, గాడీ, మాఢ్వీ, పైష్టీసురల సేవ మొదలైన అనేక వినోదాలు అభిలషితార్థ చింతామణిలో వర్ణితమయ్యాయి. ఆనాడు జనులెక్కి-తిరుగు చుండిన రంకులరాట్నం ఇప్పటికీ పిల్లలకు ఇష్టమైన వినోదమే.

చటిల సంపతి జీవఘట చక్రకర్మ
పటు పరివర్తన భ్రమణంబు గూర్చి
కీలువొందించి యాక్రియ రాటనముల
వాతియాడించు నా వడ్రంగి యతడు (బసవపురా. 102)

ఉప్పన పట్టెలాట గిల్లిదండ ఆట తెలుగునాట చాలా ప్రచారమైన ఆటలు, "ఉప్పన పట్టె లాడునెడ నుప్పలుదెత్తురు గాక యాదవుల్" (ఉ. హరివంశం) అన్నాడు నాచన సోమన. బిళ్ళంగోడి ఆటకూడా తెలుగునాట తరతరాలుగా జానపదులకు చాలా ఇష్టమైన ఆట. దీనికే గిల్లిదండ, దండుగలి, చిర్రాగోనె, చిల్లగోడె అని పిలుస్తారు. జేనెడు కట్టెపుల్లను, మూరెడు కట్టెతో కొట్టే ఈ ఆట నేటి క్రికెట్ వంటిది. బిళ్ళంగోడి వంటిదాన్నే 'ఘటికా ఖేలనం' అన్నాడు బుద్ధ ఘోషుడు. ఘటిక అంటే చిన్న కర్రపుల్లను పెద్దకర్రతో కొట్టడమని కూడా అర్థం చెప్పాడు. మహాభారతంలో కౌరవుల పిల్లల చిన్నగిల్లను కట్టెతో కొట్టి ఆడారు. అదీ ఇలాంటిదే అయివుండవచ్చు. బాలచంద్రుడు 'చిరుతలు తీరైనగోడెలతో' ఆడాడు మరాఠీలో చిల్లగోడె ఆట 'విటిదండు.' 1350 ప్రాంతంలో కరువురాగా మరాఠీవాళ్ళు దక్షిణానికి వచ్చారని, చిల్లగోడె ఆటను వాళ్ళదేశానికి తీసుకొని వెళ్ళారని సురవరం ప్రతాపరెడ్డిగారు అభిప్రాయపడ్డారు (ఆంధ్రుల సాంఘిక చరిత్ర : 84).

నాచన సోమన పాచికలాటను వర్ణించాడు. రుక్మిణి, కృష్ణుడు ఆడుతుంటే సత్యభామ సాక్షిపదం (అంపైర్) అలంకరించిందట.

జోగిణి గొనరి బైసుకవెట్టి పలకపై
　　సారెలు పోయించి సరముచూచి
తనకు లాగయిన నెత్తంబు గైకొని పన్ని
　　పాసికల్ దాళించి పాచెరింగి
లోహటంబులు మాసిలులిగన్న బడకున్న
　　పందాళమని పోవు పలకలిచ్చి
తప్పార్తుజూరెండు రాయంబులును గని
　　వారింపకము పోటుర్రాలు గలవు

పంతమడిగిన నీ పలె భాగమింత
ఛోర పెద్దదాయంబాడి పోదువుచ్చి
పైచునది ధనమునికి పోవచ్చు ననుచు
ఛేరుకొని పాటు తరిసకి జేసి యడిగె (ఉ. హరివంశం 3-120.)

అ_త్తివంచ తిగదుగయు
సత్తా దచ్చొక వంచి చౌవంచీరై
ది_త్తిగ యిద్దగ బద్రలు
చి_త్తంబున దలచినట్లు చేతికి దెచ్చున్ (3-121)

ఈ ఆటకు పచ్చీస్ అని, దోయాలు, బారాకట్ట అనీ పేర్లు. దీనిలో దుగ, తుగ, సత్తా, బద్ర మొదలైన పేర్లు వాడుకలో ఉన్నాయి. మహా భారత కాలంలో, వేదకాలంలో అక్షఖేలనం ఉండేది. మహాభారత కథంతా అక్ష ఖేలనం పైన నడిచిందే. ఇలాంటి ఆటల్లో సంఖ్యలకు మారుపేర్లు పెట్టడం నాటికీ నేటికీ ఉంది. ప్రాచీనకాలంలో పాచికలపైన ఉండే చుక్క ఒకటైతే కలి, రెండు ద్వాపర, మూడు త్రేత, నాలుగు కృతయుగాలని లెక్క. ఇలాంటి ఆటలు భారతదేశంలోనే కాక ఆసియా, యూరపు ఖండాలలోని బహు దేశా లలో చాలా ప్రాచీన కాలంలోనే ఆడినట్లు దాఖలాలున్నాయి. ఈజిప్టులో శవాలతో బాటు పాచికలను కూడా పూడ్చేవారట. బహుశా పరలోకంలో కూడా ఆడాలని వారి ఉద్దేశం కాబోలు! క్రీ. పూ. 1200 ప్రాంతంలో ట్రాయ్‌యుద్ధం పదేళ్ళు సాగగా పొద్దుపోక కోసం గ్రీకు సైనికులు పాచికలాడుతుండేవారట. పాచిక లాటను గూర్చి కళాపూర్ణోదయం (3-131)లో కూడా ఉంది. ధూర్జటి మొద లైన కవులు బాలురక్రీడలు, వినోదాలు ఎన్నిటొన్నో పేర్కొన్నారు.

చిట్ల పొట్లాకాయ సిరిసింగణావత్తి
గుడుగుడు గుంచాలు కుందెన గుడి
డాగిలి ముచ్చులాటలు గచ్చకాయలు
వెన్నెలకుప్పలు తన్నుబిళ్ళ
తూరన తుంకాలు గీరన గింజలు
పిల్ల దీపాలంకి బిల్లగోడు
చిడుగుడువ్వల పోటి చెండు గట్టినబోది
యల్లి యుప్పన బట్టె లప్పళాలు

చిక్కనా బిల్లలోటిల్లు చిందఱాది
యైన శైశవ క్రీడా విహార సరణి
చెంచు కొమరుల తోడ నుద్దించుకాడు
చిన్నడభినవ బాల్య సంపన్నుడగుచు
(శ్రీకాళహస్తి మాహాత్మ్యము 3—33)

బాలికల క్రీడలను దశావతార చరిత్రలో ధరణి దేవుల రామయమంత్రి ఇలా పట్టీ చేశాడు (నేదునూరి గంగాధరం 165 : 1961)

అచ్చనగండ్లు దోయాలును డాగిలి
మూతలు నాలుగు మూలలాట
గుజిగజి రేకులు గుజ్జన గూళ్లను
బొమ్మల పెండ్లిండ్లు [illegible]మ్మనములు
వత్తిగోడలి యాట నాలుమగని యాట
తాటి చెట్లాడ కోలాటములును
పింపిళ్లు జెండు గోరింపులు వామన
గుంతలు వెన్నెలకుప్పలాది

మఱియు బుడికిళ్లు మొదలుగా మనస్సువచ్చు
నాటలన్నియుదోడి తొయ్యలుల గూడి
పడుచుదనమున వేడుక పడుచునాడు
ముద్దరాంద్రకు నల్లారు ముద్దుగాను.

పిల్లల ఆటల్లో బోలెడన్ని రకాలున్నాయి. వయసు కోడెకాండ్రు పికిలి పిట్ట[illegible] పోట్లాటలాడేవారు బొటన వ్రేళ్ళపైన పికిలిపిట్టలను తీసుకొని పోవడం వారికి పరిపాటి. బాలచంద్రుడాడిన అనేక క్రీడలను పల్నాటి వీరచరిత్రలో పేర్కొనడం జరిగింది. 'గుమ్మడికాయలు కొంతసేపాడి', 'చెరకుల పందెంబు చెల్వొప్ప గెలిచి' 'పోకలాటల చేత బుచ్చుము ప్రొద్దు', 'ఆడుడి ముత్యంబులమరు బంతులును' 'గుంతమాపల నాడికొని గెల్చికొనుచు

'కుటిల జంతులదెచ్చి గుడిలోన నుంచి'. 'విడిపించి పోరాడువిధమును జాడు రూకల కుప్పలు రూఢిగనాడు' బొంగరాలాట పిల్లల ఆటల్లో ముఖ్యమైంది. బాలచంద్రుడాడిన బొంగరాలాట వివరంగా ఉంది. పల్నాటి వీర చరిత్రలో బాగా వర్ణింపబడిన ఆటలలో కోడిపందెం ఒకటి. పల్నాటియుద్ధానికి కోడిపోరే ముఖ్యకారణం, నాయకురాలి కోళ్ళు బ్రహ్మనాయుని కోళ్ళను గెలవటం, పందెంలో ఓడిన బ్రహ్మనాయుడు రాజ్యం వదలి ఏడేళ్ళు పరదేశంలో వుండటం, తర్వాత పల్నాటియుద్ధం జరగటం ప్రసిద్ధం. కోళ్ళుకాళ్ళతో తన్ను కొని యుద్ధంచేసేవి కాబట్టి చరణాయుధాలని అమరుడు రాశాడు. కోడికాళ్ళకు పూర్వం జానెడు కత్తులు కట్టి యుద్ధం చేయించేవారు. తెలుగువాళ్ళు కోడి పందానికి శాస్త్రమే రాసి పెట్టారు. దండి దశమకుమార చరిత్రలో కూడా కోడి పందాల ప్రసక్తి ఉంది. కేతన తెలుగు వారి సంప్రదాయం విశిష్టతను తెలప టానికేమో బాగా విస్తరించి రాశాడు. క్రీడాభిరామంలో కోళ్ళయుద్ధాన్ని కవి చాలా విపులంగా, హాస్యజనకంగా, మనోరంజకంగా వర్ణించాడు.

ఆట క్రూరంగా మారినప్పుడు జూదమవుతుంది. జూదంవల్ల సర్వ స్వాన్ని పోగోట్టుకున్న వాళ్ళున్నారు. కాకతీయుల కాలంలో కూడా ఒంటిపైన దుప్పట్లు సైతం అమ్మకొని జూదమాడేవారు. 'పచ్చడం బమ్ముకొన్నాడు పణములకును' (క్రీడాభిరామం) 'స్త్రీలు కూడా కొందరు జూదమాడేవారు, అయితే కేవలం సరసత 'మెయినాడే'వారని భోజరాజీయంలో చెప్పబడింది.

సరిలేని యంజి సొగటా
లరుదగు జూదంబు నెత్తమచ్చన గండ్లున్
దిరమగు నోపన గుంటలు
సరసత మెయినాడుచున్న సతులం గనియెన్

(5–76)

జూదాల్లో అనేక రకాలున్నాయి. కాకతీయులకాలంలో ఇది సర్వ సామాన్యం. తర్వాతి కాలంలోనేమి, నేటికీ ఇది సంసారుల పాలిటి శాపం. సింహాసన ద్వాత్రింశికలో జూదాన్ని గురించిన వర్ణన ఉంది. ''దృష్టి యేమ రక నందయు జాగరంబును దిగయును, గాళనా తేటబడిన అచ్చులలోపలనే

యచ్చన గైకొని మాటలాడిన యట్ల వేటుగలుగ తల ప్రగతి వచ్చుకోరిన దాయ మనగ........ ...... ....."

పల్లెల్లో లక్కముష్టి నక్కముష్టి ఉంది. ఒకడు గవ్వలో, చింతగింజలో పట్టుకొని వస్తాడు. నాలుగు గింజలు ఒక ఉడ్డ. పిడికిలి పట్టినవాడికి ఒకదిక్కు వదిలితక్కిన మూడుదిక్కుల్లో ఎందరైనా,తమ కిష్టంవచ్చినన్ని రూకలు, పైసలు ఉంచుతారు. పిడికిలిపట్టిన వాళ్ళు ఉడ్డలప్రకారం ఎంచితే, నాలుగు మిగిలితే దాన్ని మష్ట అంటారు. మూడు మిగిలితే తిగ అంటారు. రెండు మిగిలితే దుగ అంటారు. ఒకటి మిగిలితే నక్క. నక్కనుంచి మష్టవరకు నాలుగు సంకేతాలుండబట్టి నక్క మష్ట. అదే నక్కముష్టి అయింది. ముష్టి పట్టినవాడి సంఖ్య మిగిల్తే వాడు తక్కిన మూడిళ్ళవాళ్ళ పైకమంతా తీసుకుంటాడు. లేకుంటే తనకే యింట్లో సంఖ్య వస్తుందో ఆ సంఖ్యలో ఎంత పైకం వుంటుందో అంత ఇచ్చి, తక్కిన సంఖ్యలవాళ్ళ మొత్తాలను వదలివేస్తారు, పై పద్యంలో కూడా కాళ అంటే నాలుగై వుంటుంది. తిగ అంటే మూడు, నంది అంటే ఒకటి. జోగరమంటే రెండు (సురవరం ప్రతాపరెడ్డి, రెండవ ముద్రణ, పు. 186).

ఈనాటికీ జానపదుల్లో బాగా ప్రచారంలో ఉంటే ఆటల్లో పులిజూదం ఒకటి. సింహాసన ద్వాత్రింశికలోని పద్యం ఆనాటికే ఇది ఉండేదని తెలుపుతున్నది (భాగం 2.పు.85) 'తగులు విరివియైన కడుమెచ్చుగ నాడుదు, పులుల మూట. జూదంబులలో మిగులగ నేర్పరి బాగిడి తిగుటన్ సొగటాల నేనతి ప్రౌఢుండన్'

పై పద్యంలో పేర్కొనట్లుగా మూడు జూదాలున్నాయని, ఆ మూడు రకాలను సురవరం ప్రతాపరెడ్డిగారు ఆంధ్రుల సాంఘిక చరిత్రలో ఇచ్చారు (పు. 188-192).

వర్గీకరణ

నేదునూరి గంగాధరం గారి ప్రకారం నేటికి ఆంధ్రావని అంతటా ఉండే ఆటలు సుమారు వంద (1965 : 10). కొన్ని ఆటలను వేరు వేరు

పేళ్లతో ఆడతారు. తెలుగుదేశం నాలుగు చెరగులు తిరిగి అదే ఆటల విధా నాలను చూచి వ్రాసుకున్న అనుభవజ్ఞులు శ్రీ గంగాధరం. వారు ఆటలను విభజించిన తీరు ఈ విధంగా ఉంది :

1. ఇంట ఆడునవి—ఆరుబయట ఆడునవి
2. స్త్రీలు ఆడునవి—పురుషులు ఆడునవి
3. బాలికలు ఆడునవి—బాలురు ఆడునవి
4. ఎవరైనను సరే ఆడునవి
5. శాస్త్రానుభవం కలవి -చతురంగాదులు
6. నిషిద్ధాలు-జూదము, పేకాటాదులు·

కొందరు ఆటలను స్థూలంగా ఇంట్లో ఆడేవి. బయులులో ఆడేవని రెండే రెండు విభాగాలు చేస్తారు. మరికొందరు చాతుర్యంతో ఆడేవి (games of skill) అని, అదృష్టంతో ఆడేవి (games of luck) అని రెండుభాగాలు చెయ్యవచ్చంటారు. చాతుర్యంతో ఆడే వాటిలో చదరంగం వంటివి ఉన్నాయి. అదృష్టంతో ఆడే ఆటలలో జూదం మొదటిది. కొన్నిట్లో అదృష్టమూ, చాతుర్యమూ రెండూ పనిచేస్తాయి. ఇంకోరకం వర్గీకరణ ప్రకారం ఆటల్లో 1. వినోద ప్రధానమైనఆటలు 2. శారీరక కౌశలం చూపించాల్సిన ఆటలు, 3. పోటీల ఆటలు, 4. ఊహా ప్రధానమైన ఆటలు అన్న నాలుగురకాలున్నాయి.

ఆటలను విభజించడం చాలా కష్టమని, ఎందుకంటే ఆటలుచాలాసంకీర్ణ స్వభావం కలవని స్మిత్ అభిప్రాయం. ఆర్· ఎస్. బాగ్స్ తన వర్గీకరణలో (Dictionary of Folklore, P. 1142) ఆటను 'C' group కింద ఇచ్చాడు. ఆదేగుంపులో కథాగేయం, గేయం, నృత్యం, సంగీతం, పద్యం కూడా ఉన్నాయి. (game, Pastime, sport అనే మూడు c 500 అనే వర్గం కిందికి వస్తాయి.) బాగ్స్ వర్గీకరణలో ఈ క్రింది ఉపవిభాగా లున్నాయి,

c 520 శారీరక చలనానికి సంబంధించినవి

c 522 వ్యాయామంతో కూడినవి. అన్నిఅంగాలు కదిలేట్లు చేసేవి, కొన్ని అంగాలకు మాత్రం సంబంధించినవి.

C523 పాట, నృత్యం, నడక

C524 పరుగుపంద్యం, తరుముకోడం, పోరాటం,
గుర్రాలు, కుక్కలు, మనుషులు పరుగెత్తడం
కోడి, ఆంబోతు, మనుషులు పోరాడటం

C526 నాటకీయమైన ఆటలు

C530 మానసిక ప్రాధాన్యం కలవి

C532 బుద్ధి చాతుర్యం

C534 స్మృతి

C536 పరిజ్ఞానం

C538 ఊహ

C560 ప్రత్యేకమైన వస్తువు లేక సాధనం

పేకలు, బంతులు, గోలీలు, దారాలు, గాలిపటాలు, చిన్నకత్తులు, పిన్నులు మొదలగునవి.

C580 నీరు మంచు గడ్డ మంచు పడపనడపటం,
నీళ్ళలోఆడేఆటలు, మంచుగడ్డమీద ఆడే ఆటలు మొదలైనవి.

## ఆంధ్రుల ఆటలుకొన్ని

ఈత: ఏ ఆటాలేకున్నా, ఏ ఆటారాకున్నా ఈత పల్లెటూరి పిల్లలకు అత్యావశ్యకమైంది. కుక్క ఈత, బాలఈత, నిలుపుఈత వంటి ప్రభేదాలు కూడా ఉన్నాయి. దీనివల్ల దేహానికి మంచి వ్యాయామం లభిస్తుంది. వీటివల్ల జరిగే ప్రమాదాల నుంచి తప్పించుకోవచ్చు.

ఒప్పులకుప్ప : బాలికలకు చాలా ఇష్టమైన ఆట–పాటలతో కూడిందిది. ఒప్పులకుప్పా వయ్యారిభామా అనే పాట విననివారుండరు. ఇద్దరు బాలికలు ఎదురెదురుగా నిల్చుని ఎడమచేతులు కుడిచేతులు పట్టుకొని గిరగిరాతిరుగుతూ పాడాలి.

కాళ్ళగజ్జె : దీనికి ప్రసిద్ధమైన పాట పాడడం అవసరం. కాళ్ళాగజ్జీ కంకాళమ్మ....అనేపాటలో గజ్జికి వైద్యముంది. ఇది అసలు కాళ్ళాగజ్జె. ఏకాలంలో గజ్జికి గజ్జెకు ముడిపెట్టారో తెలియదు. పాటపాడుతున్నప్పుడు ఒక్కొక్కమాటకు ఒక్కొక్కకాలు చేతితో తట్టితాకుతూపోవాలి. చివర పడ్డ కాలు పండినట్లు లెక్క.

కోతి కొమ్మచ్చి

ఇది అనుకరణ వచ్చినదయి వుండాలి. చెట్టుకోతి కొమ్మచ్చికి పది మంది ఉండాలి. ఆటలో ఒక వెదురు కర్రే కోతి అవుతుంది. ఆటగాళ్ళలో ఒకరు దొంగ. విసరివేసిన కర్రను తేవడానికి దొంగ పరుగెత్తి వచ్చేలోపల అందరూ చెట్టెక్కుతారు. 'వేడివేడి కోతి' అనే కూతను వదలకుండా కర్రతో ఎవరిని తాకితే వాళ్ళు దొంగ అవుతారు. మళ్ళీ కర్ర విసరివేయడం మామూలే.

గాలిపటం

పిల్లలు ఆడే ఆటల్లో జనప్రియమైన వాటిలో ఒకటి. ఇటీవల కొన్ని చోట్ల ప్రాణాంతకంగా కూడా పరిణమించింది. ఏమీలేని జానపదులు కాయితం, దారం ఉంటే చాలు ఏదోరకమైన గాలిపటాన్ని తయారుచేస్తారు. పటానికి దారంకట్టి, రెండవ చివర చేతిలో ఉంచుకొని పటం గాలిలోకి పంపిస్తారు.

గుడుగుడు గుంచం

పాటపేరుతో ప్రసిద్ధమైన ఆట. బాలికలు కూర్చుని రెండు చేతులూ పిడికళ్ళుపట్టి ఒకరి పిడికిలి మీద మరొకరి పిడికిలినుంచాలి. ఆట పెద్ద ఒక రుంటారు. వాళ్ళ పైనున్న పిడికిలిలోకి పైపక్కనుంచి తన చూపుడువేలు నుంచి ఆడిస్తూ పాటపాడాలి.

'గుడుగుడు గుంచం గుండారాగం పాములపట్టం పడగారాగం'— అనే పాట ఆంధ్రదేశమంతటా ప్రసిద్ధం. ఆ తర్వాత ప్రశ్నలు జవాబులు చాలా

సాగుతాయి. ఆటపెద్ద చక్కిలిగింతలు పెట్టడంతో గుడుగుడుగుంచం పూర్తి అవుతుంది.

గోలీలు

పసిపిల్లలు ప్రలోభానికి లోనై చెడిపోడానికి ఆస్కారం ఇచ్చే ఆటలో గోలీలాట ప్రథమ శ్రేణిని ఆక్రమిస్తుంది. గోలీలాటలో దేకిడీలని, దెబ్బకు కాయ అని అనేకరకాలున్నాయి. దెబ్బకుకాయ ఒకరకమైన పందెం. ఒకడు ఉజ్జీలుపెడితే మరొకడు ఆ కాయను కొడ్తాడు. ఉజ్జీలుపెట్టిన వాడు గోలీని గుంటలో వేస్తాడు. చేతనయితే రెండవగుంటలో కూడా పడేయడానికి ప్రయత్నిస్తాడు. ఇంతలోపల మొదటివాడు గోలీకాయను కొట్టగలిగితే, రెండవవాడు ఓడినట్లు. పందెంగా ఓడి ఒకకాయను ఇస్తాడు. దీనవల్ల గురి బాగా కుదురుతుంది గాని, ఒకవిధంగా వ్యసనంగా మారే ప్రమాదం ఉంది.

చిప్ప చిప్పగోళ్ళు

ఇదీ బాలికల ఆటలలో ఒకటి. ఇద్దరు బాలికలు ఎదురెదురుగా నిలిచి చేతులు ముందరికి, వేళ్ళుముందరికి సగంవరకు కొక్కెంలాగా వంచి ఒకరి పిడికిలితో ఒకరి పిడికిలిని లంకెలాగా తగిలించి 'చిప్ప చిప్పగోళ్ళు - సింగ రాజుగోళ్ళు మాతాతగోళ్ళు - మందపరాళ్ళు' అంటూ కొంతసేపు ఎడమకు, కొంతసేపు కుడికి గిరగిర తిరుగుతూ ఆడాలి.

చెమ్మచెక్క

ఒకరికొకరు ఎదురుగా ఇద్దరు బాలికలు నిలబడి, ఒకరి అరచేతులు ఇంకొకరి అరచేతులతో తడ్తూ ఆడాలి. చేతులు తీసేసుకోడం, మళ్ళీ తట్టడం, మళ్ళీ తీసేసుకోడం, మళ్ళీ తట్టడం — ఈ విధంగా చెయ్యాలి.

చెమ్మచెక్క చేరడేసి మొగ్గ
అట్లు పోయంగా ఆరగించంగా
ముత్యాల చెమ్మచెక్క ముగ్గులెయ్యంగ
రత్నాల చెమ్మచెక్క రంగులెయ్యంగ........

అనేపాట ఈ ఆటతోబాటు వినిపిస్తుంది.

తొక్కుడు బిళ్ళ

సాయంకాలం చిన్నచిన్న పట్టణాల్లో కూడా వీధివీధిన తొక్కుడుబిళ్ళ ఆడుతుంటారు. నేలమీద ఎనిమిది గళ్ళుండే చదరాన్ని గీస్తారు. కుండ పెంకును గాని, అట్లాంటి మరోరాయిగాని తీసుకొని మొదటి గడిరేఖ మీద నిలబడి, తను అనుకున్న గడిలోకి విసిరేస్తుంది సరిగ్గా పడకపోతే ఆ బాలిక ఆటనుంచి తప్పుకోవాలి. రెండోబాలిక ఈ విధంగా చేయడానికి ప్రయత్నించాలి. ఎవరైనా సరిగ్గా బిళ్ళను వేయడంలో కృతకృత్యులైతే, దాన్ని ఒంటి కాలితో నెట్టూవెళ్ళాలి. మధ్యలో కాలు నేలమీద మోపడం, బిళ్ళ వెలుపలికి వచ్చేయడంగాని అయితే ఓడినట్లు లెక్క. చివరి వరకు సరిగ్గా తీసుకొనివస్తే, మళ్ళీ బిళ్ళను కాలివేళ్ళ మీద పెట్టుకొని మళ్ళీగెంతుతూ వెళ్ళాలి. అరచేతిలో బిళ్ళ ఉంచుకొని ఆకాశంవైపు చూస్తూ గెంతడం, నెత్తిమీద బిళ్ళ ఉంచుకొని గెంతడం కూడా చేస్తారు.

దాగుడు మూతలు

పిల్లలగుంపులో ఒకరు 'పెద్ద'గా ఉంటారు. పిల్లలలో ఒకరుదొంగగా నిర్ణయిస్తారు. పెద్దదొంగ కళ్ళు మూయగా మిగిలిన బాలికలందరూ వెళ్ళి దాక్కుంటారు. వాళ్ళలో ఒకరు రావచ్చు అనగానే దొంగ దాగిఉన్న వారిని కనుక్కోడానికి ప్రయత్నిస్తుంది. ఈ లోగా దాగిఉన్నవారు తల్లిని (పెద్దను) తాకాలి. అంతలోపల దాక్కున్న వారిని తాకితే వాళ్ళు దొంగలవుతారు. అలా సాధ్యం కాకపోతే మొదటిదొంగే మళ్ళీదొంగ అవుతుంది. దీన్ని చిన్నచిన్న మగపిల్లలు కూడా ఆడుతారు. అయితే ఎక్కువగా ఆడపిల్లలు ఆడే ఆటఇది. 'దాగుడుమూతలు దండాకోర్' వంటి పాటలూ పాడుతారు.

దూదుంబుల్ల

ఇదికూడా బాలికలు ఆడేఆట. ఇసుకను పోగుచేసి, చిన్నపుల్లను ఆ ఇసుకలో ఎక్కడైనా దాచెయ్యాలి. ఇసుకను కోలగాచేసి, కర్రలాగా తయారు చేసి పుల్లను దాచాలి. రెండవబాలిక పుల్లఎక్కడ ఉన్నది అని భావిస్తే అక్కడ చేతుల వేళ్ళను పెట్టి బిగించాలి. నడింవేలిని ఇసుకలోకి పోనిచ్చి పుల్లకోసం వెదకాలి. దొరక్కపోతే ఓడినట్లు లెక్క. ఇట్లే కొన్నిసార్లు ఓడినపిల్ల దోసిలి

నిండా ఇసుకపోసి పుల్లను అందులో గుచ్చి, కళ్ళుమూసి తీసుకుపోయి ఒక చోట ఇసుకను, పుల్లను వేయించి మళ్ళీ మొదటిచోటుకే పిలుచుకొని వచ్చి కళ్ళువిప్పి పుల్లను తీసుకురమ్మనాలి.

## పులి జూదం

వీధిలో ఎక్కడ చోటు దొరికినా బొగ్గుతో బొమ్మగీసుకొని ఆడుతుంటారు. మొత్తంమీద పులిని మేకలతో కట్టివేయడం దీనిలో ముఖ్యం. పులికి పెద్ద గులకరాళ్ళు, మేకలకు చిన్న గులకరాళ్ళు వాడుతారు. పులి జరగకుండా కట్టివేస్తే ఆట ముగుస్తుంది. ఒకరకం ఆటలో మూడుమేకలు, ఒకపులి ఉంటాయి. మరోరకం ఆటలో నాలుగుపులులు, పదహారు మేకలు ఉంటాయి.

## పులి — మేక

ఎక్కువమంది పిల్లలు ఆడే ఆటల్లో ఇది ఒకటి. కొందరు పిల్లలు గుండ్రంగా నిల్చుని ఒకరి ముంజేతిని మరొకరు పట్టుకొని మధ్యలో మేక అని పేరుపెట్టి ఒకరినుంచుతారు. బయట ఒకరినుంచి పులిఅని పేరుపెడ్తారు. గుండ్రంగా నిలుచుకున్న పిల్లలు పులిని లోనికి వెళ్ళనీయరు. పిల్లల చేతుల కిందినుంచి గాని, చేతులుసడలించిన వారి చేతులు విడిపించుకొని గాని పులి లోపలికి వచ్చి మేకను పట్టేసుకుంటే, మళ్ళీ మరొకరు పులిగా, మేకగా తయారవుతారు.

## వామన గుంటలు

విరామ సమయాల్లో ఆడుకునేందుకు స్త్రీలకు మంచి ఆట ఇది. ఆంధ్ర కర్నాటకాలలో రకరకాల వామనగుంటలు కొయ్యతో చేసి ఇంట్లో పెట్టుకుంటారు. చేప ఆకారంలో రెండువరసల్లో ఏడేడు గుంటలుంటాయి. ఒక్కొక్కగుంటలో అయిదేసి చింతగింజలు వేయాలి. ఏదో ఒకగుంటలోని గింజలు తీసుకొని పక్కగుంటనుంచి ఒకొక్కదానిలో ఒక్కొక్క గింజ చొప్పున వేసుకుంటూ పోవాలి. ఆరవగుంటలోని కాయలెత్తుకొని మళ్ళీ అల్లే వేసుకుంటూ పోవాచ. ఇలాచేస్తూ ఉంటే మధ్యలో గుంట ఖాళీపస్తే, దాన్ని చేత్తో తట్టి తరువాతి గుంటలో కాయలు తీసుకురావాలి. దీన్ని లిబ్బి అంటారు.

అంటే ఐశ్వర్యం అన్నమాట. ఒకవేళ ఆరెండు గుంటలు ఖాళీవస్తే ఆటన రెండవవారు ఆడాలి.

## సరిబేసులు

ఇది చాలా ప్రాచీనమైన ఆట అని విద్వాంసుల అభిప్రాయం. గవ్వలు, చింతగింజలు మొదలైనవి ఒడిలో పోసుకోవాలి. ఒక బాలిక తన ఒడిలోనుంచి కొన్ని గింజలు తీసి రెండు చేతులతో గిలకరించి కుడి చేతి లోకి వచ్చినన్ని కాయలుతీసి, ఆకాయలు కనబడకుండా మూసి సరా, బేసా అని రెండవ బాలికను అడగాలి, ఆమె సరిగ్గా చెప్తే ఆ కాయలు ఇచ్చివేయాలి. చెప్పలేకపోతే ఆ చేతిలోని కాయలన్ని రెండవ బాలికవద్ద పుచ్చుకోవాలి. ఇలా ఇద్దరిలో ఎవరో ఒకరు గెల్చేవరకు ఆడవచ్చు.

## స్తంభాలాట

ఇప్పుడు బాగా ప్రచారంలో ఉండే మ్యూజికల్ చేర్ వంటిదే ఈ ఆట. ఎందరు బాలికలుంటే అంతకంటే ఒక స్తంభం తక్కువగా స్తంభాలను ఎంచు కోవాలి. ఆటలో పెద్దగా చేసినవారు 'స్తంభాల నెవరు ముట్టుకుంటారోచ్' అంటారు. అనగానే బాలికలందరూ పరుగెత్తి వెళ్ళి దొరికిన స్తంభాన్ని పట్టు కోవాలి. ఒక స్తంభం తక్కువుంది కాబట్టి ఒకరికి స్తంభం దొరకదు. ఆ బాలికకు గొల్లభామ అనిపేరు. ఆమె 'చల్లోయమ్మా చల్లో' అని అమ్ముకుంటు మధ్యలో ఎక్కడ ఖాళీదొరికితే అక్కడ స్తంభాన్ని వాటేసుకుంటుంది. మళ్ళీ ఇంకొకరు గొల్లభామ అవుతారు.

## పరిశీలన–పరిశోధన

ఆటలనుగురించిన పరిశీలన ప్రాచీనకాలంనుంచే కనిపిస్తుంది. తెలుగు వారి, తెలుగుదనపు విజ్ఞాన సర్వస్వాలని పాల్కురికి సోమనాథుని రచనలను గురించి చెప్తే కొందరికి నచ్చక పోవచ్చు. కాని జానపద విజ్ఞానంలోని ఎన్నో విషయాలను పాల్కురికి సోమనలాగా చెప్పినవారు అరుదు. అసలు మన నిజ మైన సంస్కృతి జానపద విజ్ఞానంలోనే ఉంది అంటే మన పండితులకు అర్థంకాదు. ఏది ఏమైనా ఆటలు కూడా మన సంస్కృతిలో భాగమన్నది మనం

మరచిపోరాదు. ప్రాచీన కవుల్లో కొందరైనా ఆటలను సూక్ష్మంగా పరిశీలించినారన్నది కొంతలోకొంత తృప్తినిస్తుంది. బసవపురాణం, పండితారాధ్య చరిత్ర, ఉత్తర హరివంశం, క్రీడాభిరామం. భోజరాజీయం, హంస వింశతి, సింహాసన ద్వాత్రింశిక మొదలైన గ్రంథాల్లో తెలుగు ఆటలు పెక్కు పేర్కొనబడ్డాయి. ఆధునికుల్లో తెలుగు ఆటలనుగూర్చి ప్రత్యేకంగా పుస్తకమే వ్రాసి జానపదుల పాలిటి వరంలాగా ఉత్తమ గ్రంథాన్ని అర్పించిన వారు శ్రీ నేదునూరి గంగాధరం. వారి "ఆటలు, పాటలు" (1965) 88 రకాల ఆటలను గురించి తెలుపుతున్నది. ఇలాంటి ఆధార గ్రంథాన్ని వ్రాసిన శ్రీ గంగాధరం అభినందనీయులు. తెలుగు సాహిత్యంలోని ఆటలు-వినోదాలను గూర్చి పిహెచ్.డి. కోసం నాగార్జున విశ్వవిద్యాలయంలో పరిశోధించినవారు శ్రీ వి. సుబ్రహ్మణ్యం. ఆటలను పేర్కొనడం, ఆటలను వర్ణించడం చేసి ఆసక్తిని రేకెత్తించిన పండితుల్లో శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ (మాలపల్లి), శ్రీ సురవరం ప్రతాపరెడ్డి (ఆంధ్రుల సాంఘిక చరిత్ర), శ్రీ బులుసు రామ జోగరావు, శ్రీ తిమ్మావజ్ఝల కోదండ రామయ్య మొదలైన వారున్నారు.

ఇంగ్లీషులో ఆటలను ఎన్నోరకాలుగా విశ్లేషించడం జరిగింది. మనో వైజ్ఞానికంగా ఆటలను పరిశీలించిన వారు కూడా ఉన్నారు. సందర్భాన్ని దృష్టిలో పెట్టుకొని ఏ ఆటను, ఎప్పుడు, ఎందుకు, ఎవరు ఆడతారు, దానివల్ల ప్రయోజనం ఏమిటి అనే విషయాన్ని సాందర్భిక దృక్పథం (contextual schod) తో పరిశీలించిన వారున్నారు. జీవితంలోని వివిధ సంఘటనలను ఆటలు ఎంతవరకు ప్రతిబింబిస్తాయి, జీవితానికి ఆటలకుఏమిటి సంబంధం అని కూడా పరిశీలించడం మంచిది. ఆటల్లో జీవితంలోని అనేక విషయాలను సూచ్యంగా చెప్పడం జరుగుతుంది. యుద్ధం, పెళ్ళి, చతురంగ బలాలు-వాటి వాటి సామర్థ్యం. జీవితంలో ఎదుర్కొనే సమస్యలు, అదృష్ట దురదృష్టాలు మొదలైన వాటిని సాంకేతికంగా చెప్పే ఆటల్లో తరచి చూడగా మహార్థం భాసిస్తుంది. తెలుగు ఆటల్లో పాడే పాటల్లో వైద్యరహస్యాలు ఇమిడి ఉండడం కూడా ఒక విశేషమే. 'కాళ్ళాగజ్జీ' 'చెమ్మాచెక్క' మొదలయినవి ఇందుకు ఉదాహరణలు. దేహానికిచక్కని వ్యాయామాన్ని ఇవ్వడమేకాక మనసుకు ఆహ్లాదాన్ని, బుద్ధికి కసరత్తును కూడా ఇస్తూ ఆటలు మానవుని జీవితంలో ఒక దశలో అనివార్యమై ఉన్నాయి. ఆటలంటే ఏ మాత్రం ఆసక్తి చూపని బాల

బాలిక లెవరైనా ఉన్నారంటే వారు మానసికంగా సరితేరనే అర్థం. ఆటలు ఆడ వద్దని కఠిన నియమాన్ని విధించి పిల్లలను ఖైదుచేస్తే మనం వారికి హాని చేస్తున్నామనే అర్థం.

టిప్పణి

1. "Play is a form of expressive behavior common among all human beings and manifested overtly in all cultures", Robert A. Georges, *Folklore and Folklife,* (Ed. Richard M. Dorson), p. 173.

2. "We cannot then define game only as pastime or sport or amusement, for the dividing line between game and serious pursuit must be sharper if it is to be discussed with any degree of case or profit. To begin with, a game must be social activity; more than one must play. A baby fingering its toes; a child, all alone, mothering its doll; a boy toring pebbles at a tree; a huntsman practicing with bow and arrow by shooting at a stick are all engaged in activities which form the basis for games but which of themselves are not games" (Dictionary of Folklore, p. 432).

3. Brian Sulton – Smith, *The games of New Zealand children* (Berkelay and Los Angeles, 1959), p.9.



# వస్తు సంస్కృతి

జానపద వస్తు సంస్కృతే వాస్తవ సంస్కృతి. శిష్ట సంస్కృతికంటె ఎక్కువగా జానపద సంస్కృతి జన జీవనాన్ని ప్రతిబింబిస్తుంది. వస్తు సంస్కృతినే భౌతిక వస్తు సామగ్రిగా పేర్కొనవచ్చు. జానపద విజ్ఞానంలో మొదటివిభాగం మౌఖికం. శాబ్దిక కళారూపాలైన గీతాదులు సంస్కృతిని ప్రసారంచేసే ఉత్తమ సాధనాలుగా భాష పుట్టిన కాలంనుంచి ఉన్నాయి. రెండవ ప్రధానవిభాగమైన సాంఘికాచారాలు సంఘసంబంధమైన మానసిక చిత్తస్థితికి సంబంధించినవి. మూడవదైన ఈ విభాగం కంటికి కనిపించే వస్తువులతో కూడింది. సాంఘికాచారాలలో వస్తువులుండాల్సిన అవసరం లేదు. జానపదవిజ్ఞానంలోని మొదటి విభాగమైన మౌఖిక జానపదవిజ్ఞానంలోను వస్తువు లుండాల్సిన అవసరంలేదు. ఇలా స్థూలంగా జానపద విజ్ఞానంలో రెండు విభాగాలుంటాయనవచ్చు. అవి : 1. కంటికి కనిపించేవి. 2. కంటికి కనిపించనివి. వస్తు సంస్కృతి కొన్ని విధానాల ననుసరించి, పనితనం చూపించి జానపములు తయారుచేసేది. ఈ విధానాలు, పనితనం తరతరాలుగా ఒక తరంనుంచి మరొక తరానికి సంక్రమిస్తున్నవి. సంప్రదాయబద్ధమైన సమాజాలలో స్త్రీ పురుషులు ఏ విధంగా ఇళ్ళు కట్టుకుంటారు, దుస్తులు తయారుచేస్తారు. ఆహారం తయారు చేసుకుంటారు, వివిధ వృత్తులకు కావలసిన పరికరాలేమిటి. అలంకరించుకోడానికి ఉపయోగించే ఆభరణా లేమిటి అన్న విషయాలన్నీ వస్తు సంస్కృతి కింద వస్తాయి.[1]

వస్తుసంస్కృతిలో ప్రధానంగా చెప్పవలసినవి రిచర్డ్ డార్సన్ పుస్తకం (ఫోక్‌లోర్ అండ్ ఫోక్‌లైఫ్) ప్రకారం 1. చేతిపనులు 2. చిత్రకళ 3. వాస్తు 4. ఉడుపులు 5. వంట. ఇంగ్లీషులోని జానపద విజ్ఞానకోశంలో, ఆర్. ఎస్. బాగ్స్ తన వర్గీకరణలో M గ్రూప్ కింద చిత్రకళ, చేతిపనులు, వాస్తుపులను, N గ్రూప్ కింద ఆహారపానీయాలను ఇచ్చాడు. జానపద వస్తు

సంస్కృతిలో ప్రతి వస్తువునూ వివరించాలంటే అది ఒక పెద్ద జానపద వస్తు ప్రదర్శనశాల అవుతుంది. ముఖ్యంగా ఈ కింది వాటిని గురించి చెప్పవచ్చు.

1. ఆహార పద్ధతులు — పాత్రలు, వంటలు, పిండివంటలు మొ॥వి.
2. దుస్తులు—ఆభరణాలు—వస్త్రధారణ, అలంకరణవిధానాలు మొ॥వి.
3. చిత్రలేఖనం - శిల్పం - బొమ్మలు - గృహనిర్మాణం మొ॥వి.
4. ఇతర వస్తువులు, నాణెములు, వృత్తి పరికరాలు మొ॥వి.

# ఆహారపానీయాలు

ఆహారమనగానే ఏదో ఒక వస్తువు కావల్సిందే. గాలిని భోంచేయడానికి యోగులు ప్రయత్నిస్తారటగాని, జానపదులుమాత్రం అలాంటి ప్రయత్నాలు చెయ్యరు. కష్టించి పనిచేసి ఆహారాన్ని సంపాదించుకోడమే వారికి తెలిసింది. 'శ్రమైక జీవన సౌందర్యానికి' విలువనిచ్చే జానపదుల వంటలు — పిండి వంటలు కూడా పరిశీలనకు యోగ్యమైనవి. ప్రాదేశిక భేదాలతో సాంప్రదాయికంగా వస్తున్న గృహసంబంధమైన వంటవిధానమే జానపదుల వంట అని డాన్ యాడర్ నిర్వచనం [2] జానపదుల ఆహారం పద్ధతుల్లో ఆహారపదార్థాలు, వాటి స్వరూపం, తయారుచేసే పద్ధతులు, నిలువచేసే విధానం, సామాజికంగా వాటికుండే విలువ, జానపదుల జీవనంలో వాటిపాత్ర, ఆహారానికి వాడే పాత్రలు వగైరా అన్నిటినీ పరిశీలించవచ్చు.

ఆహారపద్ధతులను గురించిన పరిశీలన మనం సంస్కృతికి సంబంధించిన అనేక విషయాలను తెలుసుకునేట్లు చేస్తుంది. ఆంధ్రుల ఆవకాయ, గోంగూర వల్ల వారి అభిరుచులు, అలవాట్లు. కారంపట్ల తెలుగువారి మక్కువ, మామిడి, గోంగూర, మిరపకాయల పంట సమృద్ధి, బియ్యం ముఖ్య ఆహార పదార్థంకావడం వల్ల వారి వ్యవసాయ పద్ధతులు, ఆహారస్వరూపం మొదలైనవన్నీ తెలుస్తాయి. నేల స్వభావం, నదులు మొదలైన ప్రకృతి వనరుల ఉనికి, వర్షపాతం, సముద్రతీరం మొదలైనవి కూడా ఆహార పద్ధతుల్ని నిర్ణయిస్తాయి. కృష్ణ, గోదావరి, పినాకిని ఆంధ్రులకు వరప్రసా

దంగా ఉండబట్టే ధాన్యలక్ష్మితో ఆంధ్రదేశం కళకళలాడుతున్నది. నేలస్వభావాన్ని బట్టి, నీటివనరులను బట్టి తీరప్రాంతానికి, రాయలసీమకు, తెలంగాణకు ఆహారపు అలవాట్లలో, అభిరుచులలో భేదం కనిపిస్తుంది.

మనిషి జంతువులకు సన్నిహితంగా, జంతువుల స్వభావానికి దగ్గరగా బ్రతికిన కాలమూ ఒకటి ఉండేది. ఆ రోజుల్లో ఏదో దొరికింది తినడమూ, ప్రకృతి పరిసరాలకు తగ్గట్లుగా ఆహారాన్ని సంపాదించుకోడమూ, వంశాన్ని కొనసాగించడమే ప్రధానంగా ఉండేవి. ఆహార సంపాదన, సంతానోత్పత్తి ప్రాచీన మానవునికి ముఖ్యంగా ఉండేవి. కాలం గడిచేకొద్దీ ఆహారవిధానాలలో మార్పు వచ్చింది. రుచులు అభిరుచులు మారుతూ వచ్చాయి. వేట కేవలం ఆహారం కోసం ఉండేది తర్వాత వినోదంగా మారింది. ఒకచోట స్థిరనివాసం ఏర్పరచుకొని వ్యవసాయంతో ఆహార ఉత్పాదన చేసే పద్ధతి వచ్చింది. మృగాలవేట తర్వాత చేపలవేట, దానితో కాయలు – దుంపలు సేకరణ, ఆ తర్వాత ధాన్యం పండించడం, పశుపోషణ వగైరాలన్నీ ఆహారం తయారు చేసుకునే పద్ధతులయ్యాయి. పాడి – పంట ఐశ్వర్యానికి చిహ్నాలయ్యాయి.

ప్రాచీన ఆహార విధానాలు అవసరం కొద్దీ పుట్టినవేకాని వినోదంకోసం కాదు. ఆకలికి నకనకలాడే పొట్టే ఏదో ఒక ఆహారాన్ని అన్వేషించడానికి మనిషికి ప్రేరణనిస్తుంది. ఆహార సంపాదన దైహిక ప్రేరణ. ఆకలి మానవుని ప్రాథమిక ప్రవృత్తి. మానవుని ఆహార విధానాలు ప్రకృతి పరిసరాలమీద, సంస్కృతిమీద, జనసంఖ్య మీద ఆధారపడి ఉంటాయి. ప్రకృతి పరిసరాలే పూర్తిగా ఆహారపు అలవాట్లను నిర్ణయిస్తాయని కూడా చెప్పలేం. అందుకే సంస్కృతిని, జనసంఖ్యను కూడా చేర్చాలి. తీరప్రదేశాలలో నివసించేవారు నిజానికి చేపలనే ముఖ్య ఆహారంగా చేపట్టి ఉండవలసింది. కాని నెల్లూరు నుంచి విశాఖవరకు వందల మైళ్ళ తీరం ఉన్నా ఆంధ్రులు తినవలసినన్ని చేపలు తినరు. దీనికి సంస్కృతి కారణమై ఉండవచ్చు. మాంసాహారం సమృద్ధిగా లభిస్తున్నా, శాకాహారాన్నే ప్రధానంగా ఎంచుకునేది కూడా సంస్కృతి ప్రభావం వల్లనే.

భోజన పదార్థాలను మన పూర్వులు భక్ష్య భోజ్య చోష్యలేహ్యాదులంటూ కొన్ని వర్గాలుగా విభజించారు. స్థూలంగా చూస్తే ఘనపదార్థం,

N 246 జంతు సంబంధాలు
(గుడ్డు, పాలకు సంబంధించినవి - వెన్న, పాలకోవా మొ॥వి)
N 247 తీపి వస్తువులు
(కేకులు, లడ్డు, జిలేబి మొ॥వి)
N 248 సువాసన ద్రవ్యాలు
(తిరగమాతలు, వేర్లు, పచ్చ కర్పూరం, కుంకుడుపువ్వు మొ॥వి)
N 400 పానీయం
N 420 పాత్రలు
(లోటా, కప్పు, గాజుపాత్ర, పింగాణీపాత్ర, రాగి, వెండిచెంబులు, వృక్ష సంబంధమైన పాత్రలు మొ॥వి)
N 440 పానీయంరకం - దాన తయారింపు
N 442 నీరు
N 443 మద్యేతరములు - పళ్ళరసాలు మొ॥వి
(ద్రాక్షరసం, నిమ్మరసం, కాఫీ మొ॥వి)
N 444 మద్యేతర ధాన్యసంబధ పానీయాలు
N 446 ఆకులు, బెరడు, వేర్లతో చేసినవి
(తేయాకు, సుగంధపాలు, రోజ్‌మిల్క్ మొ॥వి)
N 447 మద్యాలు
(కల్లు, సారాయి, ఇతర మద్యాలు)
N 448 జంతు సంబంధాలు
(పాలు మొ॥వి)
N 800 ఆహారపానీయాల సేవన
నమలడం, తినడం, మింగడం, చప్పరించడం, వాసన పీల్చడం, ఇంజక్షన్‌గా తీసుకోడం మొ॥వి.

భారతదేశంలో ప్రాచీన కాలంనుంచి అనేకులు ఆహార పద్ధతులను పరిశీలించి, వర్గీకరించి వివిధాహారాలను గురించి విశ్లేషణ జరిపి ఉన్నారు. 'వాతాంబు పర్ణాశనాః' అని ప్రతీతి ఉండడం చేత ప్రాచీనకాలంనుంచి వాయు

సేవనం కూడా ఆహారాలలో ఒకటి అని మనవారు నమ్మినట్లుంది. ఆహారంలో ముఖ్యంగా ఘనద్రవ్యాలని, ద్రవద్రవ్యాలని, పక్వములని, అపక్వములని మనవారు విభజిస్తూ వచ్చారు. ఘనద్రవ్యాలలోనే కొన్ని పక్వాలు, మరికొన్ని అపక్వాలు, అట్లే ద్రవద్రవ్యాలలో కూడా రెండున్నాయి. ఈ క్రిందిది ఒక విధమైన ఆహార పానీయాల విభజన (సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము సం. 2 పు 58-59);

ధాన్యములు: శూకధాన్యములు, శింబీధాన్యములని రెండు విధములు.

శూకధాన్యములలో: రక్తశాలి, మహాశాలి, కమలం, షష్టకము. వ్రీహి గోధూమ–యవజాతులు మొదలగునవి కలవు.

శింబీ ధాన్యములలో: ముద్గ, అధకి, మసూర, కులుత్థ, నిష్పావాది జాతులు కలవు.

శాకములలో: పత్రశాకములు, పుష్పశాకములు, ఫలశాకములు, నాళ శాకములు, కందశాకములని విభాగములు కలవు.

ఫలములు; ద్రాక్ష, ఖర్జూరము, దాడిమి, ఆమ్రము, జంబీరము మొ॥వి

మాంసములు: మృగములు, విష్కిరములు, ప్రతుదములు, ప్రసహి హములు, బిలేశయములు, మహామృగములు, అప్చరములు, ఔదకములు (మత్స్యములు) అని యెనిమిది విధములుగా వర్ణింపబడినవి.

క్షీరములు: గో, మహిష, అజ, అవి, ఉష్ట్రి, అశ్వ, ఖర, మానుషీ జాతులను భేదములచే అష్టవిధములు. ఇందు దధి-తక్ర-నవనీత-అజ్యాదిద్రవ్య ములను గూర్చి గూడ వర్ణింపబడినది.

జలములు: కూప, సారస, తాటాక, చౌండ్య, ప్రాస్రవణ, నాదే-యాంతరిక్షాది విభేదములచే అష్టవిధములుగ వర్ణింప బడినవి.

స్నేహద్రవ్యములు: ఘృతములు, తైలములు.

సంధానములు: ఆసవ, అరిష్ట, మద్య, సౌవీరాదులు.

## ఆంధ్రుల ఆహారపానీయాల చరిత్ర

ఆంధ్రులలో వేటాడి ఆహారాన్ని సంపాదించుకొనే వారి నుంచి, కాలి మీద కాలేసుకొని కూర్చొని తినేవారివరకు అన్నిరకాలవారున్నారు. ఎలుకల నుంచి పులులవరకు వేటాడే వారున్నారు. చుంచెలుకల్నితినే చెంచులు, తేనె కాయలుపళ్ళుతినిజీవించే గిరిజనులు ఉన్నారు. నన్నయకు పూర్వంనుంచీ కూడా వ్యవసాయం చేసే కృషికులున్నారు

చెంచులు మొదలైన ఆదివాసుల ఆహారపు అలవాట్లను గురించి కొన్ని కావ్యాలలో ఉల్లేఖనాలు కనిపిస్తాయి. శ్రీకాళహస్తి మాహాత్మ్యంలో చెంచులను గూర్చి చెప్పబడింది. వీరు అడవిలో పళ్ళను, గడ్డలను, తేనెను, చారపప్పు మొదలైన వాటిని తినేవారు. స్త్రీలు ఎరుపు వెంట్రుకల మీద నెమలి పింఛాలు పెట్టి అలంకరించు కొనేవారు. బాణాలతో అడవిజంతువుల్నివేటాడి మాంసం తినేవారు. నేరేడు, నెలయూటి, కొండ మామిడి, దొండ, పాల, నెమ్మి, బరివంక, చిటిముటి, కలివె, తొడి వెంద, తుమికి, జాన, గంగరేను, వెలగ, మోవి, బలుసు, బీర, కొమ్మి, గొంజ, మేడి మొదలైన పళ్ళను తినేవారు (కాళ మాహా. 3 ఆశ్వా.)

యానాదులు, గోండులు, సంతాలులు, భిలుల్లు మొదలైన అనేక ఆదివాసులకు ఎలుకలు మంచి రుచికరమైన ఆహారం. ఈనాటికీ యానాదులకు ఎలుకల కలుగులు తవ్వి ఎలుకల్ని పట్టడం వేటకించే లెక్క. చెంచులు, అడివి యానాదులు విల్లంబులు భుజాన తగిలించుకొని అడివిలో వేటాడదమూ కద్దు. అడివిపందులు, పిల్లలేళ్ళు, ఎలుగు బంట్లుకూడా వారికి ఆహారమే. కుందేళ్ళు, నెమళ్ళు, ఉడుములు, ఉడతలు, కొంగలు, పాములు, కోతులు కూడా కొందరు ఆదివాసులకు ప్రీతికరమైన ఆహారాలు. బొద్దాకు, అటిక మామిడాకు, పొన్నగంటాకు, పాలపరికాకు, తోటకూర, పెరుగుకూర, తుమ్మాకు మొదలైన ఆకుకూరలు కూడా ఆదివాసుల కిష్టమైనవి. పళ్ళలో నేరేడు పళ్లు, కలేపళ్లు, అడవి దొండపళ్ళు, నాగజెముడు పళ్ళు, ఈటిపళ్లు మొదలైనవి ఇష్టపడితింటుంటారు.

మానవ జీవితం చాలావరకు ఆకులలములు తినడంలోనే గడిచిపోయింది. వ్యవసాయం బహుశా పదివేల సంవత్సరాలనుంచి ప్రారంభమై ఉండవచ్చు. మొదట పోడు వ్యవసాయమే ఉండేది. యానాదుల వంటి ఆదివాసులకు వ్యవసాయం విషయం తెలియదు. నగరాలలోఉండే ఈ ఆదివాసులుకూడా అక్కడా ఇక్కడా పాచిపని. కూలిపని చేసి ఎవరైనా ఇచ్చింది అంతతిని, గంజి నీళ్ళు తాగి కాలం వెళ్ళ బుచ్చుతారు చేపలు పట్టడం చేస్తారు కాని ఆంధ్రదేశంలోని ఈ ఆదివాసులకు పెద్దపెద్ద వలలు వేసే నేర్పులేదు. ఎండాకాలంలో ఎండిపోయే గుంటలు. కాలువలు, చెరువులు చూచుకొని. చిన్నచిన్న చెలమలకు అడ్డకట్టకట్టి కుండలతో, కుండపెంకులతో, దోసిళ్ళతో నీటిని వెలుపలికి చల్లుతారు. మిగిలిన బురదలో వట్టి చేతులు పెట్టి చేపలను పట్టి నడుముకు వేలాడే తాటాకు సంచులలో వేసుకుంటారు.

రాపూరు అడవుల్లో పుట్టి పెరిగి అడివి జీవితం అంతు కనుక్కొన్న రాచగిరి భైరవయ్య చెప్పిన వన్య పదార్థాలను వెన్నెలకంటి రాఘవయ్యగారు పేర్కొన్నారు (యానాది ; 70)

''ఆకులు : బొద్ది ఆకు, కలిశ, బీర. గడ్డనెల్లి. దేవదారు తాబేటి, పొన్నగంటి. నెల్లి, గొట్టిగడ్డల, సన్నపాయ, గున్నంగి, పొడపత్ర, ఘూటాకు. నీరుగబ్బ.

గడ్డదినుసులు : గొట్టి గడ్డలు, గిట్టి. గోరుచుట్లు, ఇంజేడి. కొండ బోరాయ, కొండఎల్ల- పూరి ఎల్ల. అడవి పెండలం. భూచక్రగడ్డ. పెన్నేరు. పెద్దీత. చిట్టీత. కొండ ఈత, మొగశిది, కన్నెకోమల, అల్లి.

విత్తనాలు : చారపప్పు, పొగడ, గొట్టి, తంబ, పొన్నగాని, అల్లి, బీర ఊటి.

ఫలాలు : పొగడ పండ్లు, గుత్తి, బీర, కలే, కొండ ఈత, మోవి, అల్లి, దేవదారు. తుమ్మిక, వానకలే, చార''

ఆదివాసుల విషయం ఇట్లుంటే ఇతర జానపదుల ఆహారపు అలవాట్లను అభిరుచులను తెలుసుకోవాలంటే తెలుగు శాసనాలు కావ్యాలు కొంతవరకు ఉపయోగిస్తాయి.

## శాసనాల్లో ఆహారం-కావ్యాల్లో వంటలు

నన్నయకు పూర్వం, నన్నయకు తరువాత వెలసిన అనేక శాసనాల్లో కూడా ఆంధ్రుల ఆహారానికి ఉపయోగించే వృక్షజాతులు పేర్కొనబడ్డాయి. వరి ఈనాడు మనకు ప్రధాన ఆహారం. క్రీ. పూ. 2000 సంవత్సరాలనాడే మన దేశంలో వరిపంట ఉండేదంటారు. కాని ఇది మనదేశంలో జన్మించింది కాదు. ఇది బహుశా ఆగ్నేయాసియానుంచి వచ్చి ఉండవచ్చు. అయినా తెలుగు దేశంలోనూ సుమారు రెండువేల సంవత్సరాలుగా వరి పండిస్తున్నారని ఊహించవచ్చు, దక్షిణ భారతదేశంలో బాగా పరిచితమైన చెట్లలో టెంకాయ చెట్టు ఒకటి. వేదకాలంలో ఇది ఆర్యులకు తెలిసిన వృక్షంకాదు. దాక్షిణాత్యుల పాలిటికిది కల్పవృక్షం. లేతకొబ్బరినీళ్ళు ఆరోగ్యానికి ఎన్నోవిధాల మంచిది. టెంకాయ అన్నివిధాలా దేవుడికి మొదట సమర్పించుకోవలసిన పవిత్రవస్తువయింది. తాటిచెట్టు కూడా దక్షిణ భారతీయులకు చాలా ప్రాచీనకాలంనుంచి బాగా పరిచయమైనదే. ఇదీ కల్పవృక్షమే. అయితే ధార్మిక వ్యవహారాలలో తాటికాయకు ప్రాధాన్యం రాలేదు.

ఆహారంగా ఉపయోగించే వస్తువులలో పైవి ముఖ్యమైనవి. కొన్ని భోగ్య వస్తువులుగా పేరుపొందాయి. తాంబూలం అలాంటి వాటిలో ఒకటి. గుప్తులకాలంనాటి శాసనంలో (5వ శతాబ్ది) మొదట తాంబూలాన్ని గురించి ఉంది (బి.జి.ఎల్. స్వామి 1975,22) దక్షిణ భారతదేశంలో ఎనిమిదవ శతాబ్దినుంచే వక్కలు, తమలపాకులు తోటల్లో చాలాచోట్ల పెంచేవారని శాసనాలనుబట్టి తెలుస్తున్నది. శ్రీకాళహస్తిలోని కన్నప్పపేరున పోకతోటను పెంచడానికి భూమిని అమ్మిన విషయం 11వ శతాబ్దికి చెందిన ఒక శాసనం ద్వారా తెలుస్తున్నది.

నైవేద్యంకోసం ఏమేమి పదార్థాలను వాడేవారన్నది శాసనాలలో చాలా చోట్ల కనిపిస్తుంది. విజయనగర రాజులకాలంనాటి శాసనాల్లో అయితే ఆహార పదార్థాల పెద్దపెద్ద పట్టికలు శాసనాల్లో దొరుకుతాయి. వైద్యంగా ఉపయోగించే చెట్లపేర్లు కూడా శాసనాల్లో పేర్కొనబడ్డాయి,

ఆహారపదార్థలుకాని, మరేవికాని సంతలో అమ్మేవారు. ఈనాటికీ ఈ పద్ధతి చాలాచోట్ల ఉంది. నాగరికం ముదిరిన పట్టణాలలో కూడా మునపటి

సంప్రదాయాలను సూచిస్తూ సంతపేటలు నామమాత్రంగానైనా నిలచి ఉన్నాయి. కాకతీయుల కాలంలో ఓరుగంటి కోటకు బయట మైలసంత జరిగేది. అక్కడ సుంకాలు నిర్ణయంచేసిన శాసనంవుండేది. ఇప్పటికీ ఆ శాసనం వుంది. అప్పుడు సంత జరుగుతుండిన ప్రదేశాన్ని ఇప్పుడు ఖాన్ సాహెబ్ తోట అంటారు. ఆ శాసనాన్నిబట్టి ఆకులు, కూరగాయలు, పెంకాయలు, మాదీ ఫలాలు, మామిడిపళ్ళు, చింతపండు, నువ్వులు, గోధుమలు, పెసలు, వడ్లు. జొన్నలు, నూనె, నెయ్యి. ఉప్పు, బెల్లం, ఆవాలు, మిరియాలు. తగరం, సీసం, రాగి, చందనం, కస్తూరి, మంజిష్ఠ, దంతం, పట్టు, పసుపు, ఉల్లి, అల్లం అమ్మేవారని తెలుస్తున్నది. పెద్దపెద్ద గ్రామాలలో వారానికొకసారి సంతలు జరిగేవని, కొన్ని సంతల్లో ప్రత్యేక వస్తువుల్ని అమ్మేవారని కొన్ని కావ్యాలవల్ల తెలుస్తున్నది.

> "మూడెడు ప్రాలకు నూనె సంతలో
> గొన జుఱదెంచి బియ్యమునకున్ సరితైలము
> పోయుమన్న నాతని పలుకెవ్వరున్ వినక........"

(కేయూర బాహు చరిత్ర 2–9) అనే పద్యంవల్ల నూనె సంతలవంటి ప్రత్యేక సంతలుండేవని, ధాన్యమిచ్చి కావలసిన సరుకులు కొనే వాళ్ళని, బియ్యానికి సరైన తైలం లభించేది కాదని "ప్రాలేడు మానికలకుం దైలము మానెడు పురమ్ము ధారణ" (కేయూర బాహు చరిత్ర 2-10) అనే మాటలవల్ల తెలుస్తున్నది.

పూర్వతీరం డెల్టా భూముల్లో ఏటి మళ్ళలో అనేక విధాలైన వరిధాన్యాలు పండేవి. వడ్లలో అనేక జాతులున్నాయి. శ్రీనాథుడు వీటిలో కొన్నిటిని తెలిపాడు: "నదీ మాతృకాయమాన విశ్వంభరాభరిత కలమశాలి–సిరాముఖషాష్టిక పతంగ హాయన ప్రముఖ బహు విధ-వ్రీహి భేదములు (హర విలాసము ఆ 1–10). శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదలో కొన్ని వడ్లపేర్లను తెలిపాడు. "తీగమల్లెలు' ఖర్జూరాలు, పుష్పమంజరులు, మామిడిగుత్తులు కుసుమములు, సంపెగలు, పచ్చగన్నెరలు, పాళలు, రాజనములు'', వరి వేరే దేశాలనుంచి మనదేశానికి వచ్చిందని శాస్త్రజ్ఞులు చెప్పినా, దాన్ని గురించిన

ఉల్లేఖనాలుమాత్రం అథర్వవేదకాలంనుంచే కనిపిస్తాయి. కావ్యాలలో. శాస నాలలో. శాస్త్రగ్రంథాలలో వరిధాన్యాలలో శాలి, వ్రీహి, షష్టికములనే పదాలు పేర్కొనబడ్డాయి (1) శాలిలో: లోహిత. కలము, కర్దమక. పాండుక, సుగం ధక, శకునాహృత. పుష్పాండక, పుండరీకం. మహాశాలిసీత భీరుకరోధ్ర పుష్పక, దీర్ఘశూంక! కాంచనక. మహిష, మహాశూక, హాయనక, దూషక, మహాదూషక అనే రకాలున్నాయి. (2) వ్రీహిలో; కృష్ణవ్రీహి. సాలాముఖ. జాదుముఖ. నందీముఖ, లావాక్షక, త్వరితక, కక్కుటండక, పరావతక, పాటల (3) షష్టికంలో; కాంగుక. ముకుందక. పీతక ప్రమోదక, కాకలక, ఆనన, పుష్పక, మహా షష్టిక. చూర్ణక, కురవాక, కేదార అనే విభాగాలు ఉన్నాయి (బి.జి.ఎల్. స్వామి 1975 : 13–14).

జొన్నలు పేదల ఆహారం గ్రాసగాండ్లకు జొన్నలు జీతంగా ఇచ్చే వారు. ఇప్పటికీ ఈ ఆచారం ఉంది. జొన్నలు గొన్న ఋణంబు నీగుదున్ అని నన్నెచోడుడు రాశాడు. పలనాటి రేగడినేలలో జొన్నలు పండించి తినే వాళ్ళు. శ్రీనాథుని చాటువుల్లో ఇది ఉల్లేఖిత మయింది.

జొన్నకలి జొన్న యంబలి
జొన్నన్నము జొన్న పిసరు జొన్నలె తప్పన్
సన్నన్నము సున్న సుమీ
పన్నుగ పల్నాట నున్న ప్రజలందరకున్

చిన్న చిన్నరాళ్ళు చిల్లరదేవుళ్ళు
నాగులేటి నీళ్ళు నాపరాళ్ళు
సజ్జజొన్న కూళ్ళు సర్పంబులును తేళ్ళు
పల్లెనాటి సీమ పల్లెటూళ్ళు

రసికుడు పోవడు పల్నా
డెసగంగా రంభయైన నేకులె వడుకున్
వసుధేశుడైన దున్నును
కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్

తెలుగువారి భోజనాలు

చదివేవారికి చవులూరించే విధంగా తెలుగు కవులుకూడా భోజనాలను వర్ణించారు. తంజావూరులో అయితే అన్నదాన మహానాటకమే వెలసింది బువ్వపుబంతివంటి సందర్భాలలో తెలుగువారి వంటలు-పిండివంటలు ప్రత్యేకతను సంతరించుకుంటాయి. కాకతీయుల కాలంలో ఒక్కరూక ఇస్తే అద్భుతమైన భోజనం దొరికేది.

కప్పురభోగి వంటకము కమ్మని గోధుమపిండి వంటయున్
గుప్పెడు పంచదారయును క్రొత్తగ కాచిన యాలనేయ, పెసర్
పప్పును గొమ్మ నల్లనటి పండ్లును నాలుగునైదు నంజులున్
లప్పలతోడ గ్రొంబెరుగు లక్ష్మణ పజ్జల యింట రూకకున్.

(క్రీడాభిరామం)

ఆహార పదార్థాలనుగురించి ఎవరైనా పరిశోధన చెయ్యాలనుకుంటే ఒక్క శ్రీనాథుడు ఇచ్చిన పదార్థాల పట్టీని వివరిస్తే చాలు. అదే ఒక పరిశోధన గ్రంథం అవుతుంది.

ఖండ శర్కర జున్నుకండ చక్కెరలు
దోసెలు, వడల్, సేవెపాసెముల తోడ
కమ్మగా కాచిన కఠియాల నేతితో
కమనీయ పంచభక్ష్యములతోడ
సంబారముల తోడి శాక పాకముతోడ
పక్వమైన పెసర పప్పుతోడ
తేనియధారతో, పానకంబులతోడ
శిఖరషాడబ రసశ్రేణి తోడ

అచ్ఛలవణాదికములతోడ అమృత
ఖండ పాండురంబైన దధితోడ బ్రాహ్మణులకు
భోజనము పెట్టు ద్వాదశీ పుణ్యవేళ
లింగమంత్రి నవీన రుక్మాంగదుండు (భీమేశ్వరపురాణం)

పదిహేనవశతాబ్దిలో తెలుగువారి భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య పానీయాలు ఏమిటనేది తెలుసుకోవాలంటే కాశీఖండం చూడాలి. అయితే ఈనాడు వీటిలో సగానికి సగం అర్థంకావు. కొన్ని ఇప్పటికీ తెలుగువారి ఇళ్ళలో ఖాద్యవస్తువులుగా ఉండేవే : "అపూపములు, లడ్డువంబులు, ఇడ్డెనలు, కుడుములు, అప్పడంబులు, ఇప్పట్లు, గొల్లెడలు, జిల్లెడుకాయలు, దోసియలు, సేవియాలు, అంగర పోలియలు, సారసత్తులు, బొంతర కుడుములు, చక్కిలంబులు, మడుగుపూవులు, మోరుండలు, పుండ్రేక్షు ఖండంబులు, పిండ ఖర్జూర ద్రాక్షా నారికేళ కదళీ పనస జంబూ చూత లికుచ దాడిమీ కపిత్థ కర్కాంధూ ఫలములు, గసగసలు, పెసరుంబులుగములు, చెఱకుగుడములు, అరిసెలు, బిసకిసలయముల వరుగులు, చిరుగడములు, బడిదెములు, బులుపలు, బులివరకలు, పప్పురొట్టియలు, చాపట్లు, వాయసంబులు, కర్కరీకారవేల్ల కూశ్మాండ నిష్పావపటోలికా కోశాలాబూసిగ్రూదుంబర వార్తాక బింబికార వింద శలాటువులు, కందయు, బొందయు, చారులు, దియ్యగూరలు, పచ్చడులు, బజ్జులు, గిజ్జలు, వడియంబులు, కడియంబులు, గాయంబులు, గంధతోయంబులు, ఉండ్రాలు, నానుబ్రాలు, అనుములు, మినుములు, బుడుకులు, నడుకులు, నిలిమిడియును, చలిమిడియును, ద్రబ్బెడయు, ఒడయును, నుక్కెలు, చక్కెరలు, నేతులు, దోనె తొలలు, బిట్టును, గట్టును, దాలతిమ్మనంబులును, దోపలు, పూపలు, మోదకంబులును గుళోచకంబులు........"

పైవన్నీ శాకాహారుల భోజన పదార్థాలు. భోగులు, మాంసాహారులు వేరే విధమైన ఆహారం భుజించేవారు. ఒక్కొక్కమాసంలో బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు ఎలాంటి భోజనం చేసేవారని శ్రీకృష్ణదేవరాయలు వర్ణించి తన పరిశీలనలోని లోతుల్ని తెలిపాడు. ఎండాకాలంలో బ్రాహ్మణులు అరటిపళ్ళు, పనసతొనలు, నేతి ముద్దలవంటి దోస బద్దలు, మామిడిపళ్ళు, ద్రాక్షపళ్ళు, వడపప్పు, తియ్యదానిమ్మలు, రసదాడి, పానకం తీసుకొనే వారు (ఆముక్త. 2-73). మాంసాహారులు చేపతునకలతో మామిడి ముక్కలు తాళింపువేసి మధ్యాహ్నంతిని సాయంకాలం తడిపిన ఇసకలో పూన్చిన టెంకాయలను తీసి ఎడనీరు తాగి చేపలకనరు పోగొట్టుకునేవారు (ఆముక్త 2-68). రెడ్లు శ్రావణమాసంలో తినే పదార్థాలను ఆముక్తమాల్యద ఇలా వర్ణిస్తున్నది (4-138).

> గురుగుం, జెంచలి, తుమ్మి, లేకగిరిసాకుం, తింత్రిణీ పల్లవో
> త్కరమున్. గూడపొరంటి నూనియలతో కట్టావికుట్టారు గో
> గిరముల్ మెక్కి- తమింబసుల్ పొలము వో గ్రేవుల్ మెయిన్నాక. మే
> కెరుపుం గుంపటి మంచమెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్.

భోజనం తర్వాత తాంబూల సేవనం తప్పక ఉండేది. తెలుగువా తాంబూలం మామూలు తమలపాకులు నమలడంకాదు. వక్కలు, కర్పూరం నీటితో తడిపి శ్రీఖండాన్ని కస్తూరిని కలిపి ఎండించి ఇతర ద్రవ్యాలతో శుద్ధి చెయ్యాలి. పిడకలతో పుటం పెట్టిన ముత్యాలభస్మాన్ని సున్నంగా వాడాలి. పచ్చకర్పూరం, కస్తూరి చూర్ణాన్ని. ఘనసారచూర్ణాన్ని. ఆకులలో వుంచాలి. తక్కోలం, జాజి మొదలైనవి నూరి గోలీలుగా చేసి వాడుకోవాలి.

ద్రవపదార్థాలలో శ్రీనాథాది కవులు పేర్కొన్న కొన్నిటిని ఆయా సందర్భాలలోనే చేర్చడం జరిగింది. సేవెపాయసము, కమ్మగా కాచిన కర యాల నేయి, తేనియ ధారలు. పానకము. శిఖరషాడబరసము, ద్రాక్షా పానకము, చారులు మొదలైన వాటిని పేర్కొనడం జరిగింది. ఇక మద్యములలో అనేకరకాలు కూడా తరతరాలనుంచి ఉన్నవని వేరే చెప్పనక్కరలేదు గౌడీ, పైష్టీ, మాధ్వీ వగైరా మద్యాలను ప్రాచీనులు వర్ణించారు. రెడ్డిరాజుల కాలం నాటి కొన్ని మద్యాలు సింహాసన ద్వాత్రింశికలో పేర్కొబడ్డాయి: "కాదంబంబును, మాధవంబునుఐక్షవంబును,క్షీరంబు,ఆసవంబు,వార్షంబు,రతిఫలంబున పాకభేదంబుల మూలస్కంధ కుసుమఫల సంభవంబుల బహువిధంబుల మధురంబులైన మధువిశేషంబు లెల్లం బరిమళ ద్రవ్యమిశితంబుగా గూర్చి పాత్రంబుల నించిరి'' (భాగం 1 పు. 103) మాధవమంటే ఇప్ప సారాయి, ఐక్షవమంటే చెరకు రసంతో చేసిన గౌడీరసం. ఆసవమంటే వైద్యులు చేసే మద్యం. మద్యాలలో కొన్నిటిని ప్రౌఢకవి మల్లన రుక్మాంగద చరిత్రలో వర్ణించాడు (3–223) : ''శార్కరంబు, సూనజము, గుగ్గుసుమఘృత జంబు, నారికేళజంబు, మాధ్వీకంబు, ఫలమయంబు, గౌడ, తాళమయంబు, నాదిగా తనర్చు నాసవములు."

ఆహారపానీయాలను గూర్చిన నమ్మకాలకు లెక్కలేదు. అన్నం పరబ్రహ్మ స్వరూపమని ఋషులతో సహా అందరూ ఒప్పుకొనేదే. జానపదులకు

అన్నం అన్నానిచ్చే భూమి పవిత్రమైనవి. అన్నాన్ని కళ్ళకద్దుకొని తినడం జానపదులకు అలవాటు. పానీయాలను గురించి కూడా చాలా నమ్మకాలున్నాయి. ఎవరికైనా అన్యాయం చేస్తే అన్నం, నీరు పుట్టవంటారు. ఉప్పు తిన్నవాడు మోసంచెయ్యడని. నమ్మకం తిన్న ఇంటివాసాలు లెక్కబెట్టడం తప్పని మన సమాజం నిర్ణయించింది.

పానీయాలలో జలం చాలా ముఖ్యమైంది. పానీయం ఏదైనా తీసుకోకుండా మనిషి బతకడం సాధ్యంకాదు "పానీయం ప్రాణినాం ప్రాణాః, విశ్వమే వహితన్మయం'' అని సూక్తి.

గంగాజలం చాలాపవిత్రమైందని, దానికి చాలా మహిమలున్నాయని మనవారి నమ్మకం. హంసోదకం ఇంకా మంచిదట! ''పగలు సూర్యకిరణములచే తప్తమై రాత్రులు చంద్ర కిరణములచే శీతలముగా చేయబడి అగస్త్య నక్షత్రముదయించుటచే నిర్విషముగా చేయబడిన జలము అమృతతుల్యముగనుండి, పానాదులకు శ్రేష్ఠమగును" అంటారు (సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము సం.2.పు.60)

హాలుని గాథా సప్తశతి పూర్తిగా తెలుగు జీవితాన్నే ప్రతిబింబించకపోయినా చాలావరకు ఆంధ్రదేశంలోని ప్రజల అలవాట్లను, అభిరుచులనే ప్రతిబింబిస్తున్నదని భావించవచ్చు. నేరుగాకాకున్నా కొన్ని ఉపమల ద్వారా ఆనాటి ఆహార పద్ధతులు వగైరాలను కొంతవరకు తెలుసుకునేందుకు వీలుంది చెరుకుతోట ఉండే గ్రామణి, బెల్లంతో సారా కాచి అమ్మేవాడు, ఉప్పు లేని తిండి పెట్టే పిసినారులు, వట్టి పోయిన ఆవును పాలు పితికేవారు ఆకాలంలో ఉండేవారు శాతవాహనుల కాలంలో వ్యవసాయమే ప్రధాన వృత్తిగా ఉండేది. వ్యవసాయ పరికరాలను అపహరిస్తే కఠినంగా శిక్షించాలని మనుస్మృతి చెప్తున్నది. శాతవాహనుల కాలంలో వరి, గోధుమ, కందులు, నువ్వులు, పత్తి, చెరకు మొదలయిన వాటిని పండించేవారు.

ప్రాచీన కాలపు సాహిత్యం, శాసనాలు మొదలైన వాటి వల్లనే మన వారి తంతరాల ఆహారపు పద్ధతులు బోలెడన్ని తెలుస్తున్నాయి. పాడి పంటలను

గురించిన సమాచారమే ఒక పరిశోధన గ్రంథమవుతుంది. గ్రామాల మీద దాడి చేసి పశువులను తోలుకొని పోయే పద్ధతులు కూడా ఉండేవి. తోటలను దేవాలయాలకు దానమిచ్చినట్లున్న శాసనాలు కూడా ఆంధ్రదేశంలో చాలా ఉన్నాయి. పోకతోట, మామిడితోట మొదలయినవి కూడా దానాలు ఇచ్చేవారు.

ఆంధ్రుల వంటలు, పిండివంటలు, ఆహారపానీయాలన్నిటిని గురించి ఇంకా చాలా పరిశ్రమ జరగవలసి ఉంది. వృక్ష శాస్త్ర సంబంధమైన అంశాల పరిశీలనవల్ల ఎన్నో లాభాలున్నాయి. కొన్ని రకాల ఆహార పదార్థాలను గురించి కావ్యాలలో ఉండే ఉదాహరణాల వల్ల ఆ కావ్యాల కాలాన్ని నిర్ణయించే అవకాశం కూడా ఉంది. ఉదాహరణకు మిరపకాయలు, టొమాటోలు, బొప్పాయి మొదలైనవి మన దేశానికి కొన్ని శతాబ్దుల క్రితం మాత్రమే వచ్చినవి. వీటి పేరు పదవ శతాబ్దికి, పదకొండవ శతాబ్దికి చెందిన కావ్యాలలో కనిపించవు. అంతే కాక ఆహార పదార్థాలను గురించి అధ్యయనం జరపడం వల్ల వివిధ కాలాలకు చెందిన సంస్కృతి ఏ విధంగా వికాసం చెందుతూ వచ్చిందన్నది కూడా తెలుస్తుంది.

టిప్పణి

1. "How men and women in tradition-oriented societies build their food, farm and fish, process the earth's bounty, fashion their tools and implements, and design their furniture and utensils are questions that concern the student of material culture". Richard M.Dorson, *Folklore and Folklife*, p. 2-3

2. "Folk cookery can be readily defined as traditional domestic cookery marked by regional variation" Dony yoder, *Folklore and Folklife*, Richard M Dorson (Edi) p. 325.



# వస్త్రాలు - ఆభరణాలు

మనిషికి తిండి తరువాత కావలసింది బట్ట; ఆ తర్వాత ఆభరణాది అలంకరణలు. దుస్తుల వల్ల కూడా ఒక ప్రాంతానికి, భాషకు, జన సమూహానికి సంబంధించిన సంస్కృతి స్వరూపాన్ని తెలుసుకోవచ్చు. దుస్తులవల్ల కలిగే ప్రయోజనం గురించి అనుశీలన జరిపి పెటర్ బొగటిరెల్ (Petr Bogatyrel), సాంప్రదాయిక వస్త్రాలంకరణ ప్రయోజనాలలో తంత్ర సంబంధమైనవి, మత సంబంధమైనవి, ప్రాదేశికమైనవి, జాతీయమైనవి, వయస్సుకు సంబంధించినవి, ఆవేశ జనకమైనవి, దైనిక మైనవి ఉన్నాయి.[1] పండుగలలో, ఇతర ఉత్సవాలలో ధరించే దుస్తులు వారివారి అంతస్తును సూచించేవిగా, సంస్కృతిని ప్రతిబింబించేవిగా ఉంటాయి. నగ, నట్ర కూడా మనిషి అంతస్తును సూచించేవిగా ఉంటాయి. ఏడు వారాల నగలుంటే జానపదుల పాలిటికి గొప్ప ఐశ్వర్యంగా లెక్క. వివాహాదిసందర్భాలలో 'నగానట్రా భూమి పుట్ర' ఉన్నాయా అని అడగడం పరిపాటి. కావ్యాలలో, శాసనాలలో, శిల్పాలలో, చిత్రాలలో చోటు చేసుకున్నదుస్తులు, ఆభరణాలు ఆయా కాలాలకు చెందిన సంస్కృతిని ప్రతిబింబిస్తాయి. జానపదుల జీవితంలో దుస్తులు, ఆభరణాలు ప్రత్యేకతను సంతరించుకున్నాయి. పాండురంగ మాహాత్మ్యంలో నిగమశర్మ అక్క తనతమ్ముడు ముక్కెర ఎత్తుకొని వెళ్ళినందుకు కంటికి కడివెడుగా ఏడవడం మనకు తెలిసిందే. ఆడవారి జీవితంలో కమ్మలు, మట్టెలు, గాజులు, మంగళ సూత్రాలు మొదలైన వాటికుండే ప్రాధాన్యం, సాంస్కృతిక చిహ్నాలుగా అవి వహించే పాత్ర గమనార్హమైనవి.

వస్త్రధారణ

జానపదుల వస్త్రధారణ అంటే జానపదుల ప్రత్యేకతను వ్యక్తీకరించే ఒక సాధనమని నిర్వచించవచ్చు. కాశీ బోసి పంచెకట్టి, మల్లెపూవులాంటి లాల్చి తొడిగి, వల్లెవాటు పై పంచ పయ్యారంగా వేసుకొని ధీమాగా నడుస్తుంటే తెలుగుదనం ఉట్టి పడుతూ ఉంటుంది. తమిళుల అడ్డపంచె మళయాళీ

స్త్రీల శిరోజాలంకరణ. పంజాబీల తల గుడ్డ వెంటనే వారిని గుర్తించేట్లుగా చేస్తాయి.

వస్త్రాలంకరణ ఒక ప్రాంతానికి చెందిన వారిని గుర్తించేట్లుగా చేస్తుంది. ఈ గుర్తింపును సాంప్రదాయికంగా కులంగాని, జాతిగాని, భాషగాని, దేశం గాని ఇస్తుంది కొంతమంది జానపద వస్త్రధారణను వ్యవసాయ దారుల వస్త్ర ధారణగా పేర్కొన్నారు. కొందరు పల్లెటూరి వారి వేషధారణే జానపద వేష ధారణగా చెప్పారు. కొందరు విద్వాంసుల ప్రకారం జానపదుడు ఏం ధరించాడన్నది ముఖ్యం కాదు ; ఎలా ధరించాడన్నది ముఖ్యం. ఒక్కొక్క సారి ఇదీ నిజమే అనిపిస్తుంది. ఒక్క పై పంచను ఒక్కొక్క సంస్కృతికి సంబంధించినవారు ఒక్కోరకంగా వేసుకుంటారు. పంచె ఒక్కటే అయినా వేరువేరు ప్రాంతాలవారు వేరువేరుగా కట్టుకుంటారు. తలగుడ్డను కర్నాటకంలో ఒక రకంగా, పంజాబులో మరో రకంగా, తెలుగుదేశంలో మరో విధంగా కట్టుకుంటారు. తలగుడ్డ చుట్టుకోడమూ వ్యవసాయదారుల్లో ఒక విధంగా, పెళ్ళి కుమారునికి మరో విధంగా, ఇతరులకు ఇంకోరకంగా ఉంటుంది

వేషభూషణాలు

మనిషికి వస్త్రం ధరించడం ఎంతవరకు అవసరం, అది ఎప్పుడు వేష మవుతుంది, ఎప్పుడు అలంకరణ అవుతుంది అన్నది నిర్ణయించడమూ కష్టమే. ఆదివాసుల పాలిటికి చిన్న తుండు గుడ్డ కట్టుకోడమే పెద్ద వస్త్రధారణ కింద లెక్క. నాగరికులకు కోటు, ప్యాంటు, బూటు, హాటు, టై అన్నీ కలిస్తేనే సంపూర్ణ వస్త్రధారణ. వేషం, వస్త్రధారణ, వస్త్రాలంకరణ మొదలైన పదాలు ఒక్కొక్క సందర్భంలో ప్రత్యేకతను సంతరించుకుంటాయి. పెళ్ళిలో మామూలు గుడ్డలు చదివించినా పట్టు వస్త్రాల కిందనే లెక్కకట్టి వస్త్రాలు ధరించుకొని రమ్మంటారు. వినాయకచవితికి పసుపుగోచీ పెట్టుకోడమే పవిత్ర వస్త్ర ధారణ కిందలెక్క. ఇంగ్లీషులో కూడా ఈ భేదాలున్నాయి. పండుగలకు పబ్బాలకు విశేష సందర్భాలకు వాడే వస్త్రధారణకు 'డ్రెస్' (dress) అనీ చెప్తుంటారు. ఇవి కాక apparel, garb, clothing మొదలైన పదాలూ వాడుకలో ఉన్నాయి.

మనలో వేషభూషణాలను గురించి పెద్దగా పట్టించుకోం గాని ఐరోపాలో విద్వాంసులు ఈ విషయంలో లోతైన పరిశోధనలు జరిపారు. తరతరాల వేషభూషణాలను ఒక పద్ధతి ప్రకారం సేకరించడం జరిగింది. ప్రతి జానపద వస్తుప్రదర్శనశాలలోను జానపదుల వేషభూషణాలను చక్కగా సేకరించి భద్రపరచడం జరిగింది. మైసూరులోని జానపద వస్తుప్రదర్శన శాలలో కూడా జానపద వేషభూషణాలు వైవిధ్యమయంగా ప్రదర్శించ బడి ఉన్నాయి. పాశ్చాత్యదేశాల పురావస్తు శాస్త్రజ్ఞులు, చారిత్రికులు కూడా వేషభూషణాలను గురించిన విలువైన సమాచారాన్ని సేకరించి విశ్లేషించారు.

వస్త్రాలంకరణను విభజిస్తే అందులో వివిధ విషయాలు ప్రాధాన్యం వహిస్తాయి 1. స్త్రీ పురుష భేదం 2. వయస్సు 3. సామాజిక మైన అంతస్తు 4. వృత్తి 5 పని చేస్తుండడం—విశ్రాంతి సమయం 6. ప్రత్యేక సందర్భాలు (Don Yoder, Folklore and Folklife, p 304)

ఆదివాసులలో కూడా స్త్రీ పురుషభేదం వేషభూషణాలలో భేదాన్ని కలిగిస్తుంది. మనలో మొట్ట మొదట వేషభూషణాల్లో స్త్రీపురుషభేదమే కనిపిస్తుంది. పురుషుని కంటే స్త్రీ వేషధారణ ఎక్కువ.

సంకీర్ణం, సౌందర్యాంశ కూడా ఎక్కువ. కుంకుమ, గాజులు, మంగళ సూత్రం, మట్టెలు, కమ్మలు, చీర, రవిక, ముక్కెర, వంకీలు, వడ్డాణం—ఈ విధంగా పట్టీ స్త్రీ విషయంలో పెరుగుతూనే ఉంటుంది. సుమంగలి వేషభూషణాలకు, విధవ వేషానికి భేదం ఉంటుంది. అట్లే చిన్నపిల్లవాడి వేషానికి, మధ్యవయస్కుని వేషానికి వయసు మళ్ళిన వాని వేషానికి భేదం ఉంటుంది. ఆడపిల్లలుకూడా చిన్నప్పుడు వేసుకునే దుస్తులకు పెద్దయిన తర్వాత వేసుకునే దుస్తులకు భేదం ఉంటుంది. అంతస్తుకు తగిన భేదం ఉండడం మరొకటి. వివాహం కావడం కూడా మనిషి జీవితంలో ఒక అంతస్తు నుంచి మరొక అంతస్తుకు పోవడమే. దీన్ని బట్టి స్త్రీ పురుషుల వేషభూషణాలలో కొన్ని భేదాలు కనిపిస్తాయి. అట్లే శ్రీమంతులా, పేదవారా మొదలైన విషయాలుకూడా వస్త్రధారణ మీద, ఇతర అలంకరణలమీద ప్రభావం చూపుతాయి. ఒక్కొక్క వృత్తికి ఒక్కొక్కరకమైన దుస్తులు, ఒకోరకమైన వస్త్రధారణ అవసరమవుతాయి. క్షౌరం చేసేటప్పుడు ప్రత్యేకమైన దుస్తులు,

బట్టలు ఉతికేటప్పుడు మరోరకమైన ఉడుపులు, కుండలు చేసేటప్పుడు ఇంకో రకం, కట్టెలు కొట్టేటప్పుడు మరొక విధమైన దుస్తులు ధరించడం మనకు తెలిసిన విషయమే. పని చేసే వేళల్లో ధరించే దుస్తులకు విరామ సమయాల్లో దుస్తులకు భేదం ఉంటుంది. పొలం పనులకు వెళ్ళే కర్షకుడు వివిధ సమయాల్లో వివిధ వస్త్రాలను ధరిస్తాడు. అదే కర్షకుడు విశ్రాంతి తీసుకునేటప్పుడు వేసుకునే దుస్తులకు, గ్రామమునసబునో, కరణాన్నో చూడడానికి వెళ్ళేటప్పుడు ధరించే దుస్తులకు భేదం ఉంటుంది.

## జానపద సాహిత్యంలో వేషభూషణాలు

మనం చేసే పరిశీలన వల్ల తేలే విషయాలెట్లున్నా జానపదులే తమ వేషభూషణాలను గురించి చెప్పిన మాటలు ఎక్కువ విలువ కలిగి ఉంటాయి. గేయాలు, కథాగేయాలు, కథలు మొదలైన సాహిత్య రూపాలలో జానపదుల వస్త్రధారణ, భూషణాదుల వర్ణనలు కనిపిస్తూనే వుంటాయి. చెంగావిచీర, జల్తారు పట్టుచీర, రత్నాల రవిక, కాసులపేర్లు, కంటెలు స్త్రీల వర్ణనల్లోవస్తాయి. పురుషులు కూడా ఒకప్పుడు ఆభరణ ప్రియులే. అందుకే మన దేవుళ్ళందరూ ఒంటినిండా ఆభరణాలు దిగవేసుకుంటారు. చెవులపోగులు, పూసల వరుసలు, మెడ హారాలు, కడియాలు మొదలైనవి పురుషులూ ధరించేవారు.

కొప్పు చక్కగ బెట్టి గూజ్జులను ముడిచి
పమిడి జల్తారు పట్టుచీరగట్టి
రంగైన రత్నాల రవికను తొడిగి....
పసిడి గొలుసులు తీర్చి బాగుగవేసి

గంట లొడ్డాణంబు-ధరించే స్త్రీలు నేడు కనిపించడం చాలా అరుదు గాని సంస్కృతిని పరిరక్షించడం జానపద విజ్ఞాన ప్రయోజనాలలో ఒకటి కాబట్టి పైజానపద గేయంలో తమ తరతరాల వేషభూషణాలను జానపదులు భద్రపరిచారు.

ఈ క్రింది ప్రసిద్ధ గేయంలో స్త్రీల ఆభరణాలను, అలంకరణలను జానపదులు పేర్కొనడం జరిగింది.

బందారు చిన్నదాన బాజా బందూలదాన్
బాజా బందూల మీద మనసేల లేదే ఓ చిన్నదానా
గుంటూరు చిన్నదాన గుళ్ళా పేరూలదాన
గుళ్ళా పేరూలమీద కళ్ళూ పోలేదే ॥ఓ॥
కాకినాడ చిన్నదాన కాసూల్ కంటేలదాన
కాసూల్ కంటేల మీద మనసేల లేదే ॥ఓ॥
అర్ధరూపాయి పెట్టి అద్దాల రయిక కొంటె
అద్దాల రయిక మీద బుద్దేల లేదే ॥ఓ॥

చంద్రగిరి చీరలు, కాకినాడ గాజులు, రాజమండ్రి రవికలు కావాలని అడిగే స్త్రీలు జానపద కవిత్వంలో కనిపిస్తారు. ఆంధ్ర జానపదుల అభిరుచులు కొన్ని ఈ గేయాలలో వ్యక్తమవుతుంటాయి. పట్టు చీరకు అంచులు, చుట్టు చెంగులు, సరిగంచు ఉండాలని కోరుకుని వీటికోసం ప్రణయ కలహానికి పాల్పడే స్త్రీలూ ఉంటారు.

పట్టుచీర తెచ్చాను పెట్టెలో పెట్టాను
కట్టమని చెప్పవే తడికా
చీరకంచులు లేవు చుట్టుచెంగులులేవు
వద్దని చెప్పవే తడికా తడికా ॥చీ॥
సంతలోకి వెళ్ళి సరిగంచు చీరను
అద్దాల రవికను అతివ తెచ్చెద కట్టుకోవే.

కథాగేయాలలో ఉండే వేషభూషణాలనే ప్రత్యేక అధ్యాయంగా వర్ణించవచ్చు. కాటమరాజు కథలో, గోసంగి దళాల వేషభూషణాలలో ఎన్నిరకాలు పేర్కొన బడ్డాయో చూస్తే ఈనాడు మనం ఎన్ని రకాల అలంకరణలను వదలి పెట్టేశామన్నది తెలుస్తుంది.

కొమరొప్పగా సంత క్రొత్త చల్లడము
కమనీయమగు చంద్రకావి దట్టీలు

పులితోలు బిరుదులు పూని కాసెలును
జెలువైన పరిపెనల్ చెంపగంధాలు
గాటంపు టరిగెలు గంటగాలమును
నీరైన కుడిసిగలు నిలువునామములు
సిగల బువ్వల చెండ్లు సింహమరిగెలుమా
నాకకాల నొరలేటి నొఱను రుమాళ్లు
నొరలు గోసిన కత్తులొనర జేపట్టి
కిరుచు చేకత్తులు గీరుగంధాలు
బాగడ పచ్చల పేరు బేజుబంధువులు
తగిన గవ్వల పేర్లు దండకడియములు
వెలుగు తలాటములు వేడ్క-భుజములును
నెలుగు చర్మంబులు నెన్నగాగటిని
నెడపగ బిరుదులన్నియు సవరించి
యెడమ చేతను గొమ్మయిరవొక్క-వేరు
కోపంపు జూపును కోరమీసమును
దాపిన నవరత్న దంతకడియములు
రంగుమీరిన వన్నె రావి రేకలును....

భూషణాలమీద ఉండే ఆశను చిన్నపిల్లలకు అలంకరించడం ద్వారా తీర్చుకోడం ఈనాటికీ కొంతకు కొంత కనిపిస్తుంది. పసిబాలుడైన శ్రీరాముణ్ణి కౌసల్య అలంకరించిన విధానం 'పుత్రకామేష్టి' పాటలో వర్ణింపబడింది.

అందమైన పాదములకు అందేలు మూగాలు
కుందనంపు కడియాలు జైమ్ని గొలుసులూ
మద్దికాయలు చెవులాకు మకరకుండలమ్ములు
ముద్దురావిరేక నొసట మొలకు గంటలూ
పచ్చపట్టు బట్ట గట్టి పగిడి మొలకట్టుకట్టి
వన్నెమీర బంగారు వత్తులేసియు....

ఇవికాక కంఠమాల, పులిగోరు, నాగస్వరములు, ముత్యాలపేర్లు, హారమణులు, వజ్రాల జోడు కవచాలు ధరింప జేస్తానని హామీ ఇస్తుంది కౌసల్య. ఇవన్నీ సామాన్య జానపదులకు అందుబాటులో లేకున్నా కొన్నిటికి కొన్నయినా అభిరుచికి తగ్గట్టుగా అలంకరించుకుంటారు జానపదులు.

మనుషులవిషయం పైవిధంగాఉంటే జంతువులను, పక్షులను కూడా అలంకరించే సందర్భాలు లేక పోలేదు. కనుమనాడు పశువులను అద్భుతంగా అలంకరించే విషయం అట్లుంచి, మామూలుగా కూడా గోవుల్ని, ఎద్దుల్ని వీలయినంత అలంకరించి ఉత్తమాభిరుచిని చాటు కోడం జానపదులకు అలవాటే. కాటమరాజు కథలో యాదవులు బొల్లావును ఈ క్రింది విధంగా అలంకరించారు :

పసిడి బిందెలనీట పాదముల్ గడిగి
అందంబుగా వెదురాకు చందమున
తిరుమణి తిరుచూర్ణము దిద్దిరి తోడ
నలదిరి మేనున నగరు గంధంబు
నటు పున్గు జవ్వాజి యలదిరి చాల
సురయించి కస్తూరి సురటుల విసరి
నాల్గుపాదంబుల నాదుటందెలను
మెండుగా వేసిరి మేలుగంటలను
రత్నాలు దాపిన రావిరేకలును
తళతళ మెరయంగ ధరియింప జేసి
కొమ్మున బంగారు కుప్పెను దొడిగి
రహిమించ మెడచుట్టు రంగుగా నపుడు
గోమేధికంబుల గొలుసును వేసె
మురువైన ముత్యాల మువ్వల పేర్లు
గంటల సరమును ఘనముగా వేసె
మూపురమునకు జుట్టు మురువు గజ్జలును
సన్నగజ్జలు వేసె సందుసందులను....

కోడి పందాలలో కోడిని అలంకరించే విధానం చూస్తే నిజానికి మన వారు ఎంత రసికులన్నది వ్యక్తమవుతుంది. పెద్దాపురపు కోడి పందెముల కథలో కోళ్ళ శృంగారం, వాటి భోగం వర్ణించ బడింది (బి. రామరాజు 1978 773).

అందెల సరసను బంగారంపు గొలుసు లుంచినారు
పట్టెడదు జుట్టుకు బంగారపు జాలే కట్టారు
ముక్కుకు అయినా మూడువేలది బులాకి పెట్టారు
సింహ తలాటం కడియముంచిరీ విడికోడీకండి
మెడలోపలనూ పదివేలాడి పట్రాపు పేరుంది
కట్టివేయను మేతవేయను కాసాలిద్దరుగా
వచ్చి పాలలో శనగపిండియు కోడికి మేపారూ
వైభోగముతో ఉన్నాదండి విడీకోడిపుంజు.

ఆదివాసులు

ఆదివాసుల అలంకరణలు ప్రాచీన మానవునికి ప్రాతినిధ్యం వహిస్తుంటాయి. కోయవారు చూడగానే గుర్తుపట్ట గలరీతిలో తలగుడ్డ, పంచె, పై పంచ, దండలు మొదలైనవి ధరించి కలకాలం జ్ఞాపకం ఉండేలాగా వస్త్ర ధారణ చేస్తారు. యానాదులు, చెంచులు మొదలైన వారికి వీలైనంత తక్కువ వస్త్రధారణ చెయ్యడమే ప్రత్యేకత. కొందరు గోచి పెట్టుకుంటారు. ఆడవాళ్లు కొంచెం పెద్ద వస్త్రాన్ని మొలకు చుట్టుకొంటారు. కొందరి మొలల్లో తాటాకుల సంచులు వ్రేలాడు తుంటాయి. ఎలుకలు, పాములు, ఎండ్రకాయలు, చేపలు వేసుకోడానికి అవిపనికి వస్తాయి. గ్రామాలలో ఉండే యానాదులు పై జాతుల వారికి కోపంరావచ్చునని చెప్పులుకూడా వేసుకోరు. నగరాలలో వేసుకున్నా సాయంత్రం చెప్పులు చేత బట్టుకొని గుడెసెవైపు నడుస్తుంటారు. యానాదుల్లో కొంతమందికి చొక్కా అని ఇంటి పేరుంది. కాని చొక్కాలు వేసుకునే యానాదులు దొరకడం చాలా కష్టమే. ఇటీవలి కాలంలో మొల్లో తాయెత్తులు, చెవులకు పోగులు, వల్లపూసలు, కాటుక, కుంకుమ మొదలైనవి అలంకరణలో

భాగాలవుతున్నాయి. వీరి స్త్రీలు కొప్పులు పెట్టుకొని దానిలో ఏదో దొరికిన పువ్వు దురుముకుంటారు.

## చరిత్రపుటల్లో వేషభూషణాలు

శాతవాహనుల కాలంనుంచి ఆంధ్రులు ఎలాంటి ఆభరణాలను ధరించే వారు, ఏవిధంగా వస్త్రధారణ చేసేవారు అన్నదానికి శిల్పాలు, చిత్రాలు, కావ్యాలు మొదలైనవి సమాధానంచెప్తాయి. గాథాసప్తశతి క్రీస్తుశకం ప్రారంభ కాలంలో ఆంధ్రులను గురించి, వారి జీవన విధానాన్ని గురించి చాలా విష యాలను చెప్తుంది. అమరావతిలోని శిల్పాలవల్ల ఆనాటి ఆంధ్రుల వేషభూషణా లంకరణలు చాలావరకు తెలుస్తాయి. క్రీస్తుశకారంభంలో ఆంధ్రస్త్రీలు మట్టి గాజుల్ని ధరించేవారు. చీరరవిక ప్రధానవస్త్రాలుగా ఉండేవి. రవిక కట్టు ముందువైపు ఉండేవి. బౌద్ధమతం ఆంధ్రదేశంలో ప్రచారం పొందిన తర్వాత మన వేషభూషణాలంకారాలలోకొన్ని మార్పులు వచ్చాయి. అమరావతి శిల్పాల వల్ల ఆంధ్రుల నిజమైన వేషభూషణాలు పూర్తిగా తెలియకున్నా కొంతకుకొం తయినా ఆనాటి సంస్కృతిని కళారూపాలలో పట్టి చూపుతున్నాయివి. స్త్రీలు. పురుషులు ఆనాడు బలమైన కర్ణాభరణాలు ధరించేవారు. నేటికీ తమిళనాడులో కొందరు స్త్రీలు బరువైన కర్ణాభరణాలు ధరించడం కనిపిస్తుంది. ఆ బరువుకు చెవులు పెద్ద చిల్లులు పడి ఉంటాయి. ఆ విధంగా జారిన చెవి చిల్లిలో చేతి వేలు నుంచుకున్న అమరావతి శిల్పం ఒకటి ఉంది. ఆ కాలంలో కొందరు ఒకే చెవికి రెండు పోగులు కూడా ధరించే వారు. మరికొందరు పూసల వరు సలు జోడించిన పోగులను కూడా ధరించే వారు. స్త్రీలు మణికట్టునుంచి మోచేతి వరకు కంకణాలు ధరించే వారు. స్త్రీ పురుషులిద్దరూ దండకడెములు వేసుకునేవారు. స్త్రీలు కాలికికూడా కడియాలు వేసుకునే వారు' హారాలు తప్పక ఉండేవి. ముత్తెపు చిప్పలవి, ఊదారంగు పూసలవి, ముత్యాలు, బంగారు గుండ్లు, బంగారు పూలు ఉండే హారాలు ఆనాడు ధరించే వారు. అమరావతీ శిల్పాల లోని శిరోవేష్టనాలు, బరువైన పెద్దకుండలాలు, హారాలు, చుంగులు తీర్చి కట్టిన దోవతులు కల్పనలు కాదని ఆనాటి వేషధారణను తెలిపేవని విద్వాంసులు భావించారు.

నన్నయ కాలంనుంచి ఆంధ్రుల వేషభూషణాలను గురించి కావ్యాలలో అనేక ఉదాహరణలు కనిపిస్తాయి. ఆ కాలంలో స్త్రీలు మట్టెలుధరించేవారు. ఇవి తెలుగువారి ఆచారాలలో ఒకటి. ''లలితంబులగు మట్టియల చప్పుడింపొం పంచ క్రైవడి నలనల్లవచ్చి, (విరాట 2–64) అని తిక్కన రాశాడు. ఆ కాలంలో పురుషులుకూడా మట్టెలు పెట్టుకుంటుండేవారని తెలుస్తున్నది. కీచకుడు 'మట్టియ లొండొంటి బిట్టు దాకగ నేల నందంద మునిగాళ్ళ నప్పళించుచు (విరాట 2-250) వెళ్ళాడు.

అంచులేని ఉడుపులను ధరించడం అమంగళకరమని మనవాళ్ళ భావన. సన్ననినూలు బట్టలకు ప్రాచీనకాలంనుంచి తెలుగుదేశం ప్రసిద్ధిచెందింది. కాకతీయరాజ్యంలో శ్రేష్ఠమైన నూలువస్త్రాలను నేస్తారని, ఆ బట్టలు సాలె పురుగు జాలలాగుండేవని మార్కోపోలో అనే విదేశీయుడు రాశాడు. మచిలీ పట్టణంలోని సన్నని బట్టనుంచే మస్లిన్ అనే పదం వచ్చిందని విద్వాంసుల అభిప్రాయం. పాల్కురికి సోమనాథుడు బసవపురాణంలో రకరకాల వస్త్రాలను పేర్కొన్నాడు.

వెంజావళియు, జయరంజియు, మంచు
పుంజంబు, మణిపట్టు. భూతిలకంబు
శ్రీవన్నియయు. మహాచీని. చీనియును,
భావజతిలకంబు, పచ్చని పట్టు,
లాయశేఖరమును, రాయవల్లభము,
వాయుమేఘము, గజవాళంబు, గండ
వడము, గావులు, సరిపట్టును హంస
వడియు, వీణావళి, పల్లడదట్టి,
వారణాసియు. జీకువాయు, కెందొగరు
గౌరిగ నయమును, క్షీరోదకంబు,
పట్టును, మరకతపట్టు, పొంబట్టు,
నెరపట్టు, వెలిపట్టు, నేత్రంబుపట్టు
మదితవరాజంబు, మాందోళ రవియు....

(బసవపురాణము పు. 56)

ఆనాడు వస్త్రాలకు మంజిష్ఠ, లాక్ష, కౌసుంభ, సింధూర, హరిద్ర, నీలివర్ణ ములు వేసేవారు. అమరావతి శిల్పాలలో ముక్కరలు కానరావు. కాకతీయుల కాలంలో ముక్కర, వంకీలు, దండకడెములు, మట్టెలు, పిల్లాండ్లు మొదలైనవి ధరించేవారని తెలుస్తున్నది. గాథాసప్తశతి కాలంనుంచికూడా పసుపు పూసుకోవడం మంగళకరమని స్త్రీలు భావించేవారని తెలుస్తున్నది. స్త్రీలు స్నానం చేసేటప్పుడు పసుపు రుద్దుకునేవారని, నదీస్నానానికి వెళ్ళినప్పుడు కూడా పసుపు తీసుకొని వెళ్ళేవారని, కన్యకలకు తొలిసమర్తకాలంలో పసుపునెయ్యి కలిపి ముఖానికి పూసేవారని గాథాసప్తశతి వల్ల తెలుస్తున్నది. కాకతీయుల కాలంలో కూడా పసుపు ముత్తయిదువల మైపూతలలో ప్రధాన స్థానం ఆక్రమించేదని తెలుస్తున్నది. ఆనాడు స్త్రీలు గోళ్ళకు గోరంటరంగు తప్పక వేసుకునేవారు. కాళ్ళకు పారాణేనేకాక లక్కరంగునుకూడా పూసుకునేవారు. ఓరుగంటిస్త్రీలు ఆనాడు తాటంకాలు, ముత్యాల కమ్మలు. కాంచీనూపుర కంకణాలు, త్రిసరాలు, మొరవంక కడియాలు ధరించేవారు. దండి దశకుమార చరిత్రను తెనిగిస్తూ, కేతన తెలుగువారి ఆభరణాలు కొన్నింటిని అదనంగా చేర్చిరాశాడు, కన్నరదములు, గట్టి నూళ్ళు, సుద్దసరితీగె, మినుకులు, సందిదండ అంగుళీయకములు, చేకట్టు పాశెలు, సరిపెణలు, ఆలక్తము, పూతకాటుక మొదలైనవి కేతన చేర్చాడు. కాకతీయులకాలంలో స్త్రీలు రకరకాల అంచులుండే చీరలు ధరించేవారు. కరకంచులు, బొమ్మంచులు. మువ్వంచులు, చిలుకవాళ్ళు, ఉడుత చారలు, పుష్పొడివన్నెలు, రుద్రాక్షవన్నెలు, హంసావళులు వాటిలోకొన్ని-తెలుగునాటి సీమంతిని రూపం ఎలా ఉండేదో కేతన పద్యాల వల్ల చిత్రలేఖనంలో లాగా తెలుస్తుంది. (దశకుమార చరిత్ర)—

మట్టియ లుజ్జ్వల మణినూపురంబులు
మొలనూలు వస్త్రముల్ ముత్తియములు
కన్నవడంబులు గట్టినూళ్ళును సుద్ద
సరితీగె మినుకులు సందిదండ
అంగుళీయకములు హార కంకణములు
చేకట్టు పాలెలు చెన్నుమెఱుగు
టాకులు సరిపెణలాలక్తకము పూత
కాటుక తిలకంబు కమ్మపువ్వు

లాడిగాగల మేలి ద్రవ్యముల నొప్ప
పసదనము చేసి యుచితరూపంబు దాల్చి
బాల చంద్రిక బోటినై పజ్జకరిగి
దారు వమ్మని లోగిలి దరియజొచ్చి

రెడ్డిరాజులకాలంలో వేషధారణ. ఆభరణాలంకరణ శ్రీనాథుని కావ్యాల వల్ల చక్కగా వ్యక్తమవుతున్నాయి. స్త్రీపురుషుల వేషభూషణాలను వర్ణించే శ్రీనాథుని చాటువులనేకం ఉన్నాయి. గోలకొండ వ్యాపారులు నీర్కావి దోవతులు. గడ్డాలు. చుంగురుమాలలు. కుచ్చుల అద్దాల కిర్రుచెప్పులు ధరించే వారు. స్త్రీలు నత్తు. ముత్యాలముంగర కమ్మలు, పచ్చపూసలు అలంకరించు కునేవారు. బ్రాహ్మణులు దోవతి కట్టేవారని, శూద్రులు చల్లాడములు తొడిగే వారని తెలుస్తున్నది చాలామంది నడుముకు బెత్తెడు వెడల్పున ఏడెనిమిది మూరల పొడవుండే దట్టిబిగించేవారు. అంగీలువేసుకుంటే వాటికి బొందెలుం డేవి. శ్రీనాథుడు, అతని సమకాలీనులు వర్ణించిన దానినిబట్టి ఆకాలంలో ముక్కునత్తు. వడ్డాణం. దానికి గజ్జెల గొలుసు, నూపురాలు, మూడుపేటలపండ, కంకణం, కమ్మలు, ముక్కెర సాధారణ భూషణాలుగా ఉండేవని తెలుస్తున్నది స్త్రీలు సామాన్యంగా కాటుక పెట్టుకునేవారు. భర్త ఇంటికి కూతుర్నిపంపే టప్పుడు కాటుకడబ్బీని ఇవ్వటం ఒక సంప్రదాయమైపోయింది. తెలుగు. దేశంలో ఉండిన బొందిలీలు 'బంగారుచీరలు', 'కుసుమంబద్దినచీరకొంగులు', 'చందురకావి రవికెలు', 'యమునారైకలు' 'నాగరా' కట్టేవారు.

విజయనగర కాలంనాటి సాంఘిక జీవనంగురించి చాలామంది విద్వాం సులు అధ్యయనం చేశారు. ఆనాటి శాసనాలు,కావ్యాలు. విదేశీయుల వ్రాతలు, శిల్పాలు, చిత్రాలు విజయనగరకాలంనాటి ప్రభువుల ప్రజల రసికతను చాటి చెప్తున్నాయి వస్త్రాలకు దేశిరంగులు వేసేవారు. ముఖ్యంగా నీలిరంగంటే ఇష్టపడేవారు. మంజిష్ఠ, ఇంగిలీకం, కవకాయ మొదలైనవి వాడేవారు. "ఇంగిలీకంబునన్ తడిపి యెత్తు కనీసపు రెంటములు" జనులు వాడేవారని ఆముక్తమాల్యద చెప్తున్నది. (4-10). విజయనగర సామ్రాజ్యం ఆంధ్ర కర్నాటకాలకు కూడలి. అయినా ఆంధ్రులకే అక్కడ పైచేయి, 'తెలుగదేల యన్న దేశంబు తెలుగు' అని స్వయానా శ్రీకృష్ణదేవరాయలే రాసుకున్నాడు.

సుగంధద్రవ్యాలను సిద్ధంచేసి అమ్మేవారు. చెవుల సంకులు—ఇంకా కొండ సిగలుగా గాలి దుప్పటులు నొప్ప గంధకలనా కుసుమస్రగ్గథనాదుల నాంధ్యంబులే కలరు నాంధ్రదేశీయులై, ఉండినట్లు కావ్యాలవల్ల తెలుస్తున్నది

విజయనగర కాలంనాటి ప్రజలు కొందరు సన్నని నూలు అంగీలను ధరించేవారు. మెడమీద పెద్ద సెల్లా ఉండేది. స్త్రీలు సన్నని నూలు చీరలు కట్టేవారు. రెడ్లు పసుపుచుంగల తలపాగా కట్టుకొని కపిల వర్ణపు పచ్చడం వేసుకొని, వంకుటుంగరం, చౌల్లు పోగులు ధరించేవారు. మాలదాసరి వర్ణనలో రాయలు వారి వేషాన్ని తెలియ జేశాడు. మాలదాసరులు తోలు కుప్పసాలు, టోపీ ధరించి తోలు తిత్తి, మొగలాకు గొడుగు, గుర్రపు వెంట్రుకల దండె, చిటితాళం, చంకబుట్ట, తులసి పేరులు మొదలైన పరికరాలతో తిరిగేవారు. విజయనగర కాలంలో పురుషులు గుండురుమాల, చుంగు విడిచిన పాగాలలో ఏదో ఒకదాన్ని ధరించేవారు. బొందుల అంగీవేసుకునేవారు; ఏక దుప్పటిని మెడమీద వేసుకునే వారు. ధనికులు, పైవర్గాలకు, జాతులకు చెందినవారు దోవతులు కట్టేవారు. సామాన్యులు మోకాళ్ళకు పైన చల్లాడం తొడిగి నాలుగువేళ్ళ వెడల్పుండే కాసెకట్టీని నడుము చుట్టూ బిగించుకునే వారు. పురుషులు కిర్రు చెప్పులు వేసుకునేవారు. వాటికి బొటన వ్రేలికి సరిపోయే తోలుంగరంఉండేది. మిగిలిన వేళ్ళకు తగులుకొనే వార్లుండేవి. కులాలను తెలిపే చిహ్నాలుకూడా ఉండేవి. విభూతి, నామం, జందెం, తిలకం, పిలక మొదలైనవి ఉండేవి. స్త్రీలు కట్టే చీరలకు వివిధ వర్ణాల అంచులుండేవి. నత్తు, ముక్కర, వంకి, కమ్మలు, నెత్తి బిళ్ళలు, హారాలు, దండ కడెములు, కంకణాలు, కాలి కడియాలు, కాలిమట్టెలు, బొబ్బిలి కాయలు ధరించే వారు. స్త్రీల వేషధారణ కూడా ఒక్కొక్క కులానికి మారుతుండేది. బ్రాహ్మణస్త్రీలకు వెనుక కొప్పు, పసుపు బొట్టు, చీర కాసెకట్టు, చెవిలో లపలాకులు ఉండేవి. రెడ్లు మొదలైన జాతుల్లో స్త్రీలు గొంటుసపూలు, రెండుగుళ్ళ ముంగరలు, మైజారు చీరలు, తూలే కొంగులు, బలు చెంపకొప్పులు, అంచుకమ్మలు, సన్నకాటుక రేకలు, నాభి నామం, పసుపు పూతలతో ఉండేవారు. బోగం సానులు రంగు పావడలు కట్టుకునే వారు. కదిరీపతి శుక సప్తతిలో వివిధజాతి స్త్రీ పురుషుల వేషాలను వర్ణించాడు.

విజయనగర రాజుల కాలం లోను, అనంతర కాలంలోను రెడ్డివేషం ఎలా ఉండేదనడానికి పరమయోగి విలాసంలోని క్రింది పాదాలు సాక్ష్యంగా ఉన్నాయి.

పసపు చుంగుల తలపాగ నెట్టంబు
కలిబిసి మెనగు బాగాల వీడియము
మిన్నదేరెడు దొడ్డమెడనూలు మిగుల
వన్నియగల మాధవళి పచ్చడంబు
దళసరి యగు దేవదారు గంధంబు
వలకేల గనుపట్టు వంకుటుంగరము
చొల్లు బోగులును కాటుక పప్పుదేరు
పిల్లి గడ్డము పడిబెట్టు మీసలును
నలవడ నాందోళి కారూఢు డగుచు
అలనాటి పూర్వికుడగు పెద్దిరెడ్డి

ఇది రెడ్డి వేషమైతే కాపు వేషం ఈ క్రింది విధంగా ఉండేది. న్యాయానికి రెడ్లూ కాపులే. అయితే కొంత మంది ఇతర కులాలవారు కూడా తాము కాపులమని చెప్పుకుంటారు. 'వ్యవసాయదారులు' అనే అర్థంలో కాపులమని చెప్పుకునే వారున్నారు.

అప్పుడా మడిసేయు నాయూరికాపు
ముప్పిరిగొను పగ్గముల చుట్టతోడ
గుచ్చిన మునికోల గొంగడి ముసుగు
మచ్చల మచ్చల మట్టికాళియును
బలువైన కేలియంబటి కుండతనకు
నలవడ నలగొండలన నొప్పుచున్న
మీసైన యెద్దుల మెడ కాడిమీద
కోచేరు వైచి నెక్కొని కొప్పికొనుచు....వచ్చిన కాపు వర్ణన ఇది.

పదిహేడవ శతాబ్దినుంచి ఆంధ్రుల మీద నవాబుల పెత్తనం అధికమై వారి వేషభూషణాల మీదకూడా మహమ్మదీయుల ప్రభావం కనబడసాగింది. బులాకీలు, బుగడలు, చెవులపైన పెట్టుకొనేకమ్మలు మొదలైనవి ఈ విధంగా వచ్చినవే. హంస వింశతి కాలానికి గ్రామకరణాలు తెలితలపాగ, చొక్కా, మొలతిత్తి, చల్వపచ్చడం, కాలిదోవతి, కాలికి ముచ్చెలు ధరించడం మొదలు పెట్టారు. ఆ నాడు స్త్రీలు ధరిస్తుండిన సొమ్ములను అయ్యలరాజు నారాయణ కవి హంసవింశతిలో ఈ విధంగా వర్ణించాడు (2–191):

'కుప్పె, రాగతి బిళ్ళ కుంకుమరేఖ, పా
పట బొట్టు, కమ్మలు, బావిలీలు,
లలి సూర్య చంద్రవంకలు, సూసకము, కెంపు
రవల పల్లెరు బూవు, రావిరేక,
బుగడలు, నాన్ దీగె, సొగసైన మెతనూలు,
కుతి కంట్లు, సరిపెణ, గుండ్ల పేరు,
సరిగె, ముక్కర, బన్న సరము, లుత్తండాలు
కంకణంబులు, తట్లు కడియములును

సంది దండలు, నొడ్డాణ, మందమైన
ముద్రికలు, హంసకంబులు, మ్రోయు గజ్జె,
లలరు బొబ్బిలి కాయలు గిలుకు మెట్టె
లాదియగు సొమ్ము దాల్చి యయ్యబల మెరయ'

ఆనాటిని ఈ నాటితో పోల్చి చూచినప్పుడు ఎన్నెన్ని మార్పులు వచ్చాయో తెలుస్తుంది. మొన్నమొన్నటి వరకు కూడా ఉండిన నత్తు ముక్కర ఎంకి తాలికడియాలు జడకుచ్చులు మొదలైన వన్నీ మోటు అయి ఈనాడు ఉండే భోషాణాల్లోకి వెళ్ళిపోయాయి. మంగళసూత్రాలు కూడా 'పాత చింత కాయ పచ్చడి' వర్గానికి చెందిన సంప్రదాయంగా అయిపోతున్నాయి. జాన పదులు ఇంకా కొంత వరకు ఈ పాతకాలపు వస్త్రాలను, ఆభరణాలను పట్టు కొని వదలలేక కనీసం పండుగలు పబ్బాలలోనైనా సాంప్రదాయకమైన వేష

భూషణాలను ధరించి వాటిని కాపాడుకొని వస్తున్నారు. మామూలుగా కని పించని కొన్ని రకాల వేషాలంకరణ భూషణాల,పదుక కొన్ని ప్రత్యేక సంద ర్భాలలో కనిపిస్తుంది. తరతరాలనాటి దుస్తులు అలంకరణల తాలూకు అవ శేషాలు కొంతవరకైనా జానపదులలో కనిపిస్తాయన్నది సాంప్రదాయిక వాదు లకు సంతోషాన్ని కలిగిస్తుంది. అయితే చరిత్రలో ఏనాడు కూడా మార్పు అన్నది అనివార్యమూ, అవసరమూను. అందువల్ల నేడు కూడా ప్రతి దశాబ్దికి కొత్తకొత్త ఫాషన్లు వస్తుండడం పోతుండడం జరుగుతున్నది. ఇది ప్రపం చంలో ఏ జనసముదాయ విషయంలో నైనా జరిగేదే.

### దేశదేశాల వేషభూషణాలు

దుస్తులు అలంకారాలు అన్నవి సంస్కృతికి సంబంధించిన విషయాలే కాని మానవుని మూలభూత ప్రవృత్తికి సంబంధించినవి కావు. మానం, మర్యాద మొదలైనవన్నీ మనం కల్పించుకున్నవే కాని పుట్టుకతో వచ్చేవి కావు సిగ్గు అన్నది దుస్తులు లేకపోవడం వల్లనే కలగనక్కరలేదు. కొందరు మాట్లాడితే సిగ్గు పడతారు. మరికొందరు పళ్ళు ఊడిపోతే మాట్లాడడానికి సిగ్గు పడతారు. ఇంకాకొందరు మాట్లాడిస్తేనే సిగ్గు పడతారు. ఆదిమజాతుల్లో అనేకాలు- అదీ అరణ్య జీవన స్థితిలో బ్రతికేవారు బట్టలు లేకపోతే కాదుసిగ్గు పడేది; వాళ్ళసాంప్రదాయికమైన హంగులుకొన్ని లేకుంటే. బొటోకుడా స్త్రీలలో చెవులకు. పెదవులకు కొయ్యతో చేసిన గొట్టాల వంటివి దూర్చు కోడం అలవాటు. ఒక మానవ శాస్త్రజ్ఞుడు పూర్తి దిగంబరంగా ఉండే బొటా కుడా స్త్రీని ప్రలోభపెట్టి వారి ఆలంకరణ సాధనాలను తీసుకోగా అంతవరకు దిగంబరంగా ఆయన ఎదుట నిలబడి వుండిన ఆ స్త్రీ బిరబిరా అడివి లోకి పారి పోయిందట ![3] వేడి దేశాలలోని ఆదిమజాతులలో ఉడుపులు ధరించకుండా ఉండేది సకారణ మనిపిస్తుంది. చలిదేశాలలోని వారు దేహాన్ని కాపాడు కోడానికే ఏదో విధంగా కప్పుకుంటారు. మామూలుగా జంతువుల చర్మాలే ఉడుపులుగా పని చేస్తాయి. ప్రకృతి మనిషికంటె జంతువులకు ఎండ చలి వాన మొదలైన వాటి నుండి సహజంగా రక్షణనిస్తుంది. అందువల్లే మనిషి జంతు వుల చర్మంతో తన్నుతాను కాపాడుకోడం నేర్చుకున్నాడు. బట్టలు కుట్టడం అన్నది ఎప్పటి నుండి వచ్చిందో కాని అప్పటి నుంచి మానవునికి కట్టుబొట్లు

ఎక్కువయ్యాయి. అసలు గుడ్డలు కుట్టివేసుకోడం అన్నదే మనిషిని ఉడుపులలో బంధించడమన్నమాట. ఈ విధంగా దుస్తులను కుట్టుకోడం, వాతావరణానికి తగ్గట్లుగా వాటిని మలచుకోడం అన్నది అన్ని తెగలలోను సరిగ్గానేజరుగుతుందని చెప్పడానికి వీలులేదు. కొన్నిచోట్ల విపరీతమైన చలి ఉన్నా వాటికి తగ్గ ఉడుపుల్ని జనం ధరించకపోవచ్చు. కొన్ని ప్రాంతాలలో నిప్పుల్లాముండే ఎండల్లోనూ దళసరిదుస్తులు వేసుకొనే వారుండవచ్చు. ఎస్కిమోల వంటి అతి ప్రాచీన తెగలకు చెందినవారు కూడా వాతావరణానికి తగ్గట్లు చక్కగా ఉడుపుల్ని తయారు చేసుకునే వారున్నారు. ఎస్కిమోలు చక్కని రంగులు అవీవేసి చర్మాన్ని తమ ఒళ్ళు కప్పడానికి తగ్గట్లుగా మలచడంతో బాటు సౌందర్య దృష్టికలవారమని కూడా చాటుకుంటారు.

ఆదిమవాసుల వేషధారణను చూపినప్పుడు అవసరం అన్నది ఏ విధంగా పనిచేస్తుందో తెలుస్తుంది. ప్రాచీనజాతుల్లో టోపీకంటె చెప్పులకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు. తలను రక్షించడానికి జుట్టుఉంది. అది దట్టంగా ఉంటే తలను బాగా కాపాడగలదు. కాని కాళ్ళు కొన్ని సందర్భాలలో ఏ కవచమూ లేకపోతే మనిషికి చాలా కష్టం కలిగించగలవు. అందువల్లే పాద రక్షలు పలుజాతుల మనుషులకు అవసరమయ్యాయి. శిరోజాలంకరణ అన్నది కూడా ఏ వందల సంవత్సరాల నాటిది మాత్రమే కాదు, వేల సంవత్సరాలకు చెందింది. క్రో — మాగ్నాన్ మానవుని కాలంలోనే మనిషి స్త్రీ శిరోజా లంకరణకు ప్రాధాన్యం ఇచ్చేవాడని తెలుస్తున్నది. కొన్ని గుహా చిత్రాల్లో, శిల్పాల్లో మనిషి ముఖంకంటె ముఖ్యంగా శిరోజాలనే పరిగణించడం కూడా కనిపిస్తుంది. శిరోజాలను అలంకరించడం కేవలం సౌందర్య దృష్టితో మాత్రమే అనుకోరాదు. అనేక సాంస్కృతిక సముదాయాలలో శిరోజాలంకరణ అంతస్తుకు గుర్తుగా కూడా ఉంటుంది ప్రతి సంస్కృతికి చెందిన సముదాయంలోను స్త్రీకి, పురుషుడికి వేరు వేరు శిరోజాలంకరణ కనిపిస్తుంది ఓమహా తెగవంటి కొందరిలో మాత్రం శిరోజాలంకరణ వయస్సుకు సంబంధించిన అంతస్తును సూచిస్తుంది. ఓమహా పిల్లలు మనలోని సాంప్రదాయక బ్రాహ్మణ కుటుంబంలోని పిల్లలలాగే తలగొరిగించుకొని అక్కడక్కడ కొంత జుట్టు మిగిలించుకుంటారు. కొందరిలో సమస్త అయ్యేంతవరకు జుట్టును వేలాడవేసుకొని, ఆ తర్వాత కొప్పు పెట్టుకోడం ఉంది. వెంట్రుకలను

అలంకరించడంలో కొన్ని విచిత్రమైన పద్ధతులు కూడా ఉన్నాయి. తెల్ల వెంట్రుకలు రాగానే పీకేసే అలవాటు కొందరికి. నల్లరంగు పూసుకోడం మరి కొందరికి అలవాటు. కేశ సంస్కారం సరిగ్గా చేసుకోక జడలు కట్టించు కొని రాగి రంగులోకి వచ్చేట్లు చేసుకునే వారు కొందరు. మెలనీషియన్లలో వల్లవెంట్రుకలను శుద్ధిచేసి కొంత ఎర్రరంగు వచ్చేట్లుగా చేసుకుంటారు

ఆదిమవాసుల్లో ఎరుపు రంగుకు ఎక్కువ ప్రాధాన్యం ఉంది. ఎక్కువ దూరానికి బాగా కనిపించే రంగుకావడం వల్ల దానికంత ప్రాధాన్యం వచ్చింది. పసుపు, నలుపు, నీలం, తెలుపు కూడా ఆదివాసుల్లో ఎక్కువగా వాడుకలో ఉన్న రంగులు. పండుగలు, మతాచరణలు మొదలైన సందర్భాలలో దేహం మీద రంగులు వేసుకొనే సంప్రదాయం ఉంది. ఈనాటికీ దసరావంటి సందర్భా లలో వేషాలు వేయడం ఉంది. ఆదివాసుల్లో ఇది మరింత ఎక్కువ. పచ్చబొట్టి పించుకొని, దాన్ని శాశ్వతంగా ఉంచుకోడం వాళ్ళలో పరిపాటి అయింది. నాగ రికులకు పచ్చబొడిపించుకోడమంటే నామోషి. కాని ఆదివాసుల్లో అంతస్తు పెరిగే కొద్దీ పచ్చ బొడిపించుకోడమూ ఎక్కువగా కనిపిస్తుంది. మరీ ఎక్కువ అంతస్తుకు చేరిన వారయితే ముఖంమీద, చేతులు కాళ్ళమీద, ఇంకా ఉత్సాహం మితిమీరితే నాలుక మీద కూడా వేయించుకునే వారున్నారు. ఒంటి మీద గాయాలు చేసుకోడం, బొబ్బలు చేసుకోడం, వాతలు పెట్టుకోడం సౌందర్యంగా భావించే వారు ప్రపంచంలో చాలా చోట్ల ఉన్నారు.

దేహం మీద వేసుకునే రంగులు, చేసుకొనే గాయాలు ఒకరకమైతే ఆభరణాలవంటి ఇతర పదార్థాలను దేహానికి తగిలించుకోడం మరొకరకం. రెండు ముక్కు పుటాలనుచేర్చి పొడుచుకునే వారు కొందరు, చెవులకు పెద్ద చిల్లులు పొడుచుకునే వారు కొందరు. ఈ చిల్లుల్లోకి ఎముకల్ని, ఈకల్ని, కొయ్యముక్కల్ని, లోహ సంబంధమైన ఆభరణాల్ని దూర్చుకుంటారు దక్షిణ అమెరికాలోని ఇంకాలు, ఉగాండా మొదలైన ఆఫ్రికా తెగలవారు చెవుల చిల్లుల్ని ఆరేడు అంగుళాల వెడల్పుండే ఆభరణాలను పెట్టుకునేంతగా పెద్దవి చేసుకుంటారు. దంతాలకు నల్లరంగు వేసుకోడం, పళ్ళు రాలగొట్టుకోడం కూడా సౌందర్యానికి చిహ్నంగా భావించే జాతులున్నాయి. ఏది ఏమైనా దైహికంగా పోగొట్టుకున్న దాన్ని ఈ ప్రాచీన తెగలవారు సామూహికంగా

పొందుతారన్నది నిజం. దైహికమైన ఈ విధమైన అలంకరణాలు మొదలైనవి వివేకవంతమైనవి కాకపోవచ్చు. కాని వాటివల్ల ఆదివాసులకొక విధమైన తృప్తికలుగుతుంది.[4] తృప్తి పొందడానికి మానవుడు చేసే అనేక ప్రయత్నాలే వివిధ వేషభూషణాలంకరణాలు రూపొందడానికి కారణమయ్యాయి.

టిప్పణి

1. "Petr Bogatyrer categorizes magical, religious, regional and national, age - group, erotic, and everyday functions of traditional attire. The form of the costume reflects its particular function" - Richard M. Dorson, *Folklore and Folklife*, 1972, p. 25.

2. A typical narrow - gauge definition is the following : "Folk costume in the present context means the dress of the rural population in the time before the changing of the dress custom in the nineteenth century, which at that juncture erased the difference between town and country, between higher and lower estates". This peasant costume "was the subject of a set of rules, in every detail prescribing the correct costume for every situation likely to be encountered by a member of the old village community in the course of the year and a whole life." – As quoted in *Folklore and Folklife*, 1972, p. 296.

3. A favored tale among anthropologists is that of Baron von Nordenskiold, who in his Amazonian travels undertook to purchase the facial plugs of a Botocudo woman, who stood all unabashed in customary nudity before him. Only irresistible offers of trade goods at long last tempted her to remove and hand over her labrets. When thus stripped of her

proper raiment, she fled in shame and confusion into the jungle. After all, the close identification between the Botocudo as a person and the botocudo as a plug in such that to become unplugged is most un-Botocudo" – E. Adamson Hoebel, *Man in the Primitive World,* 1958, p 240.

4. "...What is lost physically is gained socially. Mind triumphs over matter. No matter if the psychic satisfactions are not rational. The need that is met is elemental. The fashion and jewelry industries, the cosmetic manufacturers and purveyors, the beauticians, all may rest secure that their services have a future - as long as all mankinds" - E,Adamson Hoebel, *Man in the Primitive World,* 1958, p. 251.

# చిత్రకళ - శిల్పం - చేతిపనులు - గృహనిర్మాణం

చిత్రకళ, శిల్పం మొదలైనవి ఒక విధంగా జానపద కళలని చెప్పదగినవే. అయినా వాటిలో వస్తువు లేనిదే అసలు పని జరగదు కాబట్టి వస్తు సంస్కృతి కిందనే వాటిని చేర్చడం జరిగింది. సంగీతం, నృత్యం, నాటకం అనే మూడింటికి సంబంధించిన వాటిని మాత్రం జానపద కళలనే పారిభాషిక పదం కింద చెప్పడం పరిపాటి. చిత్రకళ, శిల్పం మొదలైనవి ప్రకృతిలోని వస్తువుల్ని ఉపయోగించుకొని జానపదులు వాటిని ఏ విధంగా తీర్చిదిద్దుతారనేందుకు ఉదాహరణలుగా ఉంటాయి.

## చిత్రకళ పుట్టుపూర్వోత్తరాలు :

గుహాలలో నివసిస్తుండిన నాడే మానవుడు చిత్రాలను గీసేవాడు అలాంటి చిత్రాలుకొన్ని ఈనాటికి కూడా గుహల్లో కనిపిస్తాయి. మాట్లాడాల్సిన దాన్ని రాతమూలంగా చెప్పాలనే భావం మానవునికి కలిగిన నాడు కూడా మొదట అతను వాడింది కూడా చిత్రరూపలిపే. జానపదులచిత్రకళ అనేక వేల సంవత్సరాలనుంచి ఒక తరంనుంచి మరొక తరానికి సంక్రమిస్తూ వస్తున్నది. మనిషికుండే నమ్మకాలను, మత సంప్రదాయాలను, జీవన పద్ధతుల్ని ప్రాచీన చిత్రకళ ప్రతిబింబిస్తుంది. వేట ప్రధాన వృత్తిగా కలిగి ఉండిన మానవుని జీవిత సమరాన్ని మార్మికంగా తెలియబరుస్తుంది గుహాంతరాళాల లోని చిత్ర పరంపర.

భారతదేశంలో చిత్రకళ చరిత్రకూడా చాలా ప్రాచీనమైనది. సింధూ నాగరికతకు సంబంధించిన అవశేషాలలో మత సంబంధమైన బొమ్మలు, మాతృదేవత విగ్రహాలు ఉన్నాయి. ఈనాటికీ మట్టితో, కొయ్యతో, లోహాలతో తయారు చేసే జానపద విగ్రహాలు మాతృదేవతారాధనను, సంతానోత్పత్తికి

సంబంధించిన ఆచారాలను ప్రతిబింబించేవిగా ఉన్నాయి. ఇవన్నీ చరిత్ర పూర్వ యుగాలలోని మానవుని సంప్రదాయాలను సాంకేతికంగా తెలియజేస్తూ, ఆనాటి మానవుని జీవిత విధానాన్ని ప్రతిబింబిస్తున్నాయి. ఈనాటికీ జానపదులు ప్రత్యేకంగా చిత్రకళలో కృషి చేస్తున్నారని చెప్పకపోయినా ఉడుపుల్లో, రంగ వల్లులలో, గృహాలంకరణలో, పాత్రలు, ఇతరసామానులు మొదలైన వాటిలో తమ స్వచ్ఛమైన కళాభిరుచిని వ్యక్తం చేస్తూనే వుంటారు. యుగయుగాలనుంచి జానపదుల అభిరుచిని వ్యక్తం చేసే చిత్రకళారూపాలుపునర్నిర్మాణం చెందు తూనే ఉన్నా అవి ఇంకా కొత్తదనం కలిగిఉండడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఉదాహరణకు నేటి గృహాలంకరణల్లో దుస్తుల మీద, ఇతర చిత్రకళా సంప్ర దాయాల్లో కూడా జానపద శైలిని వాడడం ఫాషనై పోయింది. సరళమైన రంగుల మిశ్రణం, సున్నితమైన వాడుక, స్వచ్ఛమైన ముగ్ధరూపాలు అనంత వైవిధ్యంతో అలరించ గలవని ఈ నాటికీ నిరూపితమవుతున్నది.

దక్షిణదేశంలో చిత్రకళ సంప్రదాయానికి కొన్ని వందల సంవత్సరాల చరిత్ర ఉంది. ఆంధ్రుల కలంకారీ సంప్రదాయం దక్షిణభారత దేశంలో ప్రాచీనమైనదిగా పేరుపొందింది. దీని ప్రభావం ఇతర దాక్షిణాత్య ప్రాంతాల మీద కూడా వుంది. కర్నాటకంలోని రాజవంశాలు జానపద చిత్రకళనుకూడా పోషించాయి, 'శ్రీతత్త్వనిధి' అనే పేరుగల 1160 పుటల బృహద్గ్రంథంలో అపూర్వమైన 1888 వర్ణచిత్రాలు, 458 రేఖాచిత్రాలు ఉన్నాయి. ఇది చిత్ర కళారూపాల వైవిధ్యాన్ని తెలుసుకోడానికి అత్యుత్తమ ఆకర గ్రంథం (చూ. కన్నడ విశ్వకోశ సం. 7 పు. 677). హైదరాలీ కాలంలో శ్రీరంగ పట్టణంలో వెలసిన కుడ్య చిత్రాలు దేశీయ శైలిలోనే ఉన్నాయి.

చిత్రకళ అంటే ఏమిటి? అన్నదానికి సమాధానం చెప్పవచ్చునేమో కాని జానపద చిత్రకళ మామూలు చిత్రకళ నుంచి ఏ విధంగా వేరవుతుందో చెప్పమంటే చెప్పడం కష్టమే. హోబెల్ చెప్పినట్లు జానపదుల చిత్రకళ జాన పద చిత్రకళ అనవచ్చు (ఆదివాసుల చిత్రకళే ఆదివాసి చిత్రకళ అంటాడు హోబెల్–1958 : 253). తన పరిసరాలను సౌందర్యంతో నింపాలనే ఉత్సు కత మనిషికి సహజంగా ఉంటుంది. తిండి, బట్ట అన్న ప్రాథమిక అవసరాలు అయిన తర్వాత మానవ జీవితంలో కళ అన్నది ప్రవేశిస్తుంది. తిండి, బట్టను

గురించి కొంతసేపు ఆలోచించిన తర్వాత అతని మనస్సు సుఖ సంతోషాల వైపు పరుగెడుతుంది. కళావిహీనమైన జీవితమంటే మానవత్వం లేని జీవిత మన్నమాట. చిత్రకళ అన్నది రేఖల్లో, రూపాల్లో, వర్ణాల్లో, గుహల గోడల మీద, రాళ్ళమీద, చెట్లమీద. నేలమీద, కాయితాలమీద, శాసనాల మీద, ఆకులమీద, శరీరం మీద, దుస్తులమీద వ్యక్తం కావచ్చు. చిత్రకళగాని మరే కళగాని మొట్టమొదట ప్రయోజనం మానసికమైన ఒత్తిడిని తగ్గించడం. కళా కారుని భావావేశాన్ని తగ్గించి అతనికి కళ ఉల్లాసాన్ని కలిగిస్తుంది. చిత్రకళను అభివ్యక్తిరూపంగా చేయాలనుకునే వ్యక్తికి కావలసిన ప్రేరణ ప్రకృతినుంచి దొరకవచ్చు. అది తన అంతఃప్రేరణకూడా కావచ్చు. పిచ్చిగీతల్లో కూడా ఒక మనిషి జీవితమంతా అడగి వుండే అవకాశముంది. మనిషి మనస్తత్త్వం లోని లోతుల్ని తెలుసుకోడానికి చిత్రకళ ఉపయోగించ వచ్చు. కళ అన్నది వైయక్తికమని మనమనుకుంటాంగాని జానపద స్థాయిలో అది సామాజికమే. జానపదుడు తన చిత్రాల ద్వారా ఒక జనసముదాయానికి చెందిన నమ్మకాలను జీవన విధానాన్ని సుఖదుఃఖాలను ప్రతిబింబిస్తాడు. సామాజిక ప్రాధాన్యం గల జానపద చిత్రకళ ఆయా సంస్కృతులకు ప్రతినిధిగా ఉంటుందని చెప్తే తప్పు లేదు. మనిషి సామాజిక ప్రాణి కాబట్టి చిత్రకళ వైయక్తికంగా అతనికి సంతోషం కలిగించడం మాత్రమేకాక, అది సమాజం యొక్క సామూహిక అభివ్యక్తిగా ఉంటుంది.

ప్రాచీన చిత్రకళను, జానపద చిత్రరేఖలను చాలా సరళమైనవని చెప్పడం కూడా కొన్ని సందర్భాలలో సరికాదు. కొన్ని జానపద కళారూపాల అర్థం, పరమార్థం మనకు బోధపడనంత సంకీర్ణంగా ఉంటాయి. కొన్ని మరీ పసిపిల్లల రాతల్లాగా కనిపించినా వాటిలోని మార్మికత్వం లోతులు తరచిచూస్తే గాని తెలిసేది కాదు. ప్రకృతిని ఉన్నదున్నట్లుగా సూచిస్తుందని కూడా జాన పద చిత్రకళను గురించి చెప్పడానికి వీలు లేదు. కొన్ని ప్రాచీన చిత్రాలలో శైలి మానవ జీవితం లోని వైవిధ్యాన్ని అత్యంత ధ్వని పూర్వకంగా చూపిస్తుంది. బాలిశ రూపాల నుంచి ప్రౌఢరూపాల వరకు, సరళచిత్రాలనుంచి సంక్లిష్ట చిత్రాల వరకు, సరూప చిత్రాలనుంచి నిరూప చిత్రాల వరకు అన్ని రకాలు జానపద చిత్రకళలో దర్శన మిస్తాయి.

బుష్‌మన్ చిత్రకళ చాలా సహజం గాను, శక్తివంతం గాను ఉంటుంది. ఆస్ట్రేలియన్ ఆదివాసుల చిత్రకళ మంచిశైలితో, కొన్ని విషయాలలో నిరూపంగా, ప్రతీకాత్మకంగా ఉంటుంది. ఎస్కిమోల చిత్రకళ సహజంగా, సాంకేతికంగా పరిశీలించినపుడు శిష్టంగా ఉంటుంది (హోబెల్ 1958 : 254). ప్రాచీన చిత్రకళకు ప్రాతినిధ్యం వహించే ఇటీవలి చిత్రకళ కూడా ఉండవచ్చు. సౌందర్యపరంగా చూచినప్పుడు చిత్రకళ ప్రాచీన మానవ జాతికి చెందిందిగా కనిపించినా అది కాలపరంగా ప్రాచీనమై ఉండనక్కర లేదు.

చిత్రకళలో ప్రతీకలన్నవి ప్రాధాన్యం వహిస్తాయి. ఈ ప్రతీకలు రేఖలుగా, రంగులుగా, రూపాలుగా, తళతళలుగా ఉండవచ్చు. ప్రతీకాత్మక చిత్రకళ సహజ చిత్రకళకు విరుద్ధమైనది. శైలీవిన్యాసం, సాంప్రదాయికత్వం అన్నవి సహజ చిత్రకళకు, ప్రతీకాత్మక కళకు మధ్యలో ఉంటాయి. చిత్రకళలో ప్రతీకాత్మకత నుంచే సహజ చిత్రకళ ఉద్భవించిందని విద్వాంసుల భావన. ఇది ఏవిధంగాపరిణామం చెందిందన్నది మానవ శాస్త్రజ్ఞులలో జిజ్ఞాసను రేకెత్తింపంది. తర్వాత దీనికంటెకూడా ప్రతీకాత్మక చిత్రకళ ఏ పరిస్థితుల్లో ఉద్భవించింది, ఏ మానసిక స్థితిలోఉత్పత్తి అయిందన్నది ఎక్కువగా విద్వాంసుల దృష్టి నాకర్షించింది. అర్థంలేని పిచ్చిగీతలుగా ప్రాచీన చిత్రకళను భావించడానికి వీలులేదు. ప్రతి ప్రతీక వెనక జానపదుడు ఉద్దేశించిన అర్థం ఏదో ఒకటి ఉంటుంది. ప్రాచీనకాలపు మానవుడు వేట మృగాలను, సాధనాలను, వేటను, నృత్యాన్ని సంతోషాన్ని కొన్ని ప్రతీకల ద్వారా సూచించాడు.

ఆంధ్రుల చిత్రకళ :

ఆంధ్రుల చిత్రకళ సాధించిన పరమోత్కృష్టదశకు అజంతా చిత్రాలు ఉదాహరణాలని అనేకులు భావించినా దాన్ని సరిగ్గా నిర్ణయించడానికి తగిన సాధనాలు మాత్రంలేవు. నిశ్చితాభిప్రాయం ఏర్పడనప్పుడు అజంతా చిత్రాలను ఆధారంగా గ్రహించడానికి వీలులేదు. ఒకవేళ గ్రహించినా అవి చాలా వరకు శిష్టశైలికి సంబంధించినవనవచ్చు

అయితే జానపదులకు సంబంధించిన చిత్రకళ తెలుగుభాష పుట్టినప్పటి నుంచి ఉండి ఉండాలి. ఎందుకంటే తెలుగువారు అవతరించక పూర్వమే ప్రాచీనమానవులకు చిత్రకళ ఉండేదన్నది సత్యం. జానపదులలో తరతరాలుగా సంక్రమించే కళారూపాలకు ఖచ్చితమైన కాలమంటూ లేదు కాబట్టి చిత్రకళకు కాలాన్ని నిర్ణయించలేము.

అభిలషితార్థ చింతామణివంటి గ్రంథాలలో ఆంధ్ర-కర్ణాటకాలకు చెందిన చిత్రకళ, శిల్పం వంటి వాటిని గురించి అనేక విషయాలు చెప్పబడ్డాయి. శిల్పం, చిత్రకళ మొదలైనవి బ్రాహ్మణేతరుల కళలని అభిలషితార్థ చింతామణి పీఠికలో చెప్పబడింది. ఆ కాలంలో ప్రతి ఇంటిగోడ చిత్తరువులతో కళకళలాడుతుండేది. ఆలేఖ్యకర్మను గూర్చి సోమేశ్వరుడు అభిలషితార్థ చింతామణిలో సుమారు నూరు పుటలు రాశాడు. ఇంతకంటే మేలైన చిత్రలేఖనశాస్త్రం అంత పాతది మనలో లేనేలేదు. ''ఇందు చేతిచిత్రముల కవసరమగు రంగులను సిద్ధము చేసుకొనుటను మొదలు తెలిపినారు. గోడపై మంచి గట్టి గచ్చుతో చదును చేయవలెను. దున్నపోతుతోలు కత్తిరించి ముక్కలుచేసి నీళ్ళలో అవి మెత్తనగువరకు కొన్ని దినాలు నానబెట్టి దాని మడ్డిని తీసుకొని వెన్నవలెమెత్తబరచి దానిని లేపనముగా వాడుకొనవలెను. నీలగిరిలో లభించు శంఖచూర్ణము దానిలో కలుపవలెను. సన్నని వెదురు కొనకు రాగి పొన్నువేసి దానిని వర్తిక (బ్రష్‌గా) వాడుకొనవలెను. వివిధమగు రంగులలో శ్వేతము, రక్తము, లోహితము, గైరికం, పీతము, హరితాళము, నీలము, మున్నగునవి కలవు. వాటి నెట్లు సిద్ధము చేసుకొనవలెనో వివరముగా తెలిపినారు. వివిధ దేవతలు, మానవులు, జంతువులు, ఏయే ప్రమాణములలో నెట్లుండవలెనో చాలా వివరముగా తెలిపినారు (సురవరం ప్రతాపరెడ్డి, రెం. ము॥ పు. 32) తెలుగువారి సంస్కృతికి సంబంధించిన అనేక విషయాలను తెలిపిన నన్నెచోడుడు చిత్రకళను కూడా వదలలేదు. ఇండ్ల ఇడుపులపైన చిత్రాలు రచించేవారని నన్నెచోడుడు, శ్రీనాథుడు కూడా రాశారు. ''చిత్తసాధనంబులుగొని పలక ఘట్టించి మెరుంగిడి త్రివటించి తిట్టంబు కొలదికిందెచ్చి ఋజ్వాంగతంబున రేఖనూల్కొలిపి పత్రిక బిందు నిమ్నోన్నతాపాంగ మానోన్మానంబులలవరచి సలక్షణంబుగా చిత్రించిన" పైనాన్ని నన్నెచోడుడు వర్ణించాడు (5-118). తర్వాతి కాలంలో కూడా ఇళ్ళగోడలపైన చితరువులు వ్రాయి

జానపదచిత్రకళాసంపద :

తెలుగువారి అచ్చమైన జానపద చిత్రకళ ముఖ్యంగా కలంకారి మొదలైన దేశీయ కుశల కళలవల్ల వ్యక్తమవుతుంది. రెడ్డిరాజులకాలంనుంచి కూడా తెలుగు వారికి రంగులఅద్దకంలో విశేషమైన అనుభవం ఉన్నట్లుగా శ్రీనాథాదుల కావ్యాలవల్లతెలుస్తున్నది. ఆంధ్రదేశమంతటా ఈ పరిశ్రమ వ్యాపించి ఉండినా, విశేషంగా ఉత్తర సర్కారుల్లో, అందులోనూ బందరులో ఇది కేంద్రీకృతమై ఉండేది. అప్పట్లో రంగులకు దేశీయమైన వస్తువులే వాడే వారు. అద్దకంపనిచేసేవారికి ఉర్దూలోకూడా రంగ్రేజీ అనేపేరు ఏర్పడి అది ఒక కులానికి కూడా పేరయింది. జీన్‌గర్ అన్న పేరుకూడా ఇలావచ్చిందే



విగ్రహశిల్ప నిర్మాణచతురుడు జీనిగల రమణయ్య

అంటారు. జీనిగలవారుకూడా బొమ్మలు. రంగుపనులుచేస్తూ కళాకారులుగా నేటికీ జీవిస్తున్నారు. నెల్లూరులో జీనిగల వీధికూడా ఉంది. కర్నూలులో రంగ్రేజీవారికొక వీధిఉంది. నెల్లూరులో జీనిగలవాళ్ళుమాత్రం అపదానికి వేరే అర్థం చెప్తారు. గుర్రాలకు జీనులు చేసేవారని, కుట్టుపని, చమ్కీపని చేసి పేరు పొందడంచేత ఆపేరు వచ్చిందని చెప్పుకుంటారు.

కలంకారీకి ఆధునిక పరిభాషలో బాటిక్ చిత్రకళ అనిపేరు. దీనికి వాడే రంగులను ఆకులు, పువ్వులు, చెక్కలు, వేళ్ళు, బెరళ్ళతో తయారుచేస్తారు. మూడు నాలుగు రకాల రంగులతోనే వైవిధ్యాన్ని, సౌందర్యాన్ని తీసుకువచ్చే జాణతనం అద్దకపు పనివానిది. రంగులు గుడ్డలమీద స్థిరంగా ఉండడానికిపటిక రసాన్ని ఉపయోగిస్తారు. ఎరుపు, నలుపు, పసుపు, నీలి మూలవర్ణాలు. అద్దకం పనికి వాడేకలం లేక కుంచె చూడడానికి సామాన్యంగా ఉన్నావాని ఉపయోగం ఇందులో చాలా చాలా ప్రధానమైంది. ఒక చివరకూరిగా ఉండే అరంగుళాల వెదురుకడ్డీతీసుకొని, ఒకవైపున వెంట్రుకలతో కుంచెమాదిరి కడతారు. నూలు దారంకూడా చుట్టవచ్చు. దాన్ని రంగులో ముంచినప్పుడు అది రంగును పీల్చు కుంటుంది. ఈకళలోవాడేవి నిజానికి నీటిరంగులైనా చూడడానికి అవితైల వర్ణ చిత్రాలలాగా ఉంటాయి.

ఆంధ్రదేశంలో చేనేత వృత్తి మీదజీవించేవాళ్ళు పద్మశాలీలు, దేవాంగులు, తొగటవారు, సాలెవారు, సేనాపతులు, కరిణభక్తులు మొదలైనవారు. పెద్దవైన ప్రతిఊరిలో సాలెవీధులుంటాయి. నేడురంగుల వస్త్రాలునేయడానికి ఇండెంత్రీన్ రంగులను గాని నెఫ్తాల్ రంగులనుగాని వాడుతున్నారు. కాని పూర్వం నేతపని వాళ్ళే రంగులను తయారుచేసుకునేవారు. నీలియొక్క విత్తనాలను, ఆకులను పెద్దకుండల్లో ఊరబెట్టి పై తేట తీసుకొని నూలుకు అద్దితే నీలంరంగు తయారయ్యేవి. నీలిరంగు కుండల్ని అమ్మవారితో సమానంగా చూచుకునే వారు. ఇట్లే ఎరుపు రంగు మొదలైనవి తయారుచేసుకునే వారు. అంచులను రూపొందించడంలో నేత పనివారి కళాత్మక దృష్టి వ్యక్తమవుతుంది. నెమలి కమ్మంచు, మామిడి పిందెలంచు, కోటకొమ్మంచు, కాకరపువ్వంచు, కళావ రంచు మొదలైనవి జానపదులు మెచ్చిన విన్యాసాలు.

పైదంతా దుస్తులకు సంబంధించిన కళను గూర్చినది. వేరు విధంగా కూడా జానపదులు తమ చిత్రాకళా నైపుణ్యాన్ని ప్రదర్శిస్తారు. వీటిలో ముఖ్యంగా ముగ్గులను గూర్చి చెప్పుకోవాలి. భారతీయుల సాంస్కృతిక జీవనంలో రంగవల్లికి ఉండే ప్రాధాన్యం ఎన్నదగింది. పండుగలకు వేసే రకరకాల ముగ్గులు సాంకేతికంగా కూడా ఎంతో విలువకలవి. భారతీయుల సంస్కృతిలోని వివిధాంశాలను, జీవనంలోని అనేక ఘట్టాలను ప్రతిబింబించేవిగా ఉంటాయి ముగ్గులు. సంక్రాంతి మొదలైన శుభసమయాలు రంగవల్లులు తీర్చి దిద్దడానికి ప్రత్యేక సందర్భాలు. సంక్రాతి ముగ్గులు అన్నవే ఒకరి శిష్ట సంప్రదాయంగా రూపొంది తెలుగు సంస్కృతికి అద్దంపడుతున్నాయి. బియ్యం పిండితో పెట్టే ముగ్గులు ఒకరకం, ముగ్గుపిండిని వాడేది మరొక రకం. పల్లెటూళ్ళలోనే కాక పట్టణాల్లో కూడా ముగ్గురాళ్ళు, ముగ్గుపిండి అమ్ముతూ వచ్చేవారు అప్పుడప్పుడూ దర్శన మిస్తుంటారు. సుద్దను వేరే రంగులతో కూడా కలిపి అమ్మడమూ కద్దు. కెంపు, పచ్చ, నీలం, పసుపు రంగుల ముగ్గుపిండితో తీర్చిదిద్దిన రంగవల్లులు అంగరంగవైభోగంగా కన్నుల విందు చేస్తాయి. పట్టణాలలో 'వీధివాకిలి' చిమ్మి, నీళ్ళుచల్లి పొద్దునే ఒక ముగ్గు వెయ్యడం తెలుగింటి ఆడబడుచుల నిత్యకృత్యం. ఆంధ్రరాష్ట్రం వదిలి పరరాష్ట్రాలకు వెళ్ళినా కూడా తెలుగు వారి ఈ సంప్రదాయం మాత్రం వదలదు. ఒకవేళ ఎక్కడా చోటు లేకపోతే తులిశమ్మ కోట (తులిసి) దగ్గరైనా కొంచెం నీళ్ళు చల్లి ముగ్గువెయ్యకపోతే తెలుగు స్త్రీకి తృప్తిఉండదు. పెళ్ళికి ముందు పెళ్ళికూతురు ఎదుర్కోవలసిన పరీక్షలలో ఇంతకు ముందు ముగ్గులు వేయడం కూడా ఒకటిగా ఉండేది. ఈనాడు అలాంటి పరీక్షలు లేకున్నా పత్రికలు, తెలుగు సంఘాలు జరిపే ముగ్గుల పోటీలను గురించి అప్పుడప్పుడు వింటూ ఉంటాం. పదిరకాల ముగ్గులయినా రాని తెలుగు స్త్రీలు ఉండరంటే అతిశయోక్తికాదు. ముగ్గుల్లో పువ్వులు, ఆకులు, లతలు, దేవాలయాలు, రథాలు, చిలుకలు సూర్యచంద్రులు, విమానాలు, పక్షులు ఒక్కటేమిటి సమస్త ప్రకృతి ప్రతిబింబిస్తుంటుంది. ఒక్కొక్క సందర్భానికి తగిన ముగ్గులున్నాయి. రథసప్తమికి ఒక రకమైన ముగ్గు, వైకుంఠ ఏకాదశికి మరొకరకమైన ముగ్గు, సంక్రాంతికి రకరకాల ముగ్గులు తెలుగువారి ప్రత్యేకత

పచ్చపొడుపు కూడా చిత్రకళలో భాగమే. ప్రపంచంలోని అన్ని ప్రాంతాలలో ఏదో ఒక రకమైన పచ్చపొడుపు, ఒంటిని రంగులతో అలంకరించుకోడం కనిపిస్తుంది. తెలుగుదేశంలో పచ్చ పొడిచే గిరిజన జాతులవారు అనేకులున్నారు. పట్టణాలవారికి దీనితో ఎక్కువ పరిచయంలేదు గాని, గ్రామీణ జానపదులు ఏదో ఒక దేహాంగంలో పచ్చపొడిపించుకొని తమ శరీరంమీద శాశ్వతంగా చిత్రకళకు స్థానం కల్పిస్తారు చేతులమీద కృష్ణుణ్ణో. రాముణ్ణో పొడిపించుకొనేవారు కొందరు. వైధవ్యం ప్రాప్తించనేకూడదని నుదుట పచ్చ బొట్టు పొడిపించుకొనే వారు కొందరు. బుగ్గనచుక్కను అందంకోసం పొడిపించుకొనేవారు కొందరు, ఇష్టమైన వారి పేరును చేతిమీదనో, ఛాతీమీదనో, వీపు మీదనో శాశ్వతంగా పొడిపించుకొనే వారు మరికొందరు. పచ్చబొట్ల వారనే పేరుతో ఒక కులమే ఉంది. సూదులను, ఎముకలను, ముళ్ళను రంగు పొడపడానికి వాడుతారు. కొన్నిచోట్ల నల్లరంగు, మనలో పచ్చరంగు, మరి కొన్ని ప్రాంతాల్లో ఊదారంగు వాడుతారు. మొహమంతా వికృతంగా (వారి పాలిటికి అందంగా) పచ్చపొడిపించుకునే తెగలున్నాయి. ఒంటిమీద ఎంత ఎక్కువగా పచ్చపొడిపించుకుంటే అంత అంతస్తును తెలుపుతుందని భావించే తెగలున్నాయి.

## ఒకనాటి వైభవం

'గత కాలముమేలు వచ్చుకాలము కంటెన్' అన్నది మనం ఒప్పుకో కూడనిది, అనుసరించ తగనిది అయినా, కొన్ని విషయాల్లో గత వైభవాన్ని తలచుకున్నప్పుడు మనం ఆ వైభవాన్ని ఎందుకు కార్యరూపంలో పెట్టడం లేదా అని బాధవేస్తుంది. ఒకనాడు ఆంధ్రుల కలంకారీ కళ ప్రపంచంలోని వివిధ ప్రాంతాలలో నివాళులందుకుంది. ఒక్క బందరులోనే ఆ రోజుల్లో ఎనిమిది వేలమంది అద్దకపు చిత్రకారులుండే వారని తెలుస్తున్నది. బట్టలను చలవ చేయడం, కరక్కాయ రసంపాలలో ఉడకబెట్టి ఉగ్గులు చేయడం, రేఖారచన చేయడం, పటికను దుద్దడం, కుంచెతో రంగులు అద్దడం - ఈ పన్లను విభజించుకొని సమాహారకళగా తీర్చిదిద్ది విదేశాలలో కూడా గిరాకీల నేర్పరచుకున్న కలంకారీ వర్తకుల్ని మొగలాయీలు, గోల్కొండ నవాబులు, తర్వాత ఈస్టిండియా కంపెనీవారు నాశనం చేశారు. వారు వృత్తిని వదలి వేసేంతగా పీడిం

చారు. అయినా ఈనాటికీ కలంకారీ కొంతవరకైనా నిలిచి వుందంటే తమ కళల మీద ఆంధ్రులకుండే అభిమానాన్ని మెచ్చుకోవాలి.

ప్రపంచంలోని బుద్ధుని చిత్రాలన్నీ ఒకేరకంగా ఉంటాయి. కనీసం పోలికలయినా వుంటాయి. దీని కంతటికీ మూలకారకుడయిన చిత్రకారుడు తెలుగు దేశం వాడని ఒక వూహావుంది (రాంభట్ల కృష్ణమూర్తి, ఆంధ్రప్రదేశ్ దర్శిని, 1976 : 975).

రెండువేల ఆరుపందల సంవత్సరాలనాడు బీహారులోని రాజగృహానికి కొంపరు వర్తకులు తెలుగుదేశం నుంచి వెళ్ళారట : వారిలో ఒక చిత్రకారు డున్నాడు. కృష్ణాతీర వర్తకులు బుద్ధదేవుని దర్శనానికి వెళ్ళారు. బుద్ధుని ప్రసన్న గంభీర వదనాన్ని చూచిన మన యువచిత్రకారునికి ఒళ్ళు గగుర్పొడిచి బుద్ధదేవుని అనుమతితో చిత్రాన్ని గీయడానికి ఉపక్రమించాడు. యువ చిత్రకారుని కౌశలాన్ని, ఉపాయాన్ని చూచిన బుద్ధదేవుని కన్నులలో కరుణ, పెదవులపై చిరునవ్వు వెలిశాయి. ఆ కన్నులు, ఆ పెదవులు మృదుమధుర గంభీర భంగిమలో బుద్ధదేవుని చిత్రాలకు, ప్రతిమలకు మూలమయ్యాయి. బుద్ధదేవుని నీడపట్టి తెలుగు చిత్రకారుడు రచించిన తొలిచిత్రమే తర్వాత అన్ని బుద్ధ చిత్రాలకు మూలమై ఉండవచ్చుననే కథకు కాళ్ళులేకున్నా, ఈ విధమైన ఊహే తెలుగు వారిలో పులకరింతల్ని రేపుతుంది.

కొమరు ప్రాయంపు నూనూగు కొదమ యెండ అనే కుంచెతో ఈ జగత్తును తిరిగి చిత్రిస్తున్న సహస్ర కిరణుని వర్ణనలో శ్రీనాథునికి చిత్ర కళతో వుండిన పరిచయం వ్యక్తమవుతున్నది. జానపదులనుంచి శిష్టచిత్ర కారులవరకు ఎంతమంది రంగులు కలుపుతుండగా శ్రీనాథుడు చూచాడో !

తరిపి వెన్నెలలోని లావణ్య మొకకొంత
నవ సుధాకర్దమద్రవము గాగ
చిన్నారి పొన్నారి చిరుత చీకటి చాయ
అసలు కాల్చిన మషీరసము గాగ

నిదుర మేల్కాంచిన నెత్తమ్మి మొగడల
తోరంపు పుప్పొళ్ళ అరిదళముగ
తొగరు వన్నియ లేత తొలిపంజె కెంజాయ
కమనీయ ధాతురాగంబుగాగ.........

వర్ణరంజితమైనది తెలుగువారి జీవితం; తెలుగు చిత్రకారుల జీవితం; తెలుగు కవుల జీవితం.

శిల్పం - చేతిపనులు

ఉలితీసుకొని జీవంలేని శిలలను సజీవమూర్తుల వంటి శిల్పాలుగా మలిచే వారందరూ జానపదులే. అయినా శిల్పశాస్త్రం అనంతంగా పెరిగిపోయి జానపదులచేత కూడా శిష్టశిల్పాలు అవతరించేట్లు చేసింది. అమరావతి. ఓరుగల్లు, విజయనగరం, లేపాక్షి మొదలైన చోట్ల వెలసిన శిల్పం ఆంధ్రుల మహోన్నత సంస్కృతికి దర్పణంగా ఉంది. ఇది ఒకరకమైతే కొండపల్లి బొమ్మలలో, గ్రామదేవతల చెక్కడాలలో ఇంటింటి ముంగిళ్ళలో. లోగిళ్ళలో. ద్వారబంధాలపైన. ఉత్సవ విగ్రహాలలో, లక్కపిడతలలో జానపదుల శిల్పకళ అచ్చమైన సంస్కృతికి తార్కాణంగా, శిల్పకళా వికాసంలోని ప్రాథమిక దశకు ఉదాహరణగా నేటికీ నిలిచి వుంది.

ఆర్. ఎస్. బాగ్స్ తన వర్గీకరణలో (జానపద విజ్ఞాన నిఘంటువు) Art – craft రెండింటినీ ఒక్క వర్గంలో చేర్చి విభజన క్రమాన్ని సూచించాడు. వాస్తువును, గృహనిర్మాణాన్ని ప్రత్యేక వర్గంగాచేశాడు. చిత్రకళ సాధనాలు, శిల్పం, బొమ్మలు, సంగీత వాద్యాలు, దుస్తులు, మొదలైనవాటిని ఇక్కడే చేర్చాడు.

M 200 చిత్రకళ చేతిపనులు

M 220 మూలద్రవ్యాలు

లోహసంబంధమైనవి, శిలాసంబంధమైనవి, అస్థిసంబంధమైనవి వీటిలో బంగారు, వెండి, రాగి, ఇనుము, రాయి, రత్నాలు, ఎముకలు, దంతం, కొమ్ము మొదలైన వాటిని చేర్చవచ్చు.

M 223 కొయ్య, వృక్షసంబంధాలు

M 224 చర్మం, ఉన్ని, రెక్కలు

M 225 విత్తనాలు, పగడాలు, గవ్వలు, దంతాలు

M 226 సున్నం, సుద్ద వంటివి

M 227 నేత వస్తువులు

ఉన్ని, పన్ని, జనుము, పట్టు మొదలయినవి

M 228 మనిషిదేహం, జంతువుదేహం

రంగులు పూసుకోడం, పచ్చపొడిపించుకోడం, వాతలు పెట్టుకోడం మొదలయినవి.

(పైవన్నీ మూలద్రవ్యాలకు సంబంధించినవి)

M 240 తయారుచేసిన పదార్థాలు

M 242 వృత్తిపరమైనవి (ఉపకరణాలతో కూడా)

యుద్ధం, వేట, చేపలు పట్టడం, వ్యవసాయం, పాడి మొదలైన వాటికి సంబంధించినవి

M 243 గృహోపకరణాలు, వాటి నిర్మాణం.

కళాత్మకమైన చెక్కడపుపనులు మొ॥వి.

M 244 బొమ్మలు

M 245 ముఖాలంకరణలు (మాస్క్ మొ॥వి)

M 246 సంగీత వాద్యాలు

తయారు చేయడానికి ఉపయోగించే సాధనాలు, ఉపయోగించేపద్ధతి, వివిధ కళలలో వాద్యాల ఉపయోగం మొదలైనవి.

M 247 రవాణాకు ఉపయోగించేవి.

మనుష్యులకు సంబంధించినవి, జంతువులు,బండ్లు మొ॥వి. యాంత్రికమైన రవాణాపద్ధతులు, పడవలు మొదలైనవి.

M 248 దుస్తులు

శిరస్సుకు, ఇతర దేహాంగాలకు, ఊర్ధ్వదేహం,అధోదేహం, చేతులు, కాళ్ళు, అర చేతులు, పాదాలు.

M 280 వర్ణ విన్యాసాలు

వేరేవేరే కళల్లో ఉపయోగించే వర్ణాలు, నేతపనికి, బొమ్మలకు, శిల్పాలకు, గోడలకు మొ॥ ఉపయోగించేవి.

జానపద శిల్పం

స్వరూపం, స్వభావం : జానపద శిల్పమంటే ఏమిటి, అది శిష్టశిల్పం కంటె ఏ విధంగా భిన్నమైంది- అనే విషయంపై కొంత మంది విద్వాంసులు ఆలోచన ప్రసరించారు. మౌఖిక విజ్ఞానం విషయంలో అయితే అది అలిఖితంగా ఉండాలని, వాక్సంప్రదాయంలోనే తరతరాలనుంచి అది సంక్రమించి ఉండాలని చెప్పడంలో అర్థముంది. కాని శిల్పం, చిత్రకళలు, చేతిపనులు మొదలైన విషయాలలో ఇలాంటి నియమాలను విధించడం సాధ్యం కాదు. ఒకటి మాత్రం చెప్పవచ్చు. శిష్టశిల్పానికి శాస్త్రాల సహాయం కూడా ఉంటుంది కాని జానపద శిల్పానికి పరంపరాగతంగా వచ్చిన కౌశలమే జీవగర్ర. ఆదివాసుల శిల్పానికి, గ్రామీణుల శిల్పానికి, నాగరికుల శిల్పానికి ఉండే భేదాన్ని స్పష్టమైన రేఖలద్వారా విభజించి చూపడానికి కూడా వీలుకాదు. ఒకవైపునుంచి మరొక వైపుకు భావనాస్రవంతి ప్రవహించడం అసాధ్యం. అసంభావ్యమేం కాదు.

జానపద శిల్పం, చేతిపనులు సరళభావాలను ప్రతిబింబిస్తాయని, సూక్ష్మ విషయాలకంటె స్థూల విషయాలకే ప్రాధాన్యం ఉంటుందని చెప్పవచ్చు. ఉపయోగించుకొనే సామగ్రి, విధానం, అభివ్యక్తి అనే మూడిట్లోను సూటిగా చెప్పే గుణాన్ని చూడవచ్చు. శిల్పాలనుగాని, బొమ్మలనుగాని తయారు చెయ్యడానికి రాయి, కొయ్య, మట్టి, పొట్టు, చింతగింజలు, మొదలైనవాటినే ఎక్కువగా ఉపయోగిస్తారు. సంకీర్ణమైన అలంకరణ విధానం, క్లిష్టమైన రచన ఎక్కువగా కనిపించవు. శిల్పం నాగరిక శిల్పిచేతిలో పడితే అది ఎక్కువగా వైయక్తిక శ్రేష్ఠతను సంతరించుకొంటుంది. కాని జానపద శిల్పంలో సామూహిక మనోభావానికే ఎక్కువ ప్రాధాన్యం ఉంటుంది. జానపద శిల్పంలో శిల్పి కంటె శిల్పం ముఖ్యం అనే భావం కనిపిస్తుంది. శిష్ట శిల్పానికి చేసే వాని 'అహం' జీవాన్నిస్తుంది. స్వయం ప్రేరణ లేనిదే శిష్ట శిల్పం చెక్కలేడు. తన ప్రతిభనంతా దాని ద్వారా చాటి చెప్పాలని చూస్తాడు.

కాని జానపదునికి వస్తునిష్ఠ ఎక్కువ. శిల్పంకోసం శిల్పాన్నికాక, ఈకారణం వల్ల జానపద కళారూపాలను కేవలం కళాదృష్టితోగాక సామాజిక దృష్టితో పరిశీలించాల్సిన అవసరం ఉంది. అందువల్ల జానపదులు తయారుచేసిన బొమ్మలుగాని, చెక్కడపు పనులుగాని, విగ్రహాలుగాని ఏ దృష్టితోచేశారు, మతంతో, తంత్రవిద్యతో, పండుగలతో, నిత్యజీవితంతో వాటికుండే సంబంధం ఏమిటనే విషయాన్ని తప్పక పరిశీలించవలసి ఉంటుంది. శిష్టకళారూపాలు శిలలుగా, దేవాలయాలుగా, చెక్కడాలుగా స్థిరంగా ఉండవచ్చు. కాని వాటికి సంబంధించిన శాస్త్రం పురాణాలలో ఎక్కడో దాగి ఉంటుంది కాని, ఒకతరం నుంచి మరొక తరానికి సంక్రమించేదికాదది అందువల్లనే బౌద్ధుల శిల్పాలు- జైనుల శిల్పాలు, చాళుక్యులు, విజయనగరరాజులు, బహమనీ సుల్తానులు, ఇత్యాది వివిధ కాలాలకు చెందిన శిల్పాలు వెలువడ్డాయి. కాని జానపదుల శిల్ప కళారూపాలు ఒక తరం నుంచి మరొక తరానికి అవిచ్ఛిన్నంగా సంక్రమిస్తూ ఉంటాయి. అందువల్ల జానపద శిల్పానికి ఒక సజీవమైన చరిత్ర ఉంది.

తోషి అనే విద్వాంసుడు శిల్పంతో సహా జానపద కళారూపాల లక్షణాలను ఈ విధంగా పట్టీ చేసిచూపాడు (కన్నడ విశ్వకోశ, భాగం 7, పు 706): 1. అన్ని విధాల అధిక వివరాలను వదిలి కొన్ని నిర్దిష్టమైన రేఖలు, ఆకారాలతో శిల్పం భావనను మాత్రం చెప్పడం. 2. వర్ణచ్ఛేదం, వర్ణసాంద్ర వ్యత్యాసం మొదలైన క్లిష్ట పద్ధతులను వాడకుండా రేఖలు, రంగులు, ఆకారాల సంయోజనవల్ల సులభంగా రూపొందించడం 3. కొన్ని సందర్భాలలో చూచేవాడి దృష్టి ఒక వస్తువుమీద కేంద్రీకృతమయ్యేట్లుగా చెయ్యడానికి వాటిని అస్వాభావికంగా, విపరీతమైన ఆకారంలో ఉన్నట్లుగా రూపొందించడం (ఉదాహరణకు రాజును చాలా పెద్దగా రూపొందించి, పరివారాన్ని చిన్నగా చూపడం) 4. చలనం, ధ్వని, మనోవ్యాపారం, భావనలకు ఆకారాన్ని కల్పించడం 5 అనేక సామాన్య రూపాలను కాల్పనిక రీతిలోకి మార్చి, వాటి చేరికవల్ల అలంకరణను సాధించడం 6. రేఖలు, రూపాలు, రంగులను అనేక సమయాల్లో, అనేక విధాలుగా రూపొందించడం.

భారతదేశంలో జానపదశిల్పం, ఇతర చెక్కడపు పనులకు వేల సంవత్సరాల చరిత్ర ఉంది. ఇక్కడి శిల్పాలలో అనేకం మత సంప్రదాయాల

నేపథ్యంతో వెలువడ్డవి· భారతీయుల తరతరాల నమ్మకాలు, అలవాట్లు, అభి రుచులు, సంప్రదాయాలు శిల్పాల నిర్మాణానికి దోహదం చేశాయి. రాళ్ళపైన వీరుల చిత్రాలను చెక్కి వీరగల్లులను తయారుచేసిన వారు కొందరు, కొయ్య లతో రంగురంగుల బొమ్మలు చేసి ఉత్సవాలలో ఊరేగించిన వారు కొందరు. పండుగల్లో, జాతరల్లో ఇంకా అనేక సామూహిక ఉత్సవాలలో విగ్రహాలను, బొమ్మలను, ఆట సామానులను తయారుచేసి అమ్మినవారు కొందరు, రాక్ష సులు, కిన్నరులు, కింపురుషులు, గ్రామదేవతలు మొదలైన వారందరూ బొమ్మ లుగా జానపదులచేతిలో రూపొందారు· బీహారు, గుజరాతు, రాజస్థాన్, మధ్య ప్రదేశ్, మరికొన్ని భారతీయ ప్రాంతాలలో గుర్రంమీద కూర్చున్న సవారిగాని విగ్రహాలు చాలా కనిపిస్తాయి. వంశంలోని మూలపురుషుణ్ణి ప్రతీకగా చేసి ఈ విధమైన బొమ్మను ఆబ్దికాలలో ఉపయోగిస్తారు. కిరుప్పన్ పేరుతో, అయ్యప్పన్ పేరుతో ఇలాంటి పెద్ద విగ్రహాలను తమిళనాడులో, కేరళలో, గ్రామం పొలిమేరలలో నిలుపుతారు. మట్టితోచేసిన ఈ ప్రతిమలు రంగులతో నిగనిగలాడుతుంటాయి. ఊళ్ళో ఏవైనా రోగాలు ప్రబలినప్పుడు రోగపీడితుల విగ్రహాలను చిన్నవిగా చేసి ఈ పెద్ద విగ్రహాల దగ్గర ఉంచే ఆచారం ఉంది. పొలాలలో, ఇళ్ళమీద కాపలాకోసం ఉంచే దిష్టిబొమ్మలు కూడా జానపదుల ప్రయోజనాత్మక శిల్పదృష్టికి ఉదాహరణలుగానే ఉన్నాయి.

శిల్పంకాక జానపదుల చేతిపనులను గురించి సవివరంగా చెప్పాలంటే చేట భారతం అవుతుంది. చేటలు, బుట్టలు, తట్టలు అల్లే దగ్గరనుంచి, చిన్న చిన్న చేతి పరిశ్రమల వరకు జానపదుల కళానైపుణ్యం, వస్తు సంస్కృతి వ్యక్తమవుతూనే ఉంటుంది. జానపదులలో చేతిపనులతోనే జీవికను వెళ్ళ బుచ్చే కులాలవారు ఎంతో మంది ఉన్నారు· వడ్రంగి జానపదులకు కావలసిన వ్యవసాయపు పనిముట్లను తయారుచేసి ఇస్తాడు. ఇంటికి కావలసిన వస్తువు లను, బండ్లు మొదలైన రవాణా సాధనాలనూ చేస్తాడు. శుభకార్యాలలో వాడే దీపస్తంభం, పీటాలు, దేవతా మండపాలేకాక కవ్వం, కొయ్యపాత్రలు, గరిటలు మొదలైనవీ చేస్తాడు. జానపదులువాడే అనేక గృహోపకరణాలలో కొయ్యకు ముఖ్య స్థానం ఉంది.

చేనేత పనికూడా చేతిపనే. చిత్రకళగానే కాక నేతపని వస్తుసంస్కృతిలో భాగంగా ప్రత్యేక పరిశ్రమగా ఉంది. యంత్రయుగంవల్ల అపారనష్టం సంభవించిన ఉద్యమం చేనేత ఉద్యమమే. జానపదులు శిష్టులు అనే భేదం లేకుండా అందరికీ ఉడుపుల నందించింది ఈ చేనేత ఉద్యమమే. నేడు జానపదులూ మిల్లుబట్టలకే ఎగబడుతుండడం వల్ల ముతక బట్టలైపోయిన చేనేత బట్టలకు గిరాకీ తగ్గిపోయింది. మళ్ళీ ఫాషనుగా ఇప్పుడిప్పుడే చేనేత వస్త్రాలు చలామణీలోకి వస్తూ ఉన్నాయి. మిల్లుబట్టల ఖరీదే విపరీతంగా పెరిగిపోయి, చేనేత వస్త్రాలే కొంత చౌకగా లభిస్తుండడం, అచ్చమైన సౌందర్యాంశ వీటిలో కనిపించడం ఆధునికులను కూడా ఆకర్షిస్తున్నదని చెప్పవచ్చు.

గ్రామీణ జీవనంలో కుమ్మరికి చాలా ప్రాముఖ్యం ఉంది. ఇంటికి కావలసిన పాత్రలన్నీ కుమ్మరి దగ్గరనుంచే రావలసి ఉండేది ఒక కాలంలో, మట్టిని నమ్ముకొని బ్రతికే కుమ్మరికి ఈనాడు ఎక్కువ పనిలేదు. కమ్మరి కూడా గ్రామీణ జీవనంలో ప్రధానస్థానంలో ఉండేవాడు. నాగలిపట్టే ప్రతి రైతుకూ నేటికీ వడ్రంగి కమ్మరి అత్యంతాత్మీయులే. నాగలికి, బండికి, కొడవలి, పార మొదలైన సామానులకు కమ్మరిదగ్గరికి పోవలసిందే.

జానపద వృత్తి జీవనంలో కళాత్మకత ఉట్టిపడే వస్తువులను తయారు చేసి ఇచ్చేవాడు కంసాలి. జానపదులకు కావలసిన ఆభరణాలే కాకుండా రాగి, కంచు, మొదలైన లోహాలతో కూడా కొన్ని ఆభరణాలు, విగ్రహాలు చేసి ఇస్తాడు. ఈనాడు చాలా వరకు కంసాలి అవసరంతగ్గినా, స్త్రీలకు గాజులు, కమ్మలు, మంగళ సూత్రాలు కనీసపు అవసరాలుగా ఇంకా మిగిలి వుండడం చేత జానపదుల పాలిటికైనా కంసాలి ప్రధాన వ్యక్తిగానే ఉన్నాడు.

జానపద వృత్తి కళాకారులలో మేదరి ఒకడు. జానపదుల నిత్య జీవితంలో అవసరమైన చేట, బుట్ట, తొట్లు, పూలబుట్టలు. విసనకర్రలు, తడికలు మొదలైనవాటిని తయారుచేసి ఇస్తారు మేదరి స్త్రీ పురుషులు. మేదరి పడుచు తన పనిలో ఎంత నైపుణ్యం చూపించగలదని ఈ క్రింది కోలారు జిల్లా జానపదగేయం చెప్తుంది.

మేదారి కూతురు మేలంపు రాలురా
కూసోని అల్లెరా కూరాకు జబ్బిరా
పండుకో నల్లెరా పట్టు మంచాముర్రా
చందమామా - సై
నిలబడుకో నల్లెరా నీలంపు దాగిరి
వంగోని అల్లెరా వడ్ల జల్లిడిరా
పండుకో నల్లెరా పట్టు మంచాముర్రా
చందమామా – సై

మేదారి వాళ్ళలాగే ఇంకా కొన్ని వస్తువులను అమ్మే ఇతర వృత్తుల వారున్నారు. చాపలల్లేవారు, పెట్టెలు అల్లేవారు, పట్టుపురుగు మొదలైనవాటిని పెంచడానికి చట్రాలను, గంపలను, అల్లేవారున్నారు. సంతలలో, జాతరల్లో ఇలాంటి వస్తువులను అమ్ముతారు.

జానపద వృత్తి విద్యలలో గానుగ పట్టడం ఒకటి. 'గానుగెద్దు' అన్నది చేసిందే చేసే వారిని గురించి చెప్పే పలుకుబడిగా తెలుగు వారి నోళ్ళలో నాను తున్నది. కొయ్యగానుగ వందల సంవత్సరాల నుంచి వాడుకలో ఉంది. ఇప్పుడు ఇనుపగానుగలు కూడా వచ్చాయి. నూనెమిల్లులు వచ్చి గానుగవృత్తిని పొట్టన పెట్టుకున్నాయి. నూనెగానుగ లాగే చెఱకు గానుగ కూడా ఉంది. చెరకును పిండి రసం తీసి బెల్లం తయారుచేసే వృత్తి ఆంధ్రదేశంలోని కొన్ని ప్రాంతాలలో ఇంకా జానపద స్థాయిలోనే ఉంది. చెరకురసం తీసి తయారు చేసిన బెల్లం చక్కెరతో సమానంగా వాడుకలో లేకున్నా, దానికుండే విలువ ఉండనే ఉంది.

దారాలు నేసేది, పేనేది కూడా ఒక వృత్తే. దారాలు, పెద్దతాళ్ళు, చేంతాళ్ళు, పలుపులు మొదలైనవి తయారుచేయడం ఈ వృత్తికి చెందినవారి పని. పశువులకు ముక్కుదారాలు, పలుపులు, బండికి కావలసిన దారాలు మొదలైనవి తయారు చేసేవాళ్ళు కొందరు. వ్యవసాయదారులే దీనిని ఉప వృత్తిగా కూడా కలిగిన వారున్నారు. పాడిపంట సమృద్ధిగా ఉన్నప్పుడు దారాలు, పగ్గాలు, పలుపులు అవసరమవుతాయనడంలో సందేహం లేదు.

చర్మకారుల వల్ల ఉండే ఉపయోగం తెలిసిందే. ఆధునికయుగంలో యంత్రాలవల్ల చితికిపోయిన చేతిపనులలో ఇదీ ఒకటి. సామాజికంగా అందరి కంటె వెనుకబడిన జాతులవారే ఈ వృత్తిని చేపట్టి జీవనోపాధికి చెప్పులుకుట్టి జీవిస్తూ వచ్చారు. చెప్పులతోబాటు కొన్ని జానపద వాద్యాలను తయారుచేయడం కూడా వీరివృత్తే. ఇంటికి కావలసిన రాళ్ళనుకొట్టి, వాటిని ఇటుకల్లాగా తయారుచేసే ఎడ్డెవాళ్ళు కూడా జానపదవృత్తికారుల్లో చేర్చ దగినవారే రోడ్లకు కావలసిన రాళ్ళను కూడా కొట్టి జీవించడం నేటికీ ఉంది. పెద్ద రాళ్ళ స్తంభాలను, పచ్చడి బండలను, రోళ్ళను కూడా తయారు చేసే వాళ్ళున్నారు.

ఇలా అనేక వృత్తివిద్యలకు సంబంధించిన జానపద కళాకారులు నిత్య జీవితంలో తమను తాము పోషించుకోడమే కాకుండా వందలు, వేల సంవత్స రాలుగా జనోపయోగకరమైన వస్తువులను తయారుచేసి ఇస్తున్నారు.

## చరిత్ర పూర్వయుగాల్లో వస్తుసంస్కృతి

నేడు మానవజీవితంలో యంత్రాలు రాజ్యం చేస్తున్నాయి. మనిషి అవస రానికి కావలసిన అనేక వస్తువులను యంత్రాలే తయారుచేసి ఇస్తున్నాయి. అయితే చరిత్ర పూర్వయుగాలలో మానవుడు ప్రకృతిలోని వస్తువులను తన అవసరాలకు తగినట్లుగా మలచుకొని అభివృద్ధిని ఎలా సాధించాడన్నది అద్భుతమైన కథ. లక్ష సంవత్సరాల క్రితం నేటి ఆంధ్రదేశంలోని వివిధ ప్రాంతాలలో నివసించిన మానవుడు ఏ భాషా మాట్లాడకపోయినా, ఆనాటి మానవుడు ఉపయోగించిన పనిముట్లు మహత్తరమైన గాథల్ని చెప్తాయి. అప్పటి మానవుణ్ణి తెలుగువాడనో, ఆంధ్రుడనో చెప్పడానికి ఏ మాత్రం అవ కాశం లేకున్నా ఆంధ్రుల జానపద విజ్ఞానంలో భాగమైన వస్తు సంస్కృతిని పరిశీలించేటప్పుడు కొన్ని వేల సంవత్సరాల క్రితం ఆంధ్రదేశంతో మాన వుడు ఎలాంటి వస్తువుల్ని వాడేవాడన్నది ఆసక్తికరం కాబట్టి పరిశీలన యోగ్య మవుతున్నది.

పాతరాతియుగంలో ఆంధ్రదేశంలో (అప్పుడా పేరు లేదనుకోండి) నివసించిన మానవుడు నెల్లూరు జిల్లాలోని పాలార్ నదీలోయలో క్వార్ట్జైట్

రాయితో, కృష్ణా జిల్లాకు ఎగువన షింగిల్ అనేరాయితో పనిముట్లను తయారు చేసుకున్నాడు. దక్కన్ పీఠభూమిలో పాతరాతియుగంలో మనిషి ఉపయోగి స్తుండిన పదిరకాల పనిముట్లను పురాతత్త్వశాస్త్రజ్ఞులు కనుక్కొన్నారు. గొడ్డళ్ళు, చాకులు, ఈటెలు మొదలైన వాటిని ఆనాటి మానవుడు వివిధ కార్యాలకు ఉపయోగించేవాడు వేటనే ప్రధాన వృత్తిగా చేసుకున్న కాలంలో విల్లంబులు కావలసివచ్చాయి మనిషికి. పాతరాతియుగంలో రాతితోనే ఈటె మొనల్ని, చేపలు పట్టేసూదుల్ని, పదునైన కత్తుల్ని తయారు చేసుకొని వేటకు వాడుకున్నాడు మానవుడు. ఆదిమ మానవుడు రాతి పనిముట్లతో కొయ్యపని ముట్లను కూడా వాడసాగాడు. ఎముకలనుకూడా ఆయుధాలుగా ఉపయోగించ సాగాడు. అయితే ఎక్కువ కాలం మన్నే రాతి పనిముట్లకే ఎక్కువ ప్రాధా న్యం. రాతి పనిముట్లతోనే నాటి మానవుడు అడవి జంతువుల్ని వేటాడడం కొనసాగించాడు. నేటికీ ఆంధ్రదేశంలో ఉన్న యానాదులు, చెంచులు మొద లైన ఆదిమజాతుల వాళ్ళు కొన్ని వేలనాటి ఆంధ్రదేశపు సంస్కృతిని ఈ నాడు ప్రతిబింబిస్తున్నారు. వారి ఆహారపు అలవాట్లు, కలుగులు తవ్వడం, ఎలుకలు, తొండలు, ఉడతలు మొదలైన వాటిని తినడం వగైరా ఆంధ్ర దేశంలో అనాది కాలంగా యానాదులు ఉన్నారని తమ సంప్రదాయాలను తర తరాలుగా కాపాడుకుంటూ వస్తున్నారని తెలుపుతున్నది.

ఆంధ్రదేశంలో కొత్తరాతియుగం కొన్ని వందల సంవత్సరాలుమాత్రం సాగింది. ఆంధ్రదేశంలోని మానవుడు ఆహార సేకరణ దశనుంచి ఆహా రోత్పత్తి దశకు చేరుకున్నాడు. దేశ దిమ్మరులుగా ఉండే వాళ్లు జనపదాలను ఏర్పాటు చేసుకునే స్థితికి వచ్చారు. పాడి ఆనాటి ముఖ్యవృత్తి. దానితో పాటు పోడు వ్యవసాయాన్ని కూడా ప్రారంభించారు. పనిముట్లతో ఎక్కువగా అవ సరంలేని వ్యవసాయమది. కుండలు చేయడం, నూలు తీయడం వంటివిగూడా నేర్చుకున్నారు వారు, కొత్తరాతియుగానికి చెందిన తిరగళ్ళు, రుబ్బురోళ్ళు, గోలీలు, పూసలు, బాణపు మొనలు, రంపాలు, ఈటెలు, చెకుముకి రాళ్ళు, పూజాసామగ్రి, తాయెత్తుల వంటివి కూడా ఆంధ్రదేశంలో దొరికాయి. ఆంధ్ర దేశంలో నేటికీ నివసించే కోయలు, సవరలు, గోండ్లు మొదలైన వారి జీవి తంలో కొత్తరాతియుగానికి చెందిన సంప్రదాయాలు, వస్తు సంస్కృతి కని పిస్తాయి. కొత్తరాతియుగం తర్వాత ఇనుపయుగం ప్రారంభమయింది. పోడు

వ్యవసాయంనుంచి మనిషి వ్యవసాయానికి ఎదిగాడు. ఇనుము వల్ల ఉపయోగాలను మానవుడు తెలుసుకున్నాడు. చెక్కనాగలికంటె, ఇనప కర్రు బిగించిన నాగలి లోతుగా దిగడాన్ని తెలుసుకున్నాడు. ఇనుప గొడ్డలి స్థిరనివాసానికి అలవాటు పడ్డ మనిషికి మరింత సహాయం చేసింది. వ్యవసాయమూ అందుకు అనుబంధంగా వడ్రంగం,కమ్మరం మొదలైన వృత్తులు వచ్చాయి శ్రమ విభజన జరిగింది. ఆంధ్రదేశంలో పలుప్రాంతాలలో జరిపిన త్రవ్వకాల వల్ల ఇనుపయుగం అవశేషాలెన్నో లభించాయి. బాణపు మొనలు, రంగుల గాజులు, కుండలు, బాకులు మొదలైనవి దొరికాయి. ఇనుము విస్తారంగా దొరకడంతో బాటు కొన్నిచోట్ల రాగి, ఎముకలు మొదలైనవి కూడా లభించాయి.

చరిత్ర పూర్వయుగాలలోని వస్తుసంస్కృతిని గురించి కొన్ని విషయాలను చెప్పుకున్నందువల్ల ఒక విషయం తెలుస్తుంది. ఆ కాలంలో వర్గరహిత సమాజం ఉండేది. నిజమైన అర్థంలో సమాజవాదం ఉండేది. మనిషి మనిషితో న్యాయం కోసంపోరాడాల్సిన దుస్థితి ఆనాడులేదు. మనిషి ప్రకృతితో జరిపిన పోరాటానికి గుర్తులుగా మనకీనాడు అనేక వస్తువుల అవశేషాలు కనిపిస్తాయి. చరిత్ర పూర్వయుగాలలో పోరాటం మానవ వర్గాల మధ్యకాక, మానవునికి ప్రకృతికి మధ్య జరుగుతుండేదని దీని వల్ల మనం తెలుసుకోవచ్చు.

ఆంధ్రశిల్పం—చేతిపనులు :

ఆంధ్రులనే పేరుతో ఆంధ్ర దేశంలో జనసముదాయం ఏర్పడిన తర్వాత అంటే చారిత్రక యుగాలలో పరిణామాన్ని కొంత పరిశీలించాల్సి ఉంది. క్రీస్తు పూర్వం కొన్ని శతాబ్దులకు ముందే ఆంధ్రులు మౌర్యుల తర్వాత అత్యంత బలిష్ఠులని మెగస్తనీసువంటి చరిత్రకారులు రాసి వుండడం వల్ల ఆనాటికే ఆంధ్రదేశం అనేక కళలలో ఆరితేరి ఉండిందని ఊహించవచ్చు. ఆంధ్రదేశంలో ప్రపంచదృష్టి నాకర్షించిన శిల్పరూపాల అవతరణ బౌద్ధంతో మొదలయిందని చెప్పవచ్చు. ఆంధ్రదేశంలో, అందులోనూ ముఖ్యంగా కృష్ణానది లోయ ప్రదేశంలో కనిపించినన్ని బౌద్ధ నిర్మాణావశేషాలు దక్షిణ భారతదేశంలో మరెక్కడా కనిపించవంటే అతిశయోక్తి కాదు. అమరావతి, నాగార్జున కొండ, జగ్గయ్యపేట, భట్టిప్రోలు, ఘంటసాల మొదలైనవి అట్టి ప్రదేశాలు.

ఆంధ్రదేశంలోని జానపదుల కళల్లో బొమ్మలు చేయడం ప్రధానంగా చెప్పుకోవాలి. లక్కబొమ్మలను చేసేవారు అనేకులు ఉండేవారు. 'పూచినకింశు కంబనగ పుత్తడి లత్తుక బొమ్మవోలె' అని నాచన సోముడు వర్ణించాడు (ఉ.హ.ప్ర 180). ఆనాడు చేతి జంత్రపు బొమ్మలను కూడా తయారు చేసే వారు. బొమ్మలు, ఆట వస్తువులు తయారు చేసేవారు. దేవతా విగ్రహాలను, ఇతర కళాప్రక్రియలకు కావలసిన బొమ్మలను తయారు చేసే శిల్పులు ఆంధ్ర దేశంలో నలుమూలలా ఉన్నారు. బొమ్మలు తయారు చెయ్యడం కొన్ని వేల సంవత్సరాల నుంచే జరుగుతున్నది. అత్యంత ప్రాచీన కాలంలో మట్టితో ఏదో ఒక ఆకారాన్ని చేసి పూజించేవారు. లేకుంటే శిలనే దేవతగా మలచి పూజించేవారు ఈ బొమ్మలు, విగ్రహాలు వగైరా భౌతిక పరిసరాలపైన, సాంఘిక, ఆర్థిక, మతీయ సంప్రదాయాలపైన ఆధారపడి వుంటాయి. ఆట బొమ్మలు లేని పసివారి జీవితాన్ని ఊహించడమే సాధ్యంకాదు ఏదో ఒకరక మైన ఆట బొమ్మలు, ఇతర ఆట వస్తువులు లేనిదే పిల్లలకు ఉత్సాహం కల గదు. జానపదుల ఆటబొమ్మల్లో కొయ్యవి, కాయితాలవి, గుజ్జువి, రబ్బరువి, తేలిక లోహాలవి ఉన్నాయి.

బొమ్మలకొలువుఆంధ్రులకు ఇష్టమైన ఒక సంప్రదాయంగా వస్తూఉంది. తెలుగు వారిండ్లలో బొమ్మలపెట్టె అని ఒకటి ఉంటుంది. దానిలో రకరకాల బొమ్మలను భద్రపరిచి నవరాత్రి బొమ్మలకొలువప్పుడు, సంక్రాంతి బొమ్మల కొలువు సమయంలో వెలుపలికి తీస్తారు. పాడిపంట సమృద్ధిగా వుండే ఇళ్ళలో అయితే బొమ్మరిల్లు అన్నదే ఒకటి వుంటుంది. అక్కడే బొమ్మల పెళ్ళిళ్ళు చేయడం, బొమ్మల కొలువు తీర్చడం, పిల్లల వివాహ భోజనాలు బొమ్మరింట్లో జరుగుతాయి. ఆంధ్రదేశంలోని కొన్ని ప్రదేశాలు ప్రత్యేకంగా బొమ్మలకు ప్రసిద్ధి చెందాయి. అయినా ప్రతి పల్లెటూరిలో వడ్రంగి కొన్నిరకాల బొమ్మ లను. అన్నిరకాల కొయ్యలతో చెయ్యగలిగి వుంటాడు. తెలుగు నాట అన్ని ప్రసిద్ధ దేవాలయాల ప్రాకారానికి సమీపంలో అంగళ్ళలో పిల్లలకు కావలసిన అనేక విధాల కొయ్యబొమ్మలు దొరకుతాయి. తిరుపతి వంటి చోట్ల అన్ని అంగళ్ళల్లో అన్నిరకాల కొయ్యబొమ్మలు కుప్పలు పోసి అమ్ముతుంటారు. విశాఖ శ్రీకాకుళం వంటి జిల్లాలలో కొమ్ములతో చేసే బొమ్మలు, గృహోప కరణ వస్తువులు తయారవుతున్నాయి. దువ్వెనలు, పక్షులు, జంతువులు, మను

షులు మొదలైన బొమ్మలను కొయ్యలతో తయారు చేసి అమ్మడమూ ఒక కళగా, చేతిపనిగా రూపొందింది.

కొండపల్లి బొమ్మలు వందల ఏళ్ళనుంచి ప్రసిద్ధి చెందాయి. కొండపల్లి పరిసరాలలోని అడవుల్లో తేలిగ్గా వుండే పుణికి కర్ర దొరుకుతుంది. దీనితో బొమ్మలు తయారు చెయ్యడానికి విశిష్టమైన పద్ధతుల్ని అనుసరిస్తారు ఈ వూరి కళాకారులు. కొండపల్లి బొమ్మలనగానే ఆంధ్రగ్రామీణ జీవితం సొగసు గుర్తుకు వస్తుంది. కొయ్యకు అంగాంగాలను చేర్చాల్సిన చోట చింతగింజలతో తయారు చేసిన జిగురును పొట్టుతో కలిపి అతికిస్తారు. బొమ్మలకు ఆకర్షకమైన రంగులను వేసి సహజశోభతో అలరారేట్లు చేస్తారు. రంగులను కూడా కళా కారులే తయారు చేసుకుంటారు. వీటిని సహజంగా ప్రకృతిలో దొరకే వస్తు వులతోనే తయారు చేస్తారు. కొండపల్లి బొమ్మలలో జనప్రియమైనవి పల్లె పడుచులు, దశావతారాలు. కల్లుగీత, గొబ్బి, పల్లకి, ఉయ్యాల, లక్ష్మీపార్వతి సరస్వతులు, వ్యవసాయ దారుడు మొదలైనవి. ఇక్కడి బొమ్మలు ఆంధ్ర దేశంలోనే ఇతర ప్రాంతాలకు రవాణా కావడమే కాకుండా దేశంలోని ఇతర ప్రాంతాలకు, విదేశాలకు కూడా వెళ్తున్నాయి.

కొండపల్లి బొమ్మలలాగే ఆంధ్రదేశమంతటా ప్రచారం పొందినవి నిర్మల్ బొమ్మలు. అదిలాబాదు జిల్లాలోని నిర్మల్ కొయ్య బొమ్మలపైన లక్కపూతలకు, బంగారుపూతలకు ప్రసిద్ధి చెందింది. చింతగింజలను నాన బెట్టి, ఆరనిచ్చి, రుబ్బి, జిగురయ్యేట్లుగా ఉడకబెట్టి బొమ్మలను తీర్చి దిద్ద డానికి ఉపయోగిస్తారు. నిర్మల్ పరిసరాలలో కూడా బూరుగు, పుణికి కొయ్యలు దొరుకుతాయి. నిర్మల్ పరిశ్రమలో బొమ్మలేకాక కుర్చీలు, బల్లలు, తివాసీలుకూడా తయారవు తున్నాయి. సహజ శోభతో ప్రకాశించే పక్షులు, జంతువులు, కూరలు, పళ్ళు మొదలైన వాటి బొమ్మలు నిర్మల్‌లో తయారవు తున్నాయి.

కొండపల్లిలో, నిర్మలులోనేకాక ఇంకాచాలాచోట్ల కొయ్యతోనేకాక ఇతర పదార్థాలతో కూడా బొమ్మలను తయారు చేసేవారున్నారు. బందరులో కాయితం ముద్దతో రంగురంగుల బొమ్మలు చేస్తారు. కొన్నింటిలో స్ప్రింగు

కూడా అమర్చి నృత్యంచేసేవిధంగా చేయడం వీరిప్రత్యేకత. లక్కబొమ్మలు కొండపల్లిలోనూ తయారవుతుండేవి. విశాఖపట్నం జిల్లాలోని నక్కపల్లిలో కూడా అలాంటి బొమ్మలే చేయబడుతున్నాయి. ఏటికొప్పాక లక్కబొమ్మలు ఆంధ్రదేశమంతటా ప్రసిద్ధిచెందాయి. దీనికి కూడా తేలికపాటి కొయ్యకావాలి. విశాఖ జిల్లాలో ఇలాంటి కర్ర దొరుకుతుంది. ఆంధ్రదేశాలలో అనేక ప్రాంతాలలో మట్టిబొమ్మలు తయారవుతున్నాయి. మట్టిబొమ్మలనుచేసి పొట్టపోసుకునే వృత్తి కళాకారులు పలుతావుల్లో ఉన్నారు.

చిత్తూరు, కడప జిల్లాలలో ఎర్రచందనం చెట్లు విరివిగా వున్నాయి. తిరుపతిలో ఎర్రచందనం బొమ్మలు ప్రసిద్ధి చెందాయి. రక్తచందనం చూడడానికే రంగుబొమ్మలాగా కనిపించడంవల్ల వేరు రంగు కూడా అక్కరలేదు. ఎర్రచందనంతో ఖరీదైన మేజాలు, బల్లలు, భోజనంబల్లలు, కుర్చీలుకూడా తయారుచేస్తారు ఎర్రచందనంతోచేసే బొమ్మలుకూడా చిన్న ఆకారం నుంచి పెద్దఆకారంవరకు అన్నిరకాలు ఉన్నాయి. తిరుపతిలో, తిరుమలలో, తిరువానూరులో దొరికే బొమ్మలు చిన్న ఆకారం కలిగి పసివారి ఆటపాటలకు తగ్గవిగా ఉంటాయి. ఈ బొమ్మలకు దుస్తులు తొడిగి అలంకరణ ఎక్కువచేసుకొని పిల్లలు ఆడుకొంటారు. దేవతల బొమ్మలు, మానవులబొమ్మలు, జంతువులబొమ్మలు రక్తచందనంతో తయారుచేసిన వాటిలో ఉన్నాయి.

జానపదుల శిల్పకళకు బొమ్మలు తయారు చెయ్యడం మొదలైనచేతిపనులకు ఉదాహరణ ప్రాయంగా కళాకారులైన జీనిగలవారిని గురించిన పరిచయం ఉపయోగ పడవచ్చు. నెల్లూరు పట్టణంలోని స్టోన్‌హౌస్‌పేటలో జీనిగల వీధి ఉంది. అక్కడ తరతరాలుగా కళాత్మకమైన శిల్పనిర్మాణంతోనే పొట్టపోసుకొనే నాలుగయిదు కుటుంబాలున్నాయి.

వీరు ఆర్య క్షత్రియకులం వారమని చెప్పుకుంటారు. గుర్రాలు జీనులు చేస్తుండినందువల్ల జీనిగలవాళ్ళు మయ్యామని చెప్తారు. వీరి పూర్వులు ఆదోని వారని, అక్కడినుంచి, ఉదయగిరి సంస్థానానికి చెందిన అనాసముద్రపు పేటకు వచ్చారని, చెప్తారు అక్కడినుంచి నెల్లూరు దగ్గర బుచ్చిరెడ్డి పాళెంలో మకాం పెట్టి, ఇప్పుడు నెల్లూరులో స్థిరపడ్డారట. వీరిదగ్గర చెక్కడపు పనులు,

బొమ్మలు చెయ్యడం నేర్చుకున్నవారు వరిగొంత. గుంటూరు మొదలయిన ప్రాంతాలకు వెళ్ళి అక్కడ కూడా బొమ్మలు చేస్తున్నారట.

జీనిగల వాళ్ళుచేసే కొయ్యపనులు, రంగుపనులు 1. వాహనాలు 2. విగ్రహాలు, 3. మకర తోరణాలు 4. బొట్ట బొమ్మలు 5. పులివేషాలు 6. కీలు గుర్రాలు 7. చప్పరాలు 8. మక్కు బొమ్మలు, మచ్చన బొమ్మలు 9. గ్రామ దేవతలు.



జీనిగల వారి పనితనానికి మచ్చుతునక

వాహనాలకు, విగ్రహాలకు టేకు, అత్తికొయ్య మొదలయినవి వాడు తారు. మధ్య మధ్య అతికించవలసిన చోట చింతగింజలతో తయారు

చేసిన జిగురును, రంపపుపొట్టును కలిపి పూస్తారు. బొమ్మలకు సరైన ఆకారం రావడానికి, కనుముక్కుతీరును సరిచేయడానికి పై మిశ్రమాన్నే వాడుతారు. గ్రామదేవతలనుకూడా జీనిగలవాళ్ళే తయారుచేసి ఇస్తారు. గ్రామదేవతలను చేసిన తర్వాత దిష్టితీర్పనేది ఉంటుంది. మహాలక్షమ్మ, చెంచమ్మవంటి సౌమ్యదేవతలకు వడపప్పు, పానకం, టెంకాయ ఉపయోగిస్తారు. పోలేరమ్మ అంకమ్మ, గంగమ్మ, అంకాళమ్మ వంటివారికి రక్తబలి ఇస్తారు విగ్రహాన్ని అలంకరించే రంగుల్లోకూడా భేదం ఉంటుంది. మహాలక్ష్మమ్మ వంటివాళ్ళకు పసుపు, మిగిలిన దేవతలకు ఎరుపు వాడుతారు. పోలేరమ్మకు వెయ్యిగళ్ళచీర నలుపు తెలుపులు కలిసింది కట్టిముఖానికి ఎరుపురంగు వేస్తారు. అంకమ్మకు బాణాలతో కూడిన బాణాలచీర అలంకరిస్తారు.

బొట్ట బొమ్మ (జానపద వస్తు ప్రదర్శనాలయం, మైసూరు)

బొట్టబొమ్మలు జానపద కళలలో ఒకభాగం, వెదురుదబ్బలతో అల్లిన పెద్ద పెద్ద బొమ్మలివి. మనుషులు నిలుచుకొని పైన ఈ బొట్టబొమ్మలను

పెడితే, మోసేవారి కళ్లు బొమ్మ నడుము దగ్గరికి వస్తాయి. నెల్లూరులోని రంగనాథస్వామి తిరునాళ్ళకు, ఇతరఉత్సవాలకు బొట్టబొమ్మలు వచ్చి పిల్లలకు కనువిందు కలిగిస్తాయి. రాజు, రాణి, పాములవాడు, డాక్టరమ్మ, రావణాసురుడు మొదలైన బొమ్మలను మేదరివాళ్లు అల్లిస్తే జీనిగలవాళ్ళు రంగులువేస్తారు. దసరా, పీర్లపండుగ వచ్చాయంటే జీనిగల వీధిలో పిల్లలందరూ పులివేషాలు చూడడానికి గుమికూడుతారు. జీనిగలవారి కళానైపుణ్యమంతా పులివేషాలలో వ్యక్తమవుతుంది. ఉత్సవాల సమయంలో వాడే కీలుబొమ్మలు, కీలుగుర్రాలు, నెమళ్ళు మొదలైనఅన్నిరకాల బొమ్మలనూ తయారుచేసి ఆకర్షణీయమైన రంగులువేసి తిరనాళ్ళవంటి సందర్భాలలో అమ్ముతారు వీరు. ఇలాంటి కుటుంబాలు ఆంధ్రదేశమంతటా జానపద వస్తుసంస్కృతి పూర్తిగా నశించి పోకుండా కాపాడుకుంటూ వస్తున్నాయి.

## మనదేశాల్లో చేతి పనులు

ప్రపంచంలోని వివిధ ప్రాంతాలకు చెందిన ఆదిమజాతులలోని చేతి పనులను గూర్చి కొంత తెలుసుకోడంవల్ల మన జానపద కళలనుబోలినవి, వాటికి మూలరూపాలన దగినవి అయిన కళలను గురించి తెలుస్తుంది. ఆది వాసులు వాడే సాధనాలు పనిసరాలను అవలంబించి ఉంటాయి. ఆదివాసులలో రాతిని, కొయ్యను ఉపయోగించడం సర్వసామాన్యంగా కనిపిస్తుంది. అయితే ఎస్కిమోలు కొయ్యను ఎక్కువగా ఉపయోగించరు. కారణం వాళ్ళుజీవించే ప్రాంతంలో చెట్లుఎక్కువగా పెరగక పోవడమే. రెడ్ఇండియన్ ఇండియన్లు సముద్రంలో దొరికే గవ్వలను, చిప్పలను వివిధోపకరణాలను తయారు చేయ డానికి ఉపయోగిస్తారు. ఎస్కిమోలు ఎముకలతో, చర్మంతో కొన్ని సాధనాలను చేసుకుంటారు. చర్మంతో సంచులు, వలలు, బుట్టలు మొదలైనవాటిని చేసు కుంటారు. దంతంతో కొన్ని వస్తువులను చేస్తారు. అన్నిదేశాలకు చెందిన ఆదివాసులూ చెవులు, పెదిమలు, ముక్కులు రంధ్రాలు చేసుకొని ఎముకలు, గవ్వలు, కొయ్యలు, లోహాలు గుచ్చుకొని ఆభరణాలుగా చేసుకుంటారు. రెడ్ఇండియన్లు మొదలైనవాళ్ళు చర్మంతో టోపీచేసుకొని దానిమీద పక్షుల రెక్కల్ని గుచ్చుకుంటారు.

యంత్రయుగానికి పూర్వం జానపదుల చేతిపనులు సక్రియ పాత్ర వహించి జానపద సమాజంలో అనివార్యమైన అంగంగా ఉండేవి. వైయక్తికంగా సమాజంలోని వ్యక్తి తయారుచేసుకోలేని వాటి నన్నిటినీ చేతిపనివారే చేసి ఇచ్చేవారు. కుశలకార్మికులకూ, ఉపయోగించేవారికీమధ్య వేరు సంబంధం ఉండేది. ఎక్కడో యంత్రంలో తయారై, ఎక్కడో కొనడం కాకుండా, తయారు చేసే వాడిదగ్గరకే నేరుగా పోయి కొనుక్కునేపద్ధతి ఉండేది. ఈ విధమైన సంబంధాలు లేనందుకు సంతోషించాలో, దుఃఖించాలో తెలియని పరిస్థితి మనది.



# జానపదుల ఇళ్ళు - వాకిళ్ళు

జానపదుల ఇళ్ళు వాకిళ్ళు ఎలా ఉంటాయంటే ముగ్గులు తోరణాలతో సింగారం వుట్టిపడే స్థాయినుంచి. రొచ్చు మురికి నిండిన వాకిలి పెరడువరకు అన్నిరకాలు ఉంటాయి. పల్నాటి సీమలో ఇళ్ళు ఈ కింది విధంగా వుండేవట (సురవరం ప్రతాపరెడ్డి : 165)

> దోసెడు కొంపలో పసులత్రొక్కుడి, దుమ్ము, దూడ రేణమున్
> పాసిన వంటకంబు, పసిబాలుర శౌచము, విస్తరాకులున్,
> మాసినగుడ్డలున్. తలకు మాసిన ముండలు, వంటకుండలున్,
> రాసెడు కట్టెలున్ దలపరాదు పురోహితునింటి కృత్యమున్

రెడ్డిరాజుల కాలంలోని గృహనిర్మాణాన్ని కావ్యాల ఆధారంగా సురవరం ప్రతాపరెడ్డిగారు సాంఘిక చరిత్రలో కొంతవరకు వివరించారు. ''ఇండ్ల నమూనాలు కూడా పెట్టి బిగించునట్లు ఒకే మోటు నమూనాపై కట్టుతూ వుండిరి. సంపన్నులు మాత్రము పశువులను వేరే యింటకట్టి తాముండు ఇండ్ల లోపలి భాగములో చతుశ్శాలా భవంతిని కట్టుతూ వుండిరి. పడసాల(వరండా), మొగసాల (Entrance Hall) యింటి ముందరుగులు, దొడ్డివాకిలి, పెరడు ఇవి సాధారణమయినవి. ఇండ్లకును కొన్ని వాస్తుశాస్త్రములు బయలు దేరెను. వాటి లెక్క ప్రకారము దూలము శూలలేకుండా వాకిండ్ల సంఖ్య బేసిగా ఉండ కుండా, యెన్నెన్నో నిబంధనలు చేసిరి. సాధారణముగా వంటశాలను తూర్పు గానే పెట్టుతూ ఉండిరి. ఇండ్లు కట్టితే, అందలి స్తంభాలకు పెండ్లి చేసే బ్రాహ్మణుని పిలిచి స్వస్తిచెప్పించి పుణ్యాహవాచనము చేయించి శాంతికై బంధువులకు. బీదలకురుచ్యాన్నముల విందునిస్తూ వుండిరి. ఇండ్లకు పశుబలుల నిస్తూ వుండిరి. ఇండ్లలో నొక గదిలో చిల్లరవస్తువులుంచుటకు కట్టె పలకలలో నొక పెద్ద అడ్డగూడు (అల్మారీ వంటిది) నిర్మిస్తూ వుండిరి. దానిని అట్టక (అట్టుగ, అట్టిక, అట్టువ) అనిరి'' (పు. 166).

## జానపద వాస్తువు

వాస్తు శాస్త్రాన్ని శిష్టనిర్మాణ శాస్త్రంగా మాత్రమే భావించడం జరుగుతున్నది. జానపదుల నిర్మాణాలలో ఉండే సారళ్యాన్ని, వస్తువుల పరిమిత వాడుకను దృష్టిలో ఉంచుకొని చూస్తే జానపదుల గృహనిర్మాణ కళను వాస్తువనే పేరుతో వ్యవహరించరాదని కొందరంటారు. పేరు ఏదైనా జానపదుల గృహనిర్మాణ పద్ధతులను గురించి కొన్ని విషయాలను తెలుసుకోవలసిన అవసరం ఉంది.

జానపదుల ఇళ్ళు వాకిళ్ళు వాననుంచి, ఎండనుంచి తప్పించుకోడానికి మాత్రం పనికి వచ్చేవి మాత్రమే. ఒక్కొక్క సారి అవి కేవలం కప్పులని మాత్రం చెప్పదగినవి. జానపద గృహనిర్మాణంలో ముఖ్యంగా కనిపించేవి దాని సరళత. జానపదుల నిర్మాణాలలో లౌకిక ప్రయోజనాలను ఆశించేవి కొన్ని, మత సంబంధ ప్రయోజనాలను ఉద్దేశించినవి మరికొన్ని. మామూలు గృహాలు, చావళ్ళు మొదలైనవి లౌకిక ప్రయోజనానికైతే దేవాలయాలు ధార్మిక ప్రయోజనాలకు ఏర్పడ్డవి. ఈ రెండు విధాల నిర్మాణాలు కూడా జానపద స్థాయిలో సరళ నిర్మాణాలుగానే ఉంటాయి.

జానపదుల గృహనిర్మాణంలో పరిసరాలలో దొరికే వస్తువులనే సాధ్యమైనంత వరకు ఉపయోగించుకోడం కనిపిస్తుంది. మట్టిని, రాళ్ళను, కొయ్యలను, వెదురు, గడ్డి, తాటాకులు, పెంకాయాకులు, చివరికి మంచుగడ్డలను కూడా గృహనిర్మాణంలో ఉపయోగించుకుంటారు. దేశదిమ్మరులైన తెగలవారు బట్టనుపయోగించి గుడారాలు వేసుకోడమూ ఉంది. గుడిసెలు, గుడారాలు, మట్టిళ్ళు, పెంకుటిళ్ళు మొదలైనవన్నీ చిరకాలం స్థిరంగా ఉండాలని కట్టినవి కావు. గుడిసెలు, గుడారాలయితే అప్పటికప్పుడు కొత్తకొత్తగా మార్చుకుంటూ ఉండాలి. గుడిసెకయితే కప్పునయినా తప్పక మారుస్తుండాలి.

ప్రపంచంలోని నానా భాగాలలోఆదివాసులు ఉపయోగించే గృహనిర్మాణ పద్ధతుల్ని గమనిస్తే ఆంధ్ర జానపదులు ఎన్నివిధాల ప్రాచీనపద్ధతుల్ని, ఎన్ని విధాల నవీన పద్ధతుల్ని కలిగివున్నారనే విషయం తెలుస్తుంది. ఎస్కిమోలు తమ గృహాలను నిర్మించుకోడానికి మంచు గడ్డలనే ఉపయోగిస్తారు. ఇటు

కల్లాగా మంచుగడ్డలను పేర్చి అర్ధగోళాకారంలో ఎస్కిమోలు కట్టే ఇళ్ళకు 'ఇగ్లూ' అని పేరు. వాన తక్కువగా వుండే ఆఫ్రికాలోని సహారా ఎడారిలో గురి అవుతూవుంటారు. కాబట్టి కిటికీలు ఉండవు. తలుపులూ చిన్నవిగా ఉంటాయి.

ప్లీస్టోసీన్ యుగంలో ఆదిమానవునికి గుహ నివాసంగా ఉండేది. గుహ రూపంలో ఒతనికి సహజమైన గృహాన్ని ప్రకృతే ప్రసాదించి నట్లయింది. భయంకరమైన తుఫానులనుంచి, క్రూరమృగాలనుంచి మనిషిని గుహ రక్షించింది అయితే కొన్ని కష్టాలూ దాపురించాయి. ఒకే స్థలంలో నివసించడం వల్ల వేట మృగాలు దొరక్కపోవడం, నీళ్ళు లభించక పోవడం వంటి సమస్యలుత్పన్న మయ్యాయి. అందువల్ల గుహలను వదిలి అక్కడక్కడా చిన్నచిన్న ఇళ్ళు కట్టుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. ఆఫ్రికాలో ఆది వాసులు చెట్లుపట్లను అర్ధ చంద్రాకారంగా కుట్టి గుడిసెలను వేసుకుంటారు. ఆఫ్రికాలో ఉండే గుజ్జారులు ఐదు అడుగులకంటె పొట్టి గోడలు కట్టి వెడల్పాటి ఆకుల్ని కప్పి గుడిసెల్ని నిర్మించుకుంటారు. ఆస్ట్రేలియాలో గుడిసెలు కన్పించడం అరుదు. మట్టితో చిన్న ఇళ్ళుకట్టు కుంటారు. దోమల బాధనుంచి తప్పించుకోడానికి చిన్నతలుపు మాత్రం పెట్టుకుంటారు. ఉత్తర క్వీన్స్‌లాండ్‌లో చిన్న చిన్న ఇళ్ళు కట్టుకొనే వాడుక ఉన్నా అక్కడి ఆదివాసులు బయలు ప్రదేశాల లోనే ఎక్కువగా గడుపు తుంటారు. ఒక్కొక్కరి దగ్గర ఒక చిన్న నిప్పుల కుండవంటిది ఉంటుంది. చలికాలంలో కూడా వీళ్ళు ఆరు బయటనే పడుకుంటారు.

నీలగిరిలో నివసించే తొదవలు వెదురుబొంగులతో ఇళ్ళు కట్టుకుంటారు. కప్పుకు ఎండుగడ్డిని ఉపయోగిస్తారు. అన్ని ఇళ్ళు ఒకే రకంగా ఉంటాయి. కాశ్మీరు,హిమాచలప్రదేశంవంటి చోట్ల చెట్లువిస్తారంగాలభిస్తాయి కాబట్టి ఇళ్ళు కట్టుకోడానికి కొయ్యను ఎక్కువగా ఉపయోగిస్తారు. హిమాచల ప్రదేశంలో రెండస్తుల ఇళ్ళనూ కట్టుకుంటారు.కింది అంతస్తును నివాసానికి ఉపయోగించుకుంటారు. మధ్యప్రదేశంలో రాళ్ళతో కట్టుకున్న ఇళ్లు ఎక్కువగా కనిపిస్తాయి. వానతక్కువగా ఉండే మహారాష్ట్రలోని ఆదివాసులు మట్టితో ఇళ్లు కట్టుకుంటారు. కర్నాటకంలోని బయలుసీమ, దక్షిణ కర్నాటకం, చిత్రదుర్గ,

కోలారు వంటి వాన తక్కువుండే ప్రదేశాలలో మట్టి ఇళ్ళు కనిపిస్తాయి. రాళ్ళు ఎక్కువగా ఉండే చోట రాళ్ళతోనే గృహనిర్మాణం కొనసాగిస్తారు. వర్షపాతం ఎక్కువగా ఉండే మలెనాడు, కరావళి వంటి కర్నాటక ప్రాంతాలలో వానసీళ్లు కప్పుమీద పడి కిందికి జారి వచ్చేరకంగా ఇళ్ళు నిర్మించుకుంటారు.

జానపద వాస్తువు–స్వరూపస్వభావాలు :

జానపద వాస్తువన్నది సాంప్రదాయిక వాస్తువు. తరతరాలుగా గృహాలను నిర్మించే విధానాలు, ఆకారం, రూపం, చోటు, వాడే పదార్థాలు, వివిధరకాల గృహాల వల్ల ఉపయోగం మొదలైనవి ఇందులో చర్చించాల్సిన విషయాలు.[1] జానపద గృహనిర్మాణ విధానాలు శాస్త్రీయ వాస్తువుకు ( Academic archi tecture)భిన్నమైనవి. శాస్త్రీయ వాస్తువు వివిధ శాస్త్రాలద్వారా, విద్యా విధానం ద్వారా నేర్చుకున్నది. జానపద వాస్తువు ఒక తరంనుంచి ఇంకోతరాకినినేరుగా సంక్రమించే జనప్రియ వాస్తువు. ఈ రెండు రకాల గృహ నిర్మాణాలు పరస్పర ప్రభావానికి గురి అయినవే. సాంప్రదాయికంగా జానపదులు వాడుతూ వస్తున్న పదార్థాలనే శాస్త్రీయ వాస్తువులో కూడా వాడవచ్చు. ప్రాచీనకాలంలో బండరాళ్ళను ఉపయోగించి ఇళ్ళు కట్టుకునే పద్ధతి ఉండేది. దాన్ని దేవాలయాలకు ఎక్కువగా ఉపయోగించడం మనకు తెలిసిందే. నేడు గృహనిర్మాణంలో కూడా రాతిఇటుకలను వాడడం కనిపిస్తున్నది. ఇలాంటి వస్తువులు ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క రకమైన గృహనిర్మాణంలో గృహనిర్మాణానికి ఉపయోగపడవచ్చు. మొదటి నుంచి ఆదివాసులుకట్టుకుంటున్న గుడిసెలు ఎండాకాలంలో,వానాకాలంలో కూడా ఎంతచక్కగాఉపయోగిస్తాయన్నది తెలుసుకున్న నాగరికులు, గుడిసెలనే ఆధునిక రీతిలో నిర్మించుకునే పద్ధతుల్ని అవలంబించడమూ చూస్తూనే వున్నాం. వీటికే మోటల్స్ అనో, మరోపేరో పెట్టి సహజవాతావరణంలో నాగరికులు ఉపయోగించడం నేడు కనిపిస్తుంది.

మొత్తంమీద జానపదవాస్తువు ప్రకార్యాత్మక మైనదనడంలో సందేహం లేదు. జానపదులు తమ గృహాలను ఫాషన్‌కోసం కాక ఉపయోగంకోసం కట్టుకుంటారు. గృహనిర్మాణ అధ్యయనం వల్ల అనేక విషయాలు తెలిసి వస్తాయి. ఒక జనసముదాయం ఎక్కడ నివసిస్తున్నది, ఎంతకాలం నివసించేది, ఏ పరిసరాల్లో నివసించేది గృహనిర్మాణం వల్ల వ్యక్తమవుతుంది. ఆ

ప్రాంతంలో వర్షపాతం ఎక్కువా, తక్కువా, ఎండలు ఎక్కువా, చలిఎక్కువా అది అడివి ప్రదేశమా, బయలు ప్రదేశమా, ఎడారి ప్రదేశమా అన్నదాని మీద కూడా గృహనిర్మాణం ఆధారపడి వుంటుంది.

ఆంధ్రదేశంలో దేశదిమ్మరులు, స్థిరనివాసం ఏర్పరచుకున్నవారు, చిన్నచిన్న గుడిసెలలో గూడెములు కట్టుకునేవారు, మట్టితో పూరిళ్ళువేసుకునే వారు, పెంకుటిళ్ళు నిర్మించుకునేవారు ఉన్నారు. అరణ్యవాసులు, గ్రామ వాసులు, గిరిజనులు, సముద్రప్రాంతంలో నివసించేవారు, నదీద్వీపాల్లో నివ సించేవారు ఉన్నారు వీరంతాతమతమ వాతావరణానికి తగ్గట్లు గృహనిర్మాణాన్ని చేసుకున్నారు, చేసుకుంటున్నారు. ఆంధ్రలోని ఆదిమవాసులైన యానాదులను గురించి ఒక సామెత ఉంది. యానాదులగ్రామాలు, ఏనుగుల మందలు ఉండ వన్నదే ఆ సామెత. యానాదుల గుడిసెలన్నీ ఒకే రకంగా ఉంటాయి. వాటికి కావలసిన కలపను చెట్లికొమ్మలద్వారా వారు సమకూర్చుకుంటాడు. ఈ గుడిసెలఎత్తు పది అడుగులుండవచ్చు. అంతకంటె పెద్దవి ఉండవు. వెడల్పు ఐదారడుగులు ఉంటుంది. వెదురు బొంగులనుతీసుకొని వలయాకారంగా తవ్విన కలుగుల్లోకి చొప్పించి వాటి కొనలను ముడివేస్తారు. దానిపైన ఒక కుండను బోర్లిస్తారు. దీనివల్ల వర్షపునీరు గుడిసెలోకి రాకుండావుంటుంది. నేలనుంచి వెదురు బొంగులచివరివరకు తాటాకులను పేర్చి నారతో కుట్టే స్తారు. వెదుళ్ళలో ఒకటి రెండడగుల ఎత్తున మట్టిపేర్చి చిన్న గోడలాగాకట్టు కుంటారు దీనివల్ల వాననీళ్ళు గుడిసెలోకి రాకుండా వుంటాయి. వెదురుబొంగు లకు ఆధారమూ దొరుకుతుంది. వాకిట్లోనే గుంటపొయ్యి, నీళ్ళకుండలు, చెంబులు వుంటాయి. మరొకవైపు తట్టలు, బుట్టలు, తప్పెట, ఈతాకులచాప మొదలైనవి ఉంటాయి. కొంతమంది యానాదులు గుడిసెమీదికి సొర, గుమ్మడి మొదలైన తీగలను వదలి కొంచెం కూరగాయలు కూడా పండిస్తారు. పొలంకాపరులైన యానాదులు ఎత్తయిన మట్టిదిబ్బలమీద గుడిసెలు కట్టుకుం టారు అక్కడొకటి, ఇక్కడొకటి యానాదిగుడిసె వుంటుంది. "యానాదుల గుడిసెలు వారికి చాలియుండవని మనం అనుకోవలసినదే కాని వారికి అట్టి చింత ఎన్నడు కలిగియుండలేదు. పొడుగైనకాళ్లు ఇమడకపోతే గుడిసెవాకిలి గుండ వెలుపలికి చాచుకుంటారు. చుట్టాలు వచ్చినప్పుడు అందరు ప్రొద్దు పొయ్యేవరకు చిందులు త్రొక్కుతూ వెలుపలే పడుకుంటారు. చినుకులుపడ్డ

పుడు మెలికలుతిరిగిన శరీరాలతో ఉంగరాలవలె నిద్రాతిగుంజ చుట్టు గాఢ నిద్రలో మేనుమరుస్తారు'' (వెన్నెలకంటి రాఘవయ్య 1974;36)

బోయలు మొదలైనవారు నూతన శిలాయుగంనాటి గృహనిర్మాణ పద్ధతుల్ని అనుసరిస్తారు. నూతన శిలాయుగంలో కొద్దిపాటి సొలుపులున్నచోట రాళ్ళుపేర్చి వేదికలను తయారు చేసుకునేవారు. లేదా కొండపైన నెత్తంలో కాస్త చదునుగా వుండే ప్రదేశాలలో గుండ్రని గుడిసెలు వేసుకునేవారు. వెదురుపేళ్ళదడులు కట్టి, పేడామట్టి కలిపి గోడలాగా తయారు చేసుకునేవారు. నేలపైన రాళ్ళుపరిచి అడుసుతో అతికి సమంచేసుకునేవారు. బోయలు నేటికీ ఇలాగే ఇళ్ళుకట్టుకుంటారు, ఒక్కొక్కచోట పదిపదిహేను గుడిసెల బోయ గూడెం నిర్మించుకొని సుమారు నూరుమంది ఒక్కచోట నివసిస్తారు.

పల్లెటూరి జీవితంలో పూరిల్లు ప్రధానస్థానం ఆక్రమిస్తున్నది. శ్రీమంతులుకూడా ఇంటిలో కొంత భాగాన్నయినా పూరిల్లుగా ఉంచుకోవడం గ్రామ జీవితంలో భాగంగా ఉంటున్నది. ఆంధ్రదేశం ఎండలతోమండి పోయే ప్రాంతంకాబట్టి పూరిల్లు ఇచ్చేచల్లదనం జానపదులకు తెలుసు. గోడలు వారి వారి స్తోమతలను బట్టి మట్టితోనో, ఇటుకలతోనో, రాళ్ళతోనో కట్టుకున్నా పైకప్పు గడ్డితో ఉంటుంది. ఇల్లుమిద్దె ఇల్లయినా పశువుల కొట్టాలు మొదలైనవి మాత్రం పూరిళ్ళుగానే వుంటాయి. అగ్నిప్రమాదాలు జరిగినప్పుడు మొదట బలి అయ్యేది పశువులే. ఇంటికప్పుకు కావలసిన దృఢత్వాన్నిబట్టి వెదురు బొంగులనో, ఊకుదూలాలనో వారి వారి స్తోమతనుబట్టి వాడుకుంటారు. మధ్య మధ్య వెదురు బొంగులనుపెట్టి పైన తాటాకులను సమంగాపేర్చికుట్టి దానిపైన ఎండుగడ్డిని సమంగా పరిచి అన్నికాలల వాతావరణాలకు తగినట్లుగా ఇంటిని కట్టుకుంటారు.

జానపద వాస్తువులో చేరే విషయాలను, వాటి స్వరూపాన్ని అర్థంచేసుకోవాలన్నా, అధ్యయనం చెయ్యాలన్నా వర్గీకరణ అవసరం. జానపద విజ్ఞానాన్ని శాస్త్రీయ పంథాలలో వర్గీకరించి ఆ క్షేత్రానికి మహోపకారం చేసిన ఆర్. ఎస్. బాగ్స్ వాస్తువునుకూడా సూక్ష్మంగా వర్గీకరించి చూపాడు (Standard Dictionary of Folklore, Mythology and Legend p. 1145) ఆయన విభజన ఈ క్రింది విధంగా వుంది.

M 800 వాస్తువు

M 820 వస్తువుల విభజన, స్థిరనివాసం

M 840 శాశ్వత నివాసం, తాత్కాలిక నివాసం

M 842 యోజన. విన్యాసం, రంగు, నిర్మాణవస్తువులు, నిర్మాణవిధానం.

M 844 పునాది, గచ్చు

M 845 గోడ, మధ్యగోడలు, తలుపులు, కిటికీలు

M 846 పైకప్పు

M 848 అదనపు విభాగాలు
ఒళ్ళుకాచుకోడానికి, పొయ్యి, దీపాలు మొదలైనవి.

M 850 ప్రత్యేక ప్రయోజనాలుకల ఇతర విభాగాలు

M 852 నివాసస్థానానికి అనుబంధంగా వుండేవి
వంటఇల్లు, స్నానపుగది,
మరుగుదొడ్డి మొదలైనవి

M 853 ఆహారపదార్థాలు భద్రపరిచే స్థలం

M 854 పెంపుడు జంతువులు మొ॥ ఉంచే ప్రదేశాలు

M 855 ఇతరవస్తువులను భద్రపరిచే స్థలాలు

M 856 మిల్లు

M 857 కొలిమి

M 858 అమ్మకంస్థలాలు
అంగడి, పానీయాల దుకాణం మొ॥వి

M 860 జనోపయోగిస్థలాలు

M 862 పవిత్రస్థలాలు, దేవాలయాలు

M 864 బావడి మొ॥వి

M 866 పాఠశాల

M 868 నృత్యం, ఆట, నాటకం మొదలైన వాటికోసం కేటాయించిన స్థలాలు

M 880 స్మృతి చిహ్నాలు, ఇతరకట్టడాలు

M 882 సమాధి

M 883 స్మృతికట్టడాలు

M 885 వంతెనలు

M 887 బావులు, చిమ్మయంత్రాలు మొ॥వి

పైన పేరొన్న అన్ని రకాల కట్టడాలకూ సరళమైన జానపద విధానాలు ఆంధ్రదేశంలో ఉన్నాయి. జానపద గృహనిర్మాణంలో పైన పేర్కొన్న వన్నీ ఉండాల్సిన అవసరమూ లేదు. ఉండనూ ఉండవు. ఒక్క గదికే గతిలేని గిరిజనులు మొదలైన బడుగువర్గాలవారికిస్నానపుగదులు, మరుగుదొడ్లుఎక్కడి నుంచి వస్తాయి. అయితే జానపదులలో కొంత పాడిపంటఉన్న వారైతే ధాన్యాగారం, పశువులకొట్టం, ఎరువువేసేచోటు, స్నానానికొక మరుగు, గడ్డివాములువేసే ప్రదేశాలు మొదలైనవి స్తోమతనుబట్టి ఉంటాయి.

టిప్పణి

1. "Folk architecture may be said to be traditional architecture. It is concerned with all traditional aspects of building; the shapes, sizes and layouts of buildings of all kinds, such as dwellings, barns, sheds, and craft shops; the materials used and the tools and techniques of building, the sites chosen and the placement of various buildings on the site; and the use to which buildings and various parts of buildings were put"–Warren E.Roberts, *Folklore and Folklife* (Ed. Richard M. Dorson), 281.



# జానపద వస్తుప్రదర్శనాలయాలు

రష్యా మొదలైన కమ్యూనిస్టు దేశాలలో కూడా దేవాలయాలకు జనం వెళ్ళకపోవచ్చు కాని, ప్రదర్శనాలయాలకు మాత్రం తప్పక వెళ్తారు. ముఖ్యంగా రష్యాలో తరతరాల సంస్కృతిని వస్తుప్రదర్శనాలయాలలో భద్ర పరిచి వాటినుంచి నేర్చుకోవలసిందంతా నేర్చుకుంటారు. ఒక ప్రదేశానికిగాని, జనసముదాయానికిగాని చెందిన సంస్కృతిని గురించి తెలుసుకోవాలన్నా ఆ సంస్కృతిని అధ్యయనం చెయ్యాలన్నా వస్తుప్రదర్శనాలయాల అవసరం ఎంతో ఉంది. ముఖ్యంగా జానపదుల వస్తుసంస్కృతి స్వరూపం ప్రదర్శనాల యాలవల్ల సువ్యక్తమవుతుంది. జానపదుల జీవితంలో ప్రతిఘట్టంలోను ఉప యోగించే వస్తువుల నన్నిటినీ సేకరించి, వర్గీకరించి, భద్రపరచడంవల్ల మనిషి జీవన విధానంలోని ప్రధానమైన ఒక భాగమంతా మనకళ్ళఎదుట కట్టినట్లవుతుంది.

విదేశాలలో వివిధోద్దేశాలకు అనుగుణంగా వందలకొద్దీ వస్తుప్రదర్శ నాలయాలేర్పడ్డాయి. మనదేశంలో కూడా సాలార్‌జంగ్ మ్యూజియం, ఢిల్లీ లోని జాతీయవస్తు ప్రదర్శనశాల, మద్రాసులోని ప్రభుత్వవస్తుప్రదర్శనశాల, బెంగుళూరులోని విశ్వేశ్వరయ్య సాంకేతిక వస్తుప్రదర్శనాలయం మొదలైనవి సంస్కృతిని, విజ్ఞానాన్ని సామాన్య జనులకు కూడా సుబోధమయ్యేలా ప్రద ర్శిస్తున్నాయి. ఇవికాక ఆంధ్రప్రదేశ్, కర్నాటక, తమిళనాడు, బెంగాలు వంటి ప్రాంతాల విశిష్ట సంస్కృతిని ప్రతిబింబించే వస్తుప్రదర్శనాలయాలనుఏర్పాటు చేయడం చాలా అవసరం. తరతరాలుగా మౌఖికంగానేకాక ఇతర విధాలుగా ప్రసారం పొందుతూ నేటివరకు జనజీవనంలో నిలిచివున్న సాంప్రదాయిక విజ్ఞానాన్ని భద్రపరచడం మనకర్తవ్యం. జానపద వస్తుప్రదర్శనాలయం నిజ మైన జ్ఞానాలయం, మన సంస్కృతికి ప్రతిబింబం, జనజీవనానికి ప్రతిరూపం

జానపద విజ్ఞానానికి చెందిన వస్తువుల్ని ప్రదర్శించాలనే ఉద్దేశం మొదట ఐరోపా దేశాలలో కలిగింది. యాంత్రికనాగరికత వెర్రితలలు వేస్తున్న

దృష్ట్యా నిజమైన సంస్కృతికి విలువలేకుండాపోతున్నదని తెలుసుకొని, యూరపుజనులు జానపద వస్తు ప్రదర్శనాలయాలను ఏర్పాటుచేయసాగారు. కమ్యూనిస్టుదేశాలలో సంస్కృతి నుంచి నేర్చుకోవాల్సిన పాఠాలెన్నో ఉన్నా యనే వివేకంతో బృహత్ప్రమాణంలో వస్తుసంస్కృతిని సేకరించి ప్రదర్శ నాలయాల్లో ఉంచారు. అంతేకాక జానపద విజ్ఞానాన్ని జాతీయతా భావనను పెంపొందించడానికి, విప్లవ మనోభావాలను కలిగించడానికి వాడుకున్నారు వస్తుప్రదర్శనాలయాలను ఏర్పాటుచేసే ఉద్యమం మెల్లిగా అమెరికాకు కూడా పాకింది. అక్కడకూడా పెద్ద పెద్ద ప్రదర్శనాలయాలు వెలిశాయి.

స్వీడన్‌లోని అర్తర్ ఆజిలన్ 1872 లో జానపద వస్తుప్రదర్శనాల యాన్ని శాస్త్రీయ పద్ధతుల్లో ఏర్పాటుచేసి ఈ ఉద్యమానికి ఆద్యులయ్యారు. 1887లో సాన్లెర్ సాండ్‌విగ్ నార్వేలో మరో ప్రదర్శనాలయాన్ని ఏర్పరి చారు. తర్వాత డెన్మార్క్, హాలండ్ జర్మని, అమెరికా, రష్యా మొదలైన చోట్ల అద్భుతమైన జానపద వస్తుప్రదర్శనాలయాలు ఏర్పడ్డాయి.

ఈ వస్తుప్రదర్శనాలయాలు రెండురకాలుగా వున్నాయి. కొన్ని బహిరంగ ప్రదర్శనశాలలు, కొన్ని అంతరంగ ప్రదర్శనశాలలు. విదేశాలలో చాలా విస్తీర్ణమయిన ప్రదేశాలలో ఏర్పాటుచేసే బహిరంగప్రదర్శనాలయాలే ఎక్కువగా ఉన్నాయి. బయటప్రదేశంలో, నిసర్గమనోహరమైన వాతావరణాన్ని సృష్టించి జానపద జీవనం అత్యంత సహజంగా ప్రతిబింబించేరీతిలో వస్తు ప్రదర్శనశాలలు వెలశాయి. ప్రాచీన జానపదాలనే పునర్నిర్మించి మనల్ని ఒక అద్భుతలోకానికి తీసుకునిపోయే ప్రయత్నం వీటిలో జరిగింది. ఈ వస్తుప్రద ర్శనాలయాలను ఏదో జానపద విజ్ఞానానికి సంబంధించిందేకదా అనే తేలిక దృష్టితో కాక, ఎంత గంభీరమైన దృష్టితో నెలకొల్పారో చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. వస్తు ప్రదర్శనాలయం అనగానే నిర్జీవ వస్తువుల సముదాయం అనేభావనే మనకు కలుగుతుంది. కాని విదేశాలలోనివి నిజమైన 'ప్రదర్శనా' లయాలే. మామూలుగా అయితే ఇలాంటిచోట్ల వివిధవృత్తులకు సంబంధించిన పరికరాలు, ఆచారాలు, గృహపరికరాలు, వివిధకళలకు సంబంధించిన వస్తువు లను ప్రదర్శిస్తారు, కాని మానవుడు ఈ వస్తువుల్ని ఏ విధంగా వుపయోగించే వాడు, వాటితో ఏంచేసేవాడు, వస్తులను ఏవిధంగా ధరించేవాడు, ఆభరణాలను

ఎలాతొడుక్కునేవాడు అని మనకు తెలియదు. అందువల్ల కొన్ని ప్రదర్శనా లయాలను సజీవప్రదర్శనాలయాలుగానే తీర్చిదిద్దారు. దీనికోసమే ఉద్యోగులను నియమిస్తారు. ఆ ఉద్యోగులు పనివేళల్లో తమదుస్తుల్ని తీసివేసి, సాంప్రదాయిక మైన వేషభూషణాలను ధరించి ప్రాచీన కాలంనుంచి ఒకతరంనుంచి మరొక తరానికి సంక్రమించిన వివిధ వృత్తివిద్యలను ప్రదర్శిస్తారు. ఈ ప్రదర్శనా లయాలు మనల్ని గతకాలంలోకి తీసుకువెళ్ళి అప్పటి సంస్కృతిని సజీవంగా చూపిస్తాయి.

మనదేశంలో ప్రతి ప్రాంతమూ ఒక సాంస్కృతిక కేంద్రమే. ప్రతి పల్లెటూరు ఒక జానపద విజ్ఞాన కేంద్రమే. ప్రతిరాష్ట్రంలోను ఆయాభాషా సంస్కృతులను తెలుసుకునేందుకు తగినట్లుగా పెద్ద వస్తుప్రదర్శనాలయాల్ని ఏర్పాటు చెయ్యాలి. మనం జానపదవస్తు ప్రదర్శనశాలను ఏవిధంగా రూపొం దించాలన్న దానికి ఉదాహరణగా మైసూరులోని జానపదవస్తుప్రదర్శనాలయాన్ని చెప్పుకోవచ్చు.

మైసూరు విశ్వవిద్యాలయంలోని కన్నడ అధ్యయన సంస్థకు అనుబం ధంగా జానపదవస్తు ప్రదర్శనాలయం ఉంది. ఒక దశాబ్దంక్రితమే ఏర్పాటై దినదినాభివృద్ధి చెందుతున్న ఈ వస్తుప్రదర్శనాలయంలో ఉండే వివిధ విభా గాలు, వాటిలో భద్రపరచబడిన వస్తువులు, కర్నాటక సంస్కృతీపై విధ్యాన్ని కళ్ళకు కట్టినట్లుచూపుతున్నాయి ఈ వస్తుప్రదర్శనాలయంలో వేలకొద్దీ వస్తు సంస్కృతికి సంబంధించిన వస్తువులున్నాయి. ఇది ఒక విశాలమైన భవనంలో శాస్త్రీయరీతిలో ఏర్పాటయింది. వస్తువులను సేకరించేటప్పుడు వాటికాలం, ప్రదేశం, ఎన్నిసంవత్సరాల క్రితం వాడుకలోఉంది, సేకరించిందెప్పుడు, ఆ ప్రాధాన్యం ఏమిటి, వగైరా విషయాలను తెలుసుకోడం జరుగుతుంది. ఈ వస్తుప్రదర్శనాలయంలో వివిధ గృహోపకరణాలు, లోహవస్తువులు, మట్టితో చేసినవి, వివిధవృత్తులకు సంబంధించిన పరికరాలు, వ్యవసాయోపకరణాలు, దుస్తులు, ఆదివాసుల గృహాల నమూనాలు, వాటి వస్తువులు, ఆయుధాలు, చెక్కడపు పనులు, యక్షగాన బయలాటల వేషభూషణాలు, తోలుబొమ్మలాటల వస్తువులు, కొయ్యబొమ్మలాటల వస్తువులు, పూజాసామగ్రి, వాద్యాలు, జానపద చిత్రాలు, క్రీడాసాధనాలు, పిల్లల ఆటపాటలకు సంబంధించినవి, తేరు, గ్రామ

దేవతలు, కొయ్యతోచేసిన అనేక ప్రతిమలు సేకరించిపెట్టారు. వస్తువులను మాత్రమేకాక ఈ ప్రదర్శనాలయానికి అనుబంధంగా గేయాలను, కథాగేయాలను, ఇతర మౌఖిక సాహిత్యరూపాలను ధ్వనిముద్రణద్వారా భద్రపరచడం, అప్పుడప్పుడు జానపద సాహిత్యరూపాలను ప్రదర్శించడం, జానపదసంగీతాన్ని ప్రదర్శన శాలలోని అన్నిగదుల్లో వినిపించేట్లు చేసి దాని మాధుర్యాన్ని చవి చూపడం వంటి కార్యక్రమాలుకూడా ఈ వస్తుప్రదర్శనాలయంలో జరుగుతున్నాయి. మైసూరులోని జానపద వస్తుప్రదర్శనాలయంలోని వస్తువుల ప్రముఖ భాగాలివి (ప్రొ॥జీ. శ. పరమశివయ్య, జానపద, 1978, పు 63);

1. నిత్యజీవితంలో వాడేవస్తువులు
2. యక్షగానబయలాటల వేషభూషణాలు
3. వివిధరకాల బొమ్మలాటల బొమ్మలు
4. లోహపు సామానులు
5. పూజా వస్తువులు
6. వాద్యవిశేషాలు
7. జానపద చిత్రకళ
8. కొయ్య చెక్కడపుపనులు
9. ఆయుధ విశేషాలు
10. వ్యవసాయ సాధనాలు
11. మట్టితో చేసిన వస్తువులు
12. అల్లికపు పనులు
13. వివిధ వృత్తులకు సంబంధించిన పరికరాలు
14. ఉడుపులు
15. ఆదివాసుల వస్తువులు
16. కసరత్తు వస్తువులు
17. క్రీడా సాధనాలు
18. పిల్లల సామగ్రి

19. కొయ్యతోచేసిన విగ్రహాలు మొ॥వి.

20. తేరులు

21. ఇతర అపూర్వవస్తువులు

వస్తుప్రదర్శనశాల చేయవలసిన పనులు ముఖ్యంగా నాలుగు రకాలుగా వుంటాయి. 1. వస్తువుల్ని సేకరించడం 2. సేకరించిన వస్తువుల్ని కాపాడడం 3. వస్తువుల్ని సరైన భంగిమలో, సరైన స్థలంలో ప్రదర్శించడం 4. వస్తు సంస్కృతిని గురించిన పరిశోధనకు అవకాశం కలిగించడం.

వస్తువుల్ని సేకరించడమంటే ఏదో ఒక వస్తువును, ఎక్కడో ఒకచోట, ఎప్పుడో ఒకప్పుడు సేకరించడంకాదు. సేకరించిన వస్తువుల్ని కాపాడడం చక్కగా ప్రదర్శించడం కూడా ఒక కళే.

ఆంధ్రదేశం ప్రత్యేక సంస్కృతికల జనసముదాయంతో కూడిన భౌగోళిక ప్రదేశం. తెలుగు సంస్కృతి అంటే ఏమిటి, అది వేరు సంస్కృతుల కన్నా ఏయే విషయాల్లో భిన్నమైంది అని తెలుసుకోవాలంటే వస్తు సంస్కృతిని భద్రపరచడం ఒక మార్గం. భావితరాలవారుఇది మన సంస్కృతి అని చెప్పుకునేందుకు తగ్గట్లుగా ఒక జానపద వస్తు ప్రదర్శనాలయాన్ని బృహత్పరిమాణంలో ఏర్పాటు చెయ్యడం అవసరం.



# జానపద కళలు

జానపద విజ్ఞానంలో అధ్యయనం చెయ్యాల్సిన చివరి ప్రముఖ విభాగం జానపద కళలు. మౌఖిక జానపద విజ్ఞానం, సాంఘికాచారాలు, వస్తు సంస్కృతి అన్న మూడు విభాగాలలో ఇంతవరకు పరిశీలించిన జానపద అంశాలలో కళాత్మక గుణం లేక పోలేదు. మొదటి విభాగంలోని కవిత్వం, రెండవ విభాగంలోని వినోదాలు, మూడవ విభాగంలోని చిత్రకళ, శిల్పం కళలే. సంగీతం, నృత్యం, రూపకం అన్నది పై వాటితో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సంబంధం కలవి. అయితే కవిత్వాంశకే ప్రాధాన్యం వుంటే అది మౌఖిక విజ్ఞానంలో చేరుతుంది. లేక పాట, వేషం, అలంకారాలు, సంగీతం, నృత్యం మొదలయినవన్నీ కలిసి కోలాటం వంటిది రూపొందితే అది జానపద కళ అనే ప్రత్యేక విభాగం క్రిందికి వస్తుంది. అట్లే యక్షగాన సాహిత్యం మౌఖిక కళ అయితే (యక్షగానమంటే తంజావూరు యక్షగానం కాదు, జానపదుల యక్షగానం) సాహిత్యంగా, రంగస్థలం మీద ప్రదర్శించ బడితే కళగా పేర్కొనబడుతుంది. శాస్త్రీయంగా అధ్యయనం చేసేటప్పుడు 'జానపద కళలు' అన్నపదాన్ని పారిభాషిక శబ్దంగా స్వీకరించాలని దీని సారాంశం. కళ అన్న విస్తృతార్థ ద్యోతకమైన పదం జానపద విజ్ఞానంలో పరిమితార్థంలో వాడ బడుతున్నది. సంగీతం, నృత్యం, రూపకం అనే మూడింటికి సంబంధం ఉన్న వాటిని జానపద కళలుగా విద్వాంసులు పేర్కొన్నారు.

సాంప్రదాయికంగా మనవారు అరువైనాలుగు కళలను పేర్కొంటూ వచ్చారు. కవిత్వం, సంగీతం, చిత్రలేఖనం, శిల్పం, నాట్యం అన్నవాటిని లలితకళలని చెప్పడం పరిపాటి. అయితే జానపద కళల విషయంలో సంగీత నృత్య రూపకాలనే ప్రధానంగా తీసుకోడం జరిగింది. జానపద కళల్లో ఈ మూడింటిలో ఒక్కటి గాని లేక రెండు, మూడు గాని ఉండాలి. సంగీతంలో గాత్ర సంగీతం, వాద్యసంగీతం వుండవచ్చు. నృత్యం సంగీతంతో కూడినది

కావచ్చు. పండుగలకు సంబంధించిన నృత్యం ఉండవచ్చు: ఇతర వినోదాలకు సంబంధించినదై ఉండవచ్చు. రూపకం మిశ్రకళ కాబట్టి కవిత్వం, వినోదం, చిత్రకళ, వేషభూషణాలు మొదలైనవన్నీ అందులో కలిసివుంటాయి.

జానపదకళల్లో ముఖ్యమైన వాటిని విభజించి ఈ క్రిందివిధంగా చూపవచ్చు.




కళ అన్నపదాన్ని పరిమితార్థంతో తీసుకోడంతోబాటు 'జానపద కళలు' వేరే కళలకంటె ఏ విధంగా భిన్నమైనవి, వాటి విశిష్ట లక్షణాలేమిటి అన్న విషయాన్ని కూడా పరిశీలించాలి. జానపద కళలకు జానపద విజ్ఞానం లోని ఇతర విభాగాలలో పెక్కింటికి సంబంధ ముందని ముందే చెప్పబడింది.

సంగీతనృత్యరూపకాలు మూడింటితోను జానపదసాహిత్యానికి సంబంధ ముంది అల్లే ఈ మూడింటికి పండుగలు, ఆటలు, వినోదాలు, నమ్మకాలు, మతం మొదలైన వాటిలో సంబంధం ఉంది. సంగీతంలో వాద్యాలు, రూపకాలలో వేషభూషణాలు, చిత్రకళ, శిల్పం మొదలైనవి వాడడం జరుగుతుంది. అందువల్ల జానపద కళలు మిగిలిన జానపద విజ్ఞానాంశాలు పరస్పరం పూరకమైనవి.

తంలో నేటి శాస్త్రీయ సంగీతానికి సంబంధించి అనేక రాగాలు, రాగచ్ఛాయలు వినిపిస్తాయి. "ఉదాహరణకు కర్నాటకంలోని నాగరహొళె దగ్గర నివసించే పెట్టకురుబరనే ఆదివాసుల పాటలలో ఖరహర ప్రియరాగంలోని అనేక స్వర సంచారాలను చూడవచ్చు" (కన్నడ విశ్వకోశ సం.7 ప్ర. 709). "భారత దేశంలోని నాగాజనుల్లో పాశ్చాత్యసంగీతంలాంటి సాంగత్య పద్ధతి (హార్మోనిక్‌మ్యూజిక్) కనిపిస్తుంది. భారత దేశంలోని ఇతర ప్రాంతాలలో రాగప్రధానమైన (మెలొడిక్) సంగీతం వినబడుతుంది. భారత జానపద గాన పద్ధతుల్లో సమానగుణాలు గమనార్హమైనవి. గుజరాతులో దుహాలు. మహారాష్ట్రి లావణులు, ఒరిస్సాలో గీత కావ్యాలు, ఉత్తర కర్నాటకంలో గిగిపదాలు, పాత మైసూరు లావణులు-వీటి అన్నిటి లోని నాదరూపంలో పోలిక అద్భుతమైనది" (కన్నడ విశ్వకోశ-సం. 7 పు. 709-710).

సంగీతంలో వాద్య సంగీతం, గాత్ర సంగీతం, సాహిత్యం అన్నవి మూడు ప్రధాన భాగాలు. వాద్యసంగీతం ప్రత్యేకంగా ఉండవచ్చు లేక గాత్ర సంగీతానికి సహకారిగా ఉండవచ్చు. జానపద గేయాలతోగాని, కథాగేయాలలో గాని అనుబంధంగా పాడే సంగీతానికి ఎక్కువ వాద్యాలు అవసరంలేదు. ఒకటో రెండో ఉంటేచాలు. వాద్య సంగీతం అరవైనాలుగుకళల్లో ఒకటి. వీణావేణు మృదంగాలు వాద్య త్రయమని వేదకాలంలోనే వాడుక. భారత దేశంలో అయిదువందలకంటె ఎక్కువ వాద్యాలున్నాయి. వీటిలోకొన్ని తంత్రీ వాద్యాలు, కొన్ని లోహవాద్యాలు, కొన్ని చర్మ వాద్యాలు, మరికొన్ని ఊదే వాద్యాలు. ఇవన్నీ చేతితో తయారు చేసేవే. శాస్త్ర దృష్టితో కొందరు తంత్రీ వాద్యాలని, వాయు వాద్యాలని, తాళ వాద్యాలని విభజిస్తారు. సంగీత వాద్యాలను సూక్ష్మంగా వర్గీకరించిన కొందరు మేళవాద్యాలు, దేవాలయ వాద్యాలు, రణ వాద్యాలు, జానపద వాద్యాలు అని విభజించారు.

1. మేళవాద్యాలు : i) శ్రుతి వాద్యాలు-తంబుర మొ॥వి. ii) లయవాద్యాలు—మృదంగం వంటివి. iii) సంగీత వాద్యాలు—వీణ, ఫిడేలు, నాదస్వరం మొ॥వి.
2. దేవాలయ వాద్యాలు: తంత్రాలు, ముఖవీణ, శంఖం, గంట, నగారా, జేగంట మొ॥వి.

3. రణవాద్యాలు : భేరి, దుందుభి, వంటివి.

4. జానపదవాద్యాలు : ఏకనాదం, తంబుర, కొమ్ము, పిల్లనగ్రోవి, డప్పు మొ॥వి.

జానపద వాద్యాలలో పైవాటిలో అన్నిరకాల వాద్యాలూ ఉన్నాయి. తంత్రీ వాద్యాలు ఎక్కువగా జానపదుల వాడుకలో లేవనే చెప్పాలి. తంబుర మొదలైనవి శ్రుతికోసం వాడుతారు. ఊదేవి, మీటేవి, కొట్టేవి ఈ వాద్యాలలో ఉన్నాయి. సందర్భానికి తగ్గట్లుగా వీటిని ఉపయోగించడం జరుగుతుంది. తాళాలు, గంటలు, నగారాలు, గజ్జలు, కడియాలు, కోలలు, మద్దెల, పిల్లనగ్రోవి, కొమ్ము, తప్పెట, చిరతలు మొదలైనవాటిని గేయాలకు అనుబంధంగా, నృత్యానికి అనుబంధంగా, జాతరలు, రథోత్సవాలలో వాడుతారు. వీటిని ఊదడానికి, కొట్టడానికి-అన్నిటికీ ఒక సాంప్రదాయికమైన పద్ధతి అంటూ వుంది. జాతరలు మొదలైన సమయాల్లో వీటి శబ్దం వీరావేశాన్ని కలిగిస్తుంది.

జానపద సంగీతం—స్వరూపస్వభావాలు:

జానపద సంగీతంలో కూడా కొన్ని శాస్త్రీయ రాగాలు, తాళాలు ఉండవచ్చు. ఆది, చాపు, రూపక తాళాలు ఎక్కువగా వినిపిస్తుంటాయని సంగీతజ్ఞులంటారు. ప్రతి మధ్యమ రాగాలలో, అపూర్వ రాగాలలో జానపద గేయాలుండడం అరుదు. కొంచెం నాజూకైన స్త్రీల పాటలు, పెళ్ళిపాటల్లో రాగాలుంటాయి. లాలి పాటల్లో ఆనంద భైరవి, నీలాంబరి మొదలైన రాగాలు వినిపిస్తాయి. జానపద గేయాలు ఎప్పుడూ ఒకే స్థాయిలోవుండవు గుంపుగా పాడుతున్నప్పుడు కూడా ఒకరు ఒక స్థాయిలో మరొకరుమగో స్థాయిలో పాడటం కూడా అరుదుకాదు. ఈ పాటలకు రాగనిర్దేశం చేయడం చాలా కష్టం. మొత్తం మీద జానపద సంగీతం సర్దుబాటు స్వభావం కలదని చెప్తే తప్పులేదు. సాంప్రదాయిక సంగీతం చాలావరకు ఇలాంటిది.[1] జానపద గేయాల సంగీతాన్ని అధ్యయనం చెయ్యడానికి కొత్తకొత్త పద్ధతులు అమల్లోకి వస్తున్నాయి. సంగీతం స్వభావాన్ని బట్టి Compass, scales, intervals, tonality, melodic Contour అనే విభాగాలను పరిశీలించాలని విద్వాంసులంటారు (Maria Leach Ed. 1975 : 1041). ఇది పాశ్చాత్య సంగీతం మాట.

శాస్త్రీయ సంగీతానికి జానపద సంగీతానికి ఉండే భేదాన్ని చూపి కొంతవరకు జానపద సంగీతం స్వరూపాన్ని తెలియ జెప్పేందుకు కొందరు విద్వాంసులు ప్రయత్నించారు. జానపద సంగీతం సామాన్యజన హృద్గత మైనదని, శాస్త్రీయ సంగీతం సంగీత శాస్త్రజ్ఞుల వైదుష్య ఫలమని కొందరన్నారు. నాగరకుల సంగీతానికి సామగానం ప్రాతిపదిక అని మరి కొందరు సామవేదంతో సామ్యాన్ని తీసుకు వచ్చారు. సామగాన ప్రస్తారం మూడు, నాలుగు స్వరాలకంటె మించదని, మధ్యయుగాల నాటికి దానినుంచి సప్తస్వరయుతమైన శాస్త్రీయ సంగీతం ఉద్భవించిందని చెప్తారు. సంగీత శాస్త్రవేత్తలైన పి. సాంబమూర్తిగారు జానపద సంగీత లక్షణాన్ని నిర్దేశించ ఇలా చెప్పారు (తెలుగు పల్లెపాటలు, ఉపోద్ఘాతం) :

1. స్వర పరిమితి తక్కువగా నుండటం, సాధారణంగా సప్త స్వర స్థాయిని మీరిపోదు. పాడేవారు సంగీత శిక్షణ పొందని వారు గనుక ఇది సహజం.

2. ప్రతి మధ్యమ స్వరం లోపించడం, ఈ స్వరం విద్వాంసుల స్వరం అవడం వలన అశిక్షితకంఠాలకు ఒదుగదు. అయితే పెళ్ళిపాటల వంటి నాగరకమైన పల్లె పాటలలో కొన్ని పంతురావళిలో పాడతారు.

3. సాహిత్యంలో మాటలు మరీ ఎక్కువగా వాడటం.

4. సువ్యవస్థితములైన సంగతులుకాని, స్వరదీర్ఘ కరణాలు గాని లేకపోవడం.

5. సాహిత్యం ద్విపాద చరణాలుగా గాని, చతుష్పాదాలుగా గాని ఉండటం.

ప్రకృతి దత్తంగా వచ్చిన శ్రుతిజ్ఞానమే జానపద సంగీతానికి జీవమని చెప్పవచ్చు. శాస్త్రీయ సంగీతానికి కూడా శ్రుతి ముఖ్యమే. జానపద సంగీతాన్ని శ్రుతి తప్పకుండా లేక చాలావరకు అదే శ్రుతిలో కొనసాగించడానికి కావలసిన శక్తి జానపదునికి ప్రకృతి దత్తమైనది. శబ్దానికి నాదానికి వుండే భేదం జానపదునికి కూడా తెలుసు. శబ్దాలన్నీ నాదాలు కావు. పదాలన్నీ సంగీత స్వరాలు కాదు.

తెలుగు పాటలలో వినిపించే సంగీతం స్వభావాన్ని బట్టి, శాస్త్రీయ సంగీతంతో దాని సంబంధాన్ని బట్టి కొన్ని విధాలను గుర్తించవచ్చు, శాస్త్రీయ

సంగీతాన్ని అనుకరిస్తూ వెలువడినవి మొదటి విధం. దేవతాస్తుతులు, హారతులు, పౌరాణిక గీతాలు మొదలైన వాటిలో శాస్త్రీయ సంగీతాన్ని అనుకరించడం చాలావరకు కనిపిస్తుంది. పెళ్ళి పాటలు, స్త్రీల పాటలనే పేరుతో ఉన్న మరికొన్ని పాటలు వీటికంటె కొంచెం దేశీయ సౌరభంకలవి. యక్షగానాలు, బయలాటలో వాడేవి మరొక రకం. దేశీయరాగాలు, శాస్త్రీయ రాగాలు మిశ్రమై వీధిభాగవతం వంటి ప్రదర్శన కళల్లో ఉపయోగింపబడుతూ వుంటాయి. జాతరల్లో, రథోత్సవం వంటి వాటిల్లో ఉపయోగింపబడే వాద్యసంగీతం మరొక రకం.

శాస్త్రీయ సంగీతం కంటె ఎక్కువగా జన సముదాయం కోసం, జన సమూహం సహాయంతో, సామాజిక స్పృహతో వెలువడుతుంది జానపద సంగీతం. భావోద్వేగ ప్రధానంగా, వైయక్తిక అభివ్యక్తికి ప్రాధాన్యం ఇస్తూ వెలువడి నట్లుగా అనిపించినా, జానపద సంగీతమూ సామూహిక ఆకాంక్షలకు ఆశయాలకు అనుగుణంగా వెలువడుతుందనే విషయాన్ని మరిచి పోరాదు. ఏదైనా విశిష్టమైన శైలిని సాధించడానికి, వీరావేశం కల్గించడానికి, కొత్తకొత్త నడకల్ని కథనంలో సాధించడానికి స్వరాలను మిశ్రం చేయడం, స్వరం దేన్నయినా అవసరం కంటె ఎక్కువగా లాగిలాగి గానం చెయ్యడం మొదలైనవి గుర్తించగలం. ప్రయోజనానికి తగ్గట్లుగా జానపద సంగీతంలో స్వరాలు ఉపయోగించడం జరుగుతుందనడానికి లాలిపాటలనే ఉదాహరణగా చెప్పుకోవచ్చు లాలి పాటల చివరఎక్కువగా 'రి', 'స' అనే స్వరాలు వినిపిస్తాయి. 'రి' జడమైన మనస్సు ఒక విధమైన ఉన్నత స్థానానికి వెళ్ళేట్లు చేస్తే 'స' దాన్ని ఒక్కసారిగా కింది స్థాయికి వచ్చేట్లు చేస్తుంది. ఇది నిద్రను తెప్పించేందుకు సహాయం చేస్తుంది.

అర్చిక (ఒక స్వరం), గాథిక (రెండు స్వరాలు), సాయిక (మూడు స్వరాలు) స్వరాంతర (నాలుగు స్వరాలు) అనే నాలుగు రకాల స్వరాల గీతాలను సంగీతకారులు రచించారు. నాలుగు కంటె ఎక్కువ స్వరాలతో, ఆరోహణావరోహణాలతో ఉండే వాటిని రాగాలన్నారు. మొదటి నాలుగు స్వరాలతో ఉన్నరచనలను దేశి లేక జానపద సంగీతమని చెప్పవచ్చు. లేక అలాంటి శాస్త్రీయసంగీతాన్ని జానపదసంగీతం ప్రభావంవల్ల జనించిందని చెప్పవచ్చు.

సంగీత శాస్త్రానికి సంబంధించిన మహాగ్రంథాలలో రాగసంబంధమైన ఉదాహరణలు దొరకుతాయిగాని, స్వరాలకు సంబంధించినవి దొరకవు. స్వర సంబంధమైన లక్ష్యాలను మనం జానపద సంగీతంలో వెతక వలసిఉంటుంది. పైన చెప్పిన కారణాల వల్ల జానపద సంగీతానికి రాగాలను అన్వయించి చెప్పడం వల్ల ఎక్కువ ప్రయోజనం కలగదు. అయినా శాస్త్రీయ సంగీత ప్రభావం వల్ల ఉద్భవించిన గేయాలలో కొన్ని రాగాలు, రాగచ్ఛాయలు కని పించడం మాత్రం పరిశీలనార్హం. భూపాలం, బౌళి, నవరోజ్, హిందోళ మొదలైనవి కొన్ని పాటలలో వినిపించే రాగాలు.

జానపద సంగీతం ఉత్పత్తి :

భారతీయ సంగీతానికి నటరాజు అధిదేవతని, మూలం సామవేదమని చెప్పడం వాడుక. జానపద సంగీతానికి సామగానానికి ఉండే పోలిక గణనీయ మయింది. మనుష్యుని మూల గానప్రవత్తి జానపద సంగీతానికి ఏ విధంగా కారణ భూతమయిందో, అట్లే సామవేదానికీ కారణ మయిందని విద్వాంసులు అభిప్రాయ పడ్డారు. శాస్త్రీయ సంగీతం ఉద్భవించడానికి ముందే జనసామా న్యులకు సహజమైన సంగీతం ఒకటి వుండేదని నాట్య శాస్త్రంలో భరతుడు సూచించాడు.

జానపద సంగీత పుట్టుక ఎప్పుడు జరిగిందన డానికి సమాధానం రాబట్టడం చాలాకష్టం. మానవుడు సంతోషాన్నో, దుఃఖాన్నో వ్యక్తం చేయ డానికి కూనిరాగాలు తీసిన నాడే సంగీతంలో ప్రాథమికావస్థ ప్రారంభమయిం దనవచ్చు. ఒక విధంగా జానపద సంగీతం స్వయంభువు అని చెప్పాలి, సామవేదంకాని, మరే సంగీత శాస్త్రంకాని, శాస్త్రీయ రాగాలుగాని జానపద సంగీతానికి మూలం కావు. మానవునిలో మూలభూతంగా ఉండే ప్రవృత్తులను అభివ్యక్తం చెయ్యాలనే తీవ్ర ఆకాంక్షే జానపద సంగీతానికి త్రోవ తీసింది. జానపద సంగీతం పైన ప్రత్యేక కృషి సల్పిన వింజమూరి సీతాదేవిగారు జానపదసంగీతం వికాసంచెందిన విధాన్నిఈ క్రిందివిధంగా విభజించి చెప్పారు (తెలుగువాణి. సంపు. 3. సంచిక 1, పు. 24, 1978 ; 24). 1. ఆదిమవాసు లైన ఆటవికులు పెట్టిన పొలికేకలు (savage yells) 2. ఆ నాదపు తున

కల్నే మళ్ళీ మళ్ళీ రెట్టించి పలికే అసంపూర్ణ సంగీత వాక్యం (musical phrases) 3. అటువంటి అసంపూర్ణ సంగీత వాక్యాలను కొన్నింటిని కూర్చి పాడడం (balance of musical phrases) 4. తుదకు ఒక ప్రత్యేక శ్రుతిని (tonalcentre) ఆధారం చేసుకొని, ప్రధాన సంగీత వాక్యాన్ని (principal phrase) పదేపదే రెట్టిస్తూ మిగిలిన వాక్యాలను కలిపి పాడడం.

ఆదిమ మానవుడు నృత్తం చేస్తుండిన కాలంలో అతని అవయవాల కదిలికకు అనుగుణంగా కొన్ని శబ్దాలుపలకసాగాడు. మొదట నృత్తం, తర్వాత అర్థరహితమైన నాదభరితమైన శబ్దాలు, ఆ తర్వాత అర్థం కలిగిన పదాలు చేరి పాట పుట్టింది. జానపద సంగీతంలో నృత్యానికి సంబంధించిన పద రహిత సంగీతమూ ఉంది. సాహిత్యంతో కూడిన సంగీతమూ ఉంది. జానపద వాద్యాలను వాడడం మానవుడు ప్రకృతినుంచే నేర్చుకున్న విద్య అనిపిస్తుంది. జానపద వాద్యాలు చాలావరకు సరళమైనవి, ప్రకృతి శబ్దాలను అనుకరించేవి. మనిషిలో ఆవేశాన్ని పుట్టించేవి.

తెలుగు జానపద సంగీతానికి వందల ఏళ్ళుగా ప్రాణభిక్షపెట్టినవారు భిక్షుకగాయకులు. పాల్కురికి సోమన, నన్నెచోడుడు మొదలైన వారు ఆనాటి గాయకుల్నిగురించి, వివిధ గీతాలను గురించి చెప్పడం అంతకు కొన్నివందల ఏళ్ళనుంచే సంగీత పరంపర వర్ధిల్లుతూ వుండిందని తెలుపు తుంది. ఆంధ్ర దేశంలోని ఆదిమవాసులైన యానాదులు, సవరలు, కోయలు, చెంచులు మొదలైన వాళ్ళు అప్పటికీ ఇప్పటికీ సంగీత ప్రియులే. ఈ ఆదివాసుల పాటల ప్రస్తారం మూడునాలుగు స్వరాలకు మించదు. యానాదులు చిన్నపిల్లలంతా నిద్రలో ఆదమరిచిన తర్వాత నిట్రాతికి కట్టిన తోలు తప్పెటకు సెగచూపి చిందు ప్రారంభం చేసి పాటలు తోడుచేస్తారు, 'యానాదులో ఎట్లుబొయ్యిరో' అనేపాట 'యానాదులో ఎర్రగడ్డలో' అనే పాఠాంతరంలో నెల్లూరుజిల్లాలో అందరు పిల్లలకూ చిరపరిచితమే. 'పందిటి మీది సొరకాయ ఎవరికిస్తమే? రెడ్డోరికా? కాదు, కమ్మోరికా? లేదు. కరణానికా? పోసీ మునిసీబుకా' అనే పాటా ప్రసిద్ధమే. సోడెకు కూడా యానాదికి తప్పెట అవసరం. మట్టికుండ అంచుచుట్టు ఊనిన గొర్రెతోలునో, మేక తోలునో బిగిస్తే యానాది వాద్యం తయారవుతుంది. లేత మంటపైన వెచ్చ చేస్తే యానాది చిందుకు తగిన శబ్దం సిద్ధమవుతుంది.

ఆదివాసుల విషయం ఇట్లుండే 'జానపద భిక్షుక గాయకులైన పిచ్చుకుంట్లు, శారదకాండ్రు, వీర ముష్టులు, జంగాలు, భాగవతులు, గంగిరెద్దుల వారు, దాసర్లు, బుడబుడకల వారు, బవనీలు, కొమ్ముమవారు, జక్కులవారు, బొమ్మలాట కాండ్రు జానపద సంగీతాన్ని గాత్ర సంగీత రూపంగా—రెండు రకాలు గాను కాపాడుకుంటూ వస్తున్నారు. వీరిలో చాలావరకు దేశద్రిమ్మరులే. కథాగేయాలు పాడుతూ పాల్కురికి సోమనాథుని కాలంనుంచికూడా ఆంధ్ర దేశానికి సుపరిచితులైన పిచ్చుకుంట్లు కన్నడ దేశానికి కూడా వెళ్ళి హెళవరు అనే పేరుతో ప్రసిద్ధులయ్యారు. పిచ్చుకుంట్లలోని ఏడు ఉపజాతుల్లో గంటవారు, తిత్తివారు వాద్యాల వల్లనే ఏర్పడ్డారు. శారదకాండ్రు వాడే వాద్యాలలో శారద ఉంది. ఆడవాళ్ళు డిమ్కిని వాడుతారు. వీరన్నల వారికి ఒగ్గువారనికూడా పేరు. ఇదీ వాద్యంవల్ల ఏర్పడిందే. శైవులైన వీరముష్టి వారు జేగంటను లేక తప్పెటను వాడుతారు. బవనీలు కూడా కొన్ని వందల సంవత్స రాలనుంచి ఆంధ్రదేశంలో ప్రసిద్ధులు. క్రీడాభిరామంలో ఏకవీర ఎదుట నిల్చి పరశురాముని కథలు పాడినబవనీల ప్రసక్తి ఉంది. వీళ్ళువాడేది జమిడిక లేక బవనిక. శ్రుతికోసం వంత పాటగాడు చిన్న జమిడికను వాయిస్తాడు పెద్ద జమిడికవల్ల గుండెలదిరే శబ్దం వస్తుంది. దాసర్లు తెలుగు దేశంలో, కన్నడ దేశంలో కూడా ప్రసిద్ధులు. బుక్కదాసరి, భాగవత దాసరి, దండె దాసరి, మాలదాసరి, నక్కదాసరి మొదలైన వాళ్ళున్నారు, స్త్రీ వేషం వేసి గజ్జెలు కట్టి తాళ మృదంగ ధ్వనులతో నాట్యం కూడా చేస్తారు. కిన్నెరనుకూడా వాయిస్తారు గొల్లసుద్దులు కొమ్ములు, వీరణాలు ఉపయోగిస్తారు. పెద్దడోలు వంటి వీర ణంతో బాటు శంఖాన్ని కూడా వీళ్ళు ఉపయోగిస్తారు. జంగాలు బుడిగె, గుమ్మటం మొదలైన వాద్యాలను సంగీతానికి వాడుకుంటారు. బుడిగెను ఇత్త డితోగాని, కంచుతో గాని చేస్తారు. ఈ విధంగా తెలుగుదేశంలో జానపద గాయకులు తమగాత్రంతో, వాద్యాలతో జన సమూహానికి వీనుల విందుగా, కమ్మగా ఒక కొంత, గుండెలదిరేలా మరికొంత, చిందులు తొక్కించేలా ఇంకాకొంత సంగీతాన్ని తరతరాలుగా పోషించుకుంటూ వచ్చారు.

విభజన :

ఆర్.ఎస్.బాగ్స్ జానపద విజ్ఞానానికి చేసిన వర్గీకరణలో (జానపద నిఘంటువు : 1138-47) సంగీతాన్ని C600 అనే విభాగం కింద ఇచ్చాడు.

ఆ విభజనలో గేయాలకు సంబంధించిన సంగీతం, కథాగేయాలకు సంబంధించిన సంగీతం, నృత్యసంబంధ సంగీతం, వాద్యాలు మొదలైన శీర్షికలున్నాయి. డా. బి. రామరాజుగారు ఫోక్‌లోర్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ అనే ఆంగ్ల గ్రంథంలో ఇంట్లో సంగీతం, బయటి సంగీతం అని రెండు ముఖ్య విభాగాల కింద సంతాగీన్ని విభజిస్తూ ఈ కింది విధంగా సూచించారు (పు. 103).

1, వరికోత సమయంలో చెట్లకు నీళ్ళు పడుతూ, గడ్డి బండి మీద పడుకొని ఇంటికి తిరిగి వెళ్తూ, నీళ్ళలో దిగిన గేదెమీద కూర్చొని పాడే కూని రాగాలు, పాటలు.

2. స్త్రీ పురుషులలో ఎవరైనా పనిపాటులకు ఇంటినుంచి వెళ్ళేటప్పుడు గాని, పని అయిన తర్వాత ఇంటికి తిరిగివచ్చేటప్పుడుగాని పాడేవి. ఇవి సామూహిక గీతాలు, గీతనాయకుడు, జట్టులేక గుంపు కలిసిపాడే పాటలు.

3. పని చేసేటప్పుడు పాడేవి. ఇవికూడా సామూహిక గీతాలే. గీత నాయకుడు పాడుతూవుంటే పాటనంతట్నీ జట్టు వారందుకుంటారు. లేక పల్లవి మాత్రం వంతపాడుతారు.

4. ప్రదర్శన కళల్లోని కళాకారుడుగాని, కథాగేయాలనుపాడే గాథాకారుడు కాని పాడేపాటలు, లేక పనిపాటల విరామసమయాల్లో పాడేవి.

పైన చెప్పినవి బయట పాడే సంగీతానికి సంబంధించినవి. ఇంట్లో పాడేవి ఈ క్రింది విధంగా ఉంటాయి.

1. పొద్దున మజ్జిగచిలుకుతూ స్త్రీలుపాడే పాటల్లోని సంగీతం.

2. పూజ ముగిసిన తర్వాత పాడే మంగళారతులు.

3. కథాగేయాలలో సంగీతం.

4, చిన్నపిల్లలు ఆటలకు అనుబంధంగా పాడేపాటల్లోని సంగీతాంశ

సంగీతంలో పల్లవి ప్రముఖపాత్రవహిస్తుంది. జానపద గేయాలను కథాగేయాలను పాడే వారికిగాని, వినేవారికిగాని, పూర్వపు ఆవాలంటే పల్లవిస్తుంది

తీరాలి. పల్లవి అన్నది ప్రాచీన కాలంలో లయబద్ధంగా పనిషినృత్తం చేస్తుండగా శబ్దాలు తర్వాత పదాలు చేరి పాటరూపొందిన దశను గుర్తుకుతెస్తుంది. పాటకు వెలుపల వుండే బాహ్యపల్లవిగాని, అంతరపల్లవి అనే పాటలో భాగమైన పల్లవిగాని, మిశ్రమపల్లవిగాని ఉండవచ్చు. ఇలాంటి పల్లవిని బట్టే సంగీతాన్ని నాలుగు విధాలుగా విభజించే ప్రయత్నాన్ని కే. కే. పి. ఉపాధ్యాయ చేశారు. (జి.ఎస్. మోహన్ 1981:149) పాటల్లో మాత్రలను, అక్షరాలను పదాలను, వాక్యాలను పునరావృత్తం చేయడం ద్వారా నాలుగు విధాల పాటలేర్పడతాయని డా. కె. పి. ఉపాధ్యాయ వ్రాశారు. ఆనాలుగు ఈ క్రిందివి.

1. మాత్రాస్తోభ (The Syllable insertion)
2. వర్ణస్తోభ (The letter inser tion)
3. శబ్దస్తోభ (The word insertion)
4. వాక్యస్తోభ (The sentence insertion)

మొత్తంమీద సంగీతాన్ని ప్రాదేశికమైన విశిష్టలక్షణాలను దృష్టిలో వుంచుకొని విభజించవలసి ఉంటుంది. గాత్రసంగీతం, వాద్యసంగీతం, మిశ్రమసంగీతం అన్నవి మూడు ప్రధాన విభాగాలుగా భావించవచ్చు. వీటిలో మళ్ళీ ఇంట్లో స్త్రీ పురుష బాలగీతాలు వస్తాయి. అట్లే ఇంట బయట స్త్రీపురుష బాలగీతాలు మరోవిభాగం చెయ్యవచ్చు. వీటిలో మళ్ళీ పొలంపనుల్లో పాడేవి, భిక్షుక గాయకులు పాడేవి, కళాకారులు పాడేవి వగైరా ఉపవిభాగాలను చెయ్యవచ్చు. ఇలాకాక సంగీతశాస్త్రబద్ధంగా కూడా విభజనచేసే ప్రయత్నాలుచెయ్యవచ్చు.

వైశిష్ట్యం–అధ్యయనం మొ॥వి

'శిశుర్వేత్తి పశుర్వేత్తివేత్తి గానరసంఫణిః' అని సాంప్రదాయికంగా చెప్తున్నమాట. సామాన్య జానపదునకి కావలసింది జానపద సంగీతమేగాని శాస్త్రీయ సంగీతంకాదు. శిశువులను పశువులను ఎక్కువగా అలరించేది జానపదసంగీతమే. ఎందుకంటే మానవుని మూలభూత ప్రకృతులకు దగ్గరగా, హృదయాన్ని ఆర్ద్రమొనరించే గుణంతో వెలువడేవి జానపద సంగి

తమే. శాస్త్రీయ సంగీతం బౌద్ధిక పరిణతిని సూచించేది, బుద్ధిని ప్రచోదించేది కాబట్టి జానపద సంగీతం లాగా ఆవేశాన్ని, ఉద్వేగాన్ని, సంతోషాన్ని ఇవ్వజాలదు. శాస్త్రీయ సంగీతం, జానపదసంగీతంలాగా శిశువులను నిద్ర పుచ్చనూలేదు. పెద్దవారిని మేల్కొల్పనూలేదు. జానపదసంగీతంలో ఒక విధమైన సమ్మోహనశక్తి (hypnotic Power) ఇమిడివుంది. జాతర్లలోగాని ఉత్సవాలలోగాని పాల్గొనేవారు కొన్ని 'అద్భుతాలను' ప్రదర్శించడానికి, దేవుడు ఒంటిమీదికిరావడానికికారణంస్వయంసమ్మోహనం (Self hypnosis) ద్వారానే. ఈ విధమైనస్థితికి జానపదులనుతీసుకువెళ్ళడానికి జానపద సంగీతం చాలా ఉపకరిస్తుంది. లాలిపాటల్లోకూడా సరళమైన సమ్మోహక గుణంవుంది.

జానపద గేయాలను ఇప్పటికీ మనవారు సాహిత్య దృష్టితో మాత్రమే సేకరించడంలో ఎంతవరకు ఔచిత్యం ఉన్నదన్నది సందేహమే. సాహిత్యాధ్యయనం చెయ్యకూడదని కాదు ఒకపాటకున్న విలువలో సాహిత్యపు విలువ చాలా చిన్న భాగం మాత్రమే. ఒకేఒక్క జానపద గేయాన్నిపాడే సమయం, పాడేవారు, వాద్యాలు, పల్లవి, భౌగోళిక వ్యాప్తి, సామాజికంగా వుండే విలువ, సాహిత్యపరమైన సౌందర్యం, శైలి, ఛందస్సు, సంగీతం, మనోవైజ్ఞానికంగా వుండేవిలువ—ఇవన్నీ గమనించి సంపూర్ణంగా అధ్యయనం చెయ్యాల్సిన అవసరం వుంది. వాద్యాలను గురించి వ్రాసిఇస్తే అది అర్థమయ్యేదెట్లా? తంబురిమీటితే ఎట్లుంటుందో, ఒగ్గువాయిస్తే ఏ శబ్దంవస్తుందో, సోదెచెప్తుంటే ఎట్లుంటుందో, బుడబుక్కలవాడి శబ్దం ఎట్లుంటుందో ధ్వని ముద్రణ ద్వారానే తెలుసుకొనే వీలుంది. జానపద సంగీతాన్ని రచనద్వారా, ధ్వనిముద్రణ ద్వారా, బొమ్మలద్వారా, చలనచిత్రంద్వారా చూపిస్తేనే పూర్తిగా దానిస్వరూపం బోధపడేది

జానపద సంగీత ప్రచారానికి కొంతమంది శ్రమించిన మాట చెప్పుకోవాలి. వింజమూరి అనసూయ, వింజమూరిసీతగారలు ఈ విషయంలోకృషి చేశారు. అయితే జానపద సంగీతాన్ని శాస్త్రీయసంగీతానికి దగ్గరగా తెచ్చే ప్రయత్నం చెయ్యకుండా సహజమైన వాతావరణంలో, సహజమైన పద్యాలతో జానపద సంగీతాన్ని ఆకాశవాణి ద్వారా అందించి వుంటే, ఈ ఆకాశవాణి కళాకారులు జానపద క్షేత్రానికి చాలాసహాయం చేసివుండేవారు.

ప్రపంచంలో వివిధ ప్రాంతాలలో జానపద సంగీతాన్ని అనేక ప్రయోజనాలకు వినియోగించుకోడం జరిగింది. ఇంగ్లండుకు చెందిన బీటిల్స్ ప్రపంచాద్యంతమూ ప్రచారాన్ని సంపాదించడం మనకందరికీ తెలిసిందే. జానపదగేయాలను వాటిమూలరూపంతో, వాద్యాలతోపాడేవిధానాన్ని ప్రచారానికితెచ్చి, ప్రపంచంలోని నలుమూలలకూ వెళ్ళి అపారఖ్యాతిని పొందారు. బ్రిటిష్ ప్రభుత్వం బీటిల్ సహోదరులకు 'సర్' బిరుదం ఇచ్చి సత్కరించింది. వియన్నాలోని సంగీత కళాకారుల్లో అత్యంత ప్రఖ్యాతిని గడించిన షూబర్ట్ అనే విద్వాంసుడు భారతీయ జానపద సంగీతంచేత ప్రభావితుడయ్యాడు. వందల కొద్దీ సంగీతరచనల్ని చేశాడు. అతని ప్రభావం సామాన్యజనులమీద కూడావుంది. ప్రపంచంలోని అనేక విద్వాంసులు జానపద సంగీతంలోని సత్యాన్ని అర్థం చేసుకొని ఆబాణీలను రచనల్లో, నాటకాలలో, చలనచిత్రాలలో, ఇతర కళారూపాలలో విరివిగా వాడుకున్నారు. జానపద సంగీతానికి సామాన్య ప్రజల్లో వుండే ప్రచారాన్ని దృష్టిలో పుంచుకొని రాజకీయాలలో కూడా దాన్ని బాగా వుపయోగించుకొన్నారు.

ఇటీవలి కాలంలో సంగీతాన్ని అధ్యయనం చెయ్యడానికి అమెరికా మొదలైన దేశాలలో సిలిండర్ ఫోనో గ్రాఫ్ (Cylinder phonograph) వంటి వాటిని ఉపయోగిస్తున్నారు. ఇప్పుడు ఎలక్ట్రానిక్ పరికరాలు వచ్చాయి. స్పెక్ట్రోగ్రాఫ్, మెలోగ్రాఫ్ మొదలైన వాటితో సంగీతంలోని స్థాయిని, ప్రాథమిక స్వరాలను పరిశీలించడం జరుగు తున్నది. మన జానపద సంగీతం అధ్యయనం చెయ్యడానికి కూడా అన్నిరకాల ఆధునిక పద్ధతులనూ అనుసరించాలి. అపారమైన జానపద సంగీత సంపదను సద్వినియోగం చేసుకోవాలి.

*

# జానపద నృత్యం

జానపద నృత్యం అన్నది నృత్తం నుంచి నృత్యం వరకు వ్యాప్తి చెంది వుండే వైవిధ్య మయమైన ఆంగిక చలనం. జానపద విజ్ఞానం లోని అత్యంత ప్రాచీన విభాగాలలో నృత్యంకూడా ఒకటి. నృత్యం, ధార్మిక కార్య కలాపాలలో భాగంగా అవతరించి తర్వాత లౌకిక నృత్యంకూడా అవతరించిం దని కొందరంటారు. అత్యంత ప్రాచీనకాలంలో మానవుడు ధార్మిక సంబంధ మైన ప్రతి పనిలో నృత్యం చేసేవాడు లేక ఆడేవాడు. పాడేవాడు. నృత్యం పాట కంటే ప్రాచీనమైంది. అప్పుడది నిజానికి నృత్తం మాత్రమే.

మనిషి బ్రతుకులో అనుభవించే సంతోషం, దుఃఖం, వేదన. ఆహ్లాద యత, పుట్టుక, చావు మొదలైనవి లయాత్మకమైన కదలికలుగా మారి నృత్య మనిపించుకున్నాయి. నిజానికి నృత్యం మానసికమైన అవసరం (psychological necessity). అది మనిషికి తృప్తినిస్తుంది. మనిషి నమ్మకాలకు, ఆచరణలకు, సంప్రదాయాలకు నృత్యం ప్రతినిధిగా నిలుస్తుంది.

నృత్యానికి భౌగోళిక పరిసరాలకు సంబంధం ఉంది. భూమి గుణం కూడా నృత్యరీతులను నిర్ణయిస్తుంది. ఇసుక నేలల్లో కనిపించే నృత్యాలలో భారాన్ని ఒక కాలునుంచి మరొక కాలుకు మారుస్తూవుండడం ఒక లక్షణం. కొన్ని ప్రదేశాలలో భూమి పరిసరాన్ని బట్టి ఎక్కువ లయ, తక్కువ లయ వుండవచ్చు. పాటలు, సంగీతం మొదలైనవి త్వరత్వరగా మరొక చోటికి ప్రయాణం చేసినట్లుగా నృత్యరీతులు ప్రాసారం కావు.

నృత్యం ప్రభవించడానికి శృంగారకేళి మూలమని కొందరంటారు. మగనెమలి శృంగారకేళి కోసం నృత్యం చేస్తుంది. అనేక జంతువుల్లో, పక్షుల్లో శృంగార కేళికి ముందు ప్రచోదనకోసం ఆడటం సాధారణంగా కని పిస్తుంది. ఇలాంటిదే మానవుని నృత్యాలకు కూడా మూలమయిందని సాధా రంగా నిరూపించడం కష్టం. అనుకరణ కళల మూల ప్రవృత్తిఅని నమ్మితే,

ప్రకృతిలోని వివిధ ప్రాణుల లాస్యమే మానవుని నృత్యానికి మూలమయిందని ఊహించవచ్చు. జానపద నృత్యం సరళ సుందరమయింది. ఉత్సాహావేశాలు జానపదుల నృత్యానికి జీవం. జానపద నృత్యం ముఖ్యంగా రౌద్ర బీభత్స శృంగారాలకు ఆలవాలం.

నృత్యం మానవుని మొదటి కళ అని కొందరంటారు. మనిషికి ఏదో ఒక రకమైన ఆవేశం వచ్చినపుడు అతను మొదట దాన్ని సూచించింది వివిధ ఆంగిక చలనాల ద్వారాఅని విద్వాంసుల అభిప్రాయం. భాషపుట్టిన తర్వాత గేయం మొదలైన మౌఖిక ప్రక్రియలవతరించాయి. నృత్యంలోని వివిధఅంగ చలనాలు మనిషిమనోభావాలకుప్రతిబింబాలు. భావం చురుగ్గా వుంటే నృత్యమూ చురుగ్గా వుంటుంది.భావం ప్రశాంతమైనదైతే నృత్యంకూడా లాస్యమవుతుంది.

జానపద నృత్యంలో వ్యక్తి కంటె సమిష్టికే ప్రాధాన్యం. సామూహిక నృత్యాలు తప్ప ఒక్కొక్క మనిషి చేసే నృత్యాలు ప్రాచీన కాలంలో లేవు. సామూహిక నృత్యాలకు తాళమేళాలు పొందికగా వుండాలి. అందరితో కలిసి ఆడేటప్పుడు వ్యక్తి తన్నుతాను మరిచి గుంపులో ఐక్యమవుతాడు. ప్రకృతికి దాసుడుగా వుండని ప్రాచీన మానవుడు నెమలి నుంచి, ఝరులనుంచి, తరుల నుంచి, చైతన్యం మూర్తీభవించిన ప్రతి ప్రకృతి వస్తువు నుంచి కదలికను, లయాత్మకమైన కదలికను నేర్చుకొని వుండాలి. ప్రకృతిని అనుకరిస్తూ ఆరాధిస్తూ గంతులువేసి, ఆడి, నృత్యం చేశాడు ఆదిమమానవుడు. ఆదిమజాతుల నృత్యాలే జానపద నృత్యాలకు ఆధారమని కొందరువిద్వాంసులన్నారు. ప్రాచీన కాలంనాటి చిందులాటలు నేటికీ చెంచులు, యానాదులు, సవరలు, తొడవలు, బెట్ట కురుబలు, గోండులు, కోయలు మొదలైన వాళ్ళ నృత్యరూపాలలో నిలిచి వున్నాయి.

భారత శాస్త్రానికి భిన్నమైన నాట్య పద్ధతి మనలో వుండేదనడానికి ప్రాచీన కావ్యాలలో లక్షణ గ్రంథాలలోకూడా ఆధారాలున్నాయి. 'దండలాసక విధమును, కుండలియు, బ్రెక్కణంబు తెరంగును బేరణంబు' ఉత్తర నేర్చిందని తిక్కన వ్రాశాడు. దేశినృత్యాలనేకం రెడ్డిరాజుల కాలంలో ఉండేవని కొన్ని కావ్యాలలోని వర్ణనలు తెలుపుతున్నాయి. వీటిలో పురుషులాడేవి కొన్ని. స్త్రీలు

ఆడేవి కొన్ని. స్త్రీలు వలయాకారంగా చప్పట్లు చరుస్తూ ఆడేవారని చెప్ప బడింది. బతకమ్మ, బొడ్డెమ్మ పండుగల్లో నృత్యాలు, కోలాటం, జట్టిజాము మొదలైనవి ఆ కాలంలోనూ ఉండేవనడానికి రెడ్డి రాజులనాటి కావ్యాలలోని ఉల్లేఖనాలు సాక్ష్యంగా ఉన్నాయి. స్త్రీలు గొండ్లి ఆట ఆడేవారు. "వీరుమైలార దేవర వీరభటులు గొండ్లి యాడించు చున్నారు గొరగ పడుచు నాడు చున్న చూడు మూర్ధాభినయము తాను నెట్టిన సీలంతగాని లేదు" అని క్రీడాభిరామం గొండ్లి ఆటను వర్ణిస్తున్నది. ఇదొక కుండలాకార నృత్యం. గొరగ పడుచు మైలారదేవుని కొలిచేస్త్రీ.

దశావతార చరిత్రలో జక్కిణి చిందును గురించి వుంది (History of Reddy Kingdom. p. 432)

> దురు పదంబులు సొక్కమై సిరులు వొసగ
> సరిగ నిరుగెల కుంచియల్ సవదరించి
> పెక్కవగ జక్కిణీకోపు ద్రొక్కి నొక్క
> చక్కని మిటారి నరపతుల్ సొక్కిచూడ

ఆంధ్రదేశంలోని ఆదివాసులు చేసే నృత్యాలలో ప్రాచీన కాలంనుంచి ఇక్కడ ఎలాంటి నృత్య పద్ధతులుండే వనడానికి ఉదాహరణలు లభిస్తాయి. అదిలాబాదు జిల్లాలో గోండులు దీపావళికి రంగురంగుల గుడ్డలు వేసుకొని పక్కపక్క పల్లెలకంతా ఆడుతూ పాడుతూ వస్తారు. దండారి నృత్య సమూహాలని వీరికి పేరు. ఇదొక రకంగా ధార్మిక నృత్యం. ఖమ్మం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాలలోని కొండరెడ్లుకూడా ప్రాచీన నృత్యపరంపరను కాపాడుకుంటూ వస్తున్నారు, ధార్మిక ఆచరణల అంగంగా కొండరెడ్లు రాత్రి పూట నృత్యం ప్రారంభిస్తారు నలుగురైదుగురు స్త్రీలు పరస్పరం చేతులు పట్టుకొని నృత్యం చేస్తూవుంటే మరొక వైపు పురుషులునృత్యం చేస్తుంటారు. అర్ధరాత్రి ప్రారంభమయిన నృత్యం తెల్లవారే వరకు సాగుతుంది.

### జానపద నృతం అంటే ఏమిటి ?

జానపద సంగీతం లాగే జానపద నృత్యం కూడా మానవుని మూలభూత ప్రవృత్తులకు అనుగుణంగా ప్రభవించించే గాని శాస్త్రీయ ప్రాతిపదిక

మీద పుట్టింది కాదు. శాస్త్రీయమైన భంగిమలు గాని, భావాభినయంలోని మెళ కువలుగాని జానపద నృత్యంలో ఎక్కువగా కానరావు. జానపదుల చిందులు ప్రయోజనాత్మకమయినవి. ధార్మిక నృత్యాలకు ఒకప్రయోజనమంటూ వున్నది. వానరాకడకోసమో, రోగంపోకడ కోసమో, దేవతా ప్రీతికోసమో ధార్మిక నృత్యాలను చేస్తారు. లౌకిక నృత్యానికీ ఒక ప్రయోజనంవుంది. జానపదుని సంతోషం, దుఃఖం, ఆవేదన, ఆప్యాయత ఎక్కువయి నపుడు వాటి తాలూకు ఉద్వేగాన్ని తగ్గించుకోవాలంటే చిందులు తొక్కడం ఒక మార్గం. లయబద్ధ మైన అవయవాల కదలికల ద్వారా మనిషికి తృప్తి కలుగుతుంది. దైహిక చలనం ద్వారా అలసట కలిగి, తద్వారా మనిషి తన్ను తాను ఒకవిధమైనసుప్త స్థితికి తీసుకు వెళ్తాడు. ఈ విధంగా అతనికి తృప్తి కలుగుతుంది కాబట్టి నృత్యం మానసికమైన అవసరం అనవచ్చు. నృత్యానికి అనుబంధంగా వాయించే వాద్యాలు గాని, చేతుల కదలికగాని, కాళ్ళ కదలిక గాని, ఇతర అవయవాల చలనంగాని మనిషి ఆవేశానికి తగ్గట్లుగా, సందర్భానికి తగ్గట్లుగా ఉంటుంది.

## జానపద నృత్యరూపాలు

దేవుడు, ఇతరమానవాతీత శక్తుల ప్రీతికరంగా చేసేవి ధార్మికనృత్యాలు. ప్రకృతిని అనుకరించడానికి జానపదులు చేసే ప్రయత్నం కొన్నిట్లో కని పిస్తుంది. వానకోసం చేసే నృత్యాలు కొన్ని ఇలాంటివే. ఆఫ్రికాలో ఇలాంటి నృత్యాలు అనేకం ఉన్నాయి. ఖగోళ సంబంధమైన సూర్యచంద్ర నక్షత్ర నృత్యాలున్నాయి. వ్యవసాయానికి సంబంధించిన నృత్యాలు కొన్ని, చెట్లుకోసే వారు, రాళ్ళు కొట్టేవారు మొదలైన పనుల్లో ఆహ్లాదం కలగడానికి నృత్యాలు చేస్తారు. పశుపక్షాదుల అనుకరణతో వెలువడేవి కొన్ని. మొసలి నృత్యం, తాబేలు నృత్యం, ఎలుగుబంటి నృత్యం, పక్షినృత్యాలు మొదలైనవి ఈ విభాగం క్రింద వస్తాయి. వేటగాండ్రు, బెస్తవారు మొదలయిన వివిధ వృత్తుల వారు చేసేవి కొన్ని యుద్ధానికి ఆయుధాలకు సంబంధించిన నృత్యాలు, వివాహా నికి సంబంధించినవి, ప్రణయనృత్యాలు, ఇతర వినోదాలకు సంబంధించిన కోలాటం వంటివికూడా ఈ సందర్భంలో పేర్కొన దగినవి.

ఆశ్రయాన్ని బట్టి నృత్యాన్ని పురుషులది, స్త్రీలది, ఉభయులది అని స్థూలంగా విభజించవచ్చు. వీటిలో మళ్ళీ సాంఘికాలు, మత సంబంధాలు, యుద్ధసంబంధాలు అనే ఉపవిభాగాలను కొందరు చేశారు. డా. బి. రామరాజు మత సంబంధమైనవి, సాంఘికాలు, వైనోదికాలని మూడుస్థూల విభాగాలను చేసి ఆంధ్రదేశంలోని ప్రముఖ నృత్యాలను పేర్కొన్నారు (ఫోక్‌లోర్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ పు. 110):

1. గోండుల గూసాడి నృత్యం
2. కొండరెడ్ల మామిడి నృత్యం
3. ఖోందుల నెమలినృత్యం
4. అరకులోయలో కనిపించే దిమ్సానృత్యం
5. లంబాడీనృత్యం
6. సిద్ధి
7. బతకమ్మ
8. బొడ్డెమ్మ
9. తప్పెటగుళ్ళు
10. డప్పు
11. పులివేషం
12. బుట్టబొమ్మలాట
13. గొబ్బి
14. గుర్రపు నృత్యం
15. కరువనృత్యం
16. కోలాటం
17. గరగ
18. వీరనాట్యం

శ్యామ్ పార్మర్ జానపద నృత్యాలు సామూహిక నృత్యాలనే విషయాన్ని తెలుపుతూ వాటిని నాలుగు విధాలుగా విభజించారు (జి.ఎస్. మోహన్ 1918:138). అవి ఈ క్రిందివి:

1. పండుగలకు పబ్బాలకు, సాంఘిక ఆచరణలకు, మతాచరణలకు సంబంధించినవి.

2. జానపద నృత్యాలతోనే పొట్టబోసుకొనే వృత్తికళాకారుల నృత్యాలు

3. ఆదివాసుల నృత్యాలు

4. దేవతల సంప్రీతికోసం చేసే ఆచరణాత్మక నృత్యాలు

శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి ఆంధ్రనాటక రంగచరిత్రలో, ప్రపంచతెలుగు మహాసభల సందర్భంగా ప్రచురితమైన విశేషసంచికలో, మరికొన్ని చోట్ల జానపద కళారూపాలను గురించి రాస్తూకొన్నిజానపద నృత్యాలను పేర్కొన్నారు. కోలాటం, గరగ, పులివేషం, డప్పుల కోలాటం, వీరభద్ర విన్యాస నృత్యం, దొమ్మరాట, అశ్వనృత్యం, చెక్కభజన, పండరి భజన, ఘట నృత్యం మొదలైనవి ఆయనపేర్కొన్న కొన్ని రూపాలు. తెలుగు దేశంలోని జానపద నృత్య రూపాలలో అత్యంత ప్రాచీన జాతుల ఆదిమ రూపాలనుంచి, ఆధునిక రూపాలవరకు అన్నిరకాలు వున్నట్టుగా గుర్తించవచ్చు.



# జానపద రూపకం

'ఫోక్ డ్రామా' అన్న ఆంగ్లపదాన్ని జానపద నాటకం అనడం కన్న జానపదరూపకం అనడం మేలనిపిస్తున్నది. ఇది ప్రదర్శనకళ, మిశ్రకళ. జానపద రూపకంలో నృత్యం, సంగీతం, వేషధారణ, చిత్రలేఖనం, సంభాషణలు మొదలయినవన్నీ చేరి వుంటాయి. వివిధరూపాలతో, ప్రాథమికమైన భావాభినయంతో, నృత్యసంగీతాలతో వికాసంచెందిన కళగా జానపదరూపకాన్ని చెప్పుకోవచ్చు. రాయలసీమలో బయలాటలు, వీధిభాగవతాలు, తోలు బొమ్మలాటలు ఉన్నట్లే ఆంధ్రదేశంలోని కోస్తా ప్రాంతంలో తెలంగాణాలో కూడా కొంత భేదంతో, కొత్తపేర్లతో ఇవి ఉన్నాయి.

తోలుబొమ్మలాటవంటి ప్రదర్శన కళలు ఆంధ్రమహాభారతంలో కూడా సూచితమయ్యాయి. పాల్కురికి సోమనాథుని కాలంనుంచి రఘునాథరాయల వరకు అనేకులు బొమ్మలాటను పేర్కొన్నారు. తోలుబొమ్మలాట మొదట తెలుగువారి చేతుల్లోనేవుండేదేమోకాని తర్వాత మరాఠీవారి వశమయింది. పల్నాటి వీరచరిత్రలో 'ప్రతిమల నాడగబట్టినయట్లు' అన్నమాట, ఉత్తర హరివంశంలోని 'యంత్రకు డాడించి యవని ద్రోచెన్ ద్రావలు బొమ్మలగతి రథపూగములును. అన్నదాన్నిబట్టి ఆనాడు రకరకాల బొమ్మలాటలు ఉన్నట్లుగా తెలుస్తున్నది.

జానపద రూపకాల స్వరూపస్వభావాలను గురించి తెలుగుదేశంలో అధ్యయనం చాలాతక్కువగానే జరిగింది. సామాన్యంగా రూపకాలశీర్షికకింద మనం చదివేవి చాలావరకు జానపద రూపకాలుకావు, అనుకరణలు మాత్రమే. రూపకాలను ఏ పండుగలకు అనుబంధంగానో, ధార్మికసంప్రదాయాలకు అంగంగానో అధ్యయనం చేసే విద్వాంసులే ఎక్కువ.

జానపద రూపకాలకు 'ఆట' అనే పేరు వుండడం కనిపిస్తుంది. బయలాట, దొమ్మరాట మొదలయినవి ఉదాహరణలు. నిజానికి రూపకమూ

ఒకవిధమైనఆటే. మామూలు ఆటలకూ ఈ ఆటలకూ ఒకభేదంవుంది. ఆటలలో లాగానే రూపకాలలో కూడా 'సంఘర్షణ' (Conflict) అన్నది కనిపిస్తున్నా ఒక పరిష్కారం కూడా రూపకాలలో మనం చూస్తాం పండుగలలో ధార్మిక ఆచరణలలో చేసే నృత్యాలకు జానపద రూపకాలకు ఉండే భేదాన్ని ఎత్తిచూపడం ఒక్కొక్కసారి కష్టమవుతుంది. జానపద రూపకాలలో పండుగలలోని అనుకరణ ఉంటుంది. సంభాషణ, క్రియ (action) వుంటాయి. అయితే సంభాషనకు ఎక్కువప్రాధాన్యం ఉంటుంది. జానపదస్థాయిలో రూపకానికి, నృత్యానికి వుండే భేధాన్ని గుర్తించడంఒక్కొక్కసారి కష్టమవుతుంది.

జానపదరూపకాలకు పెద్దహంగులు అక్కరలేదు. నటులకు ప్రేక్షకులకు మధ్యఎక్కువ అంతరంలేకపోవడం జానపద రూపకాలముఖ్యలక్షణాలలో ఒకటి.

నృత్యగీత వాద్యములతో బాటు సంభాషణ కలిసి జాన పదులకు ఉల్లాసాన్ని మనోరంజనను కలిగించడంలో జానపద రూపకాలు తరతరాలుగా చేసిన సేవ, నిర్వహించిన పాత్రగణనీయమైంది. ప్రేక్షకులతో ప్రత్యక్ష సంబంధం కూడా వుండడం వల్ల జానపద రూపకాలలో తామూ పాత్ర వహిస్తున్నామనే భ్రమ పేక్షకులకు కలుగుతుంది. జానపద రూపకాలలో వచ్చే హాస్యగాడు, తోలుబొమ్మలాటల్లోకూడా వచ్చే కొంటె కోణంగి, బంగారక్క మొదలయిన పాత్రలు ప్రేక్షకుల్నికూడా అప్పుడప్పుడూ పలకరిస్తూ తాము వారికి దగ్గర వారమనే భావాన్ని కలిగిస్తుంటారు.

## రూపకాల ఆవిర్భావం

నాట్యశాస్త్రం ప్రారంభంలో ఒక కథ వుంది. బ్రహ్మ దేవతల కోరిక ప్రకారం ఒక నాటకం వ్రాసి ఇచ్చాడు. ఆ నాటకం వస్తువు దేవాసురయుద్ధం. దానిలో దేవతలకు విజయం చేకూరుతుంది దీన్ని రంగ స్థలం సహాయం లేకుండా బయలులో ఆడగా దానిలో తమ ఓటమిని చూచిన రాక్షసులుకోపంతో విజృంభించి నాటకాన్ని ఆపు చేయించారు. తమ ఆటకు తగిన రక్షణకావాలని బ్రహ్మను మళ్ళీ అడగ్గా, సుభద్రమైన నాటకశాల నిర్మించి ఇచ్చాడు బ్రహ్మ. అప్పటి నుంచి నాటకాలు నిర్విఘ్నంగా సాగాయి.

ఈ కథలో నిజానిజాల సంగతి ఎట్లున్నా, మొదట బయలాటలు ఉండేవని, ఆ తర్వాతే రంగస్థలం మీద ఆడే సంప్రదాయం వచ్చిందని దీని వల్ల తెలుస్తున్నది. నాట్యశాస్త్ర రచనకు ముందే మన దేశంలో జానపద రూపకాలు ఉండేవని ఖచ్చితంగా చెప్పవచ్చు. అయితే అవి అత్యంత సరళమైనవి. నేటి ఆదివాసుల ఆటలను బోలినవి. సంభాషణలుగాని, గీతాలుగాని, వాద్యాలు గాని, హాస్యోక్తులుగాని ప్రేక్షకులకు సుపరిచితమైనవి.

జానపద నృత్యమూ, నాటకమూ కూడా ధార్మిక సంప్రదాయాల అంగాలుగా వెలువడ్డాయని కొందరు విద్వాంసుల భావన. జనప్రియ నాటకం మత సంబంధ ఆచరణలనుంచి పుట్టిందని, అన్ని విధాల నాటకకళ జనప్రియ నాటకంనుంచే ఉద్భవించిందని ఎ. హెచ్. క్రాప్పె అభిప్రాయం (దిసైన్స్ ఆఫ్ ఫోక్‌లోర్, పు. 308) జానపద రంగస్థలానికి బీజం నృత్యంలోనే కనిపిస్తుందని విద్వాంసుల నమ్మకం. ధార్మిక ఆచరణలకు సంబంధించిన నృత్యాలు, రూపకాలు అసంఖ్యాకంగా కనిపిస్తాయి. డయోనిసిస్ దేవతను పూజించే సందర్భంలోనే గ్రీకు రంగస్థలం ఉదయించిందని చెప్తారు.

# ఆంధ్రుల జానపద కళలు - చరిత్ర

సంగీతం, నృత్యం, రూపకం అనే మూడు విడివిడిగా గాని, కలిసి గాని కళాత్మకంగా రూపొందితే జానపదుల కళలనే విభాగం కిందికి వస్తాయి. సంగీత నృత్య రూపకాలను ఏవోకొన్ని సూత్రాల వివరణ కోసం విడివిడిగా చెప్పడం జరిగిందిగాని, జానపదుల కళల విషయంలో వాటిని వేరువేరుగా చెప్పడం కష్టమే. ఆంధ్రుల జానపద కళల చరిత్ర చాలా ప్రాచీనమైనది. జానపద విజ్ఞానానికి చారిత్రిక ఆధారాలే లేవు కదా, మరి చరిత్రను ఏవిధంగా చెప్పడం అనే ప్రశ్నరావచ్చు. ఆధారాలు లేవన్నది వాస్తవమే కాని, సుదీర్ఘమైన చరిత్ర జానపద విజ్ఞానానికి తప్పకుండా వుంది. ఆదివాసుల జీవితంలో కూడా భాగమైవుండే ఈ సాంప్రదాయిక కళారూపాలు చరిత్ర పూర్వయుగాలనుంచే వుండేవని చెప్పవచ్చు.

చెంచులు, యానాదులుమొదలైన ఆదివాసులు జానపద కళలను అత్యంత సంకళమైన స్థితిలో పోషించు కుంటూ వస్తున్నారు. సంగీతాది కళాంగాలను పరిచయం చేసేటప్పుడు యానాదులు మొదలైన వారి కొన్ని కళలను గురించి చెప్పడం జరిగింది. యానాదులు, కోయలు, కొండరెడ్లు మొదలైనవారి కళలను గురించిన వివరణ అకారాది కళల వివరణలో భాగంగా ఇవ్వడం జరుగుతుంది.

ఆదివాసులద్వారా ఇప్పటికీ బ్రతికి ఉన్న కళలే కాకుండా, అనేకరకాల కళారూపాలు ఆంధ్రదేశంలో ఉండేవనడానికి శిల్పాలు, సాహిత్యం, శాసనాలు, చిత్రాలు, జానపద వాఙ్మయం సాక్ష్యాలుగా ఉన్నాయి. జానపద గాయకులు, జానపద సంగీతం, యక్షగానం, అనేక నృత్యాలను గూర్చిన ఉల్లేఖనాలు మనసాహిత్యంలో చాలాచోట్ల కనిపిస్తాయి. బవనీలు తమ జమిడికను వాయిస్తుంటే 'జుకజుంజుంజుకజుంజుజుమ్మనుచు సాగుంగడున్ వాద్యముల్' అని క్రీడాభిరామంలో వుంది. పల్నాటి వీరచరిత్రలో, పాల్కురికి రచనలలోరుంజలు అనేవారు రుంజవాద్యాన్ని మ్రోయించే వారని చెప్పబడింది. పిచ్చుకుంట్లను

గురించి కూడా పాల్కురికి చెప్పాడు. అష్టేపంజల, బవని. గాండ్ల మొదలైన వారిని పండితారాధ్య చరిత్ర పేర్కొన్నది. వినోద ప్రదర్శనలనేకం ఆంధ్ర దేశంలో వందలాది ఏళ్ళనుంచి ఉన్నాయి. మోడి, గారడి విద్యలెన్నో ఉండేవి. రెడ్డి రాజుల కాలంలో ఉండిన ప్రదర్శనల్లో బిందుమతీ విద్య ఒకటి. ఇది విప్రవినోదమనే ఇంద్రజాల విద్యను పోలించి. సింహాసన ద్వాత్రింసికలో మాంత్రికత్వం, జలస్తంభనం, బహురూప నటనత్వం మొదలైన వాటిని గురించి ఉంది. వీటిలో చాలావరకు ఆంధ్రదేశం నలుమూలలా వ్యాపించినవే. శైవ సంప్రదాయంలో నంది కోలాట ఉండేది. కోలాటం, గొండ్లి, పేరణి మొదలైన వాటిని బసవపురాణంలో పాల్కురికి సోమన పేర్కొన్నాడు.

'కోలాటమును బాత్ర గొండ్లి పేరణియు
గేళిక జోకయు లీల నటింప' (బసవ. పు. 22)

గంగిరెద్దును ఆడించడం మొదలయినవి కూడా ఆనాడు వుండేవి. 'గంగి రెద్దుల వాడు కావరమణ చిముకుదాడు పొడిచిన పోతెద్దులట్లు' అని పల్నాటి వీర చరిత్ర దీనిని పేర్కొనింది.

ఆంధ్రదేశంలోని వివిధ ప్రాంతాలలో వాడుకలో ఉన్న జానపద కళలను అకారాదిగా ఈ క్రింద ఇవ్వడం జరిగింది' ఆంధ్రుల జానపద కళలే ప్రత్యేక గ్రంథంగా రాదగినంత వ్యాప్తి కలిగి ఉన్నాయి. ప్రకృత గ్రంథంలో జానపద విజ్ఞానానికి సంబంధించిన అన్ని శాఖలకు ప్రాతినిధ్యం ఉండవలసి రావడంచేత జానపద కళలను సంక్షిప్తంగా వివరించడం జరుగు తున్నది.

### ఎలుగుబంటి వేషం

జానపదులు చూచి ఆనందించే దసరావేషాలలో ఎలుగుబంటి వేషం ఒకటి. ఇందులో అభినయం ఏమీ లేకున్నా అనుకరణ కనిపిస్తుంది. దసరా, ఉగాది, సంక్రాంతి మొదలైన పండుగలలో ఈ వేషం వేసుకొని వస్తారు. కొయ్య, తగరు లేక అట్టలలో చేసిన ఎలుగుబంటి మూతిని తగిలించుకొని వేషగాళ్ళు వస్తారు. ఇవేవీ లేకున్నా మూతి దగ్గర ఒకే చేటను పెట్టుకొని ఎలుగుబంటిని అనుకరిస్తారు.

ఎలుగుబంటి వేషాన్ని వేసుకోవడం ఒక పద్ధతయితే ఎలుగుబంటినే తీసుకొని వచ్చి ఆడించడం మరో పద్ధతి. జానపద కళల్లో కొన్ని జంతువులను, పక్షులను వాడుకోడానికి ఉదాహరణగా ఎలుగుబంటి ఆటను చెప్పుకోవచ్చు ఎలుగు బంటిని మచ్చిక చేసుకొని, దాని చేత గంతులు వేయించుతూ. పసిపిల్లలను ఆకర్షిస్తారు జానపద భిక్షుకులు ఎలుగుబంటి వెంట్రుకలు జానపదులకు చాలా విలువైనవి. భయపడిన పిల్లల మొలతాడుకు ఎలుగుబంటి వెంట్రుకలను కట్టడం, తాయెతులలో ఈ వెంట్రుకల నుంచుకొని ధరించడం కద్దు. ఎలుగుబంటిని పిలుచుకొని వచ్చేవారు సామాన్యంగా ముస్లిములు. ఎలుగు బంటిచేత సలాంచేయించడం, ఆడించడం అతని వంతు. జంతువును ఆడిస్తున్నప్పుడు డప్పువంటి వాద్యాలను ఉపయోగించడమూ కనిపిస్తుంది.

కర్నాటకంలోని కొడగులో హరిజనులు, ముస్లిములు ఎలుగుబంటి వేషం వేస్తారు. అక్కడా దీపావళి, వినాయక చవితి, మోహరం వంటి పండుగల సమయాల్లో ఈ వేషం వేస్తారు. ఎలుగు బంటిని తీసుకొని వచ్చి ఆడించడం, 'ఎలుగుబంటి చికిత్స'ను చేయడం కూడా కన్నడిగులకు పరిచితమైనదే.

## కప్పలకావడి

వానదేవుడికోసం చేసే ఆచారాలలో ఇదొకటి. అనావృష్టి ప్రాంతమైన రాయలసీమలో వానకోసం పడని పాటులేదు. మానవాతీత శక్తులను సంతోషింపజేసి వానకురిపించాలని అమాయక జానపదు లనుకుంటారు. మట్టిమూకుడులో తంగేడాకు పెట్టి దానిలో కప్పలనుంచి దాన్ని నెత్తిమీద పెట్టుకొని, లేక కావిడికి తగిలించి 'వానదేవా' అని పాడుతూ భిక్షానికి వస్తారు. వర్ష లక్ష్మి ఈ రూపంలో వచ్చిందని స్త్రీలు బిచ్చం పెడ్తారు. చేరలతోగాక చేటలతో బిచ్చం పెట్టాలని జానపదుల నమ్మకం.

'బూమెమ్మ కడుపునా బుగ బుగా పొగిలింది
కన్నీటి పొంగులే పెన్నేటి కాలువా? ఓ వానదేవా?
ఏరులూ చెఱువులూ ఏకమై పారల్ల (రాలి)
మాకొంద్ర పండల్ల

మా కడుపు నిండల్ల ఓ వానదేవా?....' (టి. దొణప్ప 1975:28) అన్నది కప్పలకావడి సమయంలో పాడేపాట.

కరగ

రాయలసీమలో కొన్నిచోట్ల, కర్నాటకంలోను కరగ పేరుతో ఉత్సవం జరుగుతుంది. దీనినే ఆంధ్రదేశంలో మరికొన్నిచోట్ల గరిగ అనీ గర్గ అనీ అంటారు. రాయలసీమలో చిత్తూరు జిల్లాలో అక్కడక్కడా జాతరచేసేటప్పుడు గరిగలను తయారుచేసి పూజించడం బలులివ్వడం కనిపిస్తుంది. ఒక పచ్చి కుండనుచేసి దానిచుట్టూ పూలుచుట్టి శిరస్సుపైన ధరించి పాటలు పాడుతూ, నృత్యంచేస్తూ ఇంటింటికీ తిరుగుతారు. పాండవులు స్వర్గారోహణ చేస్తుం డగా ద్రౌపది వాళ్ళవెనక నడుస్తూ మూర్ఛపోయిందట. లేచిచూచేసరికి భర్తలు లేరు. తిమిరాసురుడు అనేవాడు ఆమెను పీడించసాగాడు. ఆమె బృహదా కారాన్ని ధరించి తలమీద కుండపెట్టుకునిందట! అదే కరగ. మరొక కథ ప్రకారం ద్రౌపది పంచపాండవులను వివాహమాడే సమయంలో సంతోషంతో చేతిలోని కలశాన్ని నెత్తిమీదపెట్టుకుందట! అదే కరగ. ఇవన్నీ ఎలావున్నా కరిగ శక్తి ఆరాధన అని చెప్పవచ్చు. శక్తికి సంబంధించిన ఆచరణల్లో కుండలు ప్రధానపాత్ర వహిస్తాయి. బెంగుళూరులో కరగ ఉత్సవం తొమ్మిది దినాలు వైభవోపేతంగా జరుగుతుంది.

కరగం అనేపేరుతో తమిళులు కూడా కరగ నృత్యాన్ని చేస్తారు. ఉభయ గోదావరి జిల్లాలలో గర్గనృత్యం దేవి నవరాత్రి సందర్భంలో గాని, గ్రామదేవ తల జాతరల సందర్భంలోగాని జరుపుతారు. గర్గ కుండను పసుపుకుంకుమ లతో, రంగురంగు గుడ్డలతో, వేపమండలతో అలంకరించి, డప్పులు వాయిస్తూ నృత్యం చేస్తారు.

కరువ నృత్యం

తూర్పుగోదావరి జిల్లాలో ప్రచారంలో ఉండే ఈ నృత్యం రాసలీలను బోలుతుంది. ఎనిమిదిమంది పురుషులు కృష్ణునివేషాన్ని, ఎనిమిదిమంది గోపికల వేషాన్ని వేసుకొని వర్తులాకారంగా నిలుచుకుంటారు. మధ్యలో

మరిద్దరు రాధాకృష్ణుల వేషాలువేసుకొని నిల్చుంటారు అందరూలయబద్ధంగా నృత్యంచేస్తారు. లయకు తగ్గట్లుగా గతి వుంటుంది. అదే ఈ నృత్యంలో ముఖ్యం.

కలాపం

భామాకలాపాన్ని కూడా కొందరు జానపద కళల్లో చేర్చారు. కూచిపూడి భాగవతుల భామాకలాపమే జానపదకళ అయితే ఇక జానపద కళల్లో చేరనిదంటూ లేదు. భామా కలాపం మీద కొంతజానపద కళల ప్రభావం ఉండవచ్చు. కాని భరతనాట్య సంప్రదాయాన్ని శాస్త్రీయంగా అనుసరిస్తూ శిష్ట సంప్రదాయాలతో వికాసం చెందిన కూచిపూడి భాగవతుల నాట్యసంప్రదాయం జానపద సంప్రదాయంకాదు. అయితే కూచిపూడి సంప్రదాయాలను కొంతవరకు అనుకరిస్తూ చేసే కొన్ని జానపద కలాపాలు కూడా ఆంధ్రదేశంలో లేకపోలేదు,

కురవంజి

కురువ, కొరవ, గొరగ, గొరవ మొదలైన పదాలు వాడుకలో ఉన్నాయి. గొరవలను గురించి పాల్కురికిసోమనాథునికాలం నుంచే ఉల్లేఖనాలున్నాయి, వీరు శైవభక్తులు, గొరవలు కన్నడ దేశంలో కూడా ఉన్నారు. వీరిలో మాలూరయ్యన ఒక్కలు, బీరేశ్వరన ఒక్కలు, పార్వతియ ఒక్కలు అనేవారూ ఉపజాతులుగా ఉన్నారు.

కన్నడిగుల్లో ఉండే గొరవల వంటివారే రాయలసీమలోని అనంతపురం మండలంలో కూడా కనిపిస్తారు. వీరిని గొరగయ్యలంటారు. పిల్లనగ్రోవు లూదుతూ ఢమరుకం వాయిస్తూ పాటలు పాడుతూ కుండలాకార నృత్యాలు చేస్తారు. వీరు మైలారులింగ భక్తులు. కురుబజాతివారు, కురవ—కురుబ సమానార్థకాలు. ఇదే అర్థంలో తమిళజాతి కూడావుంది. బళ్ళారి, అనంతపురం, మండలాల్లో కనిపించే గొరగయ్యలు గొర్రెలు మేపడం, కంబళీలు నేయడం వృత్తిగా కలవారు. బీరప్ప వీరి ఇలవేల్పు కురవంజిని పోలిన నాట్యవిశేషం వారికి తెలుసు. ఉగాదినాడు బీరప్ప విగ్రహాన్నెత్తుకొని, నగారాలు, డోళ్ళు వాయిస్తూ నృత్యం చేస్తారు. క్రీడాభిరామంలో కూడా వీళ్ళనుగూర్చి ఉంది.

కొరవంజి పేరుతో కొన్ని యక్షగానాలు కనిపిస్తాయి. వీటిలో కొరవంజి పాత్ర ఒకటి వుంటుంది. ఈ స్త్రీ పాత్ర తాత్విక ప్రాధాన్యం వుండేది. భగవంతుడే కొరవంజి పాత్ర ధరించి అనుసంధానం చేయడం ఈ యక్షగానాలలో కనిపిస్తుంది. ప్రశ్నచెప్పే కొరవంజి స్త్రీలను కన్నడంలో కొరమతియరు, కొరమరు, కొరచరు అని పిలుస్తారు. సోదె చెప్పే కొరవంజి స్త్రీలు నేటికీ పల్లెల్లో అప్పుడప్పుడు దర్శనమిస్తుంటారు. వీళ్ళు పచ్చ పొడపడంలో కూడా నిపుణులు. ఈ విధంగా జానపద కళాకారులుగా వీరికి పేరుంది. సోదెనే గద్దె అనీ, గెద్ది అనీ చెప్తారు.

కొండరెడ్లు

తూర్పు గోదావరి మన్య ప్రాంతాల కొండరెడ్లు కర్నాటకంలో కూడా కొండమామ అనే పేరుతో ప్రసిద్ధులే. వీరి పండుగలు ప్రత్యేకఋతువులలో జరుగుతుంటాయి. ఫిబ్రవరి, మార్చి నెలల్లో మామిడి పండుగ జరుగుతుంది. భూదేవత ముత్యాలమ్మ, కొండదేవత వీరికి ఆరాధ్యదైవాలు. పండుగల్లో ఈ దేవతలనుస్తుతిస్తూ, పాటలు పాడుతూ, నృత్యాలు చేస్తారు.

తంబుర మీటుకుంటూ ప్రశ్న చెప్తామని వచ్చేకొండమామ లేక కుర్రిమామలు నాటు వైద్యానికి ప్రసిద్ధులు. చేతికి కడియాలు, కర్ణకుండలాలు, నుదుట నామం, తలపాగాకు నెమలిపింఛాలు ఉంటాయి.

కొయ్యకాళ్ళు

కాళ్ళకు కొయ్యలు కట్టుకొని ఉత్సవాలలో, జాతరల్లో, పండుగల్లో నర్తించడం ఆంధ్రదేశంలో అప్పుడప్పుడు కనిపిస్తుంది. తేలికైన, గట్టికొయ్యలతో కాలికొయ్యలను తయారు చేస్తారు. అవి మూడునాలుగడుగుల పొడుగుంటాయి. కొయ్యకాళ్ళతో నడవడానికి, నృత్యం చెయ్యడానికి బాగా అనుభవం అవసరం. మొదట కొంచెంసేపు సమతూకం కోసం ఒక గడనుపట్టుకొని, తర్వాత అదికూడా వదిలేసి నడుస్తూ వెళ్తారు. తర్వాత డప్పు శబ్దానికి తగ్గట్లు నృత్యం కూడా చేస్తారు. కొయ్యకాళ్ళతోనే వంగి డబ్బులు తీసుకోడం వంటి విన్యాసాలుచేసి ప్రేక్షకులను రంజింప జేస్తారు.

## కొయ్యబొమ్మలాట

మనదేశంలో కొయ్యబొమ్మలాటకు వేల సంవత్సరాల చరిత్ర వుంది. 'సూత్రక్రీడా' అన్నది అరవై నాలుగు కళల్లో ఒకటి. ఇదే కొయ్యబొమ్మలాట అని కొందరి అభిప్రాయం. కొయ్య బొమ్మలాటలో సూత్రాలు ఉంటాయి. వీని వల్లనే సంస్కృత నాటకాలలో సూత్రధారి అనే పేరు వచ్చిందంటారు. సూత్రం ప్రధానం కాబట్టి 'సూత్రద గొంబెయాట' (సూత్రాల బొమ్మలాట) అని కన్నడంలో దీన్ని పిలుస్తారు. ఆడించేవారు తెరవెనుక వుండి బొమ్మలను సూత్రాల సహాయంతో ఆడిస్తుంటారు కాబట్టి ఈ ఆట చూడడానికి అద్భుతంగా వుంటుంది. 'బొమ్మలాట' ఇంటిపేరుగా కలవారు చాలామంది ఉండడం చేత (బొమ్మలాట సాంబయ్య వంటివారు) ఇది ఆంధ్రదేశంలో ప్రాచీన కాలం



నేడు దాదాపు నశించిపోయిన కొయ్యబొమ్మల కళ
(జానపద వస్తుప్రదర్శనాలయం. మైసూరు)

నుంచి ఉండిందని చెప్పవచ్చు. వినోదం ప్రధానంగా కల బొమ్మలాట, ప్రకృతి అనుకరణవల్ల ఉద్భవించిందని చెప్పవచ్చు. బొమ్మలాట వృత్తిగా కలవారు అనేకులు ఉండేవారు; నేటికీ ఉన్నారు. కొయ్య బొమ్మలను తేలికైన బూరుగ, ప్రత్తి మొదలైన కొయ్యలతో చేస్తారు. ముఖం, చేతులు, కాళ్ళు చేయడానికి సరివి ఉపయోగిస్తారు. మగ ఆడ, నకిలి బొమ్మలనేవి ఉంటాయి. మగబొమ్మలు ఒకటిన్నర అడుగుల నుంచి, రెండున్నర అడుగుల వరకు ఉంటాయి. ఆడ బొమ్మలు కొంచెం చిన్నవిగా ఉంటాయి. సౌమ్యం, రౌద్రం మొదలయినవి అభినయించాల్సిన పాత్రలను బట్టి రంగులు వేస్తారు. స్త్రీ పాత్రలకు గాజులు, హారాలు, డాబు మొదలైనవి ఉంటాయి. మగ పాత్రలకు విల్లు, గద, చక్రం, కిరీటం మొదలయినవి ఉంటాయి. బొమ్మల తలకు రెండు సూత్రాలుంటాయి. వీటిని సూత్రధారుడు తలకు కట్టుకుంటాడు. చేతులకు కొక్కెలుంటాయి. వాటిని చేతితో పట్టుకుంటాడు. తోలు బొమ్మలంత ప్రచారం కొయ్యబొమ్మలకు లేదు.

రాయలసీమలో కొయ్యబొమ్మలాట ఒకానొకప్పుడు చాలా ప్రచారంలో ఉండేవి. కోలారు జిల్లాలోని ఒక తెలుగు శాసనంలో (E C Xsd 100-pp 238-39) బొమ్మలాట వారు అగ్రహారాన్ని పొందినట్లుగా వుంది (క్రీ.శ. 152i నాటిది). రాయలకు ఆప్తుడైన బొమ్మలాట వాడొకడుండేవాడు. అతడు బొమ్మలాట విరూపాక్షుని కొడుకైన బొమ్మలాట కాళడు. బళ్ళారిజిల్లాలో 'బొమ్మలాట పల్లె' అనే ఊరుంది. కడప మండలంలోని కమలాపురంతాలూకా చిడిపిరాలగ్రామాన్ని బొమ్మలాట రైతయిన చంద్రమయ్య, బొమ్మలాట అమృతకవి తెరనాటకం ఆడడానికి పెద చిట్టయ్యకు ఇచ్చారని ఒక శాసనంలో ఉంది (A R.316 of 1928). పై ఉదాహరణలు బొమ్మలాటలకు సంబంధించినవి. ఇవి కొయ్యబొమ్మలాటను సూచించేవి కావచ్చు లేదా తోలుబొమ్మలాటను సూచించేవి కావచ్చు.

కీలుబొమ్మలు అనేవికూడా కొయ్యతోచేసినవే. కీలుబొమ్మలు, జంత్రపు బొమ్మలు అనే వాటి ప్రసక్తి తెలుగు కావ్యాలలో వుంది. కీలుబొమ్మలాటకు వెనుక తెరమాత్రమే వుంటుంది. కథావశాన ఆ బొమ్మలు తెరచాటునుంచి వస్తూవుంటాయి.

ఎరుకలసానులు, కొంతమంది లంబాడీలు కొన్ని బొమ్మలను తీసుకు వస్తారు. ఇవి కొయ్యతో చేసినవే. ఇవి ఒక విధంగా యంత్రపు బొమ్మలని చెప్పవచ్చు. పాటకు తగ్గట్లుగా ఈ బొమ్మలను ఆడించడమో, దంచేట్లు చేయడమో చేస్తుంటారు.

కోలాటం

భారతదేశంలోని అనేక ప్రదేశాలలో అత్యంత జనప్రియమైన వినోదం కోలాటం. పాట, పాటలయకు తగిన నృత్యం, నృత్యానికి తగిన సంగీతం, సంగీతంతో బాటు వినోదం-అన్నీ మేళవించిన కళ కోలాటం. కోలాటం పాటలు ఆంధ్ర దేశంలోని అన్ని ప్రాంతాలలో ఉన్నాయి.

కోలాటం నృత్త భేదాలలో ఒకటి. పాల్కురికి "కోలాట గొడియల"ను పేర్కొన్నాడు. అన్నమయ్య కీర్తనల్లో కోలాట కీర్తనలనేకం ఉన్నాయి. ప్రకృతి అనుకరణ వల్ల ఉద్భవించిందని చెప్పవచ్చు. బొమ్మలాట తాడిపత్రిలో చింతలరాయని దేవాలయ ప్రాకార కుడ్యాలు కోలాట చిత్రాలకు ఆటపట్లు.

ఇప్పుడు పురుషుల కోలాటాలేగాని స్త్రీలకోలాటాలు అరుదు. జడ కోలాటం స్త్రీలకు సంబంధించింది. పోతరాజు కొలువులు, గ్రామదేవతల పరషలు, మహమ్మదీయుల ఉరుసులూ కొలాటా లాడడానికి మంచి సమయాలు.

కోలాటంలో ఎనిమిది లేక పన్నెండుమంది పాల్గొంటారు. సరి సంఖ్యలోనే జట్టు ఉండాలని నమ్మకం, నియమం. బాగా ఆరితేరినవాడు నాయకుడుగా వుంటాడు. కోలాటం జట్టు నాయకుణ్ణి రాయలసీమలో ముందు పాటగాడు, పెన్నద్ది, అయ్యగారు, మేళగాడు అంటారు. వెలుపల కక్ష్యలో సవ్యంగా తిరిగే వాళ్ళకు వెలియుద్దులని, లోపలి కక్ష్యలో అపసవ్యంగా తిరిగే వాళ్ళకు లోయుద్దులని పేరు. జట్టులోని వారు కాళ్ళకు గజ్జెలు, చేత గజ్జెలు కట్టిన బచ్చెన కోలలు ధరిస్తారు. మొదట 'తయ్యక తద్ధిమితా' అని పెన్నద్ది విలంబ గతిలో మొదలు పెడ్తాడు. మొదట తాళ శుద్ధికోసం 'కోలుకోలు కోలే, కోలన్న కోలు కోలోయ్, కోలుకోలుకోలే, కోలన్న కొలు కోలోయ్' అని పాడతారు. నిలబడి, తిరుగుతూ, మోకాలిమీద కూర్చొని కూడా కోలాటం వేస్తారు. కోలాటం

వేస్తూపాడే రకరకాల వరసలు, కోపులు ఉన్నాయి. తాళాన్ననుసరించి విలంబిత మధ్యద్రుత గతుల్లో కోపులు నడుస్తాయి.

క్రికెట్ వంటి నాగరికుల ఆటలు తెలియని జానపదులకు కోలాటే వినోదం ఇచ్చే మంచి ఆట. చిన్ననక పెద్దనక అందరూ మెచ్చేఆటఇది. మామూలుగా కోలాటాలు గణనాయకుని పాటతో మొదలవుతాయి. వీటిలో జానపదుల కిష్టమైన రాముడు, గోపాలుడు, గోపికలు మొదలయిన వారంతా వస్తుంటారు. పల్లవి కోలాటం పాటల్లో లయాత్మకంగా, కోలల శబ్దానికి తగ్గట్టుగా సాగుతుంటుంది. కోలాటం వంటివి సామాజిక ప్రాధాన్యం కలవి. వినోదమే ముఖ్యమైనా ఇటువంటి ఆట పాటల్లో కూడా ఊళ్ళోని ప్రతి ఒక్కరినీ పేరుపేరునా తలచుకునే జానపదుల సామాజిక స్పృహ మెచ్చదగింది.

"ఉయ్యాలో జంపాలో ఊగ పేరేమిరా
 రామరామ కోదండరామా
ఉయ్యాలో జంపాలో ఊరు మేడికుర్తి
 రామరామ కోదండరామా
పిచ్చాన ఉండే ఆ రెడ్డి పేరేమిరా
 రామరామ కోదండరామా
పిచ్చాన వుండే ఆ రెడ్డి రాఘవరెడ్డి
 రామరామ కోదండరామా........"

రాయలసీమలో అనంతపురమండల ప్రాంతంలో కోలాటాన్ని కోలన్న అంటారు. రాయలసీమకు సీమాప్రదేశంలో వుండే కర్నాటకంలో తెలుగులో వున్న కోలాటం పాటల వంటివే వున్నాయి. "శివశివ మూర్తివి గణనాథా నీవు శివుని కుమారుడవు గణనాథా'' అనే తెలుగు కోపులాంటిదే కన్నడంలోనూ వుంది.

"శరణు శరణువయ్య గణనాయ్క
నమ్మ కరుణదిందలి కాయొ గణనాయ్క

ఎళ్ళుండె జేనుతుప్ప గణనాయ్కా
నమగె విద్యావ కలిసయ్య గణనాయ్కా........''

కన్నడంలో కోలాటం పాటలు వందలాదిగా సేకరించబడ్డాయి. కోలాటం పాటల సంకలనాలు ప్రచురించబడ్డాయి. తెలుగులో కూడా కోలాటం పాటల సంకలనాలు ఒకటి రెండు ప్రచురించబడ్డాయి. కోలాటాన్ని గూర్చి డా. టి. దొణప్ప. డా. బి. రామరాజు మొదలైన వారు విలువైన వ్యాసాలు వ్రాశారు. డా. బిట్టు వెంకటేశ్వర్లు "పల్నాటి సీమలో కోలాటా"న్ని గురించి పరిశోధన జరిపి నాగార్జున విశ్వవిద్యాలయంనుంచి పిహెచ్.డి. పట్టం పొందారు.

ఖడ్గాలు

జాతరలలో వీరభద్ర పళ్ళెరం తీసుకొని వెళ్ళేటప్పుడు ఖడ్గం పట్టుకొని తమతమ ఇలవేల్పుల మీద చదివే పద్యాలకు ఖడ్గాలని పేరు. వీరభద్రఖడ్గాలు, చౌడమ్మఖడ్గాలు మొదలైనవి రాయలసీమలో వాడుకలో వున్నాయి. కోమట్లు వాసవి కన్యకా పరమేశ్వరిని, కంసాలులు కాళిని, సాలెవాళ్ళు చౌడేశ్వరిని, కురుబలు వీరభద్రుని కొలుస్తారు. ఈ ఖడ్గాలను చదువుతుండగా పక్కన వుండే వాళ్ళు కొమ్ము ఊదుతారు. ఢంజను వాయించే వాళ్ళు జేగంట, తప్పెట, డోలు, వీరంగం, శంఖం మొదలైనవి వాయించే వాళ్ళు కూడా వుంటారు. హంగుదారులు 'శరభ శరభ అశ్శరభశరభ' అని చెప్తుంటారు. గుంటూరుజిల్లా, కోటప్పకొండ మొదలైన చోట్ల వీటిని ఘటతాలని కూడా అంటారు. ఈ క్రిందిది చౌడమ్మ వారి ఖడ్గం దీనిని చెప్పినవారు దా. టి. దొణప్ప (నివేదకుడు: వీరేబాలప్ప, తొగట వీరక్షత్రియ, చేనేత వృత్తి. పెద్దకాకుంట్ల, రాయదుర్గం తాలూకా. అనంతపురం జిల్లా)

అహహా శాంభవే అహహా శాంభవే,
వీభూతి ఒకచేత. వీరంగ మొకచేత
ఘనఘనాగంటలే ఘల్లుమనగా
చక్రంబు తిప్పితే భూచక్రగొడుగులు
చుక్కలన్నీ గూడి భ్రగ్గడిల్లా
అహహా నీ మాయలు నెలకొంటివో నైకదాంబా
సరస సద్గుణ నికురాంబ శ్రీ శారదాంబా

## గంగిరెద్దుమేళం

జంతువులకు కొన్ని విద్యలు నేర్పి పొట్టపోసుకునే వాటిలో గంగిరెద్దు మేళం ఒకటి. ఈ జానపద కళ ఎంతవరకు జనంలో చొచ్చుకు పోయిందంటే ఎవరైనా ఊర్కే "ఊ" కొడుతుంటే "ఎందుకురా గంగిరెద్దులా తలూస్తావ్" అంటారు. కన్నడిగులలోకూడా దీనిని "గంగెత్తినవరు' అనీ "బసవన్న" అనీ అంటారు. గంగిరెద్దు మేళం గొల్లపంశం వారిలో ప్రచలితమై వుంది. ఒక్కొక్క ఊరిలో గంగిరెద్దును ఆడించుకుంటూ నెల్లూరి నుంచి మైసూరు వరకు వెళ్ళేవారుకూడా వున్నారు. బసవన్నను సిద్ధం చేయడానికి కొన్ని నెలలు పడుతుంది. కొందరు సీతా రామ లక్ష్మణుల్ని తయారు చేస్తారు. సీతారామ కల్యాణం కూడా జరుపుతారు. మేళతాళాలతో అలనాటి సీతాకల్యాణమే మళ్ళీ జరుపుతున్నట్లుగా వైభవంగా బసవన్నను ఆడిస్తారు, అడుగులు వేయిస్తారు, తలూపిస్తారు, పెళ్ళి చేస్తారు. గంగిరెద్దుల్ని రకరకాల బట్టలతో, రంగులతో చక్కగా అలంకరిస్తారు. గంగిరెద్దు మేళంలో డోలు, నాదస్వరమూ ఉంటాయి. వాద్య సంగీతమూ, జంతువుల నృత్యమూ ఈ మేళంలో ప్రధాన పాత్ర వహిస్తాయి.

## గుర్రపు నృత్యం

కీలుగుర్రం అనే పేరుతో పండుగల్లో కనిపించే వేషాలలో గుర్రం ఒకటి. ఇది తమిళనాడులో, కర్నాటకంలో కూడా జనప్రియమయిన వేషం, నృత్యం, అనుకరణ. జానపద కథల్లో కీలుగుర్రాలు మూలాంశాలు. జానపద కథలలో కనిపించే అనేక కల్పనలకు రూపకల్పన చేయాలనే ఆకాంక్ష వీటిలో కనిపిస్తుంది. ఏడు సముద్రాలు దాటి రాజకుమారుని చేరాలంటే కీలుగుర్రం కావాలి. కల్పనల్లోని కీలుగుర్రాన్ని వాస్తవాంశంగా మార్చేటప్పుడు వెదురు దబ్బలే జానపదులకు దొరుకుతాయి. కాయితాలు రుబ్బి, దానిలో కొన్ని మెంతులు జిగురురావడంకోసం కలిపి తలను తయారు చేస్తారు. మిగిలిన భాగాలను వెదురు దబ్బలతో చేస్తారు. కాళ్ళకు కొయ్యలు కట్టుకుంటారు. రంగురంగుల గుడ్డల్ని గుర్రంమీద వేస్తారు గుర్రాన్ని "తోలే" వారు కిరీటాలు మొదలైన అలంకారాలు చేసుకుంటారు. భుజకీర్తులు, హారాలు, కడియాలు

వగైరా హంగులన్నీ ఉంటాయి. మొహానికి రంగు పూసుకుంటారు. పక్క వాద్యాలు కూడా ఉంటాయి.

గుంటూరు, నెల్లూరు జిల్లాలలో కీలుగుర్రాలు చాలా జనప్రియమై వున్నాయి. స్త్రీ పురుషులిద్దరూ ఈ గుర్రాల మధ్య భాగంలో చేసిన పెద్ద రంధ్రంలో నిలుచుకొని, గుర్రాలను తోలు తున్నట్లు అభినయిస్తారు. గుర్రాల బొమ్మలను ఉపయోగించి మనుషులే నృత్యం చేసేది ఒక రకమైతే గుర్రాలనే ఉపయోగించి ఆడించేది మరొక రకం. గుంటూరు జిల్లాలో ఇలాంటి నృత్యం కూడా ప్రచారంలో ఉంది. చిరుగంటలనుకళ్లాలకు బిగించి పెళ్ళి ఊరేగింపులు మొదలైన సందర్భాలలో గుర్రాల చేత నృత్యం చేయిస్తారు.

చెంచులకథలు

చెంచులు ఆంధ్రదేశంలోని ఆదివాసులు. చెంచులు పాత్రలుగా కొన్ని యక్షగానాలుకూడా వెలువడ్డాయి. చెంచునాటక కూటాలు అనే పేరుతోనే నాటక కూటాలు రాయల సీమలో ఉన్నాయి. వీటిలో సింగిసింగడు ప్రధాన పాత్రలు. ఆసాది వారు వీటిలో పాత్రలను ధరిస్తారు. జానపదుల అభిరుచులకు అనుగుణంగా పాటలు, అభినయం ఉంటాయి. సింగడు పాడే "గుండుదిగవె చెంచీత గుండు దిగవే, వేళ్ళకు తగ్గ కనకపు శ్రీ మెట్టె లిచ్చెనూ" వంటి పాటలు ఆంధ్రులకు చిరపరిచితాలే.

ఆది వాసులైన చెంచులకు ప్రత్యేకంగా పాటలంటూ లేవు. అప్పటి కప్పుడు ఏదో ఒక పాటకట్టేస్తారు. డప్పుకు తగ్గట్లుగా గంతులేస్తారు. ఇప్ప పువ్వు సారాయికూడా తోడయిందంటే ఒళ్ళెరగకుండా కుప్పిగంతులేస్తారు. నెమలినృత్యం, కోతి నృత్యం మొదలయినవి వాళ్ళగంతుల్లో భాగాలు.

జట్టిజాము

కోలాటాన్ని, గొబ్బియాటను పోలినదిది. కోలాటాన్ని గురించి ఇంతకు ముందే వివరించడమైంది. గొబ్బితట్టూ పాటలు పాడుతూ మండలాకారంగా నృత్యం చేయడం ఆంధ్రదేశంలో కనిపిస్తుంది. సంక్రాంతి పండుగ సమ యంలో ప్రతిఇంటి ముంగిట గొబ్బిళ్ళు పెడతారు. యువతులు గొబ్బితట్టూ

'గొబ్బియల్లో గొబ్బి గొబ్బిపాడరమ్మ గొబ్బియల్లో' అని పాడుతూ చప్పట్లు కొడ్తు నృత్యం చేస్తారు. గుజరాతు, మరట్వాడాలలో 'గర్బా' నృత్యం ఉంది. అదేగొబ్బి అయివుండవచ్చుఅని'తాల్‌గర్బా'అనే ప్రభేదమే జట్టిజాము వోలే నృత్యమని టి. దొణప్పగారి అభిప్రాయం (1975:190) జట్టి జామును గురించి డా. దొణప్పగారు తమ 'జానపద కళాసంపద'లో వివరించారు.

జట్టిజాము తాళప్రధానమైనకళ. గొబ్బిలోలాగా దీనిలో చుట్టిరావడం వుండదు, కోలాటంలోలాగా చేతి కోలలుగాని, చెమ్మచెక్కలోలాగా గెంతడం గాని ఉండదు. కాలు కదపకుండానే జట్టిజాము వెయ్యవచ్చు. దీనిలో చేచరపులు మాత్రం ఉంటాయి. 'తిన్నగా నిలుచుండి, ఉభయపార్శ్వములందలి ఉద్దికత్తె లతో ఒద్దికలు చెడకుండ ఒకసారి కుడి తట్టునకు, ఒకసారి యెడమతట్టునకు పార్శ్వముఖ భంగిమలో ఓరగా తిరిగి, ఆయా వైపుల నుండువారి అఱచేతులను తనఅఱచేతులతో తట్టుచు' (టి. దొణప్ప 1975:188) పాడుచు వేసేది జట్టి జాము. ఇది పూర్తిగా స్త్రీలఆట, మొదట చేతి కోలలను వాడుతుండిరని ఊహ చేయవచ్చు. సంస్కృతంలో చేతికోలలని అర్థమిచ్చే 'యష్టి' ప్రాకృతంలో 'జట్ఠి' అవుతుంది. అదే తెలుగులో 'జట్టి' అయివుండవచ్చు. ప్రహారానికి సంస్కృతంలో 'యామ' అంటారు. ప్రాకృతంలో 'జామ' అంటారు. జట్టిజాము పాటల్లో వెన్నెలాయలో, వెన్నెదాయలో, వెన్నటీ అనే పాదాంతాలుం టాయి. జట్టిజామును చైత్రవైశాఖకార్తిక మార్గశిరాలు ఈ పాటల ఋతువులు. జట్టిజాములోనలుగురుగాని. అంతకుఎక్కువయితే సరిసంఖ్యలలోగాని పాల్గొం టారు. వీరు రెండుజట్లుగా ఉంటారు. ఒక జట్టువారు పాటలో ఒక పాదం చెప్తే రెండవ జట్టువారు వంతపాడుతారు. తుమ్మెదా, నడియలో, వెన్నటీ,రామరామా కోదండరామా వంటి పల్లవులు జట్టిజాము పాటల్లో కనిపిస్తాయి.

జేగంట భాగవతులు

'ఎందుకయ్యా వుంచినావు బందిఖానాలో' (వ్రెందుకయ్యావుంచినావు (బందిఖానాలో—అని పాడడం కద్దు) అని రామదాసు బందిఖానా విషయాన్ని పాటలో చెప్తూ పెద్ద జేగంటతో రామలక్ష్మణసీతా విగ్రహాలతో కూడిన దీపపు స్తంభాన్ని పట్టుకొని నోటితో పాడుతూ గజ్జెలకాళ్ళతో నృత్యంచేస్తూ, చిరుత లతో తాళంవేస్తూ స్తంభం చుట్టూ కలయ దిరుగుతూ వీరు నృత్యం చేస్తారు.

## జోకుమార సంప్రదాయం

ఇది కన్నడదేశంలో చాలాప్రసిద్ధి వహించింది. అనంతపురంజిల్లాలో బోయలు, తలార్లు నల్లని జోకుమారుని విగ్రహాన్ని తయారుచేసి ఊరూరు తిప్పుతారు. వీరు శైవులు, జోకుమారుడు వినాయకుని సోదరుడని వీరి నమ్మకం. ఏడునుంచి తొమ్మిది రోజులలో 7–9 సీమలను చుట్టివస్తారు. ఆడవాళ్ళు తంగేడుఆకు, తంగేడు పువ్వులు జిల్లేడు ఆకులు, పువ్వులతో అలంకారం చేసుకుంటారు.

కన్నడ దేశంలో జోకుమారుడి ఉత్సవాన్ని భాద్రపదశుద్ధఅష్టమినాడు జరుపుతారు. జోకుమారుని గురించి రకరకాల కథలు కన్నడ దేశంలో ప్రచారంలో ఉన్నాయి. జోక ఋషి, ఎళేగౌరి అనేవారికి పుట్టినవాడే జోకుమారుడని కొందరు చెప్తారు. వానకోసం చేసేపూజలలో జోకుమారుని పూజఒకటి. స్త్రీలు జోకుమారుని తీసుకొని ఊరూరు తిరుగుతారు. అక్కడక్కడ పోగయిన ధాన్యం చేర్చి వంటచేసి, జోకుమార్ణ్ణి పూజించి, విగ్రహాన్ని ఉతికే బండ కింద పెట్టి భోజనం చేస్తారు. అంతలో ధారపాతంగా వానవస్తుందనిజానపదుల నమ్మకం.

## తప్పెటగుళ్ళు

తెలుగుదేశంలోని జానపద కళలలో ప్రజలకు చక్కని వినోదాన్నిచ్చే వాటిలో తప్పెటగుళ్ళను ప్రధానంగా చెప్పుకోవచ్చు. ఉత్తరఆంధ్రలో—ముఖ్యంగా శ్రీకాకుళం. విజయనగరం, విశాఖపట్నం జిల్లాలలో తప్పెటగుళ్ళు బాగా ప్రచారంలో ఉన్నాయి. తప్పెటలు, గజ్జెలు దీనిలో ముఖ్యమైన వాద్యాలు. పొట్టిచేతుల జుబ్బాలు, నిక్కర్లు వేసుకున్న కళాకారులు గుండెలకు ఆనుకొన్న తప్పెటల్ని లయాన్వితంగా వాయిస్తూ నృత్యం చేస్తారు. కళాకారులదుస్తులు ఎర్రరంగువికావడంవల్ల ప్రేక్షకులకు వారినృత్య భంగిమలు ఒక వింత సోయగంతో సంతోషాన్నిస్తాయి. నిక్కరుతో సహా గజ్జెలు ధరించడంవల్ల అవి తప్పెటకు తోడు శబ్దాన్నిస్తాయి. కాళ్ళకుకూడా గజ్జెలుంటాయి. ప్రత్యేక రంగస్థల మేమీ అక్కరలేకుండా తప్పెటగుళ్ళను ప్రదర్శించవచ్చు. పురుషులే ఈ కళను ప్రదర్శిస్తారు. తప్పెటగుళ్ళతో బాటు గాత్రసంగీతంకూడా వుంటుంది.

వంశపారంపర్యంగా ఒక తరంనుంచి మరొక తరానికి సంక్రమించే జానపద కళ తప్పెటగుళ్ళు. వీరు యాదవకులానికి చెందినవారు. అందువల్ల వైష్ణవ సంప్రదాయానికి చెందిన గీతాలనే ఈ కళాకారులు పాడుతుంటారు. తాళానికి తగినట్లు నృత్యం, పాట, వాద్యసంగీతం కలిసి తప్పెటగుళ్ళను చక్కని ప్రదర్శన కళగా రూపొందిస్తాయి.

తప్పెటగుళ్ళల్లో భాగంగా కొన్ని ప్రత్యేకమైన ప్రతిభాప్రదర్శనలు కూడా వుంటాయి. వివిధ భంగిమలలో తప్పెట్లువాయించడం వీటిలో ఒకటి పిల్లిమొగ్గలు వాయిస్తూకూడా తప్పెట్లు మోగిస్తారు. ఒకరిమీద ఒకరు ఎక్కి ఇటొకరిని అటొకరిని వ్రేలాడదీస్తూ తప్పెటలు వాయించడంకూడా చేస్తారు. ఒక్కొక్కసారి కళాకారులు రెండు జట్లుగా విడిపోయి తప్పెట్లువాయించడంలో నాట్యంచేయడంలో పోటీ పడతారు. పెద్దకుండపైన ఒకడు నిల్చుకొని, అతని భుజాలపైన మరొకడు నిల్చుకొని, అతని తలపైన నీళ్ళపాత్రను పెట్టి కూడా తప్పెట్లు వాయిస్తారు.

తప్పెటగుళ్ళ ప్రదర్శన సుమారు ఐదారు గంటలు సాగుతుంది. రాత్రి వేళ జానపదులకు ఇది మంచి వినోదాన్ని కలిగిస్తుంది. ఈ కళాకారులు పగటి పూట గొర్రెల పెంపకం వంటి వృత్తులను చేపట్టి, రాత్రి వేళ ఈ కళను ప్రదర్శిస్తుంటారు. ఈ కళలో ఎన్నో రకాల విన్యాసాలుండడం చేత దీన్ని ప్రదర్శించడానికి ఎంతో శక్తి కావాలి. ఆంధ్రభూమి(13-11-80) వారపత్రికలో శ్రీ ఎస్. వి. రమణరావు తప్పెట గుళ్ళను గురించి చక్కని సచిత్ర వ్యాసాన్ని ప్రకటించారు.

### తోలుబొమ్మలాట

ప్రపంచంలో అనేక ప్రాంతాలలో జానపదులకు వందల కొద్దీ సంవత్సరాలుగా వినోదాన్ని చేకూరుస్తున్న వినోదం తోలుబొమ్మలాట. ఇది మానవుడు తయారు చేసుకున్న మొట్టమొదటి రూపక మని కొందరి అభిప్రాయం. ఇదే తర్వాతి కాలంలో యక్షగానాలకు, నాటకాలకు దారి తీసిందనే అభిప్రాయం వుంది. మనదేశంలో 'ఆఖ్యానక' మనే పేర ఒక విధమైన ఆలేఖ్య పద్ధతి ప్రచారంలో ఉండేదని కాదంబరి, వాత్స్యాయన కామ సూత్రాలు, శృంగార



ఆంధ్రుల తోలు బొమ్మ (జానపద వస్తు ప్రదర్శనాలయం. మైసూరు)

ప్రకాశవంటి గ్రంథాల వల్ల తెలుస్తున్నది. ఏదైనా కథలోని సన్నివేశాలను కళ్ళకు గట్టినట్లు పటం మీద చిత్రించి చూపే పద్ధతి ఇది. తర్వాతి కాలంలో బహుశా ఇలాంటి చిత్రాల్నే కదిలించి చూపుతుండేవారేమో. అటు తర్వాత ప్రత్యేకంగా బొమ్మలను తోలుతో, కొయ్యలతో తయారు చేసి ఆడించే పద్ధతి వచ్చి ఉంటుంది.

మన దేశంలో తోలుబొమ్మలాటకు, కొయ్య బొమ్మలాటకు, కీలు బొమ్మలాటకు సుదీర్ఘమైన చరిత్ర వుంది. అందులోను దక్షిణ దేశంలో ఇది అత్యంత ప్రాచీన కాలం నుంచి వాడుకలో ఉన్నట్లు ఆధారాలున్నాయి. మహా భారతంలో 'రూపోప జీవనం' అనే మాట వుంది. దీన్ని వ్యాఖ్యానిస్తూ నీల

వుంటాయి. లంకా దహనం, మైరావణ చరిత్ర, కీచకవధ, ప్రహ్లాద చరిత్ర, జనప్రియ కథలు, దేశీయాలైన కుమారరాముని కథ వంటివి కూడా ఆడుతారు. ఈ కథలను గానం చేసేటప్పుడు ముఖారి, మధ్యమావతి, ఆరభి, ఆనంద, భైరవి రాగాలు వినపడుతుంటాయి.

మొదట మొదట తోలుబొమ్మలాటను తెలుగువారే ఆడించే వారేమోగాని, కొన్ని శతాబ్దాలనుంచి మాత్రం అది మరాఠీవారి చేతిలోవుంది. తెలుగుదేశంలో మాత్రమేకాక, కన్నడదేశంలో, తమిళ దేశంలోకూడా ఇదే పరిస్థితి కావడం చేత మరాఠీ వాళ్ళకు ఈ కళలో చక్కని పరిణతి లభించిందనిపిస్తుంది. రాయల సీమలో వీరిని 'ఆరె' వాళ్ళంటారు. పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలోని పర్వత ప్రకరణంలో 'ఆరె పరుస నడకలు' రాశాడు. వీళ్ళు ఆద వాని, బళ్ళారి, ఆలూరు, గుత్తి, పత్తికొండ మొదలైన చోట్ల ఉన్నారు. కాని తోలుబొమ్మ లాటే మహారాష్ట్ర దేశం నుంచి మనకు వచ్చిందని చెప్పడానికి వీలులేదు. చీరమరుగుల భారతాది కథల నాడించడం పాల్కురికి సోమనాథుని కాలంనుంచి వుంది. కన్నడంలో తోలు బొమ్మల నాడించే వారిని కిళ్ళేక్యాతరు లేక సిళ్ళేక్యాతరు అంటారు. కేతిగాడనే పాత్ర మనకు బాగా పరిచితమైనదే. కొంటె కోణంగి బొమ్మకు రాయలసీమలో కిల్లేగిత్తిరి గాడని పేరుంది.

తోలుబొమ్మలాట ఊరి చావళ్ళలో ఆరుబయట వేదికల మీద జరుగు తుంటుంది వెదురు వాసాలతో సరళ రంగస్థలం నిర్మాణమవుతుంది. ముందు వైపు చలవ చేసిన తెల్లచీర ఉంటుంది. మగపాత్రల వెనక మగవారు, ఆడ పాత్రల వెనక ఆడవారు ఉంటారు. ఆట రాత్రి రెండవజాము మొదలై తెల్లవారు జాము వరకు సాగుతుంది. మొదట వినాయకుణ్ణి, తర్వాత సరస్వతి మొదలైన దేవతలను ప్రార్థించి ఆట మొదలు పెడతారు. బంగారక్క, కేతిగాడు ముఖ్యంగా వినోదాన్ని ప్రసాదిస్తారు ప్రస్తావన జరిపేది సూత్రధార పాత్ర ధారిని, పారిపార్శ్వకుని బోలిన గందోడిగాడు, కేతిగాడు అనేవారు.

తోలు బొమ్మలను తయారు చెయ్యడానికి జింక, దుప్పి, మేక, గొర్రె, గాడిదల చర్మాన్ని ఉపయోగిస్తారు. మొదట తోలును పారదర్శకంగా చేసి రేఖ లను గీచి అక్కడికి కత్తిరిస్తారు. రంగులు అనేక దశలలో వేసుకుంటూ



ఆంధ్రుల తోలుబొమ్మ (జానపద వస్తు ప్రదర్శనాలయం, మైసూరు)

వస్తారు. ప్రధాన పాత్రలకు జింక చర్మాన్ని, మిగిలిన పాత్రలకు మేక మొద లైన వాటి చర్మాన్ని ఉపయోగిస్తారు. జిగురుపూసి దారం పురిపెట్టి బొమ్మల అవయవాలను కీళ్ళ దగ్గర కలిపి కుడ్తారు. బొమ్మలు కొన్ని మన కభిముఖంగా వుంటే, మరికొన్ని పార్శ్వముఖంగా వుంటాయి. తోలుబొమ్మలకు ఎక్కువగా జింక చర్మాన్ని వాడడానికి కారణం అది ఎక్కువ పారదర్శకం కావడమే. రంగుకూడా దానికి బాగా పడుతుంది. తోలు బొమ్మలాట వల్ల ఊరికి పట్టిన శని, ఇతర పీడలు విరుగడై పోతాయని జానపదుల నమ్మకం. దీనివల్ల వర్షం కూడా వస్తుందని నమ్ముతారు.

కన్నడంలో తోలు బొమ్మల నాడించే వారు మహారాష్ట్రలోని పతారా ప్రాంతాలనుంచి వలస వచ్చిన వారమని చెప్పుకుంటారు. వీళ్లూ దేశద్రిమ్మ



ఈ బొమ్మలాటల కలింగపేరా!
(మైసూర్లోని జానపదశ్రీ (సంగ్రహాలయం)

రులే. కొన్నిచోట్ల వీరు తమను 'కటబిర'ని చెప్పుకుంటారు. బెంగుళూరు, కోలారు, మండ్య, హాసన, తుంకూరు జిల్లాల తోలుబొమ్మలాట గాండ్రలో ఆజేట, పాచంగి, అటాపు, సింధె అనే నాలుగు జాతుల వారున్నారు. బంగారక్క కిళ్ళేక్యాత (కేతిగాడు) పాత్రలు కన్నడంలో కూడా బాగా ప్రసిద్ధమయ్యాయి. కన్నడంలో కూడా రామాయణ, మహాభారత కథలు ఎక్కువ ప్రసిద్ధాలు. సీతా స్వయంవరం, ద్రౌపదీ స్వయంవరం మొదలైన వాటితో బాటు శివజలంధర, దేవీ మాహాత్మ్యం, త్రిపుర సంహారం మొదలైన వాటిని ఆడతారు. రామాయణమయితే అనేక రాత్రులు ఆడి జానపదుల నలరిస్తారు. జానపదుల పాలిటికి తోలుబొమ్మలాటే చలన చిత్రం నిజమైన అర్థంలో అది చలన చిత్రమే.

దాసర్లు

వీరువైష్ణవులు. ముఖ్యంగా సంక్రాంతికి పల్లెపల్లెలో హరిదాసులు దర్శనమిస్తుంటారు. దాసర్లలో గొల్లలు, కురవలు, బలిజవారు, సాతాని వారు ఉన్నారు. శంఖం, వత్తివేయడానికి గరుడగంబం, జాగటి అనే కంచు వాద్యం ధరించి వీరు వస్తారు. రాగితో చేసిన బోనాసి లేక బవనాసి అనే పేరుగల భిక్షాపాత్రను వీరు ధరిస్తారు దాసర్లలో బుక్కదాసర్లు, భాగవత దాసర్లు, దండె దాసర్లు, మాలదాసర్లు మొదలైన వారున్నారు. తంబురా, చిరతలుకూడా ధరించే వారున్నారు. స్త్రీవేషంవేసి గజ్జెకట్టి, తాళ మృదంగ ధ్వనులతో నృత్యం చేస్తారు. కొందరు కిన్నెర కూడా చేపడ్తారు. నక్కదాసర్లనేవారు నక్క మొహంతో వేషం వేసుకొని వస్తారు. గూళెం దాసరులనేవారు నాటకాలాడుతారు. కన్నడ దేశంలో దొంబి దాసర్లున్నారు. వీళ్ళు తెలుగే మాట్లాడుతారు. తెలుగుదేశం నుంచి కన్నడ దేశానికి వలస వెళ్ళినవారు వీరు. వీధినాటకాలాడడంలో నిపుణులు. వైష్ణవ సంప్రదాయానికి చెందిన ఈ దాసర్లు ఏకతార, చిరతలు ధరించి బాలనాగమ్మ, హరిశ్చంద్ర, నలచరిత్ర మొదలైనవి చెప్తారు.

పగటివేషం

పగటి వేషకులని, పొగటేషగాళ్ళని పేరుపొందిన ఈ కళాకారులు దేశ ద్రిమ్మరులు. గ్రామ్యభాషలో 'పగలేసి గాళ్ళు' అని కూడా అంటారు. వీరు విప్రవినోదుల వంటివారని కొందరంటారు. వీరు దొర, దొరసాని, వడ్డెవాడు, బ్రాహ్మణ వితంతువు మొదలైన వేషాలు వేస్తారు. ఏడాది కొకసారి ఊరికి వస్తారు. వేషాలకు తగిన దుస్తులుంటాయి. వీరికి మంచి అనుకరణ శక్తి వుంది. పరిహాస ప్రియత్వం బాగా వుంటుంది. యక్షగానాల్లో వుండే సాంప్రదాయిక పాత్రలే ఈ విధంగా ప్రత్యేక వేషాలుగా మారి, పగటి వేష గాళ్లు తయారయ్యారని కొందరి అభిప్రాయం. యక్షగానాలు మొదలైనవి రాత్రి పూట జరుగుతాయి. దాన్ని పగలుకూ విస్తరించి పగటి వేషాలను జానపదులు తయారు చేసుకొని వుండవచ్చు. పగటిపూట పనులన్నీ వదలుకొని వచ్చి ఎవ్వరూ నాటకాలు చూడలేరు కాబట్టి వేషంతో, కొన్ని సంభాషణలతో తృప్తి పడడం జరుగుతుంది. పగటివేషకులు ఒకసారి ఒక వూరికి వస్తే అక్కడే వారం పదిరోజులుండి దినాని కొక వేషం చొప్పున వేస్తుంటారు.

## పాముల వాళ్ళు

ఆంధ్రదేశంలో బాగా పరిచితమైన వాటిలో పాముల వాడి ఆట ఒకటి. బుట్టలో పామును తీసుకొని, బుంగ ఊదుతూ ప్రతి ఇంటి ముందూ బుట్టను పెట్టి మెల్లగా పామును బయటికి తీస్తారు. బుంగ ఊదుతుంటే పాము తలను కదిలిస్తూ వుంటే, పాములవాడి ధ్వనికే పాము నృత్యం చేస్తున్నదని అంతా భ్రమపడుతారు. వాడి వాద్యం కదలికలకు తగ్గట్లుగా పాము ఊగుతుందని పరిశీలన వల్ల తెలుస్తుంది. పాముబుట్టతో వచ్చే పాముల వాళ్ళను గురించి రకరకాల కథలు ప్రచారంలో ఉన్నాయి. కొందరు కొండ చిలువలను మెడచుట్టూ వేసుకొని భిక్షానికి వస్తారు.

## పులివేషం

ఆంధ్రదేశంలో పలుప్రాంతాలలో కనిపించే జానపద కళలలో ఇదొకటి. కళ్ళు చెదిరే రంగులకు దీనిలో ఎక్కువ ప్రాధాన్యం ఉంటుంది. చెడ్డీ తప్ప మరేమీ దుస్తులు వుండవు. పులివేషం చాలా నిదానంగా, ఎంతో నైపుణ్యంతో తీర్చి దిద్ద వలసిన వేషం. తలకు గట్టిగా ఒక "విగ్గు" లాంటిది పెట్టి శరీరంతో బాటు దాని పైనా పూర్తిగా రంగు వేస్తారు. వెనక వైపు తోక పైకి వంగి వంటుంది. ఒళ్ళంతా చారలు చారలుగా పులిలాగే రంగులు వేస్తారు తప్పెట మోతకు తగినట్లుగా పులివేషం వేసినవాడుఆడుతాడు. కన్నడిగుల లోను హులివేష అనే పేరుతో ఇది ప్రచారంలో ఉంది. తెలుగువారి లాగానే కన్నడిగులూ ఒళ్ళంతా పసుపు పచ్చ చారలను వేసుకొని పులిలాగే తయారవుతారు.

## బయలాట

కర్ణాటకంలోను, రాయలసీమలోను ప్రాచుర్యాన్ని పొందిన రూపకాలలో బయలాట ఒకటి. దీన్నే సంస్కృత పరిభాషలో వీధినాటకం అనవచ్చు. తమిళదేశంలో 'తెరుకూత్తు' అని పేరు. యక్షగానంలో లాగానే రాయలసీమ బయలాటల్లో పాటలు, పద్యాలు, దరువులు ఉంటాయి. శబ్దాలంకారాలకు ఎక్కువ ప్రాధాన్యం. వేషభూషణాలు, అభినయం యక్షగానానికి, బయలాటకు ఒకటే. వాచికం మాత్రం బయలాటలో ఎక్కువ అనిచెప్పవచ్చు. వంత పాట

గాంధ్ర నాయకుడు రాగానే దిష్టితీయడానికి గుమ్మడికాయనో, కొబ్బరికాయనో కొట్టి అతని ఊరిపేరు అడుగుతారు. సభాగమన హేతువునడుగుతారు. అంతా అతను చెప్తాడు. ఇది 'సభావచనం'. తర్వాత అసలుకథ ప్రారంభమవుతుంది. కుమార సంభవం, కీచక వధ, ఉత్తర గోగ్రహణం, రామాయణం, కుమార రాముని కథ మొదలయినవి ప్రసిద్ధమైన బయలాటలు.

కన్నడ దేశంలో ఈ నాటికీ బయలాటకు చాలా ప్రాశస్త్యం ఉంది. కొందరు బయలాట (బయలు+ఆట) పేరుకు తగ్గట్లే బొమ్మలాటలకు కూడా అన్వయిస్తుందని అభిప్రాయ పడ్తారు. బొమ్మలాట కాక కన్నడం లోని బయలాటలలో దొడ్డాట, సణ్ణాట, దాసరాట, పారిజాత అన్నవి ఉన్నాయి. దొడ్డాట అన్నది పెద్దది. దీని ప్రదర్శనానికి చాలా హంగులు అవసరం. విశాలమైన బయలులో, రాత్రి భోజనం తర్వాత ఆట ప్రారంభమవుతుంది. మొదట గణపతి పూజ ఉంటుంది. హనుమనాయకుడనే వాడు (కోణంగి) వినోదానికి పేరు గన్నవాడు. దీనిలో పాటలు, సంభాషణలు రెండూ ప్రధానమే. తెలుగులోను, కన్నడంలోను వేషభూషణాలు ఉంటాయి. ఆభరణాలను తళతళ మెరిసేట్లు తయారు చేస్తారు. ఆయుధాలను కొయ్యతో తయారు చేస్తారు. బయలాటలలో, కన్నడంలోని దొడ్డాటలలో రామాయణ భారతాలకు సంబంధించిన కథలే ఎక్కువ. జైమినిభారతంలోని కథలుకూడా కన్నడంలోబాగా ప్రసిద్ధమయ్యాయి.

బహురూపులు

వీళ్ళే పగటి వేషగాళ్ళనే అభిప్రాయంవుంది. బహురూపానికి సంబంధించిన గ్రంథాలు ఏవీ దొరక్క పోయినా అక్కడక్కడా ఉల్లేఖనాలు కనిపిస్తాయి. పండితారాధ్య చరిత్రలో బహురూపుల పేరుంది (5-62). శ్రీశైలంలో శివరాత్రి సమయంలో బహురూపులుతమ వేషాలను ప్రదర్శించే వారని పాల్కురికి సోమనాథుడు వ్రాశాడు. వీటిలో అనేక రకాల అభినయం ఉంటుందని కూడా అందులో సూచించ బడింది. బహురూపాలను గురించి తాళ్ళపాక తిరుమలా చార్యుని రచనల్లోనూ (వైరాగ్య రచన మాలికా గీతాలు) కనిపిస్తుంది. కొందరు బహురూపులే తర్వాత పగటి వేషకులయ్యారని ఊహించారు. కాకతీయుల కాలంనాటి జాయసేనాపతి నృత్త రత్నావళిలో బహురూపులను వర్ణించాడు. బహురూపికి కొన్ని గుణాలుండాలని నిర్దేశించాడు. భావుక

కలిగి వుండాలని, కళా విమర్శకుడై వుండాలని, యువకుడై అందగాడై వుండాలని. అంత పొడుగుగాని. మరీ పొట్టిగాని కాకూడదని చెప్పాడు. అంతేకాక బహురూపి బహుభాషాభిజ్ఞుడై ఉండాలని, బలశాలిగా, రూపధారణను వేగంగా చెయ్యగలిగి వుండాలని, అనేక పాత్రలను అభినయించ గలిగి వుండాలని, ప్రేక్షకులకు కనువిందు కల్గించాలని వ్రాశాడు.

బాలసంతువారు

తెలంగాణా ప్రాంతాలలో బాల సంతువారని బాల సంతోషం వారనే పేర్లతో భవిష్యం చెప్పేవారు ఇంటింటికీ వస్తారు. తెల్లవారు ఝామున గంట వాయిస్తూ వస్తారు. పొద్దుటికి వెళ్ళి పోతారు. వీరు శైవులు.

బుట్ట బొమ్మలు

బుట్టబొమ్మలనికూడా వాడుక. ఉత్సవాలలో వీటిని చూడవచ్చు. పండుగలలో, ఉత్సవాలలో ఇవి వచ్చాయంటే పిల్లలకంతా సంబరమే. వెదురు దబ్బలతో అల్లిన పెద్ద బొమ్మలకు పైన కళ్ళు జిగేలు మనే రంగులుంటాయి కొన్ని బొమ్మలు మనిషి ఎత్తు ఉంటే మరికొన్ని ఇంకా చాలా ఎత్తుఉంటాయి. బొమ్మల నడుముదగ్గర మనిషి తల పెట్టుకోడానికి ఒక అడ్డు పలక వంటిది ఉంటుంది. అక్కడే కళ్ళు రెండు రంధ్రాలలోంచి మిలమిల మెరుస్తుంటాయి. తప్పెటల వాద్యసంగీతానికి తగ్గట్లుగా అడుగులు కదిలిస్తూ నృత్యంకూడా చేస్తుంటారు. రాజు, రాణి మొదలైన బొమ్మలతో బాటు డాక్టరమ్మ వంటి ఆధునికమైన బొమ్మలు కూడా ఉంటాయి. గారుడి గొంబె (గారడి బొమ్మ) అనే పేరుతో ఇవి కర్నాటకంలో ప్రసిద్ధమై వున్నాయి. కోలారు జిల్లాలో వీటిని 'మాను బొమ్మలు' అంటారు.

బుడబుక్కలవారు

ఈ కళ మరాఠీ వారిలో వంశ పారంపర్యంగా వచ్చిందంటారు. బుడబుడక అనేది ఒక వాద్యం. బుడబుడక్కలవారని కూడా వీరిని అంటారు. భవిష్యత్తు చెప్తూ ఊళ్ళో తిరిగే బుడబుక్కల వారంటే పిల్లలకు భయం. బుడబుడక చర్మవాద్యం. చేతితో పట్టుకొని దాన్ని ఆడిస్తూ వుంటే విచిత్రమైన

శబ్దం వస్తుంది. వీధి చివర ఆ శబ్దం రాగానే పిల్లలంతా బుడబుక్కల వాడు వచ్చాడని అర్థం చేసుకుంటారు. కోడి కూసి నప్పటినుంచి ఎండ వచ్చే వరకు చెప్పిన మాటలు సత్యమవుతాయని బుడబుక్కల వారు నమ్మి భవిష్యత్తును చెప్తుంటారు. నల్లకోటు వేసుకొని, తలపాగా చుట్టుకొని, రంగు రంగుల గుడ్డలు వేలాడుతూ వుండగా చూడగానె గుర్తుపట్టే వేషంతో బుడబుక్కల వారు వస్తారు. అర్ధరాత్రి శ్మశానంలో భవిష్యత్తు తెలుసుకొని వచ్చి పొద్దునే వచ్చి చెప్తారంటారు. శకున పక్షి భాష వీళ్ళకు మాత్రమే తెలుసట ! శ్మశానంలో ఆ పిట్ట వీళ్ళకు భవిష్యత్తు చెపుందట !

కన్నడంలో బుడబుక్కల వాళ్ళను 'బుడుబుడు కెయవరు' అంటారు. కొన్ని ప్రాంతాలలో నరసణ్ణ అనేమాట వాడుకలో ఉంది. కృష్ణుడు వీకిరి వేష భూషణాలను ఇచ్చి ఈ వృత్తితో పొట్టబోసుకోవలసిందిగా చెప్పినట్లు ఒక కథ ప్రచారంలో ఉంది

బుర్రకథ

ఇది జానపద కళనా లేక జానపద అనుకరణమా అన్నది అట్లుండ నిచ్చి జానపదులపై ప్రభావం చూపే ఆంధ్రుల కళగా దీనికి ప్రముఖ స్థానా న్నివ్వవచ్చు కొందరు ఇది శుద్ధమైన జానపదకళ కాదని అంటారు శిష్ట సంప్రదాయాలు అనేకం దీనిలో చోటుచేసుకున్నాయని, అందుచేత వీటిని వీర గాథానుకరణలు (Ballad imitations) అనాలని డా. టి. వి సుబ్బారావు అభిప్రాయం (జానపద సాహిత్యము వీరగాథలు పు. 31) తెలుగుదేశానికి విశిష్టమైన బుర్రకథ కన్నడదేశానికి కూడా వ్యాప్తిచెందింది. తెలుగు బుర్ర కన్నడంలో 'గుమ్మటి' అయింది. బుర్రకథకు కన్నడ కరపాలమేళానికి కూడా పోలికలున్నాయి. బుర్రకథ కర్నాటకంలోని కోలారుజిల్లాలోకూడా చాలాప్రసిద్ధి.

యక్షగానమే బుర్రకథకు మూలమని కొందరి అభిప్రాయం. యక్షగానాలకు బుర్రకథలకు నడుమ జంగం కథలను చెప్పవచ్చు. కొందరు తందాన కథలు అనే పదాన్ని కూడా ఉపయోగిస్తారు. జంగం కథలలో ముగ్గురు మరాఠీలు, కాంభోజరాజుకథ, పెద్దబొబ్బిలిరాజు, కామమ్మకథ, కాటమరాజుకథ,

దేశింగురాజుకథ, బాలనాగమ్మ, ద్రోణ, విరాటపర్వాలు, రామాయణం మొదలైనవి ఉన్నాయి.



ఎల్లమ్మ ఇతిహాసాన్ని అద్భుతంగా పాడే బవనీడు

జంగంకథలు రాగతాళగీత నృత్యాదుల వన్నెచిన్నెలను సంతరించుకొని బుర్రకథలయ్యాయంటారు. బుర్రతోపాటు గుమ్మెట వాద్యాన్ని ఉపయోగిస్తారు. వంతలు పాడడానికి ఇద్దరుంటారు. కథకునికి వీరు ఇరుప్రక్కలా ఉంటారు.

1. తందాన తంనాని తందానా
2. వినరా ఆంధ్రకుమారా ధీరా విజయము మనదేరా
3. తందానా, తుమ్మెదా మొదలైనవి వంతపాటలు, సంతోషంగా ఉన్నప్పుడు

భేష్, శహభాష్. భళిభళా మొదలయినవి వంతచెప్తే, విషాద ఘట్టాలలో 'హరిహరీ' 'అయ్యో' అనే వంతలు చెప్తుంటారు. గానం ఆపినప్పుడు ప్రయోగించే పడి ఓట్టువాద్యవిశేషాలను ముక్తాయింపులు అంటారు. వంతలను గుమ్మెటమీద పసందుగా పలికిస్తారు. నాజర్, బెనర్జీ, వింజమూరి, నదీరా, భద్రకాళి, శారద, వాణి మొదలయినవారు బుర్రకథలలో ప్రసిద్ధులు. నాజర్ బుర్రకథా పితామహుడని ప్రసిద్ధి చెందారు. ప్రజానాట్యమండలి వంటి సంస్థలు బుర్రకథలను బాగా వ్యాప్తికి తీసుకు వచ్చాయి. రాజకీయాలలో బుర్రకథలు వహించినపాత్ర, వహిస్తున్న పాత్ర గమనించదగింది. క్రైస్తవ మతాన్ని ప్రచారం చెయ్యడానికి కూడా ఫాదరీలు బుర్రకథను వాడుకున్నారు. కన్నడంలో తందానతాన ధాటిలో రచింపబడిన జానపద కథాగేయాలనేకం దొరుకుతాయి. వీటిమధ్య సంభాషణలు చేర్చి బుర్రకథలను కల్పించవచ్చు. కన్నడంలోని కరపాలమేళంలోను సంగీతం, సాహిత్యం, నృత్యం చేరి వున్నాయి. గురువు, శిష్యులు అనేవారు దీనిలో ఉంటారు. శిష్యునివేషభూషణాలు సామాన్యంగా ఉంటాయి. గాని గురువువేషం భిన్నంగా ఉంటుంది. తలకు కిరీటాకృతిలో పెట్టుకున్న వర్ణరంజితమైన కుళ్ళాయి ఉంటుంది. చెవులకు కర్ణకుండాలాలుంటాయి. గురువులేక నాయకుడే కరపాల మేళంలో ప్రధానపాత్ర వహిస్తాడు. సామాన్యంగా కరపాలమేళంవారు శైవ సంప్రదాయానికి చెందినవారు.

### భజన కూటాలు

సామాన్యంగా ప్రతిఊళ్ళో భజనకూటాలనేవి ఉంటాయి. ఇది సామూహికంగా ప్రదర్శించే నృత్యం, సంగీతం, సాహిత్యం. ఏదో ఒకవారం నాడు వాళ్ళ వాళ్ళ మతాన్నిబట్టి, నమ్మకాలనుబట్టి భజనకూటంవారు చేరుతారు. శివభజన, రామభజన, హరిభజన, తత్త్వభజన మొదలయినవి వివిధ భజనలు. తాళాలు, ఎక్కువగా ఉపయోగిస్తారు. పానకం, వడపప్పు చేసేసంప్రదాయమూ వుంది.

### మారెమ్మ

ఆంధ్రదేశంలో కొన్ని ప్రాంతాలలో మారెమ్మపండుగచేస్తారు. ఇది పంటలకాలం తర్వాత మూడుదినాలు జరుగుతుంది. మారెమ్మ పూజచేసి ఊరి

పొలిమేరల్లో వదులుతారు. ఒక వరుసలో నిలుచుకొని నృత్యం చేస్తారు. ఈ నృత్యంలో నలభై యాభై మంది కూడా పాల్గొంటారు.

మెరవణి

మెరవణి అంటే ఊరేగింపు. అనంతపురంజిల్లాలో మెరవణి అనే పదం వాడుకలో ఉంది. పెళ్ళిఉత్సవానికి సంబంధించిన గద్య మెరవణిగద్య. తలంబ్రాల తర్వాత మెరవణి బండిమీద రాత్రి ఊరేగేటప్పుడు వాద్యగాళ్ళ నాయకుడు దీనిని చదువుతాడు. దీన్నే పొగడింపులు, పొగడింపుల గెద్దె అంటారు. ఇది చదివే అంగాదకులకు 'ఓజు' అన్నది బిరుదనామం. ఆపాది, కొరిచె తెగల వారుకూడా వాద్యాలను నేర్చుకున్నట్లే మెరవణి గద్యాలనుకూడా నేర్చుకున్నారు. మెరవణి గద్య పొగిడింపు కోలాహలాన్ని చూచి అనుభవించాల్సిందే. దీన్ని చదివేటప్పుడు మెరవణిబండి నాపి వేస్తారు. మధ్య మధ్య గద్యంలో బళిబళీ. బాపురే, అయ్యయ్యో. సిగ్గు సిగ్గు మొదలయినవి వస్తాయి. ఇవీ వరస పాటల వంటివే. ఈగద్యాలు శబ్దాలంకారభూయిష్ఠాలు (టి·దొణప్ప 1975: 102–103)

స్తోత్రపాఠానికి ఉదాహరణ :

"వాహోహోయ్! పగలరాతిగుండు పగలగొట్టవచ్చు కొండలన్ని పిండి గొట్టవచ్చు. విశ్వాదాభిరామ వినరవేమ" అన్నట్లుగాను తూమాటోళ్ళ నారణప్ప అంటే చప్పన్నారు దేశాలలో సందారు! ముప్పైయారు పల్లెల్లో మంజూరు: యెక్కంగగుర్రాలు, యేడూళ్ల పెత్తనం! కుచ్చుల్లితురాయి పచ్చల్ల పల్లకీ! అయిదేళ్ళ కుంగరాలు అస్తకడియాలు! యిదిగో అంటే యిరవై మంది, అదిగో అంటే అరవై మంది, పనిబడితే పాదాలకాడ పదివేలమంది, నారణప్ప ముట్టింది ముత్యమై, పట్టింది బంగారమై, యెద్దుతొక్కిన బూమి యెయిపుట్లు పండి, గాది బెట్టినతోన కనకసిరి పంటపండి, వూరూగేరీ సబ్బండు జాతులు, డెబ్బైయేడుకులాలు తగ్గినా ముగ్గినా కంటికిరెప్పై కాలికి చెప్పై కాపాడి జోపానం జేసినాడు. నారణప్ప రాకపోతే రచ్చకట్టకు రవిశిలేదు; రాజుకచ్చేరికి రాణింపులేదు. నారణప్ప అంటే త్యాగదల్లికర్ణ, భోగదల్లి దేవేంద్ర, సత్యదల్లి హరిశ్చంద్ర. మేళగాళ్ళకు చదివించిన జోడుకానుకలు దక్కెనోహోయ్ దక్కె....."

మెరవణి గద్యాలలో స్తోత్రపాఠాలే ఉంటాయనుకోనక్కరలేదు. నిందా పాఠాలూ ఉన్నాయి. అలాంటిదొకటి;.... వొహోహోయ్!

చీచీచీ చీమలపుట్ట రెక్కల్లేని కోడిపెట్ట నీ నోట్లోపుండుబుట్ట నిన్ను ముదిరిపెట్ట నీకాళ్ళూడగొట్ట - వోహోహో పెండ్లికొడుకు బావమర్ది పేడిమూతి పెద్దయ్య వుండాడే, యలకని జూస్తే యచబడుతాడు, పిల్లినిజూస్తే పారిపోతాడు పీతిరి గుంతలో పొర్లాడి, జలారి గుంతలో జలకాలాడి చినుగుల చల్లాడంగట్టుకోని గోనిపట్టరుమాలు జుట్టుకోని, నల్లగంబడి కోరి కప్పుకోని పెండ్లిభోజనానికి వచ్చినాడు. అదిగో యిదిగో అని పోయినాడు. అదేపోత! ముసురు తొట్టిలో మూల్గుతుండాడో, దొంతికుండల్లో దొళ్లుతుండాడో, బాన కడుపుతో పాకుతుండాడో, దోని కడుపుతో దోకుతుండాడో, దొడ్డికాళ్ళతో దేకుతుండాడో తద్దికట్లునాకుతుండాడో, పులిస్తరాకు లెత్తుతునడాడో, కలికుండ్లతో కలబడుతుండాడో, యాడాడవుండాడో, యక్కెక్కడుండాడో....పెండ్లి కొడుకు కింద పెండ్లికొడుకు అన్నదమ్ములకింద డక్కోలాహోయి, డక్కోలు, బరాబరి వొహోయి బరాబరి."

మోడి

ఇది ఒళ్ళు గగుర్పొడిచే జానపదకళ. దీనికి హస్తలాఘవం ముఖ్యం. ఇంద్రజాలం అరవై నాలుగు కళల్లో ఒకటి. హస్తలాఘవం కూడా అరవై నాలుగుకళల్లో చేరుతుంది. ఇప్పుడు మోడి చేసేవాళ్ళు చాలా తక్కువగా కనిపిస్తారు పెద్దేటి గొల్లలు మోడిచేస్తారంటారు దీనిలో రెండుపక్షాలవారుంటారు. ఇద్దరూ తమ తమ విద్యలను ఎదుటివారిపైన ప్రయోగిస్తారు. జాతర, సంత మొదలైన సందర్భాలలో ఇది ఎక్కువగా కనిపిస్తుంది. అలాంటప్పుడు ప్రతిస్పర్ధి ఉండడు. కాయితాన్నిరూపాయినోటుగా మార్చడం, మట్టి నీళ్ళల్లో వేసి రక్తంగా మార్చడం, మట్టిని చక్కెరగా మార్చడం. వేపాకును తేళ్ళుగా మార్చడం మొదలైన కనుకట్టు విద్యలను ప్రదర్శిస్తారు. మోడి వంశపారంపర్యంగా వచ్చిన కళ. ఇది కేవలం కనుకట్టుకాదు. కనుకట్టుకు కేవలం హస్తలాఘవం ఉంటేచాలు. కాని మోడికి ముందుగా సిద్ధంచేసుకోవలసింది చాలా ఉంది. నల్లకోటు వేసుకొని తలపాగా చుట్టుకొని అంగవస్త్రం వేసుకోడం వాడుక. ఊరిబయటగాని, ఏదైనాచెట్టుకిందగాని మోడిని ప్రదర్శిస్తారు. ఎర్రగా

కాలిన గుండును నోటితో తాకడం, ఇనుపకత్తిని మింగడం, కళ్ళుపీకుకోవడం వంటి భయంకరమైన వాటిని ప్రదర్శిస్తుంటారు.

యక్షగానం

తెలుగులో యక్షగానమనగానే దృష్టి దక్షిణాంధ్ర సాహిత్యం వైపుకు వెళ్తుంది. కాని యక్షగాన సాహిత్యం జానపద కళకు అనుకరణగా వెలసిందే గాని జానపద విజ్ఞానంలో భాగం కాదు. అయితే తెలుగునాట ఇప్పటికీ తెలంగాణాలోని కొన్ని భాగాల్లో యక్షగానం పేరుతో జానపద కళ వుంది. బహుశా మొదట యక్షగానం జానపద కళగానే ఉండి తర్వాత కొన్ని శతాబ్దులకు శిష్ట కవులనుకూడా ఆకర్షించి సాహిత్యప్రక్రియగా రూపొందిందని ఊహించవచ్చు

యక్షులనే పేరు అత్యంత ప్రాచీనకాలం నుంచి వైదిక, బౌద్ధ, జైన సాహిత్యాలలో ఉదాహృత మయింది. కాళిదాసుని మేఘ సందేశంలో, భట్టి కావ్యంలో యక్షులగానాన్ని గూర్చి సూచనలున్నాయి. వాత్స్యాయన కామ సూత్రాలలో యక్షరాత్రి ఒక క్రీడా విశేషమని చెప్పబడింది.

జక్కులనే జాతివారి గానమే జక్కుల గానమని, అదే తర్వాత యక్ష గానమనే పేరు గడించిందని మరో అభిప్రాయం ఉంది. జక్కసాని కుంట్ల, జక్కుల చెఱువు, జక్కసముద్రం వంటి ఊళ్ళ పేర్లు ఆంధ్రదేశంలో కని పిస్తాయి. యక్షగానాలు కురవంజుల నుంచి ఉద్భవించాయని, తోలు బొమ్మ లాటలనుంచి ప్రభవించాయని విద్వాంసులు అనేకాభిప్రాయాలను వ్యక్త పరి చారు. యక్షగాన సాహిత్యంలో కూడా జానపదగేయాలు జానపద ఛందస్సులో రచితమైన పద్యాలు, పాటలు ఎక్కువగా ఉంటాయి. ఏల. జోల, సువ్వాల, హారతి, ధవళం, చందమామ సుద్దులు, త్రిభంగి, ద్విపద, త్రిపద, చౌపద, షట్పద, మంజరి, జక్కుల రేకు మొదలయినవి యక్షగానాల్లో ఉంటాయి. పాల్కురికి సోమనాథుని కాలంనాటి నాటకాల వస్తువులు త్రిపుర విజయం, కామదహనం, అర్ధనారీశ్వరం, అంధక గంధగజాసుర వధ, దక్షాధ్వర ధ్వంసం, క్షీరసాగర మథనం, సిరియాళచరిత్ర మొదలైనవి. క్రీడాభిరామంలో మాచల్దేవి నాటకం పేర్కొన బడింది. అయితే ఇవన్నీ నాటకాలా యక్షగానాలా లేక ఇంకేమైనా జానపద రూపకాలా అన్నది మనకు తెలియదు.

కర్నాటకంలో యక్షగానానికి ఈనాడు రాజవైభోగం పట్టింది. డా. శివ రామ కారంతగారి కృషివల్ల యక్షగానం విదేశాలలో కూడా అడుగు పెట్టింది. యక్షగానం కర్నాటకంలోని జానపదకళగా గుర్తించబడింది. వృత్తి కళాకారులు ఎంతో మంది ఏర్పడ్డారు. జానపద ప్రయోగం, శిష్ట సాహిత్యం కొన్ని యక్షగానాలలో కనిపించే గుణాలు. ఒకవిధంగా జానపద-శిష్టమార్గాల సమ్మేళ నంగా యక్షగానాన్ని పేర్కొ_వచ్చు.

యానాదుల కళలు

ఆంధ్రదేశంలోని ఆదివాసులైన యానాదుల పాటలు, చిందులు, ఆటలు కళాత్మక మైన వేనా అని కొందరికి అనుమానం కలగవచ్చు. ఎందుకంటే అవి అంత సరళంగా వుంటాయి. అయితే ఆంధ్రలోని కొన్ని ప్రాంతాలలో యానాదుల జీవన విధానం శిష్టుల భాషలో ఎంతవరకు చొచ్చుకు పోయిందంటే ఎవరైనా పిల్లలు ఎగురుతూ, గంతులేస్తూ అల్లరి చేస్తుంటే 'ఎందుకురా అట్లా యానాది చిందులేస్తావ్' అంటారు. యానాది చిందులు తొక్కి_తే కాళ్లు చేతులు అలసిపోయేంత వరకు నిలుపులేకుండా ఎగురుతాడు. దసరా పండుగ సమయంలో యానాదులు వేషాలువేసుకొంటారు. మగవారు స్త్రీవేషాలను ధరించి అంగళ్ళ దగ్గర, తెలిసిన యజమానుల దగ్గర, పురప్రముఖుల ఇళ్ళ దగ్గర చిందులుతొక్కి_ బహుమానాలు పొందుతారు. రంగులు పులుముకొని కూనిరాగాలు తీస్తూ వీధులవెంట పరుగులు పెడ్తారు. బెండుతో చేసిన కొయ్య గుర్రాలలోకిదూరి నృత్యం చెయ్యడమూ కద్దు. యానాదుల వేషాలలో చెంచు లక్ష్మి నారసింహులు, దుర్యోధనుడు – భీముడు, శ్రీకృష్ణుడు, శివుడు మొదలైనవి ఉన్నాయి. వారి వేషాల తీరు ఎలా వుంటుందనే విషయాన్ని వెన్నెలకంటి రాఘవయ్యగారు చక్క_గా వర్ణించారు (యానాది. పు. 148): "కాకితాల అట్టల గదలతో ఝుడిపిస్తూ మధ్యమధ్య బీడీ పొగలను ఉషారుగా వదలి పెట్టుతూ దుర్యోధనుడిని విడిచిపెట్టి ధర్మరాజుపైకి పరుగెత్తుతుండే భీముడి ప్రలాపాలు, చుట్టూమూగిన గ్రామస్తులను ఆనందంలో ముంచుతూ తేలుస్తు ఉంటాయి. ఔచిత్యాన్ని నీళ్ళలో కలిపే వేషగాండ్లలో బాటాబూట్లను తొడుగు కొన్న శ్రీకృష్ణులు, పించబోసిన ధోవతులను కట్టుకొని వకీళ్ళ నల్ల కోట్లను తొడుగుకొని నామాలు ధరించి నల్లకళ్ళద్దాలతో నాట్యమాడే శివుడు,

విభూతి బూసిన సీతారాములు, పొట్టలుబ్బించే నవ్వును ప్రేక్షకులలో పుట్టిస్తుంటారు.

వీధినాటకాలలో యానాదుల పాత్ర గమనార్హమైంది. నెల్లూరు జిల్లాలో పల్లెల్లోని వీధిభాగోతాలలో యానాదులు తప్పక పాత్ర వహిస్తారు. స్త్రీవేషాలను యానాదులు ఎక్కువగా ధరిస్తుంటారు. ఒకానొకప్పుడు యానాది భాగోతాలను చూడడానికి ఐదారు మైళ్ళ నుంచి కూడా పల్లెల్లో ప్రేక్షకులు వచ్చేవారట. ఈ నాటకాలలో హాస్యగాడి చిందులు ఎంత వికారంగా ఉంటాయో యువతుల గొబ్బిపాటలు అంత శ్రావ్యంగా, రమ్యంగా, గంభీరంగా వుంటాయి. యానాదులను గురించి సాధికారంగా ప్రవచించ గల్గిన వెన్నెలకంటి రాఘవయ్యగారి మాటల్లోనే వారినాటకాల స్వరూపాన్నివర్ణించడం సమంజసంగా వుంటుంది: "బెండు కిరీటాలు,బెండు భుజకీర్తులు ధరించి,ఎట్టిని చేరుమాలను ఎడమ చేతిలో పట్టుకొని, భగ్గున మండి కాంతినివెదజల్లే హరిదళము యొక్క నిగనిగలో జనంవంక త్రోసుకొని వచ్చి వచ్చెను "హరిశ్చంద్ర మహారాజు వచ్చెను; రాజువెరలె రవితేజము అలరగ—సభకు వచ్చెను, హరిశ్చంద్ర మహారాజు వచ్చెను'' అని పాడుకుంటూ, చెప్పులు లేని కాళ్ళతో నాటకశాల నలువైపుల గంతులువేసి సింహాసనమునకు ప్రత్యామ్నాయముగా వీధి బడి పంతులు ఎరువుగా ఇచ్చిన కుర్చీపైన ఆశీనుడైనప్పుడు యానాది గాంభీర్యం చూచి తీరవలసినదే. అల్లుని హేళనకు గురిఅయ్యే పొరపాట్లువుండవని చెప్పలేము. ఆటమధ్యలో గ్రామాధికారి, పెద్దరెడ్డిగారు వేషాలను చూడ వచ్చినప్పుడు రాజు వేషములో కూర్చొనివున్న యానాది సుబ్బయ్య, వేషాన్ని పూర్తిగా మరిచి రెడ్డిగారి పాదాలకు సాగిలబడి మ్రొక్కి చంపలు వేసుకోవడం దండకారణ్య ఘట్టంలో అయ్యవారు నేర్పించిన పాత్ర పాఠాన్ని మరిచిపోయిన శ్రీరాములవారి వేషంలో, నారచీరలు ధరించిన శీతమ్మను చూచి ''ఓసి నీ అబ్బిడాల! రేకలో కాసిని కూటి నీళ్ళయినా పోసి పోరాదంటే'' అని బతిమాలుకుంటూ ప్రేక్షకులను నవ్వించుచు తాను కూడా నవ్వుతుండే వాడు. కొన్ని సమయాలలో వేషములో ఉన్నప్పటి రాజు పేరును మరిచి అసలుపేరుతో ఒకరి నొకరు పిలుచుకోవడం, అదే వ్యక్తి ఒకే వేషంతో కొంత సేపు మంత్రిగాను, కొంతసేపు సేవకుడిగాను, మరికొంతసేపు మరిచిన పాఠాన్ని జ్ఞాపక పరిచే సూత్రధారిగాను నవ్వించే విదూషకుడిగాను ప్రవర్తించడం తరుచుగా జరుగుతుండేదే. ఒక్కొ

క్కాప్పుడు తెరవెనుకనుండి పాఠాన్ని నేర్పినేర్పి విసుగెత్తిన బడిపంతులు "అట్లుకాదురా దున్నపోతా" అని మందలించిన చీవాట్లు కూడ శ్రోతలకు వినబడు తుండేవి. ఆ నాటకంలోనే సుబ్బయ్య రావణుని రాభణుడని, శీత మ్మను ఛీతమ్మ అని సంబోధించాడు. విభీషణుని పేరును నోరు తిరుగనందున వదిలి వేశాడు. లేని పదాలకు ఒత్తులు అంటించడం, వున్నవాటిని తీసివేయడం యానాడికి ఆనాటి విద్య''.

వాలకం

ఇది ఒకరకంగా ఆశువిద్య. తెలుగునాట ఈ నాడు అన్ని చోట్లా ప్రచా రంలో లేకున్నా ఒకప్పుడు బాగా ప్రసిద్ధమై వుండేదని పిస్తుంది. "వాడివాలకం ఏమీబాగాలేదు" అని అప్పుడప్పుడూ వుపయోగిస్తుంటాం. వాలకమనే జానపద రూపకం విశాఖ జిల్లాలో నేటికీ వుంది. నలుగురు నటులు రంగంమీదికి వస్తారు. అప్పటి కప్పుడు ఏదో ఒక విషయాన్ని తీసుకొని, సంభాషణల్ని సమకూర్చుకొని అభినయిస్తారు. ఇదే శిష్టరూపాన్ని ధరిస్తే నాట్యావధాన మంటాం. వాలకంలో సంఘటనలు సమకాలీన ప్రాధాన్యం కలవి. సరళ హాస్యంతో కూడిన సంభాషణలు ప్రేక్షకులకు వీనుల విందుగా వుంటాయి. విదూషకుడికి దీనిలో చాలా ప్రాధాన్యం వుంది. సంఘంలోని కుళ్ళును కడి గేస్తారు వాలకం నటులు పల్లెలోని కరణాలు, ఇతర అధికారులను బాగా ఎత్తి పొడుస్తారు.

వీధిభాగోతం

వీధి నాటకమని, వీధి భాగోతమని పిలువబడుతూ నేటికీ ఇంకా పల్లె టూళ్ళల్లో ఆడే నిజమైన జానపద రూపకం జానపద కళల్లో అత్యంత ప్రముఖ మైంది. 'కావ్యేషు నాటకం రమ్యం' అని చెప్పినట్లుగా జానపద రూపకాలలో వీధి భాగోతం రమ్యమైంది. వివిధ లలితకళల సహాయంతో ప్రేక్షకులకు కను విందుగా, వీనులవిందుగా ప్రదర్శించ బడేది. జానపద కళల అకారాది వివ రణలో చివరగా, జానపద కళలలో అత్యంత ప్రాధాన్యం వున్న వీధిభాగో తాన్ని సాంగోపాంగంగా వివరించడం జరుగుతున్నది.

ఆంధ్రప్రదేశ్ తీరప్రాంతాలలో నేటికీ సజీవంగా ఉన్న జానపదఅభినయకళ వీధి భాగోతం. దినదినానికీ ఆధునిక కళారూపాల తాకిడికి తట్టుకోలేక మరుగునపడిపోతున్నదీ రూపకం. వీధి భాగోతమే కొద్ది మార్పులతో, ప్రాదేశిక



నెల్లూరుజిల్లా వీధిభాగవత కళాకారులు

మైన వ్యత్యాసాలతో యక్షగానమని. చెంచునాటకమని, బయలాట అని పిలువబడుతూ ఆంధ్రదేశంలో అన్ని ప్రాంతాలలో ఉంది. కర్నాటకంలోని తెలుగు ప్రాంతమైన కోలారు జిల్లాలో దీన్ని 'కేళిక' అంటారు. పాల్కురికి సోమనాథుడు చెప్పిన 'కేళిక' అనే పదం బహుశా వీధిభాగోతాన్ని సూచించేదే అయివుండాలి.

నిజానికి జానపద రూపకాల అధ్యయనానికి సజీవంగా ఉన్న వీధి భాగోతాలను, సేకరించి, చిత్రంగా తీసి, అధ్యయనం చెయ్యాలిగాని, దక్షిణాంధ్ర యుగపు యక్షగానాలను కాదు. కవి పండిత రచితాలు, రాజాస్థానాలలో విద్వజ్జన పరిగృహీతాలు అయిన యక్షగానాలు జానపద విజ్ఞాన అనుకరణలేగాని, జానపద రూపకాలు కావు.

జానపద రూపకం అన్నది పల్లెటూళ్ళల్లోగాని, చిన్నచిన్న జనసమూహాలలోగాని ప్రచారంలో వుండేది. జానపద రూపకంలో పాత్ర ధరించేవారు

చాలామటుకు ప్రేక్షకులు తెలిసిన వాళ్ళయి వుంటారు. జానపద కళాకారులకు, ప్రేక్షకులకు మధ్య పెద్ద అంతరం ఉండదు. రూపకంలో ప్రేక్షకుల పాత్ర కూడా ఉంటుంది.

జానపద రూపకాలు ఈనాటి సినిమా, ఆధునిక నాటకంవంటి వాటి వల్ల తమ అస్తిత్వాన్ని పోగొట్టుకొనే స్థితికి వస్తున్నాయి ఇని ఒకవిధమైన పరిణామ దశను అనుభవిస్తున్నాయని చెప్పవచ్చు. ఇవి పూర్తిగా మరుగున పడడమైనా జరుగుతుంది లేదా పూర్తిగా ఆధునిక ప్రభావానికిలోనై తమ జానపదత్వాన్ని పోగొట్టుకోడమైనా జరుగుతుంది.

వీధి భాగోతాలలో లౌకిక ఇతివృత్తాలు, పారమార్థికాలు రెండూఉన్నాయి. ఒకే పాఠాన్ని (text) ఎల్లప్పుడూ వాడటమంటూ జరగదు పాత్రధారుల ఇష్టాయిష్టాలను బట్టి భాగోతంలో వాక్యాలు మారుతూ వుంటాయి. హరిశ్చంద్ర, గయోపాఖ్యానం. సారంగధర, ఉషాపరిణయం, విరాటపర్వం, రామనాటకం, చంద్రహాస మొదలైనవి జనప్రియ కథలు. భాగోతానికి ఆద్యంతాలలో ప్రార్థన, ప్రార్థన నృత్యం (గొబ్బి) ఉంటాయి. భాగోతంలో గేయభాగం, వచనపద్య భాగం, వచనభాగం అనే మూడు భాగాలున్నాయి. శిష్ట నాటకంతో పోల్చినప్పుడు జానపద రూపకంలో సంభాషణలు చాలా తక్కువగా ఉంటాయని చెప్పవచ్చు

వీధి భాగోతం రాత్రి పది గంటల ప్రాంతంలో ప్రారంభమై మర్నాటి పొద్దుటి వరకు సాగుతుంది. రెండు మూడు రాత్రులుకూడా ఇది జరగడం కద్దు. సప్తమి, ఏకాదశి, పౌర్ణమివంటి తిథులనాడు ప్రదర్శిస్తారన్నది తప్ప ప్రత్యేకంగా నిర్ణయించిన రోజున ఈ రూపకాన్ని ప్రదర్శించాలని లేదు. రంగస్థలం చాలా సరళమైన అలంకరణతో కూడి వుంటుంది. ముందుపైపు రెండుగడలు నాటి వేపాకులతోగాని, మామిడాకులతోగాని తోరణం కడ్తారు. ఒక గుడ్డను ఇద్దరు తెరలాగా పట్టుకుంటారు.

వీధిభాగోతం గేయం, సంగీతం, నృత్యం, అభినయం కలిసిన కళ. పాత్రల సంఖ్య 12 నుంచి 15 వరకు ఉంటుంది. పాత్రలలో మానవపాత్రలు, దేవతాసంబంధమైన పాత్రలు ఉంటాయి. నరసింహునివంటి దేవతామూర్తులను అదుపులో పెట్టడం చాలా కష్టం. ఆ పాత్రల ఉగ్రస్వరూపాన్ని తగ్గించడానికి

కోడినో, గొర్రెనో బలిఇస్తారు. హాసిగాడు ఎప్పుడైనా రావచ్చు. ఎప్పుడైనా పోవచ్చు మొత్తం మీద పాత్రలలో ద్వైత స్వభావం (binary) కనిపిస్తుంది. మంచికీ చెడుకూ సంఘర్షణ పాత్రల రూపంలో చిత్రింపబడుతుంది.

దుస్తులు వగైరాలను ఇప్పుడు చిన్న చిన్న వ్యాపారస్తులనుంచి తీసుకు రావడం వాడుకయింది. ఒక్కొక్క పాత్ర దుస్తులలో మార్పుఉంటుంది. భుజ కీర్తులు, హారం, కర్ణాభరణాలు, కత్తి, గజ్జెలు మొదలైనవి తళతళ మెరుస్తూ ప్రేక్ష



ఆంధ్రుల వీధి భాగవత వేషభూషణాలు
(జానపద వస్తుప్రదర్శనాలయం, మైసూరు)

కులకు కనువిందు చేస్తుంటాయి. స్త్రీ పాత్రలకు, పురుష పాత్రలకు ఆహార్యం వేరుగా ఉంటుంది. స్త్రీ పాత్రలను కూడా పురుషులే ధరిస్తారు హాసిగాడు, ఋషులు మొదలైన కొన్ని పాత్రలు మామూలు పాత్రలకంటె భిన్నంగా ఉంటాయి.

పైన చెప్పినది ఈనాటి వీధి భాగోతాల తతంగం గురించి. ఇది ఒక విధంగా వర్ణనాత్మక అధ్యయనం. వీధి భాగోతాన్ని ఐతిహాసికంగా అధ్యయనం

చెయ్యడానికి అవకాశం చాలా తక్కువ. ఎందుకంటే వివిధ దశలలో వీధి భాగోతం పొందిన పరిణామాలను గురించిన ఆధారాలు మనకు లభించడంలేదు. 50–100 ఏళ్ళనాటి వీధి భాగోతాన్ని గురించి విన్నదాన్ని ఈనాటి వీధి భాగోతంతో పోల్చి, జరిగిన మార్పులను గుర్తించడానికి ప్రయత్నించవచ్చు. వీధి



ఎల్లమ్మ ఇతిహాస గానంలో వాడే జమిడిక వాద్యాలు

భాగోతాన్ని ఈ విధంగా ఐతిహాసికంగా అధ్యయనం చేస్తున్నప్పుడు భాషలో, పద్యాలలో, రంగస్థలంలో, అలంకరణలో, దుస్తులలో, రంగులలో మార్పులను గుర్తించవచ్చు నాగరకతా ప్రభావం, చలన చిత్రాలు. శిష్టనాటకం ప్రభావం, నాటకాలంకరణ వస్తువులు అంగళ్ళలో సులభంగా లభ్యమవుతుండడం ఈ మార్పులకు కొన్నికారణములుగా ఊహించవచ్చు.

చారిత్రకంగా భాషలో జరిగిన మార్పులను ఖచ్చితంగా గుర్తించడానికి వీలులేదు. ఎందుకంటే ఈ జానపద రూపకాలలో భాష స్థిరరూపం కలిగి వుండదు. వ్రాతరూపంలో ఉండే నాటక ప్రతులు లేవు కాబట్టి భాషలో ఏ విధమైన పరిణామం సంభవించిందో చెప్పలేం. మొత్తం మీద నాటకంలోని



మహబూబ్‌నగర్ జిల్లాలో ఎల్లమ్మగుడి

శిష్ట పాత్రలకు, హాసిగాడు మొదలైన సామాన్య పాత్రలకు భాషలో భేదం వుంటుంది. హార్మోనియం వంటి సంగీత వాద్యాలు సుమారు 70—75 సంవత్సరాల నాటి నుంచి వాడుకలోకి వచ్చాయి. ప్రస్తుతం జానపద సంగీతానికి కూడా హార్మోనియం అనివార్యమైన అంశంగా వుంది. ముఖానికి వేసుకునే రంగులు ఆనాడు పాత్రధారులే తయారుచేసుకునేవారు. దీపంమసిని ఆముదంతో కలిపి నల్లరంగుగా వాడేవారు. ఆ కాలంలో విద్యుద్దీపాలుగాని, తెరలుగాని ఉండేవి కావు. దుస్తులను, ఆభరణాలను వాళ్ళే చాలా వరకు తయారు చేసుకునేవారు.

వీధి భాగోతం అధ్యయనం వల్ల కొన్ని నిర్ణయాలు చెయ్యవచ్చు. నాటకం ధార్మికాచరణల ఫలితమా అన్నవిషయం చర్చనీయాంశమైంది. ప్రాచీనకాలపు మతాచరణలు జానపద నాటకం పుట్టుకకు కారణమనే అభిప్రాయం ఉంది. ప్రస్తుతం ఇంకా సజీవంగా ఉండే వీధి భాగోతాలలో ఈ విషయాన్ని నిర్ణయించడానికి తగిన ఆధారాలులేవు. ఒకనాడు ఆచరణలతో సంబంధముండిన జానపద రూపకం ఈనాడు ధార్మికతను కోల్పోయింది. అందువల్ల ఒకవైపు ప్రాచుర్యం పొందిన చలన చిత్రాలవంటి వాటితో పోటీ పడలేకుండా వుంది. ఈ కారణం వల్ల జానపద రూపకం ఎక్కువకాలం జీవించలేదని చెప్పవచ్చు.

వీధి భాగోతం ఇతర జానపద రూపకాల వలెనే ఒక సమాజం- దాని సంస్కృతిని ప్రతిబింబిస్తుంది. దీనిని అధ్యయనం చెయ్యడంవల్ల సాంఘికంగా, ఆర్థికపరంగా, మనోవిజ్ఞాన పరంగా, అనేకవిషయాలు అర్థమవుతాయి. పాత్రధారులు అసలైన జానపదులు కావడం వల్ల జానపద జీవితం ఈ రూపకాలవల్ల తెలిసివస్తుంది.

దక్షిణ భారతదేశంలోని జానపద రూపకాల తులనాత్మక అధ్యయనం వల్ల వీటికి మూలరూపమైన ద్రావిడ రంగభూమిని పునర్నిర్మాణం చేయడానికి సాధ్యమవుతుంది.

హరిశ్చంద్రకథ వీధిభాగోతం (కొన్నిభాగాలు)

(నివేదకులు చాకలి రమణయ్య, సుబ్బయ్య, రమణయ్య, వెంకయ్య, ఇసుకపాళెం, నెల్లూరు తాలూకా, నెల్లూరుజిల్లా)

ఇందులో 12 మంది నుంచి 15 మందిదాకా పాల్గొంటారు. మద్దెల, హార్మోనియం, తాళాలకు ఆరుమంది, పల్లవి ఇచ్చేది ఒకరు. పై రాగం, ఒకరు, వంతగాళ్లు, వేషగాళ్లు ఉంటారు. కిరీటం, భుజకీర్తులు, హారం. కర్ణపత్రాలు, గద. కత్తి, మిన్నారేకు, గజ్జెలు అలంకారాలుగా వాడుతారు ఆడ వేషాలకు అద్దాలతో కూర్చిన కమ్మలు చెంపలకు కడ్తారు. పాపట బొట్టు, సూర్యచంద్రపు బిళ్లలు, చిలకలు, కుచ్చు, జడ, వడ్డాణం, జాజిబంతులు. వంకీలు, ముంగర, బులాకీ, హారం, లవలాకులు మొదలయినవి అప్సరసల వంటి పాత్రలకు ఉంటాయి.

మొదట ప్రార్థన

శ్రీ గణనాథుని మనమున
బాగుగ వినుతింతు నేను బ్రహ్మాదులకున్
సాగిలి మ్రొక్కెద చేరెద
వేగమె కరుణించు ఒసగు ఇష్టార్థములన్
శారదవాణిని దేవిని
భారతి లోకైక మాత పతి కోడలు మా
సారస్వతి యగు తల్లిని
సారెకునే వేడ్కతోడ సన్నుతి జేతున్

తర్వాత యాలలు

శరణు పోతులూరి రాయ
శరణు వీరభద్ర రాయ
శరణు శరణు నీకే శరణయ్య ఓ పోతులూరయ్య
కరుణతోనే మమ్మూ వేలరా శరణు

హరిశ్చంద్రుని రాకడ అయిన తర్వాత దర్వు....

వచ్చె కోటి సూర్యతేజు
హెచ్చైన హరి చంద్రారాజా
రాజ రాజా రాజతేజా

హెచ్చైన మహారాజరాజు
మణులా కిరిటాము మెరయా
మౌనులూ సన్నుతులూ జేయా
మానీతా వస్త్రములు గట్టి, విసరు హాతులు సేవాజేయ....

మాటలు

సత్యకీర్తి ఈ రోజున జరుపవలసిన రాకాచర్యంబు లెవ్వియో ఆలోచింపుమా—నా కుల కాంతయగు నా ప్రాణేశ్వరియైన చంద్రమతిని రావింపుమూరా —

చంద్రమతి రాకడ — దర్వు

1. వెడలె వచ్చెనమ్మా చంద్రామాతీ
వెడలీ వచ్చె నిటూ వేడుక లలారగా
కడువడీ తనయూనీ
వడిగా తీసుకా వెడలె వచ్చెనమ్మ చంద్రామతీ

2. చంద్రాకావీ రవికె దొడగీ వరిగంచూ
చీరా గాట్టీ
పదములమూగానిటు శయ్యవేంచేసే
సుదతు లిరుగడ
లారాగా సఖుని దెస కటుల వేగా ॥వెడలే॥

3. ముత్యాలా హారములా మెరయా
రత్నాల కడియములు
దాల్చి వ్రేళ్ల వుంగురాముల్ నెలతా
ధరించియు మద
యానలు మేల్ మేల్ మేలనుచు మెప్పగాను ॥వెడలె॥

.... .... ....

మాటలు

ప్రాణేశ్వరా ! పదివేలు వందనములు

హరి : సుఖీభవ దీర్ఘాయుష్మంతురాలవై ప్రాణేశ్వరి

(మధ్య మధ్య మాటలు, పాటలు ఉంటాయి)

విశ్వామిత్రు కథ ప్రారంభం. దరువు

విశ్వామిత్రుడు వచ్చెనపుడూ
బహువితరణ గల్గిన విశ్వామిత్రుడు వచ్చె నపుడూ
విశ్వామిత్రుడు వచ్చె విశ్వము లోపలా
దృశ్యము చూపుచూ విశ్వామిత్రుడు వచ్చెనో
సృష్టికి బదులు సృష్టి నేను కల్పించియు భువిలో
దిట్ట పరిచే తానట్టె చూడు
అష్టదిశలకును శ్రేష్ఠత నేనై
నిష్ఠాతో నిఖిలము నిర్మించితీనని ........

మాటలు

ఓరి ద్వారపాలకా, మీ రాజు కొల్వు కూటమునకు పోవలెను దారి ఇమ్మురా.

ద్వార : అయ్యా మీరెవ్వరో దయచేసి ఎరింగింపుమా

............

నక్షత్రకుని రాక — దరువు
నక్షత్రం పేరుగొన్న విచిత్రమైన బ్రాహ్మనుడు
యక్షులూ వెరగొందగా దాక్షిణ్యమునను
తాంతంధిరి ధిమితక
తళాంగుజం తరితాంతరి
ముమ్మూర్తులైనగాని మునులు ఋషులైనగాని
నా ముందర నిల్వగ లేరు
అందరు వెరతూరుగాని
నక్షత్రం పేరుగల........

నక్ష : ఓహో మౌనిచంద్ర
నన్ను బిలపించిన కారణంబేమో
సెలవొసంగుము

విశ్వా : ఏమిరా యింత ఆలస్యము జేసితివి

నక్ష : స్వామి నా గుణంబు మీ రెరుంగరా. తెల్లవారె తరికే సద్ది అన్నము లేక పోతే నా ప్రాణములు గిజగిజ తన్నుక లాడుతుంది. పాటిమీద గంగమ్మకు కూటి మీదనే ఆలాపనన్నట్లు నా ప్రాణము నిల్వదుస్వామీ.

విశ్వా : ఇంతకు తింటివా.

నక్ష : తినుట చేతనేగదా సర్వము బాగుగా వచ్చుచున్నది........

హరిశ్చంద్రుడు చంద్రమతిని అమ్మట.

1. ఈ చంద్రమతిని అమ్మెద గొనుడీ
చూచి సమ్మతిని చూచిన వారికి చోద్యమై
యుండును నా చిన్నివయ్యారి
నయమైన మిటారి ఈ చంద్రమతిని

2. మారు మాటనుదూ
ఎంతటికైన మదిలో తొలుగాదు
కోరి హరిశ్చంద్ర కులకాంత యీ సత్య
సాల విశాలా ఈ సాన మోహనాంగి
ఈ చంద్రమతిని

3. చెప్పిన పనులన్ని వొప్పుగా చేయును
ఎప్పుడు మదిలోన యితరము లెంచదు
తప్పులు చేయదు ధర్మము వొదులాదు
ఈ మదగజయాన........

అనుప్రాసలు :

చంద్ర : కొడుకులు గన్నమ్మ కుల దేవతమ్మా
కడు దయయుంచి కరుణించవమ్మా
ఆరెండ్ల బాలుడు అడవికి పోవునమ్మ
భయము మిక్కిలి గల్గి భయపడునమ్మా
సారెకు ముండ్లు కంపలు ద్రొక్కునమ్మ
మన్నించవమ్మ నా మనవినమ్మా
వన్నెగానె బోయి వచ్చెదనమ్మా.......

చివర మంగళం ఉంటుంది:

మంగళ హారతి శ్రీ లక్ష్మిమణి రమణి
చిన్నయా ఆకార శేష శయన వాస
శ్రీధరేశ శరణు జేసెద నీకు మంగళం
శృంగార భరణేశ జయలక్ష్మి వల్లెవు
విజయ మివ్వర మాకు మంగళం మంగళం.

టిప్పణి

1. "We must interpret them as manifestations of a flexibility which is a basic characteristic of all traditional music" - Maria Leach (Ed.,) *Standard Dictionary of Folklore, Mythology, and Legend,* 1975, p. 1037.

2. "The refrain is incontestably sprung from singing of the people at dance, play, work, going back to that choral repetition which seems to have been the protoplasm of all poetry", Francil B. Gummere, *The Popular Ballad*, 1959, pp. 73-74.

3. "drama differs from games in being concerned with providing not only a conventional conflict but a fore known resolution to the conflict" - Richard M. Dorson, *'Folklore and Folklife,* 1972.



# సేకరణ - పరిశోధన : పద్ధతులు

ఆంధ్రుల జానపద విజ్ఞాన స్వరూప స్వభావాలను కొంతవరకు తెలుసుకున్న తర్వాత, శాస్త్రీయ పరిశోధనకు కొన్ని మార్గాలను ఈ అధ్యాయంలో వివరించడం జరుగుతున్నది. క్షేత్ర పద్ధతులు (field methods) జానపద విజ్ఞానంలో శాస్త్రీయ అధ్యయనానికి నాందిగా చెప్పవచ్చు. ఈ గ్రంథంలోని ప్రవేశికలోనే ఇటీవలి కొన్ని సిద్ధాంతాలను, అధ్యయన విధానాలను సూచించడం జరిగింది. జానపద విజ్ఞానాంశాల సేకరణ, వర్గీకరణ, విశ్లేషణ, పరిశోధన అన్నవి నాలుగు మెట్లు. ఆంధ్రుల జానపద విజ్ఞానాన్ని సేకరించబూనుకున్నవారికి, పరిశీలన జరపాలని ఉత్సాహం చూపే వారికి ఉపయోగకరంగా ఉండడానికి కొన్ని పద్ధతుల్ని ఈ అధ్యాయంలో సూచించడం జరుగుతున్నది.

భాషాశాస్త్రంలో విస్తృత పరిశోధన జరుగుతున్నది. శాస్త్రీయమైన భాషాధ్యయనం, జానపద విజ్ఞానాధ్యయనం ఇంచుమించు ఒక్కసారే ప్రారంభమయినా, భాషాధ్యయనం వేగాన్ని పుంజుకుంది. నేడు భాషా విజ్ఞానులే ప్రత్యేక విద్వాంసులు రూపొంది, ప్రతి విశ్వవిద్యాలయంలో తమ ప్రత్యేకతను నిలబెట్టుకుంటున్నారు. జానపద విద్వాంసులు కూడా ఒక ప్రత్యేక వర్గంగా ఏర్పడి తమ క్షేత్రానికి సంబంధించిన అన్ని అంశాలను సూక్ష్మంగా పరిశీలించడానికి పూనుకొన్నప్పుడే మన నిజమైన సంస్కృతిని గూర్చిన సరైన అవగాహనకు వీలు కలుగుతుంది.

జానపద విజ్ఞానంలో కూడా భాషాశాస్త్రంలో లాగే వర్ణనాత్మక జానపద విజ్ఞానం (descriptive folklore), చారిత్రిక జానపద విజ్ఞానం (historical folklore) తులనాత్మక జానపద విజ్ఞానం (comparative folklore) అనే మూడు ప్రధాన శాఖలు ఏర్పడవలసి వుంది. ప్రకృత గ్రంథంలో ఆంధ్రుల జానపద విజ్ఞానానికి సంబంధించిన అంశాలను వివరించేటప్పుడు పై మార్గాలను దృష్టిలో ఉంచుకోడం జరిగింది. జానపద విషయాలను ప్రస్తుతం ఉన్న

రీతిలో వర్ణించడం వర్ణనాత్మకం. కావ్యాలు, శాసనాలు, లిఖిత పత్రాలు, ఇతర పద్ధతుల ద్వారా చరిత్రను పునర్నిర్మించడానికి చేసే ప్రయత్నాలు, జానపద విషయాలు ఎన్ని వందల ఏళ్ళుగా ప్రచారంలో ఉన్నాయో తెలపడానికి ఆధారాల నిస్తూ, వాటి ప్రస్తుత స్థితి వరకు వికాసాన్ని వివరించడం చారిత్రిక జానపద విజ్ఞానంలో భాగం. సంబంధం ఉండే ఇతర భాషలలో, ప్రపంచంలోని పలు ప్రాంతాలలో ఉండే జానపద విజ్ఞానంతో పోల్చి చెప్పడం తులనాత్మకం. ఈ విధంగా శాస్త్రీయమైన రీతిలో, సూక్ష్మంగా జానపద అధ్యయనం సాగించ వలసి ఉంటుంది.

ప్రస్తుతం సూచించిన పద్ధతుల్లో ముఖ్యంగా సేకరణ విధానాల సూత్రాలను, తులనాత్మక జానపద విజ్ఞాన విధానాలను ప్రత్యేకంగా చెప్పడం జరిగింది. అనంత వైవిధ్యంతో, అనేక భాషలతో, సంస్కృతులతో నిండివున్న మన దేశంలో తులనాత్మక పద్ధతి ఆవశ్యకత చాలా ఎక్కువ. జానపద విజ్ఞానానికి సంబంధించిన మూలరూపాల పరిశీలనకు తులనాత్మక పద్ధతుల అవసరం ఎంతయినా ఉంది.

### క్షేత్ర పద్ధతులు

మౌఖిక జానపద విజ్ఞానాన్ని సేకరించడం మనకు కొత్తేమీ కాదు. దక్షిణాసియా జానపద విజ్ఞానానికి సంబంధించిన విషయాలకు పెద్ద గని వంటిది. అందువల్ల సుమారు ఒక శతాబ్దం నుంచి ఈ ప్రాంతం అనేక విద్వాంసుల్ని ఆకర్షించింది. అయితే శాస్త్రీయ పద్ధతుల కొరత వల్ల సేకరణ కార్యం సరైన పద్ధతుల్లో సాగలేదు. ఇప్పటికీ డబ్బు కొరత, సరైన మార్గదర్శకత్వం లోపం, పరిశోధనకు అవకాశాలు సరిగ్గా లేకపోవడం ఈ క్షేత్రంలో మనం వెనకబడి వుండడానికి కారణాలు.

సేకరణ ఆవశ్యకత: జానపద విజ్ఞానం దినదినానికి క్షీణిస్తున్న క్షేత్రం. దీనిలో చాలా భాగం మౌఖికంగా ఒక తరం నుంచి మరొక తరానికి సంక్రమించేది కావడం చేత, ఈనాడు ఉండే సాహిత్యరూపాలు, కళారూపాలు మొదలైనవి రేపు ఉంటాయనే నమ్మకంలేదు. ఒక జాతి జీవనాన్ని, సంస్కృ

తిని ప్రతిబింబిస్తుండడం వల్ల ఎప్పటికప్పుడు జానపద విషయాలను సేకరించి భద్రపరిచి తీరాల్సిన అవసరం వుంది.

సేకరణ చేసేటప్పుడు జానపద విజ్ఞానానికి దగ్గర సంబంధం వుండే భాషా శాస్త్రం, మానవ శాస్త్రం, సాంఘిక శాస్త్రం వంటి వాటి సహాయం పొందవచ్చు. అయితే జానపద విజ్ఞానానికే పరిమితమైన ధ్యేయాలు, విధానాలు కొన్ని వున్నాయి. గ్రంథస్థ ఆధారాలతోనే చేసే పరిశోధన ఒక్కొక్కసారి మనల్ని తప్పుదారి పట్టించవచ్చు, జానపదులతో నేరుగా సంబంధం పెట్టుకొని, వారి నుంచే నేరుగా విషయాలను సేకరించాల్సి వుంటుంది. ఒకవేళ వేరువేరు మార్గాల ద్వారా లభించిన వ్రాతప్రతులు విద్వాంసుని ముందున్నా, వాటిలో ఎన్ని నిజమైనవి, ఎన్ని కావు అని తెలుసుకోడానికైనా నివేదకుల దగ్గరికి నేరుగా వెళ్ళాల్సి వుంటుంది.

సేకరణకు తయారుకావడం : సేకరణకు ముందు జానపద విద్యార్థి 'పూర్వ సిద్ధత' పొందవలసి వుంటుంది. ప్రారంభకులు ఎక్కువగా తయారు కావలసిన అవసరం వుంది. నివేదకులు నివసించే స్థలాన్ని గురించి, అక్కడి సంస్కృతిని గురించి స్పష్టమైన అవగాహన అవసరం. అక్కడి జనంతో కలిసి మెలసి వుండి బాగా పరిచయం సంపాదించుకోవాలి. ఏ ప్రదేశంలో సేకరణ సాగించాలన్నది కూడా స్పష్టంగా నిర్ణయించుకోవాలి. అసలైన సేకరణ గ్రంథాలయంలో, పురావస్తు శాఖలోనే ప్రారంభమవుతుంది. ఇంతవరకు ఇతరులు సేకరించినవి. భద్రపరిచినవి. అచ్చయినవి సేకరించే వారికి తెలియాలి. సేకరించవలసినదేమిటో కూడా తెలియకుండా క్షేత్రంలో అడుగు పెట్టడం మంచిదికాదు. తయారు కావడమన్నది ఒక ప్రక్రియకు మరొక ప్రక్రియకు వేరవుతుంది. విషయాలు ఎన్ని సేకరించాలి, ఎన్ని వదిలివెయ్యాలి అన్నది కూడా మొదటే నిర్ణయించుకోవాల్సిన విషయం. గేయమో, కథా గేయమో, సామెతో, నమ్మకాలో — ఇలా ఏ విషయమైనా, దాన్ని గురించి లక్షణాదుల దగ్గర నుంచి అన్నిటినీ ముందే పరిశోధకుడు తెలుసుకుని ముందుకు వెళ్ళాలి.

సిద్ధంకావడమంటే కొన్ని వస్తువులను సమకూర్చుకోడం కూడా. టేప్ రికార్డరు. కెమెరా మొదలయిన వాటిని సిద్ధం చేసుకోవాలి. భారతదేశంలో

ఇంకా టేప్ రికార్డరునే సరిగ్గా ఉపయోగించడంలేదు. సంగీతం, ధ్వనులు, కేకలు వగైరా రాసుకొని ప్రయోజనం లేదు దృశ్యకళలను గురించి ఊరక వివరిస్తే లాభం లేదు. ఆచరణలు, నృత్యాలు, పండగలు, ప్రదర్శన కళలను, వర్ణరంజిత సంఘటనలను చలన చిత్రంగా తీసుకుంటేనే స్వరూపాన్ని అర్థం చేసుకోడానికి వీలవుతుంది.

కళాత్మకమైన సేకరణ : చాలా పనితనంతో గూడిన సేకరణ కార్యం నిజానికి ఒక కళ. సేకరణలో భాగంగా ప్రశ్నావళిని సిద్ధం చేసుకోవాలి. జానపద విజ్ఞానంలోని వివిధ శాఖలకు వివిధ విధానాలను అనుసరించాల్సి ఉంటుంది. సేకరణ కార్యంగా నిమగ్నులైన ప్రతి ఒక్కరూ ప్రాథమిక ప్రశ్నావళిని కరతలామలకం చేసుకోవాలి. ప్రశ్న అడగాల్సిన ప్రతిసారీ ప్రశ్నావళిని చూసుకోవాల్సిన పరిస్థితి వుండకూడదు సేకరించేవారికి కథాసారాంశం, పాటల భావం, సామెతల రకాలు, నమ్మకాలు మొదలయినవి తెలిసివుండాలి. సేకరణలోని మెళకువలు బాగా తెలిసి వుంటే అప్పుడు ఆ సేకరణ బాగా ఫలప్రదమవుతుందనే విషయాన్ని తెలుసుకోవాలి. నివేదకుని కుటుంబం, జీవన విధానం, సంస్కృతి మొదలైన వాటి పరిజ్ఞానం ఉంటే మంచిది. నివేదకుని గుణగణాలనుకూడా కొంత వరకు అర్థం చేసుకోగలిగితే చక్కని ఫలితాలు లభిస్తాయి. నివేదకుడు చెప్పినవి అతనికి ఎక్కడినుంచి తెలిశాయన్నది కూడా ముఖ్యమే. ఒకవేళ నివేదకుని దగ్గరే సేకరించిన విషయాలేమైనా ఉన్నాయా అన్నది కూడా అడిగి తెలుసుకోవలసిన విషయం.

విషయ సేకరణలో ప్రశ్నావళికి చాలా ప్రాధాన్యం ఉంది. భాషాశాస్త్రం వంటి అధ్యయన విషయాలలో ఇప్పటికే ప్రశ్నావళులున్నాయి. జానపద విజ్ఞానంలో ప్రశ్నావళిని తయారు చేసేటప్పుడు ఇతర విషయాలకు సంబంధించిన వాటిని కూడా వాడుకోవచ్చు. అయినా జానపద విజ్ఞానానికే కొన్ని ప్రత్యేకతలున్నాయి. వాటిని మరిచిపోరాదు. వైవిధ్యం ఈ విషయంలో చాలా ఎక్కువ. అసలు ప్రశ్నావళిలోని ప్రశ్నల్ని నివేదకునికి వేసేముందు సేకరించేవారు తమని తామే ప్రశ్నించుకోవలసి వుంది తను వేయబోయే ప్రశ్నలు అసలు మంచి ఫలితాలనిస్తాయా అని ముందు పరిశీలించాలి. ప్రాథమికంగా సేకరణలో గమనించి నమోదు చేసుకో వలసినవి 1. తేదీ 2. సమయం, కాలవ్యవధి

3. నివేదకుల పేర్లు 4. వయస్సు 5. ఆడా, మగా అన్నది 6, వివాహితులా, అవివాహితులా 7. పూర్తి చిరునామా 8. జన్మస్థలం వగైరా 9. మాతృభాష, తెలిసిన ఇతర భాషలు 10. మతం 11. విద్యాభ్యాసం 12. జాతి 13. వృత్తి 14. నివేదకుల జీవితాన్ని గురించి 15. ఇతర వివరాలు.

ఆంధ్రుల జానపద విజ్ఞానంగాని, మరే భాషకు సంబంధించిన జానపద విజ్ఞానం గాని సేకరించడానికి ముఖ్యమైన కొన్ని శీర్షికలవసరం. ప్రశ్నావళిని తయారు చేసేటప్పుడు ఈ క్రింది శీర్షికలను ప్రధానంగా స్వీకరించవచ్చు.

1. గేయాలు, 2. కథాగేయాలు, 3. గద్యకథలు, 4. పురాణాలు, ఐతిహ్యాలు, 5. సామెతలు, 6. పొడుపుకథలు, 7. భాష, 8. వృత్తి, 9. పెళ్ళి 10. కుటుంబం, 11. బాంధవ్యం, 12. సామాజిక జీవనం, 13. విద్యాభ్యాసం 14. పరిపాలన. 15. మతం, 16. పండుగలు, ఆచరణలు, 17. నమ్మకాలు, ఆచారాలు, 18. ఆటలు. 19, వైద్యం, 20. దుస్తులు, 21. ఆభరణాలు, 22. గృహనిర్మాణం 23. ఆహార పానీయాలు 24. గృహోపకరణాలు 25. చిత్రకళ 26 సంగీతం, 27. నృత్యం, 28. రూపకం. 29. ప్రాణిజానపద విజ్ఞానం, 30. వృక్షసంబంధం.

ఒక్కొక్క విభాగానికి సంబంధించిన ప్రశ్నావళిని ఉపయోగించేటప్పుడు వేరువేరు విధానాలను అనుసరించ వలసి రావచ్చు. ప్రశ్నలు వెయ్యడం ఎప్పుడు ప్రారంభించాల ఎప్పుడు నిలపాలి అని కూడా సేకరించే వారు తెలుసుకుని ఉండాలి. నివేదకులతో సాధ్యమయినంత సహజంగా నడచుకోవాలి.

సేకరణలో సమస్యలు: స్థలం నుంచి స్థలానికి, వ్యక్తి నుంచి వ్యక్తికి, సంస్కృతినుంచి సంస్కృతికి వేరయ్యే సమస్యలున్నాయి. కొన్ని సమస్యలు విశ్వజనీన మయినవి. కొన్ని స్థలీయాలు. మామూలుగా నివేదకులు అసలు విషయాన్ని వెనక్కు మళ్ళిస్తుంటారు. అప్పుడు వారిని కసరుకోడం, తక్కువ చేసిమాట్లాడడం తగదు. ఒక్కొక్కసారి మనదగ్గర వుండే విషయాల్ని నివేదకులకు చూపించడమో, వినిపించడమో కూడా తప్పే అవుతుంది. నివేదకులకు అహందెబ్బతినే లాగా ప్రవర్తిస్తే అసలుకే మోసం వచ్చే ప్రమాదముంది. నివేదకులకు భారత దేశంలో ఉత్పన్నమయ్యే సమస్యలే వేరుగా, ఇతర దేశా

లలో వేరుగా వుండవచ్చు. టేప్‌రికార్డరులో మాటఎక్కితే నోరే పడి పోతుందని నమ్మే ప్రజలు మన వారు. కెమెరాలో ఫోటోదిగితే ప్రాణమే పోతుందని ఆయుస్సుక్షీణిస్తుందని నమ్మేవాళ్ళు ఇంకా వున్నారు. అటువంటి పరిస్థితుల్ని వివేకంతో ఎదుర్కొన వలసిన బాధ్యత సంగ్రాహకుని మీద వుంది.

తులనాత్మక క్షేత్ర పద్ధతులు :

ఎక్కువ భాషలతో, సంస్కృతులతో పరిచయం ఉంటే సేకరణ సులభమవుతుంది. వేరే భాషలలో జరిగిన కృషినికూడా ఉపయోగించుకోవచ్చు. ఉదాహరణకు జానపద వైద్యం మీద తెలుగులో ఎక్కువ కృషి జరగలేదు ; కన్నడంలో జరిగింది. 'నేరుగా తలనొప్పికి వైద్యం ఏమిటి' అని నివేదకుని ప్రశ్నించే కంటె తలనొప్పికి వాడే నాలుగయిదు మందుల పేర్లు చెప్పి 'వీటిని వాడుతారా' అని అడిగితే సమాధానం సులభంగా లభిస్తుంది. ఇరుగు పొరుగు భాషలపరిచయం. ఒకే భౌగోళిక క్షేత్రంలోని వివిధభాషల పరిచయం ఉండడం మంచిది.

విశిష్టగుణం, సందర్భం :

ప్రతి జానపద విజ్ఞానరూపానికి తనదే అయిన విశిష్టగుణం(texture) వుంటుంది. ఇది పాఠం (text) కంటె భిన్నమైంది. సేకరణకు పూనుకున్న వారు ఏదైనా గేయాన్నో, కథాగేయాన్నో ఊరిక వ్రాసుకొని, 'మనం సేకరించడం పూర్తయింది' అనుకుంటే అది పొరపాటే. గేయంగాని,మరో ప్రక్రియగాని, అక్షరాలు పదాలకంటె దాని విలువ ఎక్కువగా వుంటుందనే విషయం మరిచి పోరాదు. ప్రతిజానపద ప్రక్రియకు సేకరించాల్సిన పాఠం (text), దాని విశిష్టగుణాలు (texture), సందర్భం ( Context ) అన్నవిఉంటాయి, ఈ మూడూ తెలిస్తేగాని ఆ ప్రక్రియ స్వభావం అర్థంకాదు. మౌఖిక జానపద విజ్ఞానానికి సంబంధించిన గేయం, కథ, సామెత మొదలైన వాటిలో విశిష్ట గుణాలంటే అలంకారాలు, కాకువు, ఒత్తిపలకడం, ప్రాస మొదలైనవి. గేయంగాని, మరో ప్రక్రియగాని—దాని పాఠాన్ని మరో భాషకు అనువాదం చెయ్యవచ్చుగాని విశిష్ట గుణాలను అనువాదం చెయ్యడానికి వీలుకాదు. ఇలా అనువాదం చెయ్యడానికి వీలుకానివే ఆ భాషలో ప్రత్యేకత కలవి. వీటిని

గుర్తించక పోతే సేకరణకు పుష్టి చేకూరదు. పాఠం, విశిష్ట గుణాలకంటె సందర్భం ఇంకా ముఖ్యమైంది. ఏ జానపద ప్రక్రియగాని సందర్భం తెలియకుంటే దాని అర్థమే వేరు కావచ్చు. పని పాటలను వలపు పాటలుగా హాస్యగీతాలుగా భావించడం, పనిలో వాటి పాత్రను సరిగ్గా అర్థం చేసుకోక పోవడం సందర్భం తెలియక పోవడం వల్లనే సంభవిస్తుంది. ఒక్కొక్కసారి ఏదైనా ప్రక్రియను సేకరించడానికి దాని నిజమైన సందర్భాన్ని సృష్టించాల్సి వస్తుంది. ఉదాహరణకు కోలాటం పాట కోలాటం వేసే టప్పుడే సరైన రీతిలో మనకు లభిస్తుంది. ఆచరణాత్మక గీతాల వంటివి, సామెతలవంటివి సరైన సందర్భాలలోనే జ్ఞాపకం వస్తాయి; రాణిస్తాయి. 'సామెతలు చెప్పండి' అని అడిగితే జానపదులు చాలా చిక్కుల్లో పడతారు. సందర్భ వశాన అయితే వారి నోటిలో వందల కొద్దీ సామెతలు ఆడుతూ వుంటాయి. పొలం పనుల్లో ఉపయోగించే పాటల్ని ఆయా సందర్భాలలో ఎంత ఆవేశంతో, ఉత్సాహంతో గంతులేస్తూ పాడుతారో, మనం వేరుగా అడిగినప్పుడు ఎంత సంకోచిస్తారో పోల్చి చూచుకుంటే సందర్భానికుండే ప్రాధాన్యం అర్థమవుతుంది.

జనపదీయ జానపద విజ్ఞానం—మౌఖిక సాహిత్య విమర్శ:

అలన్‌డండెస్ జానపద క్షేత్రానికి చేసిన సేవలో జనపదీయ జానపద విజ్ఞానం (metafolklore), మౌఖిక సాహిత్యవిమర్శ (oral literary cri_ticism) అనే వాటి కల్పన ఒకటి (అలన్‌డండెస్ 1978 : 38—49). జానపదులు తమ జానపద విజ్ఞానం గురించే వ్యాఖ్యానం చేస్తూ వుంటారు. జానపద విజ్ఞానాన్ని గూర్చిన జానపదవిజ్ఞానమే 'మెటాఫోక్‌లోర్'. ఉదాహరణకు 'ఏదో సామెత చెప్పినట్లు' అని సామెతగా వాడుతారు. ఇలాంటి వాటిని కూడా సేకరించే విద్వాంసులు దృష్టిలో ఉంచుకోవాలి. ఎందుకంటే ఒక జానపద విషయానికి జానపదులు ఎలాంటి విలువ ఇస్తున్నారనేది దీని వల్ల తెలుస్తుంది. మౌఖిక సాహిత్య విమర్శ అనేది జానపదులు తాము నివేదించేటప్పుడు మధ్య మధ్య చేసే విమర్శ. ఉదాహరణకు కథచెప్తూవుండే నివేదకుడు మధ్యలో రాజకుమారుడు చేసే సాహసాలను గురించి తనే ఏదైనా వ్యాఖ్యానం చెయ్యవచ్చు. ఇలాంటివి కూడా క్షేత్ర కార్యంలో గమనించాల్సి వుంటుంది. జానపద విజ్ఞానం అర్థాన్ని జానపదుల మూలకంగానే తెలుసుకునే ప్రయత్నం

చెయ్యాలి. జానపద విజ్ఞానానికి ఉండే విలువను మన దృష్టితో కాకుండా జానపదుల దృష్టితో అంచనా వేయడం మంచిదని తోస్తుంది.

## వర్గీకరణ–విశ్లేషణ

సేకరణ తర్వాత జానపద విజ్ఞానానికి సంబంధించిన విషయాలను విభజించి విశ్లేషించాల్సిన అవసరం వుంది. విభజన పద్ధతులు మొదలైనవి ప్రవేశికలోనే సూచించడం జరిగింది. రిచర్డ్ ఎం. డార్సన్ సూచించిన స్థూల విభజనను ఈ గ్రంథంలో పాటించడం జరిగింది. మౌఖిక జానపద విజ్ఞానం, సాంఘికాచారాలు, వస్తు సంస్కృతి, జానపద నాలుగు ప్రధాన విభాగాలలో జానపద విజ్ఞానాన్ని పరిశీలించవచ్చునని సూచించడం జరిగింది. ఒక్కొక్క విభాగం లోని ఉపవిభాగాలను, సూక్ష్మాతి సూక్ష్మ విభాగాలను గుర్తించడానికి ఆర్.ఎస్. బాగ్స్ వర్గీకరణ వంటివి పనికి వస్తాయి. ఆంగ్లంలోని జానపద నిఘంటువులో ఉండే జానపద విజ్ఞాన విభజన తులనాత్మక అధ్యయనానికి మాత్రమే కాక, కంప్యూటర్ సహాయంతో పరిశీలించడానికి కూడా ఉపయోగిస్తుంది. వేలకొద్దీ జానపద విషయాలను విశ్లేషణాత్మక భాషలోకి మార్చుకొని కంప్యూటర్ సహాయంతో సూక్ష్మంగా విభజించే ప్రయత్నాలు జరిగాయి. ఒక్కొక్క భాషలో, ఒక్కొక్క విభాగంలోనే వందలు, వేలు ఉపవిభాగాలను గుర్తించ వచ్చు. ఒక్కొక్క విషయానికి కొన్ని వైదృశ్యాత్మక గుణాలుంటాయి, వీటి సహాయంతో ఒక్కొక్క జానపద అంశాన్ని ప్రత్యేకంగా పరిశీలించ డానికి వీలుంటుంది. జానపద మూలాంశాల సూచి, జానపద కథల మాదిరి సూచి మొదలైనవి ఆయా విభాగాలలోని మూలాంశాలను, కథల మాదిర్లను తెలిపే విస్తృత వర్గీకరణాలు. ఇవన్నీ పరిశోధకుడు తన పరిశోధనలో ఉపయోగించుకోవలసి వుంది.

వర్గీకరణ విశ్లేషణ అన్నవి పరిశోధనలో చాలా ముఖ్యమైనవి. మనలో చాలా మంది విషయసేకరణతోనే పరిశోధన పూర్తి అయిన దనేతప్పు అభిప్రాయం కలిగి వున్నారు. సేకరించిన విషయాలను ఉపయోగించుకోడంలోనే అసలైన పరిశోధనపాటవం తెలుస్తుంది. భారతదేశంలో మనదురదృష్టం ఏమిటంటే పరిశోధకుడు సేకరణతోనే తన పరిశోధనను ప్రారంభించవలసి రావడం.

జానపద గేయాలను గురించి పరిశోధించే విద్యార్థి గేయాలను సేకరించ వలసి రావడం మన దుస్థితిని తెలుపుతుంది. నిజానికి శాస్త్రీయ పద్ధతుల్లో సేకరణ కార్యాన్ని పెద్దఎత్తున నిర్వహించవలసిన వారు ప్రభుత్వంవారు, అకాడెమీలు, విశ్వవిద్యాలయాలు, ఇతర సంస్థలు. ఉదాహరణకు శాసనాలను సేకరించడానికి ప్రత్యేక సంస్థ వుంది. మానవ శాస్త్రీయాంశాలను సేకరించడానికి ప్రత్యేక సంస్థ వుంది. ఇలాంటి సంస్థలు సేకరించిన విషయాల విభజన, విశ్లేషణ నుంచే పరిశోధన ప్రారంభంకావాలి. అప్పుడే నిజంగా చెప్పాల్సిన విషయాలను పరిశోధక విద్యార్థి చెప్పగలుగుతాడు.

## తులనాత్మక పరిశీలన పద్ధతులు

భారతదేశంవంటి వివిధ భాషాసంస్కృతుల కూడలి అయిన ప్రదేశంలో తులనాత్మక పరిశీలన వల్ల ఎంతో మేలుచేకూరింది. దగ్గరి సంబంధం ఉండే రెండుమూడు భాషలకు, సంస్కృతులకు సంబంధించిన జానపద విజ్ఞానాన్ని తులనాత్మకంగా పరిశీలించడం వల్ల మూల సంస్కృతిని పునర్నిర్మించడానికి కొంతవరకు వీలవుతుంది. ఇలా చేసినప్పుడు ద్రావిడభాషా విజ్ఞానంలో సాధ్యమైనట్లే మూల ద్రావిడ జానపద విజ్ఞానాన్ని పునర్నిర్మించడం కూడా సాధ్యం కావచ్చు. దక్షిణభారతదేశంలో అనేక జానపద ప్రక్రియల పరిశీలనవల్ల ఇలాంటి మూలరూపాలను గుర్తించడం సాధ్యమే అనిపిస్తుంది. దక్షిణ భారత దేశంలోని వివిధ ప్రాంతాలలోని జానపద రంగస్థలం, గ్రామదేవతలు, మత సంబంధ ఆచారాలు, పండుగలు, ఆటలు మొదలయిన వాటిలో ఉండే సమాన గుణాలను పరిశీలించినపుడు వీటికంతా మూలరూపాలు అని గుర్తించదగినవి ఉండి ఉండాలనిపిస్తుంది.

తులనాత్మక అధ్యయన పద్ధతులు కొన్నిటిని అలన్‌డండెస్ వంటి విద్వాంసులు కొందరు సూచించారు.. ("Ways of studying Folklore" 1969 in Tristram Coffin Ed, *American Folklore*) ఈ పద్ధతులు కథన రూపాలైన కథాగేయాలు, గద్యకథలు మొదలైన వాటికి అన్వయిస్తాయి, అలన్‌డండెస్ ప్రకారం జానపద విజ్ఞానంలో విద్వాంసుని పట్టిచూచేది ఏదైనా గీతంలేదా ఇతరప్రక్రియల మూలం. మూలరూపాలను కనుక్కోవాలంటే తులనాత్మక పద్ధతి సహాయంచేస్తుంది ఈ విషయంలో స్టిత్ థామ్సన్

తయారు చేసిన మూలాంశాలసూచి (motif index) మాదిరి సూచి (type. index) బాగా పనికి వస్తాయి. ఉదాహరణకు ఒక కథనే తీసుకుందాం. కథలు ఒక ప్రదేశం నుంచి మరో ప్రదేశానికి, ఒక దేశంనుంచి మరోదేశానికి కూడా ప్రయాణం చేస్తాయి. ఏదైనా కథ భారతదేశంనుంచి మెక్సికోకు ప్రయాణం చేసిందనుకొందాం. మెక్సికోలోని ఇతరకథల్లో అక్కడి వాతావరణానికి సహజమైన మూలాంశాలుంటాయి. భారతదేశంనుంచి వచ్చిన కథలో భారతదేశానికి సహజమైన మూలాంశాలుంటాయి. మూలాంశ సూచి ద్వారా ఈ విషయాన్ని నిర్ధరించవచ్చు ,అమెరికన్ ఫోక్‌లోర్, గ్రంథంలోని తమవ్యాసంలో అలన్' డండెస్ చారిత్రిక భౌగోళిక విధానాన్నికూడా తులనాత్మక పద్ధతులకు ఎలా ఉపయోగించుకోవచ్చోసూచించారు ఈపద్ధతిప్రకారంకథ,కథాగేయంవంటిసాహిత్య రూపాలను అధ్యయనం చేసేటప్పుడు వాటికుండే పాఠాంతరాలను సేకరించాల్సి వుంటుంది. ఈ పాఠాంతరాల తులనాత్మక పరిశీలనద్వారా మూలపాఠాన్ని గుర్తించే ప్రయత్నం చెయ్యవచ్చు. ఈ తులనాత్మక విధానంలో కాలం, వ్యాప్తి అనే రెండింటిని దృష్టిలో వుంచుకొని పరిశీలించవలసి వుంటుంది. సామాన్యంగా ప్రాచీన రూపానికి, ఎక్కువ వ్యాప్తిఉంటుంది. పాఠాంతరాలలో ఎక్కువవ్యాప్తి చెందినది మామూలుగాఎక్కువ పాతదిగావుంటుంది.

అలన్ డండెస వంటి విద్వాంసులు సూచించిన పద్ధతులు ప్రపంచంలో ఏ పరిశోధకులైనా అనుసరించదగినవి. అయితే అలన్ డండెస్ ఒక హెచ్చరిక కూడా చేశాడు. తులనాత్మక పరిశీలన జరిపేవారు విజ్ఞానానికి (lore)ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నారేగాని 'జానపదుల'కు (folk) కాదు. ఎందుకంటె పరిశోధకుడు తన ముందున్న విషయాలను మాత్రం లెక్కకు తీసుకొని, ఇతరభాషలలో ఇతరదేశాలలో వుండే వాటితోవాటినేపోల్చిచూస్తాడు. కానినిజానికి జానపదుల్ని జానపద విజ్ఞానాన్ని సమాన ప్రాధాన్యం ఇచ్చి పరిశీలిస్తేనే తులనాత్మక పరిశీలన సార్థక మవుతుంది.

అలన్‌డండెస్ సూచించిన విధానాలు ప్రధానంగా కథన రూపాలకు సంబంధించినవి. ప్రకృత రచయిత గేయాల వంటి కథారహిత శాఖలతులనాత్మక పరిశీలనకు కొన్ని పద్ధతుల్ని ఏర్పరచుకున్నాడు (తెలుగు కన్నడ జానపద గేయాలు, సిద్ధాంత గ్రంథం). గేయాలకు, గేయాల సృష్టికర్తలకు సమాన

2. ఒక్కొక్కరకం పాటనిడివి 3. ఛందస్సుకు, లయకు సంబంధించిన వివరాలు 4. పల్లవి 5. పాడేవారు స్త్రీలా, పురుషులా, ఉభయులా 6. భావాంశాలు (psychemer) 7. భాషా సంబంధమైన విశేషాలు 8. ఇంకేమైనా.

కంప్యూటరు వంటి ఆధునిక సాధనాలను ఉపయోగించి తులనాత్మక పరిశీలనను చేపట్టవచ్చు. దీనికోసం మొదట కంప్యూటరుకోసం విశ్లేషణాత్మక భాషలో దత్తాంశాలను (data) తయారు చెయ్యాలి. ఉదాహరణకు గేయాల అధ్యయనాన్నే తీసుకుందాం. ఒక్కొక్క పాటకు ఒక్కొక్క గుర్తును ఇవ్వాలి. ఆయా గీతాల మొదటి అక్షరాన్నే గుర్తుగా ఇవ్వవచ్చు. లాలిపరమైతే 'l' అని, కోత పాటలయితే 'k' అని, పడవ పాటలయితే 'p' అని, మరణ గీతాలయితే 'm' అని—ఈ విధంగా ఏదో ఒక గుర్తును వాడుకోవచ్చు. ఆ తర్వాత గేయాల్లో కొన్ని వైదృశ్యాత్మక గుణాలను తీసుకోవాలి. ఈ గుణాలు మనం తీసుకున్న గేయాల్లో ఉంటే '+' గుర్తును లేకుంటే '—' గుర్తును ఇవ్వాలి. ఉదాహరణకు గేయాలలో ఈ క్రింది వాటిని వైదృశ్యాత్మక గుణాలుగా తీసుకోవచ్చు. 1. సందర్భం (context)—ఏదైనా సందర్భంలోనే పాటపాడేట్లయితే '+' అని, ఎప్పుడైనా పాడవచ్చు అనేట్లయితే '—' అని చెప్పాలి 2. గాయకులు (singers) — పురుషులయితే '+' అని, స్త్రీలయితే '—' అని గుర్తుగా పెట్టుకోవచ్చు 3. ఒక్కరు పాడేదా, గుంపుగా పాడేదా (group song or solo) గుంపయితే '+' అని ఒక్కరే పాడితే '—' అని పెట్టుకోవచ్చు 4. వాద్యాలు (instruments) వాద్యాల అవసరం వుంటే '+' అని అవసరం లేకుంటే '—' అనిలెక్క 5. నృత్యసహితమా (dance) నృత్యం ఉంటే '+' అని, లేకుంటే '—' అని లెక్క. ఈ విధంగా కొన్ని వైదృశ్యాత్మక గుణాలను ఏర్పరచుకున్న తర్వాత కంప్యూటరు ద్వారా ఎన్నివిధాలుగా అయినా లెక్కలు తీయవచ్చు, విభజన చేయవచ్చు.

ఈ క్రింది విధంగా ముందు పట్టీ చేసుకోవాలి.

తెలుగు జానపద గేయాలు.

| | C | S | G | I | D |
|---|---|---|---|---|---|
| 1. లాలిపాటలు (l) | + | — | — | — | — |
| 2. పడవపాటలు (p) | + | + | + | — | — |
| 3. మరణ గీతాలు (m) | + | + | — | + | — |
| 4 కలుపు పాటలు (c) | + | — | + | — | — |

(c=సందర్భం ; S=గాయకులు; G=గుంపు . I=వాద్యాలు D=నృత్యం)

పై విధమైన పట్టీ చేసి తర్వాత నృత్య గీతా లెన్ని, వాద్యాలలో పాడేవి ఎన్ని, స్త్రీలు పాడేవి ఎన్ని, ఒంటిగా పాడే వెన్ని, సామూహిక గీతాలెన్ని, సందర్భం ఉండేవి ఎన్ని అని లెక్క కట్ట వచ్చు. ఇక వీటి స్త్రీలు పాడుతూ వాద్యాలు వాడేవి ఎన్ని, నృత్యం చేస్తూ పురుషులు పాడేవి ఎన్ని, వాద్యాలు వాడుతూ, నృత్యం చేస్తూ, పురుషులు పాడేవి ఎన్ని—ఈ విధంగా ఎన్ని విధాలుగా అధ్యయనం చెయ్యవచ్చునో అన్ని అవకాశాలనూ వినియోగించుకోవచ్చు.

పైవిధంగా ఒక్కొక్క భాషలో పై దృశ్యాత్మక గుణాల సహాయంతో పరిశీలన జరిపిన తర్వాత ఇదే పద్ధతిలో మరొక భాషతో పోల్చి చూస్తూ తులనాత్మక పరిశీలన కూడా జరపవచ్చు.

తులనాత్మక పరిశీలనలో భాగంగా జానపద అట్లాసులను, పటాలను తయారు చెయ్యడం కూడా ఒక పద్ధతి. భాషాశాస్త్రంలో పటాలను తయారుచేసే పద్ధతి ఉంది. ఒక్కొక్క జానపద విషయము భౌగోళికంగా ఎంతవరకు వ్యాప్తిలో వుంధి, ఎక్కడ లేదు అన్నది మ్యాపు ద్వారా చూపిస్తే అక్కడికి దగ్గరలో ఏ భాష ఉంది, ఆ భాష ప్రభావం ఎంత వరకు ఉంది అన్న విషయాలను పరిశీలించడానికి సాధ్యమవుతుంది. మ్యాపుల ద్వారా కొన్ని సాంస్కృతిక క్షేత్రాలను, ఒక విశిష్ట జానపద సముదాయం ఉండే ప్రదేశాలను, ఒక విశిష్ట జానపద ప్రకియ వాడుకలో ఉండే ప్రదేశాలను చూపవచ్చు.

## ప్రకార్యాత్మకదృష్టి

జానపద విజ్ఞానాన్ని ప్రకార్యాత్మదృష్టితో (functional approach) చూడాల్సిన అవసరం వుంది. జానపద విజ్ఞాన అధ్యయనంలో అనుసరించే ఆధునిక పద్ధతుల్లో ప్రతిజానపద ప్రక్రియ వుపయోగం, దానికి ప్రేక్షకులతో లేక శ్రోతలతో వుండే సంబంధం మొదలైనవి ఎక్కువగా పరిశీలించబడుతున్నాయి. వివిధ ప్రక్రియల పుట్టుపూర్వోత్తరాల కంటె వాటి ప్రయోజనం వైపే విద్వాంసులు మొగ్గు చూపుతున్నారు. గేయం, కథ, పొడుపుకథ వంటివి సమాజంలో నిర్వహించే పాత్ర ఏమిటి, ఒక జనసముదాయం మీద అవి

చూపే ప్రభావం ఎటువంటిది అన్న విషయాలమీద ఎక్కువగా దృష్టిని కేంద్రీకరించడం జరుగుతున్నది.

ఫ్రాంజ్ బోయస్ (Franz Boas), ఆయన విద్యార్థులు మానవ శాస్త్రీయ-ప్రకార్యాత్మక దృష్టిని ప్రచారానికి తెచ్చిన వారిలో ప్రముఖులు. బోయస్ ప్రకారం జానపద విజ్ఞానం సంస్కృతిని ప్రతిబింబిస్తుంది. ఏదైనా ఒకభౌగోళికవలయంలోని జానపద విజ్ఞానాన్ని అధ్యయనం చెయ్యడం ద్వారా అక్కడి సంస్కృతిని తెలుసుకోవచ్చు. ఏదైనా జానపద విజ్ఞాన ప్రక్రియను పరిశీలనకు తీసుకున్నప్పుడు దాని ప్రయోజనాన్ని వివిధ కోణాల ద్వారా చూడవలసి వుంటుంది. సాంస్కృతికంగా, విద్యాపరంగా, సౌందర్య పరంగా వుండే విలువమ క్షుణ్ణంగా తెలుసుకోవలసి వుంటుంది. సామెతలను న్యాయనిర్ణయానికి వుపయోగించుకొనే జనసముదాయా లున్నాయి. వీరగాథలను రాజకీయ ప్రయోజనాలకు వాడుకునే సంఘాలున్నాయి. గేయం, సామెత, కథ మొదలైన జానపద ప్రక్రియలు మనసంస్కృతిని కాపాడుతున్నాయన్నది ఒప్పుకోక తప్పదు. ఈనాడు వాడుకలో లేని మన సాంస్కృతిక విషయాలను తెలుసుకోవాలంటే జానపద విజ్ఞానం బాగా పనికి వస్తుంది. జానపదులను విద్యావంతులుగా చెయ్యడానికి జానపద కథలు, పొడుపుకథలు, కథాగేయాలు మొదలయినవే ఎంతో ఉపయోగపడుతాయి. ఇక్కడ 'విద్య' అంటే పాఠశాలలో, కళాశాలలో నేర్చుకొనే విద్య కాదు సమాజం తన సంప్రదాయాల ద్వారా నేర్పే విద్య లోకజ్ఞానాన్నిస్తుంది. జానపదుడు బ్రతకడాన్ని నేర్పుతుంది. కుటుంబమే మొదటి పాఠశాల అనే విషయం మరచి పోకూడదు. అనేక గీతాలు, కథలు, శిశుప్రాసలు శబ్దజ్ఞానాన్ని, వివేకాన్ని, ఆలోచనా శక్తిని కలిగిస్తాయి. ఆంధ్ర దేశంలో బుర్రకథ, ఒగ్గు కథ, గేయాల వంటి వాటిని రాజకీయాభిప్రాయాల వ్యాప్తికి ఉపయోగించిన సందర్భాలు అనేకం ఉన్నాయి. జానపద విజ్ఞానాన్ని అధ్యయనం చేసేటప్పుడు మన దృష్టి ఎక్కువగా సౌందర్యం పైపే మొగ్గు చూపుతున్నది. సౌందర్య సమీక్ష కూడా అవసరమే. కాని దానికి ఎంత విలువ ఇవ్వాలో అంతే విలువను ఇవ్వవలసి వుంటుంది. సౌందర్య కల్పన మనలో ఏవిధంగా వుంటుంది అనే విషయాన్ని కూడా పరిశీలించవచ్చు. ఎలాంటి ఆభరణాలను మనం సౌందర్యవంతమని

భావిస్తాం, ఏ కాలంలో ఏవి సహజమనుకున్నాం. ఏ కాలానికి అవి ఎబ్బెట్టుగా భావిస్తున్నాం ఇలాంటివన్నీ పరిశీలిస్తే ఆసక్తికరంగా వుంటాయి. 'ఆహో ఎంత సొగసు, ఓహో ఎంత బాగుంది' అనుకుంటూ వుంటే లాభం లేదు.

జానపద విజ్ఞానాని కుండే ప్రయోజనాలలో నిషేధాలకు ఆశ్రయం ఇవ్వడం ఒకటి. ఉదాహరణకు నిత్యజీవితంలో మనం ఉచ్చరించడానికి ఇష్ట పడని అశ్లీల శబ్దాలను సామెతల్లో, గీతాల్లో, పొడుపు కథల్లో చేర్చివాడుకో వచ్చు. సామాన్య జీవితంలో త్రాగుడు చాలా చెడ్డదని అందరూ చెప్తారు. కాని జాతర, ఉత్సవాల వంటి సందర్భాలలో త్రాగుడు నిషిద్ధంకాదు 'పండగ నాడూ పాతమొగుడేగా' అనే సామెత పండుగల వంటి జానపదుల సాంఘికా చారాలలో నిషిద్ధమయిన వాటిని అనుసరించడం ఎలాతప్పుకాదో తెలుపుతుంది. ముఖ్యంగా ఈ ప్రయోజనాన్ని గురించి పరిశోధకులు ఎక్కువ పట్టించుకోరు.

నిర్మాణాత్మకపద్ధతి

ఇటీవలి కాలంలో సామాజిక శాస్త్రాలమీద, సాహిత్యం వంటి మాన సిక శాస్త్రాలమీద నిర్మాణాత్మక పద్ధతి (structuralism) అపార ప్రభావం చూపింది. జానపద విజ్ఞానాన్ని అధ్యయనం చేసేవారి మీద కూడా దీని ప్రభావం చాలా వుంది. ప్రాప్, లెవిస్ట్రాస్ ఈ క్షేత్రంలో అనేకుల మీద ప్రభావం చూపిన ఇద్దరు విద్వాంసులు. నిర్మాణాత్మక వాదాన్ని అనుసరించే వారిని గురించి సూచి అనంతంగా పెరిగిపోతూ వుంది.

నిర్మాణాత్మక వాదాన్ని అనుసరించేవారు ఎక్కువగా కథ, పురాణం, కథాగేయం వంటి కథన రూపాలమీద కృషిచెయ్యడం వల్ల నిర్మాణాత్మక వాదాన్ని కథన రూపాలకు మాత్రమే అన్వయించ వచ్చనే తప్పు అభిప్రాయం వుంది.

ఈపద్ధతిని సామెత, పొడుపుకథ, మూఢనమ్మకం, మతాచరణ, పండుగ మొదలైన వాటికి కూడా అన్వయించి చెప్పిన వారున్నారు. నిర్మాణాత్మక వాదంలో కావలసింది ఏదైనా ప్రక్రియలో కనిష్ఠాంశాన్ని (minimal unit) గుర్తించడానికి వి.జె. ప్రాప్ (1968), లెవి-స్ట్రాస్ (1963), (1977), మరండా (1973) మొదలైన వారు కొన్ని విధానాలను సూచించారు. కథారహిత

శాఖల నిర్మాణాత్మక అధ్యయనానికి నేను కొన్ని పద్ధతుల్ని సూచించాను. ప్రవేశికలో అలాంటి పద్ధతిని సూచించడం జరిగింది. గేయంలో కథఉండదు. అది భావ ప్రధానమైనది. మానవుని మూలభూత ప్రవృత్తులైన శోకం, సంతోషం, భయం, ఉత్సుకత మొదలయినవి గేయాలలో అభివ్యక్తిని పొందు తాయి. అందువల్ల గేయంలో కనిష్ఠాంశం ఇలాంటి మూలభూత ప్రవృత్తుల మీద ఆధారపడి వుంటుందని చెప్పవచ్చు. దానిని భావాంశం (pycheme) అని పిలవవచ్చు. ఈ భావాంశాలతో గేయం నిర్మాణం చెందుతుంది.

కనిష్ఠాంశాలను గుర్తించి వాటిసహాయంతో గేయాల నిర్మాణాన్ని సూక్ష్మంగా పరిశీలించే పద్ధతితోబాటు కథారూపాలకు విద్వాంసులు సూచించిన పద్ధతుల్లో కొన్నింటిని కూడా గేయాలవంటి ప్రక్రియలకూ వాడుకోవచ్చు. లెవిస్ట్రాస్ అస్టివాక్ కథను నిర్మాణాత్మకంగా విశ్లేషించిన విధానం (Edmund Leach, ed. 1967) ఏ ప్రక్రియకైనా అన్వయించదగింది. లెవిస్ట్రాస్ ప్రకారం కథ, పురాణం, ఐతిహ్యం వంటి కథాప్రకారాలను వివిధస్థాయిలలో పరిశీలించాలి. భౌగోళికంగా, ఆర్థికపరంగా, సామాజికంగా, ఖగోళపరంగా లేక దివ్యవస్తువుల పరంగా పరిశీలించాలి. ఉదాహరణకు ఒక కథ ఉందను కుందాం. దాని నిర్మాణం చక్కగా అర్థం కావాలంటే మొదట దానికి ఎన్ని ప్రదేశాలలో దానికి ఎన్ని పాఠాంతరా లున్నాయి, దాని వ్యాప్తి ఎంత వుంది. ఎన్ని ప్రదేశాలలో దానికి బాగా ప్రచారం వుంది, దానిలో వచ్చే ప్రదేశాల పేర్లు నిజంగా వున్నవా లేక కల్పితాలా అన్న విషయాలను పరిశీలించవలసి ఉంటుంది. ఆర్థికపరమైన విశ్లేషణలో కథలో వచ్చే పాత్రల ఆర్థిక స్థితిగతులు. వారు జీవనం ఏ విధంగా సాగిస్తారు, ఆదాయం ఎంత, వాటిలో నిజమెంత, కల్పిత మయిన దెంత అని పరిశీలించాలి. అట్లే సామాజిక పరమైన అధ్య యనం కింద కథలో వచ్చే జాతులు, వివాహ పద్ధతులు, బాంధవ్యం, కుటుంబ విషయాలు మొదలయిన వాటిని పరిశీలించవలసి ఉంటుంది. చివరిది పురాణాలు మొదలయిన వాటికి సంబంధించినది. పురాణాల్లో స్వర్గ మర్త్య పాతాళాలకు చెందిన దివ్యపురుషులు పాత్రలుగా వుంటారు. లెవి-స్ట్రాస్ చెప్పిన ఈ విష యాలతోబాటు మన తత్వ శాస్త్రపరంగా, భాషాశాస్త్రపరంగా, ఇంకా సంబంధం ఉండే ప్రతి అధ్యయన శాస్త్రాన్ని దృష్టిలో ఉంచుకొని పరిశీలించ వలసి ఉంటుంది.

# ఉపసంహారం

ఆంధ్రుల జానపద విజ్ఞానం వ్యాప్తిని ప్రాచీనతను, వైవిధ్యాన్ని, వైశిష్ట్యాన్ని దృష్టిలో పెట్టుకొని చూస్తే ఈ గ్రంథంలో చేసిన వివేచన స్థూలమయిందని చెప్పవచ్చు. ఆంధ్రుల జానపద విజ్ఞానాన్ని సమగ్రంగా సమీక్ష చేస్తే బహుశా పదివేల పుటలకు తక్కువకాని సంపుటాలు వెలువడవచ్చు. ఆంధ్రుల జానపద విజ్ఞానాన్నంతటినీ సమగ్రంగా సేకరించి ప్రచురించే సాహసం ఎవరైనా చేస్తే బహుశా ఆ సంపుటాలు యాభై వేల పుటలకు తగ్గకపోవచ్చు. ఆంధ్రుల నిజమైన సంస్కృతిని అర్థం చేసుకోవాలంటే శిష్టసాహిత్యం కంటె జానపద విజ్ఞానమే ఎక్కువ సహాయకరమని మనం గుర్తించనంత కాలం మనం ఈ క్షేత్రానికి తగిన సేవచేయం. జనసామాన్యం నోట్లోనానే సామెతలుఒక్కొక్క సారి న్యాయశాస్త్ర గ్రంథాలలో సూత్రాల కంటె సూటిగా వుంటాయి, వాడిగా వుంటాయి, ప్రభావం చూపుతాయి. తాత్విక గ్రంథాలలోని సూత్రాలకన్నా ఒక్కొక్కసారి పొడుపు కథలోని మార్మికత వివేకవంతమై వుంటుంది, మానవ స్వభావంలోని గుణదోషాలను ధ్వనియుతంగా చూపుతుంది. శిష్టసాహిత్యంలోని పద్యాలకన్న మిన్నగా జానపద ఛందస్సులో రచితమైన పాటలు జనసామాన్యాన్ని ఆకట్టుకుంటాయి. ఈనాడు మనకు తెలియని ప్రాచీన సంప్రదాయాలను, గౌరవాలను, ఆచారాలను, ఆభరణాలను, అలవాట్లను, నమ్మకాలను జానపద విజ్ఞానం మనకు తెలుపుతుంది. వాటిని అనుసరించక పోయినా కనీసం మన భవిష్యత్తును రూపొందించుకోడానికి వాటివల్ల పొంద గలిగిన లాభాన్ని పొందవచ్చు. ఆంధ్రదేశంలోనే కాక, ప్రపంచంలోని పలు ప్రాంతాలలో నివసించే ఆంధ్రుల జానపద విజ్ఞానస్వరూపాన్ని అర్థంచేసుకొని విశ్లేషించిననాడు 'ఆంధ్రత్వం' అంటేఏమిటి. 'తెలుగుదనం' అన్నది ప్రత్యేకంగా అసలు వున్నదా అన్నవిషయం తెలుస్తుంది. అందువల్ల ఆంధ్రుల జానపద విజ్ఞాన సేకరణ, విభజన, విశ్లేషణ, పరిశోధన ఇంకా విస్తృతంగా, శాస్త్రీయంగా జరగవలసిన అవసరం ఉంది.



# గ్రంథసూచి

## తెలుగు


ఆదిశేషువు, హరి

1954 జానపద గేయ వాఙ్మయ పరిచయము

మహోదయ ప్రెస్, శ్రీకాకుళం

కృష్ణకుమారి, నాయని (డా.)

1977 తెలుగు జానపద గేయగాథలు

హైదరాబాదు

1977 పరిశీలన

హైదరాబాదు

1979 పరిశోధన

ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాదు

కృష్ణమూర్తి, భద్రిరాజు (డా.)

1979 (రెండవ ముద్రణ) తెలుగు భాషా చరిత్ర

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు

కృష్ణశ్రీ (సం.)

1963 స్త్రీల పౌరాణికపు పాటలు

ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు

కృష్ణారావు, వై.వి., బలరామమూర్తి, ఏటుకూరి (సం.)

1976 ఆంధ్రప్రదేశదర్శిని

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ,

గంగాధరం, నేదునూరి

1961 జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి

1965 ఆటలు—పాటలు

ప్రాచీన గ్రంథావళి, రాజమండ్రి

1968 మిన్నేరు

ప్రాచీన గ్రంథావళి, రాజమండ్రి

1973 మున్నీరు

ప్రాచీన గ్రంథావళి, రాజమండ్రి

జోగారావు, యస్వీ (డా.)

1961 ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, విశాఖపట్నం

దొణప్ప, తూమాటి (డా.)

1972 భాషా చారిత్రక వ్యాసావళి

ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాదు

1972 తెలుగులో కొత్త వెలుగులు (మొదటి సంపుటం)

1975 జానపద కళాసంపద (ప్రథమ సంపుటం)

నిర్మలా పబ్లికేషన్స్, విశాఖపట్నం—3

నదీరా

1975 బుఱ్ఱకథలు

ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, హైదరాబాదు

నాయక, హా.మా (డా.)

1980 జానపద విజ్ఞాన స్వరూపం

తెలుగు అను. డా. ఆర్వీయస్, సుందరం,

జానపద విజ్ఞాన భారతి, మైసూరు—6

ప్రతాపరెడ్డి, సురవరం

ఆంధ్రుల సాంఘిక చరిత్ర (రెండవ ముద్రణ)

ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాదు.

మోహన్, జి. ఎస్. (డా.)
1981 జానపద విజ్ఞాన వ్యాసావళి
శ్రీనివాస పబ్లికేషన్స్, మలయనూరు, అనంతపురం జిల్లా

రాఘవయ్య, వెన్నెలకంటి
1974 యానాది
ఆంధ్రరాష్ట్ర ఆదిమజాతి సేవా సంఘము, విజయవాడ

రామకృష్ణయ్య, కోరాడ
1971 దక్షిణదేశ భాషా సారస్వతములు — దేశి
అమలాపురం

రామరాజు, బి. (డా.)
1960 త్రివేణి
ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ,
హైదరాబాదు (ఇతరులతో కలిసి సం.)
1968 (సం.) తెలంగాణా పల్లెపాటలు (మొదటి భాగం)
1978 తెలుగు జానపద గేయ సాహిత్యము (రెండవ ముద్రణ),
జానపద విజ్ఞాన ప్రచురణలు, హైదరాబాదు

లక్ష్మీనారాయణ, గంగిశెట్టి
1977 పండుగలు—పబ్బాలు
అంతర్జాతీయ తెలుగు సంస్థ, హైదరాబాదు

లక్ష్మీరంజనం, ఖండవల్లి, బాలేందు శేఖరం, ఖండవల్లి
1974 ఆంధ్రుల చరిత్ర — సంస్కృతి
బాలసరస్వతీ బుక్ డిపో, మద్రాసు.

వీరభద్రరావు, చిలుకూరి
1910 ఆంధ్రుల చరిత్రము (పూర్వ యుగము)
విజ్ఞాన చంద్రికాగ్రంథమాల

వెంకటప్పయ్య, వెలగా (డా.)
1979 గోడమీదబొమ్మ (పొడుపు కథలు)
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ, హైదరాబాదు

వేంకటావధాని, దివాకర్ల (డా.) ఇతరులతో (సం.)
1974 తెలుగు సామెతలు (మూడవ ముద్రణ)
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు.

సత్యనారాయణ, కంభంపాటి
1981 ఆంధ్రుల సంస్కృతి – చరిత్ర–1
సంక్షిప్తానువాదం డా. మహీధర రామమోహనరావు,
హైదరాబాద్ బుక్ ట్రస్ట్, హైదరాబాదు

సుబ్బారావు, తంగిరాల వెంకట (డా.)
1975 జానపద సాహిత్యము – వీరగాథలు
ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, హైదరాబాదు.

1976 కాటమరాజు కథలు
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాదు.

సుందరం, ఆర్వీయస్ (డా.)
1970 తెలుగు సాహిత్యములో దేశికవిత
మానస సరోవర ప్రచురణలు, నెల్లూరు

1972 ఆలిచిప్పలు–ఆణిముత్యాలు (ఇతరులతో సం.)
జానపద సమితి, బెంగళూరు

1976 జానపద సాహిత్య స్వరూపం
జానపద విజ్ఞాన సమితి, బెంగళూరు

1979 తెలుగు – కన్నడ జానపద గేయాలు
జానపద విజ్ఞాన భారతి, మైసూరు.

1981 భాష – జానపదం (సం.)
పరిమిరామనరసింహంతో, తెలుగు సాంస్కృతిక సమితి, మైసూరు.

## కన్నడం

కరీంఖాన్, ఎస్.కె.
1965 జనపద గీతెగళు
టి.జి.ఎస్. ప్రకాశన, తిపటూరు.

గద్దగిమఠ, బి. ఎస్. (డా.)
1969 కన్నడ జానపద గీతగళు (ఎరడవ ముద్రణ)
కర్నాటక విశ్వవిద్యాలయ, ధారవాడ.

చన్నబసప్ప, గొ.రు. (సం.)
1977 కర్నాటక జనపద కలెగళు
కన్నడ సాహిత్య పరిషత్తు, బెంగళూరు.

చెన్నమల్లప్ప, లింగప్ప, రేవప్ప (సం)
1971 గరతియ హాడు (నాల్గవ ముద్రణ)
సమాజ బుక్ డిపో, ధారవాడ

జవరేగౌడ, దే (డా.)
1976 జానపద అధ్యయన
డి.వి.కె. మూర్తి, మైసూరు – 4

జి.వి.డి.
1978 కన్నడ ఐతిహ్యగళు
తేజస్విని ప్రకాశన

తపస్వీకుమార్, సం, (డా.)
1972 కన్నడ గాదెగళ సమీక్షె
మైసూరు విశ్వవిద్యానిలయ, మైసూరు.

దాసేగౌడ, జి.వి.
1973 నమ్మ జానపద నంబికెగళు
కన్నడ అధ్యయన సంస్థె, మైసూరు విశ్వవిద్యాలయం, మైసూరు.

పరమశివయ్య, జీ.శం. (డా.)

1970 కన్నడ జనపద కథెకళు (సం.)

కన్నడ అధ్యయన సంస్థె, మైసూరు విశ్వవిద్యాలయం, మైసూరు.

1978 జానపద సాహిత్య సదన, మైసూరు — 6

1979 దక్షిణ కర్నాటక జనపద కావ్య ప్రకారగళు,

మైసూరు విశ్వవిద్యానిలయ, మైసూరు.

మోహన్, జి.ఎస్. (డా.)

1977 కన్నడ — తెలుగు గాదెగళు

జానపద సాహిత్య పరిషత్తు, హైదరాబాదు.

రంగస్వామి, డి.టి.

1971 భారతద హబ్బ — హూరిదినగళు

సమాజ పుస్తకాలయ, ధారవాడ.

రామేగౌడ

1970 నమ్మ ఒగటుగళు (సం.)

1972 జనపద నంబికెగళు

ఎం.సి. వసంతకుమార్‌తో, (సం) ప్రబుద్ధ ప్రకాశన, మైసూరు — 6

1975 నమ్మ గాదెగళు (సం.)

గీతా బుక్ హౌస్, మైసూరు,

1978 జనపద సాహిత్యరూపగళు

పి ఎ ఎన్ పబ్లిషర్స్, బెంగళూరు,

1979 కర్ణాటక జనపద కథెగళు (సం.)

డి.వి.కె. మూర్తి, మైసూరు — 4

రేణుకాభట్, బి. కె.

హిత్తల గిడ మద్దల్ల

జనప్రియ ప్రకాశన, బెంగళూరు.

వసంతకుమార్, మళలి

1975 కర్నాటక జనపద వైద్య

పంప ప్రకాశన, మైసూరు

శివరుద్రప్ప, జి.ఎస్. (డా)
1981 కర్నాటక జానపద (సం),
బెంగళూరు విశ్వవిద్యానిలయ, బెంగళూరు.

సుధాకర
1973 నమ్మ సుత్తిన గాదెగళు,
కన్నడ అధ్యయన సంస్థె, మైసూరు విశ్వవిద్యానిలయ, మైసూరు.

స్వామి, బి.జి.ఎల్. (డా.)
1975 శాసనదల్లి గిడ మరగళు
బెంగళూరు విశ్వవిద్యానిలయ, బెంగళూరు.

హిరియణ్ణ, అంబళికె
1978 మలెనాడ జనపద సంప్రదాయగళు
పుస్తక చిలుమె, మైసూరు.

హిరేమఠ, ఆర్.సి. (డా.)
1974 జానపద సాహిత్య దర్శన (సం.),
కర్నాటక విశ్వవిద్యాలయ, ధారవాడ.

## English

Bascom, William R.
1981 Contributions to Folkloristics
Folklore Institute, Meerut.

Bowra C.M.
1963 Primitive Song
A MENTOR Book

Clarke Kenneth W, Mary Clarke w.
1963 Introducing Folklore
Holt, Rinehart and Winston, Inc.
1965 A Folklore Reader (Ed.)

Coffin III, Tristram
1969 American Folklore (Ed)
Higgin Bothams Madras.

Dorson Richard M.
1972 Folklore and Folklife (Ed)
The University of Chicago Press.

Dundes, Alan
1965 The Study of Folklore
University of California, Berkeley.
1978 Essays in Folkloristics
Folklore Institute

Girija Khanna, Hari Mohan Khanna
1974 All About Superstitions
Vikas Publishing House Pvt Limited.

Gummere, Francis B
1907 The Popular Ballad

Hoebel, Adamson E
1958 Man in the Primitive World
MC Graw-Hill Book Company, Inc.

Jarvis, D.C.
1958 Folk Medicine
A Fawcett Crest Book

Krappe, Alexander H.
1964 The Science of Folklore
Newyork : W. W. Norton.

Lakshmanan Chettiar, S.M.L.
1973 Folklore of Tamil Nadu
National Book Trust, India.

Leach, Edmund
1967 The Structural Study of Myth and Totemism

Levi - Stranss, Claude
1972 Structural Anthropology
Penguin books
1977 Structural Anthropology, vol II
Penguin

Marand, Pierre
1973 Mythology
Penguin Education

Maria Leach (Ed.)
1975 Standard Dictionary of Folklore
Mythology and Legend
One vol. Edition, New English Library.

Propp, V.
1975 Morphology of the Folktale
(5 th printing). University of Texas Press.

Rama Raju, B.
1974 Folktales of Andhra Pradesh
Sterling Publishers Pvt Ltd., New Delhi.
1978 Folklore of Andhra Pradesh
National Book Trust, India, New Delhi.

Subramanian, P.R.
1972 An Introduction to the study of Indian Folklore
Tuticorin

Sundaram, R.V.S.
1976 Structural Study of Folk song
Paper presented at the All India Conference of Dravidian Linguists, Waltair.
1978 Quantitative Analysis of Folk song
paper presented at the All India Conference of Dravidian Linguists, Madurai.
1981 Methodology of Field work and Research in Folklo
Key - note paper presented at the All India Conference o
Folklore, Osmania University, Hyderabad.

Thomson, George
Marxism and Poetry

Thompson, Stith
1946 The Folktale
New York : Holt, Rinehart and Winston

పత్రికలు – విజ్ఞాన సర్వస్వాలు

తెలుగు ఆంధ్రజ్యోతి (వారపత్రిక) ఆంధ్రభూమి (వారపత్రిక)
జానపదం (త్రైమాసిక పత్రిక) వివేచన (వార్షిక పత్రిక)
తెలుగు విజ్ఞాన సర్వస్వము - సంస్కృతి సంపుటము
సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము

కన్నడ జానపద (అర్ధవార్షిక పత్రిక), కన్నడ విశ్వకోశ
కన్నడ విషయ విశ్వకోశ సరణి (కర్నాటక)

English Encyclopaedia Britannica
Encyclopaedia of Religion and Ethics
Encyclopaedia of Social Sciences
Modern Review

